# కవికోకిల గ్రంథావళి

## శతజయంతి సంపుటి - 2

( నాటకములు, సారస్వత వ్యాసములు, డైరీ-ఉత్తరములు )

"కవికోకిల"

**దువ్వూరి రామిరెడ్డి**

ఏనుగ రామమ్మ వెంకట నరసారెడ్డి మెమోరియల్ ఛారిటబుల్ ట్రస్ట్
(రిజిష్టర్డ్) వారి ద్రవ్య సాహాయ్యముతో ముద్రింపబడినది.

ప్రచురణ

**దువ్వూరు రామిరెడ్డి విజ్ఞాన సమితి**

నెల్లూరు.

"Kavikokila" Duvvuri Rami Reddy Centenary Edition
Kavikokila Grandhavali - Volume-II
(Plays - Critical Essays - Diary-Letters)

నవంబరు - 1996
ప్రతులు : 1000



ప్రతులకు :
సోల్ డిస్ట్రిబ్యూటర్స్
మెస్సర్స్ విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
4-1-433, బ్యాంక్ స్ట్రీట్ - విజ్ఞాన్ భవన్,
హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

విశాలాంధ్ర బుక్ హౌస్
హైదరాబాద్ - విజయవాడ - విశాఖపట్నం - గుంటూరు
కాకినాడ - హన్మకొండ - అనంతపురం - తిరుపతి

మూల్యము :
రూ. 200-00 లు.

కంప్యూటర్ టైప్ సెట్టింగ్ & ప్రింటింగ్ :
నవత గ్రాఫిక్స్
16/86, తిప్పరాజువారి వీధి, నెల్లూరు - 524 001. ఆం.ప్ర.
కవర్ పేజి డిజైన్ : మల్లి

# కృతజ్ఞతలు

సాహితీ లోకములో సింహపురి సీమకు అంతర్జాతీయ విఖ్యాతిని సముపార్జించి పెట్టిన విశ్వతోముఖప్రజ్ఞానిధి "కవికోకిల" దువ్వూరి రామిరెడ్డి. సంస్తవనీయులైన ఆ మహాకవిని సంస్మరించుకోవడం కర్తవ్యముగ సంభావించి అను వత్సరము రామిరెడ్డిగారి జయంత్యుత్సవము నిర్వహించుచు సాహితీవేత్తను, విజ్ఞానశాస్త్రవేత్తను ఒక్కొక్కరిని రూ. 1116/- లతో సత్కరించి "దువ్వూరి రామిరెడ్డి అవార్డు" బహూకరిస్తూ ఆయన గ్రంథములను పునర్ముద్రణము గావించి సారస్వతసేవ సలుపు సదుద్దేశముతో మాన్యశ్రీ డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారి ఆశీస్సులతో, రేబాల లక్ష్మీనరసారెడ్డి ధర్మనిధి సహకారముతో, కొందఱు వదాన్యుల సాహాయ్యముతో 1984 జూన్ 20వ తేదీన నెల్లూరులో " దువ్వూరు రామిరెడ్డి విజ్ఞాన సమితి" స్థాపింపబడినది.

1986 సం॥లో "కవికోకిల" "వాయిస్ ఆఫ్ ది రీడ్" అను ఆంగ్ల కవితల సంపుటిని; 1992లో "కృషీవలుడు" కావ్యమును పారిశ్రామికవేత్తలు, సహృదయులు మాన్యశ్రీ గునుపాటి హరిశ్చంద్రా రెడ్డి గారు వారి తండ్రి పేర నెలకొల్పిన "గునుపాటి వెంకటరమణా రెడ్డి ట్రస్టు" వారి ద్రవ్యసాహాయ్యముతో ముద్రించి ప్రచురించగలిగినాము.

ఈనాడు ఈ శతజయంతి సంవత్సర సందర్భముగా ఆయన కృతులను రెండు సంపుటములుగ వెలువరించగలుగుతున్నాము. మొదటి సంపుటము (ఖండకృతులు - కావ్యములు) నెల్లూరులో "ఇండో నేషనల్ లిమిటెడ్" డ్రై బ్యాటరీల తయారీ పరిశ్రమను సంస్థాపించి నెల్లూరు నగరమునకు పారిశ్రామిక ప్రపంచములో ప్రముఖ స్థానమును కల్పించి దేశములో అనేకానేక సంస్థలకు భూరి విరాళాలొసగిన వదాన్యులు మాన్యశ్రీ పి. ఓబుల్‌రెడ్డిగారి ఆర్థిక సాహాయ్యముతోను;

రెండవ సంపుటము (నాటకాలు - సాహిత్య విమర్శలు, డైరీ - ఉత్తరాలు) బెంగుళూరులో గజలక్ష్మి (బెంగుళూరు) డైస్ & కెమికల్స్ సంస్థాపించి దేశ పారిశ్రామిక ప్రగతికి తమవంతు కృషి సల్పుచున్న మాన్యశ్రీ ఏనుగ అనంత పద్మనాభరెడ్డిగారు ఏనుగ రామమ్మ వెంకట నరసారెడ్డి మెమోరియల్ ఛారిటబుల్ ట్రస్ట్ (రిజిష్టర్డ్) ద్వారా అందించిన ద్రవ్య సాహాయ్యముతోను ప్రచురింపగలుగుచున్నందులకు పరమానందముగా నున్నది. ఆ మాన్య మహోదయులిరువురకు నిండు మనసుతో కృతజ్ఞతాంజలులు సమర్పించుకొను చున్నాము.

కారణభూతులు, నిత్యసాహిత్యవ్రతులు, నవ్య భవ్య వచన కవితాప్రథితాత్ములు, నెల్లూరునకు గర్వకారణులైన మాన్యమహోదయులు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు ఈ సంపుటములకు "ముందుమాట" అందించి ఆశీర్వదించడం అదృష్టముగ భావించుచు వారికి కృతజ్ఞతానేక నమస్సుమనస్సులర్పిస్తున్నాము.

శ్రీ ఓబులరెడ్డి గారి సాయమందింపజేయుటలో తోడుపడిన మా విజ్ఞాన సమితి సభ్యులు, కస్తూరిదేవి బాలికోన్నత పాఠశాల కార్యదర్శి, మాజీ రోటరీ గవర్నర్ గౌ॥ శ్రీ జె.వి. రెడ్డి గారికి, అట్లే శ్రీ ఏనుగ అనంత పద్మనాభరెడ్డి గారి సాయము చేకూర్చుటలో చేయూతనొసగిన సాహితీపరులు, సుప్రసిద్ధ కవులు గౌ॥ శ్రీ వాకాటి పెంచెల రెడ్డి గారికి ప్రత్యేకముగ హార్దికాభివాదనములు.

"కవికోకిల" రచనల ముద్రణ హక్కును దువ్వూరు రామిరెడ్డి విజ్ఞాన సమితికి ప్రసాదించిన దువ్వూరి రామిరెడ్డి రచనల కాపీరైట్ హక్కుదారులు రామిరెడ్డిగారి పౌత్రుడు - స్వర్గీయ వేణుగోపాలరెడ్డి గారి పుత్రుడు శ్రీ వెంకట రామమోహన్ గారికి; వెంకట రామమోహన్ గారి మాతృమూర్తి శ్రీమతి సత్యవతమ్మగారికి; ఈ విషయములో సాయపడిన వేణుగోపాలరెడ్డి అల్లుడు డాక్టర్ వేమారెడ్డి ప్రభాకరరెడ్డిగారికి మనఃపూర్వక ధన్యవాదములు.

ఈ సంపుటముల ముద్రణ విషయమై సముచిత సలహాలొసగి ప్రోత్సహించిన కావలి జవహర్ భారతి రిటైర్డ్ లెక్చరర్ "కవికోకిల" గ్రంథములపై ప్రామాణికులైన పరిశోధకులు గౌ॥ శ్రీ కె.వి. రమణారెడ్డి గారికి అభివందనములు.

నెల్లూరు వి.ఆర్. కళాశాల రిటైర్డ్ ఇంగ్లీషు లెక్చరర్ గౌ॥ శ్రీ వేదము వేంకటరామన్ గారికి ప్రణతులు.

రామిరెడ్డిగారి గ్రంథముల సంపుటినందించి ముద్రణకు వెసులుబాటు కల్పించిన వినయశీలి, మిత్రులు వి.ఆర్. కళాశాల ఆంధ్రశాఖాధ్యక్షులు గౌ॥ శ్రీ మోపూరు వేణుగోపాలయ్య గారికి; "కవికోకిల" సాహిత్య వ్యాస సంపుటినొసగి తోడ్పడిన సహృదయ మిత్రులు గౌ॥ శ్రీ హెచ్.యస్.వి.కె. రంగారావుగారికి;

రామిరెడ్డి గారి అముద్రిత రచనల వ్రాత ప్రతులిచ్చి ప్రచురణకు సాయపడిన - దువ్వూరివారి రచనలను గూర్చి పరిశోధించి పి.హెచ్.డి. పట్టమును పొందిన నెల్లూరులోని వేద సంస్కృత కళాశాల ఆంధ్రశాఖలో రీడర్ గౌ॥ డాక్టర్ కె. నరసింహారెడ్డిగారికి :-

కారణాంతరములవలన ముద్రణ ఆలస్యమైనా శ్రద్ధతో అందముగ ముద్రించి యిచ్చిన "నవత గ్రాఫిక్స్" అధినేతలు, వర్ధమానులు శ్రీయుతులు కూరపాటి చెంగల్ రాజు, నాగరాజు సోదరులకు - ఆ ముద్రణాలయ సిబ్బందికి;

ఓర్పుతో, నేర్పుకూర్పుతో కంప్యూటర్ టైప్ సెట్టింగ్ చేసి యిచ్చిన శ్రీ పారెళ్ళ మల్లికార్జున రావు గారికి శుభాశీస్సులు.

సాయమందించిన వారెందరో ! అందరికీ వందనాలు.

"ఆంధ్ర ఫోక్‌లోర్", "ది ఆరిజిన్ ఆఫ్ ది నాన్ బ్రామిన్ మూవ్‌మెంట్" - ఈ రెండు ఆంగ్ల వ్యాసములు శ్రీ కె.వి.ఆర్ "కవికోకిల జీవితము - సాహిత్యము" నుండి గ్రహింపబడినవి.

స్వర్గీయ బండి గోపాలరెడ్డిగారు (బంగోరె) తమ "కూనిరాగాలు-ఇతర రచనలు" (1983 ముద్రణ)అను పుస్తకములో "కవికోకిల అముద్రిత గ్రంథాలు" అను శీర్షిక క్రింద రామిరెడ్డి గారి కొన్ని రచనలు వెలుగు చూడవలసి యున్నవని ఒక జాపితా యిచ్చారు. ఆ ప్రేరణతోనే వారి అముద్రితరచనలు "నా దేశాటనం డైరీ", "ద్విపద రచన-గణభేదము", "గుడివాడ రత్తం" ప్రచురించినాము.

ఈ సంపుటి విక్రయ ధనము "దువ్వూరు రామిరెడ్డి విజ్ఞాన సమితి" మూల ధనమునకు చెందుతుంది.

ఇంకను రామిరెడ్డిగారి గ్రంథములు -

పండ్లతోట; గులాబితోట; శ్రీ కె.వి. రమణారెడ్డిగారు రచించిన 'కవికోకిల జీవితము - సాహిత్యము" పునర్ముద్రణము కావింపవలసియున్నది. వదాన్యులు, సాహిత్య ప్రియంభావుకులు ముందుకు వచ్చి సాయమందించి ఆ కృతుల ముద్రణకు కూడ తోడ్పడుతారని ఆశిస్తున్నాము.

"శ్రేయాంసిబహు విఘ్నాని" అను నానుడికి తగినటులే ఎన్నెన్నో అడ్డంకులూ - ఇబ్బందులూ అన్నియు అధిగమించి ఈనాటికి ఆంధ్ర సాహిత్య జగత్తుకు ఈ కావ్య సంపుటిని ఆదరముతో సమర్పింప గలుగుచున్నందులకు సంతసముగా ఉన్నది. "కవికోకిల" కవితాసుధను ఆస్వాదించి ఆనందిస్తారని ఆకాంక్షిస్తున్నాము.

జయోస్తు !　　　　　　　　　　　　　జైహింద్ !

# దువ్వూరు రామిరెడ్డి విజ్ఞాన సమితి

(రిజిష్టర్డు : 135/1984)

## నెల్లూరు.

పరిపోషకులు :- రేబాల లక్ష్మీనరసారెడ్డి ట్రస్టు.



17-12-1892 4-12-1976

శ్రీ ఏనుగ వెంకట నరసారెడ్డి గారు

( శ్రీ ఏనుగ అనంత పద్మనాభరెడ్డి గారి తండ్రిగారు)



9-4-1921 18-7-1957

శ్రీ ఏనుగ నరహరిరెడ్డి గారు

( శ్రీ ఏనుగ అనంత పద్మనాభరెడ్డి గారి పెద్ద అన్నగారు)



సిద్దారెడ్డి వెంకట సుబ్బారెడ్డి - కృష్ణవేణమ్మ పుణ్యదంపతులు

( శ్రీ ఏనుగ అనంత పద్మనాభరెడ్డి గారి అత్తమామలు )

శాంతి నికేతన్,
సరస్వతీనగర్, నెల్లూరు-3.

# ముందుమాట

గత శతాబ్దపు అంత్యదశాబ్దము ఆంధ్ర సాహిత్యమునకు బంగారు కిరీటమే పెట్టింది. ఆంగ్లభాషా సాహిత్యాలచే ప్రభావితులై సారస్వతమును భిన్న ప్రక్రియలతో అలంకరించిన ఒక నవతరం పండిత కవీశ్వరులు జన్మించారు. రాయప్రోలు సుబ్బారావు, అబ్బూరి రామకృష్ణారావు, బసవరాజు అప్పారావు, విశ్వనాథ సత్యనారాయణ, అడవి బాపిరాజు, గుర్రం జాషువా, నాయని సుబ్బారావు, దువ్వూరి రామిరెడ్డి, దేవులపల్లి కృష్ణశాస్త్రి మొదలగు ప్రముఖులున్నారు. నాకు పరిచయంలేని కారణముచేత ఇంకా కొంతమంది ఉండవచ్చునని భావించుచున్నాను. వీరిలో ఎక్కువమంది కాలేజీలలో చదివినవారే. అనూహ్యామైన ఒకతారాగణమో, పుష్పగుచ్ఛమో అవతరించినట్లు, ఇంతమంది మహనీయులు ఆంధ్రదేశములో ఒక దశాబ్దములో జన్మించినారు. బసవరాజు అప్పారావుతో తప్ప మిగతవారందరితో పరిచయమున్నదని ఆనందపడుతుంటాను నేను. వీరందరి శతాబ్ది ఉత్సవములు జరుపుతున్నారు. కృష్ణశాస్త్రి 1897లో జన్మించినారు. వచ్చే సంవత్సరము వారి శతాబ్ది ఉత్సవాన్ని జరుపుతారని భావిస్తాను.

ప్రస్తుతము నా ముందు మాటలు దువ్వూరి రామిరెడ్డి శతజయంతి ఉత్సవమునకు సంబంధించినవి. వీరు కాలేజీలో చదువలేదు. కవితా ప్రతిభనంతా స్వయంకృషితో అర్జించుకున్నారు. ఇంగ్లీషు బాగా చదివి తాను రచించిన కొన్ని తెలుగు ఖండికలను తానే “వాయిస్ ఆఫ్ ది రీడ్” పేర ఇంగ్లీషులో కవితల సంపుటిని రచించి వెలువరించినారు. వీరు చాలాచిన్న వయస్సులోనే దివంగతులగుట శోచనీయమైన విషయము. వారిని పెమ్మారెడ్డి పాలెంలోను, బుచ్చిరెడ్డి పాలెంలోను, నెల్లూరులోను కలిసి మాట్లాడే అవకాశం నాకు ప్రాప్తించినది. దేశబంధు చిత్తరంజన్ దాస్ రచించిన కొన్ని బెంగాలీ పద్యాలను నాదైన శైలిలో అనువదించి రామిరెడ్డికి వినిపించినాను. వారి ఆమోదముద్ర నాకు లభ్యమైనదని తలచాను. వీరు ముఖ్యముగా వ్యవసాయ కుటుంబములో జన్మించినవారై గ్రామీణ ప్రజల సుఖ దుఃఖములను తమ కావ్యవస్తువులుగా గ్రహించినారు. అదివీరి ప్రత్యేకతయేమోనని నా యభిప్రాయము. నెల్లూరులో ఒక మౌల్వి దగ్గర పర్షియన్ నేర్చి ఒమర్ ఖయ్యాం భావాలను ఆంధ్రులకు తన పానశాల ద్వార అందించినారు. ఈ సందర్భములో ఒక మాట చెప్పట మరచాను. రాయప్రోలువారు, అబ్బూరివారు వంగభాషా ప్రభావితమైనవారు. అబ్బూరి రామకృష్ణారావు కలకత్తాలో చదువుకున్నారు.

రాయప్రోలు వారు కొద్ది మాసాలు శాంతినికేతన్‌లో నుండి గురుదేవ్ రవీంద్రనాథ టాగూర్‌తో ముఖాముఖి పరిచయం కలవారు. గుఱ్ఱం జాషువా దళితవర్గాల ఆక్రోశమును ప్రకటించి ఆంధ్రుల ఆశీర్వాదాభిమానములను పొందినారు. విశ్వనాథ ప్రాచీన ఆర్య సంస్కృతికి ప్రతినిధులై అనేక ప్రక్రియలలో రచనలు సాగించి ఆంధ్రభాషామతల్లిని అలంకరించినారు. కృష్ణశాస్త్రి బ్రహ్మసమాజముచే ప్రభావితులై "నాకు ఇద్దరు గురుదేవులు. ఒకరు రవీంద్రనాథ టాగూర్, రెండవవారు రఘుపతి వేంకటరత్నం" అని చెప్పుచుండేవారు.

ఇక రామిరెడ్డి పద్యములు, నాటకములు, విమర్శన వ్యాసములు వ్రాసి కీర్తిని పొందినవారు. వారి కృతులను సమీక్షిస్తు ప్రశంసించడానికి నాకు శక్తి లేదు. వారిని గూర్చి అనేకులు పరిశోధనలు చేసియేయున్నారు. అందరికన్నా ఎక్కువగా ఆధునిక విజ్ఞానమువైపు దృష్టి మరలించిన వారు రామిరెడ్డి అని చెప్పవచ్చును. రేడియో భాగాలను సమీకరించుకొని రేడియోను తయారుచేశారు. ఆధునిక రీతిలో సెమ్మారెడ్డి పాలెంలో గృహాన్ని నిర్మించుకున్నారు. తమ వీలునామాలో తనపేరున ప్రతి సంవత్సరము ఒక విజ్ఞాన శాస్త్రవేత్తను సమ్మానించవలసినదని తన కుమారుని ఆజ్ఞాపించినారు. కొన్ని పరిస్థితులవల్ల అట్టి సమ్మానాలు కొద్ది సంవత్సరాలే జరిగినవి.

వీరి శతాబ్ది ఉత్సవాలను జరుపడానికి నెల్లూరులో ప్రముఖుల ప్రోత్సాహముతో ఒక కమిటీ ఏర్పాటైనది. దానికి మాగుంట సుబ్బరామరెడ్డిగారిని అధ్యక్షులుగా ఎన్నుకున్నారు. వారి శోచనీయమైన దారుణ హత్యానంతరము జె.కె. రెడ్డి గారిని (మాజీ శాసన సభ్యులు) అధ్యక్షులుగా ఎన్నుకున్నారు. జె.వి.రెడ్డి కోశాధికారిగ, అగస్త్యరెడ్డి వెంకురెడ్డి కార్యదర్శిగా వ్యవహరించుచున్నారు. ఈ ఉత్సవాల సమయములో రామిరెడ్డి యొక్క గ్రంథాలను రెండు సంపుటములుగా ప్రచురించుటకు నిశ్చయించినారు. మొదటి సంపుటి (కావ్యాలు - ఖండకృతులు) ని, నెల్లూరు నిప్పో ఫ్యాక్టరి అధిపతులు, మద్రాసునగరమున పేరుగాంచిన శ్రీ పి. ఓబుల్‌రెడ్డి ఉదారముగ ముద్రణ వ్యయమునంతా భరించి ప్రచురించుటకు ముందుకు వచ్చారు. రామిరెడ్డి నాటకములు, వ్యాసములు, డైరీ - ఉత్తరాలను రెండవ సంపుటిగ ప్రచురించుటకు ఖర్చుకాగల మొత్తమును బెంగుళూరులో పరిశ్రమలు స్థాపించి నడుపుతున్న శ్రీ ఏనుగ అనంత పద్మనాభ రెడ్డి భరించుటకు ముందుకు వచ్చారు. వీరిరువురకు నా అభినందనలు. ఏదైనా సావనీరు ప్రచురించినయెడల అందుకుకాగల వ్యయాన్ని భరిస్తానని మాగుంట సుబ్బరామిరెడ్డి నాతో చెప్పియున్నారు. తిక్కవరపు సుబ్బరామరెడ్డి (యం.పి.,) పాతికవేలు

రూపాయలు విరాళమొసగినారు. ఇతర దాతలును తమ విరాళములతో ముందుకు వచ్చి ప్రోత్సాహమిచ్చినారు. వీరందరికి ధన్యవాదాలు. వారి ప్రోత్సాహానికి నమోవాకములు.

గత డిసెంబరులో నేను విశ్వనాథ వారి శతజయంత్యుత్సవములలో పాల్గొనుటకు రాజోలుకు వెళ్ళినపడు డాక్టర్ అల్లూరి రాజకుమారి ఈ కమిటీకి విరాళముగ రూ. 1116/-అందించినారు. వారికి నా ప్రత్యేక నమస్కారములు.

ఈరెండు సంపుటములకు ముందుమాట వ్రాసే అవకాశము, బాధ్యత కమిటీవారు నామీదనే ఉంచారు. నేను రామిరెడ్డితో బాగుగ పరిచయము కల్గినవాడిని కాబట్టి ఆ బాధ్యతను స్వీకరించి నిర్వర్తించాను. సంపుటములు అచ్చుకావడం ఆలస్యమైనందున 1995లో జరగవలసిన జయంతి ఉత్సవాలు 1996లో జరుగుతున్నవి. రామిరెడ్డి స్మృత్యంకముగా ఈ ప్రచురణలు, ఉత్సవాలు జరుపుతున్న కమిటీ వారికి ముహూర్త దోషము ఆంధ్రులు అంటించరని నేను ఆశిస్తున్నాను. రామిరెడ్డిగారి యశస్సు వర్ధమానమగుగాక!

తేది 7-10-1996

**బెజవాడ గోపాలరెడ్డి**

# విషయానుక్రమణిక

పుట

## :: నాటకములు ::



## :: సారస్వత వ్యాసములు ::

# పాత్రలు

## పురుషులు

సూత్రధారి
రామచంద్రారెడ్డి
సుందరరామరెడ్డి
వెంకటేసు
శాస్త్రి
రామకృష్ణారెడ్డి
వెంకారెడ్డి
నరసయ్య (గుమాస్తా)
రంగడు
రాగడు
నారప్ప
సీతడు
పోలీసు ఇన్‌స్పెక్టరు
పోలీసు
యానాది
రామారావు
వెంకటరెడ్డి
వెంకటసుబ్బారెడ్డి
ప్లీడరు
ఫిర్యాది
ముగ్గురు సాక్షులు
నరసారెడ్డి
డాక్టర్
ఆచార్యులు

## స్త్రీలు

మారిష
సాతానికుబ్జ
సతారామమ్మ (వేశ్య)
వేశ్యమాత
అవ్వ

# కృతజ్ఞత

బాల్యంబుననె కావ్యవనవీథి విహరించి
కవికోకిలాలాప గతులు మెచ్చె;
సౌందర్యభావనాశబలిత చిత్తుఁడై
స్వర్గతుల్య మొనర్చె స్వభవనమును;
కలిమికి సహజమౌ గర్వంబువిడి మిత్ర
బృందహృత్ప్రీతిక నెక్కఁ గలిగె;
అర్థికి గౌరవహాని దోఁపింపని
దానశిల్పములోని తత్త్వమెఱిఁగె;

మాటలకుఁ జేఁతలకు మాఱుపాటులేమి
వఱలె నీయందు రేబాలవంశ చంద్ర
యనుచు నెల్లరుఁ బొగడంగ నలరినావు
రమ్యగుణమూర్తి శ్రీ సుబ్బరామిరెడ్డి !

కత్తికిఁ గావ్యకళా సం
పత్తికి మొగదారులైన మనతొంటి నృపుల్
ఇత్తఱి నరుదేయైనను
బొత్తిగ విడిపోవు మనలఁ బూర్వాభిరుచుల్

కొండవీటి రాజ్యేందిర క్రుంకిపోయె
నకట! దురదృష్టవశమున, నైననేమి?
నేఁడు సిరిగల ప్రతి రెడ్డివీడు కూడ
పండితులపాలిటికి "పిల్లకొండవీడు"

"జనకుని స్మృత్యర్థము నే
ననుకొంటిని నీదుకృతుల నచ్చొత్తింపన్
అనుమానమేల? నీవౌ
నన వోయీ'" యన్న తీరు "లౌ" ననిపించెన్

నీ రసికత, నీమైత్రియు
నీరమ్యకళానుభూతి నిరతము శిల్ప
ప్రేరకమై నవకవితో
ద్ధారకమై పెంపు చెందుతన్ బ్రియమిత్రా!

నేను నీవును సకలంబు నిశ్చయముగఁ
గాలవాహిని నొకనాఁడు గలయఁగలము;
కాని, రమ్యమైన యపూర్వ కావ్యసృష్టి
అమరతం గూర్చుఁగర్తకు నాశ్రితునకు!

సిరికిందగిన వదాన్యత,
పరువము, లలితాభిరుచుల బలిసిన భావ
స్ఫురణము, భోగప్రీతియు
విరిసెను నీబ్రతుకుఁ దీవ విరులటు మిత్రా.

ధనముండుట పరిపాటియె ;
ధనమే సర్వంబుగాదు; ధనముండియు స
ద్వివి యోగబుద్ధి గలిగిన
మనుజుని భాగ్యంబె లోక మాన్యత గాంచున్

రమయు వాణియుఁ బక్షపాతమువహించి
కూర్చి రర్థంబు విద్యయుఁ గొదవలేక;
అట్టియొద్దిక యందఱి కబ్బదోయి,
జీవితార్థంబు నిరుకేలఁ జిక్కఁబట్టు!

---

# విన్నపము

ఇంతవఱకు నేను రచించిన నాటకములు రచనాకాలక్రమానుసారముగా ఈ సంపుటమున సమకూర్పఁబడినవి. చిత్రగుప్త సంవత్సరాది సంచికలో ప్రకటింపబడిన "కాంగ్రెస్ వాలా" అను ఏకాంక నాటకముగూడ ఇందు పునర్ముద్రణము గావింపఁబడినది.
మోపూరు నివాసులును కళోపాసకులును కవితా రసజ్ఞులును నాకు మిత్రులును అగు

## శ్రీయుత రేబాల సుబ్బరామిరెడ్డిగారు

ఒకనాడు ప్రస్తావ వశమున నిట్లనిరి :-

"నీగ్రంథములు చెల్లా చెదరుగ నున్నవి. మాసపత్రికలలో ప్రకటింపబడిన కొన్ని కావ్యములు గ్రంథరూపమున వెలువడనే లేదు. తుదకు నీ పుస్తకములు ఎచ్చట దొరకునోయను సంగతి కూడ చాలమందికి తెలియదు. నీకృతులన్నియు ఒకే సంపుటముగ నచ్చొత్తించిన బాగుగనుండును. నీ విష్టపడుదువేని నేనందుకువలసిన యేర్పాటు కావించెదను"

సుబ్బరామిరెడ్డిగారి కవితా ప్రియత్వము, ఔదార్యము నన్ను ముగ్ధుని గావించినవి. అర్థింపఁబడియు కవులకు సహాయము చేయు కవితాపోషకులు అరుదైన ఈ కాలమున సుబ్బరామిరెడ్డిగారి ఈ యయాచిత సాహాయ్యము ప్రశంసా పాత్రమని వేఱుగ చెప్పనక్కఱలేదు. నేను వారికెంతయు కృతజ్ఞుఁడను.

సుబ్బరామిరెడ్డిగారి జనకులు

## కీ.శే. రేబాల సుబ్బారెడ్డిగారి స్మృత్యర్థము

ఈ కవికోకిల గ్రంథావళి యచ్చొత్తింపఁబడినది.

నేను నెల్లూరిలోనుండి అచ్చుప్రూఫులు స్వయముగ దిద్దికొన వీలులేకయున్నందున నామిత్రులును, మృదుమధుర కవితారచయితలునగు గోనుగుంట పున్నయ్యగారును, చిరకాలమిత్రులును "హాలిక" లాంఛన విశ్రుతులును ప్రభాత ముద్రణాలయాధికారులును అగు మరుపూరు కోదండరామ రెడ్డిగారును ప్రూఫులుదిద్ది శ్రద్ధతో మిత్రకార్యము నెరవేర్చిరి. వారి సాహాయ్యమునకు నేనెంతయు కృతజ్ఞుడను.

నెల్లూరు,
30-5-1936.

దువ్వూరి రామిరెడ్డి

# ముందుమాట

కీర్తిశేషులు దువ్వూరి రామిరెడ్డిగారి రచనల్లో ఇంతకాలం అముద్రితంగా వుండిపోయిన 'కర్షక విలాస'నాటకం ప్రచురణ పొందడం సాహిత్యప్రియులందరూ హర్షింపదగ్గ విషయం.

ఆనాడు - 64 సంవత్సరాలకు ముందు - కర్షక విలాస నాటక ప్రదర్శనలో ఒక పాత్రధారిగా నటించిన డాక్టర్ డి.వి. సుబ్బారెడ్డిగారు (దండా వెంకట సుబ్బారెడ్డి) ఈనాడు ఆనాటక ప్రచురణలో ప్రధాన పాత్ర వహించడం ఎన్నదగ్గ విశేషం. డాక్టర్‌సుబ్బారెడ్డిగారు మద్రాసు వైద్య కళాశాలలో శారీరక శాస్త్రాచార్యులుగా, గుంటూరు వైద్యకళాశాలలో ప్రిన్సిపాలుగా, ఉస్మానియా వైద్యకళాశాలలో వైద్యవిజ్ఞాన చరిత్రా చార్యులుగా, గొప్ప పరిశోధకులుగా,కీర్తిగడించి ప్రస్తుతం హైదరాబాద్‌లో విశ్రాంతి జీవితాన్ని గడుపుతున్న సుప్రసిద్ధులు. వారువైద్యశాస్త్రజ్ఞులైనా సాహిత్యప్రియులు. తెలుగులో కూడా రచయిత,.'ఆరోగ్యవ్యాసమంజరి' 'దేశీయ వైద్యవిజ్ఞానం' ' సీమకు స్టీమరులో' మొదలైనవి వీరురచించిన తెలుగు గ్రంథాలు. వయోవృద్ధులైన శ్రీ సుబ్బారెడ్డిగారు ఎంతో ఉత్సాహంతో ఈ నాటక ప్రకటనకు పూనుకోవడం వారికి దువ్వూరి రామిరెడ్డిగారి యెడలగల చిన్ననాటి సన్నిహితమైత్రికి, చిన్ననాటినుండి వారికిగల తెలుగు భాషాసాహిత్యాభిమానానికి ఒక ప్రబల నిదర్శనం.

కర్షక విలాసం ఒక సాంఘిక నాటకం. ఈ శతాబ్దపు తొలిదశాబ్దాల్లో ముఖ్యంగా ఆంగ్లేయుల పరిపాలనలో ఒకవైపు పాశ్చాత్య విద్యా నాగరికత, మరొకవైపు భారతీయ జాతీయోద్యమం రాపిడి పడి ప్రబలమౌతున్న కాలంలో తెలుగుదేశపు గ్రామీణ ప్రాంతాల్లో స్థానిక నాయకుల ఆలోచనల్ని, ప్రవర్తనా సరళిని, సామాన్యుల జీవితాన్ని ప్రతిబింబింప చేస్తున్న నాటకమిది. ఈ నాటకాన్నిచదివిన వారికి స్వాతంత్ర్యం తర్వాత కూడా మన గ్రామీణ ప్రాంతాల్లో మనుషులు, పరిస్థితులు ఇంకా మారలేదన్న సత్యం స్ఫురించకపోదు. ఈ నాటకంలోని ఇతివృత్తం ప్రాంతీయమైనదిగా, సమాజంలో కొన్ని వర్గాలకు సంబంధించినదిగా తోచవచ్చు. కాని ఇందలి మానవస్వభావచిత్రణ సార్వకాలికం,సహజం. అందువల్ల ఇది కాలదోషం పట్టని సార్వజనీనమైన రచనగా నిల్వగలదు.

ఈ నాటక ప్రచురణలో నా బాధ్యత నామమాత్రమే. పూజ్యులైన శ్రీ సుబ్బారెడ్డిగారు నామీదగల వాత్సల్యంతో నాకీపని అప్పగించారు. అందుకు ధన్యుణ్ణి. వారికి నా కృతజ్ఞతాపూర్వక నమస్కృతులు.

'కర్షక విలాస' నాటక ప్రచురణకు ముందుకువచ్చి శ్రద్ధతో ముద్రించి ప్రకటించిన త్రివేణి పబ్లిషర్స్ ప్రైవేట్ లిమిటెడ్ సంస్థవారికి, ముఖ్యంగా శ్రీ భావరాజు నరసింహారావుగారికి

నా హృదయపూర్వక ధన్యవాదాలు.

ఈ గ్రంథ ప్రచురణలో నాతో సహకరించినవారు ముఖ్యంగా, తెలుగు మినీకవితోపాసకులైన యువకవి శ్రీ రావి రంగారావుగారు, డాక్టర్ అక్కిరాజు రమాకాంతారావుగారు, శ్రీ గుత్తి కొండసుబ్బారావుగారు. డాక్టర్ కేతు విశ్వనాథరెడ్డిగారు - వీరందరికీ నా ధన్యవాదాలు.

తిరుపతి,

1981 సెప్టెంబరు.

**జి.యన్.రెడ్డి.**

# కర్షక విలాసము

మ. తొలు వానల్గురియంగ నుత్సుకతఁ దోడ్తో నాగలింబన్ని, యె
ద్దులు వోఁదోలుకుఁ గర్షణంబున భువిం దోరంబు నెత్తావి చి
ప్పిల, నంభోధర మాత పత్రము వలెన్ విన్వీధిఁబర్వంగ ని
స్తుల మోదంబున దున్ను సైరికుని దృష్టుల్ బ్రోచుమమ్మందరిన్.

(నాంద్యంతమున నటునిటుఁ జూచి)

సూత్ర : మారిషా ! ఒకసారిటు రమ్ము.

మారి : ఇదిగో, వచ్చుచున్నాను.

సూత్ర : (ఉన్ముఖుడై యాలోచించుచుండును)

మారి : బావగారూ ! ఏమో ఆలోచించుచున్నట్లున్నారే ?

సూత్ర : మారిషా ! నిక్కువమే. నేడు రెడ్డిజన మహాసంఘము ప్రప్రథమమున సమావేశమయిన శుభదివసమగుట సభాస్తారులగు సైరిక ప్రభువులు తదజ్ఞాపకార్థ మేదేని యొక నూతన నాటకమును బ్రదర్శించి తమ్మానంద కందళిత స్వాంతులరుగా నొనర్పు మని నా కనుజ్ఞయొసంగిరి.

మారి : అందుకు మీరేమని విన్నవించితిరి ?

సూత్ర : 'చిత్త' మని శిరఃకంప మొనరించితి గాని యిప్పు డే నాటకము ప్రదర్శించి సభ్యుల రంజింపవలెనో యని శంకించుచున్నాడ.

మారి : ఓహో, అటైన మీరూపకము కర్షకజన హర్షదాయకమై యుండవలయును గదా !

సూత్ర : మారిషా ! చక్కగ జ్ఞప్తికి దెచ్చితివి.' కర్షక విలాసము'ను బ్రదర్శింతము.

మారి : బావగారూ ! ఈ నాటకమును రచియించిన కవి యెవరు ?

సూత్ర : దువ్వూరి రామిరెడ్డి

మారి : ఓహో, రసికజనానంద స్వప్నాశ్లేషాది కృతికర్తయగు రామిరెడ్డియా !

సూత్ర : బుద్ధిమంతుడా, చక్కగా గ్రహియించితివి.

మారి : ఆ కవి బాలుడే కదా ? సకల విద్యా విశారదులగు నీ సభ్యుల నాతని నాటకము రంజింప జేయగలదా ? అదియుంగాక సంఘము వారి తొందర వలన నుడుకు జుర్రినట్లు పది దినమ్ములలో నెట్టులనో వ్రాసి పూర్తిచేసినాడు.

సూత్ర : నీ సందేహ మహేతుకము. ఎట్టులన,

ఆ.వె. పొరుగువారి బిడ్డ సరస భాషల కంటె
వింటి బిడ్డ కొతుకు లింపె యగును
స్వకుల బాలకుండు వాకొన్న కృతి యెట్టి
దైన ముదము గాదె హాలికులకు.

మారి : సత్యమే. గుణగ్రహణ పారీణులకు, స్వకులాభిమానము గూడ నుండిన నిక జెప్పవలయునా ?

(తెరలో)

తే.గీ. కువలయామోద సంధాయి, ప్రవిమలంబు,
సహిత చక్రంబులకు నూడు నమృత సార
మైన రెడ్ల యశశ్చంద్రి కాళి, దిక్కు
దిక్కులకు బ్రసరించు నుదీర్ణకాంతి.

సూత్ర : మారిషా ! భట్రాజు రెడ్డిగారి యశశ్చంద్రోదయ మున గైవారము సేయుచున్నాడు. రామచంద్రారెడ్డి కొలువు కూటమునకు వత్తురేమో !

మారి : అటైన మనమిక బోవుదము రమ్ము.

సూత్ర : అటులనే

(ఇద్దరు నిష్క్రమింతురు)

# కర్షక విలాసము

## ప్రథమాంకము

### 1 - వ రంగము

(రామచంద్రారెడ్డి యింటిలో చావడి)

రామ : సుందరరామరెడ్డి గారూ ! మీ రెప్పుడు వచ్చినారు ?

సుంద : కొంచెము పనియుండి నిన్న సాయంత్రము మోటారు కారుకు వచ్చితిని. నేడే యూరికి బోవలయునని తలచి యుంటిని. మిమ్ముల నొకమారు దర్శించి పోవలయునని వచ్చినాను.

రామ : మీ కార్యము సఫలమా ?

సుంద : ఏమి సఫలమండి, మొన్న క్రొత్తగా స్థాపించిన రెడ్ల సంఘ ఫండులో వేయిరూపాయలు గావలసి, దొరకునని వచ్చి విచారించితిని. రెడ్డిగారూరలేరు. గుమస్తా యుండినారు. వారు సమయము ననుసరించి, యక్కర ననుసరించి నూటికి రెండురూపాయలు మొదలు మూడున్నర రూపాయల వరకు వడ్డికిచ్చెదరట. అందుకు సమ్మతించిన, ఉండిన స్థిరాస్థిని అప్పునకు రెండింతలు ఆడుమాన పత్రము మూలముగా కుదువ యుంచవలయును. అటుపైన రెడ్డిగారికి దమ యిచ్చిన యప్పు మరల వచ్చునో రాదోయను అనుమానము గలిగిన, భాగ్యవంతుడగు రయి తొక్కరుండు జామీను దారుడుగా నుండవలయునట.

రామ : మంచి పద్ధతులే గాని, సుందరరామరెడ్డి గారూ, యింత వడ్డీ యెవరైనా అనుకొను చుండగానైనా వినలేదండీ. అబ్బా, యిది యేమి స్వార్థపరా యణత్వము ! అప్పుల గైకొనువారు మరల వడ్డి మొదలుతో గూడ చెల్లించుటకో, లేక వార లక్ష్యమగు భిక్షాపాత్రిక శరణు సొచ్చుటకో దెలిసినది గాదు. అయ్యో,అది యేమోగాని యీ అన్యాయ దేవతకు మన వారే ఆశ్రయులయినా రండి.

సుంద : అయ్యా, యిందువలననే గదా , మన కులములోని బీదవారు సర్వకాల సర్వావస్థల యందు నేకస్థితిలో నుండుట. వారి కెప్పుడు నిర్భాగ్య దేవతతోనే పోరాటము. ఆ పోరాటమునకు విరామమే లేదు. అప్పిచ్చిన భాగ్యవంతులకు వారు వెట్టి సేయుదురా ? వారివారి కార్యములు జక్కబెట్టుకొందురా? చిల్లిగవ్వయైన

గౌరవవడక వడ్డిమొదలు తేల్చి యిత్తురా ? బీద కాపుల కష్టము లేమి సెప్పను ? మా పయిరులు కోడువారినవి. ఈ వేళ మా పయిరులు కోసుకొని రేపు మీకు వడ్లిచ్చెదమని యెంత బ్రతిమాలుకొన్నను వినక, అప్పిచ్చిన రెడ్డి వారికిం తరువు చీటీల నంపి యిల్లు వెడలనీయక గోడుగుడుపుచుండును. ఏమి సేయను ? పొట్టేలు సెప్పినట్లా, పోతరాజు సెప్పినట్లా ?

రామ : మీరు సెప్పునది నిజమేనండి. యీ దుర్ణయములు అడుగంట బోకడ వెట్టుటకు జక్కగా విద్యమనకులమందు వ్యాపింప వలయును. సంకుచితాభిప్రాయములు మాన వలయును. దేశాటన ముండవలయును. ప్రజాభిమాన ముండవలయును. అట్లుగాక కూవస్థమండూక మితర జలాశయ మెరుగనట్లు, తమగ్రామమే ప్రపంచమంతయునని, తమ యుద్దేశములే యుత్కృష్టము లని తలంచుచు తమ వాదము పెడవాదమని మనస్సాక్షి యొక ప్రక్క బోధించుచుండినను, సత్యమును పోకడవెట్టి పౌరుషమునకై తమ సర్వశక్తిని వినియోగించిన నేమి లగ్గు ? యింక కులాభిమాన రహితులు జీవన్మృతులని నొక్కి చెప్పవలయునా ?

సుంద : అవునండి, కులాభిమానము లేనివారికి దేశాభిమాన మెటుల గలుగ గలదు? ఉపన్యాస వేదికలపై నెక్కి తమ వాచాలత్వమును బ్రకటించుట కొఱకు వేయినోళ్ల దేశాభిమానము దేశాభిమాన మని చాటించిన నేమి ప్రయోజనము? ఉట్టికెక్కజాలని వాడు స్వర్గమున కెక్కగలడా ? తమ సంఘములోని లోపములు పూరింపశక్తిలేని వారు, ఇతర సంఘములకు నీతి బోధింపబోయిన వారు గారవింతురా ? యింట గెలిచి గదా రచ్చ గెలువ వలయును. మన కాపు కులమున నెందరు దినమునకు రెండుపూటలయినను గడుపార భుజింపని వారు లేరు ? ఎందరు పూర్ణమయిన కట్టు పుట్టములు లేక తిరుగువారు లేరు? ఎందరు విద్యా విహీనులై, స్వభావ ప్రజ్ఞాన్వితులయ్యు సానపెట్టని రత్నములై సముచిత శిక్షలేక బుద్ధి వికాసము లేని వారై, మూఢుల వలె నగుపట్టుట లేదు ? ఎందరు తమ శిస్తుల సైతము గట్టుకొనుటకు బ్రాణముల నైన దాకట్టువెట్టి, హెచ్చు వడ్డీలకు ధనము పుచ్చుకొని తరువాత దీర్చికొను సదుపాయము గానక, తేనెను బద్ధయీగవలె, భారమై తమ జీవితమును గడుపుట లేదు ? ఇట్టి దౌర్భాగ్యులకు మనసంఘము చోటిచ్చి యుండునని మనలో నెవ్వరైనను దలచియున్నారా ?

తరువుచీటీ: మాండలికము. ముందు తన పని జరుగవలెనని కోరుతూ పంపు చీటి, తరువుకాడు అనే ప్రయోగం కూడా ఉంది.

చ. సరసపుఁ బంచభక్ష్యములు సమ్మతిమై భుజియించి, మిద్దెపై
బరపునఁ బొర్లుచుండఁబని వాఁడు పదంబుల నొత్త వీవనన్
మరియొక బంటు వీవఁగను మాల్చ నొకానొక రెడ్డి, గంజికిం
గరవయి వేరొకండు మడిఁ గష్టము సేయుట కేగుచుండడే ?

అయ్యా, యిట్టి వారల జూచినప్పుడు మన సంఘస్థుల కిట్టి యవస్థ వచ్చెను గదా యని చింతించు కరుణామయ హృదయుడొక్కడైన నున్నాడా? అట్టి దురవస్థా సాగరమును దరియించుట కొక నావ నెవడైన బ్రసాదించి యున్నాడా ?

రామ : సుందరరామరెడ్డి గారూ ! యిట్టి లోపములు ప్రయత్న పురస్సరముగా మనవారే దిద్దికొనగలరు గాని, అయితే వారెప్పుడును బ్రయత్నము చేసిన పాపమున బోరు. మనలో గొంచెము జ్ఞానము గలవాడు, చదువరులు, భాగ్యవంతులు, చదువులేని బీదలగు మూఢులను జూచినప్పుడు వారికి జదువుకొనుటకు దగిన సాధనము లేర్పరచి, క్రొత్త విషయమును మనసున కెక్కజేసి, వారి సంతతులకు విద్య చెప్పించునట్లు బోధించి, తగునంతవరకు సాయము చేసి, ప్రోత్సాహ మొనర్పవలయు. ఈ పద్ధతులను ఇతర కులస్థుల జూచియైన మనవారు నేర్చుకొనగూడదా ?

సుంద : అయ్యా, తమరు చెప్పునది నిజమే గాని, అట్లితరులకు బోధించు చదువుకొనిన భాగ్యవంతుడగు కాపు వాడెవడైన నొక్కరున్నాడో మీకు దెలిసియుండిన చెప్పగలరా ? ధనికులు నిరుపేదల జూచి నప్పుడు తమ్ము బాధించు పిశాచము లెదురుపడినవని తలంతురు. భాగ్యవంతులకు బీదలతో మాటాడిన గౌరవలోపము. కొంచెము చనువుగా గలసి మెలసి యుండిన, ఏడేండ్ల శనివలె దమ్ము బాధింతురను భయము. పట్టపరీక్షలలో తేరి యాంగ్లేయ భాషాజ్ఞానము గలిగి, నూతనోద్దేశముల దెలిసికొనిన కాపు విద్యార్థులకు, మూఢులగు సైరికులతో గలసి మెలసి యుండిన తాము సర్వకళాశాలలో జదువు కొన్నందుకు నందఱతో ధారాళముగా మాట్లాడిన గౌరవ లోపమను దుశ్చింత, కొందఱు స్వగౌరవ పోషణార్థమయి లేని మౌనము నారోపించుకొందురు. భూగోళ జ్ఞానమే లేక, నక్షత్రమండల జ్ఞాన మలవరచుకొను నిచ్ఛ తదేక దృష్టికి లోపములేక దేవాలయములోని రాతి విగ్రహములకు నిశ్చల జ్ఞాన శిక్షసేయుచు గూర్చొని యుందురు. అట్టి జీవచ్ఛవముల దర్శింపబోయిన నిరుపేదలకు బాల్యమునందు దాము వీధిబడులలో చదివిన సుమతీ శతకములోని 'అధరము కదలీ ' కదలక మధురములగు భాషలుడిగి మౌన వ్రతుడౌ" అను

పద్యము జ్ఞప్తికి వచ్చి వెనుకకు బోవుచుందురు. అయ్యో! మన సంఘమే న్నండి యిట్టి దురాచారములకు నాలవాలమై యున్నది.

రామ : ఎవరో కొందఱు 'ధన మెచ్చిన మద మెచ్చును'' అను సామెతకు లోబడిన మూఢులట్లందురుగాని 'ధనమెచ్చిన మతి హెచ్చును.'' అను లోకోక్తికి సాక్షి భూతులగు బుద్ధిమంతులు మీరు చెప్పిన యవలక్షణములకు నాశ్రయులు గారు.

సుంద : మఱి కొందఱికి సద్విద్యాగంధ మలవడియున్నను, ధన మదాంధపిశాచము చేతి పాలనా దండమునకు లోబడి గర్వోద్యోగమును నిర్వహించుచు, మనస్సాక్షి యెంత ప్రబోధించినను తెలిసికొన జాలకున్నారు.

రామ : సుందరరామరెడ్డిగారూ! మీ ప్రతిభా మహిమ యింతదనుక నాకెఱుక పడినదిగాదు. యిదివరకు మీరు వచ్చినప్పుడీ ప్రస్తావనమే రాలేదు. నివురు గప్పిన ని ప్పను లోకోక్తి మీయందు చరితార్థత నొందినట్లున్నది. మీ అభిప్రాయము లెంత ధారాళమైనవండి ! మీ బోటి వారి మైత్రిని సంపాదింపవలయునని నా కోరిక.

సుంద : మీకు దెలియని క్రొత్త విషయములు నేను దెల్పునంతటివాడనా ! యేవో నాకు దోచిన నాలుగు మాటలను జెప్పితిని.

రామ : నేనొక సంవత్సరము క్రిందట శిస్తుకాలమందు పేద కాపుల స్థితిగతులను స్వయముగా గనుగొని, వారల జేరబిలిచి 'రాజకీయ పరపతి సంఘములలో మీరేల వలసిన ధనము పుచ్చుకోగూడ''దని ప్రశ్నించితిని. అగ్రాసనాధిపతి సంఘ ధనమును స్వప్రయోజ నార్థమయి యుపయోగించుకొని, యితరులు డబ్బునకై అర్జీ యిచ్చుకొన్నప్పుడు, పంచాయతీ సభ జరుగలేదనియు, గుమాస్తా లేడనియు, ఇంతవరకు బాంకుల నుండి డబ్బు రాలేదనియు వాయిదాలు వేసి, తుట్టతుదకు వారి కాశాభంగము కలిగించుట వలన వారా సంఘము తట్టయినా మొగము పెట్టుటలేదని జెప్పిరి.

సుంద : అయ్యో ! యింక వారికి రూపాయకు మూడు కుంచములు మొలగొలుకులు చొప్పున ఒప్పందములకై డబ్బిచ్చు పుణ్యాజనులా శరణ్యము !

రామ : ఈ గ్రామమునం దట్లుగాదు. ఆరు నెలల క్రిందట నేనొక పరపతి సంఘము స్థాపించితిని. ఆ సంఘములో బీద రయితులకు మాత్రము అప్పియ్యబడును. అందుకు మూలధనము అయిదువేల రూపాయలు జమచేసితిని. వడ్డీ నూటికి ఆరు అణాల చొప్పున నేర్పరచి, ఆరు నెలలలో వడ్డీ మొదలు చెల్లించునట్లు

విధించితిని. ఈ సంవత్సరము శిస్తులకు బీద రయితు లందరు మిగుల సంతోషముతో ఆ సంఘమునందే అప్పు తీసికొని పోయిరి. మఱి నేనొక ధర్మపాఠశాల స్థాపింప బ్రయత్నము చేయుచున్నాను. దేవుని దయ ఎట్లగునో !

సుంద : గొప్ప పుణ్యము గట్టుకొన్నారండి ! ఇతరుల కష్టములు తమ కష్టముల వంటివే యని తెలిసికొను తమబోటి వారికి దప్ప తదితరులకు బరుల యాపదలు తెలియునా ?

రామ : మరి మీరెప్పుడు గ్రామానికి వెళ్ళనున్నారు ?

సుంద : ఇప్పుడే, రెండు గంటల ప్యాసింజరుకు.

రామ : అయితే మీరు భోజనము చేసి పోవచ్చును.

సుంద : భోజనమున కేమిలేండి, సకాలమున కింటికేపోగలను.

రామ : అట్లుగాదు. మీరు భోజనముచేసి పోవలయును. లేక ఫలాహారమైనను తీసికొనవలయును.

సుంద : (చిరునవ్వుతో) అటులనా ! (లేస్తూ టేబిలుపై నున్న వార్తా పత్రికలు చూచి) అయ్యా ! మీరీ కృష్ణాపత్రిక ఒక్కటేనా తెప్పించడం ?

రామ : కాదండి, దైని కాంధ్రపత్రిక, ఆంధ్ర గ్రంథాలయ సర్వస్వము, యింకా మరికొన్ని మాసపత్రికలు గూడ.

సుంద : రెడ్డిజన మహాసంఘము పక్షమున నొక మాసపత్రిక ప్రకటింపబడును. దానిని గూడ దెప్పించండి.

రామ : అటులనా ! అవశ్యము తెప్పించెదను.

(గమళ్ల వెంకటేసు ప్రవేశించును)

వెంకటేసు : అయ్యా ! సానానికి యిందా కనంగా నీళ్లు తోడాను. మరి సల్లారి పోతాయేమో!

రామ : వస్తున్నాను పోరా. (వెంకటేసు వెనుకకు మరలును)

ఒరే వెంకటేసుగా ! మన అబ్బయ్య వచ్చినాడా ?

వెంకటేసు : ఇందాకనంగా వచ్చి కూడు దిని కలుపుకాడికి పోయినాడు.

రామ : సరే, ఇక పో.

(అవనిక దిగజారును)

# కర్షక విలాసము

## ప్రథమాంకము

## ద్వితీయ రంగము

(రామచంద్రారెడ్డి సోఫా కుర్చీపై గూర్చుండి వార్తాపత్రిక చదువుకొనుచుండును)

(శాస్త్రి ప్రవేశించును)

శాస్త్రి : మహాప్రభో ! అర్థిచాత కాంభోదమా ! అభ్యుదయోస్తు !

సీ. రామచంద్రారెడ్డి రంగు బంగరు కడ్డి
శుభమస్తు ! శుభమస్తు ! సుగుణ మహిత
మీవార లెల్లరు మిగుల సత్యాత్ములు
విశ్రాణన ప్రౌఢి వెలసినారు
మీ కీర్తి చంద్రిక మిరుమిట్లు గొల్పుచు
నహితాంబుజాళికి నదరు గూర్చు
మీ వ్యవసాయంబు మేదిని ప్రజకెల్ల
జీవనాధారమై సెలగు చుండు

తే.గీ. పూర్వకాలంబు నందున భోజరాజు
పండితామర శాఖియై పరగుచుండె
ప్రస్తుతంబున సైరిక ప్రభువు లిలను
నట్టి లోపంబు దీర్పంగ బుట్టినారు.

సీ. మీ శౌర్యమున కోడి మేటి సింగము తొల్లి
యగజాత పాదంబు లాశ్రయించె
మీ రథంబుల నీడ్చి మెప్పు సెప్పగ లేక
ఆబోతు గిరిజేశు నండ జేరె
మీ పాలంబుల దున్న నేపు సాలక దున్న
యమునకు వాహమై యడరు విడిచె
మీ హలంబున కోడి మేదిని యనిశంబు
దినమణి సేవల దిరుగుచుండు

తే.గీ. *ఔర! మీవంటి వారలున్నారె యొరులు,*
*దీనమందార ! వందారు దివ్య సురభి !*
*కనక సన్మూర్తి ! కకుబంత కలితకీర్తి !*
*ప్రాభవ మహేంద్ర ! శ్రీరుంద్ర రామచంద్ర !*

రామ : శాస్త్రిగారూ ! యీ కుర్చీమీద కూర్చొనండి.

శాస్త్రి : అలాగేనండి. (కూర్చుండును)

రామ : తమ రేప్రాంతమువారు ?

శాస్త్రి : మాది ఉత్తరాదిదేశము

రామ : తమ నామధేయము ?

శాస్త్రి : బిరుదములతో గూడ చెప్పనా ?

రామ : చిత్తము

శాస్త్రి : ప్రౌఢకవి, ప్రౌఢ సరస్వతి, వాది మత్తేభ కంఠీరవ, కుకవి శుండాల గండభేరుండ, కింకవీంద్ర ఘటాపంచానన, సమరోద్దండ కోలాహల, శతావధాని, శతవిధాని, పండిత పద్మవన హేళి, మహామహోపాధ్యాయ, ఉభయ కవిత్వ తత్వపారంగతే త్యాది బిరుదాంకితుండను, లంబోదర శాస్త్రిని.

రామ : అబ్బా, యెన్ని బిరుదులండి ! యివి మీరెట్లు సంపాదించినారు ?

శాస్త్రి : కొన్నిటి సమయానుకూలముగా నే నేర్పరచుకొంటిని. కొన్ని నా స్నేహితులచే నియ్యబడినవి. మఱికొన్ని మా గురువుగారు స్వర్గమున కేగునప్పుడు ఇంద్రసభలో క్రొత్త బిరుదులను బొందుటకై, ప్రాత బిరుదులను నా పేరట పరివర్తనము చేసినారు.

రామ : అందుచేత నేనండి మీ కిన్ని బిరుదులు !

శాస్త్రి : ఇవియేగావు, కొన్ని అలవాటులేక మరచితిని. అన్నియు గలసి పేపతట్టెడు గలవు.

రామ : మీ కెవరయినా జాబు వ్రాయవలయునంటె ముందుగా పోస్టాఫీసు యజమానులకు పెద్ద కార్డులకయి అర్జీ యిచ్చుకోవలయును గాబోలు ! (దరహాసము చేయును)

శాస్త్రి : (వికట హాసము చేయును)

రామ : తమరు కవిత్వము చెప్పగలరా ?

శాస్త్రి : ఓహో, 'రామాయణము సమగ్రముగా విని, రామునకు సీతయేమి కావలయు' నన్న ప్రశ్నవలె నున్నదే! నేను వల్లించిన బిరుదులను మీరు సాంతముగా వినలేదు కాబోలు, మరల వాకొందునా ? (అని ప్రౌఢకవి అని చెప్ప మొదలిడును)

రామ : విన్నానండి. (శాస్త్రి నిలుపును) మీ రే యే కవిత్వము చెప్పగలరు ?

శాస్త్రి : ఆశు కవిత్వము, బంధ కవిత్వము, చిత్ర కవిత్వము, గర్భకవిత్వము, గర్భనిర్భేదక కవిత్వము, చాటుకవిత్వము, ప్రబంధ కవిత్వము పూర్వము చెప్పుచుంటిని.

రామ : మఱి యిప్పుడవియేవీ చెప్పలేరా ?

శాస్త్రి : ఇప్పుడు పెద్దవాడనయినాను. పూర్వము వల్లించిన పద్యములు మాత్రము ఆశు కవిత్వములో జెప్పగలను. నా కన్ని పాకములు తెలియును. నా శైలి పండిత వేద్యము.

రామ : అంత కఠిన శైలియా ?

శాస్త్రి : కాదా మఱి, ప్రబంధ రాజము, విష్ణుచిత్తీయము, వసుచరిత్ర. నా శైలికి సరిచూచే పక్షానికి పై గ్రంథములు మంచినీళ్ళ పాకంలో బడినట్లున్నవి..

రామ : శాస్త్రులుగారూ ! ప్రస్తుత కాలమునకు మీ శైలి నిరుపయోగమండీ. కావ్యము సర్వజనసామాన్యమై యుండవలయును. పద్యములు లలిత పదగుంభన గల్గి రసవంతములై యుండవలయును. ఆంధ్ర భారత శైలి స్పృహణీయము.

శాస్త్రి : భారతము మొగమే నేను జూడను. అది పిప్పి, అందేమున్నది ? సంస్కృత పద గుంభనలేదు. పద్యమంతయు నొకటే సమాసముతో నింపవలయును. అదే పాండిత్యము. అదే కవిత్వము. కవిత్వము సర్వజన సామాన్యమైతే దానికేమి గౌరవ ముంటుందండి ? మరి కవిత్వపు ఫక్కి చెప్తాను వింటారా ?

రామ : దయచేసి చెప్పండి

శాస్త్రి : ప్రౌఢకవి.

సీ. కల్పాంత మేఘాళి ఘట్టించి యొండొండు
　　పిడుగులు వర్షించు వడువుదోప
గిరి సానువుల నుండి గిరికొని బండలు
　　ధమ ధమ ధ్వని దొర్లు డంబు దోప
శైలకందరసుప్త శార్దూలమును రేప
　　గర్జించి పైబడు గతి దలిర్ప

నేటికి నెదురేదు పాటి దోపింపంగ
గమకంబు కఠినంబు గారవింప

తే.గీ. సంస్కృతంబునకే పర స్థానమిచ్చి
ద్విత్వములు గూర్చి, పొల్లులు దీటు పఱచి
యుక్కు సెనగలు గ్రసియించు నొప్పు దోప
కవిత గూర్చిన గాదె పో కవివరుండు.

రామ : లంబోదర శాస్త్రిగారూ ! మీరు చెప్పిన శైలి గల గ్రంథముల నిప్పుడెవ్వరూ కోరరు. అట్టి గ్రంథములు పుస్తక భాండాగారములలో రామబాణ ప్రీతి గాగలవు.

శాస్త్రి : ఆ శైలికి కాసెత్తు తగ్గినా గాని టీకలు వ్రాసే పండితులకు పనిలేక కవులను దూషిస్తారు.

రామ : (నవ్వుచు) మంచి సమాధానమే !

(యింతలో నొక బాలుడు వచ్చి రెడ్డి చేతికి జాబిచ్చును)

రామ : (జాబు చదువుకొని) ఏమండీ, మీరేనా రామకృష్ణారెడ్డిగారు ?

రామకృ : అవునండి.

రామ : మీ కావ్యమును దెచ్చినారా ?

రామకృ : ఆ, తెచ్చినాను. (అని చేతికిచ్చును.)

రామ : మీరు సమయమునకే వచ్చినారు. శాస్త్రులు గారుగూడ నున్నారు. మీరు కూర్చోండి. (కొన్ని పద్యములు తనలో చదువుకొని, (స్వగతము) శైలి సరసముగానే యున్నది.)

శాస్త్రి : ఆ గ్రంథమేమిటండి ? పూర్వకవి కృతమా, ఆధునిక కవి కృతమా ?

రామ : మా కులస్థుడేనండి, యీ అబ్బాయి వ్రాసినాడు.

శాస్త్రి : (ఆశ్చర్యముతో) ఈ పిల్లవాడా ! మీ కులస్థుడా ! అంటే కాపువాడు.

రామ : (చిరునవ్వుతో) అయితే యేమి ?

శాస్త్రి : రామ, రామ ! (అని చెవులు మూసికొనును)

రామ : ఏమి శాస్త్రులు గారూ ! రామనామస్మరణచేసి చెవులు మూసుకొంటున్నారు?

శాస్త్రి : అయ్యో, రెడ్డిగారూ ! కాలమెంత తలక్రిందయినదండి ! (కొంచెము తల యూపి పెదవులు విఱచి) ఎంత నికృష్టపుకార్యమైన కలియుగమున కేతగును, శంబూకుడను శూద్రవాడు తపస్సు చేస్తుంటే, యాతనిచంపి లోకమునకు శాంతిగూర్చిన రాముడే రాజు. ఆ యుగమే యుగము. శూద్రవాళ్ళు కవిత్వము చెప్పుచుంటే మరణదండన విధించే రాజులేకనే ఈ కలియుగములో నిన్ని యుత్పాతములు బయలుదేరినవి. యీ సంఘములు, యీ సమాజములు, యీ సంస్కారాలు యేమిటివి ? ఉత్పాతాలు గావా మఱి ?

రామకృ : సర్వలక్షణ సమన్వితమైన కవిత్వము ప్రధానముగాని, కవి ఎవడయిననేమి ? రత్నాభరణము పంచముని మెడలో వ్రేలాడుచుండినను స్వప్రకాశమును బోనడచునా ?

శాస్త్రి : అబ్బాయీ ! నీవు లోకానుభవ శూన్యుడవు, పసివాడవు. నీకేమియు దెలియదు. రత్నాభరణము భాగ్యవంతులు ధరించినపుడది రత్నాభరణమేగాని, అదే నగ బీదవాడు ధరించితే గాజురప్పల నగ, తెలిసికొన్నావా ?

రామకృ : (స్వగతము - '(చెవిటికి శంకూదినట్లు') (ప్రకాశముగా) మీరు శాస్త్రవేత్తలు మీతోవాదమెందుకు పసివానికి ?

రామ : శాస్త్రులుగారూ ! శూద్రులు కవిత్వము చెప్పగూడదని మీరు రాద్ధాంతించుచున్నారే,ఆది కావ్యమగు శ్రీ మద్రామాయణమును రచియించినది శ్రీ వాల్మీకి మహా మునీంద్రులు గదా ! ఆయన బోయవాడనిగదా లోక ప్రసిద్ధి!

శాస్త్రి : ఆ కాలమెక్కడ, ఈ కాలమెక్కడ ? గోకులాష్టమికి, పీర్లపండుగకు సంబంధము చేస్తున్నారు. అప్పకవి సిద్ధాంతము మీకు దెలియదా ?

తే.గీ.

*ఉపమ గలిగిన శయ్యల నొప్పియున్న*
*నంత్యభవుని కావ్యంబు గ్రాహ్యంబుగాదు,*
*పాయసంబైన సంస్కార పక్వమైన*
*కాక మృష్టంబు హవ్యంబుగాని యట్లు,*

విన్నారా ?

రామ : వసుచరిత్ర కర్తయగు రామరాజభూషణుడు రాజసభలలో గౌరవింప బడినవాడుకాడా ? ఆతని కావ్యము పండిత పఠనార్హముగాదా ?

శాస్త్రి : ఆతని కవనాన్ని తెనాలి రామకృష్ణుడు ఇట్లు తూలనాడినాడు, విన్నారా?

క. 'చీపర పాపర తీవలు
చేపలు బుట్టల్లినట్లు చెప్పెడు నీ యీ
కాపు కవిత్వపు కూతలు
బాపన కవివరుని చెవికి ప్రమదం బిడునే ?"

రామ : అందుకేమిలెండి, కవులకు నొకరి నొకరు దూషించుకొనుట స్వభావమే. మఱి యీ గ్రంథాన్ని కొంచెము చూడండి.

శాస్త్రి : అబ్బా, నేను జూడనండి, యేమి కవిత్వము ? కాపువాడికి కవిత్వము, తురకవాడికి కవిత్వము, కల్లుదాసరికి కవిత్వము. అయ్యో ! కవనాని కెన్ని కడగండ్లు పట్టినాయండి ! ఛీ, ఛీ ! యింత యేల, మా వారినే అనుకోవాలె, వారే విద్య నేర్పించడము, వారే టీకాలు వ్రాయడము, వారే వ్యాఖ్యానాలు వ్రాయడము, మరి వారే వేదముల నుదాత్తానుదాత్తాది స్వరములతో గూడ నచ్చువేయడము. ఇక శూద్ర వాండ్లకు విద్య కలుగుతుందంటే కలుగదా మఱి? అందుకే అప్పకవి దీర్ఘాలోచన పరుడుగాబట్టి ఆయన కడుపుచల్లంగా నట్టిసిద్ధాంతము చేసినాడు. ఇది యట్లుండనిచ్చి మరియొక యుత్పాతము. ఆర్యసమాజస్థులు శూద్రవారికి, తురకవారికి ఉపనయనాలు చేసి, యజ్ఞోపవీతములు వేసి, వీరెందుకు బ్రాహ్మణులు గాగూడదని మా ప్రాణములు తీస్తున్నారు. దారిలో గనబడనీరు. ఒకటే పెడవాదము. ఇది యట్లుండగా కమ్మవారు యజ్ఞదీక్ష వహించి సోమయాజులు గావడము. ఈ కష్టములు పడేదానికంటె అడవులలో తపస్సు చేసుకోవడమే మేలండి.

రామ : మఱి యీ గ్రంథాన్ని కొంచెమయినా చూడరా ?

శాస్త్రి : చూస్తామనుకొంటే సులోచనాలు లేవు. (అని లేవబోవును)

రామ : లంబోదర శాస్త్రులుగారూ ! మీరు దయచేసిన కార్యము తెలియపఱచకనే పోవుచున్నారే ?

శాస్త్రి : ఓహో, మరచితిని, (అని మరల కుర్చీలో కూర్చొనుచు) నాకు షష్టిపూర్తి అయినది. దేవుని కృపవలన నింతవరకు భార్యా భర్తలము సుఖముగా నున్నాము. మేము షష్టిపూర్తి వివాహము చేసికోవలయునని కోరిక కలిగినది. ఆ సందడిలో మా చిన్నవాడికి నుపనయనము, మా రుక్మిణికి పెండ్లిన్నీ, మా తండ్రి తద్దినమున్ను, మా పెద్దకూతురి నిషేక ముహూర్తమున్ను జరుపుకోవలయునని నా కోరిక. తరువాత దేవతా యత్నము. మీరిచ్చే సంభావన తాళిబొట్టులో బడేటట్టుగా చూస్తాను

రామ : (లోనికి వెళ్ళి రెండు రూపాయలు తెచ్చి ఇచ్చును.)

శాస్త్రి : ఇంత ప్రసంగమునకిదియేనా సంభావన ?

రామ : మఱొక సమయములో చూడండి.

శాస్త్రి : అయితే సరే. మరి సెలవా ?

రామ : దేవుని సెలవు (అని దండము పెట్టును)

శాస్త్రి : (నిష్క్రమించును.)

రామ : రామకృష్ణారెడ్డిగారూ ! యిటువంటి వారిచే మీ గ్రంథము పరిష్కరింపించుట తగిన పనిగాదు. ఇట్టివారికి నీసు మెండు. వారికి ననుమానము గలిగిన దంతయు దప్పేయని వారి భ్రమ. మఱీ నీ బాల్యము లేని తప్పులు కూడా నున్నవను నూహాకు దోడ్పడును. నాకు పరిచితులును, విద్వత్కవులును, విశాలాభిప్రాయములుగల వారును, కరుణామయ హృదయులును నైన శర్మగారొకరున్నారు. నీ గ్రంథమాయనచే పరిష్కరింపించెద. ఇక ఫలహారము చేసి గ్రంథాలయము తట్టు పోవుదము.

రామకృ : అటులనే.

(అవనిక జారును)



# కర్షక విలాసము

# ద్వితీయాంకము

## ప్రథమ రంగము

(వెంకారెడ్డి గృహము, గుమాస్తా లెక్కలు చూచుచుండును)

నరసయ్య : (స్వగతము) నూరార్లైనను, ఆరు నూర్లైనను కాపుల యిండ్లలో గుమాస్తాలుగా నుండి మెల్లగా కాలము గడుపుకొనుటయే మేలు. వారు తిట్టినను, తిమ్మినను, అగౌరవము చేసినను, గౌరవము చేసినను వారి యాశ్రయము శ్రేష్ఠము. లాభదాయకము. కష్టపడినా గవ్వదొరకని యీ కాలములో జీతముల నూరులుగా జేకూర్చు కొనుటకంటే నిక గావలసిన దేమున్నది ? నూరుతిట్లు దిని యైన నొక గుమ్మడి దబ్బ తెచ్చికోవడముగదా వివేకము ! వెంకారెడ్డి యెక్కువగా చదువుకోనందు వలన నా చేయి కొంచెము కొంచెము మెలగుచున్నది. పెత్తనములు చేయగలవాడే గాని లెక్క పద్దుచూడలేడు. ఇక వెంకటరెడ్డి చదువు చాలించి వచ్చినప్పటికి గదా గ్రామ లెక్కలపై తనికీకి వచ్చును ! ఇంతలో నే నేదో రెండు, మూడు వేల రూపాయలు చక్కబెట్టుకొందును. పోయిన సంవత్సరము జమచేసిన నన్నూరు రూపాయలు ఈ సంవత్సరము జమ చేసిన నన్నూరు రూపాయలు రెడ్డిగారికి.................. ఇక గనుగొనబోడు. తప్పులెక్కలు వ్రాయించి తప్పు దస్తావేజులు సృష్టించి వెంకారెడ్డి సంపాదించే డబ్బంతా అది పోయే దారిన పోతున్నది. మరి అట్టి..................... డబ్బు నిలుస్తుందా ! (బయట చెప్పుల సందడి యగును) చెప్పుల చప్పుడగుచున్నది. రెడ్డిగారు వచ్చుచున్నారు కాబోలు ! (బొందు బుక్కుల పేజీలు త్రిప్పుచు) సుబ్బారెడ్డి కాసా ఖర్చు 40-00 ; రామిరెడ్డి జమ 90-0-0; జంగమమల్లుగాడు ఖర్చు 20-0-0 ; ఏటుకాలి పోలుగాడు జమ 5-0-0 (అని చదువుచు వ్రాయుచుండును)

(వెంకారెడ్డి ప్రవేశించును)

వెంకా : నరసయ్యా ! యిదేమీ, యీ లెక్క రాస్తుండావు, దస్తావేజు తయారుచేయలేదా?

నరస : ఇందులో ఒక తంటా వచ్చినదండి (అని సులోచనములు తీసి చొక్కా గుడ్డతో తుడుచుచు చెప్పును)

వెంకా : ఏమి తంటాలయ్యా, మహాతంటాలు ? (అని మొగము చిట్లించుకొనును)

నరస : పెంచెలురెడ్డి చేవ్రాలు దారుడు గాడు. ఫోర్జరీ చేయుటకా వీలులేదు. బొట్టన వ్రేలి ముద్దర కావలయును. ఉత్త నిశాని చెల్లదు.

వెంకా : (కోపముతో) మఱి ఆ గాడ్దెకొడుకు పొగురెట్ల తగ్గుతుంది ? ఒకవేళ మనవి యాభయి ఆవుగొడ్లుపోయి పండుచేను ఒక జాముసేపు మేస్తేనే బందిలిదొడ్లో తోలవలయునంట్నా ? ఇంత పొగురా వాడికి ? యెవరాసరా చూచుకోని వా డాడిందల్లా ఆటగా వుండది ? వాణ్ణి బొక్కా పెట్టాల, యెట్నో ఒకట్ట రాయవయ్యా !

నరస : (కొంచెము కోపముతో) మఱి వ్రేలిముద్దరెట్లయా కొట్టుకోళ్ళు ?

వెంకా : ఏదో పనికని పిల్చి యింట్లో కొచ్చిన పాట తలుపేసి జాటీ తీసుకొంటే ముద్దరా వస్తుంది, గిద్దరా వస్తుంది.

నరస : (తలయూచి కొంచెమాలోచించి) అట్లకాదండి. పెంచెలురెడ్డి రామచంద్రారెడ్డి పక్షమువాడు, మీకు రామచంద్రారెడ్డికి పార్టీలు పడినప్పటినుంచి మన విరోధులందరు ఆయన ఆసరా చూచుకొంటున్నారు. ఆయన పెద్దమనిషి, నెల్లూరు, అల్లూరు తిరిగేవాడు. ఉద్యోగస్థులందరు ఆయనకు పరిచయము. ఆయన మాట సాగినట్లు మన మాట సాగదు.

వెంకా : అవునయ్యా. మనం జేసే ప్రతిపనికి అత డడ్డు పడుతుంటాడు. అతణ్ణి ముగించితే మన పనంతా బాగా ఉంటుంది.

నరస : (ఆశ్చర్యముతో) అబ్బా ! అది దుస్సాధ్యమైన పని. బీదవారికి ఆయన చాలా సహాయకారిగానుంటాడు. కాబట్టి ఆయన కష్టం ఊరివారి కష్టంగా ఉంటుంది. రవ్వంతైనా పొరవచ్చినట్లైతే మన కాపురమే మునుగుతుంది.

వెంకా : (ఆలోచించి) రంగా!

రంగ : అయ్యా !

వెంకా : నీవుపోయి మాదిగ రాగణ్ణి పిలుచుకోనిరా.

రంగ : ఇప్పుడేనా ?

వెంకా : (కోపముతో ) ఆ !

రంగ : (స్వగతము) మారెడ్డికి ఎప్పుడుబట్టి.............ఎవర్ని సంపడానికో మాదిగరాగణ్ణి.

(నిష్క్రమించును)

నరస : (సంతోషముతో) మీ యుక్తి మహా శ్లాఘనీయమండి.

వెంకా : (చిరునవ్వు నవ్వుచు చుట్టకాల్చును)

(రాగని ప్రవేశము)

రాగ : సామీ ! అదేం దాసిన (వంగి దండము పెట్టును)

వెంకా : ఒరే ! అట్ల తిరిగి దొడ్లోకి రారా.

రాగ : బుద్ధి (అని నిష్క్రమించును)

నరస : (స్వగతము) 'చెట్టు చెడే కాలమునకు కుక్క మూతి పిందియ లన్నట్లు,' మా రెడ్డికి పోగాలానికి అన్నీ దుర్బుద్ధులే. పండు చేను యాభయి పశువులు మేస్తే యెవరికైన కడుపు మండదా ! యెన్నిమాట్లు ఇతని దగ్గరికి వచ్చివాడు బతిమాలుకొన్నా పశువులను కట్టివేయించడు. ఈనకాచి నక్కలపాలు చేసినట్లు, దున్ని కలుపుకప్పర తీసికొని పండబోయే కాలానికి ఊరివాడి పశువులు మేసిపోయిన యెడల వాని గతి యేమి ? యిప్పుడు మాటంటే చేతబడులు, తప్పు ప్రామిసరీ నోట్లు కల్పించడం జరుగుతున్నది.

(వెంకారెడ్డి, రాగడు ప్రవేశింతురు)

రాగడు : సామీ, సెలవా !

వెంకా : ఒరే, అప్పుడు నల్లారెడ్డికి తప్పిపోయినట్లుపోయెనా...... లంజాకొడుకా ! నీ ప్రాణంతీస్తా.

రాగ : బుద్ధి, బుద్ధి, (అని చెంపలు కొట్టుకొని) సామీ ! అవశ్శృత, మునుపాయన బయలుబూమి దొరకలా ! అందుకోసము తప్పిపోయింది. మఱి (అని ఒక చేతితో తలగుడ్డ పట్టుకొని మఱియొక చేతితో తల గోకికొనుచుండును)

వెంకా : పనైతే అప్పటికంటే యింకా పందుము మొలగొలుకులొడ్లు, ఒక పొట్టేలి నిస్తాలే పోరా !

రాగ : అదే సామీ ! నీ పాదాల సలవన. (నిష్క్రమించును)

వెంకా : నరసయ్యా ! మసోదా కుదిర్చిపెట్టవయ్యా, ముద్దర కెట్టైనా ఉపాయం చేస్తాం.

నరస : (వ్రాయుచుండును)

(నారప్ప ప్రవేశించును)

వెంకా : ఏమొయియో నారప్పా ! అబ్బా, నీ దర్శనమే కనాకష్టంగా వుండదే !

నార : లేదెంకర్మ ! అగ్గురారం పోయివుణ్ణాను. నిన్నా మొన్నాలేను.

వెంకా : ఏమి సమాచారాలోయ్ ?

నార : అగ్గురారానికి నెల్లూరు బళ్లోళ్ళు వచ్చినారు. వాళ్లు చెప్పుతారు యుద్ధం మాటలు, అబ్బా ! (అని చిరునవ్వు నవ్వును)

వెంకా : యేమిటి యొ యొ !

నార : ఇప్పుడు కుంపిణీవాడికి, జర్మనోడికి యుద్ధం జరుగుతుందంట ! పెంచోల్లు, రూమోల్లు యుద్ధం చేస్తుండారంట ! యిప్పుడెల్లా వగదెగదంట. అది సరే గాని, నీలిమందు దర యుద్ధమయిన దాకా తగ్గదంట్నే ?

వెంకా : అవునంటోయి !

నార : అగ్గురారాన కోమటి రామాంజము పైసాకు ఆరు సుట్టలిచ్చేది. ఇప్పుడు యుద్ధమని రెండు తగ్గించినాడయ్యో, సూడు మఱి.

వెంకా : (పెద్ద నవ్వునవ్వి) అట్టనా ! పొవ్వాకు గూడా సీమనుంచి వస్తదంట్నా?

నార : ఇప్పుడు పెతిదానికి అదే సాకైతే! మఱి నేనొస్తా, చేనిదాకా పోవాల. ఇట్లొచ్చి పోదామని వచ్చినా !

వెంకా : ఉండోయ్ పోదువుగాని, పొవ్వాకు తీసుకోని పోదువులె. (పెద్దగా) పిల్లా (పలుకరు) రంగా !

రంగ : (తెరలో) ఆ......... చేతిలో పనుండది వస్తుండా ! (వచ్చి) అయ్యా ! ఏమి ?

వెంకా : నారప్పకు రెండు కాళ్ల పొవ్వాకియ్యరా.

రంగ : (తెచ్చి యిచ్చును)

నార : (మూచ్చూచి కొనుచు, స్వగతము) రెడ్డిగారింటి కాడ రెండుమాటలు చెప్తే రెండు కాళ్ల పొవ్వాకు దొరుకుతుంది.

(అవనిక జాఱును)

## ద్వితీయ రంగం

(వెంకారెడ్డి భోజనముచేసి, చుట్ట త్రాగుచు, భాగవతము చూచుచు, చుట్టక్రింద పెట్టి, అక్షరము లొక్కొక్కటిగా కూడికొనుచు బ్రత్యక్షరమునకు రాగము దీయుచు జదువుచుండును.)

సీ. 'చుట్టాలు దొంగలు సుతులు ఋణస్థులు
కాంతలు సంసార కారణములు "

(ఇంతలో సీతడు ప్రవేశించును)

సీత : అయ్యో, యంకరెడ్డిమ !

వెంకా : ఎవరర్రా (తలయెత్తి) సీతా ! యే...............

సీత : పోలీసోళ్ళ దెబ్బకు తట్టుకో లేకుండానయ్య.

వెంకా : ఏమి ?

సీత : నిన్న సందేల కట్టే పరవగా ఒచ్చినారు. మళ్లీ దెయ్యాల్దిరిగే అద్దమరేయికాడ లేవగొట్టినారు. యెక్కడుణ్ణారో మల్లీ కాపు లేశేయాలకు తగిల్నారు. మీ దిబ్బలమీదుంటిమి. అంతో యింతో దొరికితే మీకే యిస్తుంటిమే ! మఱి మీరు గదా సంరచ్చించాల ?

వెంకా : నీకేం భయములేదు లేరా. నీ ప్రాణానికి నా ప్రాణం ఇస్తాలే. అయితే యీ అమాస కెక్కడికీ దోపిడికి పోలేదంట్రా ?

సీత : అబ్బా ! పురోయితపు బాపనయ్యకు మీరు బియ్యం పెడ్తారు. ఆయన యింట్లో కూసోని ఒకటే మోపనకార్తి, మిందకార్తి, కార్తిమిందకార్తి పెట్టి వానలు కురిపించి, గుడిసెలలోనుంచి బయటికి కాలుపెట్టడానికి లేకుండా చేసినాడు. గెంజికి మాడి సచ్చినామయ్యా!

వెంకా : మఱి యీ తడవ వుత్తదేనె ! (అని పెదవులు విరుచును)

సీత : కాదులే, అయిదారు దినాలనాడు పోయి వడుపేసుకోని వచ్చినాను. (అని చేపల బుట్టలోని నగలు తీసి యిచ్చును.)

వెంకా : రెండు మురుగులు జతలు,ఒక పట్టెడేనా ! (అని చేతిలోనికి తీసికొనును.)

(ఇంతలో పోలీసు ఇన్‌స్పెక్టర్, పోలీసు ప్రవేశము)

వెంకా : (తత్తఱ బిత్తఱలాడి సొమ్ములు ఒడిలో వేసుకొనబోవును. రెండు మురుగులు, పట్టెడ క్రింద బడును.)

పో.ఇ. : ఏమండి రెడ్డిగారూ ! మీ కా నగలెక్కడివి ?

వెంకా : (అధైర్యముగా) మావేనండి.

పో.ఇ. : ఈ యానాదివాడెవడు ?

వెంకా : మా తోట కావలివాడు. ఇప్పుడే వాలుగలు, చేపపిల్లలు తెచ్చి పెట్టిపోతున్నాడు.

పో.ఇ. : అయితే యిప్పుడీనగలతో మీరేమి చేస్తున్నారు ?

వెంకా : అయ్యా, చెప్తా. (తెరవంకచూచి) ఒరే రంగా ! ఇనసపెట్టరుగారికి పాలల్లో సక్కిరేసుకోని తీసకరారా, పో.

పో.ఇ. : యిప్పుడేమీ అక్కరలేదు.

వెంకా : అయ్యో, తీసుకోండి స్వామీ! యెండలో బెట్టబడి వొచ్చినారు.

పో.ఇ. : మిమ్ములు చూస్తే అనుమానం మనుష్యులుగా నున్నారు. ఆ మురుగులను, గజ్జల పట్టెడను ఇక్కడ పెట్టండి.

వెంకా : ఏమన్నా అనేరు గాని ఆ మాట అనబాకండి స్వామి ! పదిమందిలో తిరగనేర్చిన వాళ్లము, అట్లా పనికివస్తామా ?

పో.ఇ. : (భీకరముగా) ఇచ్చటుంచండి చెప్పినట్లు.

వెంకా : (భయముతో క్రిందపెట్టును. పో.ఇ. చేతికి తీసుకొనును)

పో.ఇ. : 4379.....

పోలీ : అయ్యా !

పో.ఇ. : రెడ్డి చేతను, ఆ యానాదివానిచేతను స్టేట్మెంటు తీసుకో.

పోలీ. : చిత్తము

సీతడు : (రెడ్డి తట్టు తిరిగి) అయ్యా, నా గతేం సామీ ? బండెడు పిల్లల గలోణ్ణి, నిన్ను నమ్ముకోనుండాను.

వెంకా : (ఉరిమిచూచి) చత్, పూరకుండు......

సీత : (స్వగతము) తెప్పించుకునేటప్పుడు మాయమాటలు చెప్పేది, ఇప్పుడు తన్నబొయ్యేది.

(పోలీసు, పోలీసుఇన్స్పెక్టరు పరస్పరము చూచుకొంటారు)

పోలీ : వెంకా రెడ్డి, ఇట్రా

వెంకా : (వచ్చును. రెడ్డి చెవిలో పోలీసు రహస్యము చెప్పును)

వెంకా : అట్నైలే అయ్యా, యీ ప్రళయం తప్పించుకుంటే.

పోలీ : (రెడ్డిచెవిలో) కొద్దిగా తీసికొనడు. ఆయన యిప్పటివాడుగాడు, యీ సొమ్ములు గాక పైన వంద.

వెంకా : అయితే మాందిలే అయ్యా ! యీ అంపాదిలితే పదేలు, మఱి యీ కేసెట్టచేస్తారు?

పోలీ : ఏనాదివాడిపై మోపి, మిమ్ముల సాక్షి వేస్తాం.

వెంకా : అయితే సరే. రంగా ! ఇనస్పెక్టరు గారికి, పోలీసుకు తమలపాకులు, యాలక్కాయలు తెచ్చియ్యరా తొందరగా.

రంగ : (తెచ్చి యిచ్చును)

పో. ఇ. : (పోలీసు వంక తిరిగి) యీ యానాదివానిని పోలీసు స్టేషనుకు తీసుకొనిపో.

పోలీ : చిత్తం.

సీత : (రెడ్డి తట్టు తిరిగి) అయ్యా, నన్నేం చేసినావయ్యా యంకమరెడ్డి ! (అని యేడ్చును. పోలీసు మెడబట్టి నెట్టును.)

వెంకా : ఓరే, నేనింతదాకా పోలీసుతో చెప్తుండింది నీ సంగతే, పోరా, నీకు భయములేదు.

(పోలీసు, ఇన్స్పెక్టరు, యానాది నిష్క్రమింతురు)

వెంకా : అబ్బా ! నేటి కొక పెద్దగండం తప్పించుకొన్నట్టు. రంగనాయకులకు రథోత్సవము చేయిస్తానని మనసులో మొక్కుకున్నా. రంగ నాయకులు సత్యెంగల్లదేవుడే!



## తృతీయ రంగం

ఇంటి చావడి

(వెంకటరెడ్డి ఇంగ్లీషు నావలు చదువుచుండును. ఇంతలో రామారావు ప్రవేశించును)

రామా : మిష్టర్ వెంకటరెడ్డి, ఎప్పుడు వచ్చినావు man ?

వెంక : మొన్న సాయంత్రం మెయిల్కు వచ్చినాను.

రామా : మీ examinations అయినవా ?

వెంక : అయినవి. Summer holidays ఇచ్చినారు.

రామా : Re - opening ఎప్పుడు ?

వెంక : July 15th or so. ఇక్కడ reading - room start చేసినారంటనే బాగా జరుగుచున్నదా ?

రామా : ఎవరో ఒకరు start చేస్తే start చేసిన వానికేదో గౌరవమనిన్నీ, యితరుల కాగౌరవము లేదనిన్నీ.......... ఇదొక bad opinion. కొందరు దానికి vigorous గా work చేస్తారు. అందుట్లో యిప్పుడు మీ father, brother కున్ను, రామచంద్రారెడ్డికిన్నీ పార్టీలు. Reading - room ను start చేసినది రామచంద్రారెడ్డి, అందువలన మీ father, brother పక్షము వాళ్లు reading - room కు పోరు.

వెంక : ఇది బాగున్నదే ! Reading - room ప్రజలందఱి కొరకు గదా స్థాపింపబడినది. మఱి family disputes దీని కేమి సంబంధమయ్యా ! Public reading - room ఒకరి సొత్తా, అందరికి సమానాధికారం లేదా ?

రామా : అది సరే, ఇది వఱకు రామచంద్రారెడ్డి బలవంతము చేయగా చేయగా కొంతమంది రూమ్కు వస్తుండినారు. ఇప్పుడు పార్టీల సాకుతో ఎవ్వరు రారు.

వెంక : మన గ్రామములోనే గాదండి ఈ పద్ధతి. మా reddies యెక్కడెక్కడ reading - rooms start చేసినారో అక్కడంతా యిట్లే వున్నదండి.

రామా : మీ రెడ్ల party spirit చాలా మెండబ్బా !

వెంక : Party spirit ఆ, brutal spirit ఆ ?

రామా : (నవ్వును)

వెంక : మొన్న నేను పోయి చాలా వరకు మా రెడ్లు start చేసిన reading - rooms చూచినాను. Meeting call for చేస్తే పెండ్లి పేరంటము వలె ఒక్కొక్క రెడ్డిగారి యింటికి Secretary పదిమార్లు తిరగవలయును. ఎన్నిమార్లు తిప్పించుకొంటే అంత గౌరవము ఎక్కువని వారి అభిప్రాయము.

రామా : సెభాసు. (తల యూచుచు)

వెంక : రామారావ్ ! యిది యేమొ చెడ్డ అలవాటయినదండి. ఆంధ్రభాష మాట్లాడుతుంటే మధ్య మధ్య యింగ్లీషు పదములు తఱచుగా పడుతుంటవి. నేను ప్రయత్నపూర్వకముగా ఆంధ్రభాషే మాట్లాడ తలస్తాను. అలవాటువలన యెట్లో యింగ్లీషు పదములు దొర్లుతానే వుంటున్నవి.

రామా : మీ మాట సరె, అట్లుండ నీయండి. కొందరు గౌరవార్థమయి ప్రయత్నపూర్వకముగా మధ్య మధ్య ఇంగ్లీషు ముక్కలను చొప్పించి, సంతోషించే వారున్నారు.

వెంక : (నవ్వును)

రామా : నిజమే, యిది చాలా bad practice యేనండి.

వెంక : నాకిప్పుడిప్పుడాంధ్రభాషపై అభిరుచి గలుగుచున్నది. మనుచరిత్ర కొంత వఱకు చదివినాను. విజయవిలాసము రెండు మూడు సార్లు చదివినాను. అబ్బా ! ఆ సొంపేమని చెప్పనండి. ప్రతి పదరసోదయమంటే ఆ పుస్తకమునకే తగును. నాటకములు గూడా కొన్నికొన్ని చదివినాను. ఆంధ్రప్రచారిణి నవల లించుమించుగా అన్నీ చదివినాను.

రామా : వెంకటరెడ్డీ ! నీవు చాలా బాగా language improve చేసుకొన్నావే. నీవు school lessons అని చదువుతావా, general books అని చదువుతావా ?

వెంక : చదువవదలచుకొనే వారికి వ్యవధిలేకనే యుండదే ?

రామా : నీ Character చాలా మంచిదయ్యా ! మీ రెడ్డి students ను చాలా మందిని చూచినాను. వారిని గురించిన కథలు కొన్ని విన్నాను. అబ్బా! వారి moral standards bad అండి. తల్లిదండ్రులేమో తమ పిల్లకాయలు నెల్లూరులో బాగా చదువుచున్నారని నెల నెలకు school fees గాక pocket money two rupees నో లేక three rupees నో పంపిస్తారు. వీరు పాఠములు పఠింపక నెక్టయిలు, కాలర్లు, బూట్సులు, చలవద్దాలు ధరించుకొని చెడ్డ స్నేహితుల గూడి బోగమువారి యిండ్లలో కాలము గడిపి బడి విడిపించే వేళకు పుస్తకములు

చంకల్లో బెట్టుకొని భోజనముకు బయలుదేరుతారు. మఱి వీరి చర్యలు దూర గ్రామములలో నుండు తల్లిదండ్రుల కెట్లు తెలియగలవు ? వారు పిల్లకాయలను గురించి విచారించనే విచారించరు.

వెంక : అవును, నిజమేనండి ! మొన్న నేను ఇద్దఱి విద్యార్థుల విషయమై వినియున్నాను. కావున విద్యార్థుల కొక hostel యేర్పరచినట్లయిన ఈ దురాచారములు చాలా వఱకు తగ్గిపోగలవు.

రామా : Perhaps you don't know ! (అని నవ్వును)

వెంక : ఏమిటి ?

రామా : మీ రెడ్లకు నెల్లూరులో కొన్ని నెలల క్రిందట ఒక hostel యేర్పరచినారు.

వెంక : అయితే, నేను పోయి చూడవలయునే !

రామా : Then I shall take leave of you (అని లేచును)

వెంక : ఇంతలో తొందరేమి ? కూర్చోవయ్యా పోవచ్చును.

(అని చేయి పట్టుకొనును)

రామా : Excuse me, please (అని చేయి విదలించుకొని) రామచంద్రారెడ్డి private school open చేస్తానని చెప్పి, దానిలో నన్ను టీచరుగా ఉండమని కోరినారు. ఆయనతో మాట్లాడవలెను. Good - bye. I will meet you tomorrow again (నిష్క్రమించును)

(వెంకటరెడ్డి మరల నావలు చదువుచుండును. సాతాని కుబ్జ పువ్వు లమ్ముచు వచ్చును.)

కుబ్జ : పూల్ పూల్, జాజిపూల్, మల్లిపూల్, చేమంతి పూల్, దవనం, మరువం, 32 జంటాలు అర్ధణ, బలేచౌక.

వెంక : కుబ్జా ఏది ఒక మల్లెపూల దండ యిచ్చిపో.

కుబ్జ : అయ్యా, మీరెప్పుడొచ్చారు ? (అని బుట్టలోని దండ తీసియిచ్చును)

వెంక : యీ దండ యెంత ?

కుబ్జ : ఎంత అయితే యేం లెండి, యింట్లో అమ్మగారి దగ్గిర వడ్లెయ్యించుకొని పోతా.

వెంక : అయితే సరే పో. (అని పుస్తకము చూచు చుండును)

కుబ్జ : అయ్యా ! (అని తల గిరికొనుచు) దీనికి నే నొచ్చే టప్పటికి జవాబు రాసి పెట్టండి. (రవికలో నుండి జాబు తీసి, నవ్వి, అతని మొగము కొంచెము చూచి నిష్క్రమించును.)

వెంక : (అడ్రసు చూచికొని) యీ జాబెక్కడిది ? Female hand-writing గా వున్నది. (జాబు విప్పును) ఓహో, పద్యములే ! (చదువును)

క. శ్రీమద్వేంకట రెడ్డికి
వేమరు దండములు పెట్టి వెలవెలది సతా
రామమ్మ వ్రాయుచున్నది
కామునకు రతీ లతాంగి కరణిని బ్రీతిన్

ఉ. నిన్నఁ బ్రదోషకాలమున స్నేహిత వర్గముతోడఁ గూడి యో
యన్నుల కన్నువిల్తుఁడ రయంబుగ నేగెడు నిన్ను నెంతయుం
గన్నుల కాంక్ష దీరనటుఁగాంచిన యంతనె పంచబాణుడుం
గ్రొన్నన తూపులేసి తెగఁ గోసెడు నా హృదయంబునేడ్తెఱన్

చ. మనమది యేమొ కాని నిను మానదు, కానదు వేఱుత్రోవ, కుం
దనమును గుంద జేయుమెయి, తమ్ములఁదమ్ములఁ జేయు కన్నులున్
వనితల చిత్తహారి యగు వీక్షము శోభిలు నిన్ను గూడ నే
వనితలు ప్రాగ్భవంబునఁ దపంబులు సల్పి జనించిరో ధరన్.

ఉ. తాళగలేనురా మదన తాపము, కోపము నూనబోకురా!
కూళలు వారకాంత లనుకోబని లేదుర ; ద్రవ్యమొల్లరా !
హేళన గాదురా, యసువులిత్తఱి నిల్వగ నన్ను జేరరా !
పాలన సేయరా, మదిని భారము బాపర, ప్రాపు నీవెరా.

శా. ఏమో వ్రాసెను వారకాంత యనుచున్ హీనంబుగా నెంచినా
వేమో మాన్యుఁడ ! నిన్ను జెంది హృదయం బేరీతి ఁజింతించునో
ప్రేమం బారఁగ నన్ను జేరి కనుమా వేద్యంబగు న్మత్తనూ
క్షేమం బేక్రియ దగ్గెనో విరహతా చింతా నితాంతత్వతన్.

ఉ. బూమెలమారి జంతలని భూమి సృజించెనొ మమ్ము క్రూరతన్
సోమరి ధాత ! కాక గడుసుందన మొప్పగ నెల్లవారలే

మో మముగాదె దూరుటలు మోహము లేదొ ? గుణమ్ములేదొ మా
రామల కెట్టి విద్యలును రావొ ? మఱేమి మమున్ సడింపగన్.

ఉ. *పంకమునందు బుట్టెగద పంకజ మంచు నళి ప్రకాండముల్*
*పంకజ నిర్గతాసవము బానము సేయక మర్లిపోవునే ?*
*అంకము చంద్రునందు గల దంచుఁ జకోరము లంశుభుక్తికా*
*తంకము నొందునో ? గుణవితానముగాదె గ్రహింత్రు సాధువుల్*

ఉ. *వ్రాయఁ గడంగినం గులుకువాఱెడు లేఖిని, లోచనంబులం*
*బాయక బాష్పపూరములు వాఱి నిరుద్ధము సేయు దృష్టులం;*
*గాయజ దివ్యరూప ! మది గాసిలి తోఁపదు వ్రాయ నేమి ; నా*
*కాయము నిల్పి కాచెదవొ? కాలుని ప్రోలికిఁ జేర బంచెదో ?*

- ఇట్లు వేడికొను భవదీయ సతారామమ్మ

వెంక : ఈ వారకాంత గృహము రచ్చదగ్గర నుండు వేపచెట్టు సమీపమున గదా! నేను నిన్న ఆ మార్గమున బోవుచుండు నప్పుడు చూచితినని వ్రాసినది. మూడు సంవత్సరములకు పూర్వము మాయన్న వివాహమునకు వచ్చినది కూడ నీకాంత యనియే తోచుచున్నది. అప్పటికి రజస్వల కాలేదు ; గణిక యైనను చక్కగా విద్య నభ్యసించినది. ఆహా ! యెంత హృదయంగముగా పద్యములు వ్రాసి పంపినది. పద్యములు చదివి నంతనే నా హృదయము కరగుచున్నదే, యిక ప్రత్యక్షముగా నన్ను జూచి మోహించి విరహ వేదనం గుందు కోమలి హృదయమెట్లుండ వలయు ? యౌవన ప్రాదుర్భావమున విరహము దుస్సహముగదా ! (మరల జాబుజూచి) అయ్యో పాపము ! కాటుక కంటి నీటి బొట్టులు అక్కడక్కడ యీ లేఖపై బడియున్నవి.

వారకాంతల ప్రణయము శశవిషాణమని వినియుంటిని గాని యీ చేడియపట్ల నట్లుగాదు ; నిజముగా మనసులో విరహతాపము లేనియెడల ఇట్టి జాలికరమగు పద్యముల వ్రాసి పంపునా ? సామాన్య గణికలవలె మోసము సేయ ప్రయత్నించిన 'ద్రవ్యమొల్లరా" అని వ్రాయునా ? పాపము సతారామికి నాపై నిజమైన ప్రేమ కల్గుటకు సందేహము లేదు ; సాతాని కుబ్జ వచ్చినప్పుడు దాని విషయ మామూలాగ్రముగా విచారించెద.

ఇప్పటి సంఘ సంస్కర్తలు వారకాంతా సంభోగము హీనమని బోధించుచున్నారె, యిందు కేమిసేయను ? చెడిపల ప్రేమ శాశ్వతము కాదని కాబోలు ; శాశ్వత

ప్రణయము కలిగిన మన సతారామి వంటి వాలుగంటి దొరకిన యిందేమి తప్పు ? అట్టి వారలుండరని వారి వాదము గాబోలు ; ఒక వేళ నుండిన ? వారి ప్రశ్నల కెట్లో సమాధానము చెప్పవచ్చును. ఒక్క నాటికేమి ? ఎల్లకాలము మన మా వృత్తిలో నుండముగద ! అది యేమోకాని, యీ జాబు చూచినప్పటి నుండియు ఆ వారకాంత నా మనమున అచ్చొత్తినట్లున్నది. వనితయే వరించి రమ్మనిన నిరాకరించు మూర్ఖులున్నారా ? ఇక ఆ ఆలోచన యేల ? కుబ్జ మరలవచ్చునేమొ; రేపు సాయంతనము వచ్చెదనని జాబు వ్రాసెదను.

(జాబు వ్రాయుట నటించును)

(కుబ్జ ప్రవేశించును)

కుబ్జ : పూల్, పూల్, మల్లెపూల్, జాజిపూల్ చౌక ; 32 జంటాలు అర్ధణా. (తెరలో నుండి అరచుచు వచ్చును.)

వెంక : (ఆతురతతో) కుబ్జా ! మఱొక దండ యిచ్చిపో.

కుబ్జ : (ఇచ్చును)

వెంక : కుబ్జా ! యీ జాబు వ్రాసిన దెవతె ?

కుబ్జ : మీకు తెలియదా ? (అని మూతి నొయారముగా ద్రిప్పును)

వెంక : నీ నోటిగుండా చెప్పిన నోటిముత్యాలు రాలునా ?

కుబ్జ : (చిరునవ్వుతో) కాదు, కాదు, సితారామమ్మ. రచ్చకాడ బోగ మమ్మాయి.

వెంక : నే నట్లే తలచుకొంటిని (కొంచెము నిదానించి) కుబ్జా ! దానిని నీవెప్పుడు చూచితివి?

కుబ్జ : నేను ప్రతి దినము వాళ్లింట్లో పువ్వులిచ్చే వాడిక. రొండు దినాల నుంచి పూలు తీసుకోడంలేదు ; నగలు పెట్టుకోదు ; మంచి పావడ కట్టుకోదు ; పీనిగ మొకం పడి వుండింది.

వెంక : ఎందువలన ?

కుబ్జ : ఎందువల్లనో అబ్బా ! వాళ్ల సుట్టాలెవరైనా సచ్చిపోయినారు కామాల.

వెంక : (చిరునవ్వు నవ్వి) కాదు, కాదు, తరువాత ?

కుబ్జ : మరిశిపోయినా.......గందం మాత్రం పూస్కొనే పూస్కొంటుంది.

వెంక : పుస్తకములేమి చదువుకొనదా ?

కుబ్జ : ఆ గొడవ నాకు తెలియదు. నిన్న యెన్నిల్లో వాళ్ళయింటి తట్టు పోయినా; నే నెప్పుడైన వాళ్లఇంటికి పొయ్యి పాటా పద్యం నేర్చుకొనేదె. ఆ మొక్కటె మిద్దెమీద కూర్చొని పద్యాలు పాడుకుంటా వుంటే యెన్నో అవి నేర్పించుకొన్నా.

వెంక : (ఆతురతతో) ఏవి ఆ పద్యములు చెప్పు ?

కుబ్జ : (అటు యిటు చూచి) అమ్మా వాళ్లొస్తారేమో ?

వెంక : అమ్మ సందులో, నున్నది; అన్న పొలమునకు పోయి ఉన్నాడు.

కుబ్జా : (కొంచెము మురిపము సూపి)

ఉ. మారసమాన రార ! నను మానకురా, విరహంబు తాళలే
రా, రజతాద్రి ధీర ; పరిరంభణ కేళి కనుగ్రహింపరా
సారసవైరి జేరి నవ సారస బాణుడు మేరమీఱి నా
సారము బీరమున్ తులియ సాగె, మనోహర నన్ను జేరరా.

సీ. మోహనాకార ! నీ మోముఁ జూడఁగనైన
నేణాంకుఁ డిటుల నన్నేచ గలఁడె
కంజాయతాక్ష ! నిన్ గౌగిలింపఁగనైన
గంతుడు నన్నిట్లు గాల్చఁ గలఁడె
ధర్మాత్మ ! నీ యూర్పు దావి సోకగనైన
గంధిల వాతంబు గాసి నిడునె
మంజుల భాష ! నీ మాటలు విననైన
కోకిల వ్రాతంబు కుందు నిడునె.

తే. నీవు సేరఁ గళంకియౌ నీరజారి ;
అంబుజాస్త్రుడు నుక్కఱి యతనుఁడగును !
గంధిలానిల మనలము గాంచబోవు
బరభృతంబులు మనలము పాలఁబడును.

తే. కలువ వికసించె నూతన కాంతి, భృంగ
రాజమా ! గ్రోలగఁలవొ మరందరసము ?
శారదాబ్జ మయూఖముల్ సనకమున్న
పత్రజాలము ముకుళింపఁబడక మున్న.

ఆ. ప్రియుఁడు రాకయున్న వేణిక యున్నది
కంఠ మున్నదింకఁ గలఁగుటేల ?

వెంక : (స్వగతము) అయ్యో ! యెంత తాపము ! యెంత తాపము !

కుబ్జ : (ఆలోచించి) అయ్యా ! యీ పద్దెంలో సగం మఱిచి పోయినా. ఇంకా ఎన్నెన్నో పాడుకుంటూ ఉండేది. సదువుకున్న వాళ్ల కొచ్చినట్లు నా బోటి మోటువాళ్ళకి రావడమంత సుళువా ?

వెంక : అది సరే ; దానికి కన్నెఱిక....... (అర్ధోక్తియందే)

కుబ్జ : (తొందరతో, చేయిద్రిప్పుచు) ఆ మాటెత్తబాకు ; ఆ మాటెత్తబాకు. ఆహ ! పాప మా పిల్ల లోకమే యరగంది. సమర్తాడి ఆర్నెల్లు కూడా కాలేదు ; నరిశిమ్ముల పావర్ణానికి సరిగా ఆర్నెల్లా ఒక వారము.

వెంక : అయితే, యీ జాబు తీసికొని పొమ్ము. (యిచ్చును)

కుబ్జ : (జాబు రవికలో దాపుకొనును)

వెంక : (స్వగతము) ఎంత తావము పట్టలేకనో పాపమా వారకాంత చింతాక్రాంతమానసయై పాడుకొనుచుండినది.

కుబ్జ : (స్వగతము) పిల్లకాకి కేమి తెలుసురా యింటిల్లబ్బ ఏటనేది యిట్టాంటిదె. సతారామమ్మ మంచి వాణ్ణే వలలో యేసుకొన్నాది. బోగమోళ్ళటక్కు టమారాలు నిజమనుకోని అబ్బయ్య మెత్తబడ్డాడు. దానికి నేలగొలిమిడాకు మందుపెట్టి రెండు పిండాలు తీసేసింది నేనే గదా. కన్నెఱికమ్మాట ఆయన చెప్పేటప్పటికి నవ్వొచ్చి అణుసుకొన్నాను. (నవ్వబోయి ఆగును) ఈ జాబు తీసుకొని పోయి వాళ్ళ కిచ్చి నా కిస్తానన్న పాతకోక యీనాడే తీసుకొంటాను.

(నిష్క్రమించును)

వెంక : తే. *కలువ వికసించె నూతన కాంతి, భృంగ*
*రాజమా ! గ్రోలగలవొ మరందరసము ?*
*శారదాబ్జ మయూఖముల్ సనకమున్న*
*పత్రజాలము ముకుళింప బడకమున్న.*

(తెరలో)

వెంకటయ్యా ! ఫలహారానికి అమ్మ పిలస్తుండది.

వెంకట : వస్తున్నా.

(నిష్క్రమించును.)

# కర్షక విలాసము

## తృతీయాంకము

### ప్రథమ రంగము

(వారకాంతా గృహము)

తల్లి : అమ్మా ! యీ సాయంత్రమేగద వెంకటరెడ్డి వస్తానని జాబు వ్రాసినాడు.

సతా : అవునమ్మా.

తల్లి : సాతాని కుబ్జ రుణము మనమెప్పుడు తీర్చుకోగలమో గాని మన విషయములో తన సొంత పనిగా నెరవేరుస్తుంది.

సతా : దానికేమీ యియ్యలేదా ?

తల్లి : అదేమి ? నీవు కట్టుకుంటా ఉండిన కాకినాటి లేతా ముదురు సరిగంచు చల్లాయిచ్చినాను.

సతా : అమ్మా ! వెంకటరెడ్డిని ఎన్ని దినాలు మన యింటికి రానిస్తాము ?

తల్లి : అమ్మా ! అంత మాత్రము నీకు తెలియదా ! అయినా నీవు యౌవనపు కోపులో నున్నావు. ఎంత బుద్ధి చెప్పినా మీ ప్రాయం పిల్లలు మిండగాళ్లసొగసు చూచుకొంటారేగాని, డబ్బు చూచుకోరు. నీవు సదువుకొని సుద్దిబుద్ధి గలిగిన దానివి. నీవట్ల చేస్తావని నాకు నమ్మకము లేదుగాని, అయినా ఒకప్పుడు నీ మనసు గూడా తిరుగునేమొ.

సతా : అమ్మా ! కులాచారము వదలుటకు నేనంత గౌరవ హీననా ?

తల్లి : అదేగదో, మఱి నీటైన బోగముకత్తె విటుల పట్ల యెట్లు నడుచు కోవాలంటె, నా యనుభవము చెప్తాను వింటావా ?

సతా : సరే చెప్పమ్మా.

తల్లి :

ఉ. *ఒక్కని కన్ను గీటి మఱి యొక్కని రొక్కము నంది, యంత వే*
*ఱొక్కని గౌగిలించి యిక నొక్కని మోవిమరంద మాని పై*

నొక్కని పక్కచేరి, విటు నొక్కని నిల్వెడలంగ నెట్టి యిం
కొక్కని జేరదీసి ధన యోషిత కాలముపుచ్చుగా వలెన్.

అమ్మాయీ ! ఒక్కని మీదనే తగులాట ముంటే డబ్బెట్ల కూడుతుంది? ఇదిగాక మనకు వేఱే జీవనాధార మున్నదా ? ముసలి వారమైతే మన మొగాలు చూసే వారెవరైన ఉన్నారా ?

తే. తేనెఁ ద్రావిన మీదటఁ దేఁటి బోటి
తమ్మి పువ్వులు విడనాడి తలఁగు కరణి
విత్త మెల్లను గ్రహియించి వెలవెలంది
విటుల వీడుట శ్రేయంబు విపుల నేత్ర!

అమ్మా! యిట్టరా. (అని చేరదీసి ముద్దు పెట్టుకొని) మోహము, ప్రేమ యివన్ని మనకు పనికిరానే పనికిరావు, అవి మనకు నిప్పంటివి! అయితే విటుల దగ్గిర మాత్రం, అవన్ని వాటికంటె యింకా మఱిన్ని ఉండేటట్టుగా నటించాల. ఇక్కణ్ణే నీ తెలివి తేటలుపయోగించాల.

ఉ. ముద్దులు పెట్టినట్లె, మఱి మోమున మోమును జేర్చినట్లె, మే
ల్బుద్దులు చెప్పినట్లె, గడుసుందన మేమియు లేనియట్లె, పే
రొద్దిక యున్నయట్లె, మఱి యొక్కనిపై మతి లేనియట్లె, డ
బ్బెద్దియు గోరనట్లె చరియించి భుజంగుల గూడ మేలగున్.

సతారామమ్మా ! నేనొక మాట చెప్తాను. అది నీ మనస్సులో ఎప్పుడు మెలగుతూ ఉండవలె. వెతక పోయిన కుక్క యెన్ని కుందేళ్ళు పడుతుంది. నే చెప్తే నేర్చుకొనే దానివి నీ వెట్టిదానివి ? బిడ్డ పుట్టంగానె మీ గాళ్ళవాపు తెలుస్తుంది. అయినా మంచిదే విను.

తే. మధుర మకరంద లోలయై మధుప కాంత
ప్రతి సుమంబును రుచి చూచిపఱచు కరణి
విత్త మార్జింపఁ గోరిన వెలవెలంది
విరతియే లేక విటులను మరఁగవలయు.

(యింతలో బూడ్సుల శబ్దము వినబడును)

సతా: అమ్మా! బూడ్సుల చప్పుడగుచున్నది, రెడ్డి వచ్చు చున్నాడు కాబోలు.

తల్లి : అమ్మా! నీకు విటుని తోడిదే బ్రతుకు, ఆయన ధనము మనకెందుకు? గౌరవమే చాలు, ఆయన మన యింటికి వస్తేనే చాలు

(ఇంతలో వెంకటరెడ్డి వచ్చి ద్వారము ప్రక్క దాగుకొనును)

తే. విటుని తోడిదె లోకంబు విటుడె సుఖము
విటుడె మానంబు సర్వంబు విటుడె ప్రాప్తి
విటుడె ప్రాణంబు, సద్గతి, విటుడె కలిమి,
విటుని నొక్కనినే గూడ వెలయు సుఖము

మన చెడిప, లదేమి పాపమోగాని సుఖము గోరక డబ్బుకై విటులను బాధిస్తారు వాళ్లకు పాప పుణ్యం పైన బుద్ధేలేదు.

వెంకః (స్వగతము) బంగారునకుఁ దావి యలవడినట్లు ఈ కాంతామణికి నీతిబోధ సేయు జనయిత్రి గూడ ప్రాప్తించినది. గచ్చపొదలో శ్రీగంధ తరువులవలె యీ వారకాంతా కులమందు వీరేల యుద్భవించిరో! విధాత గొప్ప శిల్పియే యగుఁగాక ఛాందసత్వ మాతని బాధింపక పోలేదు.

(వెంకటరెడ్డి లోపలికి ప్రవేశించును)

తల్లిః అయ్యా! దయచేయండి.

సతాః (సిగ్గు నభినయించి లోని కేగును)

(వెంకటరెడ్డి సోఫా కుర్చీ మీఁద గూర్చుండును)

(సిగరెట్టు కాల్చును)

వెంకః ఈ వసంత ఋతువునకుఁ బండు వెన్నెల గూడదాపురమైనది.

తల్లిః అంతేగదయ్యా మఱి, పాయపు వాళ్లను వేపుట్లో వేచడానికి.

వెంకః (సిగరెట్టు రెండు గుక్కలు పీల్చి కుడిచేతి వ్రేళ్ళ సందున నిరికించికొని) (స్వగతము)

తే. *జలధరంబున మెఱిసెడు చంచలయటు*
*గన్నుదోయికి విందాయెఁ గలికి కాంతి*
*నిమిష సందర్శనంబె నా కమిత ముదము*
*నియ్య, నియ్యదో చిర సుఖ మింతి పొందు.*

తల్లి: అమ్మాయీ! సతారామమ్మా! రెడ్డిగా రొచ్చున్నారే. ఇట్లోచ్చి రెండు మాటలు మాట్లాడిపోవే. ఇంత సిగ్గెందుకే? (రెడ్డి తట్టు తిరిగి) మీ బోఁటి వారి మొకము సూచింది కాదు కాబట్టి పిల్ల సిగ్గు పడుతుంది. (తెర తట్టు తిరిగి) అమ్మాయీ! యిట్రావే, యిదేమి సిగ్గమ్మా! యీయన పరాయివాఁడంటే..

సతా: (మెల్లమెల్లగా వచ్చి ఒక మూలగా నిలుచుకొని పయఁట చెంగుఁ జేతఁ బట్టుకొని)

చ. *అలసటనొంది వచ్చితిరి యల్లన నంశుక తాళ వృంత సం*
*చలన మొనర్తునో వదన సారస ఘర్మకణాళి యింకఁగన్?*

వెంక : *లలిత మృణాళనాళ మృదులంబు భవద్భుజ వల్లి కోమలీ!*
*అలయునొ? వాడునో? శ్రమము నందునొ? గందునొ వీవ సాగినన్.*

తల్లి : పిల్లులు కుండలు తోస్తున్నాయి, సందు తలుపేసి వస్తాను.

(నిష్క్రమించును)

సతా : ప్రాణప్రియా!
నెలకొని మీ సపర్యలకు నేరని బాహువు లేల కాల్పనా?
అలసి వాడినన్ శ్రమము నందినఁ గందిననేమిదోసమా?

వెంక : (స్వగతము) ఆహా! యీ కామిని ప్రణయమెంత గాఢము! (ప్రకాశము) ప్రేయసి! నీవు లిఖించిన పత్రములోని ప్రత్యక్షరము నా హృదయస్థమైనది. చదివిన పద్యమే చదువుచుంటిని. తలఁచిన తలఁపే తలఁచుచుంటిని, ప్రొద్దుగూకు నప్పటికి నాకొక యుగము గడచినట్లైనది.

సతా : హృదయేశ్వరా! జాబు చూచిన యంతనే మీకంత ఉత్కంఠ గలిగి నప్పుడు, మిమ్ముఁ గన్నారఁ గాంచి, మోహించి, మీకై పరితపించు నా హృదయము, ప్రీలిపోక రెండు దినములు గడపినదిగదా! ఆహా! నా చిత్తము మెత్తనిది కాదేమొ. కాదు కాదు, నిన్ను పొందఁగలుగుదు నను ఆశయే నా ప్రాణబంధన మును వెడలింప లేదు. లేక యుండినఁ జైతన్యహీనమగు నా కాయమునె మీరు చూచియుందురు.

ఉ. *పండిన నాగవల్లియటు పాలెను నాదు శరీర మింతకే*
*గండము లందుఁ, బాండురవికారము పైకొనెఁ, జిత్తమంతయున్*
*మండెడు విప్రయోగ శిఖి, మాన్యుఁడ! నాగతి యిట్టులుండ, నా*
*చండశరుండు మన్మథుడు చావఁగ గుప్పెను బూవు టమ్ములన్.*

వెంక : అయ్యో! కోమలీ? నీ దురవస్థ చింతనాతీతము, నన్ను వలచినందుకుఁ గదా నీకింత కష్టము.

సతా : గడచినగాథలు త్రవ్వనేల?; చింతను నూతనముగాఁ జేసికొనుటకే.

వెంక : చెలీ! మగవారి చిత్తములకంటె నాఁడువారి చిత్తకుసుమములు, కోమలములు. అవి విరహవాతోద్ధూతములు కావుట కేమి సందేహము!

(వేశ్యమాత ప్రవేశించును)

తల్లి : అయ్యా! యిన్ని దినాలనుంచి యీ గ్రామములో ఉండి గూడ మా యిండ్ల తట్టె రారె, మే మంత చెడిపోయినామా? మా పిల్లలకు సొగసులేదా, అందము లేదా, చందము లేదా, చదువులేదా, సందెలేదా, పాటరాదా, పద్యంరాదా, మఱి గుణం లేదా? మఱేమి లేదండి? మమ్ము లెందుకో కాకులు పొడిచినట్లు పొడస్తారు లోకులు, సదువుకొన్న వాళ్ళకేనండి మా మీఁదగంటు, వాళ్ల కూటి కొచ్చినామా, వాళ్ల గుడ్డ కొచ్చినామా?

ఉ. వారపుటన్నముల్ మెసవివారలు బియ్యెలు ప్యాసుచేసి, మా
వారలు కూళలంచుఁ దమవారికిఁ జెప్పెదరంట సం
స్కారమదంట, దంట నుడికారము లేలనొ, వార లేల ని
ష్కారణ వైరమూని మము గాఱియవెట్టగ, నింత వంతమే.

దీనికొక కారణ మున్నాదండి.

సీ. ప్లీడరు హరిరావు ప్రియమున నొకనాఁడు
అర్జుకా వాటికి నరుగు దెంచి
చెలియరో యం చొక చెడిప యింటను దూరి
పరిరంభణాసక్తిఁ బడతి వేడఁ
దెలియక యా కొమ్మ తేమ్ము పణ మనఁ
దలయూచి హుమ్మంచుఁ దలఁగి పోయి
వారకాంతలు చెడ్డవారని లెక్చరుల్
చెప్పి శాస్త్రములెల్ల గుప్పి గుప్పి

తే.గీ. సభల నూరూరఁ జేయించి సంఘ సంస్క
రణ మటంచును బేరెడి రసికవర్య

లకును మాకును చెడఁబాటులను రచించి
మాదు మంచంబు లెత్తి గ్రుమ్మరెడు నిపుడు.

ముందర మా కాలానికి, ఇప్పటి కాలానికి అచ్చి మశకాంతరమండి, ముందు మేము పీడించినా ఒక్క దమ్మిడీ యిచ్చేది లేదు, ఇపుడట్లగాదు, వాళ్ళ పరువు కాపాడు కోడానికి, మేము వద్దన్నా బలవంతం చేసి యిచ్చి పోతారు మీ బోఁటి ఘరానాదార్లు. (తెరవంక చూచి) యీ పిల్లు లోకటే మోపన కుండలు తోస్తాయి.

(ఛీ, ఛీ యనుచు నిష్క్రమించును)

సతా : హృదయేశా! రవివర్మావిలిఖితములైన యీ పటములను జాచితిరా?

ఉ. *'ఇప్పుడు వేళగాదుర, యహీనగుణాకర!" యన్న వీడకే*
*కొప్పును గుంజిపట్టి మరుకోలల కాఁగగ లేక కృష్ణుఁ డిం*
*పొప్పగ గొల్ల పల్లవిని నోరగఁ దార్చెడుఁ బూవు టింటికిం*
*దప్పునె యెన్నఁడైన నవతామరసాంబకు లక్ష్య పద్ధతుల్.*

(కొంచెము తెరప్రక్కకుఁబోయి, డాచేతితో నాతని చేయి పట్టుకొని)

ఇదిగో, యీ చిత్రమును జూచితిరా?

మ. *కలలోఁ గాంచిన సుందరాంగుని నుషాకన్యా లలామంబు ని*
*చ్చలుఁ బ్రేమంబునఁ గౌఁగిలింపఁ గనులం జాల్వాఱె బాష్పాళి; చె*
*క్కిళులం జిప్పిలెఁ గంట కాంకురతతుల్; కీల్గంటు జాఱెం బ్రియా!*
*యిలలో నెట్టిరికైన నిట్టులె గదా యింతుల్ పతుల్ గూఁడగన్.*

ఆ గదిలోని రతీ మన్మథుల పటము చూతము రండు.

వెంక : (స్వగతము)

తే.గీ. *హృదయమా! వేచియుండుమ యదయుఁడైన*
*మదను దెగటార్చు కాలంబు గదియ వచ్చె;*
*వాని కోటలు లగ్గలు పట్టి,పిదప*
*నిల్లు గూల్చెడు సమయంబు నెఱుఁగు మిదియ.*

(ఇద్దరు నిష్క్రమింతురు)

(తెరపడును)

(వెంకటేశు, రంగడు చెరియొక తట్టు నుంచి ప్రవేశింతురు. వెంకటేశు చంకలో దుప్పటి యుండును. రంగని చేతిలో కూరగాయల బుట్ట యుండును)

# -: విష్కంభము :-

రంగ : వెంకటేసో! యెక్కడికిరో?

వెంక : (నవ్వి) రంగా! మీరెడ్డోర్ని, నిన్ను సూస్తె మమ్మ ల్నెక్కడ సంపతారో నని బయమేస్తుందిరా.

రంగ : సంపేదేంద్రోరే!

వెంక : మీ రెడ్డి మా రామచంద్రారెడ్డికి చాతబడి చెయ్యించినాడోయ్.

రంగ : ఆ... (అని కొంచె మాలోచించి) అందుకే గామాల్రా, అప్పుడొకనాడు మా రెడ్డి మాదిగ రాగణ్ణి పిలవమంటె, నేనే పిలిచినా. మఱి మా రెడ్డి, వాఁడు దొడ్లో యేమొ చిన్నంగా మాట్లాడుకుంటుంణ్ణారు.

వెంక : మా రెడ్డీ బలేవాడే లేవోయ్; బలే పక్కాపని చేసినాఁడు.

రంగ : ఏం చేసినాఁడు?

వెంక : మాదిగ రాగడు మా రెడ్డి దగ్గిరి కొచి 'సామీ, ఆ యంకారెడ్డి మీకు చాతబడి చేయమన్నాడు. మీకు చెయడానికి నాకు చేతులాడలేదు. నాను పిల్లా పీసుగు గలవోణ్ణి. దేవరోరు నాల్గు దినాలు బాగుళ్లే దని పట్టేసుకొని పండుకొంటె పందు మొద్లు, ఒక పొట్టేలు దొరుకుతుందని బతిమాలు కొన్నాడు. ఆపాట మా రెడ్డి సరేనని అయిదు దినాలు యింట్లోనే వుండి ఒల్లు జబ్బని పుకారా పుట్టించినాడు. నే నందరితో ఏడ్చి ఏడ్చి మా రెడ్డి సావనున్నాడని చెప్పినారా." (నవ్వును)

రంగ : బలే పక్కాపనిరా, అవతల?

వెంక : అవతల మీ రెడ్డి వాఁడికి వొడ్లు, పొట్టేల్నిచ్చినాఁడు. మా రెడ్డి వారం దినాలకు బాగయిందని బయటి కొచ్చేతలికి, యెవురో సూచి మీ రెడ్డికి చెప్పినారంట. ఆ మాయన రాగడు మోసము చేసినాఁడని వాడి తుంగల చేని కుప్ప నురిపించుకోని యింట్లో పోసుకున్నాడు. వాడిల్లు అర్ధమరేత్రికాడ తగలబెట్టించినాడు.

రంగ : (ఆశ్చర్యముతో) ఆ! యిప్పుడు యిరోదమయితే దొంగతనం గానో, దౌర్జన్యము

మీదనో కుప్పలు నురిపించి పోసుకోవడం, యిళ్లు తగలబెట్టించడం. ఎంత సాగితే మాత్రం యిట్టనా! మొన్న గూడా మా రెడ్డోరింటికి పోలీసోళ్లు రావడం, మాట్లాడడం, గందరగోళంగా వుండిందిరా. అదేందో తంతుగా వుందే మా రెడ్డి పనంతా!

వెంక : నేను తొందరగా పోవాల, వస్తామటి.

రంగ : ఎసురు బెట్టొచ్చినారా, నేను గూడా పోవాల.

(ఇద్దరు నిష్క్రమింతురు)



రామ : కాటమరెడ్డి రాధాకృష్ణారెడ్డి, నేనున్ను ఒక పాఠశాలలోఁ జదువు కొన్నాము. ఆయన తమ్ముఁడు మోహన రెడ్డి యున్నాఁడు. అతని కిచ్చి కమలమ్మను వివాహము చేసెదను.

వెంకట : (ఆశ్చర్యముతో) అన్నా! మఱి వాళ్ళు కాటమ రెడ్డి వాళ్ల తెగ, మనము పెరుమా రెడ్డి వాళ్ల తెగ అయితిమె! మన చుట్ట పక్కాలు ఈ సంబంధమున కొప్పుకుంటారా? మన కులములో లేనిది తెచ్చి పెడ్తున్నావు. ఇది, ఒక పెద్ద లోకదూషణగా ఉంటుంది.

రామ : ఇరు తెగల వారిలో ఎవరో ఒకరు అధికులయిన యెడల,ఆధిక్యత నొందిన వారికి తగ్గువారికి సంబంధము పొసఁగదు. కాని, రెండు శాఖలవారు సమానస్థులైన యం దేమి భేదమున్నది?

వెంకట : అదెట్లన్నా! మనమే యెక్కువ, మనము పెరుమారెడ్డి వాళ్లము కదా!

రామ : ఎందులో మన మెక్కువ? కులమునందా, ఆచారమునందా, వృత్తి యందా? అవియేగదా అపూర్వములు.

వెంకట : నీవే ఇట్లంటె నే నేమి జబాబు చెప్పేది? ఇది వంశ పరంపరగా వస్తున్నది. ఎట్లయినా యీ సంబంధమును మన ఇంట్లో వాళ్లు ఒప్పుకోరు.

రామ : ఈ సంస్కరణ నేటి దనుకొన్నావా? కాదు.

వెంకట : మఱి మన తాతలకాలము నుంచి ఉండినదా?

రామ : లేకేమి, ఇదివఱకు నూటయేబది సంవత్సరములకు పూర్వము గూడూరులో నున్న యేలూరువారు, కాటమరెడ్డి వారు, పెరుమారెడ్డి వారి తెగతో సంబంధము చేసి కొనిరి. కొన్ని సంవత్సరముల దనుక మన బంధుత్వములో కొంత పట్టింపుగా నుండినది గాని యేబది సంవత్సరముల నుండి యించుకైన భేదము లేక వారు పెరుమా రెడ్డి వారి తెగలో నైక్యమైనారు. అందువలన మన శాఖవారికిఁ గలిగిన అగౌరవముగాని, నష్టముగాని యింతవఱకు గాన రాదు. ఇప్పటికి ముప్పది సంవత్సరములకు పూర్వము దువ్వూరు పిచ్చిరెడ్డిగారు ఏ తత్సంస్కార దర్శకులగుటకుఁ బ్రయత్నించిరి గాని ఏలనో కొనసాగలేదు. నేఁడు కొందరు బుద్ధిశాలులు శాఖా సమ్మేళన బీజములు వెదచల్లిరి. అవి యంకురించి దినదిన ప్రవర్ధమాన ములగుచున్నవి.

వెంకట : అయితే ఈ గుద్దులాట చాలా సంవత్సరముల నాఁటిదేనె! అప్పుడెప్పటి సంగతో

పోని, నేఁడు మొదలు పెట్టింది కొత్తగానే గదా! ఇదికొంచెము ప్రబలిన తర్వాత మనము ప్రవేశిస్తే బాగుంటుందని నా యిష్టము.

రామ : అందరు మనవలెనే తలఁచి యూరకుండిన యెడల యీ సంస్కరణ యెప్పటికి ప్రబలఁ గలదు? సత్కార్యములు చేయువారికి మధ్య మధ్య ప్రతిహతములగు చుండుట స్వాభావికము. కొందఱిట్టి కార్యములకు ప్రత్యక్షముగా చెడుపు కోరకుండినను సభలలో మాత్ర మంగీకరించినవారివలె శిరఃకంపన మొనరించి, తరువాత వారెన్నెన్ని విఘాతముల ఘటింప సమర్థులో అన్నిటికి లోపము లేకుండ ఘటింతురు. అట్టి వారికి నైతిక ధైర్యము శూన్యము.

వెంకట : పెండ్లి విషయములో ఆఁడవారి సలహా లేకుండా మనము పనిచేయలేము. ఎన్నిసభలు చేసి ఉపన్యాసములిచ్చినా అవి బయట మాటలేగాని, యింట్లోవాళ్ల కయిష్టమయితే ఆ కార్యం జరిగేది కష్టం. ముందుగా వాళ్లకు బోధించవలయును. వాళ్ళను ఒప్పించు కోవలెను. అదట్లుండ నిచ్చి ముందుగా మన అవ్వబోఁటి వాళ్లను ఒప్పించ వలెను. మొగవాళ్లు చెప్తే యేదో వింటారుగాని, ఆఁడవాళ్లట్లుగాదు.

రామ : చెప్పి సూస్తాం, మన అవ్వను పిలువు మఱి.

వెంకట : (నిష్క్రమించి, అవ్వతోగూడ వచ్చును)

రామ : అవ్వా! యిదిగో ఈ కుర్చీ మీఁద కూర్చో

అవ్వ : నాయనా! మమ్మల కుర్చీలమీద తగలబెట్టకపోతే మాందిలె; మేము కాపరాలు చేసేటప్పుడు కుర్చీల్లేవు, బెంచీలు లేవు! (అని క్రింద కూర్చుండును)

రామ : (కుర్చీ విడిచి అవ్వ దగ్గర కూర్చుండును)

వెంకట : (లేచి నిలుచుండును)

అవ్వ : మన కవళమ్మ పెళ్ళి మాటలు మాట్లాడ్డానికి పిలిపించి నావని చెప్పినాడే అబ్బయ్యా?

రామ : ఆ ... అవు నవ్వా (చెవి దగ్గర బిగ్గరగా చెప్పును)

అవ్వ : మఱి మొన్న పాళాన్నుంచి కొండారెడ్డి పెళ్లాము, చెల్లెలు వచ్చినారు.

రామ : నే విన్నా.

అవ్వ : విన్నా? ... వాళ్ళ పిలగాడు మంచోడె. వాళ్ళ కాపరము మన కాపరంతో సరితూగేదె. ఆ అబ్బాయిని సూడాలని చెప్పి పంపితేను, మొన్న వొచ్చినారు. అప్పుడు నీవు

నెల్లూరికి పోయుణ్యావు. వాడు సొగటాల మంచి బిడ్డ, సొక్కాలు నిండా ఏసుకోనుణ్యాడు. మఱి యేందో గొంతుకు నవారంటి దాంతో ఉరిబోసుకోనుణ్యాడె. అట్టాంటివి మీకు లేవేం అబ్బే. ఎంత కరీదైన మాంది, అట్టాంటి నవారా రొండు పట్టె మంచాలకు తెప్పించు.

రామ : (చిరునవ్వుతో) అవున్లే, తర్వాత!

అవ్వ : అయ్యంతా అట్లుణ్ణిచ్చి ముక్కు కాణ్ణుంచి చెవ్వుకాడికి నల్లంగా మన కాకి రెక్కలాల (బొటనవ్రేలు చిటికెనవ్రేలు ముడిచి చూపుచూ) యింతింత కన్నులు.

రామ : (నవ్వి) అవి కన్నులుగావు, నల్లకంటి అద్దాలు.

అవ్వ : (ఆశ్చర్యముతో) అట్టనా నాయనా! అదేందో తెల్లగుడ్డు లేకుండా అంత కన్నుంటుందా అనుకొన్నా. మల్లీ అదుస్టానికేమైన అట్లుంటుంది కామాలను కొన్నాలె. చత్తారి దాపరమైంది నాయనా. ముసిలిముండనుగదా! మన కవళమ్మను ఆ అబ్బాయి కియ్యాలని నా కిష్టం.

రామ : అవ్వా! వాఁడికి చదువురాదు. మొద్దు. వాఁడి కియ్యడానికి నా కిష్టం లేనే లేదు.

అవ్వ : ఏమి, మట్టి పిసుక్కొనే కాపోళ్ళకు సదువుండాలని సిద్ధాంతమా! కూడు పెడ్తుందా, గుడ్డ పెడ్తుందా? మన కష్టానికీ పోదు మనకు పోదు. అయితే యెవరి కియ్యాలని?

రామ : అటు చదువురాక, యిటు సేద్యపుఁ బనులకుఁ బనికిరాక నడుమన తిరిగే వాఁడి కియ్యమంటావా?

అవ్వ : మఱి నీ యిష్టం, యెవ్వరి కియ్యాలనబ్బే?

రామ : రాధాకృష్ణారెడ్డి తమ్మునికి.

అవ్వ : (అశ్చర్యముతో) కాటమరెడ్డి రాధాకృష్ణారెడ్డి తమ్ముడికా?

రామః ఆ .... అవును.

అవ్వ : (ఎగాదిగా చూచి, కొంచెము కోపముతో) మనోళ్ళల్లో ఆడోళ్ళంత కొల్లబొయ్యి మొగుళ్ళు దొరక్కుండా అల్లాడుతుండారా, లేక యెగతాలి పట్టించడమా ఏం దబ్బె?

రామ : కాదవ్వా! మన కమలమ్మను వాళ్ళ తెగవారికి ఇయ్యవలయునని నా కిష్టము.

అవ్వ : అదిగాదు నాయనా! నీకు ఇటువంటి దుర్బుద్ధి పుట్టిందె యెందు నిమిత్తము? పెద్దోళ్ళు బతికిపోయినట్లు కాల మెగదోసుకోని పొయ్యే జాతకము లేదు కామాల

పుట్టినాను. ఉగ దెలిసింది, కాపరాలు ,చేసినాను, యీ దుష్కృతాలు, ఈ ఏర్పాట్లు ఏ నెరగనయ్యా (అని చీమిడి చీదివేయును)

రామ : అవ్వా! దీనికే యింత చింతిల్ల వలయునా?

అవ్వ : నాయనా! మన సంసారంలో (అని నిదానించి తలయూచి) నేనెఱిగి నవక దురోదన సంపత్తి నిత్తె కల్యాణంగా పిల్లా పిసుగు ముప్ప యింటి కుణ్ణారే వాళ్ళుందర్ని మొగించు కొన్నాను, మీరిద్ద రుండొస్తె మీ కిట్టాటి దుర్బుద్ధి పుట్టె. ఇంక యాడవక ఏముండది? ఎంత లోక దూసన! ఎంత లోక దూసన! కాని కానని వాళ్ళ నోళ్ళల్లో నానాల్చిన జాతకముంటె ఎవరు తప్పిస్తారు? నాడు రాశినాడా బెమ్మ నేడు రాశినాడా!

(అని లేవఁబోవును)

రామ : అవ్వా! మఱియేమి చెప్పకుండా లేచిపోతున్నావే?

అవ్వ : ఏమి చెప్పేదయ్యా! ఇన్ని కల్రాలొచ్చినాయి, యిన్ని జాడ్యా లొచ్చినాయి, యెందరో సచ్చినారు. మఱి నన్ను గాన్లేదే ఆ మాయ మాలచ్చమ్మ. ఇట్టాటి యిపరీతాలు ఇనడానికి గామాల.(లేవబోవును)

రామ : (చిఱునవ్వుతో) అవ్వా! మఱి నీ కిష్టము లేదా?

అవ్వ : నా దేందిలే అయ్యా! ఇప్పటి కతలు, ఇప్పటి కమామీసులు, (అని లేచిపోవును)

(రామ లేచును)

వెంకట : అన్నా! నేను చెప్పినది నిజమైనదిగదా?

రామ : వీరికి సర్దిచెప్పేది కష్టము. వీరి పిడికిలి కోతి పిడికిలి. వీరి కోడికి మూడే కాళ్లు. వీరి యుద్దేశములు దేహముతో మారవలయునే గాని, తదితరముగాదు, నా యభిప్రాయము పూర్వ నిర్ధారితమె.

వెంకట : అయితే సరే నన్నా!

(తెరపడును)

---

# కర్షక విలాసము

## చతుర్థాంకము

### ప్రథమ రంగము

వెంకారెడ్డి , గుమాస్తా నరసయ్య

నరస : అయ్యా! నిన్న సబ్మేజిస్ట్రీటు కచ్చేరి నుండి సమ్మను తెచ్చినాఁడు ఖాను సాహేబు.

వెంకా : తీసుకొన్నావా ?

నరస : ఆ......(అని తలయూచును)

వెంకా : ఒక రూపాయ డబ్బులిచ్చి లేడని రాయించగూడదంటయ్యా ? ఇది గూడ చెప్పాల్నా ?

నరస : మీరు సాక్ష్య మివ్వకపోతే కేసు మీమీద జరుగుతుందని చెప్పినాడు సబిన్స్పెక్టరు.

వెంకా : అట్లయితే సరే, వాయిదా యెప్పుడు ?

నరస : ఎల్లుండి.

వెంకా : ఎల్లుండేనా ! ఆహా, దగ్గిరి కొచ్చిందే ?

నరస : అయ్యా ! మన పక్క ప్లీడర్నేసుకోబనిలేదా ?

వెంకా : ఇక్కడ మనపక్కే ముండది ? మనము సాక్షమే గదా చెప్పేది. దీంట్లో ఏమిబెడదలున్నాయి ? ఇనస్పెట్టరెట్లా చెప్పమంటే నూరు భయాల్తో జ్ఞాపకము పెట్టుకొని అట్లనే చెప్పేది. దీంట్లో ప్లీడరు నేర్పించే సాక్షమేముండది ?

నరస : అట్లుగాదండి. ఇది క్రిమినలు కేసు. సాక్ష్యం చెప్పేది మహాకష్టం. తప్పుబోతే ప్రాసిక్యూషన్లు, జుల్మానాలు. పది రూపాయలకు తొక్కట పడితే, యెట్లయ్యి యెట్లు వచ్చునో ? అధికారి యిష్టం, మనఅదృష్టం.

వెంకా : అయితే మనము ప్లీడరును ఏసుకోవలసిందేనా ?

నరస : ఆవశ్యం. ఇప్పటి ప్లీడర్లలో క్రిమినలు కేసులలో వెంకట్రావుతో సమానంగా వాదించేవాళ్ళులేరు.

వెంకా : అదేమి నరసయ్యా ! మొన్న మన వారసు కేసులో సివిల్లో మొనగాడని ఎంకట్రావుకే

యిప్పిస్తివే మన వ్యాజ్యెము. ఇప్పుడు మల్లీ క్రిమినల్లో గూడా అంటావె ?

నరస : ఆయన రెండిట్లో మొనగాడె. అయితే, ఆయన క్రొత్తవాడు, అనుభవము తక్కువని కొందఱు ఆయనకు కేసు లియ్యరు గాని, ఆయన మహా మంచిగుణము గలవాడు. తెలివితేటల కేంలేండి. ఆయనలో మనిషిని కనిపెట్టి నడుచుకొనే గుణమున్నది. అందువల్లనే ఆయన ఫీజు కొంచెము యెక్కువగా అడుగడు. నేను దాన్నంతా సరిపరుస్తాలెండి.

వెంకా : అట్లయితే సరే, నీవంటి నమ్మకమైన గుమాస్తా దొరకడం నా అదృష్టమే. (నవ్వును)

నరస : (చిరునవ్వు నవ్వి) యేమో లెండి, నా శక్తి కొలది సహాయము చేసేవాణ్ణేగదా! మీ యింటి వస్తువులు, మీ యింటి కార్యములు మా యింటివిగా చూచుకొనే వాణ్ణి. అయ్యా ! యీ కేసులో మాత్రం నాకు నూరు రూపాయలు పద్దుగా ఇవ్వవలయునండి.

వెంకా : (మొగము తెల్లబోయి) నీకు నూర్రూపాయలెందుకు ?

నరస : కష్టపడి నెల్లూరు, అల్లూరు తిరిగినందుకు, ప్లీడరుతో మాట్లాడి నందుకు. కాయితాలు, గీయితాలు తీసుకోవడం పట్టడం ఉండలేదా !

వెంకా : మఱి సంవత్సరానికి నాలుగు దినాలొచ్చి లెక్క పద్దులు గీకినందుకు సాలొకటింటికి 60 రూపాయలు తీసుకొనేదిన్ని, మల్లీ యిట్టాటి అపర్దండగలొస్తే యీటికి గూడా డబ్బా ! కాపోల్ల సొత్తంత తెగ తేరక పడివుంటదంటయ్యా ! మొన్న వారసు కేసులో దీనికని, దానికని నూటయాభయి రూపాయలు లాగినావు. ఇంతవరకు ఒక వాయిదా గాలా. యిట్టయితే మేము జరపలేమయ్యా!

నరస : లెక్కపద్దులు వ్రాయడానికి నేను గుమాస్తానే గాని, కేసుల్లో దిరగడానికిస్తున్నావా 60 రూపాయలు ?

వెంకా : నీవింత కచ్చితంగా వుండే సంగతి నాకు తెలియదే? పెరుగుబొట్టు మొదలుకొని ముప్పయి మూడు మా యింటికాడ జరుపుకొంటావు. నీ కొడుకు ఉప నయనానికి 50 రూపాయలు తీసి యిచ్చినాను. ఇవన్నీ నీ మొకం చూచి యిచ్చినామా ? నీ మొగమాటాన్ని చూచి యిచ్చినామా ? యింత జ్ఞాపకమే లేదంటయ్యా ?

నరస : మొన్న బలరామిరెడ్డిమీద వచ్చిన ఉత్తర వార్సు కేసులో గుమస్తా ఆయనతో గూడ నెల్లూరికి తిరిగినందుకు 200 రూపాయలు లగాయిస్తున్నాడు. అయితే నేనింకా మొగమాట మీ్మద 100 రూపాయలడిగినాను.

వెంకా : మీ కంటె మాకు దిక్కులేదని మీరు పాడిందల్లా పాటైంది. కానీ (అని తలయూచును) అట్నే తీసుకో.

నరస : మఱి నేను పోయి ప్లీడరును మాట్లాడివస్తా.

వెంకా : సరే పోవయ్యా.

నరస : (పుస్తకములు మూటలు కట్టి వ్రాతబల్ల కడగా పెట్టుచుండును.)

వెంకా : (స్వగతము) ఈ గుమస్తాలు నకచికపర్యంతము పీక్కతినేవాళ్ళు. కొంచెమైనా విస్సాసము లేదు. కుడిచేత తీసుకోని యెడమ చేత ఎక్కిరించే వాళ్ళు. మొన్న వారసు కేసులో ఇంతవరకు 150 రూపాయలు వదిలించినాడు. మళ్లీ యదటికచ్చీ వాళ్లలో కలిసి మన కేసులో పట్టు యిాడ్పులు చెప్పి వాళ్ళ దగ్గిర 200 రూపాయలు తీసుకొన్నాడని యిన్నాను. యెట్టెట్ట మోసం చెయ్యంది మూడేళ్ళనాడు పైపంచతో వచ్చిన బాపడు, నేటికి 5 యకరాల భూమి, రెండావుగొడ్లు, ఒక బఱ్ఱె గొడ్డు, రెండుకాళ్ళ యెద్దులు సంపాయించి నాడా ? లెక్క లెట్టెట్ట చేసినాడో నాకు తెలియదు. మన యంకటరెడ్డి చాత సూపించాల. ఇయ్యంతా సదువురాని కొట్టుకోళ్లగదా !

(నిష్క్రమించును)

నరస : (స్వగతము) రెడ్డిగారికి కోపము వస్తే కట్టె విరిచి పొయిలో పెట్టినట్లు మాట్లాడతారే గాని అవతల గొఱ్ఱెపిల్ల, యీ కేసులో ప్లీడరే అక్కరులేదు. మఱి దీన్ని బలము చేసి చెప్పని యెడల యీ నూరు రూపాయ లెట్లు వచ్చును ? సమయము దొరికినప్పుడే లాగ వలయును. వెంకట్రావుకు బుద్ధి కుశలత లేదని యెవ్వరు ఆయన దగ్గరకు కేసులు తీసుకొని రారు. అందువలన ఆయన వద్దకి వ్యాజ్యాలు తెచ్చే గుమస్తాలకు గాని, ప్రయివేటు ప్లీడర్లకు గాని 100 కి సమయము ననుసరించి 25 మొదలు 40 రూపాయల వఱకు కమీషను ఇచ్చును. అందువలన నేనెప్పటికి ఆయన వద్దకే కేసులు తీసికొని పోవుచుందును. ఆయన కేదో ఒక నూరు రూపాయల నిప్పించి కనీస పక్షం 40 రూపాయలు కమీషను దెచ్చుకోగలను.

(నిష్క్రమించును)

(తెరపడును)

---

## ద్వితీయ రంగం

(ప్లీడరు గృహము. ప్లీడరు పుస్తకము చదువుచుండును.
ఫిర్యాది ముగ్గురు సాక్షులతో ప్రవేశించును)

ఫిరియా : వెంకట్రావు గారు ! దణ్ణమండి.

ప్లీడరు : (కొంచెము తల కదిల్చి) కూర్చోండి రెడ్డిగారు. (సాక్షుల తట్టు తిరిగి) వీరెవరండి?

ఫిరియా : వీళ్ళు మన సాక్షులు. కొంచెము వీళ్ళను తర్ఫీదు చెయ్యవలెనండి.

ప్లీడరు : ఓహో ! (అని కొంచెము తల కదల్చును. ఒక సాక్షి తట్టుతిరిగి) మీ రిట్టరాండి. (సాక్షి వచ్చును)

సాక్షి : (చేతులు కట్టుకొని నిలుచును)

ప్లీడరు : మీ పేరేమి ?

సాక్షి : నా పేరు రమణారెడ్డి

ప్లీడరు : మీ రెప్పుడైన యిదివఱకు కోర్టులో సాక్ష్య మిచ్చినారా ?

సాక్షి : లేదండి. మా పెద్దోళ్లు ఎఱుగరు, మేము ఎఱుగము.

ప్లీడరు : అయితే నీ విప్పుడు ఫిర్యాది నరసారెడ్డి తరపున సాక్ష్య మిచ్చుటకై వచ్చినావా?

సాక్షి : మఱేనయ్యా !

ప్లీడరు : ఫిర్యాది నరసారెడ్డిని రంగారెడ్డి గడ్డపారతో కొట్టి నప్పుడు నీవు రంగారెడ్డిని పట్టుకొన్నావా ?

సాక్షి : రామ, రామ ! లేదండి.

ప్లీడరు : (ఆశ్చర్యముతో) మఱి నీవేమి సాక్షి చెప్పడమునకై వచ్చినావు ?

సాక్షి : సాక్షమంటె సూచింది చెప్పడమనుకోని నరసారెడ్డి అడిగితేను అట్నేలే అని చెప్పినానండి.

ప్లీడరు : మఱి నీవేమి చూచినావు ?

సాక్షి : నరసారెడ్డి భార్యదేనండి పోకిరితనము.

ప్లీడరు : నరసారెడ్డి భార్య కిందులో యేమి సంబంధం ?

సాక్షి : వాడకట్టు జగడాలు పడి నరసారెడ్డి భార్య రంగారెడ్డిని తిట్టింది. ఆపాట రంగారెడ్డి

తిట్టినాడు. ఇంతలో నరసారెడ్డి గడ్డపారతో రంగారెడ్డిని కొట్టినాడు.

ఫిర్యాది : (సాక్షి తట్టుతిరిగి గుడ్లురుమును)

ప్లీడరు : నరసారెడ్డి ! యీ సాక్షి నీకు వ్యతిరేకముగా చెప్పుచున్నాడు. ఇతని సాక్ష్యము నిరుపయోగము.

ఫిర్యాది : మీరు తర్ఫీదు చేస్తే పనికొస్తాడు లేండి.

సాక్షి : అయ్యంతా నాకు తెలియవు. నిజం చెప్పబోతేనే కచ్చీర్లో ఒళ్లొణుకుతుందట, అబద్ధము చెప్పబోతినా ఒళ్ళు మతీ వణు కుతుంది. నేనెప్పుడు అధికారి మొకము సూచినోణ్ణి గాను. నీ యబ్బతోడు. ఎట్టుండి ఎట్చొచ్చునో!

ఫిర్యాది : ఈమాట వూరికాణ్ణే చెప్పితే నిన్నెందుకు తీసుకొస్తాను ? ఇక్కడ పూటకూలి తింటివి. కాఫీహోటల్లో వడలు, కారాబూంది తింటివి. మాకేం కర్చులేదనా ? నిన్ను తోడుక రావడం గుడ్లగూబను సంకలో పెట్టుకొని తీసుక రావడమైందే మా పని !

సాక్షి : సాల్లేవోయ్, చెప్పినావుగాని. అలవాటు పడిన వాళ్ళయితే పాల్లించి పాల్లించి నందిని పంది చేస్తారు. పందిని నందీ చేస్తారు. అయినా నాకేం తెలియదబ్బా!

(నరసయ్య ప్రవేశించును)

నరస : వెంకట్రావు గారూ ! నమస్కారము.

ప్లీడరు : నమస్కారం. కూర్చొండి.

ప్లీడరు : (ఫిర్యాది తట్టు తిరిగి) ప్రథమ సాక్షి పనికి రాడు. మిగత యిద్దతీని సాయంత్రం తీసుకొనిరా, తర్ఫీదు చేస్తాను. నా కిప్పుడు కొంచెము పనియున్నది.

ఫిర్యాది : చిత్తము

(దండము పెట్టును)

(సాక్షులు, ఫిర్యాది నిష్క్రమింతురు)

ప్లీడరు : నరసయ్యగారూ ! ఏదో ఒక కార్యం లేనిదే మీరు దయచేయరే !

నరస : (చిరునవ్వుతో) కొంచెము పని పడిందండి.

ప్లీడరు : వ్యాజ్యె మేమన్నానా ?

నరస : అవునండి. మా రెడ్డి మెజిస్ట్రేటు కచ్చేరిలో సాక్ష్య మియ్యబోతాడు. అందుకుగా మీతో మాట్లాడవలయునని వచ్చినాను.

ప్లీడరు : మఱి అందుకుగా నాతో యేమి పని ?

నరస : కోర్టులో ఆయన్ను క్రిందికి మీదికి లాగకుండా మీరు కొంచెము ఆసరాగా ఉండడానికి.

ప్లీడరు : (నవ్వుచు) అట్లనా !

నరస : వెంకట్రావుగారూ ! నాకు అధికంగా మాట్లాడడమునకు సమయము కాదు. రెడ్డిగారిని ఇక్కడకు తీసుకొని వస్తాను. మీరు ఫీజు 150 రూపాయలడిగి, నూరురూపాయలకు తగ్గించండి. అందుకు నేను తగువుగా రెడ్డితో చెప్తాను. మీరాయన్ను కొంచెము తర్ఫీదు చెయ్యండి.

ప్లీడరు : కేసు స్వభావము తెలియనిదే నేనేమి తర్ఫీదు చేసేది ?

నరస : కేసేమున్నది. మీరు వాదించవలసిన అక్కరలేదు. మీరు ఊరికే సాక్షిభూతంగా ఉండవలసినదే. ఇన్స్పెక్టరుగారి ప్రశ్నల ననుసరించి మీరు పోండి. ఆయన రెడ్డి పక్షంగానె ఉంటాడు.

ప్లీడరు : అట్లయితే సరే.

నరస : నేను వెళ్ళి రెడ్డిగారిని తీసుకొని వస్తాను. ఈ కేసులో మాత్రం 100 కి 40 తగ్గదండి.

ప్లీడరు : అట్నే కానీండి.

(నరసయ్య నిష్క్రమించును)

ప్లీడరు : (స్వగతము)కమిషను ఎట్లు తీసుకొన్నను నరసయ్య దయవలన నేనెట్లో కాలము గడుపుకొనుచున్నాను. ప్రతిదినము కోర్టుకు పోవడమునకు అవకాశము గల్గుచున్నది. ఇక పెద్దప్లీడరు నగుటకు ఒక గుఱ్ఱపుబండిమాత్రం తీసుకోవలయును. టెన్నీసు క్లబ్బులో మెంబరు కావలయును. ఇంత మాత్రపు గౌరవముతో ఈ సంవత్సరము గడిచిపోతే వచ్చే సంవత్సరమునకు కాన్ఫరెన్సు లో రిసెప్షను కమిటీ మెంబరు పదవి నొంది సర్వజనులకు నన్ను ప్రచురపరుచుకోగలను.

(బయట కాలి చప్పుడు వినబడును)

(ప్లీడరు న్యూస్పేపరు చదువుచుండును)

(రెడ్డి, నరసయ్య ప్రవేశింతురు)

రెడ్డి : స్వామీ ! దణ్ణం.

ప్లీడరు : (కొంచెము తలయూచును)

రెడ్డి : (నిలబడియుండును)

రెడ్డి : (కొంచెము నిదానించి, చిన్నగా) నరసయ్యా ! ప్లీడరు మనతో మాట్లాడలేదేమి?

నరస : ఓహో ! ఈయన అందఱు వకీళ్ళవంటివాడనుకున్నావా యేమి ? ఈయన చాలా గొప్ప ప్లీడరు. అందుకు మనతో పలకకుండడమే గుర్తు.

రెడ్డి : అట్నా, సరె. మఱి యెప్పుడు పలకతాడు ?

నరస : ఎప్పుడంటే....ఆయన కిష్టమైనప్పుడు.

రెడ్డి : అట్టయితే కాస్తతీరిక చేసుకోని వస్తుమె !

ప్లీడరు : (నరసయ్య తట్టుతిరిగి) ఏమండి, యితనేనా మీరు చెప్పిన రెడ్డి ?

నరస : (లేచి) చిత్తం, అవునండి.

(ఇంతలో గాలికి న్యూస్ పేపరు బల్లపై నుండి పడును. రెడ్డి ఆతురతతో, ఆ కాకితమును ఎత్తి బల్లపై పెట్టును.)

ప్లీడరు : (రెడ్డి తట్టు తిరిగి) నీవేనా కోర్టులో సాక్ష్యము చెప్పబోయేది ?

రెడ్డి : అవునండీ స్వామి ! (అని చేతులు కట్టుకొని కొంచెము వంగి యుండును)

ప్లీడరు : ఈ కేసు మాజస్ట్రీటు కోర్టులో కాబట్టి యిందుకు ఫీజు 150 రూపాయలియ్య వలయును.

రెడ్డి : స్వామీ ! కేసు నాదిగాదు. యానాది వాడిది. నేను మాటమితికి సాక్షిని. అందుకే నూటయాబయిరూపాయలడిగితే యెట్టస్వామీ ? రమారమిగా చూచి పోనీయండి. ఆశకుమట్టా, మందలా ?

నరస : (కన్నుసన్నచేసి) వెంకారెడ్డి ! నీవు మర్యాదలేని మనిషివయ్యా. గొప్ప వారితో మాట్లాడే విధం తెలియదు. (ప్లీడరు తట్టుతిరిగి) వెంకట్రావుగారూ ! ఏదో కొంచెము తగ్గించండి. వీరి కేసులన్ని మీకే యిప్పిస్తాను.

ప్లీడరు : మీ యిష్టం, మీరెట్లు తీర్మానం చేసినా సరె.

నరస : నన్ను కావలిసి పై యాభయి రూపాయలు తగ్గించి నూరు రూపాయలు తీసుకోండి.

ప్లీడరు : నీ మొగమాటం వలన యాభయి రూపాయలు తగ్గించినాను గాని, రెడ్డే స్వయముగా వచ్చి యడిగిన యెడల పైసాఅయినా తగ్గించి యుండను.

నరస : తమ దయ.

రెడ్డి : (స్వగతము) డబ్బిచ్చి చెప్పుతో కొట్టించుకున్నట్టయింది. నా డబ్బుపోవడం ఏందో, నరసయ్య మొగమాటమేందో ? ఈ వకీళ్ల ముందరచేతులు కట్టుకోని నిలుసోడం, యీళ్ళిళ్ల సుట్టూరు తిరగడం. ఏమీ నాకీ గాచారం ? పెద్దోళ్ళు సంపాయించింది ఉణ్ణెమట్టుకు తిని యింటిపట్టున కుదురుగుండా వుంటె యీ కష్టాలెందుకొస్తాయి ? ఇక దొంగ నగలు నా ప్రాణం పోయినా కొనను. అదేందో శని ! (అని చేయి పైకెత్తి దండము పెట్టును.)

నరస : అయ్యా ! యిక మనము పోదాము రండి.

రెడ్డి : ఆ.....వస్తుండా (ప్లీడరు తట్టుతిరిగి) అయ్యా, శలవ తీసుకొంటా. (దండము పెట్టును)

ప్లీడరు : (తలయూచును)

(నరసయ్య, రెడ్డి నిష్క్రమింతురు)

(తెరపడును)



# కర్షకవిలాసము

# పంచమాంకము

## ప్రథమ రంగము

(వెంకటరెడ్డి చొక్కా గుండీలు తీసి దుప్పటి కప్పుకొని యుండును)

వెంక : (స్వగతము) అయ్యో ! యీ బాధ నే నెట్లోర్చుకొనగలను ? ఎన్ని దినములు పెద్దవారికి చెప్పక, తెలియనీయక దాచగలను ? వాయుజ్వరమని తల్లికి జెప్పి ఆమెను నమ్మించుటకై రెండు వాయువ మాత్రలను మ్రింగితిని. గడ్డపారలు మ్రింగి చిట్టుడుకు నీల్ళు ద్రావిన నేమి ప్రయోజనము ? నే జెప్పకుండినను నఖశిఖ పర్యంతము పాటమరించిన మచ్చలు మున్ముందుగా దమ రాక నెఱిగింపగలవు. మూత్రవిసర్జన మతి దుస్తరమైనది. ఒక్కొక్క బొట్టు పడుట ఒక్కొక్క జన్మమెత్తుటవలె నున్నది. ఊరు మూలంబుల రుబ్బుడు పాత్రములవలె రెండు కందములు పాటమరించుచున్నవి. అబ్బా ! ఆ బాధ పరమేశ్వరున కెఱుక. గుడ్డదడుపు రోగ మిప్పుడిప్పుడు విజృంభింపుచున్నది. ఆహా ! నా గ్రహచారము. దేహమా సుఖరోగంబులకు గేహమైనది. యశమా నశించినది. ధనమా వ్యయమైనది. ముదమా తుద నొందినది. స్నేహితులా ఎల్లిద మాడుదురు. తల్లిదండ్రులా నన్ను విషసర్పముగా జూతురు. నేనిక పదిమందిలో మొగమెత్తికొని తిరుగగలనా ? వేటకాని పిల్లన గ్రోవి పాట జింకపిల్ల నెలయించినట్లు, వారకాంత కర్ణరసాయనములగు పద్యజాలము నా హృదయము నపహరించినది. ఉత్కంఠ రెక్కొల్పినది. మోహ సంతమసము నామందబుద్ధి నంధీభూతము చేసినది. కార్యాకార్యవివేక శూన్యత నాపాదించినది. ఔరా ! యిక మోహ పిశాచము నాచే నెట్టెట్టి దుష్కార్యంబుల జేయించి యుండి యుండదు ? లోకానుభవ శూన్యులగు నా బోటి వారు, మెరయు చుండు ప్రతి వస్తువును బంగరువని గ్రహింతురు. తృణాగ్రముల నున్న హిమబిందువల ముత్యంబులని భ్రమింతురు. ఉప్పును గప్పురం బనుకొందురు. జలముపై నచ్చటచ్చట నున్న నాచు కసువును జూచి లోతులేదని మందబుద్ధులు కొంద అగాధ జలంబుల దిగి జంబాలంబున గూరి కొందురు. అనుభవములేమి తేటికూన పూచిన పువ్వునందెల్ల తేనె గ్రోలవచ్చునని యాసవడి చంపక సుమమునకు సైతము పోయి కష్టపడి వెనుకకు మర్లుచుండును.

వారకాంతలు పయోముఖ విషకుంభములని తెలిసియు, నే మోస పోయితిని. శకునములు చెప్పు పక్షి వలలో బడినట్లయినది. ఇస్సబ్బా! (అని రెండు తొడలను పట్టుకొని యొత్తికొనుచు) నరములు జివ్వుజివ్వుమని గుంజుచున్నవి.. జ్వరము హెచ్చుచున్నది. (తలపట్టుకొనును) (కొంచెము నిదానించి) ఆహా ! వెలయాలి మోసము మరచినా మరుపురాదు.

తే.గీ. *కసవు గప్పిన నూతులు గణిక, లట్టి*
*వారి స్నేహ మనర్థక కారణంబు*
*ఇంబు మాటలు, కాలకూటంబు మనము*
*ప్రణయభావ మభావము పణ్య సతికి.*

'ద్రవ్యమొల్లరా'' యని కమ్మ వ్రాసినది. తొలుదొల్త నేను స్వయముగా ధనమిచ్చినను దీసికోక నా ప్రార్థనపై గైకొనినట్లు నటించినది.

చ. *రసికుల గోరుచుందు ధనరాజి యదేమిటి కయ్య నెయ్యుడా ?*
*పసిగొని నూరికో దినమా ? భావజ బాణ విభిన్న చిత్త దు*
*ర్వ్యసనము మాన్పునో ? ప్రణయ వర్ధన హేతువొ ? యంచుబల్కి నా*
*దెస కుహనా ప్రియంబుగల తీరును జూపదు వార కాంతయున్.*

ఆ కలువకంటి తేనె సోనలవంటి మాటలు నా మోహదేవతకు ఉచ్చాటన మంత్రములైనవి. ఆహా ! వారి బూమెలు ! తీసికొనని యట్లే. అందుల కిందుల కని వేయి రూపాయల వఱకు సంగ్రహించిరి. నే సల్పిన కైతవము నా యన్న కెఱుకైన పాద తాడిత భుజంగమువలె పై బడడా ? నీలిగింజల కొఱకై అన్న వేయిరూపాయలు తెమ్మనెనని చెప్పి, సుబ్బారెడ్డి పేరటి కొక ప్రామిసరీ నోటు వ్రాసి యిచ్చి పైకము తెచ్చి, ఆ పిసాళి జంతల కప్పుడప్పుడు సమర్పించితిని. ఈ విషయమెన్ని దినములు గోప్యముగా నుండగలదు ? ఱంకుతనము, బొంకుతనము దాగునా? (తలయొత్తికొనును) వాడుక లోని కొన్ని లోకోక్తులు అనుభవ పురస్సరములు గావని నా మతము. వదనము హృదయ ప్రతిబింబమని కొందఱు చెప్పుదురు. శశిబింబానన యగు ఆ సౌందర్యరాశి హృదయ రంగంబున కుహనా పిశాచమేల తాండవించుచున్నది ? ఆహా ! సృష్టి విచిత్రము.

సీ. *శ్రీ విష్ణు సేవ్యమౌ క్షీరాబ్ధి కుక్షిలో*
*బడబానలంబు సంప్రభవ మొందె*

అమృత శీకరముల నాశాంతములఁ జల్లు
శశిలోఁగళంకంబు సంభవించె
శీత సౌరభమయ శ్రీఖండ తరువుల
విషసర్పజాలంబు విడువకుండె
జగమెల్ల ముంపంగఁ జాలిన వననిధి
కట్ట లేకయె దాను గట్టువడియె

తే.గీ అట్టి సృష్టికి నధినేతయైన స్రష్ట
హారి లావణ్యలహరి యా వారనారిఁ
జిత్తమందునఁ గపటమన్ క్ష్వేళముంచి
చేసి యుండుట యది యొక చిత్ర మగునె ?

గతజల సేతు బంధన మేమి ఉపయోగము ? ఓ పరమేశ్వరా ! నా పగవానికైన నిట్టి బాధ గలగకుండుగాక ! ఇక మీద నా స్నేహితుల్వెరు ఇట్టి దురవస్థకు బాల్పడ కుందురుగాక ! అబ్బా ! యీ బాధ అనుభవ వేద్యమే గాని చెప్ప శక్యముగాదు. (తొడలు పట్టుకొనును)

(వెంకారెడ్డి ప్రవేశించును)

వెంకా : ఏం నాయనా ! జ్వరమేమైనా కొంచెము తగ్గిందా ?

వెంక : ఏం తగ్గలేదన్నా.

వెంకా : నెల్లూళ్లో పూటకూలిళ్లల్లో పచ్చడి మెతుకులు తిని, నీకు ఊష్ణం చేసి యీ జ్వరం రావడం. నేను ఆసుపత్రికి పోయి డాక్టర్ను పిలుసుకోని వస్తా. (అని లేచి వెంకట రెడ్డి మొగము చూచి) యెంకటయ్యా ! అయ్యేమిటయి, మొకాన దద్దులు దద్దులుగా లేశినాయి ?

వెంకట : పైత్యపు దద్దులు పొంగినాయన్నా !

వెంకా : అవునవును. మతి నే నాసుపత్రికి పొయ్యొస్తా.

వెంక : (స్వగతము) డాక్టరునుపిలువ వద్దని చెప్పిన యెడల అన్న అనుమానము నొందును. ఇక డాక్టరు వచ్చిన యెడల నాగుట్టు బయటబడును. నేనెంత కపట నాటక మాడినను రోగము దాగునా?

(డాక్టరు, వెంకారెడ్డి ప్రవేశింతురు)

వెంక : Good Morning Sir !

డాక్టరు : Yes. good Morning !

వెంకా : అయ్యా ! యీ కుర్చీమీద కూర్చోండి. (అని కుర్చీ జరుపును)

డాక్టరు : May I know your name please ?

వెంక : Venkata Reddy

వెంకా : అయ్యా ! మా వాడికి పది దినాలనుంచి ఒకటే జరము. ఇంతకూడైనా సగించదు. నెల్లూరినుంచి వచ్చినాడు. అప్పటి నుంచి వాడి మొగం చూడ రాకుండా పోయినాదండి. గజ్జల్లో జరబిళ్ళలు కట్టినాయి గామాల, నడవలేకనే యుండాడు. మీరు కాస్త శ్రద్ధ గా పనిచెయ్యాల్నండి డాక్టరుగారూ!

డాక్టరు : చూస్తాము (లేచి) (థర్మామీటర్ వెంకటరెడ్డి నాలుక క్రింద పెట్టును) (మరల తీసి) ఓహో ! జ్వరము 103 డిగ్రీలు కాస్తున్నది. (స్టెతాస్కోపు చెవికి తగిలించుకొని, గుండె, వీపుమీద పెట్టును) శ్వాస కోశములు గూడ దుర్బలములైనవి. వెంకటరెడ్డిగారూ ! మీకు జ్వరము ఎన్ని రోజుల నుండి ?

వెంక : పదిరోజుల నుండి,

డాక్టరు : (బొటనవ్రేలి గోరు కొఱికి కొనుచు) I see. (అని మెల్లగా దలయూచును) I want to examine your blood.

వెంక : Yes, you may.

(సూదితో వ్రేలిని గ్రుచ్చి అద్దపు తునకలపైన రాయును.

తన జోబీలో వేసుకొనును.)

Come into the adjoining room. I want to examine your private parts.

(వెంకటరెడ్డి, డాక్టరు తెరలోపలికి బోదురు)

వెంకా : (స్వగతము) ఇవి మనకు తెలిసే కొట్టుకోళ్ళుగావె !

(వెంకటరెడ్డి, డాక్టరు మరల ప్రవేశింతురు)

డాక్టరు : (ఫౌంటెన్ పేనా పెదవిపై ఆనించుకొని ఆలోచించుచు కుర్చీపై గూరుచుండును.)

వెంకా : అయ్యా ! జరమేనా, యింకా పైత్యమేమన్నానా ?

డాక్టరు : యీ అబ్బాయికి జ్వరమేగాదు, సుఖరోగములు మఱికొన్ని కలవు.

వెంకా : ఏమిటీ ......... సుకరోగాలా ? (అని తమ్ముని తట్టు తిరుగును)

వెంకట : (తలవంచుకొనును)

వెంకా : ఏమి రోగాలయ్యా ?

డాక్టరు : ఇతనికి చురుకు రోగము గలదు. తర్వాత అంటురోగము ప్రబలినది. ఇప్పుడు సవాయి దద్దులు దేహమంతా వ్యాపించినవి. నీవు చెప్పినట్లు అవి జ్వరబిళ్లలు గావు.

వెంక : అయితే మరేంటియయ్యా ? వాడిశెగెడ్డలుగానా ?

డాక్టరు : ఆ, అవే, (మందు చీటి వ్రాయుచుండును)

వెంకా : అట్టనా ! (తమ్ముని తట్టుతిరిగి) ఇందుకేనయ్యా నిన్ను నెల్లూళ్ళో సదవేశింది? (అని తలయూచును) నీ సదువు సట్టబండలయ్యిందె! యేమో సదువు సందె నేర్చుకోని బుద్ధిగలిగి వుంటావనుకొంటే నీ కిదేం దుర్బుద్ధిరా యంకటయ్యా ? సదువుకున్నోడి కంటె సాకలోడే మేలయింది ! నీ సదువు లేకపోతే నా పీడ బొయ్యిందిగాని ఇంటిపట్టునుండి ఆ లెక్కపద్దులు గీకుతావుండు నరసయ్య బదులు. ఆ పది రూపాయలైన మిగులునుగాని. తండోమండో చేసి నాలుగు దుగ్గాణ్లు సంపాయించుకోని కీర్తిగా బతుకుతుండే మన సంసారములో, యాదవ కులానికి ముసలం పుట్టినట్లు పుట్టినావేమిరా ?

డాక్టరు : వెంకారెడ్డి ! యిదిగో యీ చీటీ ప్రకారం మందు తెప్పించి, దినమునకు మూడు పూటలు భోజనానంతరము ఆ ద్రావక మిప్పించవలయును. మా ఆసుపత్రికి వచ్చిన యెడల పిచ్కారీ లోషను ఇస్తాను. మఱి ఆ గడ్డలు కొంచెము మెత్తపడిన వెనుక ఆపరేషను చేస్తాను.

వెంకా : ఆ మందులో శవ్వాయికి గూడ వుండదా అయ్యా ?

డాక్టరు : ఆ, అన్నిటికి తగిన మందులు వ్రాసియున్నాను.

వెంకా : చిత్తం. యీ కాయిలా యెట్నో ఒకట్టు కుదిరితే తమరి దర్మాన, మేము మీ కష్టం బెట్టుకోము లెండి. ఏదో సమర్పించుకొంటాము.

డాక్టరు : ఇప్పుడు నడకబత్తా 5-0-0 మాత్ర మివ్వండి. తర్వాత రోగము కుదిరిన యెడల, మీ యిష్టము వచ్చినంత యివ్వండి.

వెంకా : చిత్తము (స్వగతము) అబ్బా,ఈ నెల్లో యెన్ని దండగ లెన్ని దండగలు ! (అని లోపలికి బోయి రూపాయలను తెచ్చి యిచ్చును)

డాక్టరు : ఇక నేను వస్తానండి. (లేచి వెంకటరెడ్డి తట్టుతిరిగి)

Mr. Venkata Reddy, don't be offended for my procedure. If I don't reveal the matter to your elders and administer you good medicine, those diseases may drink the very sap of your life. You see, take care in future, lest you may loose your health. Alright, I shall take leave of you. Good morning !

వెంక : (తలవంచుకొని) Thank you sir !

(తెరపడును.)



## ద్వితీయ రంగము

### రామచంద్రారెడ్డి గృహము, అవ్వ అస్వస్థత

(అవ్వ మంచము మీద పండుకొని యుండును)

అవ్వ. ఓయనా, యిట్టరా !

రామ (దగ్గరకు బోయి మంచముపై నొక చేయి నానించి కొంచెము వంగును)

అవ్వ : అబ్బయ్యా ! మన కవళమ్మ మూర్తం కన్నారా సూచేటట్టులేదు గామాల యింత బతుకు బతికి. (కన్నీళ్ళు పెట్టుకొనును)

రామ : అవ్వా ! మన యత్నములో ఏమున్నది ? అంతా భగవద్యత్నమె. నీ వింతలో ఇంత జబ్బు పడుదువని నేకలలోనైనా అనుకోలేదు. మనమేమి చేయగలము?

అవ్వ : అవున్నాయనా ! (అని యేడ్చును.)

రామ : ఎందుకవ్వా దుఃఖపడుతున్నావు ? యేమొ తొంభయి సంవత్సరములు నీచేతి మీదుగా కాపురము నడుపుకొన్నావు. పిల్ల వాళ్ళను పెద్దవాళ్ళనుగా చేసినావు. నీ యిష్టము వచ్చినట్లు అన్నదానము చేసికొన్నావు. ఇక నీ కీ సంసారముతో ఏమి పని ? కృష్ణా, రామా అనుకో నీ కట్టె కడతేరి పోతుంది. ఇంత ముసలి ప్రాయములో నంజుజాడ్యము ప్రాణాపాయకరమైనదే!

అవ్వ : (పెద్దగా దగ్గి, అలసటతో) అవున్నాయనా ! నీవుచెప్పింది నిజమే.. కిష్ట! రామా! గోయిందా ! నారాయణ ! (మరల దగ్గును)

రామ : (మందుసీసా చేతికి తీసికొని) అవ్వా ! యీ మందు తీసుకో, దగ్గుకొంచెము తగ్గుతుంది.

అవ్వ : (అలసటతో) కాటిక్కాళ్ళు సాసుకోనుండే ఆపెకు నా కెందుకులే మందు. బదికి బద్దలు గావడానికా !

రామ : ఆయుష్యమునకు మనము కర్తలముగాము. అయితే మన చేతనయి నంత వఱకు ప్రయత్నము చేసి తగవైన మందులు తీసికొన వలయును.

అవ్వ : అబ్బయ్యా ! మంచం కింది నీళ్లిట్టియ్యి, దాహం గుంటుండది.

రామ : (నీళ్ళిచ్చును.)

అవ్వ : అబ్బె ! మన గురువులోర్ని ప్యసాదము, శీపాద తీర్తము తీసుకోని రమ్మని మణిశిని

తరుము.

రామ : అట్లనె. ఒరే ! (తెరలో) (అయ్యా' అని వినబడును) తిరువెంకటాచార్యులను అవ్వ పిలుస్తున్నదని పిలువు.

(తెరలో అట్టాగే' అని వినబడును)

అవ్వ : నాయనా ! నీ శెయ్యిట్టజూపు. నా శేతిలో శెయ్యెయ్యి.

రామ : ఎందుకవ్వా ?

అవ్వ : మన కవళమ్మను కాటంరెడ్డోళ్లకు యియ్యబాకు. మన కాపరానికి శేయస్కృతం కాదు.

రామ : ఈ విచారం నీకెందుకవ్వా ? నీవు లక్షణంగా రామమూర్తిని ధ్యానం చేసికో. ఊరకే మాట్లాడితే నీవు దగ్గలేక బాధపడుతావు.

అవ్వ : (తలయూచి) యిస్, నారాయణ ! గోయింద ! కిష్ట కిష్ట ! ఆచార్రె తిరువలికలె శరణం.

రామ : (స్వగతము) ముసలివారు తమ యభిప్రాయముల మార్చుకొనుట బహు దుస్తరం.

(ఆచార్యులు ప్రవేశింతురు)

ఆచా : ' అన్నవయల్ పుతువై యాన్డాల రంగఱ్కుప్పన్ను తిరుపావై పల్పతియం."

రామ : ఆచార్యులవారూ ! నమస్కారం. వేం చేయండి.

ఆచా : జియ్యర్ తిరువడిగళే శరణం. (అని కుర్చీలో కూర్చుండును.)

అవ్వ : (మంచము నుండి సగము లేచి) స్వామీ అపరాదిని, (అని దండము పెట్టును)

ఆచా : .అమ్మా ! లేవవద్దు, పండుకోండి.

రామ : అవ్వా కదలకుండా పండుకో.

ఆచా : అయ్యా ! యీమె కేమిజబ్బు?

రామ : వాపురోగమండి.

ఆచా : త్సో,త్సో,త్సో, అయ్యో, పాపము ! (కొంచెము నిదానించి ఆవులించి) జియ్యర్ తిరువడిగళే. శరణం. శ్రీనివాసా! యన్నప్పనే !

అవ్వ : (అలసటతో) స్వామీ ! నే నెన్నో బాగవతాపచారాలు చేసినా. నా అపచారాల నన్ని

పొంగొట్టి నాకు పరంపద మిప్పించయ్యా. నా మెళ్లో తీగ తాళిక పూసలు మీకు సమర్పించుకొంటా !

ఆచా : అమ్మా, రామానుజమ్మా ! (యింతలో)

అవ్వ : అయ్యా, నాపేరు ఎంకట లచ్చింగదో ! మరిశిపోయినారా ?

ఆచా : మీ దాసనామము'రామానుజమ్మ" అని.

అవ్వ : అట్నా ! యింతకు ముందెప్పుడైనా తెలియపరస గూడదో యీ దాశనామం.

ఆచా : అమ్మా ! శ్రీ వైష్ణవ సిద్ధాంతములో ··చార్యుని కొఱకై శిష్యులకు పరమపదం గలుగుతుందని ఆళ్వారాదులు సాయించి యున్నారు. అందులో కించిత్సందేహమైనా లేదు.

అవ్వ : (తీగ తీసి ఆచార్యున కియ్యబోవును)

రామ : అవ్వా, నీకేమిపిచ్చి ? నీవు పరమపదము పోవుటకై ఆచార్యులకు తీగె లంచమిచ్చుచున్నావా ? ఈ యాచార్యుడు పరమపదము కంట్రాక్టుకు దీసికోనున్నాడా ? ఆచార్యులు స్వర్ణ దర్శనము చేతనే పరవశులగుదురుగాని, సర్వ సృష్టికర్తయగు భువనేశ్వరునకు ఈ తీగ లంచము సంతృప్తి గలిగించునా? ఎవరెవరు చేసేత చేసిన కర్మములు వారువారనుభవించ వలయును గాని, సిఫారసులతో నేమి పని ? అవ్యయమగు న్యాయమునకు పక్షపాత ముండునా!

ఆచా : (స్వగతము) ఇక నాబోటి గురువుల వ్యాపారాలు అప్రతిహతముగా జరుగు కాలము పోయినది. (మెల్లగా దలయూచి) (ప్రకాశముగా) రెడ్డిగారూ ! మీ రట్లు శాస్త్రముల నిందించకండి. కాంచన దానం శ్రేష్ఠం. అందులో ఆచార్యులకు సమర్పించుకోవడం మహాశ్రేష్ఠం. పూర్వాచార్యుల పద్ధతి అవలంబనీయము గదా ! శ్రీ వైష్ణవ సిద్ధాంతములో తిరుమంగయాళ్వారు మహా ప్రసిద్ధ పురుషుడు. ఆయన దారులు దోచి ఆ డబ్బుచే శ్రీరంగనాథునికి సప్తప్రాకారాలు కట్టించినాడు. కట్టిన బేలుదారులను పరమపదమునకు బంపించి నాడు. ఆయన మహా కైంకర్యపరుడు. దొంగిలించియైన ఆచార్య కైంకర్యం చేయవలయును.

రామ : ఈ సిద్ధాంతం చాలా మంచిదండి. జీవిత యాత్ర గడుపుట కెవ్వరికైతే ధన మత్యావశ్యకమొ, అట్టివారి సర్వస్వము దోచి, ధనావశ్యకతలేని విరాట్ స్వరూపమున కొక దేవాలయము నిర్మించుట, సరె, గోవును చంపి చెప్పులు దానమిచ్చినట్లు,యిక మీద మీ శిష్యులకు దొంగతనము చేసి ఆచార్య కైంకర్యం చేసే పరమ

రహస్యమును బోధించండి. మఱి ఆచార్యులవారూ ! తిరుమంగయాళ్వారు బేల్దారులను పరమపదమున కెట్లు పంపినాడు?

ఆచా : (స్వగతము) ఇక నీతని తోడి వాదము లాభదాయకము గాదు. అర్థసంపాదన యందు వాదమెప్పుడు నష్టకారియే యౌను. (ప్రకాశముగా) అయ్యా ! ప్రాకారములు నిర్మించిన బేలుదారులకు కూలి యియ్యలేక, ధనమిత్తునని వారిని మోసముగా పుట్టిపై నెక్కించి కావేరిలో ముంచినాడు. తర్వాత వారికి పరంపదము.

రామ : అట్టి దుష్కృత్యాపకీర్తి మాపుటకై పూర్వులు 'బేల్దారులు పరమ పదమున కేగిరి' యని సమర్థించిరి కాబోలు.

అవ్వ : నాయనా ! నా పసుపు కుంకానికి రాసిచ్చుండే పదేనెకరాలు రంగ నాయకుల పేరట యేయ్యించయ్యా. ఏమొ సచ్చినా పేరు, పెతిష్టవుంటుంది.

రామ : అవ్వా! ఆ పద్ధతి నా కిష్టంలేదు.

ఆచా : అయ్యా ! అవ్వగారు చెప్పిన పద్ధతి చాలా మంచిదండి. ఇప్పుడు రంగ నాయకులకు నాలుగు తళియలే ఆరగింపగుచున్నవి. ఇక నీ పదిహేను యకరాలు దేవుని పేరిటవేస్తే ఎనిమిది తళియలుగా ఆరగింపుచేయ వచ్చును. చాలా వైభవముగా ఉంటుంది. భూషణములు చేయించవచ్చును.

రామ : ఎన్ని తళియలారగింపు చేసినను అందేమి కలదు ? ఆరగించువాడు దేవుడా లేక భాగవతులా ? ఇక ఎన్ని తళియలైనా భోగ్యముగా చేసికొని ఆరగింపవచ్చును. ఆద్యంత శూన్యుడై, సర్వలోక భరితుడై, జ్ఞానానంద స్వరూపుడై, పిపీలక బ్రహ్మ పర్యంతము సమముగా ప్రకాశించు సర్వేశ్వరుడు జిహ్వాచాపలముచే పులియోగిరము, దద్యోదనము, చక్కెర పొంగలి యారగించు చున్నాడా ? దేవుని పేరు చెప్పి మనము రుచి చూచుచున్నాము. ఇప్పటి దేవాలయములు వ్యాపార స్థానములైనవి. అర్చకులు ధనాకర్షణ యంత్రములైనారు. దైవ విగ్రహములు ద్రవ్య సంపాదనకై ఏర్పఱచు కొన్న సాధనములైనవి. డబ్బిచ్చిన దేవుని దర్శనము గలుగును. డబ్బు వదలిన ఆచార్య కృపగలుగును. ఆహా ! కాలవిపరీతములు, సర్వేశ్వరుని యపార కృపా మహిమ ద్రవ్యమునకు విక్రయింప బడుచున్నది. లోకరక్షకుని యఖండ స్వరూపమును ఒక చిన్న దేవాలయమున బంధించి వారమ్ముచున్నారు. మూఢులగు లోకులు కొనుచున్నారు. ఇట్లు పొసగునా ? ఇది లోకుల మనోవైకల్యము, భ్రమ. దేవుడు సర్వజన సాధ్యుడు. దేవుడు అనంత కళ్యాణ గుణగణ పరిపూర్ణుడు. అట్టి దేవుడు పూజనీయుడు. అచేతనము

నందున్న దేవుని పూజించుట కంటె సచేతనమునందున్న దేవుని పూజించుట మేలు గదా ! ఆకలి లేని విగ్రహములో నున్న దేవునికి క్షీరాన్న మారగింపు సేయుటకంటే, అన్నములేక మరణశయ్యపై దొర్లుచున్న యొక మానవుని హృదయమందున్న దేవునకు బీదగంజి యారగింపు చేసినను ఉపయోగకరముగదా ! అన్నము లేక చచ్చు వారు, కట్టగుడ్డలులేక దిగంబరులగువారు, విద్యా విహీనులై మూఢులవలె దిరుగువారు లెక్కకు మిక్కుటమై మానవకోటి యందగుపడుట లేదా ! అట్టివారు బాగుపడుట దేవునికి అయిష్టమా ? వారి దుర్గతిని కన్నారగాంచుచు, ఎట్టి సహాయము చేయనిష్టపడక, వాంఛారహితుడగు సర్వేశ్వరునకు భూషణములు చేయింప డబ్బు కొల్లవెట్టుచున్నాడు. ఈ విషయము చర్చింప బూనుకొనిన ఎడతెరిపిలేక వచ్చు చుండును. (అవ్వతట్టుతిరిగి) అవ్వా ! ఆ పొలములో కొంత గ్రంథాలయ మునకు, మరికొంత పాఠశాలకు వ్రాయించెదను.

అవ్వ : నాయనా ! నీకిష్టమొచ్చినట్లు చెయ్యి, నీకిష్టమైతే నాకిష్టమే.

ఆచా : (స్వగతము) ఇక మా కాలక్షేపాలు కట్టిపెట్టవలసిందే ! మా వ్యాపారములు మొగిసినవి. ఆ రామానుజమ్మ తీగ, దండా యిస్తే నా భార్యకు మంగుళూరు గాజులు చేయించవచ్చును. ఆ తోడు తప్పిపోయినది. రామచంద్రారెడ్డి బాగా దాపురమైనాడు. ఇక మగవారు మన మాట వినరు. ఆడవారి కంత విమర్శన జ్ఞానము లేదు. వారికి గురువిచ్చిన దంతా గుమ్మడి కాయ. మా అభీష్టములన్ని వారికి పూర్వాచార్య సూక్తులే, అట్టివారు తొందరగా లోబడుదురు. మారు మాట్లాడిన భాగవతాపచారము వచ్చునని వారు పలుకరు. అట్టి అమాయకులే మాకు శిష్యురాండ్రు. వారిని వదలిన యిక మా జీవితము జరుగుట దుస్తరము.

(తెరపడును)



## తృతీయ రంగము

(తెరలో)

ఒకడు : రామచంద్రారెడ్డి సన్నాశైనాడని వాళ్లింట్లో కలకలంగా ఉందదిరో !

రెండవవాడు : అట్నా ! వొరె, మనము పరిగిస్తాపొయ్యి సూస్తాం !

ఒకడు : ఆ......అలాగే. లగిత్తతాం పట్టోరే !

(రామచంద్రారెడ్డి సన్యాసి యుడుపులతో ప్రవేశించును)

రెడ్డి సోదరులారా !

కాలచక్ర చంక్రమణము దురూహ్యము. చక్రవర్తి పరిపాలనా దండమునకు వెఱగు పడదు. పుత్రవియోగిని కన్నీటి తరగలచే నాపబడదు. కాల సంచారము దురంతము. కాలగర్భంబున నెట్టెట్టి చిత్రములు గుప్తములై యున్నవో నెవరి కెఱుక ? లోక చరిత్రకారులు, భూమి నేకఛత్రాధిపత్యముగా నేలి నశించిన చక్రవర్తుల నొక్క రొక్కరినిగా చరిత్రాశ్వాసములకు జేర్చుచున్నారు. మిన్ను ముట్టిన సంఘంబులు మన్ను ముట్టుచున్నవి. కొన్ని సంఘంబులు బాలసూర్యుని వలె తేజో విరాజమానములై వర్ధిల్లుచున్నవి. ప్రకృతి శక్తి ప్రతి దినము లోకోపయోగమునకై విని యోగింపబడుచున్నది. ఉత్తేజ నిస్తేజంబులు ప్రకృతి పరికరములు. క్షీణదశావ సానంబున నభివృద్ధి దశాంకూరములు కందళించును. ఇదియే పరిణామ న్యాయము. ఏది నశించెనో అది యభివృద్ధి పొందుట కవకాశమున్నది. ఏది అభివృద్ధి నొందెనో అది క్షీణించు టకు బాల్పడి యున్నది. ఇట్టి ప్రకృతి న్యాయములు నిరంతములు నిచ్చలములు, దురూహ్యములు. ఈ వాదమునకు నిదర్శనము లోక చరిత్రమే.

సోదరులారా !

విత్తనము నశించిన చెట్టు గలుగుచున్నది. తైలము నశించు కొలది దీపము ప్రజ్వరిల్లుచున్నది. మేఘము క్షీణించు కొలది వర్షము గలుగుచున్నది. ఈ న్యాయము అర్థశాస్త్రజ్ఞుల కనుభవవేద్యము. ఆహా! నశించు వస్తువు కొద్దిదైనను ప్రతి ఫలము విశేషము గలుగుచున్నది గదా! వటబీజ మెంత ? దాని యాకారమెంత ? ఆ చిన్ని బీజము తన యాకారము నశింపజేసికొని ప్రభూతమగు వృక్షమును గలిగించుచున్నది. తైలము తన రూపు మాపుకొని అంధకారమును గబళించు

ప్రకాశముతో వెలుగుచున్నది. మేఘము క్షీణించి లోకమునకు పయోదానము సేయుచున్నది. ఘనులు నిర్వ్యాజ కృపాపరులు గదా ! ఈ న్యాయముల నన్నిటిని యోచించి, స్వగృహార్థ త్యాగముచే, స్వకులార్థ ప్రాకటత్వమును సాధించుటకు నేనీ దీక్ష వహించితిని. ఈ సన్న్యాసాశ్రమమును స్వీకరించితిని. రెడ్డి సంఘ సంస్కారమే మజ్జీవిత పరమావధి.

మతావిష్కృతి లేని యే యుద్యమము చక్కగా కొనసాగుట దుర్లభము. మతమనగా నేమి ? ఏ యుద్దేశము, ఏ కర్మ, ఏ పద్ధతి మనుష్యుని సర్వశక్తి సంపన్నునిగా జేయుచున్నదో అదియే మతము.

సోదరులారా !

మన సంఘమునం దెవరైన దుర్గుణులు నా యుద్యమముచే, నా యుద్దేశములచే బాగుపడగలిగిన యెడల, నా ఆశ్రమ స్వీకృతమున కది ఫలముగా బరిగణించెదను. మన సంఘములో నవనాగరకతా కైతవంబునను, మూఢత్వము వలనను, దురాశ వలనను ఎన్నియో దురాచారములు ప్రవేశించినవి. పాదుకొనినవి. ఫలముల నొసగుచున్నవి. అట్టి ఫలితము ననుభవించువారలను మనము ప్రతిదినము చూచుచున్నాము. కొందఱు తమ సర్వస్వమును వారకాంతలకు దోచి పెట్టుచున్నారు. మఱి కొందఱు బీదల నెక్కి రానీయక యిబ్బంది పఱచుచున్నారు. మఱి కొందఱు హత్యలు సేయుటకైన వెనుదీయరు. అబ్బా ! ఆ దుష్కృతముల నన్నియు బేర్కొన నాకిష్టము రాకున్నది. లేనిపోని తగువులు కల్పించుకొని యితరుల కాపురములు కొల్లగొట్టించుట ! ఓ కుల వృక్షమా ! యిట్టి విషకీటకావళికి నాశ్రయమై నీ వెంత కాలము వృద్ధి పొందగలవు ? దుర్ణయ మెంతకాలము అప్రతిహతముగా వర్ధిల్లగలదు ?

అన్నలారా !

పూర్వము రెడ్డి కులాలం కారులును, రాజ్యధురంధరులును, పండిత పోషకులును, కవిలోక శిఖామణులును,యోగీశ్వరులును నైన వీరభద్రారెడ్డి, అనవేమారెడ్డి, మల్లారెడ్డి, వేమన మొదలగువారి యశః కర్పూరముల నేడు మన దుష్కృత దవానలంబున కేల యాహుతి చేయవలయును ? ఐకమత్య భావమును స్మరింపుడు, నాగర కతా పరమాశయమును జ్ఞప్తియందుంచు కొనుడు. మీ క్షాత్రము, దీన రక్షణ, స్వార్థ సంరక్షణయందేగాని, అనహాయుల ద్రవ్యాపహరణమునందు గాదని తెలిసి కొనుడు. మీ బాలులను, బాలికలను

విద్యాన్వితుల జేయుడు. పాఠశాలలు స్థాపించుడు. కులాభివృద్ధికై పాటుపడుడు. పుస్తక భాండాగారముల నెలకొల్పుడు. విద్యాభివృద్ధికై తగినంత సహాయము సేయుడు. ఇదియే నా యుపదేశము. మీ సంఘసేవకుడనగు నన్ను పనిగొనుడు. నా యుద్యమములకు తోడ్పడుడు.

ఉ. సాదరబుద్ధి జూడుడు ప్రశస్త గుణాకరులార ! ద్రవ్య సం
పాదనకై దురాశమెయి పల్మరు బీదల కష్టపెట్టి, దు
ర్వాదము సల్పి, స్వల్పమతి పాపము పుణ్యము లెంచబోక, సం
పాదన సేయనేల నటువంటి ధనంబులు ? కీర్తి గల్గునే ?

క. అధికారమున్న దంచును
నధికులమం చిష్టవృత్తి ననిశంబును, దు
ష్పథముల బోయిన కష్టము
వ్యథయును దలబడకయున్నె హాలికులారా ?

తే.గీ. అంగమందున తల మొదల వయవములు
సరిగ నుండిన గాదెపో సౌష్ఠవంబు,
సంఘ పరమావధియు నట్లె సకల జనులు
సర్వసంపదలం గని సంతసిలుట.

తే.గీ. విద్య గల్గిన వారె వివేక మతులు
విద్య లేకున్న సర్వంబు వృథయ కాదె !
ధనము గల్గియు సద్విద్య దనరకున్న
షండునకు భార్య యబ్బిన చందమగును.

సీ. క్షాత్రంబు గలదని శక్తి హీనుల మీద
దాడి వెళ్లుట గొప్పతనము గాదు
ద్రవ్యయుక్తులమంచు తగువులాడి ధనంబు
కోర్టుల కర్పించ గోర దగదు
తనకు మాలిన ఖర్చు మును జేసి యవ్వల
నప్పు పత్రములపై నలగ దగదు
అనుపయోగములైన యాచారముల వీడు
పట్టుల సందేహపాటు తగదు.

తే.గీ. సైరికోత్తములార ! మీ క్షాత్రగుణము
హాలికోత్తములార ! మీ యర్థచయము
కర్షకోత్తములార ! మీ కర్మబుద్ధి
సంఘ సంస్కార సాధక చణత నొందు.

(భరత వాక్యము)

ఉ. ధారుణి వల్లభుండు భువి ధర్మము దప్పక సర్వ రాజ్య సం
భారము నిర్వహించుత యపార పరాక్రమ శౌర్యధుర్యులై
భారత మాతృ పుత్రకులు భాసిలుతన్, సుజనావళుల్ మహో
దారత దుష్ట సంస్కరణ తద్దయు జేయుచునుంద్రు గావుతన్.

సంపూర్ణము.



# పాత్రలు

రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు
సీత
ఊర్మిళ
వసిష్ఠుడు
వాల్మీకి
శూర్పణఖ
భద్రుడు
మందారిక
మధురిక
ద్వార పాలకుడు
పరిచారిక
మాండవ్యుడు
సానందుడు
ముని కుమారులు నలుగురు
కుశ లవులు
యజ్ఞదత్తుడు
సేనా నాయకుడు
విభీషణుడు
తాపసపురంధ్రి
రాజులు
ప్రజలు

# సీతావనవాసము

## నాంది

శ్రీ వైదేహియుఁ బుత్రకుల్ కుశలవుల్
సేవింప, సౌమిత్రి భ
క్త్యావేశమ్మున ఛత్రమెత్త, నిరుచా
యన్ నిల్చి వీచోపులన్
వైవంగా లవణారియున్ భరతుఁడున్
భద్రాసనాసీనుఁడై
యీ విశ్వంబును నేలు రాముఁడిడు మీ
కిష్టాయురారోగ్యముల్!

# ప్రథమాంకము

## ప్రథమ స్థలము : లంక

(శూర్పణఖ ప్రవేశము)

శూర్ప : ఆహా! కాల వైషమ్యము! దానవేశ్వరుఁడు పేరోలగంబుండు సభా మంటపమున సాలెపురువులు గూళు లల్లుచున్నవి. సకల సామంత మహీకాంతుల కైవారములకు మాఱు గుడ్లగూబల కర్ణకఠోరములగు, విరావములు వినవచ్చుచున్నవి. ఔరా, రాజధాని దుస్థితి!

*సురసిద్ధ సాధ్య కిన్నర యక్ష గంధర్వ*
*రాజులకును డాయరాని లంక!*
*పన్నగాశనపక్ష పరిభవ సంపాది*
*యంభోధి పరిఖయై యలరు లంక!*
*మేరుకోదండు దుర్వార శౌర్యంబైనఁ*
*గరగించు వీరులఁ గన్న లంక!*
*అభ్రంక షోత్తుంగ హర్మ్యగోపుర వైభ*
*వముల నాకము సిగ్గుపఱచు లంక!*
*ప్రళయ రుద్రార్క చండ విభ్రాజ తేజుఁ*

*డైన దశకంఠునకు రాజధాని లంక!*
*నేఁటి కెట్లాయె- నక్కటా! నేలమట్ట*
*మాయె దుష్ట దైవము మాకు దాయయౌట.*

ఔరా ! రాక్షసకుల వినాశము! సురేంద్రుని పరాభవించిన మేఘనాదుండు మడసె. అవార్య శౌర్యబలసాహసుండు కుంభకర్ణుండు కాల వశంవదుఁడయ్యె. మాల్యవదాది రాక్షస వీరనాయకులు శరతల్పము లలంకరించిరి. చతుర్దశభువన విద్రావణుండు రావణుండు పరాభూత భుజ వీర్యుండై రణక్రోడశాయి యయ్యె.

*కైలాసేశ్వరు వెండి కొండ వడఁకంగాఁ జేత నూఁగించి, ది*
*క్పాల శ్రేణికి నాజ్ఞవెట్టి, మునులం గారించి, నైలింప క*
*న్యాళిం దెచ్చి నవగ్రహంబులను గారాగారమం దుంచి శౌ*
*ర్యాలంబంబుగ రాజ్యమేలిన సురేంద్రారాతియుం గూలెఁగా!*

వీరవతంసులకు విరోధి సైన్యంబులఁ జీల్చి చెండాడి విజయలక్ష్మిని వరించుటయో లేక యాత్మోచిత మరణంబునొంది స్వర్గభోగాల సులగుటయో ధర్మముగాని, రాక్షసయోధులకు ఇంతటి యధఃపతనము తగునా!

*మరణము నైజమెల్లర, కమానుష దోర్బల సాహసాంకు లా*
*సుర నికరంబు,లట్టిరికి శూరులు వోయెడి త్రోవలెస్స గా*
*ని,రణమునన్ నరాశనుల నిశ్చల యోధవతంసులట్ల వా*
*నరులు నరుల్ జయించిరన నా కుదయించెడి లజ్జ పెల్లుగన్.*

దండకాటవి రాముఁడు నా ముక్కు, సెవులు గోయింపఁ, గినిసి రావణునిం బురికొల్పి సీతఁ జెరఁబెట్టించితిననియుఁ దన్మూలంబున రాక్షస కుల వినాశం బయ్యెననియు దైత్యాంగనలు నన్ను దూఱుచుందురు. ఆ యంగవైకల్య కథా విధానమొక వంకయు అసురకులవినాశ సంతాపవహ్ని వేఱొకవంకయు నాచిత్తము దరికొల్పుచున్నది. దైత్యకుల క్షయమునకు నేనా హేతుభూతురాలను? - కాను కాను ; ముమ్మాటికిం గాను. సురారికుల కలంకుడు ప్రతిపక్షభూషణుఁడు స్వపక్ష దూషణుఁడు ఆవిభీషణుఁడే కారకుఁడు. ఆ రాక్షసాధముడే నిజరాజ్యరహస్యములఁ బరుల కెఱింగించి కులాధఃపాతంబునకుఁ దోడ్పడియె. ఓరీ విభీషణా, నీయొక్కని యవివేకంబున దైతేయ సముదాయమున కంతటికి నాపదవాటిల్లెఁగదా. నీ మౌఢ్యమునఁ గదా లంకాపురలక్ష్మి భగ్నావశేషగోపురమిషంబునఁ జేతులు బారచాఁపి రణనిహత భర్తృకా విలాపంబుల వాపోవుచున్నది. ఛీ! ఆ దైత్యకులాంగారుని నామమేల స్మరించితివి? అట్టి పంద పవిత్రమగు మాకులమున జన్మించి వంశపారంపర్యాగత గౌరవంబు నేల

నేలపాలొనరించె?

అరిపాదంబులు పట్టి దాసు(డయి, దైత్యవ్రాతముం బోరిలో(
బరిమార్పించి, సహోదరాదులమృతిన్ భాగ్యంబుగా నెంచు ము
ష్కరు(డై నే(డు విభీషణాసురు(డు లంకా రాజ్యమేలంగ సి
గ్గఱి యిచ్చో నివసింప(గావలెనె యింక న్నీచపుం గూటికిన్?

వనంబున( గందమూలఫలాదులు లేవా యీ పాడు పొట్ట నించికొనుటకు? ఆ(డుదాన నయ్యు రాక్షసకులంబున దశకంఠునకు సోదరినై జనియింప లేదా? (ఉల్కిపడి యాకసమువంక(జూచి) ఆహా! రణనిహతులైన దైతేయవీరులు నాకన్నులకు( బొడకట్టుచున్నారు. పోటుగంటులనుండి దొరంగు ఒక్కొక రక్తపూరమును ఒక్కొక నాలుకగ ప్రతిహింసా పరాయణత్వము నుపదేశించుచున్నది.

మేఘనాదాది మహావీరులారా; నా ప్రతిజ్ఞ వినుడుః

మీరల్ రాక్షసవీరయోధులు బలామేయ ప్రభావైక దు
ర్వారుల్ పోరుల నే నరాంగనకునై స్వర్గం బధిష్ఠించి యు
న్నారో, యాధరణీ కుమారి యవమానం బొంది శోకార్తయై
ఘోరారణ్యము లందనాథయయి యెగ్గుంబొంద(గల్పించెదన్.

(ఆశ్చర్యముతో) ఏమిది! వారెంతలో అదృశ్యులైరి! ఇదియేమి మనోభ్రాంతియా? స్వప్నమా? లేక సత్యమై యుండునా? నన్ను( బ్రతిహింసకు(బురికొల్పుటకై పితృలోకవాసులు నాకు దర్శన మిచ్చియుందురు కా(బోలు!

రాముని మోసగించి తనచేతనే సీతను గాంతారముల ద్రోయించి ఆ నృపతి గోడు గోడని దుఃఖింప నేను పక పక నగ నిలింప లోకవాసులగు మా బంధుసందోహము, 'వహవా! శూర్పణఖా!' యని న న్నభినందించునప్పుడు గదా నా జన్మము కృతార్థమగుట! నే(డే నే నయోధ్యకుంబోయి పూర్వాలోచిత కల్పనాక్రమంబున సమయమువేచి పగతీర్చుకొనియెద!

(నిష్క్రమించును)

## ద్వితీయ స్థలము : వనము

(సీత, ఊర్మిళ విహరించుచుందురు)

సీత : గృహారామ పరిసరము అతిక్రమించి నిసర్గ రమణీయమగు నీ వనోపాంత దేశమునకు వచ్చితిమి.

ఊర్మి : అక్కా, చాల అలసితివని మున్నె హెచ్చరించితినిగద.

*కడప దిగలేని నిర్భర గర్భవతివి,*
*చారు సుమకోమలవు, ప్రయాసమునకోర్వ,*
*వెంత చెప్పిన వినక వనాంతరమున*
*కింత దవ్వేల నడువంగ నిగురుబోఁడి?*

సీత : వనాలోకన కుతూహలము నన్నింతదూర మెలయించినది

ఊర్మి : అత్తగా రీసాహసము వినిన -

సీత : ఏమీ?

ఊర్మి : మనల నిద్దఱను గోపింతురు.

సీత : ఆత్మవినోదార్థము ఇందుల విహరించుచుంటిమి.

ఊర్మి : అట్లయిన గమనాయాసము లేదా?

సీత : ఇపుడిపుడు దోఁచుచున్నది.

ఊర్మి : ఇఁక మరలుదమా?

సీత : ఇంచుక సేపీ వెన్నెల ఱాలతిన్నెపై విశ్రమించి యంతఃపురమున కేఁగుదము. చెల్లెలా, మార్గపరిశ్రాంతములగు నాయవయవముల కీ మందమారుత సుఖాశ్లేష మమృత లేపనమువలె నున్నది.

జిలిబిలి కమ్మదేనియల చిత్తడి జాఱుచుఁ, బుప్పొడిన్ వనీ
తలముల రాల్చుచుం, గుసుమ తల్పములంబొరలాడుచున్, ధునీ సలిల
తరంగ డోలికల సంతత మూఁగుచు, శీతలంపుఁ గౌఁ
గిళుల మదంగకంబుల సుఖింపఁగఁజేయు మరుత్కిశోరముల్.

ఊర్మిళా, గృహారామములకన్న ఈవనాంతరములు రమణీయ ములుగ నున్నవి.

*చాలుగ మార్గపార్శ్వ తరుశాఖలఁ బుష్పిత వన్యవల్లు లు*

య్యాలల పోలికం గదలియాడ, మయూరము లెక్కి కూయుచుం
గేళి జరించుచుండి తొనికింపఁగఁ దీవల నుండి క్రొంబువుల్
రాలిన నేలయంత నవరత్నమయంబుగఁ గాంతు లీనెడున్

ఊర్మి : అక్కా, పదునాలుగేఁడులు దండకారణ్యమున నివసించిన నీకు కృత్రిమారామ వాటిక లింపుగొలుపునా? అచ్చటి నిర్ఝరములు, అచ్చటి శకుంత సంతానములు, అచ్చటి వివిధ మృగవిహార సందర్శనములు ఇచ్చట లభించునా?

సీత : చెల్లెలా,దండకారణ్యమన్నంతనే నాయొడలెల్ల గగురెత్తుచున్నది.

దండకారణ్య వాసంబు దలఁచినంత
హర్ష శోకానుభవము పెల్లగ్గలించు,
వనవిహారము, తాపస జనుల మైత్రి
రాక్షస విరోధమట మాకుఁ బ్రాప్తమౌట.

ఊర్మి : అక్కా, గడచినది గదా యారణ్యవృత్తాంతము.

సీత : అయినను అందనుభవించిన సుఖదుఃఖావస్థలు మఱపునకు వచ్చునవియా? జనస్థానమునఁ బదునాలుగువేల కంచురథముల రక్కసులతో నసహాయ శూరుఁడయి పోరి, వారినుక్కడంచిన ఆర్యపుత్రుల శౌర్యమూర్తి నేఁడు దర్శించినటులఁ బొడకట్టుచున్నది.

ఖరదూషణాది దైత్యో
త్కరముల నురుమాడి,రుధిరధారల దొరఁగన్
శరజ క్షతములఁ గాంతుఁడు
వఱలెను కింశుకము బూతపట్టిన యటులన్

ఊర్మి : అక్కా, శూర్పణఖాపరిభవానంతరము గదా ఈ సమరము జరిగినది.

సీత : అవునవును! ఆ దానవి కడుమాయలమారి పిశాళి జంత

'నిను మ్రింగెద 'నని యసురాం
గన బాహువు లప్పళించి ఘన ఘోషమునన్
నను దరియరాఁగ నగ్రజు
పనుపున నీప్రియుఁడు దానిఁ బరిభవ పఱచెన్

ఊర్మి : ఆ రక్కసికి మంచి శాంతి పూజయే జరిగినది.

సీత : ఊర్మిళా, యాదైత్యాంగనయే గదా నాయపహృతికి మూలము!

ఊర్మి : (ఆశ్చర్యవిషాదములతో) ఏమీ! దాని యకార్యమా యది యంతయు?

సీత : చెల్లెలా, కాలము గానియపుడు అమృతము గూడ విషమగు చుండును. ఆ బంగారు జింక యెంతపని చేసినది?

కనకమయమైన హరిణంబు గఱికబయలఁ
గ్రేళ్లుదాఁటుచుఁ గొమ్ముల గీటుకొనుచుఁ
జిక్కిచిక్కక యల్లంతఁజేరి బెదరి
చూచు మురిపెంబు చిత్తంబు సొచ్చివిడదు.

అయ్యో! ఆర్యపుత్రా, యింతవఱకే నీసందర్శనము. సన్యాసివేషమున- హా! యిఁక నుడువఁజాలను, పవిత్ర చరిత్రుఁడగు లక్ష్మణకుమారుని నిర్హేతుకముగఁ దూలనాడిన ఫలము తత్ క్షణమే యనుభవించితిని.

ఊర్మి : అక్కా, యెందుకీ కర్ణకఠోరవృత్తాంతము ? (స్వగతము) నేనేల దండకారణ్య వృత్తాంతము నెత్తితిని?

సీత : నన్నారక్కసుని బారినుండి రక్షించుటకు నిజప్రాణ పరిత్యాగము గావించిన మహాత్ముఁడు పక్షిరాజు జటాయువు నా తలఁపునకు వచ్చుచున్నాఁడు.

సురరిపు బాణపాతములఁస్రుక్కియునెత్తురుగ్రక్కియున్ మహో
ద్ధుర గరుదంచ లానిల విధూత విమాను నొనర్చి రావణున్
ఖర నఖరాగ్ర కుంచికలఁ గండలు దొల్చుచు నెట్ట కేలకున్
దురమునఁ గూలె దుష్టవిధి దోడ్పడమిన్ ఖగవర్యుఁడక్కటా!

ఇదే యాశాభంగపరమావధి ! ఇదే దండకాంత్యదర్శనము! ప్రాణేశ్వరా, రక్షింపుము! రక్షింపుము! (మూర్ఛిల్లును)

ఊర్మి : (దుఃఖముతో) అయ్యో! యిఁక నేనేమి సేయుదును? అక్కా, అక్కా,

(రాముఁడు ప్రవేశించును)

రాము : (స్వగతము) ఎవతెదో స్త్రీకంఠస్వనముగ నున్నదీ దీనాలాపము?

ఊర్మిళ : ఓహో! బావగారిచ్చటకే వచ్చుచున్నారు. అక్కా!, యూరడిల్లు మూరడిల్లుము.

రాము : (డగ్గరి) ఇదియేమి యూర్మిళా, మీయక్క మూర్ఛిల్లి యున్నది? భయకారణమేమియుఁ గలుగదు గదా?

ఊర్మి : అరణ్యనివాసవిషయము స్మరించి మూర్ఛిల్లినది.

రాము : ఓసి బేలా! (కరస్పర్శగావించి) ప్రేయసీ, యూరడిల్లుము. గడచిపోయినది లెమ్ము వనవాసవిషయము.

సీత : (మెల్లగఁగనులు విప్పి) ప్రాణవల్లభా, రక్షింపఁబడితిని.

రాము : భ్రాంతినుండియా?

సీత : ఏమీ దండక గాదా యిది?

రాము : నీ మృదుల హృదయము నడుగుము.

సీత : (స్వగతము) స్వప్నమునందువలె నవస్థాంతరము పొందితిని. (ప్రకాశముగ) ఆర్యపుత్రుఁడు విహారమునకై యిచ్చటికే విచ్చేయనేల?

రాము : (చిఱునవ్వుతో) నేనడుగఁదలఁచిన ప్రశ్నను నీవే యడిగితివా? మఱి యెక్కడ విహరింతును? ధర్మాసనము వీడి యంతిపురంబున కేఁగితిని; అయ్యది ప్రియావిశూన్యమగుట హృదయాహ్లాద వస్తువు నన్వేషించుచు నింతదూరము వచ్చితిని.

సీత : అరణ్యావాసముతప్పినను అభ్యాసము వాసనారూపముగనున్నది కాఁబోలు!

రాము : (చిఱునవ్వుతో) కావుననే గర్భాలసవయ్యు వనముల వినోదించుట.

సీత : (సిగ్గుతో) ఆర్యపుత్రునకే ఋణపడితిని.

ఊర్మి : అక్కా, సంధ్యాపూజకుఁ గుసుమములు కోసికొనివచ్చెదను. (పువ్వుల బుట్టతో నిష్క్రమించును)

సీత : (స్వగతము) నామనోభీష్టము నెఱింగింతునా?

రాము : ప్రేయసీ, యేమొ తలపోయుచున్నట్లున్నావు.

సీత : ఏమియు లేదు

రాము : జానకీ,నీవు నా బహిః ప్రాణమవుగదా, మనకిద్దఱకు నన్యోన్య మెఱుంగ రాని రహస్యము లుండునా?

సీత : రహస్యముగాదు. నాకొక యభిలాషగలదు. భాగీరథీ పరిసరాటవుల నివసించు తాపస కన్యకల స్నేహానుబంధము నన్నీడ్చుచున్నది.

రాము : ఇందుకా యింత శంకించుచుంటివి?

సీత : ప్రాణవల్లభా,మునికన్యకలతోఁ, బ్రొద్దుపుచ్చుచుండిన యా దినములు నేనెట్లు మఱతును?

*గిరిసాను స్రుత నిర్ఝరీతటములం గ్రీడింపగాఁ బోయి, సాం*
*ధ్య రమారంజిత పశ్చిమాశఁ గల చిత్రంబుల్ విలోకించుచున్,*
*సరసాలాపము లాడికొంచు ఋషికన్యల్ నేను సంతోష ని*
*ర్భర చిత్తంబులఁ బుచ్చినట్టి దినముల్ భావంబుఁ బ్రేరించెడిన్.*

రాము : కాంతా,నిండుపున్నమనాఁటి రేయి నీవును ఆరణ్య బాలికలు గూడి యాడుచుండ-

సీత : చాలు చాలు ఆర్యపుత్రుని వినోదము!

రాము : *గాంగ పరిసర వల్లీ కుడుంగములను*
*దాపసాంగన లీవును దాఁగియాడ*
*నెవరెఱుంగక పొదరింట నేను సొచ్చి*
*సింహగర్జల మిమ్ముఁ వంచింపలేదె?*

సీత : ముగ్ధములైన తాపస కన్యకల బెదరుచూపులు ఆర్య పుత్రున కామెతలైనవి కాఁబోలు.

రాము : సీతా, యా దినములు మఱచినను మఱపురావు.

సీత : ప్రాణవల్లభా, ఆ వనప్రదేశములు మఱొక మాఱు దర్శించి వత్తము.

రాము : అటులనే పోవుదము లెమ్ము.

సీత : (స్వగతము) ధన్యను.

రాము : ఇఁక నంతఃపురమున కేఁగుదము.

*పశ్చిమాద్రికి డీకొని పగుల వాఱి*
*యర్కుఁడను నావ సాంధ్య రాగాబ్ధియందు*
*నల్లనల్లన మునుఁగంగ నాయుదంత*
*మవనిఁదెలుపంగ నరఁ బక్షు లఱచి పఱచు.*

సీత : ఊర్మిళా

ఊర్మి : ఇదిగో వచ్చుచున్నాను.

(అందఱు నిష్క్రమింతురు)

రామచంద్రుఁడు?

శత్రు : ఆ దుష్టరాక్షసుఁడు అర్ధనారీశ్వర వరప్రసాద మాత్రముననే యింత గర్వింప వలయునా?

*సీతాదేవి స్వయంవరంబున నృపశ్రేష్ఠుండు మాయన్న డా*
*చేతంబట్టిన శైవకార్ముకము విచ్ఛిన్నంబుగాఁ గూలదే!*
*భీతింజెందుదుమే త్రిశూల మనినన్? వేయేల? భూతేశ్వరున్*
*మాతోఁ బోరుకుఁదెచ్చిన న్విడతుమే మాంసాశనవ్రాతమున్.*

1వముని : రాజకుమారా, ఆత్మోచిత శూరాలాపము లాడితివి.

2వముని : మేము రక్షింపఁబడితిమి

3వముని : దీనరక్షామణీ, వర్ధిల్లుము.

రాము : మునులారా, భయపడవలదు.

4వముని : (మునులవంకఁదిరిగి) తాపసులారా, మహారాజు అభయ ప్రదానముచేసెను. ఇఁక భయపడకుఁడు

వసి : ధర్మము గౌరవింపఁబడినది.

2వముని : మహాప్రభూ రామభద్రా, ఆదుష్టరాక్షసుఁడు బ్రతికి యుండువఱకు మా నిత్యనైమిత్తిక కృత్యములు కొనసాగవు.

1వ ముని: దీనశరణ్యా, మాయాపద లేమని విన్నవింతుము?

*సవన యూప స్తంభ నివహంబు రోకళ్ళ*
*కని పెల్లగింప మాఱాడరాదు;*
*యాగభాగంబుల నర్పింపుఁడనికోర*
*నీకున్న యమపురి కేఁగవలయు;*
*పీచు గడ్డంబులు పెఱికి త్రాళులు పేన*
*వలెనన్న నెదిరింప వలనుపడదు;*
*తపసి కన్నెలఁబట్టి దయమాలి చెఱఁబెట్టఁ*
*గనులు కాయలుగాయఁ గాంచవలయు;*

*రాక్షసుల దుండగంబులు రాజసభలఁ*
*దెలుపునట్టివె? యటఁ జూడ వలయుఁగాని*

*రామభద్రుఁ డార్యావర్త రాజ్యమేలఁ*
*దాపసుల కిట్టి దుర్గతి దాపరించె.*

వసి : హరి హరి! యెంతటి మాట వినవలసె.

రాము : పాపము శాంతించుఁగాక

2వముని : మహారాజా, ఆ లవణాసురుని విజృంభణ మటుండనిచ్చి మానవ మాంసాభిలాషులగు ఆ దానవ సైనికుల యపలాప ప్రలాపంబులు విని విని మా చెవులు కాయలు గాచినవి.

*లవణుం డీ భువనత్రయీశ్వరుఁ డిఁ కేలాపల్కు? లింకొక్క మా*
*నవనాథుం బతియంచు వాకొనిన మీనాల్కల్ దెగంగోసి నె*
*త్రు వెదల్ చల్లెద మూరకాకులకు, నేరో మిమ్ము రక్షించు ధ*
*ర్మవిదుల్ దెండన నాశ్రయించితిమి రామా, మౌనికల్పద్రుమా.*

వసి : దానవసంహారమునకై యవతరించిన ధర్మస్వరూపునకు విధిగదా తాపస రక్షణము.

లక్ష్మ : మునీంద్రా, యూరపిచ్చుకపై బ్రహ్మాస్త్రము ప్రయోగింపవలయునా? ఆ యల్ప రాక్షసుని వధించుటకు దశకంఠ సంహారకుఁ డేఁగవలయునా?

సుగంధి - *ఒక్కరుండఁ జాలనే మహోగ్రవహ్ని కీలలం*
*గ్రక్కుబాణ సంచయంబు గాడనేసి వాని పే*
*రక్కుఁజీల్చి నెత్రుకండ లంతటన్ విదల్పఁగన్*
*దక్కు వారలేల యొక్క దానవున్ వధింపఁగన్?*

ముని : లక్ష్మణ కుమారా, భళి! భళి! ఇంద్రజిత్సంహారకునకుఁ దగినవే యీ వీరవాక్యములు!

శత్రు : అన్నా నిజప్రతాపమునేల యుజ్జగించుకొందువు? కుక్కనుగొట్ట బచ్చెన కోల కావలయునా?

*కాయల్గడ్డలు మెక్కు బక్కరుసులం గారించు దైతేయులన్*
*మా యింపన్ యశమౌనె? నీవలుగఁగా మాయావియౌ యింద్రజి*
*త్తో, యుద్ధంబునఁ గుంభకర్ణ ముఖదైత్యోత్తంసులో వార! లే*
*లాయీపూనికి? లక్ష్మణా, యసురఁ గూల్పన్ నన్నుఁబుత్తెంచుమా*

రాము : వత్సా శత్రుఘ్నా, నీ పలుకులు ముద్దులొలుకుచున్నవి. నీవే యాలవణాసురుని

వధియింపఁ బోయెదవులెమ్ము.

శత్రు : ప్రసాదము

మునులు: మహాప్రభూ, మా గుండెలు కుదుటఁ బడినవి

రాము : తాపసులారా, యిఁక మీ మునిపల్లెకుఁ బొండు.

1వ ముని: శ్రీరామచంద్ర, నీవే
యీ రాజ్యము నేలవయ్య యీతి రహితమై
ధారాళ సౌఖ్యములు చే
కూఱఁగ జనులెల్ల సతముఁ గుతుకము నొందన్

(యవనికజారును)

# తృతీయాంకము

## విష్కంభము - హజారపు ముంగిలి

(భద్రుఁడు ప్రవేశించును)

భద్రు : గూఢచర్యమెంత నిష్ఠురమైన యుద్యోగము! అప్రియమైనను సత్యమే పలుకవలయును. భూపతులు చారనేత్రులుగదా! ఏమి సేయుదును? ఎంతకాలము తెలుపక యూరకుందును? విశ్వసనీ యుఁడ నని గదా మహారాజు నన్నీ కార్యమున నియోగించెను? ఎన్నిమాఱులో పలుక యత్నించియు నాలుక యాడమి నూరకుంటిని? నేఁ జెప్పక దాఁచినను మఱి యే చారుఁడైనఁ దెలుపవచ్చును. కుండనుమూయ మూఁకుడు గలదుగాని, లోకమును మూయ మూఁకుడు గలదా ?

కటకటా ! యిట్టి యుద్యోగమునకా యింతకాలము జీవించియుంటిని? ఆత్మహత్య గావించుకొని యీ రహస్యము దాఁచియుంతునా ? (ఆలోచించి) ఎంత వెఱ్ఱివాడను. నే హత్య గావించుకొనిన మహారాజు విశ్వసనీయుడగు వృద్ధచారుని గోల్పోవుటగాక మఱి యేమి లభించును? కోమల స్వభావయగు జనక రాజకుమారి యీ యపవాదము విన్న బ్రతికి యుండఁగలదా?

ఆహా! లోకమెంత యవివేక పూరితము !

*అగ్ని కీలలఁ బరిశుద్ధ యైన తల్లిఁ,*
*బంక్తి రథునకుఁ గోడలిఁ, బరమసాధ్వి,*
*రాఘవుని పత్ని, సద్గుణ రత్నఖనిని*
*దూఱి రీలోకులు కళంక దూషితనుగ.*

(మందారిక ప్రవేశించును)

మందా : (స్వగతము) అంతఃపురమున నమ్మకమైన దాసిగనుండుట కన్న బావిలోపడి చచ్చుటమేలు. ఏపనికైనను మందారికయే పోయి చావ వలయును. ఆ పురోహితుఁడు ఎక్కడ బ్రాహ్మణార్థము చేయుచున్నాఁడో యెట్లు కనుగొందును,? వాఁడుగో ! భద్రుఁడు, దివాణము దిక్కునకే వచ్చుచున్నాఁడు. అతని నడిగినఁ

దెలియును. ఈ ముసలిభద్రుఁడు అంతఃపురమున తానొక్కడే విశ్వాసపాత్రుఁడని గర్వపడుచుండును. అతని కొకింత శివమెక్కించిపోయెదను. (మందారిక తొలఁగి తొలఁగిపోవుచుండును.)

భద్రుడు : ఎవరక్కడ?

మందా : (పలుకదు)

భద్రు : ఎవరది ? మందారికా, ఏమిపలుకవు ?

మందా : ఏమియాపదగలిగినది, ప్రాణము పోయేటట్లరుస్తున్నావు ?

భద్రు : ఓసి తొత్తుకూఁతురా, ఏమి తొలఁగి తొలఁగిపోవుచున్నావు ?

మందా : నీవంటి నవకోటి మన్మథాకారుని రాచుకొని పోవలయునా ? (పోవుచుండును)

భద్రు : మాటలలోనే దాఁటిపోవుచున్నావె ! ఇటురమ్ము. నీ యొడిలో నేమొదాచుకొని పోవుచున్నావు. ఏమైన దొంగిలించవు గదా ?

మందా : నీపనికి నీవు పొమ్ము. తక్కినపనితో నీకేమి సంబంధము ? దివాణమంతయు నీ మొగముపై నడచుచున్నదా ?

భద్రు : ఒసే బానిసకూఁతురా, మహారాజంతవాఁడు నన్ను పల్లెత్తుమాట యనరు. నీవా నన్ను తిరస్కరించుదానవు ? రామభద్రుని శైశవము నుండి నేను సేవకుఁడను సుమా.

మందా : అబ్బా ! అయోధ్యారాజ్యమును రక్షించితివి ! నీవు చచ్చిన రాజకుటుంబము పుట్టిమునుగును. (పోవ ప్రయత్నించును.)

భద్రు : ఓసీ మాయలాఁడి. (చేయిపట్టుకొని యొడి తడవును)

మందా : (చిఱునవ్వుతో) భద్రా, మనకిరువురికి పాణి గ్రహణమా ?

భద్రు : ఛీ!ఛీ! గయ్యాళి. (చేయి వదలును)

మందా : నీ రసికత్వము తెలిసిందిగాని, పురోహితుని యెక్కడనైన చూచినావా ?

భద్రు : ఎందుకు ?

మందా : నిన్నటి రాత్రి నాలుగోజామున దేవిగారు దుస్వప్నముగన్నారఁట. అందుకై శాంతిపూజ చేయించవలసిందని ఆజ్ఞ అయింది.

భద్రు : (ఆశ్చర్యముతో) దుస్స్వప్నమా ! ఔరా ! దుర్భిక్షమునకు ముందు ధూమ కేతువు.

మందా : (స్వగతము) ఈ ముసలి భద్రునకు ప్రతిదియు అమిత ముఖ్యముగ దోఁచుచుండును.

భద్రు : మందారికా, పురోహితుఁడెక్కడనున్నాఁడో నాకుఁ దెలియదు.

మందా : ఈ వానకా ఇన్ని ధమధమలు ? (నిష్క్రమించును.).

భద్రు : ఇఁక నాలసింపఁదగదు. సేవకు లస్వతంత్రులు గదా.

(యవనిక)



## ప్రథమ స్థలము : విశ్రాంతి భవనము.

(రాముఁ డాసీనుడైయుండఁగాఁ దెఱయెత్తఁబడును)

రాము : ఓరి, యెవఁడురా అక్కడ ?

ద్వార : మహా ప్రభో, దాసుఁడను.

రాము : ఓరీ, రాజ్యకార్యవిముక్తులమైన మా కించుకసేపు లోకవ్యవహార వినోదము గావింపవలయునని భద్రునకు మామాటగఁ దెలియఁజేయుము.

ద్వార : ఏలిన వారి ఆజ్ఞ. (నిష్క్రమించును)

భద్రు : రామభద్రా, జయము జయము !

రాము : భద్రా, విశేషము లేవియైనఁ గలవా ?

భద్రు : (నవ్వుచు) ఒక గొప్ప విశేషముగలదు. పాపదేవత మాత్రము మిమ్మెప్పుడు వేయినోళ్ళ దూషించుచుండును.

సకల భోగ భాగ్య సౌఖ్యములకుఁ బుణ్య
కార్యములకు నునికి గలదు రామ
రాజ్యమందు, నాకు రవయేనిఁ దలదాఁప
నీడ లేదటంచు నిత్య మగలు.

రాము : (చిరునవ్వుతో) ఓయీ, నీ ప్రియోక్తులు చాలింపుము. లోకులేమనుకొనుచున్నారు?

భద్రు : దేవర పవిత్ర చారిత్రము లోకమున కాదర్శప్రాయమైనది.

రాముడుఁ లోకరక్షకుఁ, డరాతిభయంకరుఁడుగ్రదైత్యదో
ష్ణేమహరుండు, దుష్టజన శిక్షకుఁ, డార్యజనావనుండు, స
త్యామల నీతికోవిదుఁ, డహంకృతిదూరుఁడటంచు సజ్జన
స్తోమము లాడుకోఁగఁ బరితోషముతో వినుచుందునెప్పుడున్.

రాము : భద్రా, యివి కేవలము స్తుతి వాక్యములు. లోపములేవి వాకొనరా లోకులు ?

భద్రు : (స్వగతము) హా ! మందభాగ్యుఁడను ఏమి తెల్పుదును ?

రాము : ఓయీ, యేలపలుకక యూరకున్నావు ?

భద్రు : (స్వగతము) ఇఁకఁ జెప్పకతప్పదు. (చెప్పఁబోయి యూరకుండును)

రాము : సంశయించెదవు ! (స్వగతము) ఈతనికేలొకో దుఃఖావేశము గల్గినది. పలుకజాలక స్తంభితుఁడై యున్నాఁడు.

తను వుద్గత ఘర్మంబుగఁ
గనుఁగొనలను బాష్పవారి కణములు జారన్
ముని పెదవులు చలియింపఁగ
మనమునఁ గల వనటఁ దెలుపుమాదిరిఁ దోఁచున్.

(ప్రకాశకముగ) ఓయీ, లోకుల కేమి యవాంతరము వాటిల్లదు గదా ?

భద్రు : (నిట్టూర్పుతో) అట్టిలోకుల కేల యవాంతరము గలుగును?

రాము : (ఆతురతో) ఎట్టిలోకులకు ?

భద్రు : బుద్ధిహీనులైన పురజను లాడెడు
పలుకు లెపుడు నమ్మ వలనుపడదు

రాము : (ఆతురతో) పౌరు లేమనుకొనుచున్నారు ?

భద్రు : అగ్ని శుద్ధియైన యమలచిత్తకుఁదప్పు
లంటఁగట్ట జంక, రళుకు వడరు.

రాము : (ఉద్వేగముతో) హా! ఏమి వినుచుంటిని. భద్రా, యేమంటివి ? జానకిని నిందించిరా లోకులు ?

భద్రు : జానపదులు నీరుదెచ్చుకొను బావికడ నొకపల్లెత యేమేమో యపవాదములు పలుకుచుండెను. నే నెట్లు చెప్పగలను ?

రాము : భద్రా, యళుకుపడవలదు.

భద్రు : రావణుఁడెత్తుకొనిపోయి తనయింట నుంచుకొనిన సీతను మరల రాముఁడు పరిగ్రహించెను ; కౌసల్యాదేవి యింటఁబెట్టికొనుటకు సందేహింపలేదు. కౌసల్యయే నేనైన కోడలినప్పుడే యిల్లు వెడలించి యుందునని యేమేమో యసంబద్ధము లాడుచుండెను.

రాము : ఔరా ! మందభాగ్యుఁడనగు నన్ను గుఱించి సాధ్వీమతల్లియగు కౌసల్యా దేవికింగూడ నిందాపాదనమా! అకటా ! వంచింపఁబడితిని. శైత్యమునకై శ్రీఖండతరువు నాశ్లేషించితిఁగాని, కోటర నిలీనయగు విషభుజంగినిఁ గాంచనైతి. ఛీ! దుష్ట హృదయమా, వహ్ని పరిశుద్ధయైన సీతను సైతము సంశయించు

చున్నావా?

భద్రు : రామభద్రా, యవివేకుల యాడికోలు పాటింపఁదగదు.

రాము : ఓయీ, సత్యము పలికితివి.

ఏ లలితాంగి సచ్చరిత మెల్లజగంబులఁ బాపవల్లికా
మూల ఖనిత్రమై భువనపూజ్యమునై నుతికెక్కె, నట్టి నా
పాలిటి భాగ్య లక్ష్మి యపవాదభరంబునఁ గ్రుంగునట్లు కాం
తాళముతోడ లోకు లనఁ దాలిమినొందునె చిత్త మిత్తఱిన్?

ఓ నిర్విచార ప్రపంచమా, నీకుఁ గాలావధి యయ్యెఁ గాఁబోలు

అనల పరిశుద్ధయైన పూతాత్మసీతఁ
దూలనాడిరి లోకులు దురితమతులు,
అగ్ని శిఖతోడ సయ్యాట లాడఁబోవు
శలభము లెఱుంగునే ప్రాణసంకటంబు ?

భద్రు : (స్వగతము) అయ్యో! యేమి యుత్పాతము లుప్పతిల్లనున్నవో ! (ప్రకాశముగ) మహాప్రభో, శాంతిల్లుము. దేవరయే కోపించిన నిఁక బ్రపంచమున కెవ్వని పాదతలము శరణ్యము ! ఆకాశమే కూలిపడిన నెత్తి పట్టువారలెవ్వరు .

రాము : (స్వగతము) కోపావేశమున సత్య మతిక్రమింపనుంటిని. (ప్రకాశముగా) భద్రా,సీత రావణాపహృతయైనదనుట సత్యము, లంకలో నివసించుటయు యథార్థమె. ఇంక లోకులేమి యన్యాయమాడిరి ?

భద్రు : ఇంతవఱకు నిజమాడిరి .

రాము : అవును. లోకము పాపశంకి.

భద్రు : ఇక్ష్వాకువంశము అపవాదాతీతము గదా.

రాము : (స్వగతము) హృదయమా, కార్య మెట్లు నిర్వర్తించెదవు ? ప్రియాంగనాశ్లేష సౌఖ్యము నపేక్షించి చిరకాలాగతమగు రఘువంశ కీర్తి కళంకితము సేయుదునా? సద్యశమును రక్షించుటకయి యర్ధాంగి నైనఁ బరిత్యజించెదవా? కఠినచిత్తమా, యేమి యుపదేశించుచున్నావు?

పెండ్లివేళఁ గాలి బొటనవ్రేలి నొక్కి
కంకణమనోజ్ఞమగు సీత కరముగొన్న

*ప్రియము విడనాడి నేఁడు గర్భిణిని సాధ్విఁ*
*గీర్తి కొఱకు వనంబున గెంట మనెదె ?*

(ప్రకాశముగ) భద్రా, నీవుపోయి లక్ష్మణునిటకు రమ్మనుము.

భద్రు : ఏలినవారి చిత్తము. (నిష్క్రమించును)

రాము : ఈయపవాదమును లక్ష్మణునకెట్లెఱింగింతును ?

(లక్ష్మణుఁడు ప్రవేశించును)

లక్ష్మ : (స్వగతము) అన్నగారేమొ దీనవదనులై విచారించుచున్నారు. (ప్రకాశముగ) అన్నా, లక్ష్మణుఁడు మ్రొక్కుచున్నాఁడు.

రాము : వత్సా లక్ష్మణా, రాముని జీవితము శూన్యమైనది. ఇఁక నీ వసుంధరా భారమును నీవ వహియింపుము. అందుకై నాకొక ప్రత్యుపకారము సేయుము.

లక్ష్మ : (ఆశ్చర్యముతో) ఏమి యీ వింత ?

రాము : లక్ష్మణా,

*ఈ కరవాలము గైకొని,*
*నా కంఠముఁ ద్రుంచుమీ*

లక్ష్మ : అమంగళము శాంతించుఁగాక !

రాము : *క్షణంబును రాముం*
*డీ కష్టలోకజీవన*
*శోకము సహియింపలేఁడు క్షుభితాత్ముండై.*

లక్ష్మ : అన్నా, అకాండముగ నీమనమేల యింత భ్రాంతిల్లినది ? ఏమి యాపద సంభవించదుగదా. నీ కఠోర వాక్యములు నా హృదయపుటము భేదించుచున్నవి. కాంతావియోగమునందైన నింతటి నిర్వేదముఁ బొందియెఱుఁగవు.

రాము : లక్ష్మణా, సీతావిరహము రామునిది మాత్రమే. కీర్తివియోగము ఇక్ష్వాకువంశ మంతటిది.

*చిరకాలార్జితమైన గౌరవ యశఃశ్రీ నేఁడు లోకాపవా*
*ద రజఃపంక కళంకితంబయి చెడెం ; దమ్ముండ, యింకేల యీ*
*ధరణీ రాజ్యము ? పూజ్యవంశగరిమన్ దైన్యాంబుధిన్ ముంచితిన్ ;*
*నరనాథుల్ నను గాంచినవ్వరె ? యిసీ! నాకేల యీ ప్రాణముల్ ?*

లక్ష్మ : అన్నా, నీ పలుకులు వింతఁగొలుపుచున్నవి. ఇక్ష్వాకువంశమా అపవాదపంకిల మగుట ? ఆశ్చర్యము !

నిప్పునకుఁ జెదలు పట్టునె ?
కప్పుర సిర మొలయునే వికారపుఁ దావిం ?
దప్పులు గలుగునె రఘుకుల
మొప్పును దేజంబు దొరఁగ నో రఘువీరా.

నీ మనం బిటుల శోక సంతప్తమగునటుల నపరాధ మొనర్చిన వారెవ్వరు?

రాము : రావణాపహృతయయి పునర్గృహీతయగు సీత.

లక్ష్మ : (నిర్విణ్ణుఁడయి) కటకటా ! యేల యిట్టి సంశయోక్తులాడెదరు?

రాము : సంశయోక్తులు లోకులవి.

లక్ష్మ : (కోపముతో) ఏమీ ? లోకులు దూషించిరా పతివ్రతాశిరోమణిని?

తెలియరా!ధారుణీతనయ, తెంపరిమూకల యాడికోలుకున్
వెలుపటి సత్యతేజమని, వీరలవారల పోల్కిఁ గండ క్రొ
వ్వొలయఁ బవిత్రవర్తనను నొప్పని కారులు ప్రేలినట్టి లో
కులను నుపేక్షసేఁత మనకు న్నరపాలురకైన ధర్మమే ?

అన్నా, లోకులు మందబుద్ధులు; గతానుగతికులు ; సత్యాసత్య వివేకశూన్యులు

రాము : అవును; అగుదురు.

లక్ష్మ : అట్లయిన వారి యపలాపప్రలాపములా మనకుఁ బ్రమాణములు?

జనులపవాదముల్ పలుకఁ జాలుదురంచుఁదలంచి, లంకలో
ననల విశుద్ధయౌటకు నిలాత్మజ మీ రడుగంగ నెమ్మనం
బున నళుకింతలేక నగుమోమునఁ జొచ్చె హుతాశనార్చులన్
జనకజ నిష్కళంకయని సన్నుతియింప నిలింపసంతతుల్.

రాము : వత్సా, నాకన్నులను నేనే విశ్వసింపక పోవుదునా?

నమ్మెడివాఁడఁగాను లలనామణి జానకి సంశయింప న్యా
యమ్మని, యైన లోకులు నయమ్మెడఁ బాసి వివేక శూన్యులై
యిమ్మలినాపవాద ముదయింపఁగఁ జేసిరి ! దూఱువాప నిం
ద్యమ్మొ యధర్మమో విధియొ తమ్ముఁడ, నీవెతలంపు మీయెడన్

లక్ష్మ : ఇఁక మూఢాత్ములే ధర్మసాక్షులా ?

రాము : లక్ష్మణా,

మూఢచిత్తులైన, బుద్ధిమంతులె యైనఁ
బ్రజల రంజనంబు పాలనంబు ;
సత్య బాహ్యమైన, సమ్మతిగానున్న
వారి ననుసరింప వలయు నృపతి.

లోకు లభినందింపని రాజ్యపాలనము నిరర్థకము.

నన్నైన సీతనైనను,
నిన్నైనను రాజ్యమైన నేవిడతును లో
కోన్నత కులకీర్తికి నా
పన్నత వాటిల్లెనేనిఁ బలుకులిఁకేలా ?

వత్సా, యేల వితర్కము ? కార్యము నిశ్చయింపఁబడినది.

లక్ష్మ : (ఆతురముతో) ఎటులు ?

రాము : ఇటురమ్ము (మెల్లగా) సీతను ఋష్యాశ్రమమున వదలి రావలయు.

లక్ష్మ : (చకితుఁడై) అకటా ! యేమివింటిని ? కానలకుఁ బంపుటయా ? అన్నా చిత్తచాంచల్యమునఁ బలుకవుగదా ?

రాము : నిండుచూలాలి జానకి నెనరులేక
కాననంబులకంపింపఁ గడఁగువీని
కెక్కడిది చిత్తచాంచల్య ? మేటికరుణ ?
యేన క్రూరుండఁ బల్కితి నిట్టిమాట.

లక్ష్మ : అన్నా, అతి కఠోరశాసనము.

రాము : లోకమును సంతోషపెట్టవలయు.

లక్ష్మ : లోకమున సజ్జనులు లేరా ?

రాము : తమ్ముఁడా, సజ్జనుల కత్తిపోటులకన్నను దుర్జనుల నాలుక పోటు లతి క్రూరములు.

లక్ష్మ : అన్నా, అపూర్వ మీఘోరశిక్ష.

రాము : ఇక్ష్వాకువంశకీర్తి దిగంతవిశ్రాంతము. ఈయపవాదము తూలరాశిం బడిన

యగ్నికణమువలె సకల దిక్కులకు వ్యాపించును.

లక్ష్మ : మీకు ధర్మము నుపదేశించునంతటి కోవిదుఁడనా ?

రాము : ఉపదేశించియు నిరుపయోగము.

లక్ష్మ : (స్వగతము) అయ్యో ! యిఁక నేనేమి సేయుదును ? (ప్రకాశముగా) అన్నా, దేవి ఆపన్నసత్వ.

రాము : ఈక్రూరాత్ముని చిత్తము పాషాణసదృశము.

లక్ష్మ : వెనుక చింతించియు - (అర్ధోక్తియందె)

రాము : లక్ష్మణా, కర్మఫలానుభవ మెవ్వరికిందప్పదు. కార్యము నిశ్చితము. ఆజ్ఞను పాలింపుము.

లక్ష్మ : (స్వగతము) వినయముచే నిరుత్తరుఁడనైతి (ప్రకాశము) మీ యిష్టానుసారము ప్రవర్తించెదను.

రాము : దండకారణ్య నివాసినులగు తాపసబాలికల దర్శింప సీత యభిలషించినది. నేఁడే ప్రయాణము సాగింపవలయు.

లక్ష్మ : (దుఃఖముతో) అన్నా ! మఱియొక్క మాఱ -

రాము : లక్ష్మణా, యిఁక మాఱాడిన నాయానగలదు. అగ్రజుని పనుపు సేయుము. పొమ్ము.

లక్ష్మ : (స్వగతము) ఎఱిఁగి యెఱిఁగి నేనీ ఘోరకృత్య మెట్లొనరింతును? హా! పాపపుదైవమా నీకెంత నెనరులేకపోయె. (నిష్క్రమించును.)

రాము : (దుఃఖముతో) ఔరా! యెంతటి కాఠిన్య మారోపించుకొన్నను శోక భారమున నా చిత్తము క్రుంగుచునే యున్నది. పత్నీ విరక్తుఁడనగుటయే గాక యనుజ తిరస్కారియుంగావలసె.

జానకి లేక రామునికి నునికిగలదా ? కఠిన హృదయమా, నీకార్యము నిర్వర్తించితివి. ఇఁక రాముని సంసార మసారమైనది.

హా! వనవాసప్రియసఖీ జానకీ, నిన్నుఁ గానలకంపి నేనెట్లు బ్రతికి యుందును? పదునాలుగేడులు ఘోరకాంతారముల నివసించియు నీవు నన్నుఁ గూడియుండుటఁగదా యాపదలెల్ల సౌఖ్యములు గను, అరణ్యమే యయోధ్యగను

జూపట్టినది. నీవు దైత్యాపహృతవైనప్పుడు గదా నాకు యథార్థమైన యరణ్య నివాసము.

ప్రాణప్రియా, యీ క్రూరాత్ముని యుపభోగ్య హారవల్లికయని గ్రహించితివి; విషవ్యాళమై కఱవనున్నాఁడు.

*దేహముననుండి హృదయమ్ముఁ దీసివైవ*
*హృదయ దేహమ్ము లెడమౌట బ్రతుకఁ గలవె ?*
*నాదు నర్ధాంగి సీత ననాదరమునఁ*
*గాన కంప మా యిద్దఱి గతులిఁకేమొ !*

జానకియందు లోకమేగాదు అపరాధి ; ఈ కారుణ్య రహితుఁడు రాముఁడుకూడ!

*ప్రియుఁడటంచును, సౌందర్యమయుఁడటంచు,*
*ధీరుఁడనుచును, త్రైలోక్య వీరుఁడనుచు*
*నెవని నమ్మి కరాంబుజ మిచ్చినావొ*
*ఆ కులాంతకుడే కానకంపు నిన్ను.*

సీతా, మదేక జీవితా, నేను జీవించియు నీ వనాధవైతివా ? (దుఃఖించును.)

(యవనిక జాఱును)



## ద్వితీయ స్థలము : సీతపడకటిల్లు

(సీత నిద్రించుచుండును; రాముఁడు ప్రవేశించును)

రాము : అకటా ! కఠోరచిత్తమా, నీవేల మెత్తందన మూనితివి ? నన్నేల యర్ధరాత్రమున నీయంతఃపురమునకుఁ గొనితెచ్చితివి ? నీయందనురాగ మిసుమంతయైనఁ గలదా ? అట్లయిన లక్ష్మణుని మృదుమధురములగు అనునయాలాపములు నీ వజ్ర సదృశమగు కవచము నేల భేదింపలేక పోవును?

*జననంబాది నిశాత శస్త్ర విదళ చ్ఛత్రూత్తమాంగ స్రవ*
*ద్ఘన రక్త ప్రహదమందుఁ జేతులను సంక్షాళించు నీ రామభ*
*ద్రుని చిత్తంబవు ! నీకు నెక్కడిది కారుణ్యంబు? కాకున్నఁ గా*
*ననముంజేర్పఁగ నియ్యకొందువె సతిన్ సంపూర్ణ గర్భాలసన్ ?*

ఇదే జానకీ శయనాగారము. ఈ మందిర మనుదిన పరిచితమయ్యు మనోలౌల్యము వలన నూతన నివేశమువలె నగపడుచున్నది.

అంతఃపురమంతయుఁ బ్రశాంతమై నిద్రానిబద్ధమై నిశ్చలమై యలరారు చున్నది. అచ్చటచ్చట మధుపానమత్తలై నిదురించు పరిచారికల యుచ్ఛ్వాస నిశ్వాసముల యలుకుడుదప్ప నొక్కచీమయైనను నిశాప్రశాంతమునకు భంగము గావింపదు. లోక మంతయు నిద్రానందపరవశమై యున్నను రాముఁడు మాత్రము శోకాకులుఁడై దొంగవలె ప్రసుప్తయగు సీతాలతాంగి శయనాగారముఁ జొచ్చుచున్నాడు.

(పరిచారిక కలవరించును)

ఏమది ? పరిచారిక లెవ్వరైన మేల్కనిరా ? కాదు. ఎవతెయో కలవరించినది. నా జీవితేశ్వరి యెక్కడ నిద్రించుచున్నది ? ఆ అదిగో ! హంసతూలికా తల్పమున

*కన్నుల సత్తపఃఫలము కాయము నొందెనొ! యంబుదంబులం*
*జెన్నొలికించు మించటకుఁ జేరెనొ ! కల్పలతా కుడుంగ మం*
*దున్నెఱపూల పాన్పుపయిఁదూఁగు నిలింపలతాంగి యేమొ! కా*
*ది న్నునబోణి నాదు హృదయేశ్వరి జానకియే నిజంబుగన్ !*

ఆహా? యేమి యీ యమాయిక వదనబింబమునఁ దాండ వించులావణ్యము!

*అలకా క్రాంత లలాటసీమను గవాక్షాయాత చంద్రాంశుమా*
*లలు కర్పూరపు నిగ్గులం జిలుకఁ దల్పంబందు నిద్రించు నీ*

లలనారత్నము సీత, యైందవ శిలా లావణ్య సారంబు ప్రో
జ్జ్వల కాంతాకృతి నొందెనో యనఁగ నాభావంబు రంజించెడిన్ !

కరచరణాద్యవయవ శోభితమగు నాహృదయమే యిది. (ముద్దిడబోయి వారించుకొని) ఛీ! నెనెవ్వఁడ నీ నారీమణి నంటుటకు?

రాముఁడను గానొ ? నిద్రించు రామసీత
గాదొ ? నేనేల ముద్దిడరాదొ ?

నన్ను నేనే శూన్యుఁడనుగఁ దలంచుకొనుచున్నాను. ఏమి యిది స్వప్నమా ?

. . . . . . . కంటి

అకట ! దారుణసత్యంబు; అవనిజాత
రామ హృదయంబుగాదింక, రమణి యెవతొ ?

మదేక జీవితా, సీతా, గృహేందిరా, హృదయేశ్వరీ, అని మధురముగ సంబోధించు నా నాలుక నేటి కిట్టి కఠినాలాపము లాడవలసెఁగదా !

ఏకన్య పాణి నందీయ శతానందుఁ
డంగంబు పులకింప నందికొంటి ;
ఏ వనబోణి నే నేఁగుదెంచఁగఁ దానె
ఘోరాటవులకు న న్గూడివచ్చె ;
ఏ సాధ్వి దనుజాపహృతయయ్యు నేక వే
ణీవ్రతంబున సతీనియతి గడపె ;
ఏ మోహనాంగిని నెడఁబాయ నాకు లో
కము శూన్యమగునట్టి విమల హృదయ ;

అంబుజేక్షణ,రాకా శశాంక వదన,
యజన భూజాత, పూత విఖ్యాత సీత
పాపకర్ముని కీర్తినాఁ బాసిపోవు ;
రామభద్రున కింక దుర్భరము బ్రతుకు !

జానకీ, నా హృదయమును దొంగిలించుకొని పోవుదువా ? ఈ రామునకు హృదయ మొకటికలదా ? కలిగిన బంగారు బొమ్మను, ఈ ముద్దుల మూటను వన్యమృగములకు బలియీయనెంచునా ? కాంతామణీ, ఈ లోకమున నిన్నుఁ గాంచుటకిదియే కడసారియా ?

ఆశా కుసుమంబున కీ సందర్శన మే వృంతచ్యుతియా ?

లలనామణీ, నిరపరాధిని వగు నిన్నుఁగాన పాలుసేయనున్న ఈ కఠినాత్ముని మీ యిలువేల్పులైనఁ గోపింపరేల ? పితృలోక వాసులగు నో రఘుకులేశ్వరులారా! నన్నేల మీరు శపింపరు ? నిలింపులారా, మీ సమక్షమునఁ గదా సీత యగ్ని పరిశుద్ధయైనది. అట్టి మిమ్ములనైన గౌరవింపక కులకాంతను అడవులకు వెడలించు ఈ నిర్దయుని ఏల సహించుచున్నారు. ప్రకృతీ! నీవేల తామసించితివి ?

నిర్భర ప్రళయాబ్ద గర్భసంభూతమై
కులిశోత్కరంబు నన్గూల్పదేమొ !
ఝుంఝూనిలోద్వేల సాగర కల్లోల
ములు పొంగిపొరలి నన్ముంప వేమొ !
పెటపెటార్భటితోడఁ బెటిలి యీ కుతలంబు
అతలంబునకు నన్ను నడపదేమొ !
క్షణకాలభగ్నమై స్తంభావలంబంబు
సౌధంబు గూలి నం జదుపదేమొ !

రాముఁడే లేకయున్న నీరాజవదన
యఖిల సౌఖ్యాభిరామయై యలరకున్నె ?
శోక ఘూర్ణితమయ్యును సొక్కుగాని
యెంత కఠినంబొ పగులదీ హృదయమకట !

సీత : (నిదురలో) ఆర్యపుత్రా, నన్ను మఱచితివా ?

రాము : సీత మేల్కనినదా ? (చూచి) కాదు కాదు. కలవరించుచున్నది. ఆహా! ప్రణయోత్కర్షము. ఈ లతాంగి నిద్రయందైనను నన్నే తలపోయుచున్నది.

హృదయేశ్వరీ, క్రూరసర్పము అమృతమయఫలంబు నంటు రీతి ఈ నిర్దయుడు కడసారి ముద్దుగొనుచున్నాఁడు.

సీత : (మేల్కొనఁబోవును)

రాము : జానకి మేల్కొనుచున్నది. ఇఁక నిటనుండఁదగదు. వీడి పోవఁగాళ్ళురాకయున్నవి. ప్రేయసీ, యిదే కడసారి సందర్శనము.

(నిష్క్రమించును.)

సీత : (మేల్కొని) ఆర్యపుత్రుని కంఠస్వరమువలె నెద్దియో అవ్యక్తగంభీర ధ్వని నాకు వినఁబడినట్లు తోఁచినది. (కలయంజూచి) ఇచ్చట ఎవ్వరును లేరు. కలగని మేల్కొంటిని గాఁబోలు ! కను ఱెప్పలు నిద్రమాంద్యమునఁగూరికొని పోవుచున్నవి. (నిద్రించును)

(యవనిక జాఱును)



# చతుర్థాంకము

## విష్కంభము

(మధురిక అటుతర్వాత ఒక నిమిషమునకు మందారిక ప్రవేశింతురు)

మధురి : ఇదిగో ! అంతఃపురపరిచారిక వస్తూవున్నది. దీని నడిగిన సమాచారమంతా తెలియును. ఒసే మందారికా, తలవంచుకొని యెక్కడికే బిరబిర పోతున్నావు ?

మందా : ఓహో ! మధురికా

మధు : నీవు రాణిగారితో కూడా మునికన్నెల చూడడానికి పోలేదా ?

మందా : ఆ - నాపని పోయినట్లే వుంది.

మధు : ఏమే గొంతుకు వురివేసుకో బొయ్యేదానివలె మాట్లాడుతున్నావు? అంతఃపురంలో నీకేమైనా చీవాట్లు తగిలినవా ?

మందా : కాదే పిచ్చిదానా, మాహారాజుగారివొల్లు జబ్బుసంగతి నీకు తెలియలేదా ?

మధు : ఏమో చూచాయగా విన్నాను. ఇప్పుడేమైన నెమ్మదిగా వున్నదా?

మందా : మధురికా, యేలిన వారికి జ్వరతమందము గలిగిందని రాజవైద్యుగులు చెప్పుకొనుచుండగా నేను రహస్యముగ విన్నాను. దేవిగారిని గుఱించి యేమేమొ కలువరిస్తున్నాడట మహారాజు ! రాజకులమంతా హల్లకల్లోలంగా వుంది.

మధు : అయ్యో పాపము ! యీ సంగతి రాణి గారికి తెలిసివుంటే మునికన్నెల చూడడానికి పొయ్యేవుండదు.

మందా : దేవిగారు బయలుదేరిన వెనుకనే ప్రెభువు గారికి జన్నిపట్టినదంట.

మధు : అయ్యో ! నీ వొక్కమారైనా దరిశింపలేదా యేలినవారిని.

మందా : వైద్యుగుల వుత్తరవులేనిదే రాజబందుగులు గూడ అక్కడికి పోగూడదని భద్రుఁడు చెప్పినాఁడు.

(నేపథ్యమున)

ఒసే మందారికా, నీవింకా యిక్కడనే పెత్తనము చేయుచున్నావా ?

మందా : వాడుగో ! భద్రుఁడు అరుస్తున్నాఁడు. తొందరగా పోవలెను. ఆ ముసిలి కట్టెతో నా కత్తకోటరికమైనది. (పోఁబోవును)

మధు : మందారికా, యిట్లెక్కడికి పోతున్నావు ?

మందా : నవగ్రహదానా లియ్యడానికి కొట్టిడీనుండి నవధాన్యాలు తెమ్మని పురోహితుఁడు పంపించితే పోతున్నాను.

మధు : సరేపొమ్ము, సాయింత్రం అక్కడికి వస్తాను.

(ఇరువురు నిష్క్రమింతురు)



## ప్రథమ స్థలము : అడవి.

(సీత చెట్టుమొదట నిద్రించుచుండును - లక్ష్మణుఁడు ప్రక్కన నిలుచుండి యుండును)

లక్ష్మ : అడుగో ! శుక్రభగవానుఁడుదయింపనున్నాఁడు. (ఆలకించి) ఆహా ! శకుంతసంతానముల కలకల నినాదములు సమీర సమ్మిళితములై వీనులకు విందొనరించుచున్నవి !

*అనిలోచ్చాలిత పర్ణమర్మర రవవ్యాప్తిన్ సుఖ స్వప్న బం*
*ధనము ల్వాయఁగ నుల్కి లేచి ఖగసంతానంబు నీడంబులన్*
*ఘనరావంబొనరింప యామవతి యాజ్ఞం గాలముండెల్లఁగో*
*యని చాటించెడు కాలమాపకుని కంఠారావమో నాఁదగున్.*

(సీతంగని) ఔరా! మానవుల కెంతటికష్టములైనను అనుభవించుకొలఁది సాధారణమగుచుండును. లేకయున్న అంతఃపుర నివాసయోగ్యయగు ఈ సుకుమారి యెక్కడ ? ఘోరమృగ భయంకరమయి కఠిన శిలాకంటక భూయిష్ఠమగు ఈ కాంతార తలమున నిదురించుట యెక్కడ ?

*లవలీపల్లవ కోమలంబులగు నీలావణ్యవత్యంగముల్*
*దవులం గావలసెం గఠోరధరణీ తల్పంబునన్ ; రామ బా*
*హువు దిండై సుఖనిద్రనొందఁదగు నీ యోషిల్లలామంబు దా*
*రువుఖండం బుపధానముం జలిపి గూర్కుం బూవుముండ్లంబలెన్*

మానవ జీవితము సుఖదుఃఖ పరిపూరితమయ్యును గర్మఫలాను భవమందు వ్యత్యాసము గనుపట్టుచుండును. అకటా ! మాకుటుంబమంతయు నెడతెగని శోకదవానలంబున మ్రగ్గుటకే జన్మించెనా ? ఒక్కరి నొసటనైనను మంచి వ్రాఁత వ్రాయఁడా ఆ విధాత ?

*వనవాసంబుగతించె, దానవుల దుర్వ్యాపారముల్మాసె, భా*
*మినిచేకూఱె, ధరాధిరాజ్యవిభవామేయానుభావంబునన్*
*మనమింపార సుఖంబులొందు చెటులో మాకాలముంబుచ్చనౌ*
*నని యోచింప నిటాయెఁ; జిత్రము లహో ! యా దైవనిర్దేశముల్ !*

తల్లీ విదేహ రాజనందనీ, ఘోరదవానలజ్వాలలు తరుకోటరమున కంటు కొనుచుండ నేమియుండెలియక సుఖనిద్రా పరవశయైయున్న శారికా కుమారివలె శయనించియున్నావా ?

రామచంద్రా, యిట్టి ముగ్ధ హృదయను ఇట్టి లోక పావన చరిత్రను నీవెట్లు విడనాడ సాహసించితివి ? ఎంత వేడికొన్నను వినవైతివే ! అకటా ! యీ పాపకార్యమొనరింప అగ్రజుఁడు నన్నే నియోగింపవలయునా ?

పదునాలుగేండ్లు వనముల
నొదవిన కష్టముల కోర్చి యున్నాఁడు దయా
స్పదచిత్తుఁడు గాఁడని యా
సదయుఁడు నన్నీ యఘంబు సలుపఁబనిచెనో !

కాకున్న నిట్టి నింద్యోద్యోగమున నన్నేల నియమించును ? కులిశాఘాత ప్రాయమగు రామసందేశము నీ కుసుమకోమల కెట్లెఱింగింతును? ఎట్లెఱింగింపక యూరకుందును ? ఒక వంక నలంఘ్యమగు నగ్రజుని యాజ్ఞ - వే ఱొక వంక మృదులమగు మానుషస్వభావము - నా యంత రాత్మను బీడించుచున్నవి.

సీత : (మేల్కొని) మందారికా, (కలయంజూచి) ఓహో ! అంతఃపుర మనుకొంటిని. వత్సా, అరుణోదయ మయినట్లున్నది.

*వనవృక్షచ్ఛదసంచయాంతరములన్ వ్యాపించి సూర్యాంశు కాం*
*చన కాంతుల్ పరికీర్ణ నిష్కముల యోజన్ నేల బింబింప భా*
*నుని భీతిం దిమిరంబు తారకల సందోహంబుతో వచ్చి కా*
*నన పాదంబుల నాశ్రయించె నన నానందంబు సంధించెడిన్.*

లక్ష్మణా

లక్ష్మ : (ఆలోచించుచుఁ బలుకడు)

సీత : (స్వగతము) నిన్నసాయంకాలమున నేఁ బిలిచినను దెలిసికొనక లక్ష్మణుఁడేదియో యోచించుచుండెను. ఇప్పుడు సైతము అన్యాయత్తచిత్తుఁడై చింతించుచున్నాఁడు. (ప్రకాశముగ) అన్నా, లక్ష్మణా.

లక్ష్మ : అమ్మా, యేమంటివి ?

సీత : నిన్నటినుండియు నీవేలొకో దీర్ఘచింతానిమగ్నుఁడవై యున్నాఁడవు. నీ మోము చూడ దైన్య మొలుకుచున్నది.

లక్ష్మ : విశేషమేమియులేదు. ఈ వనమనోహరత్వమును దలపోయు చుంటిని.

సీత : (స్వగతము) అదియేమొ నామనమున నూహింపరాని సంశయము వొడముచున్నది. (ప్రకాశముగ) లక్ష్మణా, నిన్నటి దినమున మనము గంగానదిని

తరియించితిమి గదా, ఇఁక ఋష్యాశ్రమముల కెంతదూర మేఁగవలయును ? వత్సా చూచితివా ఆ లేటికొదమను,

లక్ష్మ : ఎక్కడ?

సీత : (నిరూపించి)

ఆశ్రమకురంగ మల్లదే ! యఱుతఁ బూల
మాల వ్రేలాడ సెలయేళ్ళ కూలములను
గప్పురము లట్లు నురుగులు గాఱుచుండ
మిసిమి పచ్చిక జొంపంబు మేయుఁ గనుము !

లక్ష్మ : అమ్మా, ఈవన సౌభాగ్యముఁ దిలకించుకొలఁది యీ ప్రాంతములు తాపస నిలయములుగఁ దోఁచుచున్నవి.

నవహోమోద్గత ధూమధూమ్రములు పర్ణంబుల్ ధరాజంబులన్
బువుగుత్తుల్ మునిబాలికాపచితముల్ పూజార్థ, మిక్కానలో
సవనాజ్యామల సౌరభంబులొలుకున్ సర్వంబు, వేయేల ? మౌ
ని వరుల్ కాఁపురముండు చిహ్నములు రాణించున్ విశేషంబుగన్

సీత : వత్సా, మనము పోవలసిన తపోవన మెంతదూరముననున్నది ?

లక్ష్మ : ఈ భాగీరథీ పరిసరారణ్యముననే కొంత దవ్వేఁగవలయు

సీత : అటులైన నేనిఁక నడవఁజాలను. ప్రొద్దుటినుండియు నేదో మనోవికారము ననుఁ గలఁచుచున్నది. రాత్రియంతయు నిదుర పట్టియుఁ బట్టక యుండుట వలన అవయవముల బడలిక యింకను దీఱదు. అదియుంగాక సూర్యతాపము హెచ్చుచున్నది. కొంతసేపీ శీతల తరుచ్ఛాయల సేదదీర్చి కొని మెల్లగఁ బోవుదము.

లక్ష్మ : అటులనే విశ్రమింపుము. దప్పిగొనియున్న - (అర్థోక్తియందె)

సీత : లక్ష్మణా, నాకేమియుం బనిలేదు. ఈ మనోహరారణ్యవాటికఁ గాంచినంతనే నామన మానందపులకితమైనది. ఆహా ! నా జీవిత కాలమంతయు నిచ్చోటనే గడపఁగలిగిన--

లక్ష్మ : (స్వగతము) హతవిధీ, ముందుగనే పలికించుచున్నావా ?

సీత : సరసఫలావనమ్ర తరుజాలము తియ్యని పండ్లనిచ్చు ; నిర్
ఝరములు నిర్మలాంబులిడుఁ ? జల్లనినీడలొసంగుఁ బూఁబొదల్;

మరుతము పుష్పసౌరభ సమంచితమై గమనప్రయాస ని
ష్ఠురతఁ దొలంచు ; మృత్యువిటఁ జొప్పడినంబ్రియమౌనులక్ష్మణా !

అహా ! ముందటిజన్మమున నేనేమి నోములునోచి ఆర్యపుత్రునివంటి యనుకూలపతిని గాంచితినో గదా. ఆ సరసుఁడు నామనోభీష్టమును అనుసరింపకున్న నాకీ ప్రకృతి రామణీయకము దర్శించుభాగ్య మబ్బియుండునా?

లక్ష్మ : (స్వగతము) అయ్యో ! అమాయికా ! (కన్నీరునించును)

సీత : (చకితయై) అన్నా లక్ష్మణా, నీవేల కన్నీరునించుచున్నావు ? నిన్నటినుండియు నీ చర్యలన్నియు శంకావహములుగ నున్నవి. ఊరక నిట్టూర్చుచుందువు. ఆలోచించుచుందువు. దీనవదనుఁడవై నేలచూచుచు నీలోన నీవే మాటాడికొందువు. హృదయము నొగిలించు శోకభారమున నీమోమునఁ దొలకాడుచున్నట్లున్నది. వత్సా, అందఱకు సేమమే గదా, నీవేల పలుకవు ?

ప్రేమ మయుండు నావిభుఁడు, వీరకులా భరణుండు, సద్గుణ
స్తోముఁడు, శౌర్యధాముఁడు యశోధవళీకృత దిక్తలుండు, స
త్యామల వర్తనుండు, కరుణామృత సాగరుఁడా యయోధ్యలో
నేమియు నాపదంబొరయ కే సుఖ మొందుచు నున్నవాఁడొకో ?

లక్ష్మ : అన్నగారు సుఖముగనే యున్నారు.

సీత : లక్ష్మణా నా మనమునఁ దెలుపనలవిగాని యనుమాన ముప్పతిల్లుచున్నది. నేను వనములకు వెడలునప్పుడు రాజకార్యలంపటుఁడయి హృదయేశ్వరుఁడు నన్ను వీడ్కొలుపఁడాయె. అన్నా, శత్రుఘ్నుని సమర యాత్రలో నేమియు అమంగళము వినవుగదా ! సవనదర్శనార్థమేగిన భరత కుమారుఁడును గురుజనులు కుశలముగ నున్నారా?

లక్ష్మ : పూజ్యురాలా, అందఱకుం గుశలమే.

సీత : లక్ష్మణా, మీయన్న జనరంజకముగఁ బాలించుటలేదా ?

లక్ష్మ : అమ్మా, లోకుల సంతోష పెట్టఁ దన యర్థాంగినైనఁ గానపాలుసేయ సాహసించు కీర్తికాముఁడు ధరాతలమెల్ల శాసింప నిఁక జనరంజకత వేఱ చెప్పవలయునా?

సీత : అట్లయిన నీ హృదయాందోళనమున కేమికారణము ?

పరమ సౌఖ్యములను భార్యను విడనాడి
యన్న ననుసరించి యటవి కేఁగు

నప్పుడైన నిట్టి యార్తితోఁ గుందవు
చింతఁ బొందనేల చెప్పుమన్న

లక్ష్మ : (కన్నీటితో) తల్లీ లోకపావనీ,
ఏమని దెల్పుదున్ రఘుకులేశ్వరునాజ్ఞ -- (నిట్టూర్చును)

సీత : (చకితయై) ఆజ్ఞయేమి - ఏల విలంబించెదవు ?

లక్ష్మ : ...................................................................... శతారపాతమై
నీ మనముం గలంచదె ! అనింద్యచరిత్రఁ బతివ్రతామణిన్
గోమల చిత్త నిన్నుఁగొని ఘోరమృగాకుల భీకరాటవిన్
రాముఁడె వీడఁబంచెననఁ, బ్రాణము లింకెటు చిక్కఁబట్టెదో.

సీత : (దిగాలుపడి) వత్సా, వత్సా, లక్ష్మణా, ఏమంటివి ? ఆర్యపుత్రుఁడే నన్నుఁ గానలో విడువబంచెననియా ? నిజముగనా? ఆ.... ఆ..

(మూర్ఛిల్లును)

లక్ష్మ : అకటా! యెంతకష్ట మెంత కష్టము ! రామమయ జీవిత మూర్ఛిల్లినది, తల్లీ యూరడిల్లుము.

సీత : (సగములేచి) లక్ష్మణా, ఆర్యపుత్రునియెడ నేనేమి యపరాధ మొనరించితిని.

తడిగుడ్డఁ జుట్టి చల్లఁగ
మెడఁగోసెడు కఠిన హృదయు మేలనిపించెన్
నడుకాన నన్ను గెంటగఁ
దొడరిన కౌసల్యాసుతుఁడు ; దుర్భర మకటా !

అయ్యో ! నేనెంత పాపాత్మురాలను ? నామనోనాయకుని నిష్కారణముగ నిందించుచున్నాను. అన్నా, నీవేమిపరాకున వింటివో గాని, క్షణకాలమైన నన్ను విడనాడి జీవింపనేరని ప్రణయ సముద్రుఁడు నామనోహరుఁడు ఇట్టి ఘోర కార్యమున కియ్యకొనునా?

ననుగాంచి నిమిషమైనను నొక్కయుగమని
పలుమాఱుఁదిలకించు ప్రణయమహిమ ;
ప్రణయకోపమున నవ్వలి మొగం బయ్యును
మునుదానె మాటాడు మోహగరిను ;

*నామనంబెఱింగి మన్ననగ లాలించుటే*
*జన్మఫలంబను జాణతనము ;*
*అగ్నిసాక్షిగఁ బెండ్లియాడిన ననుఁబ్రేమ*
*దలఁపున కెలయించు ధర్మసక్తి ;*
*నవ్వులాటలకైనను నన్నుఁజేరి*
*మేలమాడంగనోపని మెత్తఁదనము*
*నేఁడు వమ్మయిపో విడనాడినాఁడె ?*
*మన్మనోహరుఁ, డిదియేటి మాట వత్స !*

లక్ష్మణా, ఆర్యపుత్రుఁడేమనెనో ఆపలుకులనే వినిపింపుము.

లక్ష్మ : (స్వగతము) అయ్యో! యీ సాధ్వీమణి యెంత ముద్దరాలు! (ప్రకాశముగ) తల్లీ, చెప్పెదను.

జానకి మన్మనఃపదము సాధుజన స్తవనీయశీల ము
గ్ధానన.........................

సీత : (స్వగతము) హృదయమా, యింతకే సంతసింపకుము.

లక్ష్మ : ................................ఏలొకో కుజనులాడిరి నిందలు దుర్మదాంధులై

సీత : ఏమీ ? లోకాపవాద దూషితనా ?

లక్ష్మ : మానిని నింక నేలికొన మానితమౌ రఘువంశకీర్తికిన్
న్యూనత గల్గుఁగాన నెగులొందక కానన వీడుమీ సతిన్.

సీత : ఆహా ! మేఘాడంబరములేని వజ్రపాతము ! లక్ష్మణా, అయోధ్యలో సజ్జనులుః లేరా ఇది తగదని బోధించుటకు ? నీతికోవిదులగు తాపసోత్తములు కఱవయిరా ? నా హృదయేశ్వరుని మనము సత్యా సత్య వివేక శూన్యమైనదా ? మున్నటి ప్రేమ యంతయుఁ గపటనాటకమా ?

*హృదయకూలంకషంబుగఁ బొదలి పొంగి*
*పొరలు ప్రణయ ప్రవాహంపుఁ దరఁగలైన*
*సరసవీక్షల సేకంబు సలుపు ప్రియుఁడె*
*యటవులకు నన్నుఁబంపుట యద్భుతంబు !*

లక్ష్మ : కరుణా సముద్రుఁడు కఠిన చిత్తుఁడగుట దైవ దుర్విపాకము గాక మఱి

యేమనవచ్చును ?

సీత : కుమారా, ఆర్యపుత్రుఁడు తన కన్నులనే విశ్వసింపఁడా ? తన మనమునే సంశయించునా ? నా పాతివ్రత్యము ననుమానించెనా ?

జనముల్ నోటికి వచ్చినట్లు పలుకన్ శంకింప రెవ్వారినిన్
మనుజాధీశ్వరుఁ డట్టి వాక్యముల సమ్మానించి; చూలాలి కాం
తను నిశ్చింతగఁ గానకంపఁదగవే ? ధర్మంబె ? యీ న్యాయముల్
మనకైపుట్టెనె లక్ష్మణా ? యిదియు సన్మార్గం బె మీబోంట్లకున్ ?

లక్ష్మ : తల్లీ, లోకపావనీ, నీపాతివ్రత్యమును రామచంద్రుఁడు శంకింపలేదు. ఇఁక శంకింపఁబోఁడు. అవివేకు లాడుకొను నపవాదముల వలన రఘువంశకీర్తి కళంకిత మౌనోయని వెఱచి తన హృదయమును బెఱికి వైచినటుల నిన్ను విడనాడెను.

సీత : (దుఃఖముతో) లక్ష్మణా, యిక నెప్పుడైనఁ బ్రాణవల్లభుని దర్శించు నవసర మబ్బునా ?

లక్ష్మ : (స్వగతము) ఈ తల్లిని ఇట్టి యవస్థలో వీడి నేనెట్లు పోఁగలను?

సీత : జీవితేశ్వరా, ఇఁకనైన దిగంత కీర్తివిస్తారుఁడవుగమ్ము. నాకిఁక మరణమే శరణ్యము.

లక్ష్మ : (స్వగతము) అయ్యో ! ఆత్మహత్య గావించుకొనునా ? (ప్రకాశముగ) అమ్మా, నిలుకడమీఁద నైనఁ బ్రజలకు నిజము దెలియకుండునా?

సీత : మందభాగ్యనగు నాకుఁగూడ నిట్టి యాశావలంబనమా !

లక్ష్మ : (స్వగతము) కాఠిన్యమా, నామనము నావేశింపుము (ప్రకాశముగ)

దురితుఁడ బంధువిరక్తుఁడఁ
గరుణారహితుండఁ గ్రూరకర్మరుఁడను ము
ష్కరత వనంబున నిన్విడి
పఱతెంచఁగ నున్న కటిక వాఁడను దల్లీ.

సీత : వత్సా, ఆత్మనిందవలదు. సార్వభౌముని శాసనము ఎల్లఱకు నలంఘనీయము. నీకు మార్గము మంగళకరమగుఁగాక !

లక్ష్మ : (స్వగతము)

ప్రణయపాశంబు లెట్టివో బలిమిబట్టి
లాగినను ద్రెవ్విపోవక సాగుచుండు,

లలిత బిసనాళ ఖండంబులను దెమల్ప
నడుమ సాగెడు సూత్ర కాండములు వోలె !

(ప్రకాశముగ) అమ్మా, యేమి సెలవిచ్చి పంపెదవు ?

సీత : లక్ష్మణా, నేఁ జెప్పిపంపున దేమున్నది ?

అపవాదదూషితయైన కాంతను బాసి
పతి కీర్తిఁ బొందుట భావ్య మనుము ;
కౌసల్యయాదిగాఁ గలుగు నత్తల కేను
గడుభక్తితో మ్రొక్కు లిడితి ననుము ;
తోడికోడండ్ర నాతోడి నేస్తము నెంచి
కడసారి సేమంబు నడిగె ననుము ;
చెలికత్తియలు నన్నుఁ బలుమాఱుఁదలపోసి
యుమ్మలింప నిరుపయోగ మనుము ;

ప్రజల నిఁకమీఁద మోదంబుఁబడయుఁడనుము ;
పతిని నెడఁబాసి యిఁక సీత బ్రదుక దనుము ;
జన్మజన్మంబులకు రామ సార్వభౌముఁ
బరమపావను భర్తగాఁ బడతుననుము.

లక్ష్మ : అమ్మా, యీ ప్రాణఘాతుకుని మన్నింపుము. (నమస్కరించును)

సీత : అన్నా, విచారింపక పయనము గమ్ము.

లక్ష్మ : తల్లీ, వనదేవతలు నీకుఁ బ్రసన్న లగుదురుగాక !

వనదేవతలారా, రా
మునిపత్నిని నొంటి వీడి పోయెడివాఁడన్
వనమృగ బాధలఁ బొందక
జనకజ రక్షింపుఁడమ్మ సౌఖ్యములిడుచున్.

(కొన్నియడుగులిడి - స్వగతము) పాదము లసమ్మతముగ ముందడుగిడుచున్నను మనసేమో వెనుకనే మరలుచున్నది. (నిష్క్రమించును.)

సీత : (లక్ష్మణుఁడేఁగు దెసఁజూచుచు) నా జీవిత శేషమువలె లక్ష్మణుఁడేఁగుచున్నాఁడు! నాకు లోకమంతయు నంధకార మలీమసమై తోఁచుచున్నది. అయ్యో ! ఈ

నిర్జరారణ్యమున దిక్కులేని దాననైతిని. ఇంతటి తిరస్కారము సంభవించునని కలలోనైనఁ దలఁచి యెఱుఁగను. హృదయేశ్వరా, కుసుమకోమలమైన నీచిత్తమేల వజ్రసదృశమైనది ? కాని కాలమునకుఁ దారహారము విషవ్యాళమై కఱచెనన్న సామెత నేఁడు యథార్థమైనది.

నవకోటి మన్మథాకారా, దీనమందారా, హృదయేశ్వరా, యెన్నికష్టము లనుభవించుచున్నను నీ త్రిజగన్మోహన స్వరూపము క్షణమైన మఱచి యుండఁగలనే ?

*మఱవంగవచ్చునే శరదిందు బింబంబుఁ*
*బురణించు చిన్నారి మోముతీరు ?*
*మఱవంగవచ్చునే మాణిక్య కుండలో*
*జ్జ్వలకోమల కపోల విలసనంబు ?*
*మఱవంగవచ్చునే యరవింద దళ సుంద*
*రంబైచెలంగునేత్రద్వయంబు ?*
*మఱవంగవచ్చునే మకరంద రస బిందు*
*తుందిలంబైన ముద్దుల యెలుంగు?*

*నయనపర్వముసేయు నానాథుమూర్తి*
*నింక నీ జన్మమునఁ గాంచ నెట్టులబ్బు ?*
*ప్రణయవృంతంబు విడిపోవ వాడకున్నె*
*జీవ నవపుష్ప మూర్పుల తావి దొలఁగి.*

ప్రాణవల్లభా, త్వదేకాలంబను నన్నిటులఁ గాన పాలొనరింప నీకు న్యాయమా మనోహరా, ప్రాణవల్లభా, యిఁక నాగతియేమి ? (చెట్టు కొమ్మపట్టుకొని దుఃఖించును)

(యవనిక జాఱును)



## ద్వితీయ స్థలము : అడవి

(వాల్మీకి, మాండవ్యుడు మాటలాడుచుండగా తెఱ యెత్తఁబడును)

వాల్మీ : మాండవ్యా, నీవు చూచితినని చెప్పిన సాధ్వి యెచ్చట నున్నది?

మాండ : ఇచ్చోటనే మూర్ఛిల్లి పడియుండినది. ఇపుడెచ్చటికో పోయి యుండును.

వాల్మీ : ఈవనమందెయ్యెడనో వృక్షచ్ఛాయల విశ్రమించియుండునేమొ చూతము రమ్ము.

(నిష్క్రమింతురు)

(తెఱయెత్తగా సీత తరుమూలమున గూర్చుండియుండును)

సీత : చిత్తమా, యూరక యేల యంతరాళసౌధములు నిర్మించెదవు? మున్ను లంకలో నశోకవనమున నివసించుచున్నపుడు నామనో నాయకుఁడు దానవపతిని వధియించి నన్ను మరలఁ గొంపోవునను పేరాసతో మేన నసువులు భరియించితిగాని, యట్టి యాశావలంబము నేఁడు లేదుగదా.

(వాల్మీకి , మాండవ్యుఁడు ప్రవేశింతురు)

వాల్మీ : (స్వగతము) ఈకుమారియా ! (ముక్కుపై వ్రేలిడికొని) ఆహా! అంతయుఁ దెలిసె. (ప్రకాశముగ) రామపత్నీ.

సీత : (ఉల్కిపడి చేచి - స్వగతము) ఎవరో మునీశ్వరులు ! నన్నెట్లు గుర్తించిరి ? (ప్రకాశముగ ) మహాత్ములారా, వందనములు.

వాల్మీ : దీర్ఘ సుమంగలీ భవ !

సీత : (స్వగతము) శీఘ్రమే మరణించునట్లు దీవింపరుగదా.

వాల్మీ : బిడ్డా, యోగదృష్టి ప్రభావము వలన నంతయుం దెలిసికొంటిని. కర్మవశంబున సత్యవంతులకైన నిక్కట్టులు గలుగుచుండును. సంసార సాగరమున మునిఁగిన వారలు సుఖ దుఃఖతరంగ తాడితులు గాకుందురా?

సీత : మునీంద్రా, నిరపరాధులును శిక్షార్హులగుదురా ?

వాల్మీ : అమ్మా, నీ వమాయికవు. నిరపాయకర జీవనముసల్పుచు అరణ్యమున నివ్వరుల నేరికొని తిని బ్రతుకు శకుంత సంతానములు సైతము వ్యాధుని యంపకోలకు గురియగుటలేదా?

సీత : మహాత్మా, లోకు లవివేకులైనను ఆర్యపుత్రుఁడు గూడ వారి నే

యనుసరింపవలయునా ?

వాల్మీ : అమ్మా, ఇది రాజకీయరహస్యము. రాజునకుఁ బ్రజప్రాణాధారము. ప్రజలు విద్వేషించి తిరుగఁబడిన సామ్రాజ్యమైనను బునాదిలోనికిఁ గూలిపోవును. కుమారీ, కాలదుర్విపాకమునకు లోఁబడనివారెవ్వరు?

*అనిలాలోల జలప్రవాహ చలితంబై శుష్కపర్ణావళుల్*
*వెనుకన్ముందుకుఁ బోవురీతి జనులున్ విశ్వంబునం గాలవా*
*హిని నోలాడుచు నస్వతంత్రులయి యేయే వేళ నేదేది గాం*
*చనగున్ దానిఁ బరిగ్రహించి తుదకుం జాలింత్రు సంసారముల్*

సాధ్వీ, ఆరణ్యకుల్యాపరిసరమున మా యాశ్రమమున్నది. అచ్చట మునిబాలికలు నీకు సహచారిణులై యుపచరింతురు- మాండవ్యా.

మాండ : స్వామీ

వాల్మీ : నీవు శీఘ్రముగ పోయి పరిపక్వ ఫలములు గోసికొని యాశ్రమము నకు రమ్మా.

మాండ : చిత్తము (నిష్క్రమించును)

వాల్మీ : బిడ్డా, శంకింపవలదు. మీ తండ్రి జనకరాజేంద్రుఁడు మా కత్యంత ప్రియమిత్రుఁడుగ నుండెను. మాయాశ్రమము నీ పుట్టినిల్లుగఁ దలఁచుకొనుము. శీఘ్రకాలమున నీవు వీరమాత వయ్యెదవు.

సీత : (కన్నీటితో) మునీంద్రా నా పరిభవమును మాజనకుఁడెఱుంగకమున్న తపోవనవాసియయ్యెను. లేకుండిన నాకొఱకెట్లు పరితపించి యుండునో !

వాల్మీ : కుమారీ, విచారింపకుము. నీ వాపన్నసత్వవు. మార్గాయాసమున బడలియున్న దానవు. అరణ్య సహజమగు నాతిథ్యముంగొని విశ్రమింతువు రమ్మా.

సీత : (స్వగతము) తాపసులు నిర్హేతుక వాత్సల్యవంతులు ! (ప్రకాశముగ) మహాత్మా, నే నేమహర్షిచేఁ గరుణింపఁ బడితిని ?

వాల్మీ : వత్సా, నన్ను వాల్మీకి యందురు.

సీత : (స్వగతము) ఈ పవిత్రనామమును మున్నే వినియుంటిని. (ప్రకాశముగ) తాపసోత్తమా యీ దిక్కులేని దానిని రక్షించితిరి.

వాల్మీ : బిడ్డా, అందఱనురక్షించుటకు సకలాంతర్యామి భగవంతుఁడొకడు గలఁడు. పోదము రమ్మా కాలవిలంబునంబునఁ దపోంతరాయము గలుగును.

సీత : మీ చరణముల ననుసరించుచున్నాను.

(స్వగతము)

దరియు దాపులేక తరఁగ లుల్లోలించు
జలధి మధ్య నావ సడలి క్రుంక
మునుఁగనున్న నావికునికిఁ జెక్కవిధానఁ
బ్రాప్తమయ్యెఁ దాపసాశ్రయంబు.

(నిష్క్రమించును.)



# పంచమాంకము

## ప్రథమ స్థలము : అయోధ్య

(శూర్పణఖ ప్రవేశించును)

శూర్ప : మాన్యులొనరింపనేరని మహిత కార్య
మొక్క యబ్బుఁడె యొడగూర్చు నొక్కవేళ ;
రావణేంద్రజిదాది వీర ప్రముఖులు
సలుపఁజాలని పని నాకు శక్యమయ్యె !

నే నాటిన యుక్తి కల్పలతాబీజ మంకురించి, తీవలల్లుకొని, పూలు పూచి ఫలించినది. నా కల్పనాచాతుర్యము పరమావధి నొందినది. పల్లెత వేసముఁ దాల్చి భద్రుఁడు వినునట్లు సీతను అపనిందలాడితిని. ఆ ముదుసలి గొడ్డు గంభీరముగఁ దలయూపు చుంబోయెను. ఒక్క గడియలో సీతాపవాదము వాడవాడల మాఱు మ్రోగునటుల అమ్మలక్కలు నీటికి వచ్చు బావులకడను పణ్యవీథులందును రచ్చకొట్టములదగ్గరను వివాదములు పెంచు చుంటిని. రామ రాజ్యముపై ప్రజలకును మునీశ్వరులకును ద్వేష బుద్ధి జనియించునటుల లవణాసురుని ప్రేరించి తపోవనములు ధ్వంసముగావించితిని.

ఆహా ! నేటికి నా కపటనాటకము ముగిసినది. రామ చంద్రుఁడు సీత నడవులకు వెడలించి తాను నేఁడు విరహ విహ్వలుఁడై శోక సాగరమునఁ బారము గానక ప్రాణ సంశయావస్థలో నున్నాఁడు. గర్భ మంథరయగు సీతను ఒక్క పెట్టునఁ జంపిన నేమి లాభముగలదు ? అడవులలోఁ బడరాని యిడుమలు గుడిపించి క్రమక్రమముగ శోకానలంబున మాడ్చినఁగదా నాకసిదీఱును. (వికటహాస మొనరించి) ఆహా ! నేఁడుగదా నేను దశకంఠునకు సహోదరినిగ వన్నెకెక్కుట ! నేఁడుగదా పితృలోక వాసులగు మా బంధు మిత్రులు పరితృప్తులగుట ! (ఆకాశము వంకఁ గాంచి) దశకంఠా, మేఘనాథా, కుంభకర్ణాది రాక్షసవీరనాయకులారా,

సీతారామ విషాద బాష్ప సలిలాసేకంబు గావించి మీ
చేతంబుల్ రగిలించు శోకదహనార్చి న్నేఁడు చల్లార్చితిం ;
బ్రీతిన్ రాక్షస విక్రమోచిత సుఖ శ్రేయంబులంబొంది చిం
తా తాపం బెడలించి శాంతి గొనుఁడీ నాకంబున న్నిచ్చలున్.

నేఁటికి నా గుండె బరువు తీఱినది. ఇదిగో ! నా దీక్షా కంకణము విచ్చుచున్నాను. సంతోషరసపూరము నా హృదయ తటముల నొరసికొని ప్రవహించుచున్నది. వేగమపోయి యీ యుదంతము యుద్ధనిహతభర్తృకలగు దైత్యాంగనల కెఱింగించి వారి చిత్తము లించుక చల్లఁబఱచెదను.

(నిష్క్రమించును.)

## ద్వితీయ స్థలము : అంతర్భవనము.

(రామభరత వసిష్ఠులు కూర్చుండియుందురు)

రాము : తమ్ముఁడా, నేనెంత కరుణాశూన్యుఁడను?

చేతులారంగఁబెంచి చేఁజేతఁ బూవ
నున్న మల్లికఁ బెకలించు తెన్నుగాఁగఁ
బ్రాణములకన్న మిన్నయై పరగు ప్రియను
ఘోరకాంతారములఁ ద్రోసి కూళనైతి.

భర : అన్నా, నీవే ఇటులఁ జింతించుచున్న మా బోంట్లగతియేమి ?

వసి : వత్సా రామచంద్రా, సర్వమెఱింగిన నీవే యిటుల నడుకానఁ బడుచున్నావు.

రాము : అంతపుణ్యము నా కలవడునా ?

వసి : గంధ సింధురము పంకనిమగ్నమైన దాని నుద్ధరించు వార లెవ్వరు? నీ శోకమును దిగమ్రింగి తమ్ములను బుజ్జగించ వలసినవాఁడవు గదా.

రాము : మునీంద్రా, జానకిని దిగమ్రింగినవాఁడను, శోకమును దిగమ్రింగ లేనా ? కొండలు మ్రింగువానికి గండశిల లొక లెక్కయా?

భర : అన్నా, నీపరితాపమునకు మేరయే దొరకకున్నది. మా యల్ప ధైర్యముగూడ ప్రవాహ సంఘర్షణమున సైకతబంధమువలె కరఁగి పోవుచున్నది.

వసి : భరతా, యుమ్మలింపకుము, మీయన్న నూరడింపుము. చింతించిన నేమి లాభము గలదు ?

శోక దహనార్చు లుజ్జ్వలించుటయె తప్ప,
బాష్ప బిందువులెడలేక పడుట దప్ప,
గాంచువారల మనములఁ గలత దప్ప
నేల శోకింప ? నుపయోగ మేమిగలదు ?

రాము : తమ్ముఁడా, లక్ష్మణుఁడు వచ్చెనో లేదో కనుగొనిరమ్ము.

భర : వచ్చిన మీ దర్శనము చేయకుండునా ?

రాము : ఏమో, అయినను చూచిరమ్ము.

భర : (స్వగతము) ధీరహృదయుఁడగు రామచంద్రుఁడే ప్రియావిరహ చంచలుఁడయి

యిట్లు గుందుచున్నాఁడఁట ! ఇక సామాన్య మానవుల విషయము చెప్ప వలయునా? (నిష్క్రమించును)

రాము : తాపసోత్తమా, ఉంఛవృత్తితో జీవించు నీచుని నిర్బాధ్యతకుఁగూడ నే నసూయ పడవలసిన వాఁడనైతిని.

వసి : వత్సా, యట్లన వలదు. ఉన్నతవృక్షములకు గాక ఝుం ఝూమారుత సంఘర్షణ మల్ప కుటజంబులకుఁ గల్గునా ?బాధ్యత వహించు పురుష పుంగవుల కెల్లరకు స్తుతినిందలు సుఖ దుఃఖములు అనివార్యములు.

రాము : (విననియట్లు) అయ్యో ః ఆ మోహన స్వరూపమును నేనెట్లు మఱవఁగలను ?

*కలగని నిద్ర లేవ నటఁగాంచిన దెల్ల మనంబులోపలన్*
*గలకగ ఖండఖండములుగా వలఁగాంచిన దృశ్యమట్టులం*
*దొలఁగి తొలంగకే వెనుకఁ దోఁచెడిరీతి ధరాకుమారి యు*
*జ్జ్వలమగు సుస్వరూపమెదఁబాయక పాసియుఁ బాయకుండెడున్*

(భరతుఁడు ప్రవేశించును)

భర : అన్నా, లక్ష్మణుఁడింకను రాలేదు.

రాము : ఏలరాఁడు ? ఇంతలో వచ్చియుండును. మరలఁబోయి కనుఁగొని రమ్ము.

భర : (స్వగతము) అకటా ! నిశ్చలమైన రాముని చిత్తమెంత లౌల్యము వహించినది?

(నిష్క్రమించును.)

రాము : వసిష్ఠమునీంద్రా, మీరు దివ్యదృష్టివంతులుగదా మా జానకి యేమైనదో చెప్పగలరా? ఎంతవెఱ్ఱివాఁడను ? ఏమైయుండును ?

*అకట ! కంటక భూయిష్ఠమైన కాన,*
*గర్భభరమునఁ బార్శ్వభాగములు క్రుంగ*
*నడుగు నామడగా నల్లనడుగులిడుచు*
*నడవిమృగముల కాహార మయ్యెయుండు !*

మా తల్లి కౌసల్య, 'వత్సా, నా ముద్దులకోడ లెక్కడ' యని యడిగిన వన మృగములకు బలిపెట్టితి నమ్మాయని చెప్పుదునా ? (దుఃఖించును.)

వసి : రామచంద్రా, మిన్నులుపడ్డచోటు పోవుకొలఁది నిరంతముగఁ బోవుచుండును.

దుఃఖసాగర మీఁదుకొలఁది నిరవధికమై దోఁచు చుండును. ఏ ప్రజల రంజమునకై ప్రియాంగనను విడనాడితివో, రాజ్యకార్యముల నారయమి, ఆలోకులకే కష్టము వాటిల్లును. వత్సా, నీవు విధిజ్ఞుఁడవు. శోకింపక ధీరుఁడవుగమ్ము.

రాము : తాపసోత్తమా, దుఃఖమెంత యడఁచికొన్నను నీటిబుగ్గవలె నిరంతరముగఁ బెల్లుబుకుచున్నది.

*విరహ సంతాప మెట్టిదో నిరయగహ్వ*
*రంబువెడలెడి ధూమ పరంపర లటు*
*లేచి హృదయాంతరాళ మలీమసముగఁ*
*గడలుకొను బుద్ధి సూర్యుండు కప్పువడఁగ.*

(భరతుఁడు, లక్ష్మణుఁడు ప్రవేశింతురు)

రాము : (ఆతురతతో) అన్నా లక్ష్మణా, నా జానకి నేమిచేసితివి ? (కౌఁగిలించుకొనును)

లక్ష్మ : కఠినాత్ముఁడను, మీ యాజ్ఞ నిర్వర్తించి వచ్చితిని.

రాము : హా! మదేక జీవితా, సీతా. (క్రుంగిపోవును)

(యవనిక జాఱును)



# షష్ఠాంకము

## ప్రథమ స్థలము : అడవి

(వాల్మీకి కృష్ణాజి నాసీనుఁడై యుండును)

వాల్మీ : సర్వకాల సర్వావస్థలయందుఁ దపోనందవిలీనమైన నా చిత్తము కుటుంబవాగురులఁ దవుల్కొన్నది. ఆహా ! సంసర్గదోషము! కుశలవుల నెత్తి పెంచుకతమునఁ, దపోదగ్ధరసమగు నాహృదయము గూడ సాంసారిక ప్రేమకుఁ దావలమైనది. ఇఁక సామాన్యుల విషయము చెప్పవలయునా ?

లోకేశ్వరా, నిదాఘసంతాపమున శుష్కించిన వన లతలువోలె యెన్నఁడో జీర్ణించిన సంసార వాసనలఁ బునరుజ్జీవింపనెంచి యిట్టి చిత్రమగు లీలనొకటి గల్పించితివా ? అఘటనాఘటన చాతురీసమంచితా, కుశలవుల నా పోషణమున నుంచి యొక బాధ్యతను గలిగించితివి. నన్నెప్పుడు బాధ్యతా విముక్తునిఁ గావించెదవు ? కుశలవులకు యథావిధిగ ఉపనయనము గావించితిని. క్షత్రియోచితవిద్యలయందు నిపుణులఁ గావించితిని. వీరకుమారులిఁకఁ బర్ణశాలలఁ గష్టములకుఁ బాల్పడఁదగరు. నవఖండ సామ్రాజ్యధురంధర క్షముండగు రామభద్రుని పుత్రులెక్కడ - ఆకులలములుఁ దిని, అడవులఁ దపోనిష్ఠఁల గాలము గడపు మాబోంట్ల కుటీరము లెక్కడ ?

ఆ జనక రాజకుమారి, పుత్రకులమూలమున నింతకాలము బ్రతికియున్నది. లేకున్న నెప్పుడో ప్రాణ పరిత్యాగము గావించికొని యుండును.

(నేపథ్యమున)

వాల్మీకిమునీంద్రా, మృత్యుంజయ తీర్థసేవాతత్పరులగు ఋషీశ్వరులు వేచియున్నారు.

వాల్మీ : ఇదిగో ! వచ్చుచున్నాను. (నిష్క్రమించును.)



## ద్వితీయ స్థలము : అడవి

(మునిబాలురు ప్రవేశింతురు)

మాండవ్యుఁడు : కుశలవులింతలో నెట్లుపోయిరి ?

సానందుఁడు : అయ్యయ్యో -

మాండ : సానందా, యేమేమి ?

సానం : వారుగో ! కుశలవులు. కొదమనులాగివైచి తల్లిసింగమును పాలు పితుకుచున్నారు.

మాండ : అబ్బబ్బో ! చచ్చిరి చచ్చిరి. సింహము తిరిగిచూచి పండ్లికిలించుచున్నది. అబ్బా, బిడ్డలు గారురా వీళ్ళు పిట్టపిడుగులు.

సానం : వీరు చచ్చిన మనపైకి వచ్చును. మాండవ్యా, మనము ఆశ్రమమునకు వెళ్ళుదమురమ్ము.

(కుశలవులు ప్రవేశింతురు)

లవు : (సింగపుఁగొదమను ముద్దుపెట్టుకొనుచు) బుజ్జమ్మా, మన మాడుకొందాము. నీకు తియ్యని పండ్లు కోసిపెట్టెదను.

కుశు : (పెద్దసింగపు జూలు పట్టుకొని) సింహమా, పరుగెత్తుము - నీపై స్వారీ చేసి చూచెదను.

మునిబాలురు : (భయపడుదురు)

లవు : సానందా, యీ బుజ్జమ్మను తీసికొని మేముగూడ ఆశ్రమానికి వచ్చెదము.

సానం : మీరు చచ్చునది గాక మమ్ములను గూడ చంపుటకా ?

మాండ : సానందా, నాకు భయమెత్తుచున్నది. మనము వీరికన్న ముందుగ పరుగెత్తుదము.

కుశు : మాండవ్యా, భయపడకండి. ఇవి పసిపాపల వంటివి. మనలనేమి చేయవు.

లవు : (నవ్వుచు సింగపుఁగొదమను మునిబాలురపై విసరుచు) ఇదిగో! సింగపుకూన, వదలిపెట్టిన మిమ్ము కఱచి చంపును.

మునిబాలురు : అయ్యో ! చచ్చితిమి - చచ్చితిమి

లవు : అబ్బా ! యెంత మహిమావంతులురా వీళ్ళు ! చచ్చి మరలా బ్రతికినారు.

సానం : లవా, మీదుండగములు తల్లితోఁ జెప్పి మిమ్ములఁ గొట్టించెదము.

లవు : ఏమీ కొట్టించెదరా ? (సింగపుఁగొదమను చంకఁబెట్టుకొని సానందుని దగ్గరకు పోవును.)

సానం : (వెనుకకుఁ దగ్గుచు) అయ్యో ! అక్కడనే యుండుము. మమ్ము సింగపుఁ గొదమచేఁ గఱిపింపకుము. బ్రాహ్మణ హత్యా పాతకము చుట్టుకొనును.

కుశు : (స్వగతము) మునిబాలకులెంత పిఱికివారు !

మాండ : లవా, యొకసింహముండినట్లు మఱియొకసింహ ముండదు సుమా. నీ మురిపెము గిరిపెము వెళ్ళివచ్చును.

లవు : (చిఱునవ్వుతో) అవునవును ! ఉండవు ; కొన్ని ఆడువి, కొన్ని మొగవి; కొన్ని చిన్నవి; కొన్ని పెద్దవి.

మాండ : మేము మాటాలడిన మీకు ఎగతాళిగనున్నది.

కుశు : తమ్ముఁడా, వీరు ధైర్యవంతులు. వీరితో చర్లాటము లాడఁబోకుము.

లవు : (ఒదుగుచు) సానందా, యీ సింగము బారినుండి మమ్ము రక్షింపుము.

సానం : ఏమీ మమ్మెత్తిపొడిచెదరా ? మేము పిఱికివారమనుకొంటిరా ? మా తల్లిదండ్రులు నిగ్రహానుగ్రహశక్తిమంతులు - శాపప్రయోగదక్షులు !

కుశు : ఊ.......ఊ..! మాకు భయమెత్తుచున్నది. చీమలపుట్ట చూడు దాగుకొంటాము.

లవు : (నవ్వుచు) మా తాత ముత్తాతలుగూడ రాజ్యాలేలిన ప్రజ్ఞావంతులే !

మాండ : సానందా, నీవిక మాటాడక రమ్ము ; అడవి మేఁకల పాలుఁ ద్రావి వీరికి పొగరుపట్టియున్నది. వాల్మీకిపాదులవారి యాశ్రమమునకుఁ బోయి మనపయి సొడ్డులేకుండా వీరితల్లితోఁ జెప్పుదము.

సానం : అవును. పోదము పద. (నిష్క్రమింతురు.)

లవు : అన్నా, తల్లిసింగమును తరుమగొట్టుము. ఈ చిన్ని కూనను ఆశ్రమమునకుఁ దీసికొనిపోయి నివ్వరియన్నముపెట్టి సాకుదము.

కుశు : పాపము ! ఆ కొదమను విడిచిపెట్టుము. దానితల్లి యూరకే నీతట్టు చూచుచున్నది. మనతల్లి దగ్గఱనుండి మనలను బలవంతముగా వేఱుపఱచిన మనకును అమ్మకును ఎంత కష్టముగ నుండును.

లవు : అన్నా, మృగాలకుఁ గూడా అంతేనా ?

కుశు : అవునవును.

లవు : అట్లయిన వదలిపెట్టెదను. (కూనను ముద్దుపెట్టుకొనుచు) నా బుజ్జికూనా, నీవుపోయి నీ తల్లి పాలు త్రాగుము (వదలిపెట్టును)

కుశ : మునిబాలకులు మనలను వదలి పెట్టి పరుగెత్తిరి చూచితివా ?

లవు : అన్నా, వారుతల్లితో యేమేమొ చాడీలు చెప్పుదురు. మనము కూడ వెళ్లుదము రమ్ము.

కుశు : అవును ! కదలుము.

(నిష్క్రమింతురు)



## తృతీయ స్థలము : వాల్మీకి ఆశ్రమము

(సీత అొతిబండపైఁ గూర్చుండియుండును)

సీత : అకటా ! బిడ్డలారా, యీ మందభాగ్యురాలి కడుపున నేలపుట్టితిరి ? రఘుకులాలంకారుని యంకపీఠమునఁ గూర్చుండి ముద్దులొసఁగు భాగ్యమునకుఁ దొలంగి యీ నట్టడవులఁ దాపసబాలురతోఁ గ్రుమ్మరునట్లు విధి మీ నొసట వ్రాసెనా ?

జలధి పరీత భూవలయ శాసనకర్తకుఁ బుత్రులయ్యు ము
ద్దులసుతులెట్టి సౌఖ్యపరితోషము లొందక మౌనియాశ్రమం
బుల ఫలమూలము ల్గుడిచి భూషణముల్ కయిసేఁతలేక ప
ట్ట లజినముల్ ధరించి యకటా ! సమిధల్ గొని తెచ్చుటాయెనే ?

అంధకారమయమ్మైన యూకాశమున నక్షత్రద్వయమువలె బాలకుల సుందరవదనారవిందములు నాకుఁ గొంత యానందము గలిగించుచున్నవి. మొలబంటి దుఃఖమున మోకాలిబంటి సంతోషమనునది యిట్టిదే కాఁబోలు.

(మాండవ్యుఁడు, సానందుఁడు ప్రవేశింతురు)

సానం : అమ్మా.

సీత : నాయనా, యేమి ?

సానం : మీ కుశలవులను గట్టుదిట్టము సేయకున్నఁ బ్రాణాపాయము గలుగును.

సీత : సానందా, యేల యిట్లు పలుకుచున్నావు ? వా రేమిచేసిరి ?

సానం : కొదమను లాగివైచి తల్లిసింగమును పాలు పితుకుచుండిరి. మేము అది యేమిపనియన్న మాపైకి సింహకిశోరమును విసరి భయపెట్టిరి. నే నబద్ధమాడిన ఈ మాండవ్యుని అడుగుము.

మాండ : ఇందేమి యబద్ధమున్నది.

సీత : అయ్యో ! వారికిఁ గ్రూరమృగములతో నేమి చర్లాటము ? వాల్మీకి నాయన గారితోఁ జెప్పి కుశలవులకుఁ దగు శిక్షచేయించెదను. మీరుపొండు.

మాండ : అమ్మా, అడవిమృగములన్న లవునకుఁగొంచెముగూడ భయము లేదు. మాబోటి వాండ్లమే భయపడుచుందుము.

(నేపథ్యమున)

అన్నా, నావిల్లుగూడ కొమ్మకుఁ దగిలించుము.

సానం : అమ్మా, మే మిఁక వెళ్ళెదము; లవుని కంఠస్వరమువలెనున్నది. మమ్ముఁజూచిన సింగపుకూనను ఉసిగొల్పుదురు. (నిష్క్రమించును)

సీత : కురంగములతోడఁబంచానన కిశోరముల బెంచినను వాని స్వభావమేల మానును?

మొగిలి పుట్టంగ ముండ్లును బుట్టినటులఁ
గుశలవులతోడ శౌర్యంబు గూడఁబుట్టె ;
నార్యతాపస సాహచర్యమున నైన
క్షాత్రగుణముల కళకళ సమసిపోదు.

(లవుఁడు ప్రవేశించును)

లవు : అమ్మా, నేను సింగపు బుజ్జమ్మను ఆశ్రమానికి తెచ్చెదనంటే అన్నయ్య వద్దన్నాఁడు.

సీత : (కౌఁగిలించుకొని) అయ్యో ! నా ముద్దుకూనా , క్రూరమృగములతోడ మీకేమి చర్లాటము ? అవి యొకప్పుడు మిమ్ములఁగఱచినను గఱవవచ్చును.

లవు : (నవ్వుచు) మాచేతిలో లేవా కఱకుబాణాలు ?

సీత : నాయనా ! యిఁకమీద మీ రట్టిసాహసకార్యము లొనరింపకుఁడు మంద భాగ్యులకు నమృతముగూడ విషమగుచుండును.

లవు : అమ్మా, వాల్మీకి తాతగారు చెప్పే రామాయణము నీవు వినలేదా ? అందు కథానాయకుఁడగు రాముఁడు చిన్ననాఁడే తాటకను మారీచ సుబాహులను చంపినాఁడఁట ! ఆయన క్షత్రియుఁడఁట ! అమ్మా క్షత్రియులందరు చిన్నతనమందే యుద్ధము నేర్చుకొంటారా ?

సీత : నాయనా, మునిబాలురకు మీకేల యా విచారము.

లవు : అమ్మా, వాల్మీకితాతగారు మాకు చిన్నప్పుడే బాణప్రయోగము శిక్షించినారుగదా ! నేను క్షత్రియుఁడనయ్యెదను. అమ్మా, అన్నయ్య కూడా అవుతాడుగదా.

సీత : (లవుని జవిరియెత్తుకొని) నా కన్నతండ్రీ, అట్లే అగుదురులెమ్ము.

(నేపథ్యమున)

తమ్ముఁడా, రమ్ము రమ్ము.

లవు : (కౌఁగిలి విడిపించుకొని) అన్నయ్య యెందుకో పిలుచుచున్నాఁడు.

నిష్క్రమించును

సీత : అక్కటా ! నాముద్దుకొమరులు ఈ యజ్ఞాత వాస కష్టములెన్ని దినములనుభవింతురు ? ఈ బిడ్డల ముద్దుమాటలు వినిన ఆర్యపుత్రుఁడెట్లు సంతసించియుండునోగదా ?

జనకుఁడు గని మోదింపని
తనయుల మృదుభాషణములు ధైర్యోద్ధతులున్
దనరియు వ్యర్థంబులు ని
ర్జనవనమునఁ బూచియున్న ప్రసవము లటులన్.

(యవనిక జాఱును)



## చతుర్థ స్థలము : అడవి

(యజ్ఞదత్తుఁడు ప్రవేశించును)

యజ్ఞ : సవనమన్న సంబరమునఁ గష్టముల గుర్తెఱుంగక యీ యుద్యోగమున కొప్పుకొంటిని. నడచినడచి నాపాదములు పుండ్లయినవి. ఏ పుట్టలోనో ఏపొదలోనో గుక్కిరిమిక్కిరి మనకుండ ముక్కుపట్టుకొని యెన్నడో ప్రాణముపోయిన పీనుఁగులవలె బిఱ్ఱబిగిసికొని కూర్చుండియున్న వగ్గుతాపసుల యిక్కలు నెనెట్లు కనుగొందును ? ఆ జడదారులు రాకున్న అశ్వమేధము చక్కగ నెరవేరదట! మేము లేమా అయిదారువేదములు చదువుకొన్న మహా బ్రాహ్మణులము. అయిననేమి ? శంఖమునుండి జాఱిన నీళ్ళే తీర్థమగును.

ఇచ్చట నలుదెసలకు బలుమార్గములు పోవుచున్నవి. ఏదారిని పోయిన నే యరణ్యము సొచ్చి యే క్రూరమృగములవాత బడుదునో అను భయమున నాగుండెలు దేవతార్చనగంటవలె గడగడ గొట్టుకొనుచున్నవి. అయ్యో, నేను తిరిగి దారపుత్రులఁ గాంచు భాగ్యముండునా ? ఎట్లయిన నగుగాక ! ఇట్టితఱిఁ ధైర్యసాహసము లవలంబించి రెండవ పరశురాముఁడ నయ్యెదను. (నలుదెసలు పరికించి) ఈ మార్గము వెడల్పుగను చక్కగనున్నది. అపాయము జరుగునెడల నిరాటంకముగ బరుగెత్తుటకుఁ దగియున్నది. (కొంతనడచి) అయ్యో సింహము! సింహము ! చచ్చితిని చచ్చితిని. వేదాధ్యయనపరుడఁను, బ్రాహ్మణుడఁను, రక్షింపుడు, రక్షింపుడు !

(లవుఁడు విల్లుభుజమున తగిలించుకొని పూలబుట్టతో వచ్చును)

లవు : ఎక్కడ ఎక్కడ సింహము ? (విల్లుచేతికందుకొనును)

యజ్ఞ : (గద్గదస్వరముతో) నాయనా,అదిగో సింహము. నిన్ను దైవము సమయమునకే పంపినాఁడు.

లవు : (విల్లెక్కుపెట్టి) ఓయీ ఛాందసుఁడా! నాచేత మునిహత్య గావింపనెంచితివా ?

యజ్ఞ : అబ్బాయీ, కాదుకాదు. అదిగో ! సింహము పొదమాటున ; గాలికి జూలెగురుచున్నది చూడు.

లవు : చూచి చెప్పెదను.

యజ్ఞ : నేనిక్కడ నుందును.

లవు : (చూడఁబోవును)

యజ్ఞ : మునికుమారా జాగ్రత, జాగ్రత.

లవు : చూచితివా, ఈయన సునందుల తాత !

యజ్ఞ : అబ్బో ! నిజము తెలియక యెంత భయపడినాను. వీరు ప్రతి అమావాస్యకు క్షౌరము చేయించుకొన్న నాకింత భీతిగలిగి యుండదుగదా. (స్వగతము) ఈ మునిపేరు పట్టీలోనున్నదా ? (చూచి) ఉన్నది. (ప్రకాశముగ) ఆర్యా, సునంద మునీంద్రా.

లవు : బ్రాహ్మణుఁడా, సమయము తెలిసికొనక హెచ్చరింపకుము. సునందుల తాతగారు సమాధిలోనున్నారు.

యజ్ఞ : అబ్బో ! మునిశాపము తప్పించుకొంటిని. నాయనా, వాల్మీకి మునీంద్రుల యాశ్రమము చూపించెదవా ?

లవు : మీరెవ్వరు ? ఎందుకు మా తాతగారి ఆశ్రమానికి వచ్చినారు?

యజ్ఞ : మునికుమారా, నేను సద్బ్రాహ్మణుఁడను. ఈ మకర కుండలములు నాశాస్త్రతత్త్వమును నాకన్న ముందు హెచ్చరింపలేదా ? చతుర్దశ వేదసారమును ఈ డబ్బాలో వైచి పీల్చుచుందును. (ముక్కుపొడి డబ్బాతీసి చిటికె పొడిపీల్చి) అనఁగా వేదములెల్లనాకు కరతలా మలకములు.

లవు : అయ్యా, మీరు వాల్మీకి తాతగారికి గురువులుగా నుండతగినవారు. మా తాతగారికి నాలుగువేదములు మాత్రమే తెలియును.

యజ్ఞ : అటులనా - (నవ్వును)

లవు : అవునుగానీ, మీ పేరేమి ?

యజ్ఞ : నాపేరా ? యజ్ఞదత్తుఁడు.

లవు : మీరిచ్చట కేల వచ్చినారు ?

యజ్ఞ : సకల సామంత మహీకాంత మణికిరీట ప్రభారంజిత పాదపద్ముఁడగు ఇక్ష్వాకువంశ ప్రదీపకుఁడు రామచంద్ర నరేంద్రుఁడు అశ్వమేధము నొనరింపనున్నాఁడు. ఆ యజ్ఞదర్శనార్థము మునీశ్వరుల నాహ్వానింప నేను నియోగింపఁబడితిని.

లవు : రామచంద్రనరేంద్రుఁడా ! (ఆలోచించి) ఏమీ రామాయణ కథానాయకుఁడా ?

యజ్ఞ : (ఆశ్చర్యముతో) రామాయణ మేమిటి ?

లవు : మీకు తెలియదా ?

యజ్ఞ : అయ్యో ! తెలియదే.

లవు : నిజముగనా ?

యజ్ఞ : ఏమీ మాబోఁటి మహాబ్రాహ్మణు లబద్ధములాడుదురా ?

లవు : వాల్మీకితాతగారు రఘువంశీయుఁడైన రామునిచరిత్రమును ఛందోబద్ధము గావించిరి. ఆ రాముఁడేనా మీ రామచంద్ర నరేంద్రుఁడు?

యజ్ఞ : అట్లేయున్నది. ఏమిచిత్రము ! వేదములందుఁగాక ఛందస్సు మఱి యొక చోటఁబుట్టెనా ?

లవు : అవును ; మా తాతగారి అమృతవాక్కునందు.

యజ్ఞ : ఎట్లు ?

లవు : ఒకనాఁడు ప్రొద్దుపొడుపున వాల్మీకి తాతగారు శిష్యులతోఁ గూడ గంగానదికి స్నానమునకుఁ బోవుచుండ దారిలో నొక చెట్టుకొమ్మపై నొక క్రౌంచమిథునము ముద్దులాడుకొనుచుండెనఁట. అంతలో ఒకబోయయొకపిట్టను కఱకుటమ్మున నేలఁగూల్చెను. పాపము ! రెండవపిట్ట దానిని గాంచి కరుణముగ వాపోవుచుండ తాతగారు వీక్షించి ఆబోయవానిని శపించిరి.

యజ్ఞ : తర్వాత ?

లవు : ఆ శాపము అనుష్టుప్పు శ్లోకరూపమున వెలువడినది. ఈ చిత్రమునకు శిష్యులును తాతగారును ఆశ్చర్యపడుచుండు సమయమున బ్రహ్మదేవుఁడు ప్రత్యక్షమయి రఘురాముని చరిత్రమును శ్లోక రూపమున రచియింపుమని ఆదేశించెను.

యజ్ఞ : (స్వగతము) ఆహా! ఈ కథను వినుకొలఁది వింత వొడముచున్నది! (ప్రకాశముగ) నాయనా ? నీవెవ్వరిబిడ్డవు, మీ తండ్రిపేరేమి?

లవు : ఏమో నాకుఁదెలియదు.

యజ్ఞ : (స్వగతము) ఆహా ! ఈ కుమారుఁడు రాజకుటుంబమునఁ బుట్టవలసినవాఁడు.

(ప్రకాశముగ) నాయనా ? వాల్మీకి మునీంద్రుల, యాశ్రమము చూపించెదవా?

లవు : వాల్మీకి తాతగారు కుటీరమున లేరు. మృత్యుంజయ తీర్థమునకు శిష్యులతోఁ గూడ పోయియున్నారు.

యజ్ఞ : ఏమి నే బయలుదేరిన లగ్నమహత్త్వము ! అగస్త్యమహర్షి యాశ్రమమునకు ఏతట్టుపోవలయును ?

లవు : రమ్ము. దారి చూపించిపోయెదను.

యజ్ఞ : నాయనా, దీర్ఘాయుష్మంతుఁడవుగమ్ము.

(నిష్క్రమింతురు)



## పంచమస్థలము : అడవి

(కుశలవులు సమిధలకట్టలతో ప్రవేశింతురు)

కుశు : తమ్ముఁడా, నీవేరిన సమిధ లివేనా ?

లవు : అన్నా, నేను పుల్లలు ఏరునప్పుడు కాలిలో ముల్లు విఱిగినొప్పిచేసినది. అందువలన కొద్దిగ నేరితిని.

కుశు : ముల్లు తీసికొంటివా ?

లవు : తీసితిని ; ఇంకను కొంచెము నొప్పిగానున్నది.

కుశు : కుటీరమునకుఁ బోదమురమ్మ ; గారనూనె పూసిన నొప్పితగ్గును.

లవు : ఇప్పుడే ఆశ్రమమునకు నడువలేను. కొంతసే పీ చెట్లనీడ కూర్చుండి పోవుదము.

కుశు : అట్లే కూర్చుండెదము (ఇరువురు కూర్చుందురు)

కుశు : (ఆలోచనోన్ముఖుఁడై స్వగతము) మాతల్లియేలొకో యడపరాని శోకముచే నెల్లప్పుడుఁ గ్రాగుచుండినటులఁ గన్పట్టును ? ఇతర మునికన్యలవలె పువ్వులు ముడువదు ; గారనూనె చరుముటలేక తలవెండ్రుకలు జడగట్టి కొనిపోయెను. నీరింకిన వాడిపోవు తమ్మితూఁటివలె మాయమ్మ ఎందువల్లనో క్రమక్రమముగా దిగఁ గరఁగుచున్నది ?

లవు : అన్నా యేమి తలపోయుచున్నావు ?

కువు : తమ్ముఁడా, అమ్మ యుమ్మలికము నీవెప్పుడైన కనిపెట్టితివా?

లవు : ఉమ్మలిక మెందుకు ?

కుశు : మనయమ్మ యప్పుడప్పుడు శోకమునఁ గుములుచుండును. నిన్న సాయంకాలమున నే నాశ్రమమునకుఁ బోవుసరికి నొంటిగఁగూర్చుండి కన్నీరు నించుచుండెను. నేను వచ్చుటఁ గాంచి కన్నీరద్దుకొని నన్నుముద్దిడి కొనియెను. శోకకారణ మడిగిన ముద్దులు గురిపించి నామాట పులిమి పుచ్చెను.

లవు : అన్నా, మునికన్యలేమైన అమ్మను కష్టపెట్టినారు కాఁబోలు.

కుశు : అటుగాదు ; వారు మనతల్లిని ఎంతో యాదరమున నుపచరించు చుండెదరు.

లవు : అన్నా, మన మాశ్రమమున కరిగి అమ్మను నిజమడుగుదము.

కుశు : లవా, నాకొక సందేహము కలుగుచున్నది ; మన మెవ్వరము ? మనమేల యీ యరణ్యమున నున్నాము ?

లవు : అన్నా, అంతమాత్రము తెలియదా ? వాల్మీకి తాతను అమ్మ నాయనా, యని పిలుచుచుండును మనతల్లి తాతకూఁతురు గదా?

కుశు : అట్లయిన మన తండ్రియెవరు ? ఒక్కనాఁడైన మనము ఆయనను చూచియెఱుంగము.

లవు : (దీనముగ) అన్నా, మనకుఁ దెలియని పిన్నఁనాటనే మరణించెఁ గాఁబోలు!

కుశు : కాదు, కాదు ; మనతల్లి మంగళసూత్రము ధరించియున్నది.

లవు : (కొంతసేపూరకుండి) అన్నా తెలిసినది, తెలిసినది. మన తండ్రి యెచ్చటనో తపస్సు చేయుచుండవలయును.

కుశు : నాకేమియుఁ దోఁపకున్నది. మనకును ఇచ్చటి మునిబాలురకును చాలభేదము గనుపట్టుచున్నది. వాల్మీకి తాతగారు తక్కిన తాపస కుమారులకు శిక్షింపని బాణప్రయోగము మనకు మాత్రమే యేల నేర్పించిరి ?

లవు : మనలను క్షత్రియులను జేయుటకు.

కుశు : లవా, నీ సమాధానము నాకు నచ్చలేదు. ఇందేదో కొంత దాపఱిక మున్నది. ఎట్టులైన హటముపట్టి ఈ రహస్యము నెఱుంగవలయును.

లవు : అవునవును ; మనమిద్దఱమేడ్చి అన్నము దినకుండిన అమ్మ యీ రహస్యము చెప్పక మానదు.

(నేపథ్యమున)

ప్రళయకాలాబ్ధి కల్లోలపటలిరేఁగి
పృథివిఁ గబళింప వచ్చెనాఁ బృథులసైన్య
మటవిఁగాల్మెట్ట భీతిల్లి యాశ్రమముల
కొక్కపెట్టునఁ బర్వె మృగోత్కరంబు.

(కుశలవులు లేచి)

లవు : ఏమీ సైన్యమా ?

కుశ : ఆహా ! తాతగారు చెప్పినట్లే అయినది. ' నే నాశ్రమమున లేని సమయమున రాక్షసులు వచ్చి యజ్ఞవేదికలు పెళ్ళగింతురు. మునిపల్లె కొల్లగొట్టుదురు

జాగరూకులై యుండుఁడ"ని హెచ్చరించిపోయిరి. లవా, ప్రమాదము వాటిల్లినది. (ఇరువురు విల్లెక్కుపెట్టుదురు)

(నేపథ్యమున)

ఆహా ! వింతమృగము ! వింతమృగము !

(మాండవ్యుఁడు ప్రవేశించును)

మాండ : ఆహా ! వింతమృగము ! వింతమృగము !

లవు : మాండవ్యా, ఏమి మృగము ?

కుశు : ఆశ్రమముతట్టుకు రక్కసి బలగములు వచ్చినవా ?

మాండ : (భయముతో) అయ్యో ! కుశా, నన్నుఁ గాపాడుము.

కుశు : భీతిల్లకుము ; రాక్షసులు నీకెదురుపడిరా ?

మాండ : లేదు.

కుశు : అట్లయిన సైన్యము లేమి ?

మాండ : (స్వగతము ) దిగులుతీఱినది. (ప్రకాశముగ) అరణ్యమార్గమున ధూళీపటలము ఆకాశమున కెగయుచున్నది. ఒక వింతమృగము బంగారు మొగము పట్ట తళతళమనునట్లు పరుగెత్తుచున్నది

లవు : మాండవ్యా, అదేమి మృగము ?

మాండ : వృద్ధతాపసులు దానిని యజ్ఞాశ్వమని చెప్పుచున్నారు.

కుశు : అశ్వములు వాహనములని రామాయణకథయందు విందుము.

లవు : అవునవును.

మాండ : మత్తకోకిల -

కాంచమింతకు నట్టివింతమృగంబు నెప్పుడు నీవనిన్
మించుపోలిక సంచలించును మేదిని న్నడయాడెడుం ;
బొంచి పట్టఁగఁ బోవఁ దారును బోదపచ్చిక మేసెడిం ;
గుంచెతోఁకయుఁ గుచ్చుజూలును గొప్పడెక్కలు చెన్నగున్.

లవు : అన్నా, మనము పోయిచూతము.

కుశు : మాండవ్యా, ఆ గుఱ్ఱమెచ్చటనున్నది ?

మాండ : కళ్యాణ సరోవర ప్రాంతమునఁ బచ్చిక బయల మేయుచున్నది.

లవు : పోవుదమురండు.

(అందఱు నిష్క్రమింతురు)

(తెఱయెత్తఁబడును. గుఱ్ఱము కనఁబడును.)

కుశు : ఆహా ! ఈ వారువమెంత తీరుగానున్నది !

మాండ : (దూరముననుండి) కుశా, యొంటిగ దగ్గఱకుఁ బోకుము, అది కఱచునేమొ.

లవు : ఈ గుఱ్ఱముపై స్వారిచేసిన నెట్లుండునో ? (డగ్గఱి) అన్నా, అదిగో బంగారుపట్ట మోమున వ్రేలాడుచున్నది.

కుశ : (మొగముపట్ట తీసికొని చూచి) దీనిపై రత్నాక్షరములు గూడమెఱయు చున్నవి.

మాండ : (స్వగతము) గుఱ్ఱమునకు కఱచుస్వభావము లేదుకాఁబోలు! (మెల్లగ డగ్గఱును)

కుశు : (ముఖపట్టము పరికించి)

పదితలల రావణాసురు
మెదిపిన శ్రీరాముఁడశ్వమేధము సేయన్
వదలెను హయమును : వీరుల్
పొదలినఁ గట్టుండు ; లేక, మోడ్పుడు కరముల్.

ఏమేమీ ? శ్రీరాముఁడశ్వమేధ మొనరింపనున్నాఁడఁట ! ఆతనికన్న వీరులున్న వారువమును బట్టవలయునఁట !

లవు : లేకున్న?

కుశు : చేతులు జోడింపవలయునఁట ! ఏమి యీ కండకావరము. దశకంఠు నంతటి వీరుని సంహరించితినను గర్వము కాఁబోలు ! లోకములోని వీరమాతలు గొడ్డువోయిరా ?

లవు : అన్నా, రాముఁడసహాయశూరుఁడై దశకంఠుని వధియించెనా ? భ్రాతృద్రోహియగు విభీషణుఁడు, కోతుఁలు, కొండముచ్చులు, ఎలుగుబంట్లు లేకున్న రామచంద్రుఁడేమయ్యుండునో యెవ్వారెఱుఁగుదురు ? ఆ శూరత్వమునకా ఈ యశ్వమేధము ?

కుశ : మనమీ సవనాశ్వమును కట్టివైచెదము.

లవు : అవునవును ; వాల్మీకి తాతగారు పక్షపాతముతో వర్ణించిన శ్రీరాముని శూరత్వ మేపాటిదో కనుఁగొందము.

మాండ : అబ్బో ! మీరు మునిపల్లెకంతటికి అగ్ని రగిలింపనున్నారా ? మునిబాలురెక్కడ? సార్వభౌమునెదుర్కొను టెక్కడ ?

కుశు : తమ్ముఁడా, నాసమిధలుగూడ నీవు పట్టుకొనిపొమ్ము. ఈ యశ్వమును నేను దీసికొనివచ్చెదను..(తీసికొనును)

లవు : అన్నా, ఈ గుఱ్ఱముపై నే నెక్కెదనా ?

కుశు : లవా, యజ్ఞాశ్వము పవిత్రమయినది.

లవు : అట్లయిన వలదు లెమ్ము.

మాండ : (స్వగతము) మునిపల్లెకేదో మహాప్రళయము సంభవింపనున్నది.

(యవనిక జాఱును)



# సప్తమాంకము

## ప్రథమ స్థలము : అడవి.

(లక్ష్మణుఁడు ప్రవేశించును)

లక్ష్మ : దుఃఖగర్భితములగు పండ్రెండువత్సరములు గడచినప్పటికిని రామ పత్నిని విడనాడిన యీ కాంతారస్థలముల దర్శింప, సీతాపరిత్యాగ సంతాపము నేఁటిదివలె నాహృదయతటము లొరసికొనుచుఁ బ్రవృద్ధ మగుచున్నది.

ధరణిజా పదన్యాస పూతంబులైన
యటవులించుక మార్పుతో నైనఁ గాంచ
నయ్యెఁగాని సీతాకార మాత్మఁదక్క
దృశ్యలోకంబు నను నెందుఁ దేజరిలదు.

సీతా విరహితమైన యశ్వమేధము దుఃఖకరమైనను దన్మూలమున ఆర్యాపునర్దర్శనము లభించునేమోయను కొండంత యాసతో వచ్చితిని. నా యాస నిద్రమేల్కొన్న వాని స్వప్నమువలె అదృశ్యమయ్యెను. (కొంత నడచి) అకటా! నేనెంత ప్రాణ ఘాతుకుఁడను. అగ్రజుని యాజ్ఞగావించి మరణ పర్యంతము వేధించు హృదయశల్యము దెచ్చికొంటిని.

రామసందేశ మేఁ దెల్పఁ గోమలాంగి
జానకీదేవి ప్రాణవిహీన యగుచు
వజ్రపాతంబునం గూలు వల్లివోలె
మూర్ఛవోయిన తరుకాండ మూలమిదిగో!

ఈ ప్రదేశము నేఁటికిని గుర్తింప సాధ్యమగుచున్నది.

జనక రాజేంద్ర పుత్రికోష్మల విషాద
బాష్పవారి ప్రవాహంబు పాఱిపాఱి
పచ్చపూరియు నిచ్చోటఁ బట్ట దకట!
పృథ్వీశోకాగ్ని పరితప్త హృదయమనఁగ.

(నేపథ్యమున కలకలము)

(ఆలకించి) ఏమీ యీ కలకలము ?

(సేనానాయకుఁడు ప్రవేశించును)

సేనా : జయము జయము యువరాజునకు ! యజ్ఞాశ్వము బంధింపఁ బడినది.

లక్ష్మ : (ఆశ్చర్యముతో) ఎవరు బంధించిరి ?

సేనా : ఎవఁడో ఋషికుమారుఁడు.

లక్ష్మ : (ఆశ్చర్యముతో) ఋషికుమారుఁడా ? తెలియక కట్టి యుండును. సవనాశ్వమనిచెప్పి విడిపించుఁడు.

సేనా : మహాప్రభూ, సర్వవిధముల బోధించితిమి. నయ భయములఁ జెప్పితిమి. ఎంత బ్రతిమాలినను వినక ఆతాపసవటువు ముష్కరపుఁబట్టు పట్టియున్నాఁడు. మేము బెదరించిన సరకుసేయక యెల్లిదమాడుచు శింజినీ టంకారము గావించుచున్నాఁడు.

లక్ష్మ : ఏమివింత ?

*కార్ముకం బేడ యడవులఁ గాయగరుబు*
*పండ్లు గుడిచెడి జడదారి వటువులేడ ?*
*బ్రహ్మకులమున రెండవ పరశురాముఁ*
*డవతరించెనె కేసరి హరిణి కటులు !*

సేనా : యువరాజా, యాతఁడు సామాన్య తాపసబాలకుఁడుగాఁడు.

*సౌందర్యశౌర్యముల్ సమభాగములు గాఁగఁ*
*బంచికొన్నవొ దేహ భావములను !*
*మునిబాలకత్వంబు భుజబల విక్రమం*
*బైకమత్యముతోడ నలరునవియొ !*
*అంగుళీ కిసలంబు లతుల శరాసనం*
*బవిరత స్నేహంబు నానగొనెనొ !*
*శైశవంబును ధైర్య సాహసోద్ధతు లన్న*
*దమ్ముల యట్లుండఁ దలఁచెనొక్కొ !*

*కాక యన్యోన్యదూరత్వ కలనమెలఁగు*
*గుణములెల్లను నొకచోటఁ గూడి తాప*
*సార్భకాకారము సమాశ్రయంబుగొనునె ?*
*యిట్టి చిత్రంబు సృష్టిలో నెందుఁగనము.*

లక్ష్మ : సేనానీ, ఆ తాపసవటువును జూచుటకు నామన ముచ్చిళ్ళూరు చున్నది. అచ్చోటికి దారితీయుము.

సేవా : ఇదిగో యిటు.

(నిష్క్రమింతురు)

వీ బాలిశోద్యమమును దెలిపిరమ్మ. నా యీ కడసారి సదుపదేశమును గమనింపుము.

కుశు : రాజా, క్షత్రియవీరులు ఉపదేశవాక్యములఁ బ్రయోగించియా విజయము నొందుట!

లక్ష్మ : (స్వగతము) విననివి నీ బాలకుని చతురోక్తు లసహ్యములగుచున్నవి. (ప్రకాశముగ) ఓయీ, నీవెవ్వని సవనాశ్వమును బంధించితివో యాలోకైక వీరుని క్రోధాగ్ని శిఖలయం దేల శలభమువలె మ్రగ్గెదవు ? ఆరామచంద్ర నరేంద్రున యతిలోక శూరత్వము నీకుఁ దెలియక యింతటి సాహసకార్య మొనరించితివి కాఁబోలు ?

కౌశిక యజ్ఞంబుఁ గావంగ నేఁగుచో
మార్మోన్న తాటక మదముడంచె ;

కుశు : ఆడుదానిని బట్టి యఱచి కూయఁగఁ జంప
నదియె శూరత్వమం చనగ వలెనె ?

లక్ష్మ : క్రతువాటి శోణిత క్రవ్యముల్ చల్లు మా
రీచ సుబాహుల పీచమడఁచె ;

కుశు : పండ్లు గడ్డలుమెక్కు బక్కతపసుల నేచు
పిరికి దైత్యులఁ గూల్ప వీరుఁడగునె ?

లక్ష్మ : ధరణీసుతా స్వయంవరమున గిరిజేశు
బలువిల్లు డాకేలఁ బట్టివిఱిచె ;

కుశు : చిరకాలముంటఁ బుచ్చిన విల్లు విఱిచిన
దానికే చంకలు తట్టవలెనె ?

లక్ష్మ : అతుల విక్రమశాలి నమరేశు సుతు వాలి
నొక్క బాణంబున నుక్కడంచె ;

కుశు : ఇరువురు పోరాడునెడఁ బొంచి యొక్కని
మఱుగుగాఁ దెగటార్ప మానుషంబె ?

లక్ష్మ : (స్వగతము) రాముని చరిత్ర మీ బాలున కెట్లు దెలియును?

కుశు : ఓయీ, రాజా, యేలయిట్లు వందివలెఁ బొగడుచున్నావు ? రాముని శూరత్వము మాకు క్రొత్తయా ?

*కోఁతి కొండముచ్చు లెలుఁగుగొడ్లచేత*
*జలధి గట్టించినార లాశ్చర్యముగను !*
*వన్యమృగములఁ బాలించువారు మీరు*
*మీ పరాక్రమోద్ధతికింక మేరగలదె ?*

లక్ష్మ : ఓయీ !

కుశు : రాజకుమారా, స్తుతిపాఠమునఁ గొంత మఱచితివి. మీ రాముఁడు కాకిపైఁగూడ నస్త్రప్రయోగముఁ గావింపలేదా ?

లక్ష్మ : (కోపముతో) ఓరి జ్ఞానలవదుర్విదగ్ధా, యెంతతాళుకొన్నను నీ యవినీతిని వీడకున్నావు ? రామచంద్రనరేంద్రునిఁ దూలనాడిన నీ గర్వమిపుడే యడంచెదను. రమ్ము -- నీ శరాసనము సజ్యము గావింపుము.

కుశు : రాజా, యిప్పుడు క్షత్రియుఁడవైతివి. తపోవన శాంతికి భంగము గావింపవలదు. ఆ మరుప్రదేశమునకు నడువుము.

(నిష్క్రమింతురు)



## తృతీయ స్థలము : వాల్మీకి కుటీరము

(సీత ఆసీనయైయుండును)

సీత : సూర్యభగవానుఁడు నభోమధ్యగతుఁడై వేడిసెకల నుమియు చున్నాఁడు. నా ముద్దుకొమరు లేలొకో యింత వఱకుఁ గుటీరమునకు రారు. అయ్యో ! యేమి నా కుడికన్నదరుచున్నది ?

(మాండవ్యుఁడు ప్రవేశించును)

మాండ : అమ్మా, అమ్మా, ఆరణ్యకా - (దుఃఖించును)

సీత : నాయనా, మాండవ్యా యెందుకు దుఃఖించుచున్నావు ? కుశలవు లెక్కడనున్నారు?

మాండ : అమ్మా యేమి చెప్పుదును ? ఇంకను గుశలవులా ? (దుఃఖించును)

సీత : (తత్తరముతో లేచి) ఏమీ ? కుశలవులేమైరి? వారిపుడెక్కడనున్నారు? వచ్చు చున్నారా ? ఒక్కమాట చెప్పుము.

మాండ : అయ్యో ! నా నాలుక యాడకున్నది.

సీత : నా ముద్దుబిడ్డలకేమైన నాపద సంభవించెనా ? మాండవ్యా యేల విలపించెదవు?

మాండ : ఎక్కడివో పాపిసైన్యములు కళ్యాణసరస్సు ప్రాంతముల విడిసినవి. వారి సవనాశ్వమును కుశుఁడు కట్టివైచెను. సేనాధిపతి వచ్చునను భీతితో నేను దూరమున దాఁగియుంటిని. అంతలో సేనాని వచ్చెను.

సీత : తర్వాత ?

మాండ : తర్వాత కుశుఁడును సేనానాయకుఁడును ఏమేమొ వివాదములు సలుపుచుండిరి. ఆ మాటలు నాకు స్పష్టముగా వినఁబడలేదు.

సీత : మాండవ్యా, కుశలవుల కేమియాపద గలుగదు గదా ? ఒక్క క్షణము సేపు విలంబన మొక్కయుగముగఁ దోఁచుచున్నది.

మాండ : అమ్మా, వారిరువురి వాదముల నూహింప, సేనాధిపతి యశ్వమును విడువు మనియుఁ గుశుఁడు విడువననియు అన్యోన్యము తర్కించు కొనుచుండినట్లు కనుపట్టినది.

సీత : (నిట్టూర్పుతో) అయ్యో ! బాలుఁడెక్కడ, యజ్ఞాశ్వమును బట్టుటెక్కడ? ఇంతనేరమి దగునా ? మాండవ్యా, కుశుఁడు అశ్వమును విడువలేదా ?

మాండ : ప్రాణమునైన వదలి పెట్టునేమోగాని, వారువమును మాత్రము విడువఁడు.

సీత : అయ్యో ! నీవైన బుద్ధి సెప్పవా ?

మాండ : నే సమీపమున నుండినఁ గదా --

సీత : తరువాత ?

మాండ : సేనానియును గుశుఁడును మరుప్రదేశమున కరిగిరి.

సీత : వారచ్చటఁ బోరుసల్పిరా ?

మాండ : వేఱు చెప్పవలయునా ?

సీత : అకటా ! ఎంతప్రమాద మెంతప్రమాదము !

*పోరులను నారితేరిన వీరులేడ ?*
*బాణవిన్యాస మెఱుగని బాలురేడ ?*
*శౌర్య సాహస సాధ్యంబు సమరమేడ ?*
*యిన్ని తలపోసి శంకించు హృదయ మకట !*

మాండ : అమ్మా, శంకింపవలదు. కుశుని సంగరకళాకౌశలము వీక్షింప సేనాధిపతి విస్మితచిత్తుఁడై ప్రతీకార సంధానజడుఁడై యూర కుండెను

సీత : మాండవ్యా, లవకుమారుఁడు దగ్గఱలేఁడా ?

మాండ : అమ్మా, ఆతఁడు సమిధలను మోసికొని కుటీరమునకు వచ్చు చుండెను.

సీత : అట్లయినఁ గుశుడొంటరిగ యుద్ధము చేయుచున్నాఁడా ?

మాండ : అయిననేమి ? అగ్నికణ మొక్కటి చాలదా కొండంత తూలరాశిని బుగ్గిసేయుటకు?

*తేనె తెట్టెను జెలరేఁపఁదేనెటీఁగ*
*గములు వెడలెడిచందానఁ గాండపటలి*
*కుశ శరాసన ముక్తమై గుమురుకొనుచు*
*దిక్కులీనిన యట్టులఁ దేజరిల్లె.*

సీత : బళీ ! కుశకుమారా, జనకున కనురూపుఁడవైన పుత్రుఁడవైతివి. మాండవ్యా, తరువాత తరువాత ?

మాండ : *రూపంబెత్తిన శౌర్యమట్టుల మహారుద్రాకృతిన్ సంగర*
*వ్యాపారోన్ముఖుఁడై కుశుండు ప్రదర వ్రాతంబు సంధింపఁగం*

జావం బుర్వికి జాఱ సైన్యపతి మూర్ఛావీత చేతస్కుఁడై
భూపర్యంక శయానుఁడయ్యె వనభూముల్ పట్ట స్వానీకినుల్.

సీత : ఆహా ! వీరమాత నైతినను నానందంబున నా యొడలెల్లఁ బులకరించుచున్నది. ముద్దుకుమారా ! మొన్నటిదనుక నాయొడిలో నాడు కొనుచుంటివే ! యింతటి సమరకళాకౌశల మెప్పుడల వఱచు కొంటి వోయి ?

జనకుఁడు నీ పరాక్రమము, శౌర్యము, బాహుబలంబు, సంగరం
బునఁ జరియించునేర్పు, శరముల్ వఱపించెడి తీరు గాంచినన్
గనులఁ బ్రమోద బాష్పములు కాల్వలు గట్టఁగఁ గౌఁగిలింపఁడే
తనయుఁడ రమ్మటంచని ? సుతా, సుకృతంబటు లుండఁబోలదే!

మాండ : అమ్మా, అంతటఁ గుశుడు విజయకుతూహలియై సవనాశ్వము ముఖమున మెఱయుచున్న బంగారు పట్టను లాగికొని కుటీర మునకుఁ దరలుట కుద్యుక్తుఁడయ్యెను.

సీత : (స్వగతము) నాయనా, ముఖపట్టమును విజయాంకముగఁ గైకొంటివా? (ప్రకాశముగ) అంతట ?

మాండ : అంతట సింహనాదములొనరించుచుఁ జెల్లాచెదరైన సైన్యములు నొక్క మొనకుఁ దలపడి కుశుని చుట్టుముట్టినవి. ఇంతలో మూర్ఛితుఁడగు సేనాని తెప్పిరిలిలేచి సేనలఁ బురికొల్పుచుండెను.

సీత : (నివ్వెఱపాటుతో) అయ్యో ! నాయనా, యింకెక్కడి కుశుఁడు ? ఒక్క బాలుని ఇంతసైన్యము పొదువుట వీరనీతియా ?

మాండ : అమ్మా, అంతట కుశుని యవస్థ చలిచీమలకుఁ జిక్కిన యురగ కిశోరమువలె నైనది. (దుఃఖించును)

సీత : (దుఃఖముతో) నన్ను వంచించితివి. వంచించితివి. ఇంతదనుక కుమారుని శౌర్యవినోదమున మైమఱపించి యతర్కితముగ సత్యమును బ్రత్యక్షము గావించితివి. నాముద్దుకుమారా, రఘువంశ కరీరమా, నాభాగ్య సర్వస్వమా, అసహాయుఁడవై రణరంగమునఁ గూలితివా ?

శరముల పోటు గంటుల నజస్రము నెత్తురు లూటకాల్వలై
తొరఁగి శరీరముందడుప దుర్భర వేదన కోర్వలేక యె

*త్రెళ్ఱఁగునఁ బల్లటిల్లి రణదేశమునన్ శయనించితో ! మనం*
*బెరియఁగ నన్నుఁ దమ్మని నిఁకెంతగ లోఁదలపోసి కుందితో*

అయ్యో ! కుశకుమారా, నాకన్నుల వెన్నెలా, నన్నును నీముద్దు తమ్ముని విడనాడి పోయితివా ? వాల్మీకి నాయన వచ్చి కుశుఁడేడీ యన్న నేనేమి చెప్పుదును తండ్రీ ? ప్రియ తనూజా, నన్నుఁగూడ నీతోడఁ గొనిపొమ్ము. (మూర్ఛిల్లును)

మాండ : అమ్మా, యూరడిల్లుము. నేఁబోయి లవుని దీసికొనివచ్చెదను. (నిష్క్రమించును.)

సీత : (తెప్పరిల్లి) నాయనా కుశకుమారా, ఒక్క నిమిషంబున లోకమెల్ల వెలిఁగించి మఱునిమిషంబున నష్టమించు నుల్కవలె నయినదా నీ బ్రతుకు ? వాల్మీకి నాయనగారుండిన సత్తపః ప్రభావమునఁ బునర్జీవిని గావించియుండునేమో గదా ! అకటా ! నాబోఁటి దురదృష్టవతికి నంతటి భాగ్యమబ్బునా ? నా ముద్దుకూనా, పండ్రెండు వత్సరములకే నీకు శతాయుష్యము సంపూర్ణమైనదా?

*పూర్ణిమా చంద్రుని బురుణించు నీమోము*
*కళలెల్లఁ దఱిగెనే కన్నతండ్రి !*
*కల్వఱేకులు వోలు కన్నులు జిగిమాసి*
*మూతలు వడియెనే ముద్దుకూన!*
*సువిశాల ఫలకంబు సొంపుమీఱు నురంబు*
*శోణితం బొలికెనే సుందరాంగ !*
*ఆజానులంబమై యలరు దోర్యుగళంబు*
*బలము దొలంగెనే కలికి పట్టి !*

*ఆశలకు నెల్ల నాలంబమైన నీవు*
*సంగర క్రోడశాయివై సమసినావె !*
*యిట్టి ప్రత్యక్ష సత్యంబు నెఱిఁగియుండి*
*పగులదేమొ నాహృదయమ్ము బ్రద్దలగుచు.*

అయ్యో ! నా ముద్దుబిడ్డా, నన్ను నట్టడవులపాలుచేసి పోయితివా ?

(లవుఁడును మాండవ్యుఁడును ప్రవేశింతురు)

నాయనా, నీ ముద్దులయన్నను గోల్పోయితిమి. (లవుని కౌఁగిలించుకొని దుఃఖించును)

లవు : అమ్మా, యేడువక చెప్పుము. గుఱ్ఱమేమైనా అన్నను కఱచెనా ?

సీత : అయ్యో ః నాయనా, యది యజ్ఞాశ్వమఁట గదా.

లవు : అయిననేమి ?

మాండ : అయిననేమియా ? అదియే ప్రాణాంతకమైనది.

సీత : అశ్వరక్షకులు కుశునితోఁ బోరాడిరఁట.

లవు : ఏమీ ? అన్నను నొప్పించిరా ?

మాండ : నొప్పించుటయా ! కంఠగతప్రాణునిఁ జేసి రనుము. ఎవరికైన నంతపొగరు తగదు. అందులో తాపసార్భకు లెట్లుండవలయు ?

సీత : మాండవ్యా, ఇది నీతిబోధలకుఁ దరుణమా ?

లవు : ఏమంటివి ? కంఠగతప్రాణునిఁ జేసిరనియా ?

*ఉన్నారా కుశునొంచువీరులు నృపవ్యూహంబునం దెచ్చటన్ ?*
*విన్నామే పులిపిల్ల ముట్టి వృకముల్ పీడించి చెండాడుటల్ ?*
*గన్నామే యిటువంటివింత ? యయినంగానిండు ; నేఁబోయి మా*
*యన్నం దెత్తు రిపు ప్రభేదన చణ వ్యాపార పారీణతన్.*

మాండవ్యా, నన్నా కదనరంగమునకుఁ గొనిపొమ్ము.

మాండ : (స్వగతము) అయ్యో ! నాకే రావలయునా యీ మహావిపత్తు ? మునుఁగఁబోయి మొసలికిఁ జిక్కితిని. ఒక్క శిలీముఖము తప్పిదారి నాపైఁబడినఁ బ్రాణముల నూటికొనకమానదు. (ప్రకాశముగ) లవా, యిట్టి కార్యముల బాల్యచాపలము ఆపదలకు మూలమగును.

సీత : నా ముద్దుకూనా, నీకేల యీదుర్బుద్ధి ? తారతమ్య మెఱుంగక పోరిన కుశకుమారుని గతి యేమైనది ?

*చంద్రబింబమ్ము జలద సంఛన్నమయ్యెఁ;*
*గాఱుచీఁకటి నల్గడఁ గ్రమ్ముకొనియెఁ ;*
*దారకలు మాసి యొక్కటే తార నిలిచె ;*
*నదియు మఱిఁగిన గతియేమి యయ్యనాకు ?*

లవు : అమ్మా, రోషాగ్నిజ్వాలల నానెత్తురు తుకతుక యుడుకుచున్నది. ప్రతిహింసావేశము నన్నుఁ బెరరేఁపుచున్నది. నన్ను వదలుము.

సీత : నాయనా, నీముష్కరత చాలింపుము. కడసారి నాముద్దుకొమరుని మృత కళేబరమునైనఁ గాంచుటకు నన్నుఁ గొనిపొమ్ము.

లవు : తల్లీ, నీవు విచారింపవలదు. అన్న సర్వతోముఖబాణప్రయోగ దక్షుఁడు. అతఁడు మరణించియుండుట కల్ల. అన్న మూర్ఛిల్లి యుండిన భీతిల్లి ఈ మాండవ్యుఁడు పరుగెత్తియుండును.

మాండ : నీవు మాత్రము భీతిల్లకుందువా ? అప్పటికిని ధైర్యవంతుఁడను గావున దూరమున నుండియైన నంతయుఁ దెలిసికొని వచ్చితిని.

లవు : అమ్మా, కాలవిలంబనమగుచున్నది. నన్నుఁబోనిమ్ము. (కౌఁగిలి విడిపించుకొనును)

సీత : నాయనా, నామాటవినరా.

నాదుముద్దుకూన, నాకన్ను వెన్నెలా,
నాదు భాగ్యరాశి, నాకుమార,
పుత్రశోక వహ్నిఁ బొగిలింపనెంచితే ?
రార కన్నతండ్రి, రణమువలదు.

లవు : అమ్మా, యాకూళలకు అన్నయ్యను నప్పగించి నన్ను సుఖముండు మనియెదవా?

అన్నను నొంచినట్టి యభియాతిబలంబులు చెట్టుపుట్టలన్
వెన్నడి మున్నడింబఱవ భీషణ సంగరమందు మబ్బులోఁ
జెన్నగు మించునా మెఱసి చిందఱవందఱచేసి శౌర్యమ
భ్యున్నతి నొందఁ దెచ్చెద సహోదరు నీవు ముదంబుఁబొందఁగన్

సీత : మాండవ్యా, యిఁక నేనేమి చేయుదును ? ఈలవుఁడు నామాట సరకు సేయకున్నాఁడు ?

మాండ : అమ్మా, నీవు బ్రతిమాలినను విననివానికి నా సదుపదేశము చెవిని దూరునా ?

లవు : తల్లి నీవైన వాల్మీకి తాతయైనఁ
దాపసేశ్వరులైన విధాతయైన
అన్న యవమానమునకు రోషాగ్నిరగులు
నన్ను నిలుపంగలేరని నమ్ముమమ్మ.

అమ్మాయిఁకఁ బోయివచ్చెదను. మాండవ్యా, రమ్ము.

మాండ : పోదము పద.

(ఇరువురు నిష్క్రమింతురు)

సీత : (చేతులుజోడించి) అయ్యో ! జగదీశ్వరా, యీ ముద్దుకుమారునైన రక్షింపవా ?

సూర్య చంద్రులార, సురలార, మునులార,
కన్నతండ్రులార గావరయ్య,
యిలను నెల్ల నేలు నిక్ష్వాకు భూపాలు
ముద్దుపట్టి నాదు ముద్దుపట్టి.

(యవనిక జాఱును)



## చతుర్థ స్థలము : అడవి

(కుశుఁడు మూర్ఛిల్లియుండును ; లక్ష్మణుఁడు ప్రక్కన నిలఁబడియుండును)

లక్ష్మ : కటకటా ! నేనెంత యకార్యమొనరించితిని ? రోషావేశమున నీ ఋషికుమారుని, ఈ శూర బాలకుని, ఈ సౌందర్యరాశిని నా కఱకు టమ్ముల కెఱ గావించితిని!

సగము పూచిన యెఱ్ఱ లొద్దుగపురెమ్మ
గాలితాఁకున నేలను గూలినటులఁ
దూపుగంటుల నెత్తురు దొరఁగుచుండ
ధరణి యొడిలోనఁ బవళించెఁ దపసి సుతుఁడు.

ఆహా ! నా యవివేకమునకు నాకే లజ్జ వొడముచున్నది ! ఋషి కుమారు దునుమాడినందుకు అన్న కోపింపక మానఁడు. ఈ కుమారుని దురవస్థఁ గాంచినఁ దాప దంపతులు నన్ను శపింపక మన్నింతురా ?

ఉత్సాహ. :

*చిగురుటాకు జొంపమందుఁ జిచ్చువెట్టి యవ్వలన్*
*వగలఁ బొగులు మూఢునటుల బాలకున్ మనోహరున్*
*విగతజీవుఁగానొనర్చి వీరలోక మందు నే*
*నగడు గుడుతు నంచుఁ జిత్తమారటంబు నొందెడిన్.*

ఆహా !యీ తాపస బాలకునిపై నకారణవాత్సల్యము నాకేల గలుగుచున్నది? ఇది తపోవన మహత్త్వమాయేమి ?

*అరిదెగటారిన యందుకుఁ*
*బరగదు మోదంబునాదు భావమునందున్*
*బరమ సుహృన్మరణంబనఁ*
*గర ముమ్మలికంబు నన్నుఁ గళవళపెట్టున్.*

ఆహా ! బాలకుని యవయవములు మెల్లమెల్లగఁ గదలు చున్నవి. శరాఘాతముల నీకుమారుఁడు మైమఱచి పడియుండెనే గాని, దైవవశమున మరణింపఁడాయె. ఈ వీర కిశోరమును మా శిబిరమునకుఁ గొనిపోయి వ్రణచికిత్సగావించి, యన్నకు ఉపాయన ముగ అయోధ్యకుఁ బంపెదను.

(కుశునినెత్తి భుజముపై వైచికొనును)

(లవుఁడు ప్రవేశించును)

లవు : (స్వగతము) ఓహో ! యీ రాజకుమారుఁడు అన్న నెత్తుకొని వెడలుచున్నాఁడు. (ప్రకాశము) ఓయీ, నిలుము, నిలుము, నీ దొంగతనము సాగుననుకొంటివా?

నేను మాయన్న వెంబడి లేనియపుడు
లెక్కయిడరాని సైనికులొక్కమొగిని
పుట్టతేనెకు నీఁగలు మూఁగినటుల
ముట్టడించి వధించియుఁ బోవువారె ?

లక్ష్మ : (కుశుని నేలపైఁ పరుఁడబెట్టి స్వగతము) ఔరా ! యీ బాలకుఁడెవ్వడు ? ఈ మూర్ఛితుని ప్రతిబింబమో యనునట్లున్నాఁడు ! వీరిరువురు కవలైయుందురా?

లవు : ఓయీ, శూరమ్మన్యుఁడా, మీరాచవారి శూరత్వమిట్టిదియేనా ? ఒక్క బాలకుని అందఱు సైనికులు పొదివి తెగటార్చుటయే గాక అతని మృతకళేబరము సైతము దొంగిలించుకొని పోవుచున్నావా ?

ఓయీ, ఆకళేబరమును విజయోపాయనముగఁ దలంచుము. అన్యోన్య జిగీషువులమగు మనలో నెవరు గెలచినను ఆ పారి తోషికమును గైకొందము.

లక్ష్మ : బాలకా, నీవీ ఋషికుమారునకు సోదరుఁడవా ?

లవు : నీకు నకాల మృత్యువును.

లక్ష్మ : అంతరమెఱుంగక బాల్యచాపలమున మార్కొనిన యీ బాలుని గతి యేమైనదో చూడుము.

లవు : (శింజినీ టంకారము చేయుచు) ఇఁక నీగతి యేమికానున్నదో తెలిసికొనుము.

కుశు : (మెల్లగఁగనువిచ్చి) తమ్ముఁడా, నాకుఁ దోడ్పడవైతివా ? మరణ శయ్యయందైన నొక్కమాఱు కౌఁగిలించుకొని నన్ను వీరస్వర్గమునకు వీడ్కొల్పవా ?

లవు : (విల్లుక్రిందవైచి) ఆహా ! మా భాగ్యవశమున అన్న బ్రతికి యున్నాఁడు. (దగ్గరకు పోయి మోకాలిపై వంగి) అన్నా, నిన్ను దురాత్ములు నొప్పించిరా ? నన్నేల ముందుగఁ బంపివైచితివి ?

కుశు : తమ్ముఁడా, నేనిపుడెక్కడ నున్నాను ?

లవు : రణరంగమున.

కుశు : ఇంకను రాజకుమారుఁడు బ్రతికియున్నాఁడా !

లవు : వీఁడుగో ! యజ్ఞపశువువలె బంధనమునకు సిద్ధముగ నున్నాఁడు.

కుశు : (చేతిపై సగములేచి) ఏఁడీ ?

లక్ష్మ : (స్వగతము) ఔరా ! ఏమి యీ కుమారుని క్షాత్రము ?

శరఘాతంబుల వేదనన్ సొలయుచున్ శార్దూలపోతంబు నె
త్తురులొల్కంగ సగంబునిక్కి మృగయుం దుండాడ నుంకించెనా
శరవిద్ధాంగుఁడు బాలకుం డురు రుషా సంక్షుబ్ధ చిత్తంబునం
బరఁగున్ ; బాపురె ! వీరమోహన రణప్రావీణ్య రూపంబనన్.

కుశు : లవా, నావింటి నిటు లందియిమ్ము. (లవుఁడు అందియిచ్చును) (స్వగతము) ఔరా ! నాకరము శరాసన భారమునైన నోర్వకున్నది. (వింటిని దిగవిడచును)

లవు : (శింజినీ టంకారము సేయును)

(వాల్మీకి ప్రవేశించును)

వాల్మీ : ఆహా ! శాంతికిఁ దావలమైన తపోవన మేలాకో ఆర్ద్ర శోణిత పిశితంబులఁ గళంకితమైనది.

లవు : రాజకుమారా , నీ ప్రాణములఁ గాచికొమ్ము.

మాజనని సర్వలోక సమ్మాన్యవృత్త
పూత చారిత్ర వీరప్రసూతయేని
తాత వాల్మీకి సత్తపో ధన్యుఁడేని

వాల్మీ : ఎవరు నన్నుఁ బేర్కొనుచున్నారు ?

లవు : అస్త్రమియ్యదె,

వాల్మీ : ఆహా! ప్రమాదము. విడువక యాఁగుమాఁగు.

లక్ష్మ : మునిచంద్రమా, లక్ష్మణుఁడు మ్రొక్కుచున్నాఁడు.

వాల్మీ : కుమారా, వర్ధిల్లుము !

కుశు : (స్వగతము) లక్ష్మణుఁడా యీతఁడు ?

లవు : తాతా, (వాల్మీకిని కౌఁగిలించుకొని) యీ దురాత్ముని సేనలు అన్నను ముట్టడించి మూర్ఛిల్లఁజేసినవి. అన్నను బ్రతికింపుము.

కుశు : తాతా, నన్ను శీఘ్రముగ వీరస్వర్గమునకు వీడ్కొల్పుము. ఈ శరాఘాత వేదన దుర్భరమగుచున్నది.

వాల్మీ : (స్వగతము) ఆహా! దైవఘటనాచిత్రము! (ప్రకాశముగ) నాయనా, యూఁరడిల్లుము. నీవు వజ్రకాయుఁడవు కాఁగలవు.

లక్ష్మ : (స్వగతము) ఏమీ వాల్మీకి మునీంద్రుల మనుమలా యీ వీరకుమారులు ? ఆజన్మ బ్రహ్మచారికిఁ గుటుంబము కలదా ?

వాల్మీకి : (కుశునిపైవంగి) నాయనా కుశా, (ఒడలు నిమురుచు) నీ శరాఘాతములన్నియు నిర్బాధకములయ్యెడిని లెమ్ము.

లక్ష్మ : (స్వగతము) ఆహా తపోధనుల మహత్వము !

కుశు : తాతా, సమయమునకు వచ్చి నన్ను రక్షించితివి.

లవు : అన్నా, వేదన శమియించినదా ?

కుశు : లవా, తాతగారి తపఃప్రభావ మమోఘము గదా ?

*చేతితోఁ దీసి వైచిన రీతిగాఁగఁ*
*దూపుగంటుల వేదన తొలఁగిపోయెఁ ;*
*బూర్వదోర్బల ముత్సాహమును జెలంగెఁ ;*
*దగుదు నేనింక వైరి మర్దనము సలుప.*

వాల్మీ : కుమారా, యీ పట్టుదలవదలుము. మాననీయులయెడ అపరాధ మొనరించితివి.

కుశు : (స్వగతము) ఆహా ! ఏమి వాల్మీకి తాతగారి పక్షపాతము.

వాల్మీ : లక్ష్మణా. గొప్ప ప్రమాదము వాటిల్లినది. లోక విఖ్యాత వీరులగు మీర లీబాలురతోఁ బోరాడుట ధర్మమా ?

లవు : (స్వగతము) ఇంద్రజిత్సంహారకుఁడగు లక్ష్మణుఁడా యీతఁడు?

లక్ష్మ : మునికులతిలకా, మన్నింపవలయు. ఈ కుమారకుల మనోహర స్వరూపములు నా హృదయమును గరుణావేల్లితమును గావింపఁ బోరుట కిష్టపడక సవనాశ్వమును వదలుఁడని యెంత బ్రతిమాలు కొన్నను వీరు వినరైరి. నా ప్రయత్నము సాఁగమి రఘుకులేశ్వరు ప్రతిజ్ఞ నెఱవేర్చుటకై అనిష్టముతో నైనఁ గదనము సలుపవలసి వచ్చెను.

లవు : (స్వగతము) వాల్మీకి తాతగారు రాకుండిన నింతవఱకే ప్రతిజ్ఞ నెఱవేర్చియుందువు కాఁబోలు !

వాల్మీ : నాయనా, గతమునకుఁ జింతించిన లాభములేదు. ఈ తపోవనము ప్రవేశించి

మా కతిథివైతివి.

లక్ష్మ : మహాప్రసాదము.

లవు : (కుశుని వంకతిరిగి) అన్నా, మనల నొప్పించిన దురాత్మునకు ఆతిథ్యమొసఁగ వలయునా ?

కుశు : లవా, తాతగారు ఆశ్రమ ధర్మములకు వెలియౌదురా ?

వాల్మీ : కుమారులారా, ఆశ్రమమునకుఁ బోదమురండు ; అతిథి సత్కారధన్యుల మగుదము. (స్వగతము) దైవవశమున నేను సమయమునకుఁ దీర్ఘయాత్రనుండి మరలిరాకున్న నెంత ప్రమాదము వాటిల్లియుండునో !

(అందఱు నిష్క్రమింతురు)



## పంచమ స్థలము : వాల్మీకి ఆశ్రమము

(వాల్మీకియు సీతయు సంభాషించుచుందురు)

వాల్మీ : కుమారీ, ఈ విషయము చక్కఁగ నాలోచింపుము. ప్రజలింతకుమున్నె తమ యవివేకమును తెలిసికొని పశ్చాత్తాప పడుచుందురు. పుత్రవతిని నిన్ను రామచంద్రుఁడు కన్నులఁ గప్పికొని స్వీకరించును.

నేలనాలుగు చెఱగులు నేలజాలు
వీరవీరులు కుశలవుల్ వెలఁదిమిన్న,
అట్టికొమరుల సౌఖ్యంబు నరసియైనఁ
గాంతు సన్నిధిఁ గాలంబుఁ గడపుమమ్మ.

సీత : నాయనా, సర్వమెఱింగిన మీరే యిట్లాడుచున్న నిఁక నే నేమి పలుకఁగలను ? ఆర్యపుత్రునకు నాకన్నను గుమారులకన్నను కీర్తియే గదా యాదరణీయము.

వాల్మీ : కుమారీ, నిన్ను మరలఁ బరిగ్రహించుట వలన రామచంద్రుఁ డపకీర్తివంతుఁడౌనని యెంచెదవా ?

సీత : ప్రజలట్లు తలంతురు.

వాల్మీ : అమ్మా, లక్ష్మణుని వలన నంతయు నెఱింగితిని. నిన్ను వనములకుఁ బంపి నందులకు జనులు రామచంద్రుని తొందరపాటును దూలనాడుచున్నారఁట!

సీత : ఆహా ! ఏమి లోకుల చిత్తచాంచల్యము !

నోటి కడ్డమాఁకయులేక మాటలాడి
సత్యము నసత్యమెఱుఁగరు జడహృదయులు ;
గాలి వీచిన యట్లెల్లఁ గదలియాడు
కేతనాంచల మటు వారి చేత మలరు.

వాల్మీ : జానకీ, జనసామాన్యము కర్ణధారిలేని నావవలె ముందు వెనుకకుఁ ద్రుళ్ళింత లాడుచు అనేక విధములఁ బోవుచుండును.

సీత : నాయనా, యశ్వమేధ మొనరింప సమకట్టిన యార్యపుత్రుఁడు నూతనముగ సహధర్మచారిణిని బరిగ్రహించియుండునుగదా !

వాల్మీ : బిడ్డా, రామచంద్రుఁడు ఏకపత్నీ వ్రతుఁడని యెఱుంగవా ?

సీత : అట్లయిన సహధర్మచారిణి లేక యజ్ఞదీక్ష యెట్లు వహించును?

వాల్మీ : నీ ప్రతిబింబమగు స్వర్ణమయ విగ్రహమె సహధర్మచారిణి యగుట!

సీత : (ఆశ్చర్యముతో) ఏమీ యీవింత ! ఆర్యపుత్రుఁడెంతటి కైనఁ దగియున్నాఁడు.

వాల్మీ : శాస్త్రసమ్మతమని యెందఱో ధర్మవేత్తలగు తాపసు లుపదేశించినను ద్వితీయ పరిగ్రహమున కియ్యకొనక నీ ప్రతికృతిగ గాంచన విగ్రహమును నిర్మింపించి రఘుకులేశ్వరుఁడు దీక్షాకంకణము ధరియించెనఁట!

సీత : (స్వగతము) ఆర్యపుత్రుని యేకపత్నీ వ్రత మెల్లకాలము వర్ధిల్లుఁగాక!

వాల్మీ : అమ్మా, రామచంద్రుఁడు నిన్ను విడనాడియుండువఱకు స్వస్థ చిత్తుఁడు కాఁజాలఁడు.

*నిండుచూలాలి విడనాడ నేర్చెఁగాని*
*విరహతాపంబు రాముఁడు వీడలేఁడు ;*
*పవలు రేయును నిన్నెంచి పనవిపనవి*
*పాండురోగి విధంబునఁ బాలిపోవు.*

సీత : (స్వగతము) ఆర్యపుత్రునకు వినోద హేతువైన ఆ కనక విగ్రహమునకన్న సంతాపకారిణినగు నేనే దురదృష్టవతిని.

(కుశలవులు ప్రవేశింతురు)

కుశు : తాతా, మా పాఠముల నొప్పగించుకొనుము. మేము పూజాపుష్పములు గోయఁబోవలయు.

వాల్మీ : నాయనలారా, పాఠములటుండనిండు. అయోధ్యాపతి యొనరించు అశ్వమేధమునకు మన మాహ్వానింపఁబడితిమి. మనమందఱము నేఁడేఁరాజధానికిఁ బ్రయాణము కావలయు.

లవు : తాతా, అమ్మకూడానా ?

వాల్మీ : అవును ?

కుశు : తాతా, అట్లయిన మేము రామాయణ కథానాయకునిఁ బ్రత్యక్షముగఁ జూడఁగలమా?

వాల్మీ : నిస్సంశయముగఁ జూడఁగలరు.

సీత : (స్వగతము) ఆర్యపుత్రుఁడు తమతండ్రియని తెలిసిన ఈ కుమారకులెట్లు సంతసించువారో గదా !

లవు : తాతా, ఆ లక్ష్మణుఁడేమైన మాపై లేనిపోని తంటాలు చెప్పునేమొ ?

వాల్మీ : న న్ననుసరించు మీకు నేలాటిభయముండదు లెమ్ము.

లవు : అన్నా, రమ్ము, చక్కగ ఉతికియారవైచిన వల్కలములు ధరియించు కొని సిద్ధముగ నుందము. (కుశలవులు నిష్క్రమింతురు).

వాల్మీ : కుమారీ, తాపస సువాసినుల యాశీర్వాదములు వడసిరమ్ము.

సీత : అటులనే పోయివచ్చెదను. (నిష్క్రమించును.)

వాల్మీ : నే నిన్నిదినములుఁ దలపోయుచుండిన కార్యము అతర్కితముగ అశ్వమేధ సందర్శనమూలమున సిద్ధింపనున్నది. ఇఁకనైన రామ భద్రుఁడు దారాపుత్రవంతుఁడై సుఖియించుఁగాక

(నిష్క్రమించును)



# అష్టమాంకము

## ప్రథమ స్థలము : యాగమంటపము

(రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులును,

రాజులును, మునులును, ప్రజలును కూర్చుండియుందురు.)

రాము : (స్వగతము) అకటా ! సర్వాంగనిర్వాణదాయిని యగు నా జానకిని మోసగించి యడవులకు వెడలించి కృత్రిమమగు కనకవిగ్రహముతోడ నే నీ యాగమంటపము నలంకరింపవలయునా ? ఈ సాహసము సీతా బహిష్కారమునకన్న హృదయభేదక మగుచున్నది.

వసి : రామభద్రా, కంకణము ధరియించికొమ్ము.

రాము : (చేయిచాఁపును. వసిష్ఠుఁడు కంకణము కట్టుచుండును.)

*అవనిజాత రాముని బహిఃప్రాణ మనుచు*
*నెల్లరనుకొను సత్యంబు కల్లయయ్యె ;*
*నట్లుగాకున్న జానకి నడవి కంపి*
*పాపి రాముండు నింకను బ్రతికియున్నె ?*

వసి : రామచంద్రా, హుతాశనున కంజలి ఘటియించి హోమకుండము రగుల్పుము.

రాము : (ఉల్క చేతఁబట్టుకొని కుండము తప్పించి రగిలించుచు.) (స్వగతము) సీతా విరహితమైన ఈ యశ్వమేధము నే నెట్లొనర్తును?

*నాదు గృహలక్ష్మి , యర్ధాంగి, నా మనో ల*
*తాంత మకరంద బిందువు చెంతనుండ*
*నెన్ని జన్నంబు లొనరించి యున్న నాకు*
*ధర్మపత్ని యయ్యె నిటఁ గుందనపుబొమ్మ.*

లక్ష్మ : (స్వగతము) శోకాకులితచిత్తుఁడగు మాయన్న యజ్ఞవిధుల సాంతముగ నొనరింపఁ గలఁడా ?

రాము : (స్వగతము) జానకీ, నీకై యొనర్చిన అనన్యసాధ్యములగు సాహస కార్యములు నేఁడు నిష్ప్రయోజనము లాయెఁగదా !

నీవు లేకుండిన నిస్తుల బలశాలి
వాలిఁ జెండాడుట వమ్ముగాదె ?
నీవు లేకుండినఁ బావని జృంభించి
వనధి దాఁటుటయు నిష్ఫలముగాదె ?
నీవు లేకుండిన నిఖిల వానరసేన
యబ్ధిగట్టుట వ్యర్థమౌనుగాదె ?
నీవు లేకుండిన నిర్ణిద్ర రణవీరు
రావణుఁ జంపుట రవ్వగాదె ?

స్వార్థపరత నిన్ను సాధుచరిత్రను
జేతులారఁ గానఁ జేరఁద్రోసి,
వెఱ్ఱిపట్టినటుల వెకలినై చింతింతు
గడచినట్టి దుష్ట కార్యమునకుఁ

(వాల్మీకి కుశలవులు ప్రవేశింతురు)

వాల్మీ : రామభద్రా, మంగళమగుఁగాక !

రాము : మునీంద్రా, భవదాగమమునఁ గృతార్థుఁడనైతిని.

మునులు : తథాస్తు. తథాస్తు.

రాము : (స్వగతము) లక్ష్మణుఁడెఱింగించిన సౌందర్యమూర్తు లీయిరువురు వటువులై యుందురా ?

(సభలో గుజగుజలు)

రాము : మునీంద్రా, యీ తాపస వటువు లెవ్వరి కుమారులు ?

వాల్మీ : వీరొక వనవాసిని బిడ్డలు.

లవు : (జనాంతికము) అన్నా, యీ యజమానుఁడేనా రామాయణ కథానాయకుఁడు?

కుశు : అట్లే తోఁచుచున్నాఁడు. తమ్ముఁడా, యీ శాంతస్వరూపుని దర్శించి నంతఁ దల్లినిగాంచినంత యనురాగ ముప్పతిల్లుచున్నది !

లవు : అన్నా, వాల్మీకి తాత సత్యమే వర్ణించెను.

రాము : మునీంద్రా, ఆ వనవాసిని యెవ్వతె ?

వాల్మీ : ఎవ్వతెయో యొక గర్భిణి వనముల నిస్సహాయయై పరితపించు చుండ, నే నాశ్రమమునకుఁ దీసికొనిపోయి కుమారీ నిర్విశేషముగఁ బోషించుచుంటిని.

రాము : తాపసోత్తమా, యీనిర్హేతుకవాత్సల్యము మీ దివ్యచిత్తమున కను రూపమైనది. - తరువాత ?

వాల్మీ : కొన్ని దినముల కా సీమంతిని యీ కవ బిడ్డలను బ్రసవించెను.

రాము : (స్వగతము) ఆహా ! ఈ సుందరకుమారులఁ గాంచినప్పటినుండి నా మనము పరిపరి విధములఁ బోవుచున్నది ! అదియేలాకో వీరి ముఖ మండలముల వైదేహి పోలికలు పొడకట్టుచున్నవి. నా భ్రాంతియే యిట్లు తోఁపించుచున్నదా?

(ప్రకాశముగ) కుమారులారా, యిటురండు

వాల్మీ : (స్వగతము) వాత్సల్యబీజమా, యంకురింపుము.

కుశలవులు : (అనుజ్ఞకై వాల్మీకితట్టు చూతురు)

వాల్మీ : నాయనలారా, భయపడకుఁడు రామభద్రుఁడు సర్వ ప్రజలకు జనక ప్రాయుఁడు.

కుశలవులు : (రాముని యొద్దకుపోదురు)

రాము : (ఇరువురను రెండుచేతులఁ జేరదీసికొని, స్వగతము)

ఆహా ! ఏమి యీ యాశ్చర్యము !

ఈ మనోహరాంగు లీ ముద్దుకొమరులు
నన్ను నంటినంత సన్నుతాంగి
జనకజాత హస్త సంస్పర్శమట్టులఁ
గాయమెల్ల నమృత కలితమయ్యె.

కుశు : (స్వగతము)ఏమి, యీ మహాత్ముని తాపసాదరణము ?

లవు : (స్వగతము) తండ్రి కౌఁగిలి నెఱుంగని నా శరీరము ఈ మహా రాజు కౌఁగిట సుఖించుచున్నది.

రాము : కుమారులారా, మీ నామధేయములేమి ?

లవు : మహారాజా, యీయన కుశుఁడు.

కుశు : రాజచంద్రా, యీతఁడు లవుఁడు.

రాము : (స్వగతము) ఎంత కఠోర సంబోధనములు!

వసి : వత్సా, యిఁక యజ్ఞవిధుల గమనింపుము.

వాల్మీ : వాయనలారా, మీరిఁకరండు.

కుశలవులు : (కౌఁగిలి వదల్చుకొని వాల్మీకి దగ్గఱకు వత్తురు)

రాము : (స్వగతము) ఆహా! కౌఁగిలి వదల్చుకొనిపోవు నీబాలకుల నాచిత్తము గూడ ననుసరించుచున్నది. ఆగర్భవతియే సీతయై యుండిన ఈ ముద్దుకొమరులే నా బిడ్డలైయుండిన --ఆశా, యీ మందభాగ్యుని యందు నీయూహలన్నియు నిరర్థకములు.

(శూర్పణఖ నీడ్చుకొని విభీషణుఁడు ప్రవేశించును)

విభీ : *ఓసి కులపాంసనీ, చండి, యోసి జంత,*
*నాకు సోదరివై పుట్టినావె నీవు ?*
*కత్తికొక్కొక్క కండగాఁ గాయమెల్లఁ*
*దఱిగివైచినఁ బోనె పాతకము కుటిల ?*

లక్ష్మ : దానేశ్వరా, యాగమంటపముననా స్త్రీ హత్య ?

రాము : విభీషణా, ఏమి యీ దౌర్జన్యము ?

విభీ : రఘుకులేశ్వరా, యీ మాయలమారిజంతను ఇప్పుడే శిరచ్ఛేదన మొనరించుట కాజ్ఞ యొసఁగవలయు. ఈ శూర్పణఖయే నిరపరాధి నియగు జానకీదేవి బహిష్కారమునకు మూలము. ఈ రక్కసి యొనరించిన కుట్రలన్నియు నాకుఁ దెలియవచ్చినవి.

రాము : (ఆశ్చర్యముతో) ఏమేమి ?

లక్ష్మ : (స్వగతము) ఇది యేమివింత ?

రాము : విభీషణా, యీ శూర్పణఖ యేమిచేసినది ?

విభీ : ఈ క్రూరచారిత్రయే తన దుష్టకృత్యమును దెలిసికొనుఁగాక.

(సభలో గుజగుజలు)

శూర్ప : దీనరక్షామణీ, ఆపద్బాంధవా, రామచంద్రా యాఁడు కుయు లాలింపుము. అనాథవత్సలా, ఈ పాపాత్మను రక్షింపుము. నాతప్పు క్షమియింపుము. నన్ను బ్రతుకనిమ్ము.

భరతు : (స్వగతము) ఈ రహస్యము పూర్వమే తెలిసియుండిన జానకీదేవి యడవులకుఁ బంపఁబడి యుండదుగదా.

విభీ : ఓసీ మాయలమారీ, నీబొంకులింకఁ జాలింపుము. సీతాపవాద కళంకము నీ హృదయ రక్తపూరమునఁ గడిగివేయవలయును.

శత్రు : (స్వగతము) శూర్పణఖ కుట్రయా యింతటికిం గారణము!

శూర్ప : దీనబాంధవా, రామభద్రా, యీ దీనురాలికి నభయప్రదాన మొసంగి రక్షింపుము.

ప్రాణవల్లభఁ జీకాకు పఱచినట్టి
కాకదైత్యుని సైతముఁ గాచినావు ;
అఖిలలోక శరణ్యుండవైన నిన్నుఁ
బ్రాణదానంబు వేఁడెద రామభద్ర.

లక్ష్మ : అన్నా, యీ మాయావినియందు నెనరూనఁదగదు.

రాము : దానవీ, నీవెట్లు సీతాపవాదమునకు మూలమవైతివి ?

శూర్ప : మహారాజా, యథార్థము చెప్పుచున్నాను. నన్ను రక్షించినను శిక్షించి నను మీ కరుణయే.

రాము : చెప్పుము.

శూర్ప : రాక్షసవినాశన ప్రతీకారమొనరింపఁ గోరి జానకీదేవిని నెట్లైన నడవులఁ గష్టపెట్టనెంచి అయోధ్యఁ జేరితిని. మాఱువేసంబునఁ జరించుచు జనసమ్మర్దములగు ప్రదేశముల ఏమేమొ యపవాదములు వ్యాపింపజేసితిని. రామభద్రా, రక్షింపుము. రక్షింపుము.

ప్రజలు : జానకీదేవి నిష్కళంక--సీతాదేవి సాధుచరిత్ర--

రాము : (స్వగతము) ఓసీ క్రూర రాక్షసీ, నీపగ తీర్చుకొంటివా?

విభీ : మహారాజా, ఈకపటచారిణిని దెగటార్చుటకు ఆజ్ఞవెట్టుము.

శత్రు : అన్నా, ఈ రాక్షసి కరుణార్హగాదు.

నిండుచూలాలి వైదేహి నిష్ఠురంపుఁ
గష్టములకుఁ గారణమైన దుష్టురాలిఁ
గఱకు కఱవాలమునఁ జీల్చి కండలెల్లఁ
గాకులకు గ్రద్దలకు వైవఁ గౌతుకంబు.

రాము : తమ్ముఁడా దీక్షాకంకణపూతమైన నా హస్తము అపరాదిని రక్తమందైన ముంపఁజాలను. ఈ కుటిల చరిత్రను హింసించినను నా ప్రాణ వల్లభ మరల బ్రతికివచ్చునా ? శూర్పణఖా, వెడలిపొమ్ము. పాప పరిహారముఁ గావించుకొనుము.

శూర్ప : రఘుకులేశ్వరా, నీయనంత కారుణ్యము వర్ధిల్లుఁగాక ! దార పుత్రవంతుఁడవై సుఖింపుము.

రాము : (స్వగతము) జానకి జీవించియున్నఁగదా --

ఋషులు : రామభద్రా, నీయతిలోక దయాళుత్వము ప్రశంసనీయము.

విభీ : శూర్పణఖా, రామచంద్రుని యాజ్ఞలేమి నీవు వధింపఁబడక బ్రతికి తివి . ఇఁక లంకయందడుగిడిన నా కరవాలము నీప్రాణముల నూటికొనును. పొమ్ము. నీపాపాత్మతరియించునటుల నెక్కడనైన వనమందుఁ దపమాచరింపుము.

శూర్ప : (స్వగతము) పులివాతఁబడిన జింకపిల్ల జాఱిపడినటుల ఈ విభీషణుని చేతినుండి తప్పించుకొంటిని. ఇఁక నెక్కడికైనఁబోయి నాజీవితశేషమును గడపెద. (నిష్క్రమించును)

వాల్మీ : (లేచినిలుచుండి) ఋషీశ్వరులారా, సకల దేశాధీశ్వరులారా, ప్రజలారా, పవిత్ర చారిత్రయగు జానకీదేవి శూర్పణఖ మూలమున నడవులకు వెడలింపఁబడుట మీరెల్ల రెఱుంగుదురుగదా ! నిండుచూలాలు- కోమలశరీర - రాజకుమారి నిస్సహాయయై యెట్లు కాలముగడపుచున్నదో యెవరెఱుంగుదురు ?

రాము : మునీంద్రా, హృదయ మర్మభేదకమగు నీ విషయము నేల తలపించుచున్నారు?

వాల్మీ : ఆ సాధ్వీమణి కష్టపరంపరలు విన్నఁ గఠోరచిత్తులైన ఁగంటఁ దడివెట్ట కుందురా? ఇఁకఁ గరుణార్ద్ర హృదయులగు మీమాటఁ జెప్ప వలయునా ?

ప్రజలు : వాల్మీకి మునీంద్రా, మహారాజ్ఞి దురవస్థఁదలఁచినంతనే మాగుండె లవియుచున్నవి.

వాల్మీ : అవునవును ; అయోధ్యావాసులు సజ్జనులని నాకుఁ దెలియును. సీత యన్ననో కదల మెదలలేని గర్భవతి. వనమా ఘోరమృగాకులము. ప్రాణములు పిడికిటఁబట్టుకొని ఆ యబల యెంత కాలము జీవించియుండును ?

ప్రజలు : కష్టము ! కష్టము !

మునులు : సీత సుఖించుఁగాక !

రాము : (స్వగతము) అయ్యో ! యీ మునీంద్రుని పల్కులు వ్రీలుచున్న నా హృదయమునకు

శల్య సంచలనములవలె నున్నవి.

వాల్మీ : శూర్పణఖ తన దుష్కార్య మొప్పుకొనినవెనుక సభాస్థారులలో నెవ్వరైన సీతాదేవి బహిష్కారయోగ్యయని చెప్పఁగలరా ?

ప్రజలు : మునీంద్రా, సీతాదేవి మాకుఁ గన్నతల్లివంటిది. జానకీదేవి పావన చరిత్ర - పతివ్రతామణి. దేవీ బహిష్కారము ప్రమాదజనితము ; ప్రమాదజనితము.

రాము : (స్వగతము) ఈ ప్రజ లే గాలికి ఆ చాపయెత్తు స్వభావము గలవారు.

వాల్మీ : సభ్యులారా, సీతాదేవి దైవవశమున బ్రతికియుండినఁ బునర్గ్రహణ యోగ్య యగునా ?

ప్రజలు : నిస్సంశయముగ - ఈయశ్వమేధమున మహారాజునకు సీతాదేవియే సహధర్మచారిణి గావలయు.

రాము : ఇది యెట్లు సంభవించును ?

వాల్మీ : వత్సా ! దైవఘటన కసాధ్యముగలదా ?

రాము : (ఆతురతతో) ఆర్యా, అట్లయిన మాహృదయేశ్వరి బ్రతికియున్నదా?

వాల్మీ : కుమారా, జానకి బ్రతికియున్నది.

(ప్రజలలో సంతోష సూచక సంభాషణలు, గుజగుజలు)

రాము : ఏమి వినుచున్నాను ? ఇది స్వప్నము గాదు గదా ?

ప్రజలు : మహారాజా, మా మనములు చల్లఁబడునటుల సీతాదేవిని పరిగ్రహించి సుఖింపుము.

వాల్మీ : రాఘవా, నీకుఁ గుమారులు గూడఁ గలరు.

లక్ష్మ : (స్వగతము) నాయూహ యథార్థమై యుండునా ?

రాము : ఆహా! యిదియేమో మాయనాటకముగ నున్నది. మునీంద్రా, యిది యంతయు నసంబద్ధము. నాకెక్కడి జానకి ? యెక్కడి కొమరులు ? సీతకును నాకును బండ్రెండు వత్సరములు దుర్భేద్యకుడ్యము వలె యెడఁబాటు గావించినవి. ఇది యంతయు స్వప్నము - మృగతృష్ణాప్రాయము -ఇంద్రజాలము- ఈ మందభాగ్యునికి భార్యలేదు, బిడ్డలులేరు, సోదరులులేరు, బంధువులులేరు, ఎవ్వరును లేరు. రామునకు లోకమంతయు శూన్యము ; అంధకార మలీమసము; నరక సదృశము.

వాల్మీ : అమ్మా, జానకీ,

(జానకి, తాపసపురంధ్రి, ప్రవేశింతురు ;

కుశలవులు ఆమెను చూచి ప్రక్కకు వత్తురు)

రాము : (ఆశ్చర్య దుఃఖములతో) జానకియా ? ఏకవేణీధారిణి - కృశాంగి - ఆ - నాజానకి బ్రతికియున్నది !

(రాముఁడు పీఠముపై నుండి లేచును. కుశలవులు ఆశ్చర్యముతో చూచుచుందురు. రాముఁడు సితను దగ్గఱకు తీసికొని) ప్రాణ ప్రియా, నా స్వార్థపరత్వమును క్షమియింపుము. నాయపరాధమును నీ కృపాకటాక్ష వీక్షణములఁ గప్పిపుచ్చుము. నా జీవిత శేషమును నీ యభీష్టపాలనమునకై వినియోగించి యపరాధ విముక్తుఁడ నయ్యెదను.

నాముద్దు బిడ్డలారా, కుశలవులారా, రండు నాయుత్సంగము నలంక రింపుఁడు. నన్నానందవార్ధి నోలలాడింపుఁడు. మీ తల్లి నట్లు నట్టడవులఁ గష్ట పెట్టితినని కోపింపకుఁడు.

కుశు : (స్వగతము) ఇదియేమి, మహారాజిట్లనుచున్నాఁడు ?

లవు : (స్వగతము) మేము రామాయణ కథానాయకుని బిడ్డలమా?

(సభలోగుజగుజలు)

రాము : నాయనలారా, రండు. నన్నుఁ గౌఁగిలించుకొనుఁడు.

లవు : (స్వగతము) ఇంతవఱకుఁ దాపసబాలకుల మనుకొనుచుంటిమి!

సీత : ప్రాణవల్లభా, యీ దీనురాలి యపరాధములను మన్నింపుము. (పాదములమీఁద వ్రాలును)

రాము : (లేవనెత్తి) హృదయేశ్వరీ, నిరపరాధిని వని తెలిసియుఁ గీర్తిలోభమున, మిషపెట్టి నిన్నుఁ గానలకంపిన యీ పాపిరాముఁడు నిన్ను క్షమియించుట కెవ్వఁడు ? నీ యతి లోక పాతివ్రత్యము నీయనన్య సాధ్యమైన క్షమ మావంశము నుద్ధరించినది. మఱొకమాఱీలోకమును నా కానందమయముగ నొనరింపుము. (స్వగతము) ఆహా ! మానవుని సుఖదుఃఖావస్థల భ్రమణము !

*ఐంద్రజాలికుఁ డాత్మ మోహనపుఁ గుంచె*
*విసరినంతనె మాఱెడి విషయమటుల*
*నాకు నిరయంబుగాఁ దోఁచు నాదు బ్రతుకు*
*స్వర్గ సన్నిభమయ్యె నీక్షణమునందు !*

(ప్రకాశముగ) మునిసత్తమా, నాకృతజ్ఞత యెట్లు తెలిపికొనుటకుఁ దోఁపకున్నది. నన్నింకొకమాఱు సపత్నీకుని గావించితిరి.

వాల్మీ : వత్సా, కష్టసుఖములు లోకమునకు సహజములు ; అని వార్యములు, గడచినది మఱచిపొమ్ము. వర్తమానము ననుభవింపుము. భవిష్యత్తును దృష్టిపథమున నుంచుకొనుము.

ఋషులు : రఘుకులేశ్వరా, జానకీసహితుఁడవై యశ్వమేధము నొనరింపుము. దార పుత్రవంతుఁడవై గార్హస్థ్యసౌఖ్యముల ననుభవింతువు గాక !

ప్రజలు : తల్లీ లోకమాత, అజ్ఞానుల యపరాధముల మన్నించి మమ్ము మీ బిడ్డలవలె రక్షింపుఁడు.

ఋషులు : *స్వస్తిప్రజాభ్యః పరిపాలయంతాం,*
*న్యాయేన మార్గేణ మహీంమహీశాః*
*గోబ్రాహ్మణేభ్యః శుభమస్తునిత్యం,*
*లోకాః సమస్తాః సుఖినో భవంతు !*

(యవనిక జాఱును)

# భరతవాక్యం

*నెలమున్మూఱులు వర్షముల్ గురియుతన్*
*నీరంధ్రమేఘాళి స*
*స్య లతావృక్షచయంబు సత్ఫలయుతంబై*
*క్షామముల్ వాపుతం*
*గలుగుంగాత స్వరాజ్యమెల్ల ప్రజకుం!*
*గల్యాణముల్ సౌఖ్యముల్*
*వెలయుంగావుత స్వర్గమందు బలె నీ*
*విశ్వంభరన్ నిత్యమున్ !*



# కుంభరాణా

## (మీరాబాయి)

ప్రథమ ముద్రణము 29-10-1924

# పాత్రలు

## పురుషులు

కుంభరాణా
అగ్బరు బాదుషా
తాన్‌సేన్
బలవంతరావు
శ్యామలరావు
మాధవరావు
కుమారసింహుడు
సేనాధిపతి
అర్చకుడు
వెంకయ్య
సుబ్బయ్య
ఇరువురు యాత్రికులు
వెంకటదాసు
గోకులదాసు
మురళీదాసు (తలారి)
ఫకీరు
దునీచంద్‌శేట్
ఇరువురు మంత్రులు
ద్వార పాలకుడు
బాలుడు
ఇస్మాయిల్

## స్త్రీలు

మీరాబాయి
సుశీల (దాసి)
వాసంతిక (దాసి)
వైష్ణవి

# కుంభరాణా

## (మీరాబాయి)

### నాంది.

శ్రీ రాధాసతి నేలినట్లు కరుణా
చిత్తంబునన్ దుఃఖ దు
ర్వారాంగ పరీక్ష తప్తయగు
మీరాబాయి చేపట్టి లో
కారాధ్యుండుగ నొప్పు మాధవుడు
మమ్మజ్ఞాన సంక్షుబ్ధ సం
సారాంభోనిధి కర్ణధారుడయి
మోక్షద్వీపముం జేర్చుతన్ !



## స్థలము 1 : ఉదయపురము

( శ్రీ కృష్ణాలయాంతర్భాగము. అంతయు కొంచెము చీకటిగనుండును. ద్వారము చుట్టును వెలుగుచుండిన చిన్న ప్రమిదలు కొలదిపాటి వెలుతురు నొసగుచుండును. తెఱ యెత్తబడగనే అలంకృతమైన కృష్ణవిగ్రహము, తీర్థపాత్రాది సన్నిధి సామగ్రి, పూజించుచున్న అర్చకుడు, దర్శనార్థము వచ్చిన యిద్దరు యాత్రికులు అగపడుదురు. అర్చకుడు అర్చనానంతరము కర్పూర హారతి యెత్తును. యాత్రికులిద్దఱుకూడ పాడుదురు.)

మొదటి

యాత్రికుడు : ఆహా ! ఏమి ఈ దేవాలయ ప్రభావము ! లోన అడుగు పెట్టినంతనే యేదో అనిర్వాచ్యమగు ఆనందము, శాంతి నా చిత్తము నావరించుచున్నవి.

రెండవ

యాత్రికుడు : వేసవి యెండల తిరిగి తిరిగి సొమ్మసిల్లు బాటసారికి శీతల తరుచ్ఛాయ సుఖమొసగునట్లు, సంసారపీడాజర్జరితచిత్తుడైన మానవునకు ఈ కృష్ణమందిరము శాంతిదాయకమగుచున్నది.

మొ. యాత్రి : అవునవును. ఒక్క క్షణములో నెంత మార్పు గలిగినది !

రెం. యాత్రి : ఇచ్చట పవిత్ర వాతావరణము నిగూఢమైయున్న మానవుని దివ్య ప్రకృతిని పైకుబికించుచున్నది. (విగ్రహము తట్టుతిరిగి) నందనందనా, మరల నీ దర్శనభాగ్యము లభింపజేయుము.

(ఇరువురు యాత్రికులు నిష్క్రమింతురు)

అర్చకుడు : పూజల పసేగాని ఒక్క రూక కూడ పడడములేదు తీర్థపాత్రలో.

(వెంకయ్య సుబ్బయ్య అను ఇద్దఱు యాత్రికులు ప్రవేశింతురు)

సుబ్బయ్య : (దేవాలయ స్తంభములు తక్కిన విశేషములు చూచుచుండును)

వెంకయ్య : ఓయ్, శనిపిశాచమా, యిట్టసూడు దేవుణ్ణి. బుద్ధి, బుద్ధి. (చెంపలు వేసికొని) మనకా యింటికాడి కూతలే వస్తాయి దేవళాల్లో కూడాను. దేవుణ్ణి శేవించు.

సుబ్బ : ఆ - సేవించాంగా. మఱి, దూరాపుకొండలు నునుపన్నారు పెద్దోళ్ళు. ఈ సంబరానికా మఱి నన్ను గోదారినుండి ఏంటేంటో శెప్పి యింతదూరం లాక్కోనొచ్చావు. ఇంతదూరం వచ్చాంగా యెంత పెద్ద గాలిగోప్పరం వుంటుందో అని ఆశపడ్డాను. శ్రీరంగం దేవళంలో నూరోవంతుకూడా లేదు. దాని

తస్సాదీయ ఆ స్తంబాలకేశి చూస్తే తలగుడ్డకింద పడ్డాది. యెంకయ్యా, యీ శిత్తరం చూశావా ? ఇంత జగప్పెళయంగా తిరుణాళ్ళ జరుగుతుంటె ఒక్క జంతరిజంతరిపెట్టె కూడా లేదు. ఒక్క రంకలరాటమైనా లేదు. అదేంసూశావు, ఒక్క సుట్టపొవ్వాకు అంగడికూడా లేదు.

వెంక : ఆ, భేష్, మాబాగా శెప్పావురా సుబ్బన్నా! ఎంత పెద్దగాలిగోప్పరం వుంటే అంత పెద్దమహత్తెం గల్లదేవుడుంటాడాయేం ? ఇక్కడ మహత్తెమంతా ఆ మీరాబాయమ్మ గారిదే. అందుకోసమే దేశదేశాలనుంచి జనం తేరుమోకు తీశినమల్లె వస్తుంటారు. ఒక్కసారి ఆ తల్లి పాటవింటే మనజన్మం తరిస్తుందంట. ఆమె యీ పట్నమేలే రాణాగారి పట్టపుదేవంటారు.

సుబ్బ : ఆలాగా? పట్టపుదేవిని మనము సూస్తే యింకా బతకడంగూడానా?

వెంక : ఆ బక్తురాలికి రాణి వాసంలేదు.

సుబ్బ : అందరూ చూశేటట్లు పెళ్ళాన్ని యీదులు తిప్పేరాజు యేంరాజోసి తోసిరాజు!

అర్చకుడు : (చేతులుతట్టి) ఓయ్, పండ్లూ ఫలాలు బేడా పాతిక యేదైనా తెస్తే సన్నిధిలో సమర్పించండి. తీర్థం శటకోపం తీసుకోండి.

సుబ్బ : ఒకమూల కడుపుకాలుతుంటే శిత్తం శివుడిమీద నిలుస్తుందా యేవిటి ?

వెంక : మీరాబాయమ్మ యెప్పుడు ఇక్కడికి వస్తాదండి ?

అర్చ : ఆమె యిప్పుడు రాదు. మీరు తెచ్చిన నైవేద్యం తృణం ఫణం యీ తట్టలో పడవేయండి.

(హారతిపళ్ళెము చూపించును)

సుబ్బ : (వెంకయ్యతో రహస్యముగ) ఇక్కడిది ఇక్కణ్ణే రంగరిస్తాం. (ప్రకాశముగ) అంతా దేవుడి సొత్తేగదండి. పళ్ళు ఫలాలు ఇక్కడివే పెట్టండి.

వెంక : ఒక అణారూక పెట్టు.

సుబ్బయ్య : కాటి కాసైనా తప్పినా తప్పుతుందిగాని, అర్చకుడి కట్నం మాత్రం తప్పేది కనాకష్టం. (కుచ్చె కొంగుముడివిప్పుచు) ఇంట్లో డబ్బు స్మరణా, ఈదులో డబ్బు స్మరణా, దేవళంలోకూడా డబ్బు స్మరణేనా సోమీ ?

అర్చ : (కర్పూరము వెలిగించి హారతి త్రిప్పుచు) ఏడ్చినట్లే వుంది. మీ స్మరణా, మీ భక్తి! యాత్ర వచ్చినప్పుడైనా పదిపాతికలు ఖర్చుచేయరాదూ ? (ఈలాటి మంత్రములతో హారతియిచ్చి, ఒక తులసిదళం ప్రసాదముగా యిచ్చును.)

సుబ్బ : కాశంత ఆ పళ్ళు ఫలాలు పెసాదం పెట్టండి సోమీ.

అర్చ : కొనుక్కోని తినండి. వెళ్ళండి. వచ్చేవాళ్ళకుకూడ అడ్డము. (అని అదలించును.)

సుబ్బ : అణారూక శేతులోపడే దాకా కాస్త అట్టా యిట్టా వుండి అది శేతులో పడ్డపాట తన్నబోతాడు ! ఈడి తస్సాదీయ మా వూళ్ళో కాక పోయెనే.

వెంక : నోరుమూసుకో. అపచారం (సుబ్బయ్యను లాగుకొని పోవును.)

(పూర్వసువాసినియగు వైష్ణవియు నొకబాలుడును పూజాద్రవ్యములతో ప్రవేశింతురు)

వైష్ణవి : (అర్చకుని చేతి తబుకులో పూజాద్రవ్యములు పెట్టును)

అర్చ : అష్టోత్తరమా, సహస్రనామమా ?

వైష్ణ : సహస్రనామమె చెయ్యండి.

అర్చ : అష్టోత్తరానికి అర్ధరూపాయ, సహస్రనామానికి ఒక రూపాయ.

వైష్ణ : అట్లయితే అష్టోత్తరమే జరిపించండి.

అర్చ : అర్ధరూపాయ యిట్లా పడవేయండి.

వైష్ణ : (గుడ్డకొంగు విప్పుచూ) జరిపించండి. ఇస్తున్నాను.

అర్చ : మీ యజమానుడి పేరేమి ?

వైష్ణ : ఒరే, బాబు.

బాలు : ఏమవ్వా?

వైష్ణ : మీ తాత పేరటచెప్పరా.

బాలు : వరదాచార్లు

వైష్ణ : కాదురా.

బాలు : రంగాచార్లు.

వైష్ణ : కాధురా, నీకు తెలియదూ ?

బాలు : (కోపముతో) కుంకాచార్లు, వెంకాచార్లు.

వైష్ణ : ఛీ ! వెధవి. (అర్చకుడితట్టు తిరిగి) అది గాదండి. సీతా అమ్మవారి మరదిపేరు ఏమిటండి ?

అర్చ : భరతుడు.

వైష్ణ : ఇంకొకాయనండి.

అర్చ : శత్రుఘ్నుడు, లక్ష్మణుడు.

వైష్ణ : ఆ, నిలపండి ఆరెండో ఆయనండి.

అర్చ : లక్ష్మణాచార్యులా ! అబ్బా ? చంపినావుగదమ్మా (అర్చన మొదలు పెట్టి పదినామములు చదివి అర్ధరూపాయ కొఱకు చూచుచు) ఈ యుగములో విచ్చేటట్టుగా వుండలేదే ఆ కొంగుమూట !

వైష్ణ : ఇదుగోనండి (బేడరూక తబుకులో వేయును. బేడను చూచి అసంతృప్తుడయి అర్చనచేయుట ముగించి కర్పూర హారతి యిచ్చి, తీర్థమిచ్చును.)

బిచ్చగాడు : అయ్యా, రెండుకళ్ళూ లేనివాణ్ణి, ఒక్కకాణీ ధైచెయ్యండి తండ్రులారా.

బాలు : (రహస్యముగ) అవ్వా, నీదగ్గరవుండిన చెల్లని బేడబిళ్ళ ఏమిచేశావు?

వైష్ణ : ఎందుకురా ?

బాలు : అదుగో ! ఆ గుడ్డివాడికి వేశి చిల్లర తీసుకొంటాము.

వైష్ణ : అయ్యో, నేను అర్చకుడి తబుకులో వేసి తీర్థం తీసుకొన్నా గదరా.

బాలు : అయితే పోనీలే అవ్వా, మంచిపనే చేశావు.

(ఇద్దఱు నిష్క్రమింతురు)

(హిందూ యాత్రికుల వేషము ధరించిన తాన్‌సేను ఇస్మాయిల్ ప్రవేశింతురు)

తాన్‌సేన్ : ఆహా, యేమి యీ చిత్రము ! గర్భగుడి చీకటిలో మినుకుమినుకు మని నక్షత్రములవలె వెలుగుచున్న ఈ దీపములు మూల ప్రకృతిలో మెఱయుచున్న జీవాత్మలో యనునట్లున్నవి! ఈ యగరు ధూపము, ఈ కర్పూర సౌరభము, ఇవి యన్నియుంజూడ మనమెదో యొక దివ్యప్రపంచమున సంచరించు చున్నట్లున్నది. మన శ్రమకు మించిన ప్రతిఫల మబ్బినది.

ఇస్మాయిల్ : తాన్‌సేన్ జీ.........

తాన్ : జాగ్రత........

ఇస్మా : మఱచితిని. గురూజీ, ఇచ్చట ప్రాణరహితములగు శిలలు కూడ పవిత్రము లైనవో యనునట్లు భయభక్తులను పురికొల్పుచున్నవి. మీరాబాయి గాన

మాధుర్యముచే మెత్తపడి, భక్తుల యడుగురాపిళ్ళకు అఱుగు వాఱిన ఈ శిలా ఫలకములు గూడా మానవకారుణ్యమునకు పాత్రములగుచున్నవి.

తాన్ : నేను హిందూ దేవాలయము లోనికి ప్రవేశించుట కిదియే మొదటితూరి. ఇట్టి యానందము నేనెప్పుడును అనుభవించియుండలేదు. మనము పునీతులమైతిమి. మనజన్మము సార్థకమైనది.

అర్చ : (తీర్థపు గిన్నెలోని రూకలను ఎంచుకొనుచు) దమ్మిడి యాగాణి, అణా, ...... ఒక వెండిరూకైన వేసిన పాపాత్ముడులేడు. లేకలేక ఒక బేడరూకపడితే అదికూడా చెల్లనిదే ! వీళ్ళభక్తి యిట్లా బద్ధలవుతుంది.

(డబ్బులు తీసిరొండిన దోపుకొనును)

(కొందఱు యాత్రికులు ప్రవేశింతురు. దూరమున మీరాబాయి గానము వినబడును. కలకలముమాని యాత్రికులందఱు వినుచుందురు)

తాన్ : ఆ అవ్యక్త మధుర గాన ప్రవాహమెక్కడనుండి ?

యాత్రి : అదిగో ! మీరాబాయి, మీరాబాయి.

(యాత్రికులలో కలకలము)

(మీరాబాయి పాడుచు ప్రవేశించును. సుశీల, వాసంతిక ఇంకకొందఱు స్త్రీ పురుషులు పూజాద్రవ్యములతో ప్రవేశింతురు. దేవాలయములో నుండిన యాత్రికులు మీరాబాయికి సాష్టాంగ నమస్కారములొనరింతురు.)

అర్చ : (స్వగతము) ఈయమ్మవల్ల మాబ్రతుకుదెరువు పాడయిపోతున్నది.

మీరా : అన్నలారా, లెండు, లెండు. నాకు మీరేల మ్రొక్కెదరు ? ఈ తుచ్ఛురాలి నేల ప్రశంసించెదరు ? నేను దాసురాలను, ఈకృష్ణమందిరమున నూడిగము చేయుదానను. బిచ్చగత్తెను. యాచించు బిచ్చగాండ్రకు ఏమి ప్రయోజనముకలదు ? మనల నందఱను రక్షించుటకు కంకణము గట్టుకొన్న ఈ శ్రీకృష్ణ పరమాత్మను - ఈ రాధావల్లభుని - ఈభక్తవత్సలుని - ఈయనంత కళ్యాణగుణ పరిపూర్ణుని - ఈ సౌందర్యరాశిని మనమందఱమును చేరి ప్రార్థించెదము.

(కొందఱు యాత్రికులు అర్చకుని చేతికి పూజాద్రవ్యముల నియ్యబోవుదురు)

మీరా : వలదు, వలదు, మీరు తెచ్చిన పూజాద్రవ్యములను ఈ లీలావిగ్రహుని పాదముల కడనుంచుడు. జన్మమెత్తిన ప్రతి మానవుడును దేవుని పూజించుట

కర్పుడు. అందఱము సృష్టికర్తయెదుట సమానులము. మధ్యవర్తితో నవసరములేదు.

(అందఱును అట్లేచేయుదురు)

అర్చ : (కోపము దిగమ్రింగుచు) మీరు సొంతంగా పూజించు కొంటే పూజించుకొన్నారుగాని, మా భాగం కొబ్బరి చిప్పలు పండ్లు ఫలాలు తృణం ఫణం ఈ బుట్టలో పడవేయండి. (బుట్టచూపును.)

(కొందఱు అట్లుచేయుదురు)

మీరా : (భక్తిపారవశ్యమున పాడును.)

(అందఱును ఆనందపరవశులగుదురు. అర్చకునకు గూడ భక్తి గలిగి మీరాబాయికి నమస్కరించును.)

మీరా : హే కృష్ణా, భక్తజనహృత్పద్మాసనాసీనా.

(ధ్యాన నిర్మగ్నయగును ; సుశీల ఆమెను పడనీయక పట్టుకొనియుండును)

తాన్ : మిత్రమా, నేనిక గాయక సార్వభౌముడనుగాను. నాగర్వము నేలగఱచినది. నాగాన నైపుణ్యము తృణప్రాయమైనది. మీరాబాయి బ్రతికియున్నంతవరకు లోకమున మఱియెవ్వరును గాయక సార్వభౌములు లేరు. ఆహా ! అగ్బరు చక్రవర్తియే ఈ భక్తురాలి గానము విన్న ..........

ఇస్మా : చక్రవర్తి బిచ్చగాడగును. కృష్ణమందిరమే వాసగృహమగును.

(మీరా బాయి మెల్లగా కన్నులెత్తి పాడుచు కదలును ; అర్చకుడు తప్ప అందఱును ఆమెననుసరింతురు)

(తెఱజాఱును)



# స్థలము 2 : ఢిల్లీ

(అగ్బరుపాదుషా విశ్రాంతి మందిరము; చిన్న మేజాపై హుక్కా పెట్టబడి యుండును. తెఱయెత్తునప్పటికి అగ్బరు తాన్‌సేనులు సంభాషించు వైఖరిలో నుందురు.)

తాన్ : ప్రభూ, మీకోరిక అపాయకరము. మఱలనాలోచింపుడు.

అగ్బరు : అపాయము మొగలాయి చక్రవర్తులకు క్రొత్తదికాదు; అనుక్షణ పరిచితము.

తాన్ : అయినను ఇది సాహసకార్యముగాదా?

అగ్బరు : నే నెఱుంగుదును. కుంభరాణా మనకు ప్రబల విరోధి. రహస్యముగ ఆతని రాజ్యమున ప్రవేశించుట సాహసకార్యమె. అయినను, ఆ భక్తురాలి దర్శనము అవశ్యకర్తవ్యము. తాన్‌సేన్, ఆమెపాట నిన్ను కూడ ఆనంద పులకితుని గావించినదా?

తాన్ : నన్నేకాదు. ఆ దావీదు నేడు జీవించియుండి ఆ భక్తురాలి గానము విన్న ఆనంద పరవశుడై యొడలు మఱచును. స్వర్గములోని కౌసరు నిర్ఝురము ఆమె కంఠము నుండి ప్రవహించును. ఆ దివ్యగాన ప్రవాహమున నేనును నా చిన్న పానపాత్రిక నింపుకొంటిని.

అగ్బ : ఏమి ?

తాన్ : నేను ఆమె పాటలు కొన్ని నేర్చుకొంటిని.

అగ్బ : (సంతోషముతో) అటులనా, ఏదీ ఒక్కపాట పాడుము. నా హృదయమును ఆనందవీచికల నుయ్యాలలూపుము.

తాన్ : ఆ సుధా ప్రవాహమెక్కడ ? యీ యుప్పునీటి కాలువయెక్కడ ?

అగ్బ : ఆ పాటలు విన కుతూహలము వొడముచున్నది.

తాన్ : (పాడును)

అగ్బ : ఆహా, ఏమి యీ పాటసొంపు ! ఈ గీతము ఆమె సౌందర్యముకడ మాధుర్యము నెరవు తీసికొనెనా యేమి ?

తాన్ : ప్రభూ, వ్రతోపవాస కృశాంగి యగుటచే ఆమె సౌందర్యము పూజ్యము ; దివ్యము. శ్రీకృష్ణ ధ్యానపరాయణయై తన్మయత్వమున ఒడలు మఱచి వ్రాలినది. మజ్నూను కూడ లైలా కొఱకు అంతటి వేదన అనుభవించియుండడు. షీరీను కొఱకు భృగుపాత మొనరించిన ఫర్హాదు సైతమట్టి నిర్మల ప్రేమ

నెఱిగియుండడు. 'అనల్ హక్' అని చాటించిన మాన్సూరుకూడా అంతటి ఆత్మ పరమాత్మల యైక్యము రుచిచూచి యుండడు. ఆ సతీతిలకము హిందూసూఫీ.....

హర్షపులకిత దేహయై హా ! ముకుంద,
కృష్ణ, కృష్ణా యటంచు సంకీర్తనంబు
సలుపుచునె ధ్యానమగ్నయై సన్నుతాంగి
దివ్య శోభా పరిధియందు తేజరిల్లె !

అగ్బ : తాన్‌సేన్, నా వాంఛా ప్రదీపమును వెలిగించితివి ; ఉత్కంఠ ప్రేరించితివి. నిర్దయుడవై మఱల నార్పబోకుము. నా జీవిత మంతయు రాజ్యసంపాదనమునందె వ్యయమగుచున్నది. ఒక్కనిమిషమైన శాంతిలేదు. ఈ తృష్ణకు దరిదాపుగలదా ?

ఒక రాష్ట్రము గైకొన వే
ఱొక రాజ్యము నాచి కొనగ నుల్లము గోరున్ ;
సకలైశ్వర్యము లొనరియు
నిక జాలునటన్న తృప్తి యిల లేదుగదా !

తాన్ : మా బోటి దరిబేసులకు తృప్తి యుచితము గాని, తమ వంటి చక్రవర్తులకు పరాక్రమమే యశస్కరము.

అగ్బ : తాన్‌సేన్, చక్రవర్తులు గూడ మర్త్యులే సుమా.

ఏరీ యా బహరాముగోరి, ఖుసురూ లెందేగె నౌషీరవాన్ ?
ఏరీ రుస్తుముజాలు, తాయి ? యెపుడో యెచ్చోటనో ధూళియై
పోరే, వారి సమాధులైన గలవే ? భోగాను భోగత్వమే
సారంబో, పరతత్త్వమొండుగలదో సత్యంబుగా సృష్టిలోన్ ?

నే నెవ్వడను ? ఏల జన్మించితిని ? ఏల మరణించుచున్నాను ? ఈ జనన మరణముల రహస్యమేమి ? ఈ ప్రశ్నలు చిరంతనములయ్యును నిరంతరములుగ నగపడుచున్నవి. దైవదృష్టియందు అందఱము సమానులమే కదా ? అట్లయిన లోకములోని ఈ విపర్యాసమునకు కారణమేమి ? కొందఱు రాజులు, కొందఱు రైతులు, కొందఱు సంపన్నులు, కొందఱు దరిద్రులు, కొందఱు సుఖితులు, కొందఱు దుఃఖితులు ! ఈ రహస్యమును ఆ భక్తురాలు భేదింపగలదు. ఆమె ఐంద్రజాలిక స్పర్శచే ఈ రహస్యము దాచిన మంజూషపు మూత విడిపోవును. మనము రేపే తరలవలయును.

తాన్ : నావలన గదా మీకీ తలంపు గలిగినది ! ఇప్పటికే మౌలానాలు, షేకులు మిమ్ముద్వేషించుచున్నారు. మీ హైందవ పక్షపాతమును నిందించుచున్నారు. ఇంతకును నేను కారకుడనని నామరణమున కెదురుచూచు చున్నారు.

అగ్బ : తాన్‌సేన్, వారు జగదేకసత్యము నెఱుంగరు, జ్ఞానమున కన్న వారికి స్వపక్షాభిమానము మిక్కుటము. జ్ఞానమునకు జాతిమతభేదములు లేవు. గులాబిపూవు ఎవరిచేతనుండినను అదేవాసన గొట్టుచుండును.

తాన్ : నిజము చెప్పితిరి.

హైందవ తురుష్క పారసీ హౌణులకును
వీరు వారననేల ? యీ విశ్వమునకు
దేవుడొకడను సత్యంబు దెలియలేక
మతము పేరట పోరాట మ్రందు జనము.

అగ్బ : మీరాబాయి జ్ఞాన ప్రదీప మీ మాయాంధకారమును దొలగింపగలదు.

తాన్ : మహమ్మదీయుల కంట బడిన కులకాంతలు రాణి వాసమునకు తగరని రాజపుత్రుల మతము. అందులో కుంభరాణా మిక్కిలి యభిమానవంతుడు.

అగ్బ : మన యుద్దేశము దుష్టముగాదు. ఆమె హృదయ హోమకుండమునుండి జ్ఞానవిస్ఫులింగ మొక్కటియైన వెలికుఱికి మన మనఃపథముల జ్యోతిర్మయము చేయవచ్చును.

తాన్ : మీచిత్తము. వజీరు లీయుద్యమమున కియ్యకొందురా ?

అగ్బ : ఇది మన యిరువురిని దాటి పోని రహస్యము.

తాన్ : మీ ప్రయాణమునకు కారణము ?

అగ్బ : ఆ సంగతి నాకు వదలుము. మనము హిందూ యాత్రికులమయ్యెదము. వలసిన యేర్పాటులు గూఢముగ కావింపుము.

తాన్ : మాఱాడజాలను.

అగ్బ : సంశయింపకుము. దైవము మనకు తోడ్పడును.

తాన్ : అట్లెయగుగాక ! సెలవు (నిష్క్రమించును.)

అగ్బ : నా జీవిత కావ్యమునందు క్రొత్త అధ్యాయము ప్రారంభమైనది. (హుక్కా త్రాగుచు ఆలోచించుచుండును.)

(తెఱజాఱును)

## స్థలము 3 : ఉదయపురము

(ఉద్యానవనము, ఒక సరోవరము, అందు చేపలు తినుచున్న కొంగయు అగపడును. కుంభరాణా పరాయత్తచిత్తుడై ఒక పూవును వాసన చూచుచు చలువఱాతిబండపయి కూర్చుండియుండును)

రాణా : నానాటికి మా యంతఃపురము నే నడుగిడుటకు యోగ్యముగాని సన్న్యాసిని మఠమగుచున్నది. అచ్చట పూర్వమునవలె హృదయరంజన మొనరించుట కొక్క చిఱునవ్వుగాని, ఒక్క ప్రేమావలోకనముగాని, తుదకొక్క తియ్యని మాటగాని కఱవయ్యెను. నా ప్రాణేశ్వరి క్రమక్రమముగ నాచేతి నుండి జాఱిపోవుచున్నది. ఆ పాడు మత మేనాడు మా యింట నడుగు వెట్టినదో ఆనాటినుండియు మా యిరువురి యనురాగ బంధములు సడలిపోయినవి. ఆ విరాగిణి హృదయమున నాకిప్పుడించుకయైన చోటులేదు. (నిట్టూర్చి) నేడు నేను కేవలము భర్తను, ప్రాణవల్లభుడను. పుష్పాడి రస్తావలె కనుపడుచుండిన మా జీవిత మార్గము నేడు కంటకశిలా భూయిష్ఠమయి అసహ్యమయి ఘోరమయి పొడకట్టుచున్నది. నా సంసార మసారమయి నరకప్రాయమైనది.

(మీరాబాయి, సుశీల పువ్వుల బుట్టతో ప్రవేశింతురు)

మీరా : నాథుడిచ్చటనే యున్నాడు. సుశీలా, మనమా వంకకు పోయి పూవులు కోసికొందము. పూజా సమయము కావచ్చినది.

(ఇరువుఱును రాణాకు కొంచెము దూరమున బోవుచుందురు)

రాణా : నన్నుచూచి యేల మరలుచున్నారు ? ఈ ప్రాకృతుని గాలిసోకిన పంచమహాపాతకములు మిమ్మంటుకొనుననియా ?

మీరా : అయ్యో ! నాయపరాథమును మన్నింపుడు, మీరేదో యాలోచనలో మునిగియున్నటుల తోచినది. మా నందడి మీ యవధానమునకు అంతరాయము కావచ్చునను తలంపుతో తొలగిపోయితిమి.

రాణా : (విషపు చిఱునవ్వుతో) అనుకూలవతివి !

మీరా : నా సదుద్దేశము నేల యనుమానించుచున్నారు ? ఎపుడైన మీ కనిష్టమాచరించితినా ? నా సతీత్వమున కేమైన లోపము వాటిల్లెనా?

రాణా : మీరా, ఆయుపచారవాక్యముల నటుండనిమ్ము. సతులు నిరంతర వ్రతోపవాస కృశాంగులేకారు, కేవలము విధినియమబద్ధ సంబంధలేకారు ; పతుల హృదయము లాకర్షించు సమ్మోహన మంత్రాధి దేవతలు గను, మృదుమధుర స్వభావలుగ నుండవలయును. పరస్పర హృదయైక్యములేని వైవాహిక బంధము నీరసము - సంతాపకరము - హత్యాకరము. కృశాంగీ, కడచిన యేడెనిమిది సంవత్సరములు వేఱు. మున్నటి లావణ్యవతి వేనా నీవు ?

కాటుక జిగి పూత కాఱుచీకటి గ్రమ్మ
నీ కన్నుదమ్ముల నీటు దొలగె ;
హృదయభేదక చింత లేనియు నడగించు
చిఱునవ్వు విడిమోము చిన్నవోయె;
కనుల కానందంబు గలిగించు నీరూప
సౌందర్య మేడకో జాఱిపోయె ;
ఎపుడైన విశ్లేష మెఱుగని చిత్తంబు
ప్రణయ శ్మశానమైరాజదొడగె ;
నవ్వులాటలు సరసాలు నాడె ముగిసె ;
నీ సమేలమేనియు స్మరణీయమయ్యె ;
అనుదినంబును నెడబాటె యధికమయ్యె,
నిక సతీపతి సంబంధమేమి యౌనా !

మీరా : సుశీలా, చూచితివా నాధుడెంత తప్పుదలచుచున్నాడో ? వేషము పైని యభిమానమును నాపైని ప్రేమయని పొరపడినాడు.

సుశీల : (మీరాతట్టుతిరిగి) అంతేగదమ్మా మఱి. (రాజుతట్టుతిరిగి) అట్లగాదు లేవమ్మా (స్వగతము) ఎటుచెప్పినా చావె.

రాణా : మీరా, నీకిపుడటులనే తోచును లెమ్ము. హృదయము తోడ నంతయు మాఱును. చేటికా, నీవిక వెడలిపొమ్ము.

సుశీల : (వారికి కనబడకుండ మూతి త్రిప్పుకొనుచు నిష్క్రమించును)

రాణా : (మీరాబాయి భుజముపట్టుకొని) నీవేల యీ పిచ్చివేషము వేసికొని నా కన్నులను దూషించుచున్నావు ? నా సంతోషము భగ్నము చేయుటకు నీవు కంకణము కట్టుకొంటివా ?

మీరా : నాథా, యెవరెవరి వేషములు వారివారి చిత్తసంస్కార స్వభావాదుల

కనురూపముగనుండును. నాకీ వేషముపై ప్రీతిగలదు.

రాణా : నాప్రీతియు తలపవలదా ?

మీరా : నా స్వభావమునకు విరుద్ధముగ నేనెట్లు నడచుకొనగలను ? ఆ కపట నాటకము వలన మీకెట్టి ప్రీతికలుగును ?

రాణా : అన్యోన్య భావానుసరణము కపట నాటకముగాదు. అదియె గార్హస్థ్య జీవితమునకు పునాది.

మీరా : నేను ధర్మబాహ్యనని మీ యుద్దేశ్యమా ?

రాణా : నీమతావేశము, అలౌకిక విషయచింతనము, నిరభిమానము, శుష్క వైరాగ్యము సామాన్య గృహస్థ ధర్మములకు భంగము గలిగించుచున్నది.

మీరా : (దీనముగా) అయ్యో ! అందుకు నేనేమి సేయుదును ? నా మనస్సు నాస్వాధీనము కాకయున్నది. కన్నులు మూసినను దెఱచినను శ్రీకృష్ణుని దివ్యమంగళ విగ్రహము నాయెదుట నిలిచినట్లు పొడకట్టును. ఒక్క నిమిషమా రాధావల్లభుడు నా కన్నులకు కట్టకున్న లోకమే మునిగిపోయినట్లు అంతయు శూన్యముగ నగపట్టును. నిమిషమొక్క యుగముగ విశేషదుఃఖ మనుభవింతును. ఇట్టి జీవితము నాకు స్వాభావికమైనది. ఇందు మీకేమి విపరీతము తోచుచున్నది ?

రాణా : అందు విపరీతము కానిదేమున్నది ? (స్వగతము) ఇంతదనుక యీ కాంతను తనదారిని తన్నేగనిచ్చినందులకు నేనే నింద్యుడను. అయినను పూర్వస్మృతిని కొంత కలిగించి చూచెదను. (ప్రకాశముగ) ప్రేయసీ యటుచూడుము. ఆ సుందర సరోవర ప్రాంతమును మఱచితివా ?

మీరా : లేదు.

రాణా : తామరపాకువెంబడి నిలుచుండి యాకొంగ చేయుచుండిన యుదర పూరణ తపస్సును చూడుము ;

ధ్యాన నిర్మగ్నమైనిల్చి యా బకంబు
కాలు దవిలిన చేపల గఱచి తినును,
కపట వైరాగ్యనటనల ఘనత చూపి
గ్రుడ్డిలోకుల వంచించు గురుని పగిది.

మీరా : నాథా, నిశ్చింతముగ జీవితమును వ్యర్థము సేయుచున్న యాబేడిస త్రుళ్ళి పాటును దిలకింపుడు.

కాయ మనపాయ మని యెంచి కాలమెల్ల
మిట్టిపాటుల బుచ్చెదు మీనరాజ,
విధి యదృశ్యహస్తము వెనువెంట నంటి
కడకు నిను మృత్యుపదముల కడకు గెంటు.

రాణా : (స్వగతము) ఇంతవఱకు నాయుద్దేశమె తనయుద్దేశముగ నుండినది. ఇప్పుడు భిన్నము. ఇది యంతయు దుర్మతముయొక్క వైపరీత్యము (ప్రకాశముగ) అవునుగాని, మీరా, యీ పాలఱాతిబండ జ్ఞప్తియున్నదా ?

మీరా : పూర్వము మనకు విశ్రాంతి పీఠము.

రాణా : పూర్వము ! అవునవును పూర్వము! మఱియొక మాఱిచ్చట కూర్చుండి మున్నటి వినోదములను ఆప్రణయసఖ్యమును కొంచెము సేపు కలగనియెదము వచ్చెదవా ? ఆ స్మృతి మందపవనుని సుఖోచ్ఛ్వాసమువలె నాయొడలు పులకరింప చేయుచున్నది.

మీరా : కలయని తెలిసియు దానిపై నింతమక్కువయేల ?

రాణా : (విసుగుతో) నీయీపిచ్చి ప్రశ్నలే నన్ను మాటిమాటికి హతాశుని చేయుచున్నవి. నీకేదో చిత్తచాంచల్యము కలిగియుండవలయు. రమణీయస్వప్నము ఆనందదాయకము కాదా ?

మీరా : ఆ యానంద మెంతకాలము ? కలగనినంతకాలమె. మన మేల నిరంతర దివ్యానంద మనుభవించుటకు యత్నింపగూడదు ?

రాణా : (ఆసతో) ఆ యానంద మెట్టిది ?

మీరా : అమృతానందము ; శ్రీకృష్ణలీలాధ్యాన పారవశ్యము.

రాణా : (లాఘవముగ నవ్వి) ఓసీ పిచ్చిదాన, నీ మాటలు నాదుఃఖమునందు కూడ నవ్వుపుట్టించుచున్నవి. నా మనస్సు తేలికయైన యగరు ధూపమను కొంటివా గాలిలో నెగిరిపోవుటకు? ఊహామాత్రమైన పాల సముద్రమును నమ్మి చేతిలోని పాయసపు పాత్రను జాఱవిడుచు మూఢుడుండునా? దారిద్ర్యచింతా పీడితుల నూరడించుటకొఱకు, పరలోకము మీది యాసతో నిహలోక

దుఃఖము సహించుట కొఱకు, అవివేకులను భయపెట్టి ధర్మబద్ధులను జేయుట కొఱకు పౌరాణికులు స్వర్గ నరకములను కల్పించిరి. పరలోకమునకు ద్వారపాలకులు గురువులట ! వారికి లంచమిచ్చినవారికి పరమపదము ! నిరసించినవారికి నరకము కాబోలు ! ఎంత యవివేకము ?

మీరా : (దీనముగ) అయ్యో ! యేల యీ పరలోకదూషణము, గురు నిరసనము ? అహంకారచిత్తు లెఱుంగజాలని తత్త్వరహస్యము లెన్నిలేవు ?

*కండ నెత్తురు ప్రాయంపు గారవంబు*
*కనుల కెగదట్ట తత్త్వంబు గానబడదు ;*
*పాలనా దండశక్తి నశ్వరమటన్న*
*పిడుగువంటి సత్యంబును వినెద వెపుడొ.*

రాణా : మీరా, నీ నిరసన స్వభావము నాకు కోపము గొల్పినను నీ యజ్ఞానమునకు మాత్రము నాకు జాలికలుగుచున్నది. ఆడువారబలలు దుర్బలచిత్తలు. వివేకమునకన్న భావోద్రేకము మిక్కుటము. కావుననే మత విక్రేతలగు కపటగురువులు మిమ్ములను దేలికగ లోబఱచుకొని వంచింతురు. పాక్షిక మతావలంబకులే లోకమునకు ఉపద్రవకారులు. స్వయ మారోపితమైనవారి పవిత్రత అన్యులకు ఏవము పుట్టించును ; వారి దుర్ణయములు దురాచారములు మతాచ్ఛాదనముతో లోకుల మోసగించుచున్నవి. మీరా, నీమతోన్మాదము నీకు పరలోకము నిచ్చునో లేదో తెలియదు గాని, సంతోషముగను నిశ్చింతముగను గడచిపోవుచుండిన మన గార్హస్థ్యజీవితమును మాత్రము భగ్నముచేసినది.

*తెమ్మెర వీవ కంపిలెడి దీపము మానవ జీవితంబు ; సౌ*
*ఖ్యమ్ములు భోగముల్ గుడువనౌను దదంతరమందు ;చావు స*
*త్య; మ్మని రూప్య సంశయపదంబు పరంబుననమ్మియేల భో*
*గ్యమ్మగు యౌవనాసవము నానక చిందెదవో విరక్తవై.*

మీరా : (స్వగతము) ఓ విశ్వనాటక ప్రణేతా, నీవు రచించిన యీ సంసార విషాదాంత నాటకమును అభినయింపించుటకు మమ్మునిరువుర నొక్క సూత్రమున బంధించితివా ? ఏమి నీ మాయావిలాసము !

రాణా : (స్వగతము) సుందరుడయి సర్వభోగ సమోపేతుడయి తన్ను ప్రాణ ప్రదముగ కామించుప్రియుని అలక్ష్యముచేసి అప్రత్యక్షమైన యూహావిగ్రహమును మనోవైకల్యములేని యేయువతియైన ప్రేమించునా ? ఇది యసహజము. ఇదియొక మానసిక వ్యాధి. ఔషధసేవనము మేలు చేయవచ్చును.

(నేపథ్యమున శంఖధ్వని)

మీరా : నాథా, నేనిక పోవచ్చునా ? శ్రీకృష్ణ మందిరమున శంఖమును పూరించుచున్నారు. ఇది పూజా సమయము.

రాణా : నాయెడ్డిక నీకంత వెగటు పుట్టించుచున్నది కాబోలు. మీరా, మనజీవితమునందెంత మార్పు కలిగినదో నీవే యూహింపుమా, ఈ పరిసరములే అప్పటి మనవినోదమునకు సాక్షులు.

ఇచటి సంధ్యా విహారంబు, లిచటి చేత,
లిచటి యాటలుపాటలు హేళనములు,
నిచటి విడరాని కౌగిళ్ళు, నిచటి సుఖము
కనుల కాలేఖ్యమట్టుల గానవచ్చు.

సుఖమయముగా కడచిపోయిన ఆనాటి జీవితమునకును నీరసమై నిరయప్రాయమైన యీనాటి జీవితాభాసమున కెంతటి తారతమ్యముకలదో నీవెఱుంగకపోవు.

మీరా : సకల వస్తువులకును మార్పు అనివార్యము. భోగములు శాశ్వతములని తలంచితిరి కాబోలు ! మీరు నారూపసౌందర్యమునే వలచి యుందురేని నేనెప్పటికైన పరిత్యజింపబడవలసిన దాననే. నా సౌందర్యము నిరంతముకాదు. రోగ పీడితను జరాభారకృశాంగిని కావచ్చును.

రాణా : నీవు నిజముగ లోకజ్ఞాన శూన్యవు. యౌవన సౌందర్యములెట్లు కాలబద్ధములో మానవుని భోగాభిలాషకూడ అట్లె. ఆ కామ్యానురాగమె అనుభుక్తమయి వార్ధక్యమునందు తప్తకాంచనమువలె నిష్కల్మషమయి బహుకాల సహవాసజనిత బాంధవ్యముగ మాఱును. వసంతమున పూచిన పువ్వు శరత్తున ఫలవంతమగును. సామాన్యమైన యీ ప్రకృతి ధర్మమును గుర్తెఱుగని నీమనస్తత్త్వము నాకు దురూహ్యముగ నున్నది.

మీరా : అసామాన్య ధర్మములుకూడ కొన్నికలవని మీరును గుర్తింపవలయును.

రాణా : (విసుగు కోపములతో) అవి కుక్కమూతి పిందియలు. చెడుకాలమునకు పుట్టు విపరీతములు.

మీరా : మీకట్లు తోపవచ్చును.

రాణా : (స్వగతము) మతితప్పిన వారింత యుక్తియుక్తముగ మాట లాడుదురా? నాబుద్ధి సంశయగ్రస్తమగుచున్నది. (ప్రకాశముగ) విరాగవతీ, రసహీనమైన తర్కము నేనెఱుంగను, హృదయముల భాష వేఱు, ఆ భాషయె నాకు తెలియును. నీవనావశ్యకముగ భావిచింతనము సేయుచున్నావు.

*కడచినది కడచిపోయె దుఃఖమ్మొ సుఖమొ,*
*కడచుచున్నదె పెదవుల నిడినపాత్ర ;*
*దానికన్న ననిశ్చితార్థంబు మేలె ?*
*రేపు రేపను మాటకు రూపులేదు.*

(బ్రతిమాలుకొనునట్లు) నీవీ సన్యాసిని వేషమును తగులబెట్టి మున్నటి మీరావు కమ్ము.

మీరా : ఆ మీరా నికచూడలేరు ; పునర్జన్మము వచ్చినది. నాథా, వేషములో నేమున్నది?

రాణా : (కోపముతో) నీ హృదయములో నేమున్నదో ఆ వల్లకాడే వేసమునందు ప్రతిఫలించుచున్నది. ఎంత యోర్చుకొనబోయినను నీయీతత్వోన్మాదము నాకు విసుగుపుట్టించి కోపము రేపుచున్నది. నీవు నీమతమునైనను లేదా నేను నిన్నైనను వదలు కొనవలయును. అందునీకేది సమ్మతము ?

మీరా : నాకు రెండును సమ్మతములు కావు. నేను మిమ్ములను ద్వేషించుట లేదు.

రాణా : ప్రేమించుటయునులేదు. అటులైన భావసామరస్యము లేని మనకు సంసారమెట్లు నిరంతరాయముగ కొనసాగును ?

మీరా : ఆ సామరస్యము, ఆ సంధిస్థానము మీయందును నాయందును అందఱియందును కలదు. మనమందఱము నొక్క సూత్రమున గ్రుచ్చబడిన ముత్యములము ; ఒక్క భిత్తిపై చిత్రింపబడిన బొమ్మలము ; ఒక్క సముద్రమున రేగు తరంగములము. ఈ బాహ్య వివిధత్వమునందు అంతర్భూతమైన ఏకత్వము కలదు.

రాణా : ఓసి వెఱ్ఱిదానా, నీ రోగమునకు మందులేదా ?

మీరా : ఆ మందుకొఱకె నిరంతర మన్వేషించుచున్నాను. చేతికి చిక్కీ చిక్కక మాయగారడివలె మఱీగిపోవుచున్నది. ఆ మందు దొఱకిన నా పిచ్చియేకాదు, లోకము పిచ్చికూడ కుదురును.

రాణా : (కోపముతో) మీరా, నీవిక పిచ్చిదానివికమ్ము. బిచ్చకత్తెవు కమ్ము, ఇంక నేదియైన కమ్ము, నీవుమాత్రమిక నంతఃపుర మర్యాదను దాటవలదు. సామాన్య స్త్రీలవలె అందఱికంటపడుచు నీవు కృష్ణమందిరమునకు పోవలదు. నీప్రవర్తనము నీయొక్కతెకే సంబంధించినదికాదు ; మాపైకూడ ప్రతిఫలించును. ఉదయపూరు రాజ్యాధీశ్వరుని పట్టమహిషి పిచ్చిపట్టి వీధుల వెంబడి తిరుగుచున్నదను అపవాదమునుండి కాచికొనుము.

మీరా : నాపై ఆస వదలితి నంటిరి. బిచ్చకత్తె నగుటకు సమ్మతించితిరి. దారిప్రక్కల దుమ్ముతో కూడ సరిపోలని నాకు అభిమానమేల ? ఆ దురభిమానము పూర్వజన్మముతోడ నశించినది. దిక్కులేని వారికి దేవుడే తోడునీడ. బిచ్చమెత్తుటకు నాకు అనుజ్ఞయిండు ; ఆలోకేశ్వరుని ముంగిట భిక్షాందేహియని నిలచెదను.

రాణా : నీ పిచ్చికి నిన్ను వదలినను త్రాడు తెగిన గాలిపటమువలె నిన్ను తిరుగనిచ్చుట నాకిష్టములేదు. ఇంకను నేను నీకు పతిని.

మీరా : ఆ కృష్ణుడొక్కడే ప్రాణేశ్వరుడు. లోకములోని జీవులందఱును విరహిణులు.

రాణా : (కోపముతో) ఈ పిచ్చి మఱింత ముదురుచున్నది. మీరా, నీవన్నమాట నీకు తెలిసివచ్చినదా ? వినుము, ఇంకను నేను నీకు ప - తి - ని.

మీరా : నన్ను సేవకురాలిగ పనిగొండు. నామతమునకు నన్ను వదలుడు. అన్యమతస్థులే పూజ్యమైన హిందూమతమును స్వీకరించి సంసారమును తరించుచుండ మీరేల నాస్తికులగుట ?

రాణా : అన్యమతస్థులెవరు ?

మీరా : అగ్బరు పాదుషావంటివాడే గోపిచందనము ధరించి భక్తిమార్గము నవలంబించి హిందూ మతమును ఆదరించుచున్నాడని వినికిడి.

రాణా : (కోపముతో) అగ్బర్? మరల ఆతని ప్రశంస. ఇది వఱకే పలుమాఱులు హెచ్చరించితిని. ఆతని ప్రశంస నారాజ్యమునందు అపరాధము. ఆతడు మేకవన్నె పులి. తేనె పూసిన కత్తి. చిరకాలమునాటి రసపుత్రరాజ్యములను

మెల్లమెల్లగా కబళించుచున్నాడు. ఆతని రాజకీయ నీతి అతలస్పర్శి. ... ఆ! ...సరి, సరి, నీయభిమానముకు కారణముకలదు. అగ్బరు నిన్ను వివాహమాడ తలచి యుండెనుగదా. మీ తండ్రికి మానము ఆభిజాత్యము లేకుంటిన నీవు సార్వభౌముని శుద్ధాంత కాంతవై యుందువు. పాపము, నీదురదృష్టవశమున నాబోటి యల్పమండలేశ్వరునకు భార్యవైతివి.

మీరా : కడచిన గాథలేల త్రవ్వెదరు? మీ మనస్సులోని వేరుపుర్వు ఇంకను నశింపలేదు. మీయనుమానమె మీకు తెవులు లేని వేదనయగుచున్నది. అగ్బరు పాదుషా మనకు విరోధియైనంత మాత్రమున ఆయన పేరుకూడ ఉచ్చరింపకూడదా? విరోధి లోనున్నంతమాత్రమున సద్గుణములు గౌరవింపబడకూడదా? పాదుషాహి జనకునివంటి కర్మయోగియని వింటిని.

రాణా : (పిడుగడచినట్లు నిర్విణ్ణుడయి, కోపఘూర్ణిత నేత్రుడయి) ఏమీ? .... నాసతి ... నాయెదుట .. ఆ రసపుత్రకుల మానాపహారిని ఆమ్లేచ్ఛుని ప్రశంసించుట? వాని దుర్ణయములను సమర్థించుట! ... సహింపరాని పతితిరస్కృతి. ఓసి మాన రహితా, నీవెంత సాహసమున కొడి గట్టితివి? ఆ మాయ వేషగాడా నీకు పూజ్యుడు? ఆ కపటనాటకము హిందువుల నాకర్షించి మోసగించుటకై పన్నిన పన్నాగమని నీవెఱుగవా? గౌరవమైన రసపుత్రకులము చెడపుట్టిన బీహారీమల్లునివంటి వంశపాంసనులు వాని పాదముల నాశ్రయించి తమకూతుండ్లను వాని యంతఃపురకాంతలు గావించి వాని గులాములకు గులాములై తిరుగుచుండ నేనొక్కడనే వానిని ధిక్కరించి స్వతంత్రుడనై యండుట నీవెఱుంగవా? ఆదురాత్మునిపై ఏల నీకు గౌరవము? నానెత్తురు తుకతుక యుడికిపోవుచున్నది.

మీరా : (దీనముగ) అయ్యో! నేనేమిసేయుదును? నాదురదృష్టమువలన నామాటలలో మీకు విపరీతార్థములు తోచుచుండును. నేను విన్నసంగతి యంటిని?

రాణా : అవునవును! విన్నసంగతి యంటివి. అంతఃపురమున నీకు వాని ప్రసంగములతో ప్రొద్దుపోవుచుండెనా? వెడలిపొమ్ము, నామనము సంక్షుబ్ధమైనది.

మీరా : (కన్నీరు నించుచు) మీకింత మనోవేదన కలిగించు నేనుండియేమి ఉండక యేమి? శ్రీకృష్ణా, ఆపద్బాంధవా, నన్ను, నీకడకు చేర్చికొమ్ము.

(నిష్క్రమించును)

రాణా : ఎంతకాల మీయింటిలోని పోరు? హృదయములోని కొలిమి.? ... నాసతి నావిరోధికి వత్తాసివచ్చుట? ... రవంతయైన యళుకు లేక అతుచ్ఛుని జనక మహర్షితో సరిపోల్చుట, ఆ కాంత ధిక్కారము హృదయ శల్యమువలె పీడించుచున్నది. మనకింక శాంతిలేదు. మీరా, మన యిద్దరిలో నెవ్వరైన నొకరు చావవలయును.

(నేపథ్యమున)

చేటిక : ఇద్దరున్నూ.

రాణా : ఏమి యీయపశ్రుతి? ఎవరక్కడ?

చేటిక : (ప్రవేశించి) దాసురాలిని వాసంతికను. రాణిగారూ సుశీలా యెక్కడికి పోయారని గోస్వాములవారడిగారు. ఇద్దరున్నూ యిప్పుడే దేవాలయం తట్టుకుపోయారని చెప్పేసరికి దేవరవారు హెచ్చరించుకొన్నారు.

రాణా : మరల ఆయున్మాదిని దేవాలయమునకు పోయెనా? ఈగోస్వాములు మహిష స్వాములు మాసంసారమిట్లు వల్లకాడు చేసిరి. ఏడి యాసన్యాసి?

( తొందరగ నిష్క్రమించును )

చేటిక : ఓయమ్మో, ఇంకేముంది - (అంటూ నిష్క్రమించును.)

(తెఱజాఱును)



## స్థలము 4 : ఉదయపురము

(పాంథశాల, కొందఱు యాత్రికులు కునికిపాట్లు పడుచుందురు. కొందఱు నిద్రించుచుందురు. ఒక ముసలియవ్వ కాళ్ళు చాపుకొని కూర్చుండి మేలుకొలుపులు పాడుచుండును. ఈ సందడికి వెంకటదాసు ముందుగా లేచును)

వెంకటదాసు : ఏమండోయ్, గోకులదాసూ, లెగండి, లెగండి, ఎంత మొద్దు నిద్రయ్యా మీకు! పొద్దున్నే ప్రయాణమంటే నాకు రాత్రంతా నిద్రపట్టదు. ఏమండోయ్, బృందావనానికి పొయ్యేబండ్లు కదిలిపోతున్నాయి. ఈ సమయం తప్పితే మనకింక మంచి దారితోడు దొరకదు. లెగండయ్యా లెగండి.

(ఒక ఫకీరు ఈ కేకలకు నిద్రమేల్కొనును)

ఫకీరు : అయ్! ఏ కోన్‌రే తెలంగిముసాఫిర్, రాత్రిహంతా దివానా మాద్రి పుకార్ శేస్తాడ్? ఈ హడావుడీ మే మాకి హొక్క ఛనం కూడా నీంద్‌వుంది లేదు. హొక్కముసాఫిర్ వస్తాడ్ హరిబోలో హరిబోలో శెప్తాడ్, ఇంకా హొక్క బైరాగీ వస్తాడ్ జయ్ సీతారాం బోల్తాడ్. తుత్తెరీ గడ్బడా హింద్వాలోగ్ (కోపముతో జోలె గొంగడి జవురుకొని పోవును)

వెంకట : నీదేంటోయ్? ఫక్కీరి,కీసరపాసర మంటావు, కట్టెపుచ్చుకొని నీ బుఱ్ఱబద్దలు చెయ్యనా యేంటి.

(ఇంతలో యిద్దరు యాత్రికులు తూఁగు కన్నులతో లేచి కూర్చుండి "పట్టుకో పోనియ్యవద్దు, దొంగలు, దొంగలు" అని అరతురు)

వెంకట : ఏంటి ఆ వెఱ్ఱి కలవరింపు? పట్టుకోవడమేంటి!

యాత్రికుడు : నీవు మఱిబుఱ్ఱ బద్దలు కొట్టమన్నది దొంగల్ని కాదూ?

వెంకట : (పకాయించి నవ్వును)

( ఈ సందడికి యాత్రికులందఱు లేచి మూటా ముల్లె సవరించుకొందురు. ఇంతలో అగ్బరు తాన్‌సేనులు హిందూ యాత్రికుల వేషములతో ప్రవేశింతురు)

అగ్బర్ : వారు చెప్పిన పాంథశాల యిదియే కాఁబోలు

తాన్‌సేన్ : ఈ రాత్రి మనమిచ్చటనే నిదురించి వేఁగుజామున లేచి కృష్ణమందిరమునకు పోవచ్చును.

అగ్బర్ : అట్లే కానిమ్ము.

తాన్ : అయ్యో మీరీ వట్టినేల యెట్లు నిద్రింతురు?

(మూటలోని గుడ్డనుతీసి పడకవేయును)

అగ్బ : (పడకపై కూర్చుండి) ఆహా యీ పాంథశాల యెంత గంభీర సత్యమును బోధించుచున్నది. ఉమ్రఖయ్యాము రుబాయిని తలంపునకు తెచ్చుచున్నది.

అంతములేని యీ భువనమంత పురాతన పాంథశాల, వి
శ్రాంతి గృహంబు; నందు నిరుసంజలు రంగులవాకిళుల్, ధరా
క్రాంతులు పాదుషాలు,బహరాం జమిషీడులు వేనవేలుగాఁ
గొంత సుఖించి పోయి రెటకో పెఱవారికిఁ జోటొసంగుచున్

ఇచట, నున్నంతవఱకె మనదని యెడి భ్రాంతి. తరువాత సుకృత దుష్కృతములు తప్ప వేఱొండు మనల నంటిరాదు. ఇట్లయ్యును జీవితాశ సహజముగ నుండుట వింతగదా?

తాన్ : భగవంతుడు భ్రాంతియనెడు పుష్పహారముచే విశ్వసంసారమును బంధించి యున్నాడు.

అగ్బ : కావుననే బంధము గూడ ప్రియమైనది.

(పాంథశాలలోని యాత్రికులు వెడలుచుందురు)

వెంకట : (తాన్‌సేన్‌తట్టుతిరిగి) ఏమండోయ్, మీరింక సుఖంగా పండుకోవచ్చును. మేము వెళ్ళుతున్నాం.

తాన్ : అయ్యా మీరేదేశస్థులు

వెంక : (స్వగతము) తస్సాదియ్యా, బాగా డాబు సరిగా చెబుతాను. (ప్రకాశముగ) నేనా? ఆంధ్రుణ్ణి.

తాన్ : చాలా దూరము యాత్ర చేసినారు.

వెంక : అయ్యో! మాదురదృష్టం యిక్కడికి గూడా తరుముకొచ్చిందండి. ఆ పరమ భక్తురాలిని మీరాబాయమ్మగారిని దర్శనంచేసుకొని ఆమె కృష్ణ మందిరంలో పాడుతుంటే విని మా పాపిష్టి జన్మాలు కృతార్థం చేసుకోవడానికి యింతదూరం ఎండనక వాననక కొండంత ఆశతో యీ పట్నం చేరినాము.

అగ్బ : (ఆతురతతో) ఏమీ? ఆమె దర్శనము మీకు లభింపలేదా?

వెంక : మీ ఆత్రం చూస్తే మీరు కూడా ఆ భక్తురాలి దర్శనానికి వచ్చినట్లుంది.

అగ్బ : అవును.

వెంక : ఆ తల్లి దర్శనమైతే యింత మనస్తాపమెందుకు? ఆమెకు పిచ్చి పట్టిందట.! రాణాగారు ఆమెను అంతఃపురములో వుంచి చికిత్స చేయిస్తున్నాడట.

తాన్ : తన యవివేకమునకు చికిత్స చేయించుకొనిన బాగుగ నుండెడిది.

వెంక : పిచ్చి కుదిరి కృష్ణ మందిరానికి వస్తుందని పది దినాలు కనిపెట్టుకొని వుండినాము. ఆమెకు దినం దినం పిచ్చి హెచ్చుతున్నదని విని ఇక యింత దూరము వచ్చినవాళ్ళము బృందావనమైన సేవించుకొని పోదామని బయలుదేర్నాము. మీరేమైనా వస్తారా?

అగ్బ : (ఆలోచనా నిమగ్నుఁడై యుండును)

తాన్ : మేమిప్పుడే యిచ్చటకు వచ్చితిమి. పట్టణము చూడ వలయును.

గోకు : అబ్బబ్బా, యీ వెంకటదాసుతో వేగేదికష్టంగా వుంది. ఎవరడిగినా ఆంధ్రుణ్ణి, ఆంధ్రుణ్ణి అని బలే డాబుసరిగా మాటచెబుతాడు. కార్యం మాత్రం బండిసున్న. దారిలో మనిషి కనపడ్డ పాపానికి తలవిసిగి బట్ట కట్టేవరకు వుపన్యాసం చేస్తాడు - ఏమోయ్ వెంకటదాసూ, బండ్లు కదలి పోతున్నాయి రావయ్యా, మాట లెట్టుకోని పెద్ద దొర కొడుకులాగా నిలుచున్నావు?

వెంక : ఏమోయి, మనం దొరకొడుకులంగాక, రామరాజు ప్రభువు రాజ్యం చేసేవఱకు ఆంధ్రుడికుండే జబర్దస్తి పాచ్చావుకు కూడా లేదు. మన దెబ్బంటే గోల్కొండ అబ్బా అంటుంది!

గోకు : ఆ! యిట్లా యెగనిక్కినవాళ్ళే కిందపడేది, ఆ - ఇకచాలురావయ్యా ప్రసంగం.

వెంక : (కోపముతో) ఏమంత పుట్టమునిగిపోయిందా యేంటి? మనిషి కనబడితే మాట్లాడనియ్యవు, నీబోటి శకునాల పక్షితో కూడా వస్తే యింతేకదూ మఱి.

యాత్రికులు : హే ద్వారకీవాసా, శ్రీ కృష్ణా, జయరమారమణ గోవిందో హరి. (మూట ముల్లె లెత్తుకొని కదలుదురు).

అగ్బ : మనము దైవముచే వంచింపబడితిమి; మందభాగ్యులము. ఆ పరమ భక్తురాలి వైరాగ్యమును ధ్యాన పారవశ్యమును ఉన్మాదముగా శంకించి విషయలోలుఁడైన రాణా ఆమెను అంతఃపురమున బంధించి యుండవచ్చును. ఇఁక మనమెట్లు దర్శింపగలము?

తాన్ : మనలను ప్రేరించి యింతదూరము ఈడ్చుకొనివచ్చిన యా భగవంతుడు మనకేదైన సదుపాయము చూపింపక పోవునా?

అగ్బ : మిత్రమా, కోకిల పంజరమున బంధింపఁబడియు గానము మానదుగదా?

తాన్ : గానమునకప్పుడే యెక్కు డావశ్యకత. వేదనామృదులమైన గానము మఱింత మధురమై భువనేశ్వరుని హృదయ ద్వారము కడ అతిథియై నిల్చి తలుపుఁదట్టగలదు - ఇక విశ్రమించెదము.

అగ్బ : మీరాబాయిని దర్శించువఱకు నాకెక్కడి విశ్రాంతి?

(తాన్‌సేను మూటవిప్పి అగ్బరునకు పడకపఱచును. ఇరువురును గుడ్డలు కప్పుకొని పండుకొందురు. తలారి మురళీదాసు కట్లకఱ్ఱతోను చేతిలాందరుతోను ప్రవేశించును)

మురళీదాసు : ఎవరు ముసాఫిర్‌ఖానాలో బాటసార్లు? మూటా ముల్లె జాగ్రత్తగా తలకింద పెట్టుకోండి. దొంగలు దోచుకుంటే మా జవాబు దారీలేదు. హుషార్,హుషార్.

(అగ్బర్ తాన్‌సేనులు గుడ్డకప్పుకొని లేచి కూర్చుండుదురు)

తాన్ : అయ్యా నీవెవ్వఁడవు?

మురళి : నేను గస్తి తిరిగే తలారి వాణ్ణండి

అగ్బ : బాటసారులను నిదురలేపుట తోడనేని జవాబు దారితనము తీఱినట్లున్నది.

మురళి : ఏమి చెయ్యమంటారండి బాబు ? ఎవరు బాటసార్లో యెవరు వేషధార్లో కనుక్కొనేది కనాకష్టం.

(అగ్బరు తాన్‌సేన్‌లు చిఱునవ్వుతో అర్థగర్భితముగ పరస్పరము చూచు కొందురు)

మురళి : దొంగలు కూడా యాత్రికుల్లాగా వచ్చి నెమ్మదిగా పండుకొంటారు. అందరిని నిద్రపోనిచ్చి దొరికినవరకు చంకలో పెట్టుకొని పెద్దమనుష్యుల్లాగా వెళ్ళిపోతారు.

అగ్బ : అవును! లోకము బహువిధము

తాన్ : నీ పేరేమి?

మురళి : మురళీదాసండి.

అగ్బ : పేరు వినుటకు సొంపుగ నేయున్నది.

మురళి : నవుకరిమాత్రం బలె గడుసుగావుందండి. కడుపునిండా కూడు లేదు.

కంటినిండానిద్రలేదు. కట్టుగుడ్డకు గూడా కరువు. ఇట్లాంటి కక్కురితి నవుకరి చేసేదానికంటే మీమాదిరిబైరాగులై "'జైసీతారాం' అంటూ నాలుగిళ్ళకు పోయి నాలుగు పిడికెళ్ళు బియ్యం తెచ్చుకోని సుఖంగా పొట్ట గడుపుకొంటూ కాలుమీద కాలు వేసుకోని ఏ సత్రపు గోడకో ఆనుకోని దొరకొడుకు ఎట్టాంటి వాడ్రా అనుకొంటూ కాలచ్చేపంచెయ్యడమే మేలుగాతోస్తుంది నాబుద్ధికి. మా రాజులుకూడా సోమారిపోతుల్నే ఆదరిస్తారు. మాబోటి కష్టపడేవాళ్ళకు కూడు లేదు యీ కాలంలో. మా వూళ్ళో వుండే రామాంజయ్యగోరు పొద్దున్నే మొగాన యెంటికపోసంత సందూ కూడా లేకుండా నామాలు పెట్టుకోని గుమ్మడికాయ తపిలె నెత్తిన పెట్టుకోని అచ్చాపాత్రకొస్తాడు. సాయంత్రం పూల దండలమ్ముతాడు. నెలకి రెండు మోరీల అచ్చా పాత్ర బియ్యం అమ్ముతాడు. సారాయంగడికి దినమ్మా తప్పడు. మల్లీ పెళ్ళానికి బంగారుమురుగులు రాళ్ళ కమ్మలు చెయ్యించాడు. ఇదంతా అచ్చాపాత్రడబ్బె ! ఇంక నేను నెల పొడుగుతూ నవకరిచేస్తే కల్లు తాక్కుండా బిగబట్టుకోని వుంటేగింటే పెళ్ళాం బిడ్డలకు దినానికి రెండు పూటలు కూడు దొరికేది కనా కష్టం. నా పెళ్ళాంకూడా బిచ్చమెత్తి మురుగులు చేయించి పెట్టమని దినమ్మా తగువు. నాకు అదే తేలిగ్గా వుంది బాబు.

అగ్బ : దానము దుర్వినియోగమగుటయే తప్పు, బిచ్చమెత్తుట వలన బీదతనము పోదు. ఎంతటివానికైనను కాలుసేతులు చక్కగానుండు నంతవఱకు యాచించుట నీచము.

మురళి : కడుపునకు చాలీచాలని నవుకరి అంతకంటే నీచంగా తోస్తుందండి. యాత్రకు వచ్చిన పల్లెటూరివాండ్లను అదిలించి బెదిలించి కొంచెము డాబుసరి మణుసులను యాచించి బేడా పాతికా సంపాయించుకోని కాలం గడుపుతూ వుండినాను. ఇప్పుడు మా కూట్లో రాయిపడిందండి బాబు.

అగ్బ : ఏమీ?

మురళి : రాణిగోరి వల్లనే యీ పట్నం యాత్రాస్థలమైంది. ఆతల్లికి పిచ్చిపట్టి అంతప్పురములోనే చెరపెట్టించినప్పటినుంచి యాత్రికులందరు మెల్లింగా సళ్ళు కొంటున్నారు. మాకొక్క దమ్మిడీ యిచ్చేవాళ్ళు కూడా కనబడరు.

తాన్ : ఈ పిచ్చి కథను సామాన్య జనులందరు నమ్ముచున్నట్లే యున్నది.- ఈ యూరిలో విశేషము లేవియైనఁ గలవా?

మురా : రాణిగోరికి పిచ్చిపట్టిందొక పెద్ద విశేషం. ఆలుబిడ్డల్ని పెట్టుకోని గుట్టుగా కాపరంచేస్తుండే సంసార్లకు మతాలు వైరాగ్యాలు నేర్పించి కుటుంబాల్లో కలహాలు పెట్టే గురువుల్ని సన్నాసుల్ని రాజ్యంలోనుండి యెళ్ళ గొట్టారని మొన్న దొరగారు పట్నమంతా తుడుమెయ్యించారు. ఈది బళ్ళల్లో యేమి తెలియని పిల్లకాయలకి యేలాంటిమతాలు మాయమాటలు చెప్పకూడదనీ యిందుకు తప్పినట్లయితే వురిసిచ్చని చాటించారు. వూరంతా కూడుడికినట్లు వుడికి పోతుంది. గురువులంతా వొక కట్టుగట్టి సిసువుల్ని సిసువురాండ్లని యెగదోల్తున్నారు.

తాన్ : అయితే మీ యూరిలో చాలా విశేషములు గలవు.

మురా : ఇంకా వకటండి - ఆ - మరేంగలిస్తే - మీ కేమైనా పిచ్చికి వైయిద్దం తెలుసునాండి? అట్లయితే దివాణంలో కొంచెం సంబావన ముట్తుంది. గోసాయి చిట్కాలంటే అందరు నమ్ముతారు.

అగ్బ : రాణిగారి పిచ్చి కుదుర్చుటకా?

మురా : అవునండి

తాన్ : సంస్థానపు వైద్యులు లేరా?

మురా : ఎందుకులేరు ! వుండాడు కండోజీరావు. ఆయన రాణిగోరిని సూశి దణ్ణం పెట్టి ఈరోగానికి నాకు మందు తెలియదని వెళ్ళి పోయాడంట !

అగ్బ : ఆతఁడు వివేకి.

తాన్ : అంతఃపురములోనికి ఇతరులను రానిచ్చెదరా ?

మురా : ఆ - వైద్దుగులైతే రావచ్చును. అంతప్పురాధికారి బలవంతరావుగోరి వుత్తరువు తీసుకొని రాణమ్మగారికి వైద్దెం చేయవచ్చును. కుదిరితే మీకు బలే పేరుంటుంది. వూళ్ళో వాళ్ళందరు మిమ్మల్నే పిలస్తారు.

అగ్బ : (చిఱునవ్వుతో) మీ యూరి వారికందఱకు ఇట్టి పిచ్చియేపట్టి యున్నదాయేమి?

మురా : కాదండి, ముందుగా రాజోరి నగళ్ళల్లో పేరు తెచ్చుకొంటే ఆయెనక యాడబట్టినా చెల్లాకె.

తాన్ : మేము రాణిగారియొద్దకు పోవలసియున్న రాణాగారి వద్దకు పోవలసిన యవసరములేదా?

మురి : ఇదంతా బలవంతరావుగారి మీదనే వదలిపెట్టేశిన లాగుంది. ప్రెబువుగా రిప్పుడు కొలువుకచ్చేరిలోకి రావటం లేదు. దొరగారు ముందటిమాదిరికాదు. (నలుప్రక్కలుచూచి రహస్యము చెప్పువానివలె నటించి) ఎవ్వరు ఏమీ అనుకోడానికి కూడా జంకుతారు. బంగారమంటి దొర యీలాగై పొయ్యాడని పెద్దాచిన్నా అందరు అనుకొంటున్నారు. (దుప్పటిమడచి క్రింద వేసికొని కూర్చుండి) అయ్యా, చలిపుడ్తావుంది. మీ దగ్గిర చిలిమివుంటే వొక్క దమ్మిస్తారా?

అగ్బ : మేము బైరాగులము కాము. బంగి త్రాగము. ఇదిగో ! యిటు రమ్ము, నీవు చాలా మంచివాడవుగా నున్నావు. ఈ రూక తీసికొనుము.

మురి : (లేచి సంతోషముతో చేయిచాపి) దైశెయ్యండి బాబు, మీపేరు చెప్పుకోని పిల్లాపిసుగు రెండుదినాలు కమ్మంగా కారంగా కడుపునిండా గెంజితాగుతాము. నేను కల్లంగడికి పోనేపోనండి. (రూకతీసికొనును)

తాన్ : (మెల్లగా) రేపటి మన యెత్తుగడకు అవలంబము దొఱకినది

అగ్బ : అంతయు దైవేచ్ఛ. (గుడ్డకప్పుకొని పరుండును)

మురి : (రూకను చేతిలాందరు వెలుగున చూచుకొని) అబ్బో ! ఇది రూకగాదురో ! మోరియ్య ! ఇట్టా ధర్మంచేసే బైరాగుల్ని నేను పుట్టిబుద్దెరిగినాక ఎప్పుడూ చూళ్ళేదు. (మరల లాందరు వెలుగున చూచుకొని) అబ్బో ! యీ మోరియ్య గిన్నెలో సారాయిలాగ చకచక మెరుస్తుంది.

(అటు నిటు పరిక్రమించుచు)



## గేయము

బంగారు మోరియ్యా బయమేసుతుంది
శేతులో మెరుపట్ల శెదిరీపోతుంది.
కనబడని దేవుండు గరడావాహనుడు
పెత్తేక్షదైవంబు బంగారుమోరి ;
పిశినారివాడింట పెరిగే నంటుంది
మాబోటి వారిండ్ల మారిపోతుంది ;
పెళ్ళాన్కి సూపిస్తె ప్రియమాడుతుంది
పిలిశిముద్దెట్టి నన్ వలపించుతుంది.
దాని తస్సాదియ్యా, దానికి సూపించనే సూపించను.
సారాయమ్మే బాబు సల్లంగావుంటె
నవుకర్కి శెలవిచ్చి నవ్వుకొంటాను ;
బంగారు మోరియ్యా బయమేసుతుంది
శేతులో మెరుపట్లు శెదిరీపోతుంది.

(నిష్క్రమించును)

(తెరజాఱును).



## స్థలము 5 : అంతఃపురము

(మీరాబాయి ధ్యాననిమగ్నయై యుండును. తెరయెత్తబడును. సుశీల మందుగిన్నెతో ప్రవేశించును.)

సుశీల : రాణిగారూ, ఈ మందు కొంచెం పుచ్చుకోండి. ఈ సారం కడుపులోకి పొయ్యేసరికే పిచ్చి కుదురుతుందట.

మీర : (పలుకదు)

సుశీ : ఈమెపిచ్చి మందూమాకులతో కుదిరేలాగులేదు. మూడు దినాలు నుంచీ అన్నం నీళ్ళు అంటకుండా ధ్యాన్నించుకొంటూ, పాడుకొంటూ, నవ్వుకొంటూ మనలోకంలోనే లేదు. మా లలితకు జన్నిగుణం తగిలినప్పుడు ఈలాగే వుణ్ణింది. ఇట్టాంటి రోగాలు కట్టెతో గూడా పోవాల్సిందే...అమ్మగారూ, కొంచెమయినా యీమందు తాగండి.

మీరా : (ధ్యాన నిమగ్నయై పలుకదు)

సుశీ : మందంతా తాగేశిందని బలవంతరావుగారితో చెబుతాను. (ఒకప్రక్కకు వచ్చి మందు క్రింద పాఱబోసి మెల్లగా స్తంభమున కానుకొని తూగుచుండును.)

మీర : (మెల్లమెల్లగ కనులెత్తి) శ్రీకృష్ణా, రాధామనోవల్లభా, దీనావనదీక్షా పరతంత్రా, నన్నేల యీనిర్బంధమున నుంచితివి ? నేనేమి యపరాధ మొనరించితిని ? నీ మందిరమునకు నచ్చి నీ దివ్య సుందరమూర్తిని సేవింపనీయక నా భర్త నన్నీ యంతః పురమున బంధించియుండుట నీకు సమ్మతమేనా ? తమ సర్వస్వమును నీపాదములకు నర్పించిన పల్లెటూరి గొల్లపడుచుల సైతము నల్లాటవెట్టుట కలవాటుపడిన నీకు నన్నుపేక్షసేయుట యొకవింతయా ! ఓ భక్తవత్సలా, అజ్ఞానముచే నీసదుద్దేశమును తెలిసికొన లేక నిందించితిని. సందేహించితిని. విషయవాంఛా మలీమసములైన గోపికల హృదయములను విరహాగ్ని జ్వాలలందు పరిశుద్ధము గావించి, వారికి నిర్వాణసామ్రాజ్యము నొసంగితివి. నీదాసురాలను నన్నుగూడ నట్లే పరిశుద్ధము చేయుటకు ఈ యుపాయము పన్నితివి కాబోలు 'సకలాంతర్యామి నైన నన్ను ఈ యజ్ఞానవతి యెఱుంగలేక మందిరము మందిరమని భ్రమపడుచున్నది. దీనికి చక్కని గుణపాఠము నేర్పించెద'నని యెంచి, నాకీ బంధనము విధించియుందువు. ఆపత్పరంపరలు మహోపకార గర్భితములను గభీరసత్యమును నేడు

గ్రహించితిని. కృష్ణా, నీ కరుణ అనంతము ! అనంతము!

(ధ్యాన నిర్మగ్నయగును)

(వాసంతిక ప్రవేశించును)

వాసంతిక : సుశీలా, యెక్కడ ?

సుశీ : (తూగుచుండి యుల్కిపడిలేచును) మల్లీమందుతెచ్చావా ? అమ్మగారు వొక్కచుక్క పోకుండా మందంతా తాగేశినారు.

వాసం : దొరసానమ్మగారు ఆఅవస్థలో వుంటే నీవు నిమ్మళంగా నిద్రపోతున్నావా ?

సుశీ : నీవొక్కదానివే భయభక్తులతో నవకరిచేసేదానివిన్నీ తక్కిన వాల్లందరూ కూలికి పనిచేసే వాళ్ళు. ఎందుకీ పనికిమాలిన బడాయి ? వచ్చినపని చూచుకొని పోరాదూ.

వాసం : సుశీలమ్మగారూ, బుద్ధి, బుద్ధి, (చెంపలువేసుకొనును) రాణిగారి కెట్లావుందో కనుక్కోని రమ్మన్నారు బలవంతరావుగారు. మందు తాగిన వెనుక నెమ్మదిగా పడుకుందో లేదో కూడా అడిగి రమ్మన్నారు.

సుశీ : బుద్ధితో అట్లా అడుగు చెబుతాను. మునుపటికంటే పైదుర్గుణాలేమీ కనిపించలేదు. ఇంకా కాళ్ళుముక్కు పీక్కునే స్థితికి రాలేదు. తనలో తానే మాట్లాడుకొంటుంది. ఇప్పుడే కన్ను మాల్చింది. ఇంతవఱకు నేను విసురుతునే వుణ్యాను. కానీ, యీ సంగతంతా నేను పోయి బలవంతరావుగారితో విన్నవిస్తాను. అంతదాకా రాణిగారి దగ్గర వుంటావుగదూ?

వాసం : ఆ మాటలు చెప్పడానికి యెవరితెలివైనా యెరవుతెచ్చుకోవాల్నా యేంటి? (నిష్క్రమించును)

సుశీ : ఇది బహుచమత్కారి తొత్తుకూతురు. మఱిచిపోయైనా మోసపోతుందంటే మోసపోదు. రేయింబవుళ్ళు నన్నే పడిచావమంటుంది.

మీర : (ఉల్కిపడిలేచి బయలుచూచుచు) హృదయేశ్వరా, యింతలో నా కౌగిలి విడిపించుకొని యెట్లుపోయితివి ? ఎచ్చటి కేగితివి ? ఈ దీనురాలిని వంచించుటకు నీకు మనసెట్లు పుట్టెను ? ఒక్క స్థలమున నుందువని నిర్ణయములేని నిన్ను నేనెక్కడయని వెదకుదును ?

ఉందువో మౌనిజనోత్ఫుల్ల హృదయాబ్జ
కర్ణికా నాట్య రంగములయందు ?
ఉందువో శాంత రసోజ్జ్వల మూర్తివై
క్షీరాబ్ధిలో మృదుశేషశయ్య ?
ఉందువో దీనావనోద్యోగ రతుడవై
తలపోత కందెడు దవ్వునందు ?
ఉందువో నిర్వాణయోగ సంధాయివై
రాసలీలా భోగరాజ్యమందు ?
ఇంక నెచ్చోట నుందువో యెవరి కెఱుక ?
సృష్టినాటక సూత్రధారివి ! నిరంత
ప్రకృతి కేళీవినోద హర్షంబు కొఱకు
బొమ్మరిలుగట్టి తుడిపెదు మొదలు సెడక.

లోకేశ్వరా, ఎందుకీ లీలావిలాసము ? నీ దివ్యమంగళ సౌందర్యము నీ యనంత ప్రకృతి దర్పణమున ప్రతిఫలింపజేసి నిన్నునీవు చూచుకొనుటకా? (బయలుచూచి క్రమక్రమముగ ధ్యాననిమగ్నయగును.)

సుశీ : ఈయమ్మగారి మాటలూ మందలింపులూ నాకు సంస్కృతంగా వుంది. నిన్నటి రాత్రంతా కునికిపాటైనాలేక యీమెతోటి మేల్కొని అవస్తపడ్డాను. కొంచమట్టకన్నుమాలస్తాను. ఆ ముదనష్టపు వాసంతికతో నాకు అత్తపోరయింది. (పైట చెంగు పఱచుకొని యొక మూలగ పరుండును)

మీర : నన్నేల యింకను నీ యొద్దికి చేర్చుకొనవు ? దవాగ్ని మధ్యమున పరితపించుచున్న యీ కురంగిని కాపాడుటకు నీకింకను దయగలుగలేదా ? నీ కంఠమున వేయుటకై కట్టిన పొగడదండ నాయంజలిపుటమున కమలిపోయినది. ఇంకను నీవుర్వావేమి ? నేను పంపుచుండిన బాష్పదూతికలు నిన్నింకను చేరలేదా ? నా విన్నపమును గొనిపోయిన బలాకలు దారిలో నేమైన నాలసించినవా ? లేక నీవే యుపేక్షించితివా ?

ధూళి గప్పిన యీ జీర్ణ చేలదాల్చి
గఱిక పువ్వులు కొప్పులో దుఱిమి, ముసుగు

టంబరంబును రాణివాసంబు వీడి
దుమ్ము గద్దియనెక్కితి తుదకు నాథ !

ఇంకనైనను నీ చరణ దాసినగుటకు తగనా ? పూర్వమా రుక్మిణిని గొని పోయినట్లు నన్నేల గొనిపోవు ? రాధామనోవల్లభా, నీవు రాధకౌగిటిలో చిక్కియున్నావు. లేకయున్న నీవేల మఱతువు, రాధా? నీవు ధన్యవు - ధన్యవు . (ధ్యాన నిమగ్నయగును)

సుశీ : (మేల్కొని కూర్చుండి పైటచెంగుతో విసరుకొనుచు) అబ్బా! యీ హడావుడిలో నిద్రపట్టడంగూడానా. (ఆవులించి, తూగి, కొంచెము జరిగి పండుకొనును.)

మీరా : (ఉలిక్కిపడిలేచి అటునిటుచూచుచు) ఇంతలో నెక్కడ మాయమైతివి ? నాయొద్దనే కూర్చుండి నన్ను ముద్దిడుచుంటివే. నీ త్రిజగన్మోహన స్వరూపము నొక్కక్షణమాత్రము నాకన్నులకు కనిపించి యానందపారవశ్యమున నేనొడలు మఱచియుండ మోసముచేసి తారిపోయితివా ? నీకెందఱో ప్రాణవల్లభలు గలరు. వారిని వదలి నీవొక్క క్షణమైన సహింపనోపవు. ఈ రాధతో నీకేమిపని ? నేను సౌందర్యవతిని గాను. భాగ్యవతిని గాను. కులీననూ గాను. కృష్ణా, నీకిట్టి భేదబుద్ధియుం గలదా ? ఆకుబ్జయెట్టి యందకత్తె ? ఆ విదురుడెంతటి భాగ్యవంతుడు ? ఎట్టి కులీనుడు ? అట్టి అవ్యాజ కృపాకటాక్షము నాయెడల యేల యుజ్జగించితివి ? మోసగాడా, పొమ్ము. పొమ్ము. నీవు మరల అర్ధరాత్రమున వచ్చి నాతలుపు తట్టి నన్ను బ్రతిమాలుకొన్నను నేను లొబడను. అలుకపూని నిన్ను వెనుకకు మరలించెదను. చెలులారా, ఒకవేళ నేను మెత్తందన మూనినను మీరు గట్టితనముబూని నాకు సహాయపడవలయును. ఇసీ ! నేనెంత ముద్దరాలను ? పదియారువేల గోపికలకు జీవితేశ్వరుడైన మన్మథజనకుని ఈ దీనురాలి అలుకయేమి సేయును ? పేదవారల కోపము పెదవులు దాటదు. దాటినను నవ్వులచేటు. హృదయేశ్వరా, నాకా యభిమానము దుమ్ముదుమారమైనది. నేను నీ సొత్తును. అస్వతంత్రను. తలపై పెట్టుకొన్నను కాలిక్రింద వైచికొన్నను నాకిష్టమె. నాకిష్టమనునది యెక్కడిది ? అంతయు నీయిష్టమె. నన్నేల ప్రొద్దుపొడుపుననే నీతోడ యమునా తీరమునకు కొనిపోవు ? గొల్లపడుచునకు రాణివాసమెక్కడిది? ఇరువురము తోడుతోడుగా పసుల మేపుకొనుచుందుముగదా !

నీ వెండలో చెట్లనీడల పన్నుండి
పసుల మేపగ నన్నుబంపరాదా ;

చలిది చిక్కంబుల సడలించి యన్నంబు
    పెట్టవేయని పేర్మి బిలువరాదొ ;
అలసితి నొక్కింత తలిరువీవన వీవు
    ప్రేయసీ, యని యాజ్ఞవెట్టరాదొ ;
మనసయ్యె భువన మోహనగాన మొనరింప
    మురళి యిమ్మని చూడ్కి నెఱపరాదొ ;

తలిరుటాకులు పూవులు దండగట్టి
మెడను గీలింపుమా యని నుడువరాదొ ;
అట్టి యుపచారముల కే ననర్హనైన
నిష్టముండిన రీతి నన్నేల రాదొ !

(ధ్యాననిర్మగ్నయగును)

(అగ్బరు తాన్‌సేనులు వైద్యుల వేషముతో ప్రవేశింతురు)

అగ్బరు, తాన్‌సేనులు : తల్లీ, చరణదాసులము. (దండముపెట్టుదురు).

మీరా : (ఆనంద పారవశ్యమున నుండును)

తాన్ : దర్శనమాత్రముననే ధన్యులము.

అగ్బ : గానమువిన్న నేమి యగుదుమో !

మీరా : నందనందనా, దివ్యసుందరశరీరా , నీవంటి సుకుమార కుమారుని ఆకొండతిప్పలలో ఆ యరణ్యములలో పసుల గాచుటకు ఆ యశోదాదేవి యెట్లుపంపెను ? ఆ నందుడెట్లియ్యకొనెను ? తల్లిదండ్రుల హృదయము లింత కఠినముగ నుండునా?

పగలెల్ల సూర్యాతపంబున దిరుగంగ
    ముదుక వాఱిన నీదు మోముగాంచి ;
నజల మేఘశ్యామ సంకాశదేహంబు
    గోరజచ్ఛన్నమౌ తీరుగాంచి ;
లలిత పల్లవ కోమలములైన వ్రేళులు.
    కఱ్ఱ రాపిడి కాయ గాయగాంచి ;
వ్రజభామినీ మనః పథముల విహరించు
    పదములు ముండ్ల పాల్పడుటగాంచి ;

వేడినిట్టూర్పు విడతు ; నావిధిని దూరు
కొందు ; హృదయంబు వ్రీలిపో గుందుచుందు ;
నీ చరణ దాసిని రాధను నేను లేనె,
యంతకష్టంబు నీకేల యాత్మపాల ?

అగ్బ : ఈ పరమభక్తురాలికి రాధాత్వము సిద్ధించినది.

మీర : కృష్ణా, రేపటినుండియు నేనే యాల మేపబోయెదను. నీ వా యరణ్యమునకు రావలదు. నాకు వాదోడుగా నుండుటకు నీపిల్లన గ్రోవినిమ్ము. నీపెదవి కెంజిగురులంటిన వివరమునందె నా వాతెఱనాన్చి నీ మధురాధర రసస్పర్శ ననుభవించెదను.

తాన్ : (మెల్లగా కనుఱెప్పలు వాల్చుచు) గానపారవశ్యముచేత కన్నులు మూతపడుచున్నవి.

అగ్బ : కన్నులు మూతపడుచుండగనే ఇంతకు ముందెన్నడును ఎఱిగి యుండని హృదయద్వారమొకటి తెఱవబడినది.

తాన్ : దాని తాళపు చెవి కొఱకె మనమింత దూరము వచ్చితిమి. ఏమి యీగాన విశేషము!

అగ్బ : కావుననే లోక ప్రసిద్ధమైనది.

తాన్ : తల్లీ, మమ్మొక్కమాఱు కరుణింపుము. మేము కృతార్థులమయ్యెదము.

సుశీ : (కన్నులు పులుపుకొనుచు లేచి కూర్చుండి) మల్లీ వైద్దుగులొచ్చినారె ! రోగమొక దోవ మందొకదోవ.

మీరా : (ఉల్కిపడిలేచును)

(అగ్బరు తాన్ సేనులు లేతురు)

మీరా : ఆ! మనోమోహనా, వచ్చితివా ? నన్నుగొనిపొమ్ము. ఎంతకాలము నీకయి వేచియుంటిని ?

సుశీ : ఇక్కణ్ణుంచి కొనిపొమ్మని వేడుకొంటుంది దొరసానమ్మ.

( కూర్చుండి తూగును)

మీరా : (అగ్బరు తాన్సేనుల తట్టుతిరిగి) ఇద్దరు శ్రీకృష్ణులు ! (సుశీలవంక చూచి) ఇంకొక శ్రీకృష్ణుడు (నలువంకలుచూచి) కోటానుకోట్ల శ్రీకృష్ణులు ! ఇందులో

నాప్రాణేశ్వరుడైన యశోదానందనుడేడి ?

అగ్బ : ఈ భక్తురాలికి లోకమంతయు శ్రీకృష్ణమయముగ నున్నది. అమ్మా, ఆ కృష్ణుని మాకు చూపించి మమ్ములను భవవిముక్తులను గావింపుము.

మీరా : జగన్మోహనా, నీవు నాతో చెరలాట మాడుచున్నావా ? నీవు నిన్నెఱుగవా ? నీవు శ్రీకృష్ణుడవుగావా ?

అగ్బ : ఈమె కీ సమయమున నిహలోకజ్ఞాన మంతరించినది. రాధయే తానను విశ్వాసమున శ్రీకృష్ణ విశ్లేషము సహింపనోపక యార్తిచెందుచున్నది. మన మిప్పుడీమెతో సంభాషింపలేము. దర్శనముచే పవిత్రులమైతిమి. గానముచే హృదయము నిర్మలమయ్యెను. ఇక మరలుదము.

తాన్ : 'నీవు నిన్నెఱుగవా ? నీవు శ్రీకృష్ణుడవు గావా ?' యను వాక్యముతో మనకు చిరంతన సత్యమును బోధించినది.

సుశీ : (కనులెత్తి) అబ్బో ! మరల దోమరాటుకూడా యెక్కువైంది. (పైటతో విసరుకొనుచు) కన్నట్టెమూయనీయ వీ పాపిష్టిదోమలు. అయ్యా, - యేమైనా మందిచ్చిపోతున్నారా? కుప్పెకట్టయితే మఱొక్కసుట్టు యెక్కువగా సాదియ్యండి. కాస్త యిచ్చాపత్తెం పెట్టండి. పాపం ! మారాణిగారు ఇప్పటికే సన్నగిల్లిపోయారు.

అగ్బ : ఆమె పిచ్చికి ఆమెయొద్దనే మందుగలదు. దానిని మేము కూడ కొంచెము గ్రహించితిమి.

సుశీ : (స్వగతము) వీళ్ళకు గూడా పిచ్చిపట్టిందాయేంటి ! ఈ పిచ్చి అంటురోగమాల అందరికీ తగులుకొనేటట్టుంది. ఈ గాలితగిలి నాకూగూడా పిచ్చిపట్టిందోయేమొ అద్దము చూచుకోని వస్తాను. (నిష్క్రమించును)

అగ్బ : ఈ దాసి మనల ననుమానించి యుండదుకదా !

తాన్ : అది తూగుబోతు.

అగ్బ : తల్లీ, ఈ గురుకట్నమును గ్రహింపుము. ఈ హారమును శ్రీ కృష్ణునకు స్వయంవర హారముగ సమర్పింపుము.

(మీరాబాయి అంజలిలో హారమును విడచును)

తాన్ : ఈబీద కట్నమును గూడ పరిగ్రహింపుము.

(పూవులదండను దోసిట విడచును.)

(దండముపెట్టి యిరువురు నిష్క్రమింతురు. ధ్యాన నిమగ్నయైయున్న మీరాబాయి చేతిలోనుండి హారము క్రిందికి జారిపడును.)

సుశీ : (ప్రవేశించి) అద్దములో చూచుకొంటె ముందరి మొఖంలాగేవుంది. నాకేం పిచ్చిపట్టలేదు. వైద్దుగులు మందైనా యియ్యకుండా వెళ్లిపొయ్యారే. (హారమును చూచి ఆశ్చర్యముతో) ఆ ! యిదేంటి చుక్కల దండలాగా మెరుస్తుంది. (నలుప్రక్కలు పరికించి) ఇక్కడ యెవ్వరూలేరు. రాణిగారు కన్నుమాల్చివున్నారు. (హారమును తీసికొని) వైద్దుగులు చూచివుంటే తట్టేసివుండేవాళ్ళే. దీన్ని దొంగిలిస్తే దేవుడుకూడా కనుక్కోలేడు. (అటునిటు చూచి ఱవికెలో దోపుకొనును)

మీరా : (మెల్లగా కనులెత్తి) ప్రాణవల్లభా, యీవిరహిణిని నీవు పరిత్యజించితివి. ఇక నే జీవించయుండలేను. ప్రాణపరిత్యాగము చేసికొందును. ఈ హత్యాపాతకము నిన్నుదప్పక చుట్టుకొనును. (తన్నుజూచుకొని యుల్కిపడిలేచి) హా! ఇదియేమివింత! నేనే కృష్ణుడను ! మా కిరువురకు నభేద ప్రతిపత్తి గలిగినది ! ఈ చరాచర భూతసృష్టి యంతయు నేనే ! నేను లేనిదియు నేను కానిదియు నొక్కటియైన కనబడదు ! అంతయు నేనే......నేనే........నేనే....నే.........నే........

(మూర్ఛిల్లును ; సుశీల అనుకొని పట్టుకొనును)

(తెరజారును)



## స్థలము 6 : రాణిగారి అలంకార మందిరము

(తెర యెత్తబడునప్పటికి సుశీల అచ్చట సామానులు సర్దుచుండును)

సుశీల : అదుష్టం గోడమీది పిల్లిదూకినట్లు దూకుతుంది. కలలోనైనా యిట్లాంటి హారం వేసుకొనే దినం వస్తుందని నే ననుకోలేదు.

(రవికెలో దాచియున్న హారమును తీసి కన్నులకద్దుకొని, మెడలో వేసికొని అద్దముచూచుకొనుచు పాపట దిద్దుకొనుచు)

దాసీయని పేరేగాని నాకుమాత్రం అంద చందాలు లేవా యేంటి ? రాణివాసంలో పుట్టేవుంటే నేనూ వొక రాణినై యుండేదాన్నే.

(ఇంతలో వాసంతిక ప్రవేశించి, సుశీల మాటలువిని యొకప్రక్క నక్కియుండును)

వాసం : ఈ గదిలో యేంచేస్తుంది సుశీల ? రాణిగారిని వదలిపెట్టి యిక్కడ తారాడుతుంది. (కొంచెము వంగిచూచి) ఓహో ! అందం చూచుకొని మూర్ఛపోతుంది. ఆ మొఖం యింకా కాస్తబాగుంటే అద్దం రవికెలోనే వుండాల్సి వుంటుందేమొ.

సుశీ : అందంలో రాణిగారికి చవితినిగా వున్నాను. మతీ యీ హారం వల్ల నా అందం యిమ్మడించింది.

వాసం : (ఆశ్చర్యముతో) ఇదేంటి యీ విచిత్రం ! ఈ బుగ్గల బూచి! కడుపులో యెన్ని ఆలోచనలున్నాయి ! వొక్కదెబ్బలో రాణిగారికి చవితైపోయింది! ఇంక రాణాగారివంటి మొగుడొక్కడే తక్కువ !

సుశీ : నేనింక అధికారంచేస్తే వొక్కదాసీతొత్తు కూతురుకూడా పల్లెత్తు మాట నలేదు. నా హారంచూచి గపుచిపుమని నోరుమూసుకొని పోతారు.

వాసం : ఈ దయ్యాల మంగిని చీపురుకట్టతో శివాళించ బుద్దేస్తుంది. దీని కెక్కడిదీహారము? ఏ మిండమగడైనా యిచ్చిపోయినాడా యేం ?

సుశీ : నాకు మంచికాలం వచ్చేసరికి ఆ వైద్దుగులు దొరసానమ్మకు హారం నజరిచ్చి పోయినారనుకుంటాను. లేకపోతే వుట్టవుడియంగా హారాలు ఆకాశం బొందచేసుకొని కిందపడతవా ?

వాసం : ఆ ! తెలిసింది. ఎవరో నజరిచ్చిపోయిన హారాన్ని రాణిగారు మాంద్యంలో వుండేటప్పుడు ఈ మాయలాడి తట్టేసివుంటుంది.

సుశీ : ఆ వాసంతిక నా అందాన్ని చూచి చూపోపలేక గొంతుకు వురివేసుకొని చస్తుంది.

వాసం : (మెటికలు విఱుచుచు) ఓసి లంబాడి, నీబుగ్గలుకోసి వండివేస్తే పదిమంది సిపాయిల కడుపులు నిండుతాయి. నీయందాన్ని చూచి నేను వురివేసుకొని చావాల్నా ?

సుశీ : సరిసమానుల్లో వొకరికి కొత్తగా భాగ్యంవస్తే తక్కిన వాళ్ళ కళ్ళలో కారం చల్లినట్లుంటుంది. వాళ్లయీసు నన్నేమి చేస్తుంది ? కొంచెం వోరపైటవేసుకొని మద్యరంగంలో పనివున్నట్లు తిరుగుతుంటాను. ఎవరైనా యెక్కడి దీహారమంటే రాజాగారిచ్చినారని రహస్యంగా చెబుతాను.

వాసం : (ఈ మాటలు విని నవ్వునిలుపుకొనలేక పక్కున నవ్వును)

సుశీ : (ఉలిక్కిపడి) ఎవరక్కడ ? వాసంతికా ?

వాసం : అమ్మా, దొరసానమ్మా, అట్టాంటిరాజు నాకూ మొగుడైతే నేనూ రాణిగారికి చవితినై వుందునుగదా !

సుశీ : (ప్రాణములు పోయినట్లు దిగాలుపడును) ఈలంజెకూతురు అంతావిన్నది (తెప్పరిల్లి) వాసంతికా, యెంతసేపైంది నీవు వచ్చి ?

వాసం : తమరు రాణిగారికి చవితి అయ్యింది మొదలు తమరి అందచందాన్ని చూచి వాసంతిక వురివేసుకొని చచ్చేవఱకు, రాణాగారు నిన్ను మోహించి ఆ హారం బహుమానం చేసేవఱకు.

సుశీ : నే ననుకొన్నట్లే మోసపోయావు.

వాసం : అదేంటి ?

సుశీ : నీవు వచ్చి వాకిటివద్ద దాంకొన్నది అప్పుడే చూచాను. నీ వేమనుకొంటావో చూస్తామని అట్లా మాట్లాడినాను.

వాసం : (నవ్వుచు) నేను మాత్రం నిజమనుకొన్నానా ? నీవు తమాషా పట్టిస్తున్నావని నేనుకూడా నవ్వుతుణ్ణాను.

సుశీ : నేను ఎగతాళికి అన్నమాటలు నీవు దాసీలదగ్గర అనవద్దు. వొట్టు. వాళ్ళు ఎకసక్కెం మాటలు కూడా నిజమని యెత్తిపొడుస్తుంటారు.

వాసం : అంతేగా భాగ్యం. అట్లాగే, నాకు పనివుంది. మళ్లీవస్తాను. (స్వగతము) ఇది

నన్ను మోసం చేసినానని అనుకొంటుంది. దీన్ని మోసంచేసి కొరడా వేట్లతో నలుగు పెట్టిస్తాను. (నిష్క్రమించును)

సుశీ : పాపము, వాసంతిక నన్నొకకంట కనిపెట్టేవుంటుంది. ఎట్లయినా దానికి నన్నుచూస్తే కొంచెం భయమే. (హారముతీసి అవికెలో దోపుకొనును) శుక్రవారము నాడు తలకుపోసుకొని రాణి గారిచ్చిన బనారసుచీర కట్టుకొని మల్లీ యీ హారం వేసుకొంటాను.

(తెరలో సుశీలా, ఇంకా ఏం చేస్తున్నావు ? అని కేక వినబడును)

సుశీ : ఇదిగో ! వస్తున్నాను. రాణిగారి మందు సంగతే మరచిపోయాను.

(నిష్క్రమించును)



## స్థలము 7 ః రాణాగారి విశ్రాంతి మందిరము

(పట్టుమెత్తలుకుట్టిన సోఫాయుండును. దానికి కుడిప్రక్కన రెండుకుర్చీలు వేయబడియుండును. ఎడమ ప్రక్కన ఒక చిన్న టేబిలుపై హుక్కాయుండును. రెండుమూడు పుస్తకములు పెట్టబడియుండును. రాణా ఆలోచనా నిమగ్నుడయి అటునిటు పచారుచేయుచుండగా తెరయెత్తబడును. రాణా కుదుటపడని మనస్సుతో ఒకతూరి పుస్తకము తీసికొని పుటలు త్రిప్పి మరల బల్లపై పెట్టును. అటునిటు తిరుగును. ఒక్క గ్రుక్కెడు హుక్కా పీల్చి గొట్టమును బల్లపై పెట్టును. రాణా యిట్లు మనస్సంక్షోభముకనబఱచు చేష్టలు ఒకటి రెండు నిమిషములు చేయును.)

రాణా ః మీరాయొక్క నడవడి విడదీయరాని చిక్కుగ నేర్పడినది. ఇది యది యని నిర్ణయించుటకు వీలుకాకున్నది. కొందఱు దీనిని మతావేశమని చెప్పుచున్నారు. మతావేశముకూడ యొక మానసిక వ్యాధియనియే నాయుద్దేశము. (సోఫాపై కూర్చుండును) ఔరా! నాకన్నుల యెదుటనే నీ జీవిత మెట్లు మాఱిపోయినది! ప్రేమకు విషయీభూతమగు వస్తువే ద్వేష ప్రేరకమైనయెడల - ఈ రాజ్యమే కాదు. ప్రపంచమునంతయు నేలు వానికైన శాంతిలేదు. ఆనందములేదు. హృదయము శ్మశానము. జీవితము మరుప్రదేశము. ఇంతకన్న దుఃఖకరమైన ఆంతరిక సంక్షోభము వేఱొండు లేదు. (లేచి అటునిటు తిరిగి) తనకు తెలిసి మీరా నన్ను తిరస్కరించుట లేదు. ద్వేషించుటయులేదు. ఒకప్పుడు తాను వచించుమాటల ఫలితమును యోచింపలేనంత అమాయికగ నగపడును. ఆ కాంత యొనరించు ప్రతి కార్యమును తనకు నైసర్గిక మైనట్లే తోచుచుండును. ఏదియో యొక బలాత్కారశక్తి తన్ను నన్నుండి యాకర్షించుకొన్నట్లు నిస్సహాయయై వర్ణించు చుండును.

(మఱల సోఫాలో కూర్చుండును)

మీరాను పరిత్యజింపజాలను, ప్రణయమంజులమైన గత జీవిత స్మృతి నాసంకల్పమున కడ్డుపడుచున్నది. ఎప్పటికైనను మీరాను నా వంకకు త్రిప్పుకొనగలనను నమ్మకము గలదు.

(బలవంతరావు ప్రవేశించును)

బలవంతరావు ః జయము, జయము ధర్మ ప్రభువులకు !

రాణా ః కూర్చుండుము - మీరా ఇపుడెట్లున్నది ?

బల : (కూర్చుండి) నిన్నటివలెనే యున్నది. ఔషధ సేవనము వలన ప్రయోజనమేమియు నగపడుటలేదు. దైవానుకూలముగ నాకొక విషయముజ్ఞప్తికి వచ్చినది. భూతచికిత్సచేయించి వేయిమంది సద్బ్రాహ్మణులకు షడ్రసోపేతముగ సంతర్పణ చేయించి, శాంతిచేసిన యెడల రాణిగారికి తప్పక జాడ్యము కుదురును !

రాణా : (విసుగుచూపుచు, స్వగతము) ఇతడు పురాణపురుషుడు. ఇతని ఇప్పటి యోగ్యత వార్ధక్యమే!

బల : భేతాళుని ఆజ్ఞలోనుండి అప్పుడప్పుడు కొన్ని పిశాచములు తప్పించుకొని, భూలోకమునకు వచ్చి ప్రజలను బాధపెట్టుచుండునని మంత్రశాస్త్రవేత్తలు చెప్పుదురు. అవి పట్టినప్పుడు ఆవేశమువచ్చినట్లూ, పిచ్చిపట్టినట్లూ ఉండేదికలదు. భల్లూక శాస్త్రుల వారు శాతపాడి మంత్రములలో . -

రాణా : (విసుగుతో) ఇస్...ఇక చాలింపుము ! ఎంతతెలివితక్కువ వ్యాఖ్యానము?

బల : (అణగిపోయి) ప్రభువులవారు మత విషయములలో ఇంత కఠినముగా మాట్లాడడము కొంచెము - (నీళ్ళు నములును)

రాణా : మూఢభక్తులకు మతము కానిదేది ?

బల : పాఠశాలలో మతప్రచారము చేయకూడదని దేవరవారు కావించిన శాసనము ప్రజలలో కల్లోలము పుట్టించుచున్నది. పీఠాధిపతులు, కులగురువులు, రాజద్రోహము బోధించుచున్నట్లు వినికిడి. మొగలాయి వాళ్ళు మనమీద కత్తిగట్టియున్న యీ సమయమున మన ప్రజలలో రాజ్య ద్వేషం కలగడము మంచిపనిగాదు. ఏదో వృద్ధుడను, సంస్థాన శ్రేయోభిలాషిని, అనుభవశాలిని విన్నవించుకొన్నాను. తర్వాత ప్రభువుల చిత్తము.

రాణా : నిజమే ! దానిని నేను గమనింపకపోలేదు. విశ్వసనీయుడైన సేనాధిపతికి ఖచ్చితమైన ఉత్తరువు వంపియున్నాను. ఈ మతాధికారము ప్రతిపదమునందును నాయాజ్ఞ నెదుర్కొనుచున్నది. నా రాజ్యమునందు నా శాసనమే శిరసావహింపబడవలయును. అరాజకము, బహురాజకము రెండును అపాయకములే ! మతాచార్యుల పలుకుబడి సన్నగిల్లిననే ప్రజలలో మూఢభక్తి నశింపగలదు. లౌకిక జ్ఞానమును, జీవితమును ద్వేషించు ప్రతి మతమును మానవుని మనో వికాసమునకు అభ్యంతరమగును. ఈ సంకుచిత మతములను నా రాజ్యమునుండి సమ్మార్జింపవలయును.

బల : మతాధికారము చాలా శతాబ్దముల నుండి వేళ్ళు పారియున్నది.

రాణా : నేను ప్రవేశపెట్టిన విద్యాపద్ధతికి కఱకైన వాదరగలదు.

బల : దేవరవారికి తెలియనిదేమున్నది ? సర్వజ్ఞులు - అయినా అనుభవశాలిని. శలవు పుచ్చుకొంటాను. (లేచి కొంతనడచి) మనవి చేసుకొన వలయునని మఱచిపోతిని. ఒక చిన్న సంగతి, ప్రభువుల వారికి తెలియవలసిన ముఖ్యమైన విషయము గాదు.

రాణా : ఏమది ?

బల : రాణిగారికి చికిత్సచేయుటకు నిన్నటిదినమున ఎవరో యిద్దరు వైదేశిక వైద్యులు వచ్చియుండిరి. వారును వచ్చినట్లే పోయిరి. అప్పుడు రాణిగారి వద్ద సుశీలయను దాసి యుండినది. ఈనాడు అది ఏదో యొక హారము వేసికొని తిరుగుచున్నదని ఇంకొక దాసి వాసంతిక చెప్పెను. దానిని పిలిపించితిని; అది ధరించుకొన్నహారము అమూల్య వజ్రహారముగా కనుపట్టినది.

రాణా : ఈ విషయము చిత్రముగనున్నది. దాసిఏమి ? వజ్రహారమును ధరించుటేమి? దాని నిటకు పిలిపింపుడు.

బల : ఎవడురా అక్కడ?

ద్వారపాలకుడు : స్వామి

బల : రాణిగారి పెద్దదాసిని సుశీలను ఇచ్చటకు దోడ్కొనిరమ్ము.

ద్వార : చిత్తం. (నిష్క్రమించును)

రాణా : ఆ దాసి యెచ్చటనైన దొంగిలించియుండునా ?

బల : అది సామాన్య భాగ్యవంతులు వేసికొను హారముగాదు. దొంగిలించి యుండిన అంతఃపురముననే దొంగిలించి యుండవలయును.

(సుశీల మెడలో హారము వేసికొని యోరపైటతో కుల్కునడకతో ప్రవేశించును)

సుశీల : (స్వగతము) రాజుగారు నన్నెప్పుడు పిలిపించేవారుగారు. ఈ దండ మహత్తెంవల్ల నాకేదో యదృష్టం పట్టేలాగుంది. (సిగ్గునభినయించుచు) నీళ్ళల్లో లోతు, మనసులో మర్మం యెవరికి తెలుస్తుంది! (పైట సవరించుకొని హారము దిద్దుకొని) దాసురాలిని (దండముపెట్టును.)

రాణా : (సుశీల మెడలోని హారమును పరికించును)

సుశీ : (స్వగతము) రాజుగారు నాహారపైటమీదనే కన్నువేశారు.

రాణా : ఆ హారమును దీసికొండు.

సుశీల : (సిగ్గుపడుచు హారముదీసి వినయ మభినయించుచు దూరము నుండి బలవంతరావుచేతి కందియిచ్చును)

బల : (రాణాచేతబెట్టును)

రాణా : (పరీక్షించుచుండును)

సుశీ : (స్వగతము) ఎవరైనా నన్ను మోసం చేసి వుండరుగదా ?

రాణా : దాసీ, నీ కీహారమెక్కడిది ? మాబొక్కసములోని ధనమంతయు వెచ్చించినను దీని మూల్యమునకు సరిపోదు.

సుశీ : (స్వగతము) అబ్బో ! అట్టాంటి హారమా యిది ? యెంత వెఱ్ఱిముండను. దాచైనా పెట్టుకోక పోతిని.

రాణా : ఏమి యాలోచించుచున్నావు ? కట్టుకథలల్లకుము. యథార్థము చెప్పుము.

సుశీ : నిన్నటిదినం రాణిగారికి మందియ్యడానికి వచ్చిన వైద్దుగులు ఈ హారము ఇచ్చిపోయినట్లుంది.

రాణా : ఊహించుటయేమి ? నీవు చూడలేదా ?

సుశీ : (భయముతో) రాత్రంతా అమ్మగారికి విసుర్తానే వుండి నిద్రలేక అప్పుడే కన్నట్ట మాల్చాను.

రాణా : ఓహో ! కన్నుమాల్చితివా ?

సుశీ : తర్వాత రాణిగారు నన్ను దగ్గరికి పిలిచి 'ఒసె సుశీలా, ఇక్కడ వుండే' దాసీల్లో కెల్లా నీవుకొంచెం ముక్కూమొగం అందంగా వుండేదానివి, ఈ హారం నీకైతే తగివుంటుంది" అని నేను వద్దనేకొంది నామెళ్ళోవేసారు.

రాణా : (కోపముతో) ఓసీ, బుద్ధిలేనిదానా, నీ సౌందర్యవర్ణనముతో మాకిప్పుడు పనియేమి? మీరాకు ఆ వైద్యులు ఈవజ్రహారము నిచ్చిరా ? లేక అంతకు ముందు ధరించియుండినదా ?

సుశీ : అంతకుముందు లేదండి దొరగారు, వాళ్ళు రాణిగారికి నజరు తెచ్చినారేమొ.

రాణా : వైద్యులేమి అంతఃపురమున కిట్టి నజరులు తెచ్చుటయేమి ? ఇదియొక క్రొత్త చికిత్సకాబోలు !

బల : (స్వగతము) ఇది అటుతిరిగి యిటుతిరిగి కడపటికి నా ప్రాణముల మీదికే వచ్చునట్లున్నదే.

రాణా : పాతర త్రవ్వబోవగా భూతము బయటపడినట్లు ఇదేదియో యొక క్రొత్త విషయము బొగడ పొడిచెను. దీని నంతయు మా యమాత్యులుకూడ విచారించి పరిశీలించిన బాగుగనుండును. - ఓరీ

ద్వారపాలకుడు : దాసుణ్ణి

రాణా : మా మంత్రులను నిచ్చటకు రమ్మని చెప్పుము ; శీఘ్రముగ.

ద్వార : చిత్తం. (నిష్క్రమించును)

రాణా : బలవంతరావ్, ఆ వైద్యులు మీయుత్తరువు తీసికొని యంతఃపురములోనికి ప్రవేశించిరా ?

బల : (సగర్వముగ) నా యనుమతి లేనిదే పోతుటీగ కూడ అంతఃపురములోనికి ప్రవేశింపదు.

రాణా : వారివేషభాష లెట్లుండినవి ? అసాధారణ విశేషము లేవియు మీకు తోపలేదా?

బల : వారివేషములు వారికి తగినవిగనే యుండినవి. వారి సంభాషణ యోగ్యతను పట్టిచూడగా రాజసంస్థానములలో మెలగిన వైద్యులవలె నే యగపడిరి. ద్రవ్యార్జనముకంటె వ్యాధి కుదిర్చిన కీర్తియే వారికి ముఖ్యమైనట్లు తోచినది. తిరిగి పోవునప్పుడు సంభావన మాటయే యెత్తలేదు.

రాణా : (కోపము బిగపట్టుకొని) అప్పుడు నీ బుద్ధి స్వాధీనమున నుండినదా లేక అభిని మత్తున తూగుచుంటివా ?

బల : (తత్తరముతో చేతులు పిసుకుకొనుచు, స్వగతము) రాజు గారికి గూడా తెలిసినట్లె యున్నది.

రాణా : (కోపముతో) ఓయీ, పిచ్చి బ్రాహ్మణుడా, నీవు కన్ను లుండియు చూడలేవు ; వీనులుండియు వినలేవు ; తలయుండియు నాలోచింపలేవు. ఇట్టి యమూల్య హారములను నిశ్చింతముగ కానుక యియ్యగల వైద్య వేషధారులకు నీవిచ్చు బీదసంభావన లెందుకు ?

బల : (ఆశ్చర్యముతో) వేషధారులా వారు !

రాణా : కాక, మఱియెవ్వరు ?

సుశీ : (స్వగతము) ఈ ముసలాయనకు మూడుచిట్ల ముక్కజొన్నలు బత్తెం పడేలాగుంది.

(మంత్రులిరువురు ప్రవేశింతురు)

మంత్రులు : జయము, జయము !

రాణా : విచ్చేయుడు.

(మంత్రులు కూర్చుండుదురు)

రాణా : శ్యామల రావుగారూ, మన యంతఃపురమున వింతలు పుట్టుచున్నవి. ఈ హారమును చూచితిరా ? (శ్యామలరావు చేతికిచ్చును.) దీనిని ఆ దాసివేసికొని తిరగుచుండగా మరియొకదాసి చూచి బలవంతరావు గారి కెఱిగించెను.

సుశీ : (స్వగతము) చూపోపలేక ఆ మాయలాడి తొత్తుకూతురు వాసంతిక మోసం చేసి వుంటుంది. ఈ ముసలిబాపడికి నేనంటే కళ్ళల్లో కారం చల్లినట్లుంటుంది.

రాణా : నిన్నటిదినమున ఎవరో యిద్దరు వైద్యులు మన యంతఃపురమునకు వచ్చి మీరాకు ఈహారములను నజరిచ్చి పోయిరట !

శ్యామ : వైద్యులా యిట్టిహారములను బహుమతిచేయుట !

మాధ : (హారమును తాను తీసికొని) ఇది నమ్మతగినది కాదు.

సుశీ : నిజమేనండి దొరగారు.

మాధ : నీవు చూచితివా ?

సుశీ : నా చేరడేసి కళ్ళనిండా చూచానండి.

రాణా : రావుజీ, వైద్యులు మన యంతఃపురమునకు వచ్చినమాట యథార్థము. ఆ సంగతి బలవంతరావుగారె చెప్పిరి.

బల : వచ్చిన మాట వాస్తవమె.

రాణా : ఆ వైద్యులే యీ హారమును దెచ్చియుండక పోయిన, అంతరాళము నుండి యూడిపడి యుండునా ?

శ్యామ : వారు నిక్కువమైన వైద్యులైనట్లు తోపదు.

రాణా : నేనును అట్లె తలంచితిని. ఎవరో దురాత్ములైన సంస్థానాధిపతులు మాయంతఃపురము నపవాద కళంకితము కావించుటకొఱకు వైద్యవేషధారులై వచ్చిరి. నీకు వారి యుచ్చారణలో భేదమేమైన గోచరింపలేదా ?

బల : (తత్తరముతో) ఏదో కొంచెముండినట్లుగనే తోచుచున్నది. నాకప్పుడనుమానము తట్టనందువలన అంతగా పరిశీలింపలేదు. కొంత మొగలాయిదేశ స్పర్శఉండినట్లుగా భ్రమ.

రాణా : ఆ ! తెలిసినది. ఇది యంతయు ఆ కపటాత్ముడు అగ్బరు పన్నిన కుట్రవలె నగవడుచున్నది. నన్ను శౌర్యముతో లోబఱచుకొనలేక యిట్టి యధమకృత్యమున కొడిగట్టియుండును. మీరేమి తలంచెదరు ?

శ్యామ : మన యూహావలంబనమునకు ఇంకను కొన్ని ఘనిష్టములైన యాధారములు దొఱకవలయును.

మాధ : ఒకవేళ ప్రభువు గారి యూహ సత్యముగనే యుండవచ్చును. మొగలాయివారు ఎట్టి నీచకార్యములకైన సాహసింపగలరు.

రాణా : ఆ దుర్వివేకుడు ఇట్టికుతంత్రముల వలన నన్ను లోబఱచుకొనగలడా ? అక్క సెలియండ్రను ఆలుబిడ్డలను మొగలాయి పాదుషాలకర్పించి యా యపకీర్తి మూల్యముచే నున్నతోద్యోగముల విలిచి నీచ జీవనము సేయుచు చిరంతన యశోవిరాజితమైన రాజపుత్ర కులమునకు కళంకము దెచ్చిన మానసింహాదుల వంటి పతితుడ ననుకొనెనా నన్ను ? ఎన్ని యుపాయములైన పన్నుగాక, కుంభరాణా అగ్బరునకు ప్రాణముతో లోబడడు. (బలవంతరావు తట్టుతిరిగి) ఓయీ నిద్దురపోతా, నీ యజాగ్రత్తవలన గదా మాయంతఃపురమున కింత యపనింద కలిగినది ?

బల : (లేచి, గద్గద స్వరముతో) మహాప్రభూ, అంతఃపురాధికారినౌట నేనే యపరాధిని. వృద్ధుడనౌట బుద్ధిపాటవముకూడ తగ్గిపోవుచున్నది. కన్నులును చక్కగ కనబడవు. నన్నిక ఉద్యోగ విముక్తుని గావింపవలయునని ప్రార్థించుచున్నాను.

రాణా : ప్రార్థన మవసరములేకయే నిన్ను పదభ్రష్టుని గావించుచున్నాను ; నీ వయస్సు, నీ స్వామిభక్తియు, నీ ప్రాణములను దక్కించినవి. వెడలిపొమ్ము.

బల : మన్నింపబడితిని. ధన్యుడను. (తాళములు రాజుముందరపెట్టును) రాజసేవ కత్తిపైని సాము ! (నిష్క్రమించును)

సుశీ : (స్వగతము) ఈ ముసలిబాపడు మేయబోయి మెడకు దగిలించుకొన్నాడు. ఆ వాసంతిక మాటవిని నామీద చాడీలు చెప్పినందుకు ఆ వుద్యోగం కాస్తా వూడిపోయింది.

రాణా : మాకు విశ్వాసపాత్రుడైన కుమార సింహుని అంతఃపురాధికారిగా నియమించితిమి. ఉత్తరువు సాదరు చేయించుడు.

శ్యామ : చిత్తము, దేవరవారు చాలా న్యాయముగ తీర్మానించితిరి. కుమారసింహుడు వనిప్రాయము వాడగుటవలన అతని తండ్రియుద్యోగమును బలవంతరావుగారి కొసగబడియుండెను. ఇప్పుడు కుమార సింహుడు యుక్తవయస్కుడు.

సుశీ : రాణిగా రొంటరిగా వుంటారు. మళ్ళీ వస్తాను. (నిష్క్రమించును)

ద్వార : తలారివాడొకడు ప్రభువులవారి దర్శనానికి కనిపెట్టుకోని వున్నాడు.

శ్యామ : ప్రభువుగారిప్పుడు కార్యాంతర నిమగ్నులు. రేపువచ్చి మనవి చేసికొమ్మనుము.

ద్వార : (నిష్క్రమించి, మరలవచ్చి) వాడిది అగత్తెమయిన మనివంట. పెళ్ళాం బిడ్డల నోటికాడ కూడంట.

రాణా : ఏమది ? వానిని రమ్మనుము - నాదర్శనమును గోరువారినెవ్వరిని ఆటంకపెట్టకుడు. అంతకన్న నాకు ఉత్తమమయిన కార్యమేమున్నది?

శ్యామ : చిత్తము.

(తలారి మురళీదాసు ప్రవేశించును)

మురళి : మహాప్రెభో, నాది అగిత్తెమయిన మనివండి. పెళ్ళాం బిడ్డల నోటికాడ కూడండి. (వంగి దణ్ణము పెట్టును.)

శ్యామ : ఏమిరా నీమనవి ? ఒకటి రెండు మాటలతో విన్నవించుము.

మురళి : చిత్తం మహాప్రెభో, యీ యాళపొద్దున, అంటే పొద్దుఅల్లాడికెక్కినాక, (నిర్దేశించును) నేనొక బంగారు మోరీ యెత్తుకోని మార్చుకొందామని దునీచంద్ సేట్ దగ్గరికి వెళ్ళినాను. ఆమోరి తీసుకోని దాని కరీదు పది రూపాయలని అయిదు రూపాయలిచ్చి మిగత పైకానికి పదిరోజులు తాళి రమ్మన్నాడండి.

రాణా : కానిమ్ము.

మురళి : ఆ పక్కంగటి సేటు ఆయన కడుపు సల్లంగుంటే దాని కరీదు యిరవయి రూపాయలని చెప్పినాడు. ఆ పాట మళ్లీ దునీచందుసేటు దగ్గరికి పోయి నీపయికంతీసుకోని నా మోరీ అన్నాయియ్యా,లేకుంటె యిర వయి రూపాయలన్నా యియ్యా అని బతిమాలినాను. మోదేసుకొన్నాను. ఏమి

చేసినా నా కోడికి మూడే కాళ్ళంటాడు. ససేమంటే ససేమంటాడు. మోరీ యెత్తి తిత్తిలో యేసుకోని పెట్లోపెట్టి బీగం యేసి, మొల్లో యేసుకొన్నాడు. నేను మల్లీ గట్టిగా అడిగితే నీవిక్కడ అల్లరిచేస్తే దొంగసొత్తని చెప్పి దండాధికారికి పట్టిస్తాను కబరారని గుడ్లు మిటకరించాడు. ఆపాట నేను యిదంతా యిన్నపంచేసుకోడానికి దండాదికారిదగ్గరికి పోయినాను. పోయినపాటనే అక్కడవుండిన నౌకరి నాచేతికి యిసనకఱ్ఱ పట్టిచ్చి ఆయన యాడకో జారుకొన్నాడు. నేన విసుర్తూ మనవి చేసుకొంటూ వుణ్యాను. అయ్యగారు మెల్లంగా కన్నుమాల్చినారు. రెండు గెడియలకి మేల్కొని సరే అంతా విన్నాను గాని, దునీచందు నీమీద ఫిర్యాదుచేస్తే అప్పుడు విచారిస్తాము పో అని పంపేశాడు. నామోరీ యిప్పించేమాట మరిశేపొయ్యాడు.

శ్యామ : నీమనివి యామోరీని తిరుగ యిప్పించమనియే కదా.

మురళి : అదేనండి మహాప్రెభో.

రాణా : శ్యామలరావుగారూ, చూచితిరా మన పరిపాలనా సౌష్ఠవము, దండనీతి విధానము? ప్రజల మనస్సులే కాదు. పాలనా యంత్రము కూడ సంస్కరింపబడవలయును.

శ్యామ : చిత్తము.

రాణా : నీకు మొహరీ యెక్కడిదిరా ?

మురళి : నిన్నటిరాత్రి ముసాపురిఖానా వద్ద గుస్తు తిరుగుతుణ్యాను. నేను అందరి తలారివాళ్ళలాగ రాత్రంతా నిద్రపోయి పొద్దున్నే లేచి కాగడా పట్టుకోని వచ్చేవాణ్ణి కాదండి. గుట్టుగా నవుకరి చేసుకోని బతికేవాణ్ణి.

రాణా : కానిమ్ము

మురళి : చిత్తం మహాప్రెభో - ఆ సాలలో యిద్దరు ముసాఫర్లు పండుకోని నిద్రపోతుండినారు. వాళ్ళను లేవగొట్టి మూటాముల్లె భద్రమని యెచ్చరించాను. నేనెప్పటికి ప్రతి బాటసారిని కఱ్ఱతో తట్టిలేపి కాగడా పట్టి చూస్తుంటాను. అందువల్లనే నా ఫారాలో వొక్క దొంగతనమైనాపోలేదండి దొరగారూ. అదంతా ప్రెభువుల కెరికె.

రాణా : అధిక ప్రసంగము చేయకుము. శీఘ్రముగ ముగింపుము.

మురళి : (భయముతో) చిత్తం మహాప్రెభో - మాటామాటలో మా యింటి మంచీ

శెబ్బరా చెప్పుకొన్నాను. వాళ్ళల్లో వొకాయన నా మీద కనికరం పుట్టి వొక మోరియ్య యినామిచ్చినాడు. ఇంతకంటే చిల్లపెంకెత్తుకూడా యెత్యాషం జరగలేదండి దొరగారు (దండము పెట్టును)

రాణా : వారు వైదేశిక యాత్రికులా, బైరాగులా ? వారిపై నీ కేమైనా అనుమానము తట్టలేదా ?

మురళి : వాళ్లు దొంగల్లాగా లేరండి మహాప్రెభో, పెద్దపెద్ద నామాలు, తొళిసిపూసల దండలూ చూస్తే భక్తుల్లాగా కనబడ్డారు. నాయంటివాణ్ణీ గూడ 'అయ్యా' అని పెద్దమణిశిని లాగా పలకరించారు.

రాణా : అందుకే ఉబ్బి తబ్బిబ్బులయి నీయుద్యోగవిధులను మఱచితివా ? అడిగినంతనే బంగారు మొహిరీల విసరి పాఱవేయగల సంపన్న యాత్రికులు బిచ్చగాండ్రకయి కట్టింపబడియున్న పాంథశాలలలో నివసింతురా ? ఓరీ, మూర్ఖుడా, నీగాడిద బుద్ధిచే మానవాకృతి దూషింపబడినది. (మంత్రుల తట్టుతిరిగి) రావుజీ, యీ బాటసారులే యావేషధారి వైద్యులు.

శ్యామ : అట్లే తోచుచున్నది. ఆ దునీచందుశేటును పిలిపించెదము. ఆతడు రత్నవ్యాపారముచేయు గొప్ప షాహుకారు. ఆతని చేత ఈ హారమునకు కూడా మదింపు వేయింపవచ్చును.

రాణా : పిలిపింపుడు

శ్యామ : ఓరీ.

ద్వార : స్వామి

శ్యామ : నీవు శీఘ్రముగా పోయి దునీచంద్‌శేటును రాజాజ్ఞగా పిలిచికొనిరమ్ము. తలారియొద్ద తీసికొనిన మొహరీని గూడ తీసికొని రమ్మనుము.

ద్వార : చిత్తం (నిష్క్రమించును)

రాణా : మనవేగువారు చాలా ప్రమత్తులయినటుల కనబడుచున్నారు. లేకయున్న పరదేశీయులు మాఱువేసములతో సంచరించియు, అంతఃపురమున దూరియు తప్పించుకొని పోగలుగుదురా ?

శ్యామ : ఈతూరి ప్రమాదమే జరిగినది.

రాణా : తీవ్రముగ మందలింపుడు.

శ్యామ : చిత్తము.

(దునీచంద్ శేటు ప్రవేశించును)

దునీచంద్ శేటు : (తలారి మురళీదాసును చూచి రహస్యముగ ) ఏమిరా ఈసంగతి రాజుగారిదాకా తెచ్చావా ? ఉండు ! భడవా, నీసంగతి చెప్పిస్తాను.

మరళి : చూడండి దొరగారూ ఈ శేటుగారేమంటున్నారో.

దునీ : జయము, జయము ఏలినవారికి ! దొరగారి వుత్తరువైతే యీ మొహరీ వాడికిస్తానని చెప్తున్నానండి.

మురళి : (స్వగతము) ఆ - వూరికే యిస్తావా, వుంగరాల చేతిమొట్టు దగిలితే పెద్దమణిశిలాగా యిస్తావు.

శ్యామ : నీవుపోయి, నీనవకరిచూచుకొమ్ము, మేము విచారించి నీ సొత్తును నీకిప్పించెదము.

మురళి : దయసేయించండి సోమి, పిల్లాజల్లాగల్లవాణ్ణి. (దండముపెట్టి, నిష్క్రమించును.)

దునీ : (తిత్తికుచ్చె విప్పుచు) తమరు బంట్రోతును పంపేటప్పటికే నేను దండాధికారి దర్శనం చెయ్యడానికి సగం దూరం వచ్చానండి. నే నబద్ధమాడితే ఆ జవాన్నడగండి. (మొహరి శ్యామలరావు చేతికిచ్చి) ఇది దొంగ సొత్తేనని నాకు చాలా అనుమానం తట్టింది. అట్టాంటి సొత్తులను కొనవలెనంటె నాకు మహా చెడ్డభయమండి.

శ్యామ : (పరిశీలించి) ప్రభువుగారు దీనిని చిత్తగింపుడు ; ఇది మొగలాయి నాణెము.

రాణా : (పరికించి) అవును ! ఆ వేషధారులు కూడా మొగలాయి రాజ్యమునకు సంబంధించినవారె.

దునీ : (భయముతో) ఇంకే వేషధారులు మాదుకాణానికి దొంగసొత్తులు తేలేదండి. కర్పూరం వెలిగించి ఆర్పమన్నా ఆర్పుతాను.

శ్యామ : శేటుగారూ, దొరగారు మీ పెద్దమనిషితనమును అనుమానింపలేదు. ఈ వజ్రహారమునకు మదింపువేయుడు.

దునీ : (హారమును తీసికొని ఉత్తరీయపు చెఱగుతో దానిరుద్దుచు) నేను ధరవేస్తే త్రాసులో పెట్టితూచినట్లు సరిపోతుంది. (పరికించి ఆశ్చర్యముతో) ఈ

హారము నేనిదివఱకు చూచినదేనండి. కాశ్మీరదేశవర్తకుడు సంవత్సరము క్రిందట పదిలక్షల రూపాయలకు అగ్బరు చక్రవర్తిగారికి అమ్మినాడు.

రాణా : (చివుక్కునలేచి) ఏమంటివి ? అగ్బరుకా ?

దునీ : (తత్తరముతో స్వగతము) కొంపమునిగినట్లుంది. (ప్రకాశముగ) పరధ్యానంమీద యేమొ అన్నాను.

రాణా : (ఉద్రేకముతో శేటు భుజము పట్టుకొని) యథార్థము చెప్పుము ! సంవత్సరము క్రిందట అగ్బరు ఈ హారమును కొనియుండెనా ?

దునీ : ఇటువంటి దానివలె వుండినదేగాని, అయితే యిదౌనోకాదో నేను నిర్ణయించి చెప్పడానికి జ్ఞప్తిచాలదండి మహాప్రభో.

మాధ : నిజము చెప్పుము ; అందువలన నీకేమి యపాయములేదు.

దునీ : (అనుమానించుచు) ముప్పాతికా మూడువీసాలా మూడుపిరలు ఆ హారంమాదిరిగానే - వుండినట్లు తోస్తుందండి ప్రభో. -

రాణా : (శేటు భుజము వదలి) సత్యము బయటపడినది. అమాత్యులారా, యింకను మీకు ఘనిష్టములైన యాధారములు కావలయునా ? ఆ దుర్మార్గుడైన అగ్బరే మాఱువేసమున మాయంతఃపురము జొచ్చెననుట కింకను సందియము గలదా? కుంభరాణా బ్రతికి యుండగనే తన యంతఃపురమున నింతటి యన్యాయము జరుగునా ? (నలుప్రక్కల చూచి) ఆ దాసి యెచ్చటకు తారిపోయినది ? అంతఃపురములో నౌళవులేనిదే యితరు డింతటి సాహసకార్యమున కియ్యకొనునా? పూజ కను నెపమున కోరినప్పుడెల్ల మీరా కృష్ణమందిరమునకు పోవుచుండెను. యాత్రికుల వేషము ధరించి అగ్బరు అప్పుడప్పుడు ఆ మందిరమునకు వచ్చుచుండెకాబోలు ! ఆ కపటవతి యంతఃపురమున బంధింపబడుట యెఱింగి వైద్యవేషధారులయి వారు వచ్చియుందురు.

శ్యామ : నాబుద్ధి సంశయాందోళితమైనది. ఎట్లు నిర్ణయించుటకును వీలుకాకున్నది.

మాధ : రాణిగారిట్టినింద కతీతులు.

రాణా : (రేగుచున్న కోపము బిగబట్టుకొనుచు) ఏమీ ? రాణిగారు ఆకసము బొంద చేసికొని క్రిందికి నూడి పడిరా ? ఏల మీకింకను సందేహము? అదియేమిబుద్ధి? మీ ముందు మట్టిబొమ్మను చేసి పెట్టినగాని యథార్థము నూహింపలేరా ?

ఆ దాసి యెక్కడ ?

(భయముతో సుశీల ప్రవేశించును)

రాణా : ఓసీ, ఆ వైద్యులు వచ్చినప్పుడు నీ వంతఃపురమున నుంటివా?

సుశీ : (గొణుగుచు) వుణ్యానండి

రాణా : మీరా ఆ వైద్యులతోనేమైన మాటలాడినదా?

సుశీ : అమ్మగారు ముందటి మాదిరిగానే మాట్లాడుకుంటూ వుణ్యారు. వైద్దుగులను చూచి అమ్మగారు '''వచ్చితివా, నన్ను తీసుకొని పొమ్మ' ఎంతకాలమువేచి వుందును'' అని వేడుకొంటూ వుణ్ణింది.

రాణా : ఆఁ? (క్రోధమూర్తి యగును)

సుశీ : అమ్మగారితో గూడా రాత్రంతా మేల్కొనుండి అప్పుడే తెలియకుండా కన్ను మాల్చినాను.

రాణా : (కోపముతో) అమ్మగారు - అమ్మగారు- ఆ అమ్మగారిని నిన్ను ఒక త్రాటనే యురివేయించెదను. నీకంతలోనే వొడలు తెలియని నిద్రవచ్చెనా? దీని నిద్రమత్తు వదలునట్లు గుఱ్ఱపు కమిచీతో మేలు కొల్పుడు

సుశీ : (దుఃఖముతో) ఈ తప్పు మన్నించండి దొరగారు. బుద్ది గెడ్డిదిని నిద్రబొయ్యాను.

(బంట్రోతు నెట్టుకొని పోవును)

శ్యామ : మహాప్రభూ, యిట్టి సందర్భముల తొందరపాటు తగదు. ఆ తెలివి తక్కువ దాసి చెప్పిన తబ్బిబ్బు మాటల నాధారముగాచేసికొని మీ సందేహమును బలపఱచుకొనఁబోకుడు. అది నిద్రమత్తున నుండి పుర్వాపరముల నెఱుంగక అసంగతముగ కొన్ని మాటలు చెప్పెను.

రాణా : శ్యామలరావ్, మీ సదుద్దేశము ప్రశంసనీయము. కాని, సదుద్దేశములు అపరాధ కళంకమును తుడిచి వేయజాలవు. ఇక నేను బూటకపు సమాధానముల నమ్మను. ఇది వఱకు నా యనుమానము నిర్హేతుకమని తలంచి యుంటిని. సందేహ వశంవదుఁడనైన నా యభిప్రాయము నణఁగ ద్రొక్కి నిష్పక్షపాత బుద్ధితో అన్యునివలె విషయ పరిశీలనము గావించితిని ఇప్పుడంతయు స్పష్టమైనది.

శ్యామ : ప్రథమ విచారణయందు దోషులని తేలినవి కొన్ని పునర్విచారణ యందు

నిర్దోషములని నిరూపింప బడవచ్చును. మేఘాచ్ఛన్నమైన యాకాశము ఒక్క పెట్టున మేఘ నిర్ముక్త మగుట లేదా?

రాణా : మీ కవితా ప్రియత్వము మన్నింప దగినది.

శ్యామ : దేవరవారు నామనవిని తుదివఱకు చిత్తగింపుడు- అగ్బరు చక్రవర్తి మాఱు వేసమున మన యంతఃపురము జొచ్చినది నిశ్చయము. అది అంతఃపురమునకు కేవలము విరుద్ధము.

మాధ : నింద్యమును.

శ్యామ : నింద్యమె, కాని!

రాణా : (విసుగుతో) కాని, యేమి?

శ్యామ : కొంచెము ఓర్పు వహింపుడు

రాణా : నిరర్థక కాలయాపనము!

శ్యామ : అయినను ఇచ్చట కార్యోద్దేశము ముఖ్యముగ గమనింపదగిన విషయము. రాణిగారు సర్వభోగముల పరిత్యజించి, వైరాగ్యమూని నిరంతరము శ్రీ కృష్ణపదధ్యాన పరాయణయై కాలము గడపుచున్నది. ఆమె భక్తురాలను కీర్తి దేశమంతట వ్యాపించియున్నది. ఆమెను దర్శించుటకు వేనవేలుగ భక్తులు వచ్చుచుందురు.

రాణా : ఇంతకు మీ మాటలలో స్ఫురించున దేమనఁగా మీరా యొక లోకాతీతమైన భక్తురాలు, అగ్బరు లోకాతీతుఁడైన పరమభాగవతోత్తముడు, మోక్షార్థియై భక్తి భావనతో ఆతఁడు మీరాను సేవింపవచ్చెను. ఇంతియేనా?

శ్యామ : చిత్తము

రాణా : చక్కగానున్నది విషయ కల్పనము! విపరీత వ్యాఖ్యానమునకు కూడ నొక హద్దుండవలయును. ఆత్మ వంచనమునకు పరస్పర ప్రతారణమున కిచ్చట నవకాశములేదు. నా వివేకమును మీరనుమానించు చున్నట్లున్నది. నేను పసిపాపను గాను (ఉద్రేకముతో) నేను తిరస్కరింపబడితిని. వంచింపబడితిని. నా బలము, నా శౌర్యము, నాయభిమానము, నాగౌరవము తుదకు నాస్థితియె ధిక్కరింపబడినది, తృణీకరింపబడినది. పట్టపగలే నా యంతఃపురము గణికా మందిరమైనది. ఇక నేమి కావలయును ?

మంత్రులు : రామ!రామ! పాపము శాంతిల్లుగాక !

రాణా : (దుఃఖగద్గద స్వరముతో) నాయాశాలేశము కూడా భగ్నమైపోయినది. (మీరాబాయినుద్దేశించి) మీరా ఇక నీవు నా ప్రేమకు పాత్రమవుకావు. నా సంసార మసారమైనది. సుఖస్వప్నము అతర్కితముగ భిన్నమైనది. మీరా, నీవు చావవలయును ! చావవలయును!

శ్యామ : (తత్తరముతో) మహాప్రభూ, - ఏమి నిర్ణయించితిరి. ఘోరము ! ఘోరము! ఈ తొందర పాటునకు పశ్చాత్తప్తులు కాగలరు. వెనుక చింతించుటకంటె ముందుజాగ్రతమేలు. కోపోద్రిక్త మానసులయి సత్యము నెఱుంగ జాలకున్నారు.

రాణా : దుర్బల హృదయులై మీరు సత్యము నెదుర్కొన భయపడుచున్నారు. మీరా భక్తురా లను మీ దురభిప్రాయము సత్య సందర్శనమున కడ్డుపడుచున్నది. ఆ మాయలాడి రక్తపాతమున గాక యీ యపయశో మాలిన్యము సమ్మార్జితము కాదు.

మాధ : హరి ! హరి ! కొంచెము తడవిండు. నిజము నిలుకడమీద తేలగలదు.

రాణా : కాలము జరుగుకొలది దాంపత్యప్రేమ విడంబించి విధినిర్వర్తనమునందు అసమర్థుడను గావచ్చును.

శ్యామ : నా చిన్న మనవి యాలకింపుడు. ఈ విషయమును గుఱించి రాణిగారేమి సమాధానము చెప్పికొందురో తెలిసికొనవలయును.

మాధ : అవును. అపరాధిని విచారింపక యెంత యల్పదండనము విధించినను అది న్యాయ్యముగాదు.

రాణా : నాకు దెలిసి నేనెవ్వరికి నన్యాయమొనరింపను. ఇంతకు తెగించిన సాహసవతి తనతప్పుల నొప్పుకొనక పోవునా ? అయినను కనుగొందము. పిలిపింపుడు.

శ్యామ : రాణిగారు పట్టమహిషి !

రాణా : (కోపముతో) ఇంకను పట్టమహిషియా ?

శ్యామ : దేవరవారు పట్టభద్రులైయున్నంతవఱకును.

రాణా : (విసుగుతో) నా సంకల్పము నాటంక పెట్టుటకు మీరు పండితులు. నేనిప్పుడేమి చేయవలయు ?

శ్యామ : అంతఃపురమునకు పోయి రాణిగారిని విచారింపవలయును.

రాణా : (లేచి కొంతదూరము పోయి, వెనుకకు మరలి కోపముతో) ఆ పాపిస్టురాలి మొగము నేనింకజూడనొల్లను. (కూర్చుండును)

శ్యామ : అట్లయిన నెవరినైన నియోగింపుడు.

రాణా : నేనెవ్వరిని విశ్వసింపజాలను. నేనే పోయి విచారించెదను. ఇప్పుడు నేను భర్తను గాను. న్యాయాధిపతిని. (లేచును)

శ్యామ : మాకు సెలవిండు. మరల మాపై మీకు నమ్మకము గలిగినప్పుడు పిలిపింపుడు.

రాణా : (వినిపించుకొనక నిష్క్రమించును)

మాధ : రాజు తననే తాను నమ్మలేడు. ఇక నితరులను నమ్ముటెట్లు ?

శ్యామ : అయినను ఈ సమష్టినింద యసహ్యము. మన జీవిత మంతయు ప్రభువు శ్రేయోభివృద్ధులకు ధారవోసితిమి ! అందుకు ప్రతి బహుమానమేమి ?

మాధ : అవిశ్వసనీయుల మగుట !

శ్యామ : మరల రాజమందిరమునకు వచ్చుటకు పూర్వము మన కర్తవ్యమును నిశ్చయించుకొనవలయును. మొదటి నుండియు రాజు స్వభావము మన మెఱుంగుదుము. అనురాగముగాని విరాగముగాని అతిగాఢము ; భావోద్రేకము కలవాడు. వదలక పట్టుపట్టి తన యభిమతము నెగ్గించు కొనును.

మాధ : చాలవఱకు న్యాయబుద్ధియు గలదు.

శ్యామ : కలదు ; కాని, న్యాయబుద్ధియె తప్పుదారిపట్టి అందుకు దృఢ సంకల్పము తోడ్పడునెడల గుణము విషమించి యవగుణ మగును. ఒకవేళ ఆశ్రయనాశకమును గావచ్చును.

మాధ : మనచేత నైనంతవఱకు విప్పిచెప్పితిమి. మన విధి మనఃపూర్వకముగ నిర్వర్తించితిమి. రాజుగారి యకార్యమునందు మనము భాగస్వాములము కాము. ఇకమీది కర్తవ్యము మీరే నిశ్చయింపవలయును.

శ్యామ : భాగస్వాములము కాము గదాయని తృప్తిపడి యుండకూడదు. పవిత్రశీలయగు రాణిగారు రక్షింపబడవలయును.

మాధ : అవును. మా మంత్ర ప్రయోగమునకు అవకాశమేర్పడినది.

శ్యామ : సైన్యాధిపతి మన యభిప్రాయమునకు విరుద్ధుడయ్యెనేని అతని నెట్లయిన

మనప్రక్కకు త్రిప్పుకొనవలయును.

మాధ : అదిచాల ముఖ్యము.

శ్యామ : రాణీగారిని సంరక్షించుట కొఱకు రాణాగారిని తిరస్కరింపవలసి వచ్చినను అందుకు మనము సంసిద్ధులమై యుండవలయును.

మాధ : నేను మిమ్ము ననుసరించెదను. - కాని, కుమార సింహుడు ?

శ్యామ : ఆతడు రాజభక్తి యంత్రము. ధర్మమైనను అధర్మమైనను రాజాజ్ఞ నెరవేర్చును. మన నిర్ణయ మతనికి తెలియకూడదు.

మాధ : అట్లె.

(ఇరువురు నిష్క్రమింతురు)



## స్థలము 8 : రాజమందిరము

(రాజు ఖిన్నమానసుడై, సోఫాపై కూర్చుండి యుండును)

రాణా : ఇంతవఱకె యీ యపవాదము నగర మెల్లెడల మాఱుమ్రోగుచుండును. పనిపాటులేని సోమరిపోతులు రచ్చకొట్టములలో కూర్చుండి గోరంత కింవదంతిని కొండంత సత్యముగ నెంచి వితర్కించుచు, ఆనందించుచు ప్రొద్దు పుచ్చుకొను చుందురు కాబోలు ! ఇంకను ఆ కళంకవతిని బ్రతుక నిచ్చినందులకు రాజపుత్ర యువకులు నన్ను దూషించుచుందురు. నా బ్రతుకు నగుబాట్ల పాలైనది. ఎంత సాహసవతి ! తన దుష్కార్యమును గప్పిపుచ్చుటకు అసత్యమాడుచున్నది !

(మంత్రులు ప్రవేశింతురు)

రాణా : (చిత్తోద్వేగము నడచుకొని) అమాత్యులారా, మీరా ఒక దేవత యనియు, సత్యవ్రత యనియు, మీరు విశ్వసించి యుంటిరి. మీ విశ్వాసము మూఢభక్తియనియు అస్థానికమనియు ఆ దుశ్చరితయొక్క యసత్యవాదనమె నిరూపించుచున్నది. - వేయినోళ్ళ ఘోషించుచున్నది.

శ్యామ : రాణిగారేమిజెప్పిరి ?

రాణా : పూజ్యురాలైన మీరాణిగారు అంతఃపురమునకు నిన్న వైద్యులెవ్వరును వచ్చియుండలేదని సెలవిచ్చిరి.

మ్లాధ : అది యెట్లు ?

రాణా : ఎట్లో బుద్ధిమంతులు మీరే యోచింపుడు.

మాధ : (సంశయముగ) రాణిగారేల యబద్ధమాడవలయును ?

రాణా : ఏలనో కనుగొండు. ఇప్పటికైన తెలియవచ్చినదా మీ రాణిగారి పూజ్య ప్రవర్తనము?

శ్యామ : (ఆలోచించి) మహాప్రభూ, రాణిగారేమియు నసత్యమాడలేదు. వైద్యులు వచ్చిన సంగతియే యామె యెఱిగియుండదు.

రాణా : శ్యామలరావ్, మంచి పూతమాటలు ! మీరా ప్రాణరక్షణోద్యమము ప్రశంసనీయమైనను మాకుగల గౌరవమును బలియీయనెంచుట నింద్యము.

శ్యామ : పరాభిప్రాయమునించుక సహించుడు. నిజము తేలగలదు. భక్తిపరవశురాలైన

రాణిగారికి వైద్యులు వచ్చునప్పటికి నిహలోక జ్ఞానమంతరించి యుండినది.

మాధ : ఉండవచ్చును.

రాణా : (గంభీరముగ ) నా యధికారము నెల్లిదము సేయుటకు మీరు కృతనిశ్చయులైనట్లున్నది - కానిండు.

శ్యామ : తప్పదలచితిరి. మేము న్యాయైక పక్షపాతులము. నిరంతరమును దేవరవారి మేలుగోరు మంత్రులము. మా విధిని నిర్వర్తించుచున్నాము.

రాణా : ఏల యీ వ్యర్థప్రసంగము ? నా నమ్మకము అవిచార మూలకముగాదు. సత్యము నూహించితిని. నిజమెఱిగిన వెనుక నాకర్తవ్యమును అనుకూలముగ మఱచునంతటి భీరువునుగాను.- స్వార్థపరుడనూగాను. నా సంకల్పము నాయ్యము. నా న్యాయ్యసంకల్పము శాసనము. నా శాసనము పొల్లుపోవక కొనసాగి తీఱవలయును.

శ్యామ : మీ యాజ్ఞకేవలము ధర్మబాహ్యము. మా యంతరాత్మకు విరుద్ధమైన కార్యము మేము చేయజాలము. మమ్ము నుద్యోగ విముక్తులను గావింపుడు.

రాణా : (ఆశ్చర్యకోపములతో స్తంభితుడై చూచి) ఏమీ ? నాయాజ్ఞకు మారుపల్కుటయా? మీకు మతిభ్రమణము కలిగినదా ? లేక నేను కుంభరాణాయను సంగతి మఱచితిరా ? మిమ్ము పదభ్రష్టుల గావించుటయేగాదు వధ్యశిలయొద్దకు మరణదండనము మీవెనువెంట నంటివచ్చును. పొండు. మీ సర్వస్వము మా సైన్యాధిపతి జప్తిచేసి కోశాగారమున కర్పించును.

శ్యామ : సత్యమేవ జయతి. (నిష్క్రమించును)

మాధ : (అనుసరించును)

రాణా : (క్రోధముతో) పాదాన్వితములైన రాజద్రోహపిండములు నడచిపోవుచున్నవి. ద్రోహులు, తేనెపూసిన కత్తులు, - నట్టనడియేట పుట్టిముంచు పాతకులు, - వారికి చెడుకాలమునకు బుద్ధిపెడదారి పట్టినది కాబోలు ! ఏమి వారి అపూర్వప్రవర్తనము! ఓరీ.

భటు : స్వామి

రాణా : పరుగెత్తుము. పొమ్ము. మా సేనాధిపతిని పిలుచుకొనిరమ్ము.

భటు : అజ్ఞ. (నిష్క్రమించును)

రాణా : (ఉద్రిక్త చిత్తుడై అటునిటు తిరుగుచు) ఈ యమాత్యుల విపరీత ప్రవర్తనము నాకు బోధపడకున్నది. నన్ను ప్రతిఘటించుటకు తగిన ధైర్యము వారికెట్లువచ్చెను? ఆ ! యీ ధిక్కారము నేను సహింపజాలను.

(సేనాధిపతి ప్రవేశించును)

సేనాధిపతి : జయము, జయము !

రాణా : ధర్మసింహా, నీవు గుఱ్ఱపు రౌతుల వెంటబెట్టుకొనిపోయి అమాత్యుల భవనములను ముట్టడించి, వారి స్థిర చరాస్తులను జప్తిచేసి కోశాధిపతి యాధీనము చేయుము. వారిరువురకు మరణదండనము విధించితిని. ఆజ్ఞాపత్రముగొని దానిని నిర్వహింపుము.

సేనా : (ఆశ్చర్యముతో) మరణ దండనమా ! ఎందులకు ?

రాణా : (కోపముతో) ఏమీ ? యీ యాజ్ఞావిమర్శనమహామారి యందఱకు వ్యాపించి నట్లున్నది ! అది నా యుత్తరువు.

సేనా : అమాత్యు లంతటి యపరాధమేమిచేసిరి ?

రాణా : (కోపము నడచుకొనుచు) ఆ విచారము నీ కనవసరము. నా పనుపు చేయుము. పొమ్ము.

సేవా : నిరపరాధులను నేను హత్య చేయజాలను.

రాణా : ఇది హత్యకాదు. దండనము.

సేనా : నిర్హేతుకమైన దండనము బలాత్కార హత్య.

రాణా : (విసుగుతో) ఇంక వేఱేమి హేతువు కావలయును ? సతీత్వమర్యాదను అతిక్రమించిన మీరాకు మరణశిక్ష విధించితిని. అమాత్యులు నాయాజ్ఞను తిరస్కరించిరి.

సేనా : అపరాధమొనరించినది అగ్బరు, అతడు దండ్యుడు.

రాణా : (కోపముతో) నీవు నాకు ధర్మోపదేశము చేయునంతటి పండితుడవైతివా ? అమాత్యులయొద్ద శిక్షపొందితివా ?

సేనా : అపరాధులే దండ్యులగుట న్యాయమని మనవి చేసితిని.

రాణా : ఇరువురును దండ్యులే. ఆ అగ్బరును మాత్రము వదలితినను కొంటివా ? ఆ దురాత్ముని రక్తపూరము మాయంతఃపురమున చల్లించి అంటు వాపెదను. మీరాను శిక్షింపనిదే లోకము సంతృప్తిపడదు. ఈ యనవసర కాలయాపన మెందుకు ? నా యాజ్ఞను నిర్వహించెదవా ? లేదా ? ఒక్కమాట.

సేనా : సంగ్రామభూముల విరోధికంఠ నాళముల నిష్కరుణముగ చెండాడితిగాని, ఎన్నడును నిరపరాధులను హత్యగావించి యెఱుగను. మీరు నన్ను నిర్బంధించుచుదురేని ఇదిగో ! నాయధికార చిహ్నమును మీకు సమర్పించుచున్నాను. (కత్తిని రాజుపాదములకడ వైచి నిష్క్రమించును)

రాణా : (కోపస్తంభితుడై అట్టె కొంతవఱకు చూచి) ఆ! వీరందఱకు సంఘాతమరణము విధింపవలయును. అందఱు స్వామిద్రోహులు. ఈ విప్లవకారులు నా నీడయందె పన్నాగించుచున్న యీ కుట్రను నేను శంకింపలేకపోయితిని. అందఱు లంచగొండెలు. అగ్బరుచే లంచములను దీసికొని నాయుప్పులుసునకు ద్రోహము చేసిరి ! వీరిని ముక్కలుముక్కలుగ తఱిగించి గ్రద్దలకు వెదచల్లించినను నాకసి దీఱదు. ఎవడురా అక్కడ ? (పలుకరు) (అటునిటు నాలుగుతట్టుల తిరుగును) ఓరీ (పలుకరు) ఏమీ ? ద్వారపాలకుడును లేడా ? నా జీవితమునం దెప్పుడును ఇటువంటి యాజ్ఞాతృణీకరణము ననుభవించియుండలేదు. నా కన్నులయెదుటనే నా పాలనాదండము భగ్నమై పోయినదా ? ఈ ధిక్కార మసహ్యము ! ఉదయపూర్ రాజ్యాధిపతి ఒక్క క్షణములో నిస్సహాయుడయ్యెనా ? ఇది స్వప్నము కాదుకదా! (కలయంజూచి) అహో ! యిది నగ్న సత్యము ! కుమార సింహా, నీవును విశ్వాసఘాతుకుడవైతివా ?

(కుమారసింహుడు ప్రవేశించును)

కుమార-
సింహుడు : మహాప్రభూ, నేను విశ్వాస ఘాతుకుడను గాను, స్వామి యాజ్ఞకై వేచియున్నాను.

రాణా : (ఆతురతతో కౌగిలించికొని) కుమారా, నీవొక్కడవే నాకు స్నేహాస్పదుడవు. తక్కినవార లందఱు విప్లవకారులు. స్వామిద్రోహులు. అమాత్యులతోడ నందఱును వెడలిపోయిరా ? ఇది దీర్ఘాలోచితమైన కుట్రగానున్నది. వారి కంత పలుకుబడియుండుట యెప్పటికైన నపాయకరమె.

కుమా : రాణిగారిపై ఆబాలవృద్ధముగ నందఱికిని భక్తి విశ్వాసములు కలవు. ప్రజలును అట్టివారె. దివాణమున నుండిన ఎవ్వరైన మీ యాజ్ఞను నిర్వర్తింపవలసి వచ్చునేమోయని యందఱు వెడలిపోయిరి.

రాణా : నా ప్రజలు నన్ను త్యజించిరా ?

కుమా : రాణిగారిని విశ్వసించుచున్నారు.

రాణా : నా సైన్యములు ?

కుమా : రాణిగారి సతీత్వము ననుమానింపవు.

రాణా : (యోచనా మగ్నముగ) అమాత్యులు, ప్రజలు, సైన్యములు మీరా సతీత్వము సంశయింపరు ! నేనేమైన పొరపడితినా ?

కుమా : ఎట్టి వివేకవంతులైనను పొరపడుట కలదు.

రాణా : (యోచించుచు హఠాత్తుగ తలయెత్తిచూచి) కుమారా, నేను పొరపడలేదు. న్యాయమని నాకు తోచిన యెడల ప్రపంచమునకు ప్రతి స్పర్థిగ నైన నిలువగలను. లోకులు మూఢభక్తులు, గతాను గతికులు ; అమాత్యులు దుర్బల హృదయులు, సైనికులు వివేక శూన్యులు. ప్రత్యక్షసాక్ష్యము మీరా యపరాధమును నిరూపించుచున్నది. ఇపుడేమి కర్తవ్యము ? ఎవ్వరును లేరా ?

కుమా : రాజప్రాసాద మంతయు నంధకారకులాయముగా నున్నది.

రాణా : (కోపముతో) మీరా రక్తజ్వాలలతో మన ప్రాసాదము మరల నుద్దీప్తము కాగలదు. కుమారా, నీవు విశ్వాసపాత్రుడవని నేనెఱుంగుదును. నాయాజ్ఞను నిర్వహింపుము. నీవే నాకు కడపటి పట్టుగొమ్మవు. మీరాకు మరణదండన పత్రమును వ్రాసితెమ్ము.

కుమా : రాణిగారిని శిరచ్ఛేదన మొనరించుట కొక్క కటికవాడైన నొప్పుకొనడు.

రాణా : నీవో

కుమా : (వెఱగుపడి ఒకయడుగు వెనుకకు పెట్టుచు) నేనా ?

రాణా : అట్లయిన మీరాయె స్వప్రాణ హంతకి కావలయును. అటులనే వ్రాసితెమ్ము.

కుమా : (స్వగతము) రాజాజ్ఞ అనుల్లంఘనీయుము. (నిష్క్రమించును)

రాణా : (సంక్షుబ్ధ చిత్తుడై గద్గద స్వరముతో) మీరా, నీవు చావవలయునా ? నీకీ దుర్బుద్ధి పుట్టకయున్న నీవిట్టి చావుచావవుగదా ! భర్తయే భార్యకు మరణదండనము విధించుట ! హా ! ప్రళయంకరోద్యోగము. అసహ్యమైన మానసిక సంఘర్షణము! నేను రాక్షసుడను. (దుఃఖించును)

(ఇంతలో కుమార సింహుడు ఆజ్ఞాపత్రము వ్రాసికొని తెచ్చి, నిలుచుండి వేచియుండును)

రాణా : (కొంతసేపటికి తలయెత్తి, స్వప్నములోవలె) తెచ్చితివా ?

కుమా : (ఆజ్ఞాపత్రమును చేతికిచ్చును)

రాణా : (చేవ్రాలు చేయబోవునప్పుడు. చేయి వడకును. కొన్ని యక్షరములు వ్రాసినిలుపును. ఎట్లో చేవ్రాలు పూర్తిచేయును) ఈ పత్రికను మీరాహస్తమున బెట్టుము. ఎంత వేడికొన్నను నా దర్శన మిప్పింపకుము. ఆ కాంత ప్రాణపరిత్యాగము గావించుకొనువఱకు నీ వంగరక్షకుడవుగ నుండుము. పొమ్ము.

కుమా : (స్వగతము) అకటా ! నేనీ సతీతిలకముయొక్క యాత్మ హత్యకు సాక్షిగ నుండవలయునా ? ఘోరము ! ఘోరము ! (నిష్క్రమింపబోవును)

రాణా : ఏదీ, పత్రిక నిటుదెమ్ము. చక్కగ చేవ్రాలు చేసితినోలేదో చూతము.

కుమా : (ఇచ్చును)

రాణా : (పత్రికను చూచిచూచి యొక్క బాష్పకణము రాల్చి కుమారసింహుని చేతికిచ్చును)

కుమా : (నిష్క్రమించును)

రాణా : (దుఃఖ గద్గద స్వరముతో) మీరా, నీ యపరాధమునకు మరణమునకన్న నల్పదండనము వేఱొండులేదు. ఇంకొక్క నిమిషములో చిరపరిచితమైన నీ మోహన స్వరూపము, ఏడెనిమిది సంవత్సరములు నా జీవితమునకు అమృతంపువర్తియైన నీ ముఖేందుబింబము, మర్త్యలోకమునుండి సమ్మార్జితము కాగలదు. నా యాశలు నిరాశలైనవి. నా సంసారము నిస్సారమరు ప్రదేశమైనది. మీరా...చచ్చితివి.......చచ్చితివి..

(సోఫాలో నొరగబడును) (తెర జాఱును)

## స్థలము : 9 యమునానదికి బోవుమార్గము

(చీకటి. అప్పుడప్పుడు మెఱయుచుండును. అగ్బరు తాన్‌సేనులు యాత్రికుల వేషములతో ప్రవేశింతురు)

తాన్ : నేనెంత బ్రతిమాలుకొన్నను వినకున్నారు. మూడు దినములనుండియు మనము మాఱువేషములతో ఉదయపురమున నున్నాము. ఇచ్చట మనము నిస్సహాయులము. మన యునికి రాణా యెఱింగిన ప్రాణములతో మన శరీరములు ఢిల్లీకి పోవు. భారతసామ్రాజ్యము మీ పరిపాలనమున సుఖించుచున్నది. అట్టి మీ యమూల్య జీవితమును ప్రతినిమిషమునందును అపాయమున కగ్గముసేయుట భావ్యము కాదు. ఇప్పుడే కదలుదము రండు.

అగ్బ : తాన్‌సేన్, నే నధఃపతితుడను. ఉత్సాహముచే దీర్ఘాలోచనము సేయనేరక మీరాబాయిని అంతఃపురమున దర్శించితిమి. అంత బోక యానంద జడచిత్తుడనై వివేక శూన్యుడనై, ఆమెకు వజ్రహారమును సమర్పించితిని. అదియె యా పరమ పావన చరిత్ర మరణదండనమునకు హేతువయ్యెను. ఈ ఘోర పాతకమునుండి నేనెట్లు విముక్తుడను కాగలను. ఇందుకేమైన ప్రాయశ్చిత్తము కలదా ? నా సింహాసనమైనను లేక నా ప్రాణమైనను సమర్పించి యీ పాపమును బాపుకొన గలిగినయెడల నే నందుకు సంసిద్ధుడను.

తాన్ : అంతయు దైవికముగ జరిగినది. దైవేచ్ఛకు మానవుడు ప్రతికూల కల్పనము చేయజాలడు.

అగ్బ : అది దైవేచ్ఛయే యగునుగాక ! ఆ దైవము మనయెడల ప్రతికూలము. మాఱువేసములతో పరుల యంతఃపురము జొచ్చితినన్న యపవాదము నా జీవితమునకు కళంక మాపాదించుచున్నది.

తాన్ : మీరాబాయి పావన చరిత్రము లోకులెల్లరకు విదితము. సామాన్యములైన యంతఃపుర ధర్మములు మానావమానముల కతీతయైన యాపరమ భక్తురాలియెడల చెల్లవు. మీ సదుద్దేశమును ప్రజలు శంకింపరు.

అగ్బ : ఎట్టులో సమాధానపఱచుకొనుటకు మార్గములు కలవు. కాని, మన తొందరపాటునకు పర్యవసానమేమి ? మీరాబాయి హత్య ! ఇది

మరణాంతమువరకు పీడించు హృదయ శల్యము. ఈ రాత్రియె యామె మరణింపవలయునని వింటిమిగదా !

తాన్ : (ఆలకించి దారిలో పద శబ్దములు వినవచ్చుచున్నవి

అగ్బ : (ఆలకించును)

తాన్ : ఏదోయొక స్త్రీవ్యక్తి.

అగ్బ : అమ్మా, మీరెవ్వరు ?

మీరా : పథికురాలను.

అగ్బ : ఎచ్చటికేగుచున్నారు ?

మీరా : బృందావనమునకు.

అగ్బ : ఆదారి తప్పివచ్చితిరి. ఈ త్రోవ యమునానది యొద్దకు పోవును.

మీరా : ఇదియే దగ్గరిమార్గము.

అగ్బ : అడవిదారి ఒంటరిగా పోవుచున్నారు.

మీరా : తోడు లేనివారికి తోడ్పడు బంటు ముందు నడచుచున్నాడు.

అగ్బ : చిమ్మచీకటి

మీరా : ఇదియె యభిసరించుటకు దగిన సమయము.

అగ్బ : నిన్నంత శ్రమపాలుచేసిన యాకఠిన హృదయుడెవడు ?

మీరా : నా ప్రాణేశ్వరుడు.

అఖిల భూభువన పట్టాభిషిక్తుండయ్యు
పసుల మేపుట కిష్టపడియె నెవడు ?
బ్రహ్మాండ సంసార బంధముక్తుండయ్యు
తల్లిబంధములలో దవిలె నెవడు ?
గోపాంగనా ప్రేమ గోష్ఠీ రతుండయ్యు
నిర్మల జ్యోతియై నెగడె నెవడు ?
నిర్జీవ వేణు ప్రణీత గీతుండయ్యు
జాల నాత్మల రేపజాలెనెవడు ?

బర్హిపింఛంబు హొంబట్టు వలువతోడ
విశ్వమోహన మూర్తియై వెలిగె నెవడు ?
అట్టి శ్రీకృష్ణుడే నాకు నాత్మవిభుడు ;
అతని యన్వేషణమె జీవితాంత్య ఫలము!

అగ్బ : ఆ ! తల్లీ ఈ పాతకులను మన్నింపుము.

(ఇరువురు పాదములపై వ్రాలుదురు)

మీరా : అయ్యలారా, లెండు ! మీరెవ్వరు ?

అగ్బ : మీ నిర్హేతుక మరణదండనమునకు కారకులమైన రాక్షసులము.

కుమారసింహుడు : (స్వగతము) హా ! అగ్బరు పాదుషా ! రాణా కెఱింగించెదను. (పోబోయి) అయ్యో ! ఆజ్ఞలేదే ! అయినను ఈ వార్త రాణాకు ప్రియముగ నుండవచ్చును. తడయజనదు. (నిష్క్రమించును)

తాన్ : ఎవరో పరుగెత్తుచున్నటుల కాలిచప్పుడగుచున్నది !

మీరా : పాదుషా, నీవు నాకు పరమ బంధుడవు. నీమూలమున నాకు బంధవిముక్తి కలిగినది. నీవు నిమిత్త మాత్రమైన కీలుబొమ్మవు, సూత్రధారుడు సర్వేశ్వరుడు.

అగ్బ : తల్లీ, యీ మరణోద్యోగము నుండి విరమింపుము. నా వలన నీవు మరణింప వలసివచ్చెనన్న దుఃఖము సహింపజాలను.

మీరా : పాదుషా, అజ్ఞానలేశము నిన్నింకను ఆవరించియున్నది. పరలోకము భయంకరమను అపోహయు, ఇహలోకముపై గల అత్యంతమమతయు మరణ మాధుర్యమును విషవంతము చేయుచున్నది. జీవితము నిరంతర ప్రవాహము - ఆద్యంతములు లేనిది. ఒకచోటి చావు మఱియొక చోటి పుట్టుక. మరణము భౌతిక పరిణామము. అని వార్యము. అందుకు చింతయేల ?

అగ్బ : అమ్మా మరణ మనివార్యమైన యెడల దానిని జయించుటకు మార్గములేదా?

మీరా : కలదు. మరణమును చిఱునవ్వుతో నెదుర్కొనుటయె విజయోపాయము.... హృదయేశ్వరా ... యిదిగో ! వచ్చుచున్నాను. వాడు గో ! నా మనోవల్లభుడు, నన్ను పిలుచుచున్నాడు . (కదలును)

అగ్బ : (పాదములపై బడి) తల్లీ, మన్నింపుము. నిలువుము. నిలువుము !

మీరా : (తొలగి) పాదుషా, నన్నంటకుము. ( నిష్క్రమించును)

(నేపథ్యమున మీరాబాయి గీతము పాడుచు పోవుచుండును. ఆ గీతము క్రమక్రమముగ సన్నగిల్లును)

తాన్ : మన హృదయము లింకను పరిశుద్ధము కావలయును ?

అగ్బ : ఇదియే కడసారి పాట !

తాన్ : అశరీర గానము ఆకసమున దేలిపోవుచున్నట్లున్నది.

అగ్బ : ఆ గాన మస్ఫుటమై లయించినది. అకటా ! మీరాబాయినిక మర్త్యలోకమున జూడలేము.

*చిరవిరహతాప సంశీర్ణచిత్త, మీర*
*యభిసరించుచు నున్నది యాత్మనాథు -*

తాన్ : *ఎన్నడో దివ్యపాదోధి నెడసినట్టు*
*జలకణంబు సంగమ తృష్ణ జనెడురీతి.*

(తెరజాఱును)



## స్థలము : 10 రాజమందిరము

(రాణా చెదరిన వెంట్రుకలతో ఉద్రిక్తచిత్తుడై అటునిటు తిరుగుచుండును)

రాణా : మీరా యింతలోన విషముత్రావి యైనను ఉరివేసికొని యైనను లేక యమునలో దూకియైనను ప్రాణపరిత్యాగము గావించుకొని యుండును. ఓసీ, కాంతాపాత్రనిర్వహణముతో నన్ను మోసగించిన పిశాచీ! నీవు యమునలోనే దూకిచావుము. నీ యపయశోమాలిన్యము గుర్తింపరాక ఆ యమునా జలనీలిమములో మిళితమై పోగలదు. నీ చిఱునవ్వు మఱుగున విషదిగ్ధమగు కోఱల నెట్లు దాచుకొని యుంటివి ? - నేనెంత బుద్ధిహీనుడను! ఇంకను ఆ కులభ్రష్ట విషయమై చింతించుచున్నాను. దాని మనోహర ప్రతిమను నా హృదయమునుండి బలాత్కారముగ బెఱికివైచితిని. కాని, మచ్చమాత్రము మాసిపోదు.

ఒక్క దినములో వార్ధక్యము వచ్చినట్లు తోచుచున్నది ! నా జీవితపు పునాదియే నడలినట్లు కదలుచున్నది. నేను కుంభరాణాకన్న నన్యుండనను భ్రమపుట్టుచున్నది. నాస్మృతి పథమున జీవించియున్న కుంభరాణా, ఇప్పటి నన్ను నీ వెక్కిరింపకుము! ఆ ! గత స్మృతి ! ఇది మరణదండనమున కన్న హింసాకరము ! ఘోరము !

(కుమార సింహుడు ఎగు ఊపిరితో పరుగెత్తుకొనివచ్చును)

కుమార : అగ్బరిచ్చటనే యున్నాడు.

రాణా : ఎక్కడ ? అంతఃపురములోనా ?

కుమా : కాదు. యమునా మార్గమున రాణిగారిని నేననుసరించుచుంటిని.

రాణా : కానిమ్ము. ఒక్కమాటలో చెప్పుము ! ఎక్కడ ?

కుమా : అచ్చట నొకచోట నిద్దఱు మనుష్యులు ఆమెతో మాటలాడుచుండిరి, వారిలో నొకడు 'మీమరణ దండనమునకు కారణమైన రాక్షసుల'మని చెప్పుచుండెను. నేను పరుగెత్తుకొని వచ్చితిని. అతడే అగ్బరు కావలయు.

రాణా : (కోపముతో) ఆ దుశ్చరితుడే అగ్బరు కుమారసింహా, నీవేల యింత మందబుద్ధి వైతివి ? ఆ యంతఃపుర ద్రోహి ప్రక్కలో నొక్క కత్తిపోటు పొడిచి యా సంతోషవార్తను దెచ్చుటకుమాఱు ఊరకయేల బేలవై పరుగెత్తుకొని వచ్చితివి?

కుమా : (చేతులు పిసుకుకొనుచు) ఆజ్ఞకొఱకు.

రాణా : ఓరి, దుర్బల హృదయుడా, కాలు దవిలిన విషసర్పమును చావమొత్తుట కెవరియాజ్ఞ కావలయును ? పొమ్ము ! తెప్పపాటులో ఆస్థలముచేరుము. నీపిడిబాకుతో వాని హృదయమును చీల్చి ఆ రక్తపూరములో ఈ రుమాలు గుడ్డను తడిపి కొనిరమ్ము. (చేతిగుడ్డను విసరికుమారసింహుని తట్టుపారవేయును; కుమారసింహుడు వంగి అందుకొనును)

ఆ దురాత్ముడు మీరాను ఢిల్లీకి దీసికొనిపోవుటకు వేచియున్నాడు. అదియె వారు నిర్ణయించుకొన్న సంకేతస్థలము. ఇంకను నీవిచ్చటనే యున్నావా ? పరుగెత్తుము. ఎగిరిపొమ్ము. (కుమార సింహుడు నిష్క్రమించును) వంటయిలుసొచ్చిన కుందేటిని వదలివచ్చితివి.

ఓరీ ! పాదుషా, నీకు దగిన శిక్షను నీవు పొంద నున్నావు. ప్రాణములతోడ నీవు మరల ఢిల్లీకిబోవు. ఓమృత్యుదేవతా, ఈ నాటిరాత్రి నీకు చేతినిండ పనిదొరకినది. ప్రళయంక రోన్మత్తనృత్యము గావింపుము.

ఆ ! యిసీ! నేనెంత మందమతిని? ఎంతపొరపడితిని ? నాయంతిపురము నారడి వుచ్చి, నా యానంద భాండమును బగులదన్ని, మా పవిత్ర వంశయశమును అపవాద దూషితము గావించి, నన్నిట్లు పిచ్చిబికారిని జేసిన యానరాధముని ఈ కరవాలమున గ్రుమ్మి యాతని మరణ వేదన నా కనులార జూడకున్న నా హృదయ సంతాప మెట్లు తీఱును ? అగ్బర్, నీకు మృత్యువాసన్నము. (ఖడ్గహస్తుడై వేగముగ నిష్క్రమించును)

(యవనిక జాఱును)



## స్థలము : 11 యమునానదీ మార్గము.

(గాఢాంధకారము. రాణా ఖడ్గ హస్తుడై ప్రవేశించును)

రాణా : ఇదియేనా యమునకు బోవు మార్గము ? (నలుప్రక్కల కలయజూచి) అమావాస్యరాత్రి, కాఱుమబ్బులు నలుదెసలు నావరించియున్నవి. ఈ వృక్షశ్రేణుల క్రింద నాకు నేనే యగపడుట లేదు ! చినుకులు గూడ పుటపుట రాలుచున్నవి. అంతయు నాహృదయమువలె గాఢాంధకార మలీమసమై నిశ్శబ్ద సమాధిగ నగపడుచున్నది. (ఆలకించి) ఎవరిదాకాలిచప్పుడు ? (మరల నాలకించి) కాదు, కాదు, చెట్లయాకులు కదలుచున్నవి. (పరికించి) ఇచ్చట ఎవ్వరును లేరు. వారింతవఱకే వెడలిపోయి యుందురా ? (కొంత పరిక్రమించి) అచ్చట నేదియో యొక యాకృతి కనబడుచున్నది. (కాలిచప్పుడు కాకుండ దగ్గఱకు పోయి కత్తితో, పొడుచుట నభినయించి) ఓ ! తరుకాండము! అగ్బరని భ్రమించితిని ! (వెదకుచుండును)

(కుమార సింహుడు ఖడ్గహస్తుడై ప్రవేశించును)

కుమార సింహుడు : (స్వగతము) నేనెచ్చట వెదకినను వారిరువురు నగపడలేదు. ఈ చెట్ల నీడలో దాగుకొని యుందురు. (అటునిటు పరికించి) అదిగో! చీకటిలో నస్పష్టముగ నటునిటు తిరుగుచున్న వ్యక్తియే అగ్బరు పాదుషా. ఆతని యీ కత్తిచే నొక్కపోటు పొడిచి నా స్వామి ఋణమును తీర్చుకొందును. (మెల్లగాపోయి పొడిచి) అగ్బర్ పాదుషా, యిది యుదయపూర్ రాజ్యాధిపతి యాజ్ఞ. నీ దుండగమునకు దగిన మరణదండనము. నా స్వామి ఋణము దీర్చుకొంటిని.

రాణా : (తరుకాండమున కానుకొని బాధ నభినయించుచు) అయ్యో ! ప్రమాదము ! కుమారా, చచ్చితిని, చచ్చితిని.

కుమా : (దుఃఖోద్వేగముతో) హా! స్వామి ఘాతుకుడను. అయ్యో, తండ్రీ, నీవేల యింతలో నిచ్చటకు వచ్చితివి ? హతవిధీ, తలపట్టియీడ్చుకొని వచ్చితివా ? ఈ దుఃఖము దుర్భరము. మీ సేవకుడు మిమ్ము ననుసరించుచున్నాడు. (నడుము కట్టులోనున్న ఖడ్గము దూసి పొడుచుకొని) తండ్రీ, మన్నింపుము మన్నింపుము. విధి చేష్ట....వి.....ధి.....చే..........ష్ట......(మరణించును)

రాణా : (తరుకాండము క్రిందికి జాఱి) కుమారా, స్వామిభక్తునకనురూపమె నీ ప్రాణ పరిత్యాగము. ప్రయోజనమేమి ? నీవైన ఏల బ్రతుకవు? తలంపనిచోటనుండి కులిశాఘాతము ! ఎంత ఘటనా వైపరీత్యము.

ఓరీ, అగ్బర్, నీ కింకను మంచి దినములు గలవు ; నీవు బ్రతికితివి. నేనిప్పుడశక్తి మంతుడను. ఒక్క నిమిషములో మరణింపనున్నాను. కాని, నీకు మాత్రము దండనము తప్పదు. నా యవమానమును కులావమానముగదలంచిన యే రసపుత్ర వీరుడైనను నా మనో నిశ్చయమును నెరవేర్పగలడు. రక్తజ్వాలా భయంకరమైన నా యభిశాపము పిడుగువలె నీ తలపై ప్రేలగలదు.

(అగ్బరు తాన్‌సేనులు ప్రవేశింతురు)

అగ్బ : ఎవడో వేదనా భరితుడు నన్ను నిందించుచున్నాడు. (దగ్గఱి) అయ్యా, మీరెవ్వరు? అగ్బరునేల శపించుచున్నారు ?

రాణా : (వేదనా గద్గదస్వరముతో) ఆ పరమపాతకుని నామమును మీరేల యుచ్చరించెదరు? ఆ మొగలాయి కులకలంకుడు నన్నొరడిపుచ్చి నా యిల్లాలిని దొంగిలించుకొని ఢిల్లీకి పాఱిపోవుచున్నాడు.

తాన్ : ఇదియేమి భ్రాంతి ?

అగ్బ : మీకేల యింత దురవస్థకలిగినది ?

రాణా : విపరీత సంఘటనము

అగ్బ : అగ్బరును చంపింపనెంచి మీరే చంపబడితిరా ?

తాన్ : పాదుషాకు ప్రాణాంతక మైన గండము తప్పినది.

అగ్బ : కుంభరాణా.

రాణా : నా రాజ్యమున నన్ను పేరుపెట్టిపిలచు మానవుడెవ్వడు ?

అగ్బ : అగ్బరు మీ యంతఃపురము జొచ్చినది నిజము. తన జీవితమును పునీతముచేసికొనుటకై పరమ భక్తురాలైన మీరాబాయిని సందర్శించెను. ఆమె పాదరజః ప్రసాదము యాచించుట కొఱకు సాధారణ ధర్మములు లెక్కసేయక పాదుషా సాహసించెను.

రాణా : (భూమిపైనుండి సగము నిక్కి) ఏమీ ? అగ్బరు మీరాను మోహింపలేదా ?

అగ్బ : తల్లి స్తన్యపానము చేయుచున్న పసిబిడ్డకు మోహమంటగట్టు నీచు డెవ్వడుండును?

రాణా : నీవెవ్వడవు ? అగ్బరు సహాయులలో నొక్కడవా ?

అగ్బ : నేనే అగ్బరును.

రాణా : (క్రోధముతో) అగ్బర్ : (దూరముగ పడియుండిన కత్తికయిచేయి తడవును)

అగ్బ : (కత్తితీసికొని వచ్చి కుంభరాణా కందించుచు) నా మరణమువలన నీ హృదయము నీ మరణ కాలమున క్రోధరహితమయి, సుఖవంతమగు నేని నన్ను వధింపుము. ఇదిగో ! అనాచ్ఛాదితమైన నా వక్షస్థలము (మోకాలుపైన వంగును)

తాన్ : ఏమి యీ సాహసము ? (చేయిపట్టుకొని పైకి లాగును)

రాణా : (ఇతి కర్తవ్యతా మూఢుడయి, ఆశ్చర్య స్తంభితుడయి) పాదుషా, నీవు సత్యము పలుకుచున్నావా ? ఇంతదనుక నన్ను బాధించుచున్న సంశయము కేవలము స్వప్నమా ? మీ రిరువురును నిరపరాధులా ?

అగ్బ : రాణా, నీ యెడల నాకు జాలి కలుగుచున్నది. మీరాబాయి మా తల్లి. నేనామె పుత్రుడను. ఇంతకన్న నెక్కుడుగ నేనేమి చెప్పగలను ? నీకేల యింత భ్రాంతి కల్గెను ?

రాణా : పాదుషా, నా హృదయమున మెరముచుండిన శల్యమును పెరికి వైచితివి. నాకు నీవు ప్రబలద్వేషి వయ్యును ఇప్పుడు పరమాప్తుడవైతివి. సంశయగ్రస్తచిత్తుడనై బ్రతికియుండుటకన్న సత్యమెఱుంగుట కాస్పదమైన యీ మరణమె సుఖవంతము. అగ్బర్, నా మీరా ఏమైనది?

అగ్బ : ఆ పతివ్రతా శిరోమణి యమునాగర్భము నాశ్రయించినది.

రాణా : (గద్గద స్వరముతో) హా ! పరమ పాతకుడను. ఆ అమాయికను నిష్కారణముగ హింసించినందులకు దుఃఖించెదను. మందమతినై తప్పుజాడపట్టితిని. స్వయంకృతాపరాధమునకు తగిన చరమశిక్ష ననుభవించుచున్నాను. అబ్బా, భ్రమ కప్పుచున్నది. మీరా - మీరా - క్షమాపణము వేడికొనుటకై నీ యొద్దకే వచ్చుచున్నాను. పాపాత్ముడనని పెడమోము పెట్టకుము. నీ యెదుట నంజలి బద్ధుడనై నా యపరాధము నొప్పు కొందును. మీరా - మీరా - మన్నింపుము - కనికరింపుము - మీ - రా - మీ - రా - రా - రా (మరణించును)

అగ్బ : రాణా మరణమునకన్న నా బ్రతుకే శోచనీయము. ఆతడొక్కసారియే మరణించెను. నేను ప్రతిక్షణము మరణవేదన ననుభవించుచున్నాను.

తాన్ : మృత్యువు దైవముయొక్క అమోఘాస్త్రము.

అగ్బ : అజ్ఞాతముగ మన మీ ఘటనావర్తములోని కీడ్వబడితిమి.

పరమభక్తురాలి పదములు సేవింప
భక్తితోడ నిటకు వచ్చినాడ,
దైవఘటన మెట్లు తలపోతు ? మరలెద
రక్తసిక్తమౌ కరంబుతోడ.

(తెరజాఱును)

సంపూర్ణము.

29 - 10 - 1924



## నాటకపాత్రలు

| | |
|---|---|
| శాంత వర్మ | వసంతపురాధిపతి |
| మాధవవర్మ | శాంతవర్మగారి సాకుడుబిడ్డ |
| రాజశేఖరవర్మ | ॥ ॥ కుమారుఁడు |
| విజయవర్మ | హోమనగ రాధిపతి |
| సమరసేనుడు | సేనాధిపతి |
| అచ్యుతవర్మ | సుబేదారు |
| లతీఫ్‌సాహెబు | పాతాళగృహద్వారపాలకుఁడు |

పరిచారకులు, భటులు, ద్వారపాలకులు

## స్త్రీలు

| | |
|---|---|
| యశోధర | శాంతవర్మగారి భార్య |
| మనోరమ | ॥ కుమారిక |
| మాలతి | విజయవర్మగారి అన్నకూఁతురు |

# మాధవ విజయము

## స్థలము 1 : హేమనగరము.

(విజయ వర్మ విశ్రాంతిమందిరమున అటు నిటు తిరుగుచుండ(గా తెర యెత్తబడును)

విజయవర్మ : మధ్యాహ్నము కావచ్చినను వీరేల యింకను ప్రయాణ సన్నాహము కావింపకున్నారు? సేవకు(డు మొదలు సైన్యాధిపతి వఱకు అందఱును సోమరి పోతులు! ఎంతటి నేరమునైన మన్నింతునుగాని, సోమరితనమును మాత్రము మన్నింపజాలను.

(సమరసేనుడు ప్రవేశించును)

విజ : సమరసేనా, యేల యీ యాలస్యము ?

సమ : గంత గుఱ్ఱములకు సామాను లెక్కించుచున్నారు.. నెల దినముల ప్రయాణములకు వలయు పదార్థములు సిద్ధము చేయించితిని. ఇంకనొక యరగడియలో మనము బయలు దేరుదుము.

విజ : తమ యింట రెండు దినములు బసచేయవలయునని శాంతవర్మగారు మనకాహ్వానము పంపిరి.

సమ : మన ప్రయాణమున కభ్యంతరమగునుగదా!

విజ : (చిఱునవ్వుతో) ఆ యాహ్వానము తెప్పించుటకే యీప్రయాణము

సమ : (ఆశ్చర్యముతో) ఏమీ! ఉత్కళ దేశ ప్రయాణము నెపము మాత్రమేనా? (కొంచెము తలయూ(పుచు) పూర్వమువలె రహస్యము లెఱుగదగు నంతటి విశ్వాసపాత్రుడను కాకపోయితిని, పనిదీఱిన వెనుక పనిముట్టు త్రుప్పుపట్టుటలో నాశ్చర్యమేమి గలదు?

విజ : సమరసేనా, కొలది దినములనుండియు నిష్ఠురముగ మాటలాడుట నీ కలవాటుపడినట్లున్నది. నాలోపము నాధారము చేసికొని నా స్నేహితమును నీచముగ దుర్వినియోగపఱచుచున్నావు, నీ సాహాయ్యమునకు తగిన యుపకారము నొనర్చితిని. మాయన్నగారి పరిపాలనా సమయమున తక్కువ యుద్యోగమునందున్న నీకు క్రమక్రమముగ సైన్యాధిపత్యము నొసంగితిని. నీకింకను తృప్తికలుగదు. వివేచనారహితమైన నాయంగీకారమె నీయత్యాశకు సోపానమైనట్లున్నది.

సమ : ప్రభువు లేమి మాటాడినను న్యాయముగనే యుండును. ప్రయోగదక్షులు ఫలసిద్ధికొఱకు ఎంతటి కార్యములనైన నొనరింతురు. ఉదార హృదయులైన మీరు కనికరించి నాకు మహాదానమొనరించితిరని యనుకొందు.

విజ : నీ యుద్యోగము నీయోగ్యతకు తగిన బహుమతి యనుకొంటివా?

సమ : నా సాహాయ్యమునకు మించని పదవియనుకొంటిని.

విజ : (స్వగతము) నాగుట్టంతయు వీనిచేతిలోనున్నది. విరోధ మపాయకరము. (ప్రకాశముగ) సమరసేనా, నీవు చెప్పినది యథార్థమే. నీఋణము పూర్ణముగ నేను తీర్చుకొనజాలను. మనయిరువురిలో నొకరి కొకరికి తెలియరాని రహస్యములు లేవు.

సమ : (స్వగతము) విజయవర్మ నాప్రాముఖ్యము నిప్పుడు గుర్తెఱుగుచున్నాడు. (ప్రకాశముగ) శాంతవర్మగా రింట మీరేల బసచేయవలయును?

విజ : శాంతవర్మకు రమణీయవతియైన యొక కుమారిక కలదు. నేనా కాంతను పెండ్లియాడ దలంచుకొంటిని.

సమ : ఎంతకాలమునకు సంతోషవార్తవింటిని! అట్లయిన వసంతపురము వఱకెమన ప్రయాణము?

విజ : అవును!

సమ : ఇంత సిబ్బందియు ఇన్ని పదార్థములు అనావశ్యకము కదా?

విజ : మనము దూరప్రయాణము చేయువారివలె నగపడ వలయును. నీవు పోయి తొందరగ ప్రయాణ సన్నాహము కావింపుము. అచ్యుతవర్మ కూడ మనతోడ రావలయును.

సమ : అట్లె! (నిష్క్రమించును)

విజ : సమరసేనుడు తన ప్రయోజనమును తానెఱుంగును. ఈతడెన్నటికైన అపాయకరుడు. ఇప్పటికేనా యవివేకమునకు తగిన శిక్షనొందితిని. నేను రాజ్యము నేలిన ఆతడు నన్నేలుచుండును. ఈ కంటిలోని నలుసును తీసివేయునంతవఱకు నాకు సుఖ నిద్రయుండదు.

(సైనికుడు ప్రవేశించును)

సైనికుడు : మహాప్రభూ, సిబ్బంది పయనమగుచుండగా ఏదో యొక దుశ్శకునము

గలిగెను. తరువాత దేవరయాజ్ఞ.

విజ : ఓరీ, మూఢమతులకేది దుళ్శకునమో అదియే ధీమంతులకు శుభశకునము. నేను తలంచిన కార్యమునకు విఘ్నము వాటిల్లదు. ఇప్పుడే కదలవలయును. నాగుజ్జము నాయత్తపఱిపింపుము, పొమ్ము.

సైని : ఆజ్ఞ. (నిష్క్రమించును.)

విజ : తమ కార్యములెల్లను పూర్వనిర్ణీతములని భ్రమించు అవివేకులను జూచినప్పుడెల్ల నాకు జాలికలుగుచుండును. సంకల్పశూన్యుల కంతయు పూర్వనిర్ణీతమె. దౌర్బల్యమునకు మంచి యాశ్రయ మీ మెట్టవేదాంతము! ఏల యింకను ఆలస్యము?



# స్థలము 2 ః వసంతపురము

(రాజప్రాసాదమున నొక గది. శాంతవర్మ పట్టుమొత్తలు కుట్టిన సోఫాపై కూర్చుండియుండును. యశోధర దగ్గఱగా నొకపీఠముపై కూర్చుండియుండును. తెరయెత్త బడును)

శాంతవర్మ : మన పిన్ననాటి కాలము వలెకాదు. ఇప్పుడంతయు తలక్రిందుగ మాఱిపోవుచున్నది. మహాభారతమును వ్రాసిన వ్యాసమహర్షి ఏమంత తెలివి తక్కువవాడా? కలియుగ ధర్మమునంతయు ముందుగనె యోచించి వ్రాసిపెట్టెను. ఇప్పుడంతయును తూ చా తప్పకుండ జరుగుచున్నది. ఈ కాలమున పిన్నయెవడు? పెద్దయెవడు? లేకున్న తల్లిదండ్రుల మాటలు బిడ్డలు వినకపోవుదురా?

యశోధర : ఈ కొద్దిపాటి విషయమును మీరింత గొప్పచేసి చింతించుట యెందుకు? మనోరమ లేక లేక కలిగిన చిన్నారి కూతురు. నిండుగారాబమున సాకి సంతరించితిమి. కావుననే కన్యాత్వసహజమైన చనవుతో అంతవిడువక పట్టు పట్టియున్నది. ఆబిడ్డ కింకను పెండ్లియీడు మించలేదు.

శాంత : పదునేడేండ్లు నెత్తికివచ్చిన కన్యక యింకను ఒడిలోని పసిపాప యనుకొంటివా?

యశో : మనోరమ వినయవివేకములు లేని బాలిక కాదు.

శాంత : బాలిక!

యశో : నేను బ్రతిమాలినప్పుడెల్ల "అంత తొందరవేమి?" అని నన్ను వారించుచుండును.

శాంత : యుక్తవయస్కను అవివాహితనుగ నింట నుంచికొనుట యుచితముకాదు. ఆడువారి మర్మములు ఆడువారికే తెలియును. మనోరమ మనస్సు ఎవనియందైన లగ్నము కాలేదుగదా?

యశో : (చిఱునవ్వుతో) నేనుకూడ అట్లే సందేహించి యడిగితిని. సిగ్గుచేత తలవంచుకొని మాటాడదు.

శాంత : అట్లయిన ఏదోకొంత దాపఱికమున్నది. ఎంత తెలివిగల వారైనను కన్యలు కన్యలే గదా! మనము బాల్యచాపల్యమును గౌరవింపరాదు. సాధ్యమయి నంత వఱకు పూర్వాచార గౌరవమును నాచేతులార భగ్నముచేయను.

యశో : యోగ్యులయిన వరులు మీ దృష్టిలో నెవరైన నున్నారా?

శాంత : నేను చాలకాలమునుండి యోచించుచున్నాను.

"శ్రీయును కులమును రూపును

ప్రాయము శుభలక్షణంబు, బాంధవ విద్యా

శేయము గల వరునకు' "

కన్య నియ్యవలయునని మహాభారతములోవ్యాసభగవానులు నొక్కి చెప్పియున్నారు. బిడ్డలయెడ తల్లిదండ్రుల బాధ్యత అంత తేలికగాదు సుమా.

యశో : అయితే యింతవఱకు మీరు వరుని నిర్ణయింపలేదు?

శాంతి : ముప్పాతిక పాలు నిర్ణయించినట్లే. మరల ఆలోచించిరేపు చెప్పెదను. - నీవెవరినైన నిశ్చయించితివా?

యశో : నానిశ్చయముతో ఏమిప్రయోజనము? మీ యిష్టమేగదా నెరవేరవలయును. మనోరమ యిప్పటికిని పసిబిడ్డవలె పెరుగుచున్నది.

శాంత : ఆమాటనే నే ననవద్దని చెప్పినది.

యశో : నన్నుచూడనిదే యొక్క నిమిషమైన నుండలేదు. నాకును అట్టిమరులే యున్నది.

శాంత : అట్లయిన కూతురికి పెండ్లిచేయవా?

యశో : ఎవనినైన నొక జమీందారు కుమారుని ఇంట నుంచుకొని మనోరమ నియ్యవలయునని నా కోరిక. అందఱ మొక్కచోటనే యుందుము.

శాంత : (నవ్వుచు) ఔనౌను ! స్త్రీజన సహజమయినదే యీ కోరిక ! ఎవనినో యొక యనామకుని తెచ్చుకొని ఇంటనుంచుకొనవలయును. ఆతనికి కూతురి నియ్యవలయును ! అడుగడుగునకును పారతంత్ర్యమను భవించుచు, అదవ[్రా]వుడు త్రావుచు, దెప్పెనలను సహించుకొనుచు, లజ్జలేని కీలుబొమ్మవలె ఆతడు అంతఃపురమున కొలువుదీరి యుండవలయును ! మనకూతు రా దురదృష్టవంతునిపై అధికారము చేయు చుండుట చూచి మన మానందింపవలయును ! చక్కని యూహ !

యశో : ఏల మీరిట్లు గేలిసేయుచున్నారు ? ఆతడేల యనామకుడుగ నుండవలయును ? ఏల యదవ త్రాగుడు త్రాగవలయును ?

శాంత : ఇంకను వివరింపుమందువా ? మనకొక కుమారుడు కలడు. మనకన్న తక్కువ శ్రీమంతుడు కానిదె యే జమీందారుని కుమారుడైన మన యింట బ్రతుకుట కిష్టపడడు. ఆకుముల్లుపై బడినను ముల్లు ఆకుపైబడినను ఆకే చినుగును. యశోధరా, ఇల్లటమునీచము. నీవొక్క కూతురి సంగతినే తలపోయుచున్నావు.నేను అల్లుని విషయము గూడ ఆలోచించుచున్నాను. ఆతడెంతటి స్వాతంత్ర్య ప్రియుడయ్యును మన యిష్టానుసారమె ప్రవర్తింపవలయును.

(రాజశేఖరుడు ప్రవేశించును)

శాంత : రాజశేఖరా, సమయమునకే వచ్చితివి. కూర్చుండుము ?

రాజ : (తండ్రి ప్రక్కన కూర్చుండి) అవును ! సమయమునకే వచ్చితిని, నేడే సర్దారు పంజాబు గుఱ్ఱముల బిడారును వజ్రపురికి కదలించుచున్నాడు. ఈ సమయము తప్పిన నొకకుంటి గుఱ్ఱము కూడ మనకు దొఱకదు.

శాంత : గుఱ్ఱపు బిడారేమిటి ?

రాజ : పంజాబు సర్దారు కందుకకేళి యలవడిన బొమ్మలవంటి యవనాశ్వములను అమ్మకమునకై మన పట్టణమున నిల్పియున్నాడు.

శాంత : రాజశేఖరా, నీ కందుకకేళి పిచ్చి మితిమీరుచున్నది. నిరుడు కొన్నవికాక ఈ యేడును గుఱ్ఱములు కొనవలయునా ? ప్రతి సంవత్సరమును వానిపోషణమునకు తరిబీదునకు రెండులక్షల రూపాయలు ఖర్చు పెట్టుచున్నావు. ఒక్క పందెమైన గెలిచితివా ? మహాభారతమున -

రాజ : (విసుగుతో) మీ మహాభారత పురాణ శ్రవణమునకు తీఱికలేదు. నేను పది గుఱ్ఱములు కొనవలయును.

యశో : (కన్నురుముచు) ఆ !శేఖరా, నీవింకను మట్టు మర్యాదలు నేర్చుకొనవు.

శాంత : (కోపముతో) ఈ యవిధేయత నేనొక్క క్షణమైన నోర్చుకొనను (భార్యతట్టుతిరిగి) ఇది యంతయు నీ గారాబము - నీ చనవు - వీనికి తృణీకర భావము తుంటరితనము హెచ్చి పోవుచున్నది. మాధవునికిని వీనికిని ఎంతయో తారతమ్యము గలదు.

రాజ : అవునవును. మాధవుడు మీకడుపునబుట్టిన బిడ్డకదా !

శాంత : కాకపోయిన నేమి ? పరాయిబిడ్డయే యోగ్యుడుగ నగపడుచున్నాడు.

యశో : కుమారుని బాల్య చాపల్యమును మన్నింపుడు. ఇంకను ఆటప్రాయమే గదా. (రాజశేఖరునికి కనుసైగ చేయును)

రాజ : నాతొందరపాటు మన్నింపుడు.

శాంత : నీవు మహాభారతమును చదివి మట్టు మర్యాదలు నేర్చుకొనవలయును.

రాజ : (మంచిబిడ్డవలె) అటులనే చదివెదను.

శాంత : శేఖరా, మేమిరువురము మనోరమ వివాహ విషయము మాటాడుచుంటిమి. ఎవనినైన నొకని యిల్లటము తెచ్చి పెట్టవలయునని మీ తల్లికోరిక. నీయభిప్రాయమేమి ?

రాజ : (ఆశ్చర్యముతో) ఇల్లటమా ! నాకుసమ్మతముగాదు.

యశో : ఎందువలన ?

రాజ : ఒక యొరలో రెండు కత్తులు మెలగుటకు వీలులేదు.

శాంత : నిజము, నిజము.

రాజ : ఇప్పటికే మాధవునితో నాతల విసిగి బట్టకట్టుచున్నది. ఆతడొక మహారాజు కొమారునివలె లేనిపోని యాత్మగౌరవముతో విఱ్ఱవీగు చుండును. ఎవనినో యొక యజ్ఞాతజన్ముని మనము సాకి సంతరించి నంతనే యా దరిద్రుడు మనతో సాటియగునా ? మాధవుడు నన్నొక పూరిపుల్లకు కూడ సరకు చేయడు. కొఱవితో నెత్తి గోకి కొనునట్లు అతడొకడు చాలక మఱియొకనిని తెచ్చి పెట్టుకొనవలయునా?

శాంత : నీవు దురభిమానివి. మాధవుడు అవిధేయుడు గాడు. మన సంస్థానమున పెరిగిన బిడ్డ మన వలె నుండక మఱి యెట్టులుండును ?

రాజ : పుట్టుకలో తారతమ్యములేదా ? రాజసము మనకు సహజముగాని యేబిచ్చకత్తె బిడ్డకో అది యెట్లు తగియుండును ?

శాంత : ఆతడు బిచ్చకత్తె బిడ్డయేయైయుండిన యెడల అంతటి రూపలావణ్యము, అంతటి గౌరవప్రీతి యలవడియుండదు. ఆతని జన్మరహస్యము ఎపుడైన నొకప్పుడు వెల్లడి కాకమానదు. అప్పుడు మనము పశ్చాత్తప్తులము కావలసిన యవసరము నుండదు.

రాజ : నాకన్న నాతడంత రూపవంతుడా ? గొప్పతనమంత కాఱి పోవుచున్నదా?

ఎత్తిపెంచిన మరులు మిమ్మట్లు పలికించుచున్నది. సమయము వచ్చినపుడు మాధవుడు తనయంతరమును దా నెఱుంగును గాక !

శాంత : శేఖరా, నిష్కారణముగ మాధవుని అవమానించిన నిన్ను మన్నింపను.

రాజ : (చివుక్కునలేచి) నేను సర్దారుతో మాటాడవలయును. (నిష్క్రమించును.)

యశో : మాధవునిపై రాజశేఖరునకు అసూయ నానాటికి హెచ్చుచున్నది. వారిరువురికమీద పొందిపొసగి యుండుట దుర్లభము.

శాంత : నా కిరువురును సమానులే ! మాధవుని గౌరవ ప్రీతి మన వానికి గిట్టదు. అసూయ నింద్యమని మహాభారతములో చెప్పబడియున్నది.

(మాధవవర్మ ప్రవేశించును)

శాంత : మాధవా, యేమి ?

మాధవవర్మ : విజయవర్మగారి విడిదికై మోతీమహలును సిద్ధపఱ పించితిని. వారు మన పట్టణము దాపునకు వచ్చిరని పొలిమేరకాపు చెప్పిపంపెను.

శాంత : మఱచియుంటిని. ఎదురేగుటకు కొంత సిబ్బందితో రాజశేఖరుని పంపెదము. గుఱ్ఱపు రౌతులను ఆయత్తపఱచుము.

మాధ : అట్లే. (నిష్క్రమించును)

శాంత : మాధవుని చూచినప్పుడెల్ల నాకు వాత్సల్యముతోడ గౌరవమును కలుగుచుండును. ఆతని మొగముపై నేదో గంభీరమైన చింత పొడకట్టుచుండును. నీ వెప్పుడైన గమనించితివా ?

యశో : అవునవును ! మాధవుని చిఱునవ్వు నే నెప్పుడును చూచియెఱుగను.

శాంత : అది నాకు గూడ చిత్రముగ తోచినది.

యశో : మనమెంత ప్రేమతో నాదరించినను సొంతతల్లిదండ్రులు లేని లోపమును పూర్తిచేయజాలము.

శాంత : మాధవునికి గూడ పెండ్లియీడు వచ్చినది. అతడు స్వతంత్రముగను గౌరవోచితముగను బ్రతుకుటకు మనబాధ్యత నెట్లు నెరవేర్పవలయునో నాకు తోపకున్నది.

యశో : ప్రస్తుతము విజయవర్మగారి యాతిథ్యమునకు వలయు ఏర్పాటులు చేయించుడు.

శాంత : చక్కగ జ్ఞప్తిచేసితివి (లేచి) మతిమఱపు వార్ధక్యమునకు అనివార్యముగ నున్నది. (నిష్క్రమించును)

యశో : మనోరమను మాధవుని చూచినపుడెల్ల నాకు పట్టరానిదుఃఖము కలుగుచుండును. ఇరువురికి చక్కని యీడు జోడు. వారిచేష్టలు చూపులు అనురాగ గర్భితములుగ కనుపట్టుచుండును. అయ్యో ! సఫలముగాని కోరికలె మిక్కిలి యనురూపముగ నుండును !

(మనోరమ ప్రవేశించును)

మనోరమ : (అమ్మను కౌగిలించుకొని) అమ్మా, ఒంటరిగా కూర్చొని యేమి చేయుచున్నావు? ఇప్పుడు మనయింటికి అతిథులెవరో వత్తురటకదా!

యశో : నిజమేనమ్మ.

మనో : ఆ జమీన్‌దారుని గురించేనా నాయన సమయము దొరికనప్పుడెల్ల చాల గొప్పగా పొగడుచుండినది ?

యశో : అవును ! మీ నాయనగారు అల్లుని సంపాదించు కొనుచున్నారేమొ !

మనో : (ఆశ్చర్యముతో) ఏమీ ! అమ్మా, నీవుకూడ నన్ను ఎగతాళి పట్టించుచున్నావు?

యశో : కాదు కాదు ; మీ నాయన యుత్సాహముచూచి నేనట్లూహించితిని; ఒక వేళ విజయవర్మయె తగిన వరుడని మీ నాయన నిర్ణయించిన నీవేమి తలంతువు?

మనో : నేనా వరునికి అర్హము కాని వధువును.

యశో : ఆ వరుడే నిన్ను వరించునెడల ?

మనో : వివాహము మానుకొందును ?

యశో : తల్లిదండ్రుల నవమానించి నట్లౌనుగదా ?

మనో : బ్రతికియున్న వారికిగదా యావిచారము !

యశో : (మనోరమను ప్రక్కకు జేరదీసికొని) మనోరమా, నీ రహస్యము చెప్పుకొనుటకు నాకన్న నమ్మకము గలవారలెవరుందురు ? తల్లికి కూడ తెలియరానంత దాపతీక మేమున్నది ? నా యెదుట నీకేమి సిగ్గు?

మనో : అమ్మా, నేను దురదృష్టవతిని, (తల్లియొడిలో వ్రాలి దుఃఖించును.

అంటరాని పాపాత్మక యంచు దలచి
యముడె ద్వేషించి నన్ విడనాడె నేని
ఏకభుక్తంబు వెలిచీర హితవు గాగ
బ్రహ్మచర్యంబు వహియించి బ్రతుకుదాన.

యశో : చిట్టితల్లీ, ఏల యిట్లు లోలోన కుములుచున్నావు ? ఇంత నిరాశ యెందుకు?

కలుగునొ యాడుబిడ్డయని కానక కానక నిన్నుగంటి, కాం
త లెపుడు సల్పియుండని వ్రతంబుల నోముల నాచరించి ;నీ
లలితపుకాలు సేతులు నిలాతల మంటిన కందునంచు పు
వ్వులు పఱపించితిన్ గునిసి పోకల నీవటు దోగియాడగన్.

ఉయ్యేలను సైతము నమ్మలేక నిన్ను నా యొడియందె యుంచుకొని సాకితిని. అట్టినీవు నాయెదుట "అమ్మా నేను దురదృష్టవతిని" " అని పల్కిన మాట నా హృదయమును చీల్చివైచినది. నా కడుపులో మంట పెట్టినది. నేనును ఆడుపుట్టువు పుట్టినదాననె. నీ వనుభవించుచున్న దుఃఖమును ఒకప్పుడు నేనును అనుభవించితిని ; నీ కోరికను తండ్రి గౌరవింపకుండిన నుండునుగాక ? తల్లియేల యాదరింపకపోవును ?

మనో : (కొంచెము లజ్జతో) అమ్మా మాధవుని సహవాసము లేని దిన మొక్కయుగముగ దోచుచుండును. ఆయనతోడ పాచికలాడుచున్న తరుణమున కాలము నిర్దయముగ నెగిరిపోవుచుండును. అమ్మా, యీ సంగతి తండ్రికెఱిగింప వలదు. నా యపరాధమునకు మాధవుడు శిక్ష ననుభవింపవలసి వచ్చును.

(రాజశేఖరుడు ప్రవేశించును)

రాజశేఖరుడు : విజయవర్మగారు వచ్చిరి. మీ రిక అంతఃపురము లోనికి పొండు.

(అందఱు నిష్క్రమింతురు)



## స్థలము 3 : విడిది గృహము

(విజయవర్మ సోఫాలో ఆనుకొనియుండును. ప్రక్కన చిన్న మేజాపైని పళ్ళెరములో పన్నీరు చెంబు, గంధపుగిన్నె, వెలిగించిన సాంబ్రాణి వత్తులు, పండ్లు పెట్టబడియుండును. పరిచారకుడు సురటి వేయుచుండును. తెర యెత్తబడును)

విజయవర్మ : (స్వగతము) అన్నియు నాయభీష్టమునకు అనుకూలముగనె జరుగుచున్నట్లున్నవి !

(శాంతవర్మ ప్రవేశించును)

విజ : (లేచి) విచ్చేయుడు !

శాంతవర్మ : (కూర్చుండి) చాలదినములకు పునర్దర్శనము ! మీకు కుశలమేగదా ?

విజ : (కూర్చుండి) మీబోటి పెద్దల యాశీర్వాదమువలన మాకందఱకు కుశలమె. ఆదరణ పురస్సరమైన మీ యాతిథ్యమును గుఱించి మీ యెదుట చెప్పుట ముఖస్తుతిగ ఉండవచ్చును. నన్ను మీ బంధు వర్గములో నొక్కనిగ తలంచి గౌరవించితిరి.

శాంత : మీరు మా యాతిథ్యమును స్వీకరించుట కంగీకరించుటయే మా భాగ్యము.

విజ : నేనంత వినయమునకు పాత్రుడనుగాను.

శాంత : మార్గాయాసము శ్రమించునట్లు కొంత విశ్రమింపుడు. క్రొత్తస్థలమని మీ సౌఖ్యమునకు భంగము కలిగించుకొనబోకుడు.

విజ : మీ సౌజన్యము వలన నాకిది పరస్థలముగ తోచుట లేదు.

శాంత : (స్వగతము) చక్కని వినయవంతుడు !

విజ : మీపై నాకు తండ్రిపై నున్నంత గౌరవ ప్రీతులుగలవు. పాదుషాపట్టాభిషేక సమయమున మిమ్ము చూచినప్పటి నుండియు మీ మైత్రి సంపాదించుకొని రాజకీయ విషయములలో మీ సలహా పొందవలయునని నాకెక్కుడు కోరిక గలదు.

శాంత : (సంతోషముతో) రాజకీయ విషయములలో నేనంత పండితుడను గాను ; అయినను వయోవృద్ధుడను - మహాభారతము నా కభిమాన గ్రంథము. అందలి ధర్మములను నీతులను అవగతము చేసికొంటిని. పెద్దవారు చెప్పిన

మాటలు వినక కుట్రపన్నిన దుర్యోధనాదులు హతులైరి. అన్నను సేవించుచు అతని యాజ్ఞను జవదాటని భీమార్జునాదులు జయము నొందిరి.

విజ : (స్వగతము) కడపటి వాక్యము మర్మస్పర్శిగనున్నది. ఈతడు సూక్ష్మాఘాతము లొనరించునంతటి కుశాగ్రబుద్ధికాడు. ఏదో తన గొడవ చెప్పుకొనుచున్నాడు.

శాంత : ఏమి యాలోచించుచున్నారు ?

విజ : మహాభారతములోని సారమంతయు రెండు వాక్యములలో సంక్షిప్తముగ చెప్పినందుకు నాకాశ్చర్యము కలిగినది.

శాంత : ఏదో నా యల్పబుద్ధికి తోచినంత మాత్రము గ్రహించితిని. నేనెప్పుడును నా బిడ్డల యవిధేయతను మన్నింపను.

విజ : మీరు మాటాడు కొలది మీ గొప్ప గుణములు బయలు పడుచున్నవి. నా కొక మేనమామ యుండెను. ఆయనయెడ నేను చాల భక్తి విశ్వాసములతో ప్రవర్తించుచుంటిని. సంవత్సరము క్రిందట పరిణత వయస్కుడై ఆ పూజ్యుడు మరణించెను. నా యదృష్టవశమున అట్టి వారె మీరు పరిచితులైతిరి. మిమ్ములను 'మామా' యని సంబోధించి మామ పోయిన లోపమును తీర్చుకొందును.

శాంత : మీ బంధుప్రీతి కొనియాడదగినది (స్వగతము) నామనస్సు కూడ ఈతని వంకకే పరుగెత్తుచున్నది. మనోరమకు ఈతని నే దైవము నిర్దేశించెనేమొ ! (ప్రకాశముగ) రఘుపతి వర్మగారిని నే నెఱుంగుదును. వారికి మీ రేమికావలయును ?

విజ : ఆయన నా సవతి తల్లి కుమారుడు, పెద్దవాడు ; వేటలో పులివాతబడి మరణించెను.

శాంత : అవునవును ! ఆయన యకాలమరణమును విని మేమును దుఃఖించితిమి. రఘుపతి వర్మ గారి కొక కుమారుడుండెనని విని యుంటిని.

విజ : దురదృష్టవశమున ఆ బిడ్డయు విషజ్వర పీడితుడై పసిప్రాయమున మరణించెను. ఒక్క కుమారిక మాత్రము కలదు.

శాంత : అయ్యో ! అటులనా ? ఈ ప్రస్తావము మీకు దుఃఖము పురికొల్పి నట్లున్నది!

విజ : పదునెనిమిది సంవత్సరములు గడచినను స్మృతియింకను క్రొత్తదిగ నేయున్నది.

శాంత : మీరు వివాహ ప్రయత్నము లేమియు చేసియుండలేదా?

విజ : ఎన్ని ప్రయత్నములు చేసినను దైవానుకూల్యము లేనిదే ఫలింపవు.

శాంత : (స్వగతము) దైవభక్తి సంపన్నుడు. (ప్రకాశముగ) మామలేని లోపమును నా వలన తీర్చుకొనతలంచితిరి. నేనాలోపమును యంథార్థముగ పూరింపసమకట్టితిని.

విజ : మీ మాటలు నాకర్థమగుట లేదు !

శాంత : నా కొక కుమారిక కలదు.

విజ : (ఆశ్చర్యము) అటులనా ? నేను వినియుండలేదు. నాభాగ్యము ఫలించినది.

శాంత : మీ వంటి యల్లుడు మాకు దొరకుట పూర్వపుణ్యము ! మీ యంగీకారమును అంతఃపురమున తెలిపివచ్చెదను.

విజ : అంత తొందర పడకుడు. ఈ సంబంధము మీకు నచ్చినట్లు తక్కినవారికి నచ్చవలయును గదా ?

శాంత : వారెవ్వరును నా కవిధేయులుగ నుండజాలరు. ఎవడురా అక్కడ ?

ద్వారపాలకుడు : స్వామి !

శాంత : మాధవుని యిచ్చటికి రమ్మనుము.

ద్వార : చిత్తం. (నిష్క్రమించును)

శాంత : మాధవునితో మీరు ప్రొద్దుపుచ్చుకొనవచ్చును. అతడు వివేకి, మట్టుమర్యాద లెఱిగిన గుణవంతుడు.

(మాధవ వర్మ ప్రవేశించును)

విజ : కూర్చుండుడు.

మాధవవర్మ : (నిలచియుండును)

విజ : అయ్యా, యీయన మీ పుత్రుడా ?

మాధ : (చింతతో మొగము వ్రేలాడవేసుకొనును) (స్వగతము) ఈ నిష్కపటహృదయుడు నా యనాథచరిత్రమంతయు చెప్పివేయునేమో.

శాంత : కాదు, కుమారుని వలె పెంచుకొంటిమి.

విజ : (స్వగతము) మాలతి పోలికలు ఈతని మొగమునందు పొడకట్టుచున్నవి. (ప్రకాశముగ) ఏమీ ! మీ యౌరసుడు కాడా ?

మాధ : మరల ఇప్పుడే వచ్చెదను. (నిష్క్రమించును.)

శాంత : ఇప్పటికి షుమారు పదునెనిమిది సంవత్సరములకు పూర్వము ఒకనాటి రాత్రి ఎవరో మా హజారపు సోపానములపై వానిని పడవేసిపోయిరి. ప్రొద్దుననే పరిచారిక యొకటి మా కీసంగతి యెఱిగించెను. మేము పోయి చూచితిమి. ఆ బిడ్డ మృతినొందినవానివలె నగపడెను. అంతట వైద్యుని రప్పించి పరీక్షింపచేసితిమి. శిశువునకు మూర్ఛరోగమనియు కొంతసేపటికి స్మృతి కలుగ వచ్చుననియు ఆతడు చెప్పెను.

విజ : వింతగానున్నది !

శాంత : మధ్యాహ్న మగునప్పటికి ఆ బిడ్డయేడువసాగెను. మా కప్పటికి సంతానములేనందున దైవదత్తమని ఆ పసిబిడ్డను పెంచుకొంటిమి.

విజ : అప్పటి కాబిడ్డకు ఎంత వయస్సుండినది ?

శాంత : బహుశా మూడు సంవత్సరములుండవచ్చును.

విజ : ఆ పరిచారిక యిపుడున్నదా ?

శాంత : రెండుసంవత్సరములకు పూర్వము మరణించినది.

విజ : ఓహో !

శాంత : మాధవుడెచ్చటికి పోయెను ? మీరు కొంచెము విశ్రమింపుడు. (నిష్క్రమించును)

విజ : (ఆలోచనామగ్నుడయి తిరుగుచు) పదునెనిమిది - సంవత్సరములకు పూర్వము ! అప్పటికి రెండుమూడు సంవత్సరముల బాలుడు ! స్మృతి తప్పి మృతునివలె పడియుండెను ! ఇంతవఱకు కొంచెమించుమించు సరిపోవుచున్నది ! మాలతి మొగము పోలికలు గలవాడు మఱియెవ్వడుగ నుండును ? ఓ ! వంచింపబడితిని. ఆ వైద్యుడు నన్ను మోసగించి విషమునకు మాఱు మరణమువంటి మైకము కప్పించునేదియో మత్తుపదార్థమునిచ్చి యుండును. అవునవును ! బాలుని శవమును దహనము చేయవలయునని నేనంటిని. శిశువు గావున భూమిలో నిక్షేపించుటయుక్తమని ఆ వైద్యుడు చెప్పెను. ఆనాటి రాత్రియే నిక్షేపింపబడెను. ఆతడే రహస్యముగ ఆ శిశువును తెచ్చి సంతానరహితులైన వీరి హజారపు ముంగిట ఏల యుంచి పోయియుండరాదు ? తరువాత రెండుమూడు దినములకే యాతడు కాశీయాత్రకనిచెప్పి యూరువెడలెను. ఇంతవఱకు పోబడియేలేదు. అన్నియు

సరిపోవుచున్నవి. ఇది యథార్థమైయుండునా ? లేక నాభావనయా ? వానికి కుడితొడపై పెద్దపుట్టుమచ్చ యుండవలయను ; ఆ యానవాలె సత్యమును నిర్ణయింపగలదు.

(మాధవ వర్మయు సమరసేనుడును ప్రవేశింతురు)

విజ : విచ్చేయుడు.

సమరసేనుడు : మాధవవర్మగారు మనలను చాల స్నేహముతో విచారించుచున్నారు. మన పరివారమున కంతయు సంతృప్తికరముగా నేర్పాటులు గావించిరి.

విజ : మాధవవర్మగారికి మనము కృతజ్ఞులము.

మాధవవర్మ : ఇందు నా యోగ్యతయేమియు లేదు. అంతయు శాంతవర్మగారి యుత్తరువు.

విజ : మిమ్ములను గాంచినప్పటినుండియు మీయెడల నాకు బంధుప్రీతి పొడముచున్నది. శాంతవర్మగారు మిమ్ము సొంత కుమారునివలె ఆదరింతురని తలంచెదను.

మాధ : అవును. తండ్రివలె నన్ను ఆదరింతురు. (స్వగతము) ఈతని గాంచినంతనె నిర్ణిమిత్తముగ నాకు వికర్షణము కలుగుచున్నది. ఇతడు మా కుటుంబ రహస్యములను నెమ్మదిగ జాఱదీయుటకు యత్నించుచున్నాడు.

విజ : రాజశేఖరవర్మగారు కూడ మిమ్ము సోదర ప్రీతితో చూచుచుందురు గదా ?

మాధ : అవును.

విజ : (స్వగతము) నా యుద్దేశమును వీడు గ్రహించియుండును ; ప్రత్యుత్తరములు ప్రోత్సాహకరముగ లేవు. (ప్రకాశముగ) మీరేయేగ్రంథములు చదివితిరి ? మహాభారత ప్రియులైన శాంతవర్మగారు మీ కావురాణమును చెప్పించియుందురు.

మాధ : చెప్పించిరి. (స్వగతము) ఈతడు సూక్ష్మబుద్ధి. శాంతవర్మగారి లోపమును కనిపెట్టెను.

విజ : మీకు జ్యోతిషమును గుఱించి యేమైన తెలియునా ?

మాధ తెలియదు.

సమ : (స్వగతము) ఏల యీతని నిన్నిప్రశ్నలడుగుచున్నాడు ? దేనికో గుఱిపెట్టినట్లున్నది.

విజ : సాముద్రిక శాస్త్రమున పరిచయము గలదా ?

సమ : ఈ శాస్త్రములన్నియు మాధవవర్మగారికేల తెలియును ?

విజ : తెలిసియుండిన మేలె. శాంతవర్మగారీలాటి శాస్త్రములు చెప్పించియుందురని యూహించితిని. సామాన్యమైన పుట్టుమచ్చల శాస్త్రము గూడ మీకు తెలియదా?

మాధ : తెలియదు. మీకు తెలియునా ?

విజ : కొంతవఱకు తెలియును.

మాధ : నా కుడితొడపై అరచేఖ్ఖుయంత మచ్చగలదు. దానికి ఫలితమేమి ?

విజ : (ఉద్రిక్తచిత్తుడై) సత్యముగనా ? చెప్పుము !

మాధ : కలదు (స్వగతము) ఏలయిట్లు కలత చెందుచున్నాడు ?

విజ : మిత్రమా, నీ వదృష్టవంతుడవు.

మాధ : పరాశ్రయున కేమి యదృష్టము ?

సమ : (స్వగతము) ఈతనికి ప్రతికూలమైన రహస్యమేదియో బయటపడినది. అది అంతముఖ్యమైనదిగాకున్న ఇంతకలవర మెందుకు ?

విజ : నాకు ప్రయాణాయాస మింకను తీఱలేదు. కొంచెము విశ్రమించెదను .

మాధ : అట్లే. (స్వగతము) ఈతని చర్య దురూహ్యముగ నున్నది. పుట్టుమచ్చ యనినంతనె సంక్షుబ్ధమానసుడయ్యెను !

(నిష్క్రమించును)

విజ : (కోపముతో) ఇప్పుడన్ని సందియములు తీఱినవి, నాప్రయోగమింత వ్యర్థమైపోవునా ? నా మాయాజాలములో తగుల్కొనిన యొక ఈగ ఇట్లు తప్పించుకొని వెడలిపోవునా ? (తెప్పవాల్పక బయలవలోకించును)

సమ : మీ రేల యిట్లు కలత చెందితిరి ? ఇందుకు పుట్టుమచ్చయే కారణము కాదుగదా ?

విజ : (ఆ మాటలు వినని యట్లు) బిడ్డయు తండ్రి ననుసరించెనని నమ్మియుంటి . ఆ ! నే నుద్దేశింపని మూలనుండి హఠాత్తుగ పిట్టపిడుగు నెత్తిపై జాఱెను.

సమ : కడచిన విషయమును జ్ఞప్తికి తెచ్చుచున్నారు.

విజ : ఆ విషయము ఇంకను గడవలేదు. ప్రత్యక్షముగా నగపడుచున్నది. మనము

అవివేకులమైతిమి. వంచింప బడితిమి. నరేంద్రుడు బ్రతికియున్నాడు. వాడే ఈ మాధవవర్మ.

సమ : (ఆశ్చర్యముతో) అటులనా ! మన మొకటి తలంచిన దైవమొకటి తలచెను. ఇదెట్లు సంభవించెను ?

విజ : ఆ వైద్యుడే యిందుకు మూలమైయుండును. ఇంతమాత్రమునకే నేనేల యపజయము స్వీకరింపవలయును ? ఎట్టి యభ్యంతరములైనను నా యాశాప్రదీపము నార్పలేవు. నిరుత్సాహమెట్టిదో నేనెఱుంగను నాహృదయము పదను పెట్టిన యుక్కు. విఘ్నపరంపరలారా, మీతో పంతము వైచెదను. నా భావ్యభ్యున్నతికి మార్గము నరికట్టు మిమ్ము నా యూర్పుగాలిచే పటాపంచలు గావించెదను. భాగధేయమునకు విధేయత శిక్షించెదను.

సమ : ఇంకను మన చేయి దాటలేదు.

విజ : సమరసేనా, పొమ్ము. పొమ్ము. చెల్లాచెదరైన నా భావములను ఏ కాంతమున చిక్కబట్టవలయును.

సమ : మరల దర్శించెదను. (నిష్క్రమించును)

విజ : ఉపకరణ సమీకరణమునందు పొరపడితిని. పొరపాటు మానవ సహజము. ఇందు విధిచేష్టయేమి ?

మానవుడైనవాడు పదిమాఱులు యత్నము సల్పియున్ జయ
శ్రీని వరింపడేని చలచిత్తులు ప్రాప్తమటంద్రు దానినిన్ ;
మాన యుతుల్ తదుక్తిని బ్రమాణముగా గయికోరు ; చూచెదం
గాని యదృష్టమే యొకటి గల్గిన, దానికి నాకు యుద్ధమే !

(ఏవగింపుతో) ఆ ! తూ - విధి - విధి.

(తెరజాఱును)



## స్థలము : 4 అంతఃపురము

(తెరయెత్తునప్పటికి యశోధర దీనవదనయై పైటకొంగుతో కన్నీరు తుడుచుకొనుచుండును. రాజశేఖరుడు ప్రవేశించును)

రాజశేఖరు : అమ్మా, యెందుకు రమ్మంటివి ?

యశో : నాయనా, యిటురమ్ము. కూర్చుండుము.

రాజ : (అమ్మప్రక్కన కూర్చుండును)

యశో : శేఖరా, యిక మనమేమి చేయగలము ? మీ తండ్రిపట్టిన పట్టు విడువకున్నాడు. ముసలితనపు ముక్కోపము , నేనేమి చెప్పబోయినను అవిధేయనని శంకించుచుండును. తండ్రి నిశ్చయమును విని మనోరమ రేయుంబవలు తనలో తాను కుమిలి కుమిలి పరితపించుచున్నది. రెండు దినముల నుండియు మంచినీరైన త్రావక కృశించుచున్నది. కన్నీరు నించి నించి కనుతెప్పలు వాచిపోయియున్నవి. ఆ బిడ్డదురవస్థ చూచినప్పుడు కన్నకడుపెట్లు దరికొనక పోవును ? నాయనా, యీడువారి మనసుకోతలు మీకేమితెలియును?

రాజ : అమ్మా, మనోరమను విజయవర్మకిచ్చి వివాహము చేయుట నాకును అంత సమ్మతము కాదు. నిన్న ఆయన విడిదికి పోయియుంటిని. నేను పోవునప్పటికి ఏలనో కోపోద్రిక్త మానసుడైనటుల నిప్పులు గ్రక్కువాడి చూపులతో బయలవలోకించుచుండెను. ఆతతాయి క్రూర స్వభావమును ప్రతిబింబించు చుండిన ఆతని ముఖము నన్ను చూచిన తత్క్షణమె దరహసిత దీప్తమై వింతగొల్పినది.

యశో : నాయనా, ఆయన అంతకోపపడుటకు మనమేమి యగౌరవము చేసితిమి ?

రాజ : ఆయన నడవడి యేదో కొంత చిత్రముగ నున్నది !

యశో : అట్టి కపటాత్ముని మీ తండ్రి యెట్లు సద్గుణసంపన్నుడని నమ్మెను ?

*కడుపు చుమ్మలు వాఱగగాంచి పెంచి,*
*నేడు చేసేత కూతురి పాడుకూప*
*మున బడంగ నెట్టుల ద్రోతు ? ముప్పుదప్పు*
*సరణి లేదొకొ ? నీవైన సాయపడవొ ?*

రాజ : అమ్మా, చింతిల్లకుము. నాయనకు మరల చెప్పిచూచెదము. వినడేని

ముహూర్తము వేళకు మనోరమ నెచ్చోటికైన దాటవేసికొని పోయెదను. ప్రస్తుత మంతకన్న వేఱు ఉపాయములేదు.

యశో : విజయవర్మగారు అవమానింపబడినట్లు కోపగించు కొందురు గదా !

రాజ : ఆతనికోపము మనలనేమిసేయును ?

(మాధవ వర్మ ప్రవేశించును)

మాధవ వర్మ : అమ్మా -

రాజ : మాధవా, మేమిప్పుడు నీవు వినగూడని కుటుంబ రహస్యములు మాటలాడుకొనుచున్నాము. తరువాత రమ్ము.

మాధ : (కోపమడచుకొన్నవానివలె నటించి నిష్క్రమించును)

యశో : శేఖరా, మాధవునియెడ నీ ప్రవర్తనము చాల నింద్యముగ నున్నది. నిర్హేతుకముగ వానిని నీ వవమానించుచుందువు. మానమర్యాద లెఱిగిన మాధవుడు నీ పొగరుబోతుమాటల కెంత నొచ్చుకొని యుండును?

రాజ : వానిని నేను వ్యర్థముగ దూషించుటలేదు. మన కుటుంబమున వాని యంతరమును వాడెఱుంగ వలయును. మీ చనవును వాడు దుర్వినియోగ పెట్టుచున్నాడు. నాయెదుట కూడ మనోరమతో స్వేచ్ఛగ మాటలాడుచుండును. వారిరువురు పాచికలాడునప్పుడు నేను కోరినను వారు నన్ను ఆటలోనికి రానియ్యరు. వారిరువురి కలుపుగోలుతనము నాకేవము పుట్టించుచున్నది.

యశో : కుమారా, పిన్నటినాటనుండియు మీరు ముగ్గురొక్కచోట పెరిగితిరి. ఒక్క కంచమున గుడిచి, యొక్కమంచమున నిదురించితిరి. మొన్న మొన్నటి వఱకు పరమాప్తులుగ నుంటిరి. మాధవుడు నీ యసూయకు పాత్రుడు కాడు. గొప్ప బుద్ధివహింపుము. మనోరమ యింకను బాల్య వినోదముల విడనాడదు.

రాజ : అమ్మా, నీవేమైన ననుకొందువుగాక, నేను మాత్ర మొకమాటచెప్పుచున్నాను. ఇక మీద మనోరమ మాధవునితో కలసిమెలసి యుండరాదు. నీకుమారిక ప్రవర్తనమునకు నీవు బాధ్యురాలవు. తెలిసికొమ్ము. (నిష్క్రమించును)

యశో : ఇంకమీద వారిరువురు కలసిమెలసి యుండరు. రాజశేఖరుడు తండ్రియంతవాడు. పట్టినపట్టువిడువడు. అయ్యో, మాధవా, నీవెప్పుడైన వెడలవలసినవాడవేనా ! ఏ పల్లెతయో పెంచుకొనియున్న నీకిట్టి యిక్కటులు

వచ్చియుండవు గదా ! రాజశేఖరుని యుద్దేశ మటుండనిచ్చి మనోరమకు మాధవునకు గల చనవును కొంతమట్టుకు తగ్గించుటయే యుచితమని నాకును దోచుచున్నది. వారిరువురికి పరిణయము దుస్సాధ్యము ! అట్టి యెడ పరస్పరానురాగము హృదయాను తాపమునకు మూలము కాగలదు. అన్యాపదేశముగ మాధవున కీ సందర్భములన్నియు తెలియజెప్పెదను.

(నిష్క్రమించును)

(తెరజాఱును)



## స్థలము : 5 విడిది యిల్లు.

(విజయవర్మ సోఫాపై నానుకొని యొక పుస్తకము చదువుచుండును. తెరయెత్తబడును)

విజయవర్మ : చాణక్యుడొక్కడే నా మనస్సు కెక్కిన నీతివేత్త . సాంసారిక రాజకీయ ధర్మముల నాతడు భేదము నిరూపించెను. కార్యదక్షులు ఫలసిద్ధికొఱకు నెంతటి కార్యములనైన నొనరింతురు.

(సమర సేనుడు ప్రవేశించును)

విజ : ఏవైన క్రొత్త విశేషములు కనుగొంటివా ?

సమరసేనుడు : (కూర్చుండి) తమరి దగ్గఱ విశేషములు వినవచ్చితిని.

విజ : అంతియేనా ? సమరసేనా, చిన్న బహుమానముతో ఎట్టి పరిచారకుని నోటి తాళములైన ఊడిపోవును. ఈ కుటుంబ రహస్యములన్నియు గ్రహించితిని. మనోరమ మాధవుని వలచియున్నదట ! తల్లికిని కుమారునకును నాసంబంధ మంగీకారము కాదట.

సమ : అటులనా ! ఇంట నందఱును ప్రతికూలురైనపుడు శాంత వర్మమాత్రమేమి చేయును ?

విజ : ఆతని కోతిపిడికిలిపై నాకు నమ్మకము గలదు. కాకపోయినను నాకొక యుపాయము తోచుచున్నది.

సమ : సూచింపుడు ! తత్ క్షణమే నిర్వహించెదము.

విజ : రాజశేఖరుని రహస్యముగ మన దుర్గమున దాచియుంచవలయును. వాని సాహాయ్యము లేనిదే రాణి స్వతంత్రముగ నేమియు చేయజాలదు.

సమ : అట్లయిన ఎప్పటికిని రాజశేఖరవర్మ మనదుర్గమును ప్రాణముతో వదల రాదు.

విజ : అవును ! అది నిశ్చయము.

సమ : మఱియొకటి యాలోచింపుడు. పుత్రహీనుడైన శాంతవర్మ మాధవునింటనుంచుకొని మనోరమ నిచ్చి వివాహము చేయవచ్చును. అట్లే అగునేని మన ప్రయత్నములన్నియు విఫలములగును.

విజ : (నవ్వుచు) సమరసేనా, నేనంత మూఢుడననుకొంటివా ? పరస్పర ద్వేషముండుటవలన రాజశేఖరుని మాధవుడే చంపెనని నిరూపింపవచ్చును.

సమ : మీరు ప్రతిభావంతులు ; మీయెదుట నేను మందమతిని.

విజ : మనోరమ మాధవునిపై ఆస వదలుకొనకతప్పదు.

సమ : శాంతవర్మకు మీరుతప్ప వేఱుగతి యుండదు.

విజ : ఇట్టిసందర్భముల వివాహము కొంచెమాలస్యమైనను జరిగితీరును.

సమ : పెండ్లికూతురితోడ అరణముగ రాజ్యమును హస్తగతమగును.

విజ : నా భావిజీవితమును ప్రభాతమువలె స్వర్ణమయమై పొడకట్టుచున్నది.

సమ : మీ యనుచరుని జీవితము గూడ నట్లే యొనర్పవలయును.

విజ : సమరసేనా, నిన్ను మఱతు ననుకొంటివా ? వసంతపురమున రాజ ప్రతినిధియగుట కంత తీసిపోవు .

సమ : (సంతోషముతో) మీ చిత్తము, నా భాగ్యము.

విజ : మన మిప్పుడు ఊహ్యమైన యానందము ననుభవించుచు కర్తవ్యమును మఱవరాదు. నేనిచ్చట కొన్ని దినములుండవలసివచ్చును. నీవు పరివారమును దీసికొని హేమనగరమునకు వెడలుము. మన మాలతీదేవికి ఇచ్చటి వృత్తాంతము లేవియు తెలియగూడదని పరిచారకుల హెచ్చరింపుము.

సమ : అట్లె . (స్వగతము) మాలతితో సంభాషించుటకు తరుణము దొరకినది.

విజ : మాధవుని వేటనేర్పును రాజశేఖరునియొద్ద అగ్గించి వానిలో అసూయ ప్రేరేపితిని ; రాజశేఖరుడు తన నైపుణ్యము నాయెదుట ప్రదర్శింప నువ్విళ్లూరుచున్నాడు. ఈనాడు సాయంకాలమె మే మిర్వురము అరణ్యమునకు వత్తుము ; మన పరివారములోని కొందఱు మాఱువేషములు ధరించి అచ్చట వేచియుండవలయును. సమయము చూచి ఆతని కాలుసేతులు బంధించి గుఱ్ఱముపై వేసుకొని ఈ నాటి రాత్రియె పట్టణముచేర్చి పాతాళ గృహమున దాచవలయును. ఇచ్చటను అచ్చటను ఈ రహస్యము ఎవ్వరికిని తెలియకూడదు.

సమ : అట్లే యొనర్చెదను.

విజ : (పుస్తకము చేతికి తీసికొని చూచుచుండును)

సమ : (స్వగతము) ఈతని యొక్కొక్క రహస్యమును నావాంఛా పూర్తికి ఒక్కొక్క సోపానమగుచున్నది. మాలతిని నేను పెండ్లిచేసుకొని తీఱవలయు. ఆకాంతపై ననురాగము నాకు నానాటికి హెచ్చుచున్నది. ఎన్ని దినములు దాచగలను. ఏల దాచవలయను ?

విజ : (తలయెత్తి చూచి) సమరసేనా, నీవింకను ఇచ్చటనే యున్నావా ? నిదురలేని కలలు గనుట నాసేనాధిపతులకు తగిన యుద్యోగము కాదు.

సమ : శిలాక్షరప్రాయమైన మీవాగ్దానము నామనమున మధురస్వప్నము సృజించినది.

విజ : అందుకు నాపైన సొద్దుపెట్టెదవా ? తీఱిక చూచి వాగ్వాదవినోదము ననుభవింతము. నీకప్పగించిన కార్యము కాలయాపనము సేయక నిర్వహింపుము.

సమ : (తలవంచుకొని) నాసేవకు తగిన ప్రతిఫలము ముట్టునని నాకేమి నమ్మకము?

విజ : ఏమీ ! నీ సందేహము వింతగొల్పుచున్నది. సమరసేనా, నా మొగము చూచి మాటాడుము. నిన్నెప్పుడైన మోసము చేసియుంటినా ? పొమ్ము, పొమ్ము బేలవు కాకుము.

సమ : మీకు రాజ్యము చేకూరినది. వివాహమును కాబోవుచున్నది.

విజ : ఇదియొక క్రొత్తవిషయము కాదు.

సమ : క్రొత్తవిషయమే చెప్పెదను. నాకును పెండ్లిచేసికొనకోరిక కలదు.

విజ : (నవ్వుచు) ఇందుకా యింత యుపోద్ఘాతము ? అటులనే చేసికొమ్ము ;నాకును సంతోషమెగదా !

సమ : వసంతపురమున రాజప్రతినిధి కాబోవునాకు వధువు కూడ అనురూపవతిగ నుండవలయును.

విజ : (స్వగతము) చాలదూరము అంగవేయుచున్నాడు. (ప్రకాశముగ) కన్యకను నిర్ణయించుకొంటివా ?

సమ : నిర్ణయించుకొంటిని .

విజ : ఎవరు ?

సమ : (క్రిందిచూపుతో) మాలతీదేవికి నేనంత తగని వరుడనుగాను.

విజ : (పిడుగడచినట్లు నిర్విణ్ణుడయి) మాలతీ దేవికి నేనంత తగని వరుడను

గాను! (కోపముతో) తగిన వరుడని యెవరు చెప్పిరి ?

సమ : నేననుకొంటిని.

విజ : (కోపముతో) సమరసేనా, నీవు తలక్రిందుగా నడచుట లేదుకదా ? నీకు చిత్త చాంచల్యము కలిగినదా ? లేక కల గనుచున్నావా ? ఇతరుడవే యైయున్న ఈ యసంగత ప్రలాపములకు నిన్ను మన్నించి యుండను. హాస్యాస్పదుడవు కాకుము.

సమ : మాలతీదేవిపై మీకు ప్రీతిలేదు. ఆకన్యను శిక్షించుటకుగా నాకిచ్చి వివాహము చేయుడు.

విజ : నీవు బుద్ధిమంతుడవేని ఈవిషయమై మఱొక్కమాటయైన నెత్తకుము. ఇంత తారతమ్య మెఱుంగని వాడవని నే నెన్నడును తలంపలేదు.

సమ : ఇదియే కడపటి మాటయా ?

విజ : ముమ్మాటికి.

సమ : ఏనుగు తన నెత్తిపయి తానే మన్నుచల్లుకొనును.

విజ : ఓరీ, నీచుడా, నన్ను బెదరించి లోగొన జూచెదవా ?

సమ : మాధవవర్మకే నేనట్టి సాహాయ్య మొనరించియుందునేని -

(నిష్క్రమించును.)

విజ : ఈ రహస్యమును కూడ వీనికి దెలిసిపోయెను ! నా తెలివితక్కువతనమునే నిందించుకొనవలయును. నానాటికి వీనికి నాపై అధికారము హెచ్చుచున్నది. ఈ దుర్మార్గుడు బ్రతికియున్నంత వఱకు నాగుండెలు కుదుట పడవు. సమరసేనా,

(పలుకడు) సమరసేనా, (పలుకడు)

(అటునిటు తిరుగును)

ఇంతలో నెచ్చటికిపోయెను ? మాధవుని యొద్దకుపోయి యుండడు కదా ? సమరసేనా.

(పలుకడు) ఎవడురా అక్కడ ?

పరిచారకుడు : స్వామి.

విజ : సేనాధిపతి ఎచ్చటికిపోయెనో త్వరితముగ పిలిచికొనిరమ్ము.

పరి : ఆజ్ఞ (నిష్క్రమించును)

విజ : (అటునిటుతిరుగుచు) ఆతడెక్కడకు పోయియుండును ? ఇంత యనాలోచితముగ కార్యముచేయునా ? చేయడు ; చేయడు. ఏల యింతవఱకు రాడు ? సమరసేనా.

(సమరసేనుడు ప్రవేశించును)

సమరసేనుడు : నన్ను పిలిపించితిరా ?

విజ : ఆడుదానివలె అలగిపోవుట ఎప్పుడు నేర్చుకొంటివి ? కూర్చుండుము.

సమ : (నిలువబడి) నాతోడ మీకు పనితీఱినది ; నే నిక నుండిన నేమి పోయిననేమి?

విజ : (కూర్చుండి) కూర్చుండుము. మంచిబుద్ధితో ఈ విషయమును మరల నాలోచింపుము. నీకోరిక యసంగతమని యిప్పటికే నీకుతోచి యుండును. మనము లోక దూషణమునకు బాల్పడుదుము ; వింత వింత కింవదంతులు పుట్టును.

సమ : కింవదంతులకు క్రొత్తగా భయపడుచున్నామా ? అసమ్మతిని ఇంత శాఖాచంక్రమణముగ నుపదేశించుట యెందుకు ? ఔనా - కాదా, ఒకమాట చెప్పుడు. పోయెదను.

విజ : సమరసేనా, నీపై ద్వేషముతో నిట్లు చెప్పుటలేదు. లోకుల యాడికోలుకు వెఱచి సందేహించితిని. నీకంత యావశ్యకమని తోచినప్పుడు నీ యభీష్టము నెఱవేర్చియే తీరుదును. నీకింకను సందేహమా ?

సమ : నాసందేహము తీఱినది.

విజ : ఇక త్వరితముగ వెడలిపొమ్ము. జాగరూకుడవై అంతయు నిర్వహింపుము.

సమ : పోయివచ్చెదను. మరణ పర్యంతము మీ మేలుమఱువను. (నిష్క్రమించును.)

విజ : నన్నావేశించిన పిశాచము తొలగినటులైనది. ప్రతిపదమునందును వీనిదే నాకు చింత ; నా జీవిత మీ నీచుని మూలమున దుర్భోగ్యమగు చున్నది. ఏలాటి సందేహమున కెడమియ్యని స్నేహముతో ప్రవర్తించి సమయముచూచి మట్టుపెట్టెదను.

(రాజశేఖరుడు ప్రవేశించును)

రాజశేఖరుడు : వేటకు వచ్చెదరా ?

విజ : నాకు కొంచెము తలనొప్పిగానున్నది; అయినను నీ వెనువెంటనే వచ్చెదను.

రాజ : ఆలసింపకుడు. (నిష్క్రమించును)

విజ : రాజశేఖరుడు తనవేట నైపుణ్యము చూపుటకు నువ్విళ్ళూరుచున్నాడు కాబోలు!

(అచ్యుత వర్మ ప్రవేశించును)

అచ్యుత వర్మ : జయము, జయము !

విజ : అచ్యుతవర్మా, సమరసేనుడు ప్రయాణ సన్నాహము చేయుచున్నాడా?

అచ్యు : మేమిక ఆతని అధికారము లెక్కసేయము. నా అధీనములోనుండు పరివారము ముందర అతడు నన్ను నీచముగ నిందించెను. ఆ గర్వాంధుడు ఏలిన వారిని సైతము లెక్కసేయుటలేదు.

విజ : ఆతడేమైన నొడలుతప్ప త్రాగియున్నాడా ?

అచ్యు : ఇదియంతయు దేవరవారి యాదరణమువలన వచ్చిన కండకావరము. లేక యుండిన ఆతనినప్పుడే.....

విజ : ఇటురమ్ము (తిన్నగా) వానిపై నా కాదరణ పోయినది. ఆ నీచుడు నాదయకు పాత్రుడు కాడు. వాని యుద్యోగమును నీవు నిర్వహింప నభిలషింతువా ?

అచ్యు : దేవర కరుణ.

విజ : మిగత విషయము నీవూహింపగలవు. సమయము చూడుము. ఇచ్చటకాదు ; తెలిసినదా ?

అచ్యు : గ్రహించితిని.

విజ : పొమ్ము నీ యదృష్టము నీచేతిలోనున్నది.

అచ్యు : మహాభాగ్యము (నిష్క్రమించును)

విజ : రాజశేఖరుడు నాకొఱకు వేచియుండునేమో. (నిష్క్రమించును)

(తెరజాఱును)



## స్థలము 6 : అరణ్యము

(మనోరమయు చేటికయు ప్రవేశింతురు)

చేటిక : అమ్మా, యింక మనమింటికి మళ్ళుదాం. రాణిగారితో కూడ చెప్పిరాలేదు. అన్నయ్యగారు చూస్తే కోపగించుకొంటారు.

మనోరమ : శ్యామలా, నాకు అంతఃపురము కంటె ఈ యరణ్యమె వేయింతలు సుఖప్రదముగ నున్నది. ఇచ్చట చెట్టుచేమలు పనికిమాలిన బోధ లొనరించి ప్రాణము విసిగింపవు.

శ్యామల : తండ్రిగారు పట్టిన పట్టు విడువరు ; మొన్న వచ్చిన క్రొత్త దొరగారు పెద్దదొరగార్ని మచ్చుమందుసల్లి లోపఱచుకొన్నట్లుంది.

మనో : మా నాయన ఉత్సాహవంతుడు, సదుద్దేశముతోనే నా హృదయమును చిందఱవందఱగ త్రొక్కుచున్నాడు. ఏమే, మాధవుని ఈవేళ చూచితివా? రెండుదినములనుండియు నాకంటి కగపడుటలేదు.

శ్యామ : ఆయన్ని ఈనాటి పొద్దున చూచాను. అమ్మా, ముందటి మాదవయ్య దొరగారు కారు - ఆనడుపు ఆ చూపులు మాఱిపోయినాయి. పిచ్చి వాడిలాగా తిరుగుతుంటాడు.

మనో : నా దుఃఖాగ్ని హృదయదాహకమైనను తల్లియౌదార్యులచే కొంత చల్లవడుచున్నది. పాపము ! మాధవుని ఊరడించువారెవరు ? శ్యామలా, మాధవుని గంభీర స్వభావమును నీవెప్పుడైన కనిపెట్టితివా ? తన దుఃఖము నెవరితోనైన చెప్పికొనడు ; భారమును అసహాయుడుగ వహించును.

శ్యామ : నిన్న మన శేకరయ్యదొరగారు ఎందుకో కోపగించుకొన్నారు. ఆయన వినిపించుకోకుండా తలవంచుకొని వెళ్ళిపోయి నారు.

మనో : మాధవుడు నివుఱుగప్పిన నిప్పు.

(మాధవవర్మ అన్యాయత్తచిత్తుడయి క్రింద చూపుతో ప్రవేశించును.)

శ్యామ : అమ్మా, వారుగో మాధవయ్య దొరగారు, ఇక్కడికే వస్తున్నారు.

మనో : (ఆతురతతో) ఏడి ? (చూచి) పాతాళ పర్యంతము నంటుచూపు ! మొగ మేదియో ఘోరనిర్ణయమును ప్రకటించుచున్నది ! మాధవా, ఏమి యీ స్వరూపము ?

మాధవవర్మ : (మెల్లగ తలయెత్తిచూచి) మనోరమా, యదృశ్యశక్తి యాహ్వానము బలవత్తరము. స్వతంత్ర జీవిత యాత్రా మహానముద్రా వర్తనమున ఏకాకినై దుముకబోవుచున్నాను. వీడ్కోలుపుము.

మనో : (కలతచెంది) నీమాటలు నాకర్థమగుటలేదు. ఏమియాత్ర? వీడ్కోలుపుట యేమి ?

మాధ : ఇంకొక్క నిముసమైనను ఈ యవమానకరమైన జీవనమును గడపజాలను. ఓర్పునకు గూడ నొక మేరయుండును. నే నెవ్వడను ? మీయింట నే నేల యదవత్రావుడు త్రాగుచుండవలయును ? అజ్ఞాతజన్ముడను, పవిత్రమగు మీ కులీనత కేల కళంకము తేవలయును?

మనో : మాధవా, నిన్నెవరైన దూషించిరా? రాజశేఖరుడేమైన కానిమాటలు పల్కెనా? తండ్రితొందరపడి కోపగించు కొనలేదుగదా ?

మాధ : ఒక్క రాజశేఖరుడే కాడు, నేను జూచు ప్రతిపదార్థమును నన్నవమానించు చున్నది. పారతంత్ర్య విషవాయువునందు నాయౌవన కుసుమము వివర్ణమయి జీర్ణించిపోవుచున్నది. కఱకుటమ్ములను నిష్కవచమైన నా వక్షఃస్థలముతో నెదుర్కొనగలను గాని, మర్మ భేదకములగు నెత్తిపొడుపు లను, అన్యాపదేశ దూషణములను సహింపజాలను. ప్రత్యక్షముగ నీవు నా హృదయమును చూడగలుగుదు వేని, ఒక్కొక్క యణుమాత్రస్థలము నొకొక్కక్షతము ! ఒకొక్క క్షతమును రక్తస్రావి ! ఒకొక్క రక్తబిందువును నా జీవిత సారము!

మనో : అయ్యో ! నీవెన్నడును నింత కలత నొందియెఱుగవు. ఆ పొగరుబోతు రాజశేఖరుడే నిన్ను మితిమీఱ నొప్పించియుండవలయును.

శ్యామ : అనుమానమెందుకమ్మా ? నిజంగానే వుండవచ్చును.

మాధ : మనోరమా, నేను బిచ్చకత్తె బిడ్డనని తూలనాడినందుకు నాకేమి యవమానములేదు ; లోకమున నందఱును భాగ్యవంతులుగ నుండరు. నేను జారిణీకుమారుడనా ? తన యపవిత్రకళంకమును కప్పిపుచ్చుటకు మాతల్లి నన్ను నిశ్చింతముగ పాఱవైచినదా ? (సంక్షుబ్ధ చిత్తుడయి) మా తల్లిజారిణి ! దుస్సహము - ఓరి రాజశేఖరా, నేను మీ తండ్రికి మరణ పర్యంతము ఋణపడియుండనియెడల - (కత్తిపైచేయి వేయును)

మనో : ప్రాణమిత్రమా, నన్ను గుఱించియైన ఆ బాలిశుని నీచోక్తులు మన్నింపుమని

వేడికొనుటకును నోరాడకున్నది.

మాధ : వీడ్కొలుపుము. కాలయాపనమగుచున్నది. నీయనురాగ స్మృతి యను మహాప్రదీపమును చేతనుంచుకొని నా జీవిత కాళరాత్రి నంతయు నిర్భయముగ గడపెదను.

మనో : (చేయివట్టుకొని) నీవు నిజముగ వెడలవలయునా ? ఇంకొక యుపాయములేదా ?

మాధ : నే నింకొక్క నిమిషమైన యీ యింట నుండజాలను. ఈ బూటకపు జీవనము నాకు నరకము పలెనున్నది. రాజులయింట నునికి - సర్వసౌఖ్యము లనుభవించు చున్నట్లు లగుపడుట - హృదయముమాత్రము బయటి కగపడని అంపకోతలతో జర్జరిత మగుట! ఇదియేటి బ్రతుకు ?

మనో : నీ యూరడింపులతో నా హృదయభారమును దేలిక పఱచుకొనదలచి యుంటిని గాని, నీ దుఃఖమును చూచి నా సొదమ్రింగి కొంటిని. మాధవా, అన్న యపరాధమునకు నాపై కసితీర్చుకొందువా ?

మాధ : నా మానత్యాగము నీసౌఖ్యమునకు గోరంతయైన నుపకరించునెడల, అదియే కాదు ప్రాణత్యాగము కూడా నా కిష్టమే.

మనో : మన యనురాగలత నిరాలంబముగ కృశింపవలసినదేనా ?

మాధ : మాటిమాటికి పొడిచి చంపెదవు ? నేను రాజపుత్రుడను కాను.

మనో : నీవు స్మృతిని భగ్నము చేయలేవా ?

మాధ : *స్మృతిని గాలంబు నశియింప జేయుమందు*
*నీకడన యున్న దయసేయుమో కులీన,*
*నీరమైనను విషమైన నీ వొసంగ*
*నమృతరసమట్లు తనివార నానువాడ*

మనో : మాధవా, నీ సహవాసములేని బ్రతుకు నాకు జీవన్మరణము. నేను నిశ్చయించుకొంటిని.

మాధ : (దుఃఖోద్వేగముతో) ఏమనుచున్నావు ? ఈ యజ్ఞాత జన్ముడు, ఈ కులహీనుడు, ఈ పరాన్న భోక్త - దుస్సాధ్యము, దుస్సాధ్యము ! నీవేడ, నేనేడ ? ఏల యీ పిచ్చి భ్రమ గొల్పుచున్నావు ? దురదృష్టమునకు భ్రాంతి ; భ్రాంతికి ఆశాభంగము; ఆశాభంగమునకు అకాలమరణము ; చక్కని సంతాన పరంపర !

వనితా, నీవొక ధావమాన మధుర స్వప్నంబవై మన్మనో
ఘనమార్గంబున తేలియాడెదవు దక్కన్ రాని దూరంబునన్,
నను నచ్చోటికి రమ్మటంచు కనుసన్నన్ పిల్తువేగాని, నీ
వనుమానింపవు నా విపక్షతను ; పేరాసల్ వృధావేదనల్ !

మనో : మాధవా, నీకు మరణింప నిచ్చకలదా ?

అదిగో ! యాగిరి శృంగమెక్కుదము సంధ్యారక్తవర్ణాంకితాం
బుద రమ్యాంబర భిత్తిపై మన వపుర్మూర్తుల్ మషీచిత్ర సం
పద రూపింప, నభుక్తమౌ వలపుతాపంబుల్ శమింపంగ, పే
రెద కౌగిళ్ల సుఖించి క్రిందినదిలోనే దూకి నిద్రింతమా ?

శ్యామ : అన్నయ్యగారిక్కడికే వస్తున్నారు !

మనో : ఏడి ! విజయవర్మగారు కూడా వచ్చుచున్నారు. నే నిక బోయెదను. అన్న కోపగించుకొన్నను సహింపుము.

(విజయవర్మ రాజశేఖరులు ప్రవేశింతురు)

రాజశేఖరుడు : (స్వగతము) వీరిచట మాటలాడుచుండి, మమ్ముచూచి మనోరమ చెట్లచాటునకు పోయినది. (ప్రకాశముగ) ఓరి, నీకింకను జ్ఞానము లేదా ? నీ యంతరమును నీ వెఱుంగవా ? మాయమాటలతో ఆ యమాయికను లోబఱచుకొన యత్నించుచున్నావా ? ఓరి దుర్జాతీ, నిన్నిప్పుడే యీ వనదేవతలకు బలియిచ్చెదను.

(కత్తిదూసి మాధవునిపైకి పోవును. అంతలో మనోరమ రాజశేఖరమాధవుల మధ్యకు వచ్చి రాజశేఖరుని పట్టుకొని,)

మనో : అన్నా , తొందరపడకుము. మాధవుడేల యింతటి పగవాడాయెను ?

మాధ : (గంభీర నిర్లక్ష్యభావముతో) రాజశేఖరా , యీ యాటవస్తువును దాచియుంచుకొనుము.

రాజ : (కోపముతో) ఏమీ, ఈకరవాలము నీ హృదయ రక్తమును ద్రావునపుడు విషవ్యాళమని తెలిసికొందువు.

మాధ : (రాజశేఖరుని కరవాలమును పెరికి కొంచెము దూరముగ పఱవైచి) మహానాయకుడా, అదిగో ! నీ కరవాలము మట్టిదాకి కఱకు మాయును.

చక్కగ తుడిచి యొరలో దాచిపెట్టికొమ్ము.

మనో : మాధవా, నీవుకూడా అన్నకోపమునకు తగునట్లు ఆటలాడుచున్నావు.

రాజ : ఓరి కృతఘ్నుడా, నిన్నింతవఱకె చంపకుండినది తప్పు. (క్రిందపడియున్న కత్తితీసికొని పైకిదూకును)

మనో : అన్నా. మన్నింపుము, మన్నింపుము.

రాజ : వెడలిపొమ్ము ! సిగ్గులేనిదాన, మాన మర్యాదలెఱుగవు, పరపురుషుల యెదుట స్వచ్ఛంద విహారిణివలె నాట్యమాడెదవు.

మనో : (మాధవుని తట్టు అర్థగర్భితముగ చూచి వెడలిపోవును.)

రాజ : ఓరీ, నీవు తిన్నయింటికి ద్రోహము సల్పువాడవు. చిన్ననాటనుండి మాయింట పెరిగిన దోషమున పాపశంకచే నిన్ను మన్నించితిని. వెడలిపొమ్ము. ఇక మా దివాణమున నడుగుపెట్టకుము. (విజయవర్మ దగ్గరకు పోయి) మనమిక పోదమురండు.

విజ : (స్వగతము) అంతయు నా యాలోచన కనుకూలముగ నే పరిణమించుచున్నది. ! ఈయసదృశ లావణ్యవతి కొఱకైన మాధవుని తుదముట్టింపవలయును. (ప్రకాశముగా) మిత్రమా, నాకు తలనొప్పి మఱింత హెచ్చుచున్నది. నేను కొంత తడవు విశ్రమింపవలయును. (జనాంతికము) నీవు మాధవునిపై కనుపఱచిన శౌర్యము నా కచ్చెరువు గలిగించినది. భేష్ ! రాజశేఖరా, భేష్ ! (వీపుతట్టును)

రాజ : (జనాంతికము) కనికరముతో వానిని చంపక వదలితిని ; లేకున్న ఇంతవఱకె వాని కళేబరముపై కాకులు, గ్రద్దలు గీగావులాడుచుండెడివి. మీరు ఇంటికి పోయెదరా ?

విజ : నుదుట తైలము రాచికొని కొంత విశ్రమించిననేగాని యుపశమించునట్లు లేదు.

రాజ : నేను పోయెదను.

విజ : నీవు ఒంటరిగా వేటాడెదవా ?

రాజ : ఈ యరణ్యము మాకు చిరపరిచితము. (నిష్క్రమించును)

విజ : (స్వగతము) వెడలుము. పాతాళగృహముకూడా చిరపరిచితము కాగలదు.

(నిష్క్రమించును)

మాధ : (అధోముఖుడై అటునిటు తిరుగుచు) మనోరమ నాస్థితిని మఱింత ఘోర మొనరించుచున్నది. నేను వెడలి పోవుదునేని ఆ సుకుమార హృదయ తప్పక ప్రాణ పరిత్యాగము కావించుకొనును. ఇన్ని దూషణములకు, అవమానములకు నగ్గమయి ఇంక నేనెట్లు వారి దివాణమున నివసింప గలను ? ప్రియసఖీ ఎట్టి విషమ సంఘటనము తెచ్చిపెట్టితివి ? ఎట్టి పిచ్చి యాస పురికొల్పితివి !

*ప్రతి ఫలించిన చంద్ర బింబంబుగాంచి*
*యురము పై నిదురించుచు నున్నదనెడి*
*భ్రాంతిని సుఖించు కుముదా కరంబు సరసి ;*
*ఎంతదూరమ్ము, రెంటికి నెంత యెడము !*

(నేపథ్యమున) ఓ మాధవా, పంది, చచ్చితిని - చచ్చితిని - పంది. (అని దూరమునుండి వినబడును)

మాధ : ఏమది ? (ఒరనుండి కత్తిలాగికొని పరుగెత్తును)

(తెరపడును)



## స్థలము 7 : కొలువుకూటము

(శాంతవర్మయు విజయవర్మయు కూర్చుండి, తెరయెత్తునప్పటికి సంభాషించు వైఖరిలో నుందురు.)

శాంతవర్మ : (దుఃఖముతో) అయ్యో ! యింకెక్కడి రాజశేఖరుడు ? ఇంకను బ్రతికియున్నాడా? రాత్రి యంతయు దివిటీలు వేయించి యడవి యంతయు వెదకించితిని - మీరేల వాని నొంటరిగ వదలివచ్చితిరి ?

విజ : నేనెంత బ్రతిమాలినను వినక యుత్తరపు దిక్కునకు పోయెను. నేను గూడ వెంబడింపదలచితినిగాని, గొడ్డటితో చీల్చినట్లు తలనొప్పి పుట్టుచుండెను. విశ్రమింపవలయునని యింటికి వచ్చితిని. మాధవ వర్మగారు మాత్రము అడవియందే యుండిరి.

శాంత : ఏమీ, మాధవుడచ్చట నుండెనా ? మాధవుడేడి ? మాధవా.

(మాధవవర్మ ప్రవేశించును)

శాంత : నీవుకూడ వేటకు పోయియుంటివా ?

మాధవవర్మ : లేదు. ఏదూరదేశమైన పరుగెత్తి పోవుటకు పోవుచుంటిని కాని, నా విధి మరల నన్ను వెనుకకు మరలించినది.

శాంత : ఇదియేమి వెఱ్ఱి ?

మాధ : ఇంతవఱకు పరగృహ వాసముయొక్క దైన్యమును పారతంత్ర్యమును నేనెఱుంగను. మీ వాత్సల్యము చేత మైమఱచి యుంటిని. ఆ మధుర స్వప్నము నుండి రాజశేఖరుడు నన్ను మేల్కొలిపెను. పదిజన్మములెత్తినను మీ ఋణమునేను తీర్చుకొనజాలను ; లేక యుండిన మాయిరువురిలో నెవరైన నొకరు మరణించియుందురు.

శాంత : (తత్తరముతో) ఏమీ ! ఏమిజరిగినది ?

మాధ : నేను అరణ్యమున కేగునప్పటికి మనోరమయు దాసియు నచ్చట నుండిరి. నేనామె యొద్ద సెలవు పుచ్చుకొనుచుంటిని, అంతలో విజయవర్మగారును రాజశేఖరుడును అచ్చటకు వచ్చిరి. ఆతడెట్లు నన్ను నిందించినదియు వీరెఱుంగుదురు.

విజ : పాపము ! మాధవవర్మగారు చాల యోర్పువహించి యుండిరి. (స్వగతము)

మూఢుడా, నీ సత్యభాషిత్వమే నీమెడకు నురిత్రాడును బిగించును లెమ్ము.

మాధ : నన్ను సాకి సంతరించిన వారి యెడ కృతఘ్నుడనుగనుండ జాలను. నావలన మీ కుటుంబ శాంతికి భంగమేల కలుగవలయును ?నన్ను విడనాడుడు. రాజశేఖరుడు తిరిగివచ్చునప్పటికి నేనింట నుందునేని అతడు నన్నొక మనుష్యునిగ లెక్కింపడు.

(ఇరువురు పరిచారకులు ఒక విరిగిన కత్తిముక్కను, తలపాగను తీసికొని ప్రవేశింతురు)

ఒకపరిచారకుడు : (దుఃఖగద్గద స్వరముతో) పొద్దున్నె పోయి, మళ్లీ అడివంతా గాలించి గాలించి వెతికినాం. పుట్టపుట్టా చెట్టుచెట్టూ సూశినాం. అరణ్యకుల్యానదికి దగ్గిరగా ఈకత్తితునక, యీతలగుడ్డపడివుండింది.

శాంత : (ఆతురతతో) ఏవి !ఏవి !

(చేతులు చాపును. పరిచారకులు తలగుడ్డను కత్తిముక్కను అందింతురు)

విజ : ఇది నిన్న రాజశేఖరవర్మచుట్టుకొనిన తలపాగవలెనున్నది.

శాంత : (తలగుడ్డను కౌగిలించుకొని దుఃఖించుచు) అయ్యో ! నా బిడ్డనెవరో చంపిరి. కత్తితునుక నెత్తుట తడిసియున్నది. అయ్యో ! నాయనా నీకేలయిట్టి ఘోరమరణము ప్రాప్తించినది ? (దుఃఖించును)

విజ : (నిట్టూర్చుచు) అయ్యో ఎంతకష్టము ! నేనెంత దురదృష్టవంతుడను! మీ యింట నే నతిథినై యుండునప్పుడే యిట్టి యిక్కట్టులు వాటిల్ల వలయునా?

శాంత : ఇందుకు ఎవరేమి సేయుదురు ? దైవము మాయెడ క్రూరము. ముసలి ముప్పున నిట్టి పుత్రశోక మనుభవించుటకు మేమెవరికేమి యెగ్గుచేసితిమి?

మాధ : ఇది యంతయు స్వప్నమువలె నున్నది. నేను నమ్మజాలను. రాజశేఖరుడు మరణించి యుండడు.

శాంత : నీ మాటలే సత్యమగుగాక !

పరిచారకుడు : అక్కడ ముగ్గురు నలుగురు మనుష్యులు పెనగులాడిన లాగా అడుగు గుర్తు లగుపడుతున్నాయి.

మాధ : అచ్చుట చచ్చిపడియున్న అడవి పంది కళేబరమును చూచితిరా ?

పరి : లేదండి దొరగారు.

మాధ : (ఆలోచించుచుండును)

శాంత : (ఆతురతతో) మాధవా, నీకేదో కొంత తెలిసినట్లున్నది, దాచిపెట్టకుము. అడవిపంది యేమిటి - చెప్పుము? రాజశేఖరు నెవరు చంపిరి? ఆ క్రూరకర్ముడెవ్వడైన గాని వానిని కండలు కండలుగ చెక్కించి గ్రద్దలకు వేయించెదను. ఆ హంతకుడు నేన యైనను నన్ను మన్నించుకొనను.

విజ : మీరు ఘోరప్రతిజ్ఞచేయుచున్నారు. ఆడినమాట తప్పరని నాకు తెలియును. తొందర పడకుడు.

శాంత : ఇంతకన్న నాకు దుఃఖజనకమేమున్నది? వార్ధక్యమున నాయూతకఱ్ఱను విఱచి వైచిరి. నాకు మృత్యుమందిరమునకు దారిచూపించిరి. నాజీవిత శేషమును ఘోరదండనముగ నొనరించిరి. మా పితృదేవతలు నీతాప నీరమునకైన నోచుకొనరు కాబోలు! మాధవా, ఆ అడవి పందిని గుఱించి యేమిచెప్పితివి? (ఆలకించి) ఆగుమాగుము. రాజశేఖరుని కంఠ స్వరమువలెనున్నది. (అందఱును ఆతురతతో చూతురు) రాజశేఖరా, -

(పరిచారకు డొకడు ప్రవేశించును)

పరిచారకుడు : ఇక్కడ ఎవ్వరూ లేరండి దొరగారు.

శాంత : (కోపముతో) ఓరి దున్నపోతా నీవటరా, పొమ్ము పొమ్ము. నీపాడు మొగము చూపింపకుము.

పరి : (నిష్క్రమించును)

శాంత : మాధవా, యేమంటివి? (తలపాగ తెచ్చిన పరిచారకులు తట్టుతిరిగి) మీరు పోయి మరల ఆ తీరప్రదేశము నంతయు వెదకుడు., రాజ శేఖరుడు బ్రతికియున్న వార్త తెచ్చినవారికి గొప్ప జాగీరు నిప్పించెదను. పొండు!

పరి : చిత్తం. (దణ్ణము పెట్టి నిష్క్రమింతురు)

శాంత : మాధవా, ఆ అడవిపంది సంగతి యేమి?

మాధ : విజయవర్మగారు రాజశేఖరుడును వేటకై వెడలిన చాలసేపు వఱకును నాకేమియు తోపక యున్మత్తునివలె నచ్చట తిరుగుచుంటిని. "అడవిపంది అడవిపంది చచ్చితిని, చచ్చితిని" అని కేక వినబడెను.

శాంత : (ఆతురతతో) రాజశేఖరుని కేకయా? తరువాత?

మాధ : నేనట్లే యూహించితిని.

శాంత : నాయనా, నీవు తత్‌క్షణమె పరుగెత్తలేదా?

మాధ : పరుగెత్తితిని. నేను పోవునప్పటికి ఆ పంది రాజశేఖరునిపైకి దుముకుచుండెను. ఆతడు దానిని కత్తితో తప్పించుకొనుచుండెను. నేనొక్క నిమిష మాలసించి యుందునేని బెదరియుండిన ఆ యేదుపంది పాపము! రాజశేఖరుని చీల్చివేసియుండును.

శాంత : దానిని పొడిచి నీవు రాజశేఖరుని కాపాడితివా? నిన్ను సాకిసంతరించిన ఋణమును తీర్చుకొంటివిగదా?

మాధ : దాని డొక్కలో నాకరవాలముతో నొక్కపోటు పొడిచితిని. అది రాజశేఖరుని వదలి నాపైకి దుమికెను. నేను తప్పించుకొని కత్తి నూడబెరుకునంతలో నది యొరగబడెను. అందువలన నాకరవాలముమొన విరిగిపోయెను, ఆ తునకయే యిది.

విజ : అట్లయిన దాని కళేబర మేమైయుండును? ఒక వేళ అడవి మృగములు తిన్నను అస్థిపంజరమైన నుండవలయును గదా?

మాధ : అదియె దురూహ్యముగన్నది.

విజ : తరువాత అచ్చటినుండి మీరిరువురు కలిసికొని వచ్చితిరా

మధ : రాజశేఖరుడు కలవరమంది కొంతవఱకచ్చటనే నిలిచుయుండెను. నాచేత రక్షింపబడెనన్న భావము అతనికి లజ్జాకరముగా నుండుటను గ్రహించి నేనచ్చటనుండక ఇంటివంక మరలి వచ్చితిని. ఇంతవఱకె నాకు తెలియును.

విజ : (స్వగతము) నిన్నురితీయించుట కింతకన్న నెక్కుడవసరము లేదు.

శాంత : అట్లయిన రాజశేఖరుడేడి?

మాధ : నేనుకూడ అదే ప్రశ్న అడుగవలయును. నాకేదియో కొంతసందేహము కలుగుచున్నది. మరల నొకమాఱాప్రదేశమునకు పోయి చూచివచ్చెదను.

విజ : ఉపయోగమేమి?

శాంత : అయిననుపోనిండు,పొమ్ము,పొమ్ము; యథార్థము

మాధ : (నిష్క్రమించును)

విజ : (స్వగతము) అచ్చట తలపాగయు కత్తితునకయు దప్పనింక నేమియు

దొరకనందున చాలమేలయ్యేను. మా భటుల తలగుడ్డలు చిక్కియుండిన! (ప్రకాశముగ) మాధవవర్మ

సుస్వభావముకలవాఁడు. సత్యమె చెప్పినట్లు తోఁచు చున్నది. అయినను రాజశేఖరుని వృత్తాంతము తెలియువఱకు ఆయన సాహాయ్యము మన కావశ్యకము. ఆయన పరదేశమునకు పాఱిపోవ నిర్ణయించుకొన్నవానివలె నగపడుచున్నాడు. ఆ యుద్దేశము నిన్ననే యంకురించి నట్లున్నది.

శాంత : (స్వగతము) ఈ మాటలలో నేదియో కొంత యనుమానము ధ్వనించుచున్నది. సత్యముగ నుండకుండునుగాక! (ప్రకాశముగ) అయ్యా, మీకు మాధవునిపై నేమైన నను మానము తట్టినదా?

విజ : మాధవవర్మ వినయవంతుఁడు. మీయెడ పితృభక్తి చూపుచుండును. నాకును ఆతనిపై సోదర ప్రీతి జనించినది. అయినను -- (కొంచెము నీళ్లు నములును.)

శాంత : ఏదియో చెప్పఁదలఁచి సంకోచించుచున్నారు.

విజ : ఏమియులేదు. యథార్థము దెలిసికొనునంతవఱకు ఎవరిపైనను నేరము మోపుట న్యాయముకాదు. అందులో మీ యింట నిండు గారాబమున బెరుగుచుండి, మీ కెన్నఁడు నపకార మొనరించియుండని గుణవంతునిపై నాకేల సందేహము కలుగును? అయినను మానవస్వభావము స్థిరమైనదికాదు. రాజశేఖరుని హత్యకు కారణ ముండితీరవలయును.

శాంత : ఈ విషయమును మీరు శ్రద్ధతో విచారించుఁడు. ఇఁక మీ కన్న నా కెవరుదిక్కు?

విజ : నిన్న జరిగిన విషయములన్నియు పునరాలోచించిన కొంతవఱకు సత్యము నూహింపఁగలము. మీరే యాలోచింపుడు.

శాంత : నాపుత్రుని హత్యగుఱించి నేనాలోచించుటలో ఒకవేళ అకాంక్షితముగా పక్షపాతము వహించిన వహింపవచ్చును: మీరు నిర్మల హృదయులు,న్యాయతత్పరులు, మీరె వివరింపుడు.

విజ : వేం మరణ్యమునకుఁ బోవునప్పటికి మనోరమయు తానును మాటలాడుచుండిరని మాధవవర్మయె చెప్పియుండెను.

శాంత : అవును !

విజ : వారిని చూచినంతనె మీ కుమారుఁడు 'చంపెద'నని కత్తి దూసి మాధవవర్మపైకి దూఁకెను.

శాంత : రాజశేఖరుఁడు గర్వాంధుఁడు; మాధవుఁడు అవమానము సహించువాఁడు కాఁడు. వారిరువు రెప్పుడైన కలహింతురని నేనెఱుంగుదును.

విజ : మాధవవర్మకూడ కత్తిపై చేయిపెట్టెను

శాంత : అట్టులనా! ఓరి కృతఘ్నుఁడా.

విజ : కాని, ప్రక్కన నుండిన నన్నుచూచి యూరకుండెను.

శాంత : మీరు లేనిసమయమునకు వేచియుండెను కాఁబోలు !

విజ : తర్వాత నే నింటికి వచ్చితిని. వా రిరువురు అరణ్యమందేయుండిరి. అట్టిస్థితిలో వారిని వదలి వచ్చుట అపాయకరమె; అయినను నాతల గొడ్డటితో చీల్చినట్లు నొప్పియెత్తుచుండెను; కొంతదూరము వచ్చి వెనుకకు తిరిగి చూచితిని. మాధవవర్మ ముందుకు వెనుకకు నడచుచుండెను.అతని చర్యలన్నియును చిత్తసంక్షోభమును దెలుపుచుండెను.

శాంత : చక్కగ కనిపెట్టితిరి. . చంపుదునా వద్దా యను వితర్కముతో వాఁడట్లు తిరుగుచుండెను కాఁబోలు! ఎంతటి దుర్మార్గుఁడు!

విజ : తరువాత - ఎట్లు ఊహించుటకును తోఁపకున్నది. రాజశేఖరుఁడు ఆత్మహత్య చేసికొని యుండవలయును.

శాంత : ఆత్మహత్య చేసికొనవలసినంత యవసరమేమి కలదు? అంతయు స్పష్టము! మాధవుఁడే వధించి యుండవలయును.

విజ : అదియు సంభవమె. అయినను నేనంత తొందరగ అభిప్రాయపడను.

శాంత : మీరు వానిపైఁగల యభిమానముచే వెనుకముందులాడుచున్నారు. నాకును వానిపై వాత్సల్యము కలదు. ఎట్టి దురవస్థ!

విజ : మీరట్లు తలఁపకుఁడు. నాకు ఆతని కన్నను రాజశేఖరుని కన్నను సత్యముపై నెక్కు డభిమానము. నాసోదరుఁడె యిట్టి హత్యగావించియుండిన నేను వానినివదలిపెట్టను కాని, మొదట సత్యము నెఱుంగవలయును.

శాంత : ఇప్పటికే యెఱింగితిమి.

విజ : మాధవవర్మ రాజశేఖరు నేల చంపవలయును?

శాంత : ఒడలెఱుఁగని కోపమువచ్చి చంపియుండును.

విజ : అంతమాత్రము చాలదు. మాధవవర్మయే మీ కుమారుని వధించెనని నిర్ణయించుకొందు మేని అందుకు నగాధమైన కారణ ముండవలయును.

అతఁడు మనోరమను రహస్యముగ వలచియుండవచ్చును; రాజశేఖరుఁడది యెఱింగి అతనిని మాటిమాటికి నిందించుచుండవచ్చును. ఆ యాటంకమును దొలఁగించుకొని మనోరమను పరిణయ మాడుట కీ వధకావించి యుండవచ్చును. ఇదియంతయు మన యూహ; సత్యము కాక పోవచ్చును.

శాంత : (చిత్తోద్వేగముతో) ఇంకను సందేహమేల? ఆదుర్మార్గుఁడే నా కుమారుని వధించెను. వాఁడు కడుపులో కన్నులు గలవాఁడు. ఎంత దూర మాలోచించెను! ఓరి మాధవా, యిందుకా నిన్ను కన్నకొడుకువలె సాఁకి సంతరించినది? పాముపిల్లకు పాలుపోసి పెంచుచుంటిని; తుట్టతుద కదియే నాకన్నులు పొడిచెను. అట్టి సౌజన్యము-అట్టి మొగము- రాక్షసహృదయమును దాఁచు మునుఁగులైన యెడల లోకములోని సుజనులందఱిని వధింపుఁడు; అట్టి మొగములను చెక్కివేయుఁడు. ప్రపంచమంతయు కపటనాటకము! మనసులో చంపునిచ్చ - మాటలలో తేనెతీపు! ఓరీ ఆతతాయి, స్వామిద్రోహి, కృతఘ్నుఁడా, నీవు బ్రతుకఁదగవు. నిన్ను శిక్షించి లోకమునకు మేలు చేసెదను. నీవు తగిన మరణదండన మనుభవింతువుగాక!

విజ : మీరు తొందర పడుచున్నారు; ఇంకను విచారింతము. రెండు దినము లాలసింపుఁడు.

శాంత : రెండు నిముసము లాలస్యమైన సహింపనోపను. కాలయాపనము నా మనోనిశ్చయమును సడలింపవచ్చును. - ఎవఁడురా అక్కడబంటు?

బంటు : ఆజ్ఞ.

శాంత : మాధవుఁడు వచ్చిన వెంటనే కారాగృహమునకు పంపింప వలయు ననియు ఎంతబ్రతిమాలినను నా దర్శన మిప్పింపఁ గూడదనియు, నా కుమారు నెచ్చట ఆక్రూరాత్ముఁడు వధించెనో అచ్చటనే వధ్యశిల నాటి వానిని ఖండింపవలయుననియు మామాటగా దండనాధికారికి తెలియఁ జేయుము. పొమ్ము.

బంటు : చిత్తం (నిష్క్రమించును.)

విజ : ఎంత కష్ట మెంతకష్టము!

శాంత : అయ్యో! రాజశేఖరా, నాకన్నులఁ గట్టుచున్నావు.

(దుఃఖించును.)

తెరజారును.

## స్థలము 8 : అంతఃపురము

(మనోరమ ముసుఁగుపెట్టుకొని పండుకొనియుండును తెరయెత్తఁబడును, యశోధర ప్రవేశించును)

యశోధర : (పడక ప్రక్కకుపోయి మనోరమపై చేయివైచి) అమ్మా లేచి కూర్చుండుము.

మనోరమ : (తల్లి మాటవిని లేచికూర్చుండును)

యశో : మనోరమ ప్రక్కనకూర్చుండి బుజ్జగించుచు) చిన్నితల్లీ కొంచెము పాలైనను పుచ్చుకొనుము; శోషవచ్చును.

మనో : అమ్మా, నీవుకూడ మాధవుఁడే వధించియుండు నని నమ్మెదవా?

యశో : అందఱును వాని మీఁదనే యనుమాన పడియున్నారు, ఎట్లు నమ్మవచ్చును? ఎట్లు నమ్మకపోవచ్చును?

మనో : మాధవుఁడింత ఘోరకృత్యమునకు తెగించియుండునని నేను నమ్మఁజాలను. నాయెదుటను విజయవర్మగారి యెదుటను అన్న నీచముగ పరాభవించినను రోషమునంతయు దిగమ్రింగి గాంభీర్యమూర్తియై నిలుచుండిన శాంతచిత్తుఁడు 'తండ్రికి మరణ పర్యంతము ఋణపడియున్నా'నని చెప్పిన కృతజ్ఞుఁడు అన్నను వధించియుండునా? కలలోని వార్త! అమ్మా, నాకదేలనో విజయవర్మ గారిపై ననుమానము వొడముచున్నది. వనమున మాధవునిపై విషయ పూరితమైన క్రూరదృష్టిని ప్రసరింపఁజేసెను. ఆచూపు ఇప్పటికిని నామనమున నంకితమైయున్నది.

యశో : మాధవునిపై ఆయన కేమి కంటగింపు?

మనో : మాకు పరస్పరానురాగము గలదని గ్రహించియుండును.

యశో : ఆయనంత దుఃస్వభావుఁడుగ నగపడుటలేదు. మాధవునిపై విజయవర్మగారికి మొట్టమొదట అనుమానమె కలుగలేదఁట! కాని , అప్పటి సందర్భములను ఆలోచింపఁగా నిజము మీతండ్రిగారికే తోఁచినదఁట! ఒక విజయవర్మగారేమి? అందఱును మాధవుని సందేహించుచున్నారు. నిజము దేవుని కెఱుక. --- మాధవా, నాకడుపు నిట్లు నేలపాలు చేసితివా?

(దుఃఖించును)

మనో : అయ్యో! అమ్మకూడ నమ్ముచున్నది! అందఱును నమ్ముచున్నారు. ఇందఱు

నమ్మనది సత్యము కాకయుండునా? మాధవా, నీవు నరహంతకుఁడవా? నీ చేతులు మాయన్న నెత్తుటిలో తడిసి శీతలసుకుమార స్పర్శను గోల్పోయి రాక్షసము లైనవా?

*లలిత పల్లవ పేశలంబైన హృదయంబు*
*అన్న హత్యకు నెట్టులానగొనియె?*
*దీనరక్షా దీక్షనూని చేపట్టిన*
*కత్తి కీదుర్గతి కామ్యమగునె?*
*అత్యంత దుఃఖంబు నపనయించి సహించు*
*ధీరత్వమెయ్యెడ పూరిమేసె ?*
*నిను సాఁకి సంతరించిన వృద్ధజనకుని*
*కిదియె కృతజ్ఞతాస్పద సమర్చ?*

*వలపువెన్నెల చిలుకు నీ కలికినుదుట*
*ఆతతాయి యటన్న రక్తాక్షరములు*
*ప్రజ్వరిల్లునె? యెంతటి పాతకంబు*
*నకుఁగడంగితి వీవు? మన్ననయుఁ గలదె?*

ప్రియసఖుఁడా, మనకు మరణపర్యంతము వియోగము !

యశో : అమ్మా, మాధవునకు మరణదండనముకూడ విధింపబడినదఁట

మనో : (దుఃఖముతో) ఏమీ! మరణదండనమా? హృదయేశ్వరా, నా హృదయము నాకిచ్చిపొమ్ము. నీతోడ నరకమునకు తీసికొని పోకుము. (తల్లియొడిలో నొరగి దుఃఖించును)

యశో : చిట్టితల్లీ, యూరడిల్లుము. పుత్రశోకముతో వకావకలైన నా హృదయమును మఱింత కలఁచఁబోకుము.

మనో : అమ్మా మాధవుని వధించుటవలన అన్న బ్రతికివచ్చునా? ఏ పరదేశమునందైన అతనిని ప్రాణముతోనుండనీయరాదా? మాధవా,

*పెండ్లిమంటపమునఁ బ్రియముతో నాచేతి*
*పూలమాల తొడవు పొందనున్న*
*నీదు కంఠమిపుడు నిర్దయమౌ గంండ్ర*
*గొడ్డటికి బలియయి గోడుపడునె!*

అమ్మా, యిఁక నన్నేమి చేసెదవు?

(తల్లి, యొడిలో ఒరగి దుఃఖించును.)

యశో : తల్లీ, యూరడిల్లుము. అనివార్యదుఃఖ మనుభవించియే తీరవలయును.

మనో : మాధవా, అమూల్యమైన నీ రక్తము వధ్యశిలను పునీతము చేయనున్నదా?

*ఎచ్చట నెత్రుటొల్కి ప్రవహించునొ యయ్యెడలన్ గులాబిపూ*
*ల్విచ్చుత! కమ్మతావులటు వీచుతనీస్మృతి! తోఁటదాసినై*
*పుచ్చెదఁగాలముం గనులబుంగలఁబాదులనీరుపోయుచున్!*
*అచ్చపు నాదు జీవితపు హారతి నెత్తెద నీ సమర్చకున్*

(తెరపడును.)



## స్థలము 9 : కారాగృహము

(వెలుతురు తక్కువగ నుండును. మాధవుఁడు ఉద్రిక్త చిత్తుఁడై యటునిటు తిరుగుచుండును.)

మాధవుఁడు : నన్నేల వీ రీ యంధకార కారాగారమున బంధించిరి? నే నేమి యపరాధ మొనరించితిని? రాజశేఖరుని దుర్మరణమునకు నేను కారకుఁడనని యనుమానపడిరా? ఎంత అన్యాయము? బాల్యము నుండి నా స్వభావము నెఱింగిన శాంతవర్మయ నన్ను సందేహించెనా? పుత్రశోకమున మతిచెడి సత్యాసత్య వివేక శూన్యుఁడయి తన క్రోధమునకు నన్ను బలి యీయ నెంచెనా? లేక యిది యంతయు విజయవర్మ కపట కృత్యమైయుండునా? ఆతఁడు నా పుట్టుమచ్చ సంగతి విని సంక్షుబ్ధచిత్తుఁడాయెను? నాజన్మ రహస్యము విజయవర్మ యెఱుంగునా? --- అదియెట్లు సంభవించును? శాంతవర్మయె పొరపడియుండును. నా పక్షమూను వా రెవ్వరు? కృతఘ్నుఁడు, ఆతతాయి అను పాపకళంకమును వహించి నిరయసదృశమైన ఈ కారాగారమున మరణపర్యంతము క్రుళ్ళవలయునా ? అబ్బా!.......... మనోరమ యేమనుకొనుచున్నదో! భ్రాతృహంతనని నన్ను దూషించుచున్నదికాబోలు! ఘోరవిధీ, నేను నీ యజ్ఞపశువునా?

(నేపథ్యమున గంటలు వినఁబడును)

(ఆలకించి) నిశ్శబ్దయామినీ గభీరతను భంగించు అశుభ సూచక కఠోర కంఠస్వరముతో ఆగంట "అవును అవును" 'అనిమ్రోగుచున్నది!. (ఆలకించి) అదిగో! తలుపులో తాళపుచెవి తిరుగుచున్న ఘర్ఘరధ్వని వినఁబడుచున్నది. నన్ను వధ్యశిలయొద్దకు తీసికొనిపోవ రాజభటులు వచ్చుచున్నారు కాఁబోలు!

(విజయవర్మ ప్రవేశించును)

మాధ : (సంక్షుబ్ధచిత్తుఁడయి) నీవా నన్ను వధింపవచ్చినది? (విజయవర్మ రెండు చేతులు గట్టిగ పట్టుకొనును)

విజ : మిత్రమా, శాంతింపుము. నిన్ను బంధవిముక్తుని చేయవచ్చితిని.

మాధ : (చేతులు వదలి పెట్టి) అటులనా? మన్నింపుడు. మన్నింపుడు; తప్ప దలఁచితిని. మీరొక్కరే నాకు పరమమిత్రులు. సత్యైక పక్షపాతులు, నా నిరప రాధిత్వమును దెలిసికొని నన్ను విడిపింపవచ్చితిరా? శాంత వర్మగారి సందేహము తీఱినదా?

నిజమెన్నటికైన దాఁగదు; విడిపింపుఁడు, విడిపింపుఁడు. ఇంక నొక్క నిమిషమైనను ఆత్మనాశనమైన యీ కారాగార దుర్గంధవాయువును పీల్చుకొనఁజాలను.

విజ : కరుఁణాపాత్రుఁడా, నీకు మరణదండనముకూడ విధింపఁబడినది.

మాధ : (నిర్విణ్ణుఁడైచూచి మరల నుద్రిక్తచిత్తముతో) ఏమీ? నాకు మరణ దండనమా! నన్ను విచారింపకయె శిక్ష విధించితిరా? ఇది దండనము కాదు; కుట్ర - హత్య - నరబలి. ధర్మశాస్త్రములు బలవంతుల దౌర్జన్యమున కుపపత్తి కల్పించుటకే వ్రాయఁబడెను కాఁబోలు. మానవసంఘ మంతయు ప్రహసనము. (ఆలోచనాబద్ధ చిత్తుఁడయి క్రిందిచూపుతో అటునిటు తిరుగుచు) నేను ఆతతాయిని! ప్రళయంకరజ్వాలోద్గారి భూకంపము ఒక్కపెట్టున ఈ దుష్టప్రపంచమును కబళించునుగాత!....

నిశ్చయముగ నే నపరాధినని రూఢమైనదా? నీవాజ్ఞను నిర్వహింపవచ్చితివా?

విజ : మిత్రమా, శాంతిల్లుము. నీకు తోడ్పడవచ్చితిని.

మాధ : శాంతి ! శాంతి ! ఎక్కడి శాంతి ? కటిక వాని గండ్రగొడ్డలిని నిరపరాధుని కంఠముపై పెట్టి శాంతి బోధించుచున్నావు.

*కఱకుటమ్ముల మేను గాఱింపబడిన కే*
*సరికి శాంతము నేర్పజాలుదేని,*
*జ్వాలాప్రచండమై జ్వలియించు దవవహ్ని*
*కోరిమి శిక్షింప నోపుదేని,*
*భిన్నోన్ముఖంబైన భీకరాగ్ని గిరీంద్ర*
*మునకు వాకట్టంగ బూనుదేని,*
*ఝుంఝూమరుద్భిన్న సాగరోర్మికలకు*
*మహిత సంక్షోభంబు మాన్పుదేని*

*నాకు - నిరపరాధునకు - వినష్టమధుర*
*జీవితాశునకు - వ్యథావిశీర్ణమతికి -*
*మృత్యుభావనోన్మత్తున - కింక నీవు*
*శాంతి శాస్త్రంబు బోధింపజాలుదేమొ !*

విజ : మాధవా, బహుభాషలకు సమయము కాదు. ప్రతి నిమిషము నీ ఆయువును హరించుచున్నది. నీ హితము కోరియుండని యెడల అర్ధరాత్రమున నేనేల రహస్యముగ ఈ కారాగృహమునకు వత్తును ?

మాధ : (ఆశ్చర్యముతో) రహస్యముగనా ! మీ మాటలు నా కర్థమగుటలేదు!

విజ : బేలవు ! రేపు నీ మరణ దండనము నిర్వహింపబడును. నేనేమి సాహాయ్య మొనరించినను ఈ రాత్రియే యొనర్పవలయును. ఒక అశ్వమును, కొంత ద్రవ్యమును ఆయత్తపఱచి యున్నాను. తప్పించుకొని వెడలిపొమ్ము. ఎచ్చటనైన పరదేశమున బ్రతుకవచ్చును. ఎంతటి అవివేకియైనను ఇట్టి యనుకూల సమయమును వ్యర్థపుచ్చడు. రమ్ము, రమ్ము. (చేయిపట్టుకొని లాగికొని పోబోవును)

మాధ : (చేపట్టు వదలించుకొని) ఏమి ? నేను దొంగవలె పాఱిపోవలయునా?

ఆతతాయి యన్న యంక మామరణంబు
చాకివాని ఖరము సాటిమోసి
భారభూతమైన బ్రతుకు సంరక్షింప
యశముకన్న బ్రాణమంత తీపె ?

విజ : తొందరపడుము ; కానిమ్ము, కానిమ్ము, వెనుకముందు లాడకుము. నీ ప్రాణము - తరుణము.

మాధ : నా నిరపరాధిత్వమును మీరు శంకించుచున్నారా ?

విజ : (విసుగుతో) వ్యర్థప్రసంగము - వెడలుము. నీకు జీవితము పైన ఆసయున్నట్లులేదు.

మాధ : నన్ను మీరు కనికరించి తప్పింపవచ్చితిరా ? మీ సదుద్దేశమునకు కృతజ్ఞుడను కాని, మీ సాహాయ్యము నంగీకరింపజాలను. సర్వసాక్షియైన భగవంతుడొకడు కలడు. ఆ కరుణామయుడు నన్నిట్లు నిస్సహాయునిగ వదలి పెట్టడు.

విజ : ఓరీ బాలిశుడా ! పరస్పర కబళనోద్యత ప్రాణిసంకులమైన యీ ప్రపంచము. నిశ్చేత సాంధకారశక్తి ప్రేరిత భూతప్రళయ నాట్యరంగమైన యీ ప్రపంచము - కరుణామయుని సృష్టియనుట కల్ల, అవివేకము,

మాధ : నీవు కలిపురుషుడవు.

విజ : కానిమ్ము, ఆ పురాణపురుషుడే నా మూలమున నీకు తోడ్పడనున్నాడు. అందు కేమందువు?

మాధ : సర్వశక్తి సంపన్నుడైన నియంత యిట్టి నీచకృత్యమునకు పురికొల్పడు. ఆ కరుణామయుని సందేశ మెప్పుడును వంచనాకృతితో పొడకట్టదు. మీరు హితశత్రువులు ; వెడలిపొండు, నా మనోనిశ్చయమును భేదింపకుడు.

విజ : (కరుణామయముగ) మాధవా, ఎంత పొరపడుచున్నావు ! నూరేండ్లు బ్రతికిన వృద్ధుడైనను మరణించుట కిష్టపడడు. అయ్యో! నీవు యువకుడవు. మధురమైన ప్రాపంచిక సౌఖ్యముల రుచిచూచి యెఱుగవు. నీవెంత కాలము బ్రతుకవలయునో, ఎన్ని సౌఖ్యము లనుభవింపవలయునో ఎంత సంతానమును పడయవలయునో యెవరెఱుంగుదురు ? ఎట్టి నికృష్టుని కైనను బ్రదుకు తీపుగదా ! నీకేల యింత వైరాగ్యము ? నీవు నిరపరాధుడవు. వెనుక నైనను శాంతవర్మగారు పశ్చాత్తప్తులు కాగలరు. నీవు బ్రతికియుండిన పొరపాటు దిద్దికొనవచ్చును. ఎంత పశ్చాత్తాపమైనను మరణించిన నిన్ను పునర్జీవుని కావింపనేరదు. (భుజముపై చేయివేసి) నా మాటవినుము.

మాధ : (స్వగతము) ఇదియు సమంజసముగ నేయున్నది. నిరపరాధుడనని తెలిసియు నేనేల బ్రతుకగూడదు ? ఇతరుల యవివేకమునకు నేనేల బలికావలయును? ఎట్లయినను లోకము నన్ను సందేహించును. (ప్రకాశముగ) నేనుతప్పించుకొని పాఱిపోయిన లోకులేమందురు ? హత్య చేయకుండిన ఇంత రహస్యముగ నేల పలాయనము కావలయునని సందేహింపరా ? ఇంకను నొక్కదినము కలదు. అంతలో సత్యము తెలియవచ్చును.

విజ : నిన్నాదరింపని లోకులతో నీకేమిపని ? లోకులు కాకులు - జీవితము నీయది. చేతిలోని నీటిని దిగవిడచి మబ్బులోని నీటి కాసించుచున్నావు. ఒక వేళ మనోరమయె........

మాధ : ఆ పావనహృదయనామము నిచ్చోట వచింపకుడు. ఆ పేరునకు గూడ కల్మషమంటుకొనును.

విజ : ఆ కాంతయే నిన్ను తప్పించుకొని పొమ్మని చెప్పునెడల ?

మాధ : అట్లెన్నటికిని చెప్పదు. నేను నరహంతకుడనని ఆ కాంతనమ్మదు ; ముమ్మాటికి నమ్మదు.

విజ : (విషపునవ్వుతో) నమ్మదు, నమ్మదు. ఆడువారు చక్కెర పూత విష ఘుటికెలు; మూఢులు రసాయనమని నమ్మి సేవింతురు. ప్రేమ యవివేకుల స్వర్గము! కొనుటకును అమ్ముటకును వీలైన అంగడివస్తువు ! శృంగార వతులు కాముకుల గంతగాడిదలజేసి అనురాగ సంభారము మోయింతురు! భ్రాంతినుండి మేల్కొనుము. ఎన్నిమణుగుల ప్రేమయైనను, ఎందఱు ప్రియురాండ్రయినను నీ జీవితమునకు సరిరారు. ఇవన్నియు జీవితము కొఱకె.........

మాధ : (కోపముతో) నీ నిర్హేతుక దూషణము స్త్రీజాతి కంతటికి నాపాదించినను విశేషముగ మనోరమ కన్వయించునట్లు ధ్వనించుచున్నది. నిరూపింపకున్న నిన్ను ప్రాణములతో వదలను. (భుజముపట్టుకొనును.)

విజ : (నిర్లక్ష్యముగ) మాధవా, నీవింకను బాలుడవు. వేచియుండుము, స్వానుభవమె బోధించును.

మాధ : నీవు వంచకుండవు. నాకు దృష్టాంతము కావలయును.

విజ : (చిఱు నవ్వుతో) లేనియెడల ?

మాధ : నీవు క్రక్కిన విషమును నీ నోటనే తినిపించెదను.

విజ : శెభాష్, మాధవా శెభాష్ (నవ్వును)

మాధ : నీ నవ్వుచాలించి నా కానవాలు చూపుము.

విజ : చూపెదను. ఉండుము (జేబిలో వెదకుచు కనబడని యట్లు నటించి) ఆహా : యెక్కడనో జాఱిపడిపోయినది !

మాధ : పరనిందాపాతకుడా, నీ టక్కులు కట్టిపెట్టుము. నీదూషణము నుపసంహరించుకొనుము.

విజ : (మరల వెదకుచు) కొంచెము నిదానించుము. ఆ ! దొరకినది. ఆనవాలు.......

(మాధవుని చేతికి జాబు నిచ్చును)

మాధ : (ఆతురతతో విప్పిచదువుచు) ముసుగులో అక్షరములు స్పష్టముగ నగపడుటలేదు. మహారాజశ్రీ - విజయవర్మగారికి - మనోరమ విన్నపము - కారణాంతరములచేత.....'

విజ : ఆయుత్తరముకాదు.(మాధవునిచేతిలోనుండి తీసికొనబోవును. మాధవుడియ్యక దానిని చదువబోవును) అది ప్రేమలేఖ సుమా, నీవు చదువకూడదు.

మాధ : మనోరమ యక్షరములవలె నున్నవి !

విజ : అన్యుల ప్రణయలేఖను చదువుట మర్యాదకాదు. (తీసికొనబోవును)

మాధ : (ఉత్తరము విజయవర్మ కియ్యక కొంచెము ప్రక్కకు పోయిచదువును) ... కారణాంతరముల చేత నామనను మాఱినందున మిమ్ముల్ లనే వివాహమాడెదను.

(చేతిలో జాబును ఉండగ నలుపును. నలుపుచుండగా జాబు అజ్ఞాతముగ క్రిందపడును. మాధవుడు కన్నులు పచ్చగ పోవుచున్న వానివలె, చెక్కిళ్ళు రెండు చేతులమధ్య ఇరికించుకొని కూర్చుండును.)

విజ : (ఆ జాబుతీసికొని సరిపఱచిచూచుచు) ఇది దొంగజాబుకాదు! అక్షరముల నానవాలు పట్టితివా ? స్త్రీలు విశ్వాసపాత్రలు - ప్రాణపదములు - వారి వాగ్దానములు శిలాక్షరములు.

మాధ : నేనే మందమతిని.

విజ : కాదు, ప్రేమ సంభారము మోయుచున్న గాడిదవు.

విజ : వంచింపబడితిని.

విజ : ఆడింపబడితివి.

మాధ : (స్వగతము ) ఈ జాబు నిక్కువమా, కల్పితమా ? మనోరమ అక్షరములవలె నున్నవి. భ్రాతృహంతకుడనని ఆ కాంత నన్ను పరిత్యజించెను కాబోలు (లేచి, ప్రకాశముగ) ఒక్కనిమిషమైన మనోరమతో మాటలాడ సెలవిచ్చెదరా ?

విజ : ఆ కాంత నీ మొగము చూచుటకైన నిష్టపడదు.

మాధ : (హఠాత్తుగ పిచ్చివానివలె) నీవు మనోరమను పెండ్లియాడెదవా ? (విజయవర్మ పైకిరేగి రెండుచేతులతో గొంతుపట్టుకొని కుదిలించును.)

విజ : (కష్టముతో తప్పించుకొని, మెడ తడవుకొనుచు స్వగతము) ఈ దరిద్రుని చేతిలో నెంతబలమున్నది !

మాధ : (శక్తి తరగిన వానివలె బెంచిపై కూలపడును)

విజ : (స్వగతము) వీడు వెడలునట్లు లేదు. నన్నెవరైన చూచిన నా యత్నమంతయు నిరుపయుక్తమగును. పాప ! మీ పిచ్చివాడు అది మనోరమ జాబనియే నమ్మెను ! (ప్రకాశముగ) కడపటి మాట - వెడలెదవా, లేదా ?

మాధ : పొమ్ము, పొమ్ము, నన్నొంటరిగ వదలిపెట్టుము.

విజ : చావుము, చావుము. ప్రజ్వలించుచున్న చితి వేయి నాలుకలతో నీకై నిరీక్షించుచున్నది. (నిష్క్రమించును)

మాధ : ఇంక నే నెవరి కొఱకు బ్రతుకవలయును ? తల్లి శీతలకరుణా కటాక్షముల యాదరింపు నే నెఱుగను. తండ్రియుత్సంగ సౌఖ్యము కఱవయ్యెను ; బంధువులు లేరు ; స్నేహితులు లేరు ; ఏకాకిని. నన్ను ప్రాణ పదముగ ప్రేమించు మనోరమయు ద్వేషించెను. జీవించుట నరకమైన యెడల చావు తప్పించుకొనుట యవివేకము. మనోరమ యిప్పటికిని నా హృదయముపై అధికారము చేయుచున్నది. ప్రేయసీ, భ్రాతృహంత నని నీవు నన్ను పరిత్యజించినను నేను నిన్ను ద్వేషింపజాలను. స్వప్నమందైన మరల నిన్ను చూడగలనా ? ఎంత మంద భాగ్యుడను? నిదుర యుండినగదా స్వప్నము!

గున్న మావిచిగుళ్ల కోమలత్వము గేరు
నంగుళిస్పర్శల యమృతరసము,
అరవిచ్చు సెలవుల నంకురించియు సిగ్గు
తెరగప్పు చిఱునవ్వు తేనె తెరలు,
అత్యంత శోక శుష్కాంతరంగము దేర్చు
క్రేగంటి చూపుల ప్రేమమదిర,
సరస సల్లాప చేష్టాభీష్ట గోష్ఠుల
గొన్నట్టి స్మృతి పాయసాన్న భిక్ష,

అన్నియుంగూడి పరలోక యాత్రయందు
దారి బత్తెంపు కొఱతను దలగజేయ,
నీ మనోహరమూర్తి నిర్నిద్రకాంతి
కాగడావేయ నిశ్చింత గదలువాడ.

(నేపథ్యమున కోడికూత వినబడును)

(ఆలకించి) అదిగో ! కోడికూత వినబడుచున్నది. వేగుజామయ్యెను కాబోలు. కాలమా. యెంత నిర్దయగ నెగిరిపోవుచున్నావు? ఇక నొక్కదినము - ఒక్కదినము ! (మహోద్వేగముతో) తరువాత - వధ - వధ - నరబలి - నరబలి -

తెరపడును

# స్థలము 10 : విజయవర్మ స్వగృహము

(మాలతీదేవి కూర్చుండియుండును; చెలికత్తెయగు రజని నెమిలికన్నుల విసనకఱ్ఱతో విసరుచుండగా తెరయెత్త బడును.)

మాలతీదేవి : రజనీ, మా పినతండ్రిగారు పరివారమును పంపివేసిరట కదా ? వారముదినములలో నింటికి వత్తురని వింటిని.

రజని : వారము దినాలే పడుతుందో నెలదినాలే పడుతుందో మనకెలా తెలుస్తుంది?

మాల : వారినడిగి నీవేమైన సంగతులు తెలిసికొంటివా ?

రజ : దొరగారు పెండ్లిచేసుకొనిగాని రారట !

మాల : (ఆశ్చర్యముతో) ఏమీ ? పెండ్లియా ? ఎప్పుడు ? ఎవరుచెప్పిరి ?

రజ : నే విన్నాను.

మాల : పెండ్లికార్యముకూడ నింతరహస్యముగ జరుగవలయునా ? ఇంకేమైన సంగతులు గలవా ?

రజ : పరివారం వచ్చినతోటే పాతాళగృహం దగ్గిర తలుపులు తీసినట్లు సందడైందట.

మాల : ఇంకొక రహస్యము కాబోలు ! రజనీ, ఆ ద్వారపాలకుని దగ్గఱ మెల్లగా ఆ సంగతి తెలిసికొనివచ్చెదవా ?

రజ : వాడు ఆతి గుండెగలమనిషి. అయినా పోయివస్తా.

మాల : పొమ్ము, ఎట్లయిన తెలిసికొనిరమ్ము.

రజ : (నిష్క్రమించును)

మాల : నా కనుమానము తట్టుచున్నది. ఎవనినో పట్టితెచ్చియచ్చట బంధించి యుండవలయును. మా పినతండ్రి యెవ్వని సంసారమున కెసరుపెట్టెనో గదా ! ఆ క్రూరకర్ముని పినతండ్రియనుటకు నాకు సిగ్గగుచున్నది.

తాను పెండ్లియాడిన వెంటనే నన్నే పాళెగానికో యిచ్చి యిల్లు వెడలించును. నామేలు కోరువారెవ్వరు ? తల్లిదండ్రులులేని బిడ్డలగతి యిట్టిదేకదా !

రాజ్యతృష్ణచే మా తండ్రిని రహస్యముగ చంపించిన యాపాపాత్ముని చూచినప్పుడు దుఃఖమును దిగమ్రింగి కొనుట యసాధ్యముగ నున్నది. ఎప్పుడెప్పుడీ హంతకుని మొగము

చూడక తప్పించుకొందునా యని వేయి దేవుళ్లకు మ్రొక్కుచుందును. నాకోర్కె యింకను ఫలింపలేదు.

మా తండ్రి యెక్కుచుండిన గద్దియపై అతడు సుఖాసీనుడై యుండగాంచి నా హృదయము పెనములో వేగినట్లు ఆవిళ్ళు గ్రక్కుచుండును. మా తల్లి ఆ దుఃఖముతో మంచము పట్టి నవసినవసి మరణించినది. ఆడువారి గోడు తప్పక తగులునందురు ! ఆ పరమ పతివ్రత శాపమెప్పుడు ఈ కుటిలాత్ముని ధ్వంసము చేయును; మాయన్నయైన బ్రతికియుండరాదా?

(రజని ప్రవేశించును)

మాల : తెలిసికొని వచ్చితివా ?

రజ : ఎవరో రాజపుత్రుడివలె వున్నాడు.

మాల : (ఆశ్చర్యముతో) రాజపుత్రుడా ? పాపము! రజనీ, రమ్ము ; నీవొకపని చేయవలయును. (ఇరువురు నిష్క్రమింతురు)



## స్థలము 11 : పాతాళ గృహము.

(లోన కొంచెము చీకటిగనుండును. రాజశేఖర వర్మ బెంచిపై కూర్చుండియుండును. ద్వారపాలకుడైన లతీఫ్‌సాహెబు రాజశేఖరునికి కనబడక ప్రక్కనుండును)

రాజశేఖరుడు : (అటునిటు తిరుగుచు) ఎవడురా , యిక్కడ పరిచారకుడు ? ఎంత అరచినను ఒక్క తొత్తుకొడుకైన హెచ్చరించుకొనడు. ఓరీ, ఎవడురా అక్కడ? (పలుకరు) వీరెవ్వరో పశుప్రాయులు. మట్టుమర్యాద లెఱుగని మూర్ఖులు.

లతీఫ్‌సాహెబు : అరె ! ఎవఁడ్రా యీ మణ్సి ? చెవుకోసిన మేకాలాగా పుకార్‌చేస్తాడ్. బందెఖానాలోగూడా పరిశారకుళ్ళూ పట్టుదిళ్ళూ కావాలావుంది.

రాజ : మా దివాణమందేయైన నొకొక్క పరిచారకుని గుఱ్ఱపు కమిచీతో పట్టలు రేగ గొట్టియుందును.

లతీ : దౌలత్ సూస్కుంతే రాజాకి బేటాలాగానే వుండ్యాడ్.

రాజ : (గాలి యాఘ్రాణించి మొగము చిట్లించుకొని) ఛీ,ఛీ ఎక్కడపట్టినను దుర్గంధము; దుమ్ము దుమారము ; కిచకిచమని గబ్బిళముల వాగ్వాదములు. వీరికిల్లు చిమ్ముటకైన నౌకరు లేడు కాబోలు. మెత్తలు కుట్టిన సోఫా యొక్కటియైన లేదు. తుదకొక్క మేజాబల్లయైనను కుర్చీయైన నుండకూడదా?

లతీ : (నవ్వుచు) పడకటిల్లు అనుకొన్నాడ్ లాగావుంది.

రాజ : (బెంచిపైన కూర్చుండి మట్టియైన చేతులు చూచుకొని లేచి చొక్కా వెనుకతట్టు మట్టిమఱక చూచుకొని) అబ్బే ! నా గుడ్డలన్నియు మలినమైనవి. నన్నీ యింట దింపిన పెద్దమనుష్యునికి బుద్ధి చెప్పించెదను. నేను రాజపుత్రుడనని యెఱుగక యిట్టి నికృష్టమైన విడిది యేర్పఱచి యుందురు.

లతీ : అరెతోబా ! ఈ యద్మీయింకా అదే లోకంలో వుండ్యాడ్ ! బందెఖానా ఆయా, యిది బందెఖానా - పిచ్చివయా.

రాజ : ఎచ్చటనో మాటయలుకుడు వినవచ్చుచున్నది. ఎవడురా అక్కడ ? ఈ యింటి యజమానుడెక్కడకు పోయెను. నన్ను పస్తుపెట్టదలంచెనా యేమి? ఏమి మొఱకు దనము! నాకిష్టమైన తినుబండములనైన అడిగి తెలిసికొనుటకు వంటవాడింకను రాడు.

లతీ : తినుబండాలూ - వంటవాడు వస్తాడ్ వస్తాడ్ ! సజ్జరొట్టె పప్పుపుల్సు తెస్తాడ్ ! అరె దివానా ఆద్మి !

రాజ : ఉక్కపుట్టి చెమట కాఱుచున్నది. సురటివేయు నౌకరియైనలేడు. ఈ రాత్రి గడచుటయె దుర్భరముగ నున్నది.

లతీ : ఒంటి స్తంబం మేడా మెవుండి గాలీ భోజనం చేస్తావుంద్యాడ్ లాగా అనుకొంటుంద్యాడ్ ! లస్తర్లు, పట్టె మంచాలు, పరుపుదిండ్లూ, బోగంపిల్లా, బొమ్మాయిపిట్టా కావాల్నా శెప్పండి సర్కార్, తెప్పిస్తాన్. (నవ్వును)

రాజ : ఇచ్చట నెవ్వరును కాపురముండునట్లు కనిపించదు. నాకేదియో సందేహము పుట్టుచున్నది. దయ్యమునోటినుండి బ్రహ్మరక్షస్సు ఒడిలో పడితినా ? ఈ మూల మెట్లగపడుచున్నది. ఎక్కడికి పోవునో చూచెదను. (పోబోయి వెనుకకుతగ్గి) అంధకార కూపమువలెనున్నది.

ఎంత వితర్కించినను నాకేమియు దోచకున్నది. నన్ను గట్టి తెచ్చిన వారును వారినుండి తప్పించి నన్నిచ్చటికి గొనివచ్చి రేపుప్రొద్దుననే మా పట్టణమునకు పంపెదమని చెప్పిన కపటాత్ములును ఒక్క గూడెము వారేయై యుందురా? తలంచుకొలది నా స్థితి భయంకరమగుచున్నది. మా తల్లిదండ్రులెట్లు దుఃఖించుచున్నారో గదా ? నన్ను వారెట్లు కనుగొని తప్పింపగలరు ?

(నాలుగు మూలలు తిరిగిచూచి బెంచిపై కూర్చుండును)

తప్పించుకొని పోవుటకు దారిలేదు. (ఆలోచనా నిమగ్నుడైయుండును)

మాలతీ : మాకీబలే దాహం చేస్తావుంది. రజనీ పోసిన సారాయి కొంచెం మజాపట్టిస్తాన్ (ప్రక్కన కూర్చుండి కూజాలోని సారాయిత్రాగును) జమ్‌జమా మజాబలారే! రజనీకి నామీదా భలే యిష్వాసం వుంది. (క్రైపెక్కినట్లు నటించుచు) రజనీ ! క్యామజా ! క్యాతమాషా, సార్గం పాతాహళం నరకం పాపం, పుణ్యం, సబ్ దీంట్లోనే వుండాయ్. యిద్యా, బుద్ధి, గొడ్డుగోదా, యిల్లూవాకిలి, పిల్లా పిసుగు, అంతా దరోబస్తీ దీంట్లోనే గుటగుటా గుటగుటా మున్గిపోతుందిబే, అరరే యే క్యారే - నాకళ్ళు నట్టందాని పావడాలాగా గిర్గిరా గిర్గిరా - (పడిపోవును)

రాజ : అన్నియు కఠిన శిలా నిర్మితములైన కుడ్యములు. నా జీవితాశ శిథిలమగుచున్నది.

(మెట్లపైనుండి అవగుంఠనము వైచికొన్న మాలతియు, దీపము పట్టుకొని రజనియు ప్రవేశింతురు)

రాజ : (స్వగతము) ఎవ్వతె యీ నారీమణి ? నాభాగ్యదేవతవలె ప్రసన్నమైనది!

మాలతి : (స్వగతము) ఎవడో సుందరుడైన రాజపుత్రుడు.

రజని : నేను మెట్ల తలుపుదగ్గఱ వుంటాను. (నిష్క్రమించును)

రాజ : కాంతా, నీవు స్వర్గమునుండి నరకలోకమున జాఱిపడిన యచ్చర పూవుబోణివా?

మాల : మీ రెవ్వరు ?

రాజ : ఇదియేమి వింత ? కాలుసేతులుకట్టి తెప్పించినవారికి నన్నేల తెలియదు?

మాల : మీ దేపట్టణము ?

రాజ : ఇదియేమి మాయలాడితనము ? కాంతా, యిట్టి స్వయం వరములుకూడ లోకమున నుండునా ?

*ఓర చూపుల, మాటల, నొప్పిదముల,*
*నడల, యొయ్యారముల, ప్రేమనాటకముల*
*మగల వలపింత్రు మగువలు ; మడతి, వరుని*
*చాపకట్టుగ దెచ్చిన జాణవీవె !*

మాల : (నవ్వుకొని స్వగతము) పాప మీ రాకొమారుడు పొరపడెను. (ప్రకాశముగ) మిమ్ము తెప్పించిన వారితరులు ; మీకు సాహాయ్యము చేయుతలంపుతో నే నిచ్చటకు వచ్చితిని.

రాజ : (ఆశ్చర్యముతో) అటులనా ! కాంతా, నాయధిక ప్రసంగమును మన్నింపుము.

మాల : (చిఱునవ్వుతో) ఒకొక్కప్పుడు అధికప్రసంగముకూడ ఇంపుగనే యుండును.

రాజ : నేనెప్పుడును నీవంటి యువతీమణిని చూచి యెఱుగను ; సౌందర్య సౌజన్యముల కింతటి పొత్తుకుదిరియుండుట యరుదు.

*ఆరిపోయెడు దివ్వెకు నాజ్యమటుల*
*నీ కటాక్షము ప్రాణేచ్ఛ నింపెమదిని ;*
*నీ మనోజ్ఞత యీ పొగగీమె కాదు*
*నా మనంబును వెలిగించె హేమగాత్రి.*

మాల : (స్వగతము) మా పినతండ్రి దుష్కార్య మింకొక విధముగ వరప్రసాదియయ్యెను. ఈ సుందరాంగుని చూచి నప్పటినుండియు నామనము నావశము కాకయున్నది. (ప్రకాశముగ) రాజకన్యక లిట్లు వరపురుషులతో మంతనములాడుచుండుట యుచితముకాదు. మీరెవ్వరైనదియు తెలియక నేనెట్లు తోడ్పడగలను ?

రాజ : లతాంగీ, నేను వసంతపురము నేలు శాంతవర్మగారి కుమారుడను.

మాల : (ఆశ్చర్యముతో) శాంతవర్మగారి కుమారుడవా ?

రాజ : ఏల యట్లు వెఱగుపడితివి ? మా తండ్రిని నీవెట్లెఱుగుదువు ?

మాల : ఎఱుగను, ఎప్పుడో ఆ పేరు వింటిని.

రాజ : (స్వగతము) నేనింతకుముందు గమనింపలేదు. మాధవుని మొగము పోలికలు ఈ కాంత కున్నట్లు తోచుచున్నది.

మాల : మీకు సోదరియున్నదా ?

రాజ : ఉన్నది. ఏల ?

మాల : ఆమెకు వివాహమైనదా ?

రాజ : ఇంకను కాలేదు. విజయవర్మయను నొక జమీన్దారుని కియ్యవలయునని నాయనగారి కోరిక ; ఆ సంబంధము నాకిష్టములేదు. మా తల్లికిని నచ్చలేదు.

మాల : (స్వగతము) ఆ దుర్మార్గుని పన్నుగడ ఇప్పుడర్థమయ్యెను. అంతరాయము తొలగించుట కొఱకీ దౌర్జన్యము సల్పియుండును.

రాజ : మనోహరీ, నన్నెవరు పట్టితెప్పించిరి ? నే నెచ్చటనున్నాను ? నీవెవ్వతెవు?

మాల : (ఆలోచనా నిర్మగ్నయై యుండును)

రాజ : నీకు తల్లిదండ్రులున్నారా ?

మాల : మా పినతండ్రి రాజ్యాశకు బలియైరి ?

రాజ : ఆ దుశ్చరితుడెవ్వడు ?

మాల : మిమ్ము తెప్పించిన యతడు.

రాజ : (ఆశ్చర్యముతో) మీ పినతండ్రియా ?

మాల : మా పినతండ్రియే కాదు ; మీయింటి యల్లుడుకూడ !

రాజ : (పిడుగడచినట్లు నిలబడి) ఏమీ ! విజయవర్మయా? ఓరి దుర్మార్గుడా, అతిథిజన కలంకుడా, గోముఖవ్యాఘ్రము, ఏమి మాయ నాటక మాడితివి? ఇంకను మా తలిదండ్రులు బ్రతికి యుందురా? మాధవుడు చాల బుద్ధిశాలి. విజయవర్మ చర్యలను ఆతడు శంకించుచునే యుండెను.

మాల : మాధవుడెవడు ?

రాజ : సాకుడు బిడ్డ .

మాల : ఎవరు సాకిరి ?

రాజ : మా తల్లిదండ్రులు. కొన్ని సంవత్సరములకు పూర్వము ఒక పసిబాలుడు మూర్ఛతగిలి మావాకిట పడియుండెను. మా తల్లిదండ్రుల కప్పటికి సంతానము లేనందువలన వాని నెత్తిపెంచుకొనిరి.

మాల : రాజులు పెంచుకొనదగినంతటి బిడ్డయా ?

రాజ : రూపవంతుడె.

మాల : అప్పటికి వాని వయస్సెంత ?

రాజ : రెండుమూడు సంవత్సరములుండవచ్చునని చెప్పిరి.

మాల : మాయన్నకూడ ఆప్రాయముననే మరణించెనట ! (స్వగతము) ఆశా! ఎంత పిచ్చిదానవు. మరణించిన వారు తిరిగి వత్తురా ? (ప్రకాశముగ) అతడు క్షత్రియుడని అనిపించుకొనదగియున్నాడా ?

రాజ : (సగర్వముగ) సౌందర్యమున నన్ను మించువాడు కాడు ; అయినను కొంచెము బలిష్ఠకాయుడు. తల్లిదండ్రులులేని బిడ్డయని యందఱును వానిని ఆదరించుచుందురు. గర్విష్ఠుడు. తానొక సార్వభౌముని కుమారుని వలె నటించుచుండును. నీ మొగము చూచిన అతడు జ్ఞప్తికి వచ్చును.

మాల : ఈ మందభాగ్యకంతటి యదృష్టమా ? అతని తొడపై పెద్ద పుట్టుమచ్చ యున్నదా ?

రాజ : (ఆశ్చర్యముతో) నీకెట్లు తెలియును ?

మాల : (ఆతురతతో) ఉన్నదా ? చెప్పుడు.

రాజ : ఇది యేమిచిత్రము ! ఆనాడు విజయవర్మకూడ మాధవుని పుట్టుమచ్చ విషయము విన్నప్పుడు సంక్షుబ్ధచిత్తుడయి వెలవెలబోయెనట !

మాల : మచ్చయున్నదా ? మాయన్న బ్రతికియున్నాడు ! అన్నా - అన్నా - (మూర్ఛిల్లబోవును. రాజశేఖరుడు పట్టుకొని బెంచిపై కూర్చుండపెట్టును.)

రాజ : మాధవుని జన్మరహస్యము తెలియవచ్చినది. లతాంగీ, యూరడిల్లుము.

మాల : అన్నా, మరల నీ వా హంతకుని కంటబడితివా ? (లేచి) ఇంకొక్క నిమిష మాలస్యమైన కార్యముచెడును. ఆ రాక్షసుడు మీ సోదరిని వివాహమాడబోవుచున్నాడు. మా అన్న విషయమై నా కనుమానము కలుగుచున్నది. మనము తక్షణమే రహ్యముగా వెడలిపోవలయును. నాకు గుఱ్ఱపుస్వారి తెలియును. బాణ ప్రయోగమెఱుగుదును)

రాజ : కదలుము. (ఇద్దఱు మెట్లపైనుండి పోవుదురు).

(తెరపడును)



# స్థలము 12 : సమరసేనుని గృహము

(సమరసేనుడు అటునిటు తిరుగుచుండగా తెరయెత్తబడును)

సమరసేనుడు : విజయవర్మకు వివాహమయి వచ్చిన వెంటనే నా వివాహమును గుఱించి మరల హెచ్చరించెదను. మాలతిపై నానాటికి నాకు వలపు హెచ్చుచున్నది. ఆ కాంత నన్ను పరిణయమాడునా ? ఎట్లయినను పినతండ్రి యాజ్ఞకు మాఱాడజాలదు. నేను మాలతినే పెండ్లియాడిన యెడల రాజ్యాధిపత్యము వహించుటకు గూడ వీలుండును. మాధవునికి తన జన్మరహస్యము నెఱిగింతును. నేను సైన్యాధిపతినగుట వలన సేనయంతయు నన్ననుసరించును. మాధవుడు నాకు మఱిదియగుటయే గాక కృతజ్ఞుడుగ నుండును. (సగర్వముగ) ఆతని పేరు పెట్టి నేనే రాజ్యమునంతయు పరిపాలింపగలను.

(నేపథ్యమున కలకలము)

అర్ధరాత్రమున కోటలో ఏమి యీ కలకలము ! (ఆలకించును)

(నేపథ్యమున దొంగలు, దొంగలు, పట్టుకొనుడు, కొట్టుడు, దివిటీ తెండు, హా, హా" యిత్యాది)

సమరసేనుడు : దొంగలా ?

(అచ్యుతవర్మయు కొందఱు సేవకులును ప్రవేశింతురు)

సమ : అచ్యుతవర్మా, ఏమి యీ కలకలము ?

అచ్యుతవర్మ : మనము పాతాళగృహమున బంధించియుండిన ఖైది తప్పించుకొని పాఱిపోయెను.

సమ : (ఉద్రిక్తుడై) ఎట్లు తప్పించుకొనెను ?

అచ్యు : బయటి తాళములు వేసినట్లే యుండెను.

సమ : లోపలకూడ మెట్లున్నవి. అచ్చట చూచితిరా ? పొండు. పొండు.

(రజని ప్రవేశించును)

రజని : (దుఃఖించుచు) చిన్న దొరసానమ్మకూడ కనబడలేదు ; గుఱ్ఱాలు పరిగిస్తుండిన శబ్దమైంది.

సమ : (కోపోద్రిక్తుడై) ఆ ! ఇది యంతయు మాలతీదేవి పన్నాగము. పరుగెత్తుడు,

పరుగెత్తుడు, గుల్మముల నాయత్తపఱచుడు, భటులను లేపుడు. పాండు - మా యాలోచన లన్నియు భగ్నమై పోయినవి. ఇంకను ఇచ్చట నేయున్నారా? పాండు. నా గుల్మము నాయత్తము చేయుడు.

(సేవకులు నిష్క్రమింతురు. అచ్యుతవర్మ అచ్చటనే యుండును)

ఆలసించిన మన ప్రాణములమీదికి వచ్చును. అచ్యుతవర్మా, మనము కూడా పోవుదము రమ్ము. (నిష్క్రమించును)

అచ్యు : నేను వేచియుండిన సమయమిప్పుడు దొరకినది. అడవిలో తప్పుదారితీసి ఈతని నచ్చట తెగటార్చి విజయవర్మగారికి నేనిచ్చిన మాట చెల్లించుకొనెదను.

(నిష్క్రమించును)



## స్థలము 13 : అడవి

(అంతయు కొంచెము చీకటిగనుండును. భటులు కొందఱు పుల్లదివిటీలు పట్టుకొని యుందురు. కొందఱు విచ్చుకత్తులతో నిలబడియుందురు. మాధవవర్మ వధ్యశిల యొద్ద నిలబడి యుండును. కటిక వాడు గండ్రగొడ్డలి భుజముపై పెట్టుకొని యుండును ; తెర యెత్తబడును)

మాధవవర్మ : ఓ దౌర్జన్యరాక్షసీ, ఎందఱు నిరపరాధులు, సత్యవంతులు, ధర్మబద్ధులు నీ రథచక్రముల క్రిందపడి నుగ్గు నూచయిపోవుచున్నారు ? ఎందఱి యస్థిపంజరములతో నీ భోగమందిరము నిర్మింపబడుచున్నది ? ఎందఱి యమాయకుల రక్తపూరము తీఱరాని నీ తృషను తీర్చుచున్నది? సత్యమా, నీవెల్లప్పటికి దుఃఖభారవాహివె !

ఆపద్బాంధవా, దీన సంరక్షకా, జగదీశ్వరా, నేను నిరపరాధుడను. నీవు సర్వజ్ఞుడవు. నేను దౌర్జన్యమునకు బలిపశువును. నీవు సర్వశక్తిమంతుడవు. కరుణామయుడవు. -

పాదుచేసి నీరు పోఱించి, మొలకను
నాటి పెంచినావు తోటయందు ;
పూత పిందె కాయ పొడసూపు నదనున
చెట్టుమొదలు నఱకు చిత్రమేమి ?

మహాప్రభూ, నీ యుద్దేశమేమి ? నీలీల దురూహ్యము !

నేను సంతోషముగా మరణింతును. ప్రేమ సూత్రములతో నిహలోకమునకు నన్ను బలవంతముగ బంధించు నేప్రాణియును లేదు. నా దురదృష్ట జీవిత కావ్యమున కడపటి యాశ్వాసము రక్తాంకితాక్షరములతో పరిసమాప్త మగుచున్నది. !

(జోబీలోనుండిన చేతిగుడ్డనుతీసికొని దానిని చూచుచు)

సచేతనములకన్న నచేతనములే విశ్వాసపాత్రములు! నీవు నా కన్నీటిధారల మాధుర్యము నెఱిగిన దానిలో నూరవపాలు మీ స్వామిని యెఱిఁగియున్నయెడల? మనోరమా, నీవు ప్రణయ బహుమానముగ నొసఁగిన యీ రుమాలు గుడ్డయె నాశవమునకు కడపటి యలంకారము!

(భటులు కన్నీరునింతురు; రుమాలుగుడ్డ కన్నులకు కట్టుకొని)

దైవమా, నీయభీష్టము నెఱవేరుఁగాక! ఓయీ, నీవిధిని నిర్వర్తింపుము.

(వధ్యశిలపై తలపెట్టును)

కటికవాడు : (స్వగతము) ఇంత నెమ్మదిగా సచ్చిపొయ్యే మా రాజును నేనెప్పుడు సూళ్ళేదు. (ప్రకాశముగ)

అన్నెము పున్నెము ఎఱగను నేను అంతా మాదొరదే;
ఆకలి బాదకు నౌకరిచేస్తా, అంతే నా యెఱిక.
తప్పుడు నౌకరి కొప్పుకుంటిని తప్పదునాకింక
కళ్ళు మూసుకుని పాపముచేస్తే కర్మమంటదంట!
పడుసు దొరోరిని సంపబోయితే గడగడ వణుకును చెయ్యి

(రాజశేఖరుఁడు, పురుషవేషధారిణియైన మాలతియు ప్రవేశింతురు)

రాజ : ఆవెలుతురేమి? ఆ! వధ్యశిల

మాధ : ఏల యాలసించెదవు? నిమిషయాపనము దుస్సహముగనున్నది.

రాజ : మాధవుని కంఠస్వరమువలె నున్నది.

కటి : (తొందరగ చదువును)

గంఢ్రగొడ్డలికి సత్తెమువుంటె కాళమ్మవుంటె
వొక్క యేటుకే మొండెమునుంచి వూడిపోవు సిరసు.

(గొడ్డలి పైకెత్తును)

రాజ : ఊడిపోదురా నరపిశాచీ, ఊడిపోదు.

(ఎత్తిన గొడ్డలిని పట్టుకొనును)

కటిక : (తిరిగి చూచి) ఒయ్యో, ఒయ్యో, దెయ్యం దెయ్యం. చిన్న దొరయ్య దెయ్యమయ్యాడు. (పెద్దకేకవేయును,భటులు భయపడుదురు)

రాజ : నేను మరణించితిననుకొని యుండిరా?

మాల : నేను సందేహించినట్లేయైనది. మనము సమయమునకు రాకున్న !

మాధ : (మెల్లఁగ తలయెత్తి కన్నులకు గట్టుకొన్న రుమాలువిప్పి) ఏమి దయ్యమురా? (రాజశేఖరుని చూచి) ఆ! నన్ను బ్రతికించుటకై స్వర్గమునుండి పరుగెత్తుకొని వచ్చితివా?

రాజ : (మాధవుని కౌఁగిలించుకొని) మాధవా, యిది యేమి దురవస్థ?

మాధ : నీవు నిజముగ బ్రతికియున్నావా? స్వప్నము కాదుకదా? (రెండు భుజములు పట్టుకొని కుదిలించును)

కటిక : ( భటులతో జనాంతికము ) మణిశిలాగే వుండాడు. సావలేదురో, అయ్య.

మాధ : నిన్ను హత్యచేసితినని మీ తండ్రి నాకు మరణదండనము విధించెను.

రాజ : అయ్యో! ఎంత ప్రమాదము. ఒక్క నిమిష మాలస్యమై యుండిన తీఱరాని దుఃఖము ననుభవించి యుందుము.

మాధ :

*ఒక్కక్షణములోన నుత్కట దుఃఖంబు*
*మఱుక్షణంబునందు మాఱుపాటు!*
*కలలువోలెఁ దోఁచుఁ గలుములు లేములు!*
*బలు తుపాను కడలి పడవ నరుఁడు.*

మాల : (సందేహించుచువచ్చి) అన్నా, మాయదృష్టవశమున బ్రతికితివి. (కౌఁగిలించుకొని కన్నీరునించును)

మాధ : రాజశేఖరా, యీ ప్రియబంధువెవ్వడు?

రాజ : మీ సోదరి.

మాధ : (ఆశ్చర్యముతో) నా సోదరి! నేనెవ్వఁడను?

రాజ : విజయవర్మ అన్నకుమారుఁడవు. మీతండ్రిని అతఁడు వేఁటలో చంపించెను. నిన్నును శిశుప్రాయమున చంపింపఁబోయెను; నన్నీ పాతాళగృహమున బంధింపజేసినదియు అతఁడే. ఇది యంతయు నిన్నువధింపించి మనోరమను పెండ్లియాడుటకు చేసిన పన్నాగము.

మాధ : (ఉద్రిక్తచిత్తుఁడై కటికవానిచేతి గొడ్డలి పెరుకుకొని) ఓరి దుర్మార్గుఁడా, చచ్చితివి, చచ్చితివి. (పరుగెత్తును)

తెరపడును

---

## స్థలము 14 : వివాహ మంటపము.

(తెరయెత్తగనే పుష్పమాలాలంకృతులైన మనోరమా మాధవులు, మాలతీ రాజశేఖరులు, మఱియు రాజబంధువులు, పౌరోహితుడు, తక్కుంగల ఇతర సభాసదులు అగపడుదురు.)

పౌరోహితుడు : (ఆశీర్వదించుచు)

అల యరుంధతియు వసిష్ఠునటుల మీరు
నిత్య మన్యోన్య మధుర దాంపత్యగరిమ
నాయురారోగ్య విభవసౌఖ్యంబు లొంది
పుత్ర పౌత్రాభివృద్ధిగఁ బొల్తుగాత!

సంపూర్ణము



# కాంగ్రెస్ వాలా

## ఏకాంక రూపకము

ప్రథమ ముద్రణ : - 1935 ఏప్రెల్

# పాత్రలు

వెంకట రెడ్డి

నరసింహం

రంగారావు

కళ్యాణరెడ్డి

లాల్‌గుడి వెంకటేశయ్యరు

జంగ్లి

గమళ్ళ వెంకటేసు }
అతని భార్య-బిడ్డ; }
రోగి - ఆమెబిడ్డ }

ఇద్దఱు విద్యార్థులు

ప్లీడరు -ఆయన భార్య

కాంగ్రెసువాలా

కాంగ్రెస్ వాలంటీరు

రవీంద్రుని శాంతిని కేతన్ విద్యార్థి

పుదుచ్చేరి అరవిందు ఆశ్రమవాసి

హోటల్ సొంతదారు

ఎంగిలిప్లేట్లు తీయు ఏనాది

రంగనాయకుల తిరునాళ్ళ
చూచుటకు వచ్చిన యాత్రి
కులు

# కాంగ్రెస్ వాలా

## (ఏకాంక రూపకము)

## స్థలము 1 - నెల్లూరు.

(లాల్‌గుడి వెంకటేశయ్యరు కాఫీహోటలు. కాఫీ హోటలులో నాలుగు అంకణముల గది. గోడలకు కాంగ్రెస్ నాయకుల పటములు, రవివర్మ పటములు తగిలించబడియున్నవి. వాకిలికి ఎదురుగా నున్న గోడపై గడియారపు స్టాండు అమర్చబడి దానిపై వేంకటేశ్వరుల పటము పెట్టబడియున్నది. చిన్న యిత్తడి శెమ్మె, సాంబ్రాణి వత్తుల స్టాండు, పటము ప్రక్కన నున్నవి. ఒక మూల చిన్న టేబిలుపై గ్రామోఫోను, ప్లేట్లు, ఎలక్ట్రిక్ ఫ్యాన్ పెట్టబడియుండును. తెర యెత్తునప్పటికి ఎంగిలి ప్లేట్లు - తామరాకులతో నిండిన టేబిలు కనబడును.

రంగారావు ప్రవేశించును. ఈయన వయస్సు షుమారు ఇరువది రెండు సంవత్సరములుగ నుండును. చెవుల మీదికి వ్రేలాడు పొడుగాటి క్రాపు వెంద్రుకలు, కంటికి 'ప్రిన్సునెజ్ ' సులోచనములు, వేస్టు సిల్కు పక్కజోబీ కుడితిని, సిల్కు కద్దర్ బెంగాలీ కప్పు చేతి గడియారము, కుడిచేత జపాను దేశపు ఎదురుకఱ్ఱ, ఎడమమేత చేతి క్యామర ఇవి రంగారావు అనివార్య బాహ్య లక్షణములు; అలంకారాలు)

రంగారావు : అయ్యర్. (ఎవ్వరు పలుకరు) (సులోచనములు సర్దుకొనుచు నలువైపుల చూచి) ఈ హోటళ్ళు కూడా మన భాగ్యవంతుల బంగళాలలాగే పటాలంగళ్ళుగా తయారయ్యాయి. డెకరేషన్ కూడా వొక ఆర్టని, ఆర్డరు-అరేంజిమెంటు - టేస్టు - అనేవి ఈ ప్రపంచములో వున్నాయని వీళ్ళకు తెలియకపోవడం ఘోరం. (ఈగలు మూగుచున్న ఎంగిలి ప్లేట్లను తామరాకులను చూచి) పూర్వకాలంలో తామర పూవుల పైకి తుమ్మెదలు మూగి ఝుంకారం చేస్తూ వుండేవని కవులు వర్ణించేవారు. ఇప్పటి కవులు, ఈలాంటి హోటళ్ళలో ఎంగిలి తామరాకులపైకి మూగే ఈగల అవ్యక్తమధుర గానాన్ని అభివర్ణించవలసి వుంటుంది. అయ్యర్ (కఱ్ఱతో టేబిలు తట్టును)

అయ్యర్ : (ప్రవేశించి) కూసుకోండిమి. ఏం తెచ్చేదండి.

రంగా : ఆ సంగతి తర్వాత, ముందు ఈ కవితా సామగ్రిని తీసి వెయ్యించండి.

అయ్యు : ఆ జంగ్లీగాడ్డెకు ఎన్నిమాట్లు చెప్పినా దినం కొత్తేనండి. ఏమిరా జంగ్లీ - ఏమి చేస్తున్నావురా ? ఈప్లేట్లు తీసివేయ్.

(ఇంతలో ఏనాదివాడు బక్కెటు పట్టుకొని వచ్చి ప్లేట్లను ఆకులను దానిలో వేసికొని ఒక మురికిగుడ్డతో టేబిలును తుడిచిపోవును)

అయ్య : స్వీటు కావలిస్తే - బాదంహల్వా, రవాకేసరి, మైసూర్‌పాక్, లడ్డూ, జాంగ్రీ, పాల్‌కోవా, గులాబ్‌జామ్, గౌరీజాన్, ఎట్‌సెట్రా. కారం కావలిస్తే -కారాబూంది, పగోడి.......

(కళ్యాణరెడ్డి ప్రవేశించును. ఈయన మల్లు చొక్కాతొడిగికొని గోరంచు ఉత్తరీయము వేసికొనియుండును. వయస్సు షుమారు ముప్పది సంవత్సరములు ఉండును.)

కళ్యాణరెడ్డి : ఓహో ! ఎప్పుడొచ్చారండీ, రంగారావుగారూ ?

రంగా : వారంరోజులైంది.

కళ్యాణ : చాలారోజులకు దర్శనం.

రంగా : మీరు గ్రామంలోనే వున్నారా ?

కళ్యాణ : లేదండి. నేను పుదుచ్చేరి ఆశ్రమంలో వున్నాను.

రంగా : ఓహో !

కళ్యాణ : (అయ్యరు తట్టుతిరిగి) ఏమున్నాయండి

అయ్య : రవాకేసరీ, బాదంహల్వా, మైసూరుపాక్, జాంగ్రీ, గులాబ్‌జామ్....

(వెంకటరెడ్డి ప్రవేశించును. కుడితిని, పంచె, ఉత్తరీయము, టోపీ ఖద్దరువి. చేతికి తగిలించుకొన్న ఖద్దరు సంచిలో ఒక పుస్తకము, ఒక వార్తా పత్రిక, కరపత్రము లుండును.)

అయ్య : (వెంకటరెడ్డి తట్టు తిరిగి) కారాబూంది, అటుకులు, మైసూరుబోండా....

వెంకట : (విసుగుతో) ఇంక చదువుచాలిస్తూ. (సీరియస్‌గా) సరోజనిహల్వా, బజాజ్ వుప్పుమా, నెహ్రూ చట్నీ, గాంధీ అటుకులు తెచ్చిపెట్టు.

(రంగారావు కళ్యాణరెడ్డి ఒకరిమొకము నొకరు చూచి నవ్వుకొందురు)

అయ్య : ఆ గోడ తట్టుచూడండి. ఇంకా తిలక్, పటేలు, ఆండ్రూస్, దాస్‌పటాల పేర్లు రాలేదు - తిలక్ పగోడి, పటేలు బజ్జి, ఆండ్రూస్ సేమియాపాయసం తెమ్మంటారా?

వెంకట : అయ్యర్, నీ అధికప్రసంగంతోనే మాకు కడుపునిండింది. తక్కినవాటికి చోటేది?

అయ్య : మీరేం తెమ్మన్నారండి ?

రంగా : బాదంహల్వా.

కళ్యాణ : అటుకులు.

అయ్య : (లోనికిపోవును)

రంగా : (లేచి) ఈ గదిలోకి గాలే దూరదు. పైగా పొగ ఒక విశేషం. ఫ్యాన్‌స్విచ్ వేయును. అది తిరుగదు) ఇది కూడా ఒక అలంకారంలాగే వుంది. (కూర్చుండును)

(అయ్యరు రంగారావుకు కళ్యాణరెడ్డికి చెరియొక ప్లేటు పెట్టి వెంకటరెడ్డికి మూడు ప్లేటులు పెట్టును. వెంకటరెడ్డి ఆతురతతో తినుచుండును. కళ్యాణరెడ్డి మెల్లగా చిటికెడు అటుకులు తీసికొని నోట వేసికొనును. రంగారావు స్పూను కొనతో సెనగగింజంత హల్వా తీసికొని నోరు మెదల్పక చప్పరించుచుండును.)

రంగా : (వెంకటరెడ్డి తలయెత్తక నములుచుండుట చూచి) మనవాళ్లకు తినడంకూడా ఒక ఆర్టని ఇంతవఱకు తెలియదు. వాళ్ళు తినడం చూస్తే చాలా బార్బరస్‌గా వుంటుంది.

కళ్యాణ : (ఈ రిమార్కు తనకు కూడా అన్వయించునను అనుమానముతో అటుకులు మెల్లగ నములుచుండును.)

వెంకట : దినానికి ఒక్క పూట కూడా కడుపునిండా అన్నము దొరకని వాళ్ళు లక్షలకొలది మన దేశంలో వున్నారు. అటువంటి వాళ్ళకు తినడం ఆవశ్యకంగా యేర్పడు తుందిగాని శిల్పంగా వుండదండి.

రంగా : (స్పూను క్రిందపెట్టి చేతి రుమాలుతో మూతి తుడుచుకొని) మీరేమైనా అనండి. ఎక్స్‌క్యూస్‌మి మీ పేరేమండి ?

వెంకట : వెంకటరెడ్డి

రంగా : మిస్టర్ వెంకటరెడ్డి, గాంధీ ఉద్యమం ప్రబలమైనప్పటి నుండి మన దేశంలో చాలా హల్లకల్లోలం బయలుదేరింది. కవిత్వంపైన ఆర్టుపైన ఉత్సాహం తగ్గింది. మొరటుతనం హెచ్చింది.

కళ్యాణ : శాంతిలోవుండే సౌందర్యం పోయింది.

రంగా : ఇదంతా గాంధీకి ఈస్థటిక్సు, ఆర్టు, తెలియని లోపం. ఏ థింగ్ ఆఫ్ బ్యూటి ఈజ్ ఎ జాయ్ ఫార్ ఎవర్ అని అన్నాడు కీట్సు. అసలు స్త్రీ ప్రకృతి చాలా సున్నితమైనది. అలాంటి మల్లెపూలవంటి స్త్రీలకు మొరటుఖద్దరు కట్టబెట్టి,

వారిచేతికి జెండాలిచ్చి ఎఱ్ఱటెండలో వీధులు వీధులు తిప్పించి, లాఠీచార్జీలకు గుఱిచేయించిన దానికంటే ఘోరం, పాపం , అక్రమం, అన్యాయం ఫిక్షన్ లో కూడా వుండదండి. గాంధి ఆర్టును మర్డరు చేశాడు.

కళ్యాణ : కొంపదీసి పాలిటిక్స్‌లో యాక్షన్ తెచ్చిపెట్టాడు.

వెంకట : (నములుచున్న పదార్థం మ్రింగి) మీ పొరపాటు చాలా శోచనీయంగా వుందండి. మీరు తెలుసుకోగలిగిన దానికంటే గాంధీ చాలా గొప్ప ఆర్టిస్టు. ఆయన ఆర్టును తెలుసుకోవలెనంటే మీకు ఇంకా కొంత యథార్థమైన కల్‌చర్ కావాలె. ఆయన క్యాన్‌వాస్ అయిదారడుగుల చుట్టుకొలత కలదిగాదు , హిందూదేశమంత విశాలమైనది. ఆయన న్యూటన్ కంపెనీ రంగులతో చిత్రింపడు. లోకకళ్యాణానికి ఆత్మార్పణం గావించిన తన నిరాడంబర జీవితం నుండి అపూర్వమైన త్యాగసౌరభం ఈ అనంత భారతీయాకాశాన్నంటి ఇంద్ర ధనుర్వర్ణములతో ప్రభాతరాగ జ్వాలలను చిత్రిస్తున్నది. ఆ మనోహర దృశ్యం ప్రపంచమంతట అన్ని జాతుల వారిని ఆశ్చర్య ముగ్ధులను గావిస్తున్నది.

రంగా : కాంగ్రెసు వాళ్ళల్లోకూడా కొంత పోయిటిక్ టచ్ ఉందన్నమాట ! ఎ రెవెలేషన్!

వెంకట : నా మాటల్లో కవిత్వం గాదు ప్రధానం, విషయం.

కళ్యాణ : మా మహర్షి విషయగర్భితంగా కవిత్వము వ్రాస్తారు. చిత్తరంజనుని సాగర సంగీతం ఇంగ్లీషు కవిత్వంలోకి తర్జుమాచేశారు. మీరు చూశారా ? అందులో సముద్రఘోష ప్రతిధ్వనిస్తుంటుంది.

వెంకట : ప్రజాఘోష ప్రతిధ్వనిస్తే బాగుండేదేమో - ఇప్పుడు మీబోటి వారంతా ఏ థింగ్ ఆఫ్ బ్యూటి ఈజ్ ఎ జాయ్ ఫర్ ఎవర్ అని పాఠం వొప్పజెప్పి సంతృప్తి పడుతుంటే, గాంధీ ఆ థింగ్ ఆఫ్ బ్యూటి ని తన దైనందిన జీవితంలో సమ్మేళనం చేసి ఆ ఆనందాన్ని అనుభవిస్తున్నాడు. మీ స్థూలదృష్టికి ఏది వికారంగా కనబడుతుందో, ఆయన అంతశ్చక్షువుకు అది రమణీయంగా కనబడుతుంది. మీ కే త్యాజ్యమో ఆయన కది పూజ్యము.

కళ్యాణ : (రెండు చిటికెలు అటుకులు నోట్లో వేసుకొని నములుచు) గాంధీ ఆర్టిస్టు కాకపోవడం వల్ల మనకేం బాధలేదు. అయితే పవిత్రమైన ఆధ్యాత్మిక తత్వాన్ని పాలిటిక్స్‌తో సాంకర్యం చేసి రచ్చకీడ్చి నానాగోల పెట్టాడు. హిందూదేశం పూర్వం పరమఋషులున్న తపోభూమి. ఇప్పటికి కూడా మహర్షి వంటి

మహనీయులు అక్కడక్కడ లేకపోలేదు. ఇటువంటి పవిత్రమైన ఆధ్యాత్మిక వాతావరణంలో రాక్షసమైన పాలిటిక్సును తెచ్చి పెట్టి దేశ శాంతికి భంగం కలిగించాడు గాంధి. అందువల్లనే మా మహర్షి పుదుచ్చేరి వదలి రావడం లేదన్నాడు. ప్రపంచాన్నంతా ఆధ్యాత్మికంగా ఒక్కసారి వుద్ధరించడానికి మాగురుదేవుడు ఆ దివ్య శక్తిని పాపభూయిష్ఠమైన యీ ప్రపంచంలోకి అవతరింప చేస్తున్నాడు. అది సూర్యమండలం దాటింది ; చంద్రమండలంలోకి ప్రవేశించింది ; ఇక కొన్ని దినాలకు మేఘమండలం గూడా వ్యాపిస్తుంది. అప్పటికి మన హృదయాలన్నీ చాలా రిసెప్టివ్ స్టేట్‌లో వుంచుకోవాలె. పాలిటిక్స్ దానికి ప్రతిబంధకం.

వెంకట : అయ్యర్ - కాఫీ

రంగా : ఎందుకండీ.

వెంకట : తాగడానికి

రంగా : మిమ్ములను గాదండి.

కళ్యాణ : పాలిటిక్సు యీ లోకానికి సంబంధించిన గోల ; మానవశరీరం క్షణికం ; ఇక దానికి సంబంధించిన ప్రతిదీ క్షణికమె. ఆ దివ్యశక్తి క్రిందకు అవతరిస్తే ఒక్క హిందూ దేశమే గాదు. ప్రపంచానికంతా ముక్తి గలుగుతుంది.

వెంకట : ఆ దివ్యశక్తి బీహారు భూకంపంలాగా నాలుగుచోట్ల వస్తేనేగాని అందరికి ఒక్కసారిగా ముక్తిగలుగదు. ఉట్టికెక్కలేని వాళ్ళు స్వర్గానికెక్కుతారట !

రంగా : ఈ కాంగ్రెస్ క్రీడులోనే వుంది యీ తలబిరుసుతనం. నాజూకుగా మాట్లాడేది వీళ్ళకు తెలియనే తెలియదు.

అయ్య : (వెంకటరెడ్డికి కాఫీ తెచ్చి యిచ్చును.)

వెంకట : (రెండు గుక్కలు త్రాగును)

కళ్యాణ : గాందీ లోకాన్ని పట్టుకొని యింకా వూగులాడుతున్నాడు. ఆయన్ను సెయింట్ అనడం అక్రమం. అందరి కళ్ళకు కనబడుతూ అందరితో మాట్లాడే వాడు సెయింట్ కానేకాడు. సెయింట్ అంటే మా మహర్షికి ఒక్కడికే చెల్లుతుంది. ఒక్క మదర్ కు తప్ప ఆయన ఇంకొక మానవుడి కంటికి కనబడడు. ఆయన స్పెన్సరు కంపెనీ చుట్టలు తప్ప మరేవి తాగడని అందరూ అనుకొంటారుగాని ఆయన వుద్దేశం వీళ్ళేవరికీ తెలియదు.

వెంకట : మీకు తెలిస్తే చెప్పండి.

కళ్యాణ : గాంధి ద్వేషంతో పరదేశి గుడ్డలను తగులబెట్టించాడు. మా మహర్షి ఏ మాత్రం ద్వేషబుద్ధి లేకుండా పరదేశీ వస్తువును ప్రయోజనకరంగా తగులబెడుతున్నాడు. ప్రేమలో వైరాగ్యం సాధిస్తున్నాడు. ప్రకృతి పురుషుల సంయోగమే సృష్టికి మూలమని ఋజువుచేశాడు.

అయ్య : (టీ తెచ్చిపెట్టును)

రంగా : మా గురుదేవుడికి మోస్తరే మహర్షికి కూడా ఇన్‌టర్ నేషనల్ ఔట్ లుక్ వుంది. మహర్షి చాలా గ్రేట్ జీనియస్! అందుకు ఏ మాత్రం సందేహం లేదు. ఆర్ట్, పొయిట్రీ భావంలో విశేషంగా వున్నవి. ఇంగ్లీషు వాళ్ళుకూడా ఆయనతో పాటు ఇంగ్లీషు వ్రాయలేరు. ఇంగ్లీషులో కవిత్వం అద్భుతంగా వ్రాస్తాడు. అంతా బాగానే వుంది. అయితే ఆయన రహస్య ప్రవర్తనం నాకు బోధపడటం లేదు.

వెంకట : మీకేగాదండి, ప్రపంచాని కంతటికి గూడా బోదపడడంలేదు.

కళ్యాణ : ప్రాకృతులకు బోధపడదు. పూర్వం మహర్షులు కొండగుహలలో తపస్సుచేసి భావతరంగాలతో ప్రపంచం నింపేశేవారు. అలాగే మాగురుదేవుడు కూడా చేస్తున్నాడు. తపస్సు పరిపక్వం కావడం తోటే బుద్ధుడు మోస్తరే ఆయన బయులు వెడల్తాడు. ఇప్పుడాయన్ను హేళన చేస్తే వాళ్ళందరు పటాపంచలైపోతారు.

(వెంకటరెడ్డి మొకముచూచుచు టేబిలు పైగా చేయివిసరును. టీ కప్పు దొరలును)

కళ్యాణ : (టీ గుడ్డలపైకి కారకుండా కుర్చీకొంచెము వెనుకకు జరుపుకొనును.)

రంగా : మెనీ ఎ స్లిప్ బిట్‌వీన్ ది కప్ అండ్ ది లిప్ !

వెంకట : అప్పుడు జరగబోయే ఉత్పాతం యెట్లుంటుందో గాని, ఇప్పుడు మాత్రం అయ్యర్ కాఫీ బొచ్చెకు తలనొప్పి వచ్చింది - ఏ జంగ్లీ, వచ్చి యీ టేబిల్ తుడువు.

ఏనాది : (టేబిల్ తుడుచును)

కళ్యాణ : అయ్యర్, ఇంకోకప్పు టీ.

రంగా : మీరు ఆశ్రమంలో ఎన్ని సంవత్సరాలుగా ఉన్నారండి ?

కళ్యాణ : అయిదారు సంవత్సరాలుగా వున్నాను.

అయ్య : (టీ తెచ్చిపెట్టును)

రంగా : మీ కోర్సు పూర్తయిందా ?

కళ్యాణ : (టీ గ్రుక్కెడు త్రాగి) మాకు వేతేకోర్సేమి లేదండి ; డెయిలీ కోర్సు మాత్రం వుంది.

వెంకట : మగవాళ్ళు కాబట్టి -

కళ్యాణ : ప్రొద్దున్నే లోటాడు ఆవుపాలిస్తారు. మధ్యాహ్నం, రాత్రి, సాత్వికాహారం. వాళ్ళిచ్చే మామూలు చాలనివాళ్ళు సొంతంగా వంట చేయించుకొని ఎక్స్ట్రా గా తినవచ్చును. ఒకరికొకరికి ప్రత్యేకంగా గదులుంటవి. భార్యాభర్తలు ఒకటిగా వుండవచ్చు. ఇష్టముంటే చదువుకోవచ్చు. బీచికి షికారు వెళ్ళవచ్చు.

రంగా : అయితే మీకు ప్రొద్దెట్లా జరుగుతుందండి ?

కళ్యాణ : భోంచేసిన తర్వాత పరుపుమీద వెల్లకిల పండుకొంటాము ; ఆ దివ్యశక్తిని ఆకర్షించడానికి మనస్సును రిసెప్టివ్ స్టేట్ లో వుంచుకోవడం అభ్యసిస్తాం. ఇది మనిషికి చాలా న్యాచురల్ పొజిషన్.

వెంకట : నిష్కర్మయోగులన్నమాట !

రంగా : మహర్షి యేం చేస్తుంటాడండి ? పుస్తకాలు వ్రాస్తుంటాడేమొ !

వెంకట : ఆశ్రమ కులాయంలో సూపర్ మ్యాన్ గుడ్లు తయారౌతున్నాయి వాటిని పిల్లలు చేయించడానికి పొదుగుతున్నాడు మహర్షి.

రంగా : ఓ కాంగ్రెస్, దై నేమ్ ఈజ్ ఇమ్పెర్టినెన్స్ !

వెంకట : విత్ అపాలజీస్ టు షేక్స్పియర్ !

కళ్యాణ : నే వెళ్ళుతానండి.

రంగా : కూర్చోండి. ఆ అటుకులు తీరా తీసుకోండి. మీకు సాధనాలేమైనా ఉన్నాయా?

కళ్యాణ : ఆ విషయం రహస్యం. మదర్ ఆజ్ఞ.

రంగా : ఇంత రహస్యం రామకృష్ణ పరమహంసకు కూడా లేదనుకుంటాను. - అయ్యర్, ఒన్ కప్ టీ.

వెంకట : పాపం ! పరమహంసకు ఆ రహస్యంలోనే వుంది చితంబర రహస్యమంతాను. నన్ను విప్పిచెప్పమంటారా ?

కళ్యాణ : నిన్నుంచి కాదుగదా మీ గురువునుంచీ కాదు.

వెంకట : మహర్షి కాకపూర్వం ఆయన రాజకీయంగా చాలా ప్రబోధం కలిగించాడు దేశంలో ; ఒప్పుకొంటారా ?

అయ్య : (టీ తెచ్చిపెట్టును)

రంగా : నిజమె ! (ఒక గుటికెడు టీ త్రాగును)

వెంకట : తర్వాత కేసులో తప్పించుకొని తన్ను నమ్మివుండిన స్నేహితులను నట్టేటిలో ప్టుటెముంచి పుదుచ్చేరిలో మకాం వేశాడు. ప్రజలంతాకూడా ఈ మహానుభావుడు మళ్ళీ వస్తాడు, రాజకీయచక్రం తిప్పుతాడు అని ఎదురుచూస్తుండినారు. ప్రజల నిరీక్షణం ఆయనకు గడబద్ధకమైంది. రాజకీయంగా ఏమీ చేయలేమని అనుకొన్నాడు. ఆ ఉద్దేశానికి ముసుగువేశాడు ; ఆధ్యాత్మికంగా ముసుగులో తానూ కూర్చున్నాడు. ముసుగు అక్కడక్కడా చినిగిపోతున్నది. కొంత కాలానికి యథార్థం బట్టబయలవుతుంది. తుదకు మహర్షే బయట పడతాడో, లేకపోతే కపటవేషమే బయట పడుతుందో దేవుడికే యెఱుక !

కళ్యాణ : (కోపముతో) నా యెదురుగా మా మహర్షిని యిట్లు నిందించడం, లేని కాపట్యం ఆరోపించడం నీచం, అసహ్యం, ఇంపెర్టినెన్సు, రూడ్‌నెస్ (అని లేచిపోవును.)

అయ్య : (వాకిలిదగ్గఱకు పోయి) ఏమండో, డబ్బు ఎగనూకి పోతున్నారే!

కళ్యాణ : (తిరిగి వచ్చి డబ్బు ఇచ్చును)

రంగా : కాంగ్రెసువాళ్ళ మాటలకు తలా తోకవుండదు లేండి. ఇన్‌ష్యూరెంసు ఏజెంట్లులాగా ఎక్కడచూచినా యికాంగ్రెసు గూడెము వారే హాజరౌతారు. వీళ్ళ మాటలకు కోపపడితే మనిషి బ్రతకడం దుర్ఘటం. కూర్చోండి.

కళ్యాణ : (కూర్చుండును)

రంగా : వీళ్ళకు గాంధీతప్ప మరెవ్వరు పనికిరారు. ఆ గాంధీ వల్లనే స్వరాజ్యం రాకుండాపోయిన సంగతి కూడా వీళ్ళకు తెలియదు. మా టాగూరు ఇంగ్లాండుకు పోయినప్పుడు ఆయన్ను చూచి అందరు ఓరియన్‌టల్ క్రైస్ట్ అని ఆరాధించారు. ఆయన ఫ్లోయింగ్ సిల్వర్ బియర్డ్ పట్టుఅంగీ సర్వజన వశీకరణం చేశాయి. చాలమంది ఇంగ్లీషుకన్యలు ఆయన ముసలివాడు కాకుండా వుంటే పెండ్లిచేసుకొని వుందుముగదా అని చింతించినారట! ఈలాంటి మహానుభావులు పుట్టిన దేశానికి స్వరాజ్యం యివ్వవలసిందని లేబరువాళ్లు పట్టుబట్టితే అప్పుడ

మ్యాగ్నోనాల్టుకు మెజారిటీ లేక ఆ తీర్మానం ఓడిపోయిందట. గాంధీ రౌండు టేబుల్ కాన్ఫరెన్సుకు పోవడమువల్ల మన దేశానికి పరమ అన్యాయం జరిగింది. మోకాళ్ళకు పైగా ఖద్దరుగుడ్డ యెగదీసి కట్టి ఒక పెద్ద మోటు దుప్పటి పైన కప్పు కొని పెద్ద 'బూర' లాగా తయారై అక్కడికి వెళ్లేటప్పుటికి ఆయన్ను చూచినవాళ్ళందరు ఇండియా ఈజ్ అన్ సివిలైజ్ ఇండియా ఈజ్ అన్‌ఫిట్‌ఫార్ డొమీనియన్ స్టేటస్ అని అరిచారు. ఇంగ్లీషు కన్యలందరు ఒక కమిటీగట్టి, గాంధీ ఇంతకంటె ఫర్దరుగా డ్రెస్ రిఫారం చేయగూడదని హోరుదగ్గరికి డెప్యుటేషన్ వెళ్లినారట, కన్‌సర్వేటివ్ పక్షంవాళ్లు ఈ సమయం అనుకూలంగా వుందని గాంధీ ఫోటోను న్యూస్ పేపర్లలో గుప్పించి "ఇటువంటి ఆనాగరకులున్న దేశాన్ని రక్షించి ఉద్ధరించడానికి దేవుడు మనలను ధర్మకర్తలనుగా నియమించాల' ని క్రిశ్చియన్ ఫిలాసఫి బోధించారట. గాంధీవల్ల మన మాతృభూమికి యింత అన్యాయం జరిగితే దాన్నంతా మరుగు పెట్టి, నోరూవాయీలేని అమాయికులను మోసం చేస్తున్నారు ఈ నాయకులంతాను. గ్రామస్థుల్లో మొట్టమొదట మానవసేవ ప్రారంభించాల. ఆర్టు, పాయిట్రి నేర్పించాల. వాళ్ళకు మందూమాకు యిచ్చి కాపాడాల.

అయ్య : టీ చల్లగాపోతున్నదండి.

రంగా : థ్యాంక్‌యు (టీ త్రాగబోయి టేబిలుపైబెట్టి) ఆహా! ఏమి యీ చిత్రం! (లేచును)

కళ్యాణ : ఏమిటండీ?

రంగా : ఈగ కప్పులో పడ్డది. తన్నుకొంటున్నది. స్ట్రగుల్ ఫార్‌ఎగ్ జిస్‌టెన్స్ ప్రాణికోటికంతా ఎంత సహజంగా వుంది! దీంట్లో ట్ర్యాజిక్ బ్యూటి కనిపిస్తుంది. ఇంత చిన్న యీగ ఇన్ని టీ నీళ్ళలో ఈదుటకు ప్రయత్నించడం సబ్లైం! సబ్లైం !!

వెంకట : (ముసిముసి నవ్వు నవ్వును)

కళ్యాణ : (ఈగను చూచుటకు లేచును)

అయ్య : స్పూనుతో తీసిపారవెయ్యండి

రంగా : ఆ ట్ర్యాజిక్ స్ట్రగుల్‌లో వుండే స్పిరిచ్యువల్ భావాన్ని చూడు! ఇటువంటి ప్రకృతి ప్రేరణలు లేకపోతే కవిత్వం రాదు.

కళ్యాణ : (కూర్చుండి) అవును! కవిత్వానికి........

రంగా : ఉండండి. నాకు కవిత్వము దొర్లుతున్నది.

కాఫీ కప్పున నీగ తన్నుకొనుచున్ కాన్పించు సంసారమం దాఫెన్‌టైమ్సు............

(తర్వాత సాగదు; మరల ఆపాదమును ఉచ్చరించును)

కళ్యాణ : చాలా గా వుందండి. ఎట్లా వున్నదో అట్లా చెప్పడంలోనే నేచర్ స్టడీ వుండేది.

రంగా : కాఫీ కప్పున నీగ తన్నుకొనుచున్ కాన్పించు సంసారము దాఫెన్‌టైమ్సు (తర్వాత సాగదు)

వెంకట : తర్వాత బండిసాగ లేదన్నమాట!'నిరుపహతిస్థలంబు రమణీ ప్రియదూతిక తెచ్చియిచ్చు కప్పుర విడెము''. కావలసి ఉంటుందేమో!

రంగా : తొందరలో ఫకార ప్రాస వేశాను. దాన్ని పూర్తి చేయడం కొంచెము కష్టమే.

వెంకట : అందుకనా ఆ ఫెన్ టైమ్సు అని అన్నారు.

రంగా : రాజభాష ఉపయోగించ వచ్చు. పూర్వకవి ప్రయోగాలున్నాయి. మీకు కవిత్వంగూడా తెలుసునా యేంటి?

వెంకట : ఏదో కొద్దిగ.

రంగా : అట్లయితే నాన్‌కోఆపరేటర్లయ్యారేం ?

వెంకట : ప్రస్తుతావస్థలో కవిత్వం, ఆర్టు, డ్రామా, సర్వం దాస్య విమోచనం కొఱకే ఉపయోగపడవలెనని నా అభిప్రాయమండి.

రంగా : అయితే మీరు ఆర్ట్ ఫర్ ఆర్ట్స్ సేక్ వాదులు కారన్నమాట. యు ఆర్ ప్రాస్టిట్యూటింగ్ ఆర్ట్. కోకిల యేమి ప్రయోజనం ఆశించి గానం చేస్తున్నదంటారు?

వెంకట : కోకిలకు ప్రయోజనం ఆశించే జ్ఞానములేదు. మనిషికున్నది.

రంగా : ఉయ్ ఆర్ పోల్స్ అసందర్.

కాఫీ కప్పున నీగ...........

(తర్వాత పద్యము సాగదు)

ప్రపంచమంతా ఫ్రీడం ఫ్రీడం అని ఘోషిస్తుంటే తెలుగు కవిత్వం మాత్రం సనాతనంగా మడికట్టుకోవడం, అందువల'కవిశయః పార్థి' అన్న కాళిదాసులు మనదేశంలో పుట్టడానికి అవకాశం లేకుండాపోవడం చాలా అన్యాయం.

వెంకట : మీరు పొరపడుతున్నారు. తెలుగువారు ఎందులోనూ తీసిపోరు. డెమొక్రసీ అని

పేరు పెట్టి పద్యానికి గద్యానికి వుండే భేదం లేకుండా చేశారు. కట్టుదిట్టాలేమీ అవసరంలేదు. పాడిందల్లా పాటే, ఆడిందల్లా ఆటే ! ఆర్టులో రిస్ట్రెయింట్ అక్కరలేదట !

రంగా : మైగాడ్ నాలుగు సంవత్సరాలుగా కలకత్తాలో వుండడం వల్ల మన వాఙ్మయంలో కలుగుతున్న మార్పులతో నాకు టచ్ లేదు. అట్లయితే యీ పద్యం యిప్పుడే పూర్తి చేస్తాను.

కాఫీ కప్పున నీగ తన్నుకొనుచున్ గాన్పించు సంసారమందాఫెన్ టైమ్సు సమస్త బాధలకు లోనైగట్టుగాన్పించకే-

(తర్వాత పద్యం సాగదు) ఏమండీ, గణాల్లో గూడ ఫ్రీడమ్ వచ్చిందా ?

వెంకట : ఓ ! సర్వదుంబాళంగా వచ్చింది.

రంగా : హుర్రా ! అట్లయితే కవిత్వం యింకా సులువే.

కాఫీ కప్పున నీగ తన్నుకొచున్ గాన్పించు సంసారమం

దాఫెన్ టైమ్సు సమస్త బాధలకులోనై గట్టుగాన్పించకే కుయ్యోమొఱ్ఱియటంచు డిప్రెషను కష్టాల్ పొందు గృహస్థు చం దానన్ ; ట్రాజెడి యన్న నిట్టిదెకదా సబ్లైము భావంబులన్ !

వెంకట : కవిత్వం చాలా ట్ర్యాజిక్‌గా వుందండి.

(ఇంతలో ఒక కాంగ్రెస్ వాలెంటీరు ఆతురతతో పరుగెత్తుకొని వచ్చి 'వెంకటరెడ్డి వున్నారాండీ ?'' అని అటునిటు చూచును.)

వెంకట : ఏమి నరసింహం ?

నరసింహం : రంగనాయకుల తిరుణాళ్ళకు గ్రామాంతరాన్నుంచి యెవరో ఒక అమ్మాన్ను చంటిబిడ్డవచ్చినారు. ఆమెకు కలరా తగిలి పాతచత్రంలో పడిపోయింది. ఆమెను వదలి పెట్టి చత్రంలో వుండిన వాళ్ళందరూ వెళ్ళిపోయినారు. బిడ్డ పాలకేడుస్తుంది. తల్లి కష్టావస్థలో వుంది.

వెంకట : అట్లనా ! అయ్యర్. (డబ్బిచ్చి) ఒక కప్పులో పాలు పోసివ్వండి. నరసింహం, నీవు డాక్టరు దగ్గిరికి వెళ్ళి కలరా మిక్స్చరు కలిపించుకొని చత్రం దగ్గిరకి వాయువేగంతో రావాల. సైకిల్ వుందా ?

నర : ఉందండి.

వెంకట : అయితే వెళ్లు.

నర : (నిష్క్రమించును)

అయ్య : (కప్పులో పాలు తెచ్చియిచ్చి) కలరా వచ్చిందీమళ్ళా ! ఇక ఈ స్యానిటరీ యిన్‌స్పెక్టర్లతో వేగేది కష్టం. ఇప్పుడు వొక్కపూటే తిరపెపు కాఫీకి వస్తున్నారు. రేపటి నుంచీ రెండుపూటలూ తగులుకొంటారన్నమాట !

వెంకట : (నిష్క్రమించును)

రంగా : ఈ కాంగ్రెసు వాలంటీర్లు కొఱవిదయ్యాలండి. కలరా అంటురోగమని అది ప్రజలలో వ్యాపిస్తుందని వీళ్ళకు కొంచెంకూడా జంకులేదు. (సిగరెట్టు ముట్టించి) అయ్యర్, మీ వద్ద కర్పూరపు బిళ్ళలుంటే ఒక పైసాకివ్వండి.

అయ్య : లేవండి. ఎందుకు ?

రంగా : కర్చీఫ్‌లో వేసుకొని మూచ్చూస్తుంటే కలరా రాదండి. రెడ్డిగారు, మీరు గూడ సిగరెట్ ముట్టించండి. కలరా పురుగులు ఈ పొగలో మాడిపోతవి.

కళ్యాణ : నాకు అభ్యాసం లేదు. మనం గూడా ఆ చత్రంతట్టు వెళ్ళుదామా?

రంగా : ఎందుకు ?

కళ్యాణ : ఇది అడ్వర్‌టైజ్‌మెంటు ఎత్తో లేకుంటే యథార్థమో కనుక్కొందాం.

రంగా : ఆ ! గ్రేట్ హిట్ ! అవును. మనము ఈ కాంగ్రెసు వాళ్ళను మెర్‌సిలెస్ గా ఎక్స్‌పోజ్ చెయ్యాల. నేను కర్పూరం బిళ్ళలు కొనుక్కొని మీతోగూడా వస్తాను.

(అయ్యరుకు డబ్బిచ్చి వెడలిపోవును)

కళ్యాణ : మా మహర్షిని అపనిందలాడిన వీళ్ళకు............... ఆల్‌రైట్ (వెడలిపోవును.)



## స్థలము 2 - పాత చత్రం వరండా.

(కలరా తగిలిన స్త్రీ గుడ్డ పఱుచుకొని చిన్నమూట తలక్రింద పెట్టుకొని పండుకొని బాధపడుచుండును. వెంకటరెడ్డి ఒక సంవత్సరం వయస్సుగల చంటిబిడ్డను చేతులలో పెట్టుకొని అటునిటు త్రిప్పుచు లాలించుచుండగా తెరయెత్తబడును.)

రోగి : (అటునిటు పొరలుచు, వోక్కిరమనుచు బాధపడుచు, ఈలగొంతుతో) అయ్యా, యీ బాదెట్లయ్యా ! నేనెందుకీ పాడు తిరుణాళ్ళ కొస్తినయ్య (వోక్కిరమనుచు) రామా దేవుడా - యెక్కడుండావురా నాయనా - అబ్బా - తండ్రీ -

(ఇంతలో బిడ్డయేడ్చును)

వెంకటరెడ్డి : నాయన - నాయన - ఏడవబోకు తండ్రీ. పాలుతాగించేదా ?

(పాల లోటాను మూతిదగ్గర పెట్టును. బిడ్డ త్రాగడు. లోటా క్రిందపెట్టి జోబీలో నుండి తాళపు గుత్తి తీసుకొని కదలించుచు బిడ్డను లాలించుచుండును)

రోగి : నా బిడగ్గూడా కల్లర తగిలిందయ్యా ?

వెంకట : లేదమ్మా, బిడ్డ బాగున్నాడు. పాలు నోటిదగ్గర బెడితే తాగలేదు.

రోగి : అట్ల తాగడు నాయనా, కాళ్ళమీద వేసుకొని ఉగ్గుపాలతో పోస్తేనే గాని తాగడు. అబ్బా ! మా వాళ్ళకెట్లా తెలుస్తుందయ్యా ?

వెంకట : మీ దేవూరు ?

రోగి : ఇక్కడ్నే, ఏటవతల.

వెంకట : ముందు నీకు మందిచ్చి, తర్వాత ఆసుపత్రికి తీసుకొని పోతాను. నీకేమీ భయంలేదు.

రోగి : నేను బతకతానయ్యా ?

వెంకట : నీకే మాత్రం ప్రాణభయములేదు. నీవు ధైర్యంగా వుండు. దేవుడున్నాడు రక్షించడానికి.

రోగి : ఆ దేవుణ్ణి చూడడానికి వస్తేనే యిట్లయిందయ్యా (బాధతో) అ - ఎట్లయ్యా.

(ఇంతలో నరసింహం మందు తీసికొనివచ్చి సైకిల్‌ను గోడకు ఆనించును)

వెంకట : ఈ బిడ్డను పట్టుకో ; మందిస్తాను.

(అందించునపుడు బిడ్డ యేడ్చును)

రోగి : అయ్యో, నా బిడ్డ ఆకటికి అల్లాడుతుందయ్యా, నేనైనా గుక్కెడు పాలిస్తాను.

వెంకట : (బ్రతిమాలినట్లు) నీవీయగూడదమ్మా, (నరసింహం తట్టు తిరిగి) నరసింహం, చేతిగుడ్డ పాలలోముంచి ఒక్కొక్క బొట్టుగా బిడ్డనోట్లో పిండు, చూస్తాం (రోగి ప్రక్కకు వచ్చి) అమ్మా, నోరు తెరువు ఈమందు కొంచెం తాగు. నీకు తప్పకుండా బాగౌతుంది.

(మిక్సరు నోటిలో పోయును. ఆమె గుటక వేయును)

(ఇంతలో రంగారావు, కళ్యాణరెడ్డి వచ్చి కొంచెము దూరముగా నిలబడి రోగిని చూచుచుందురు.)

రోగి : నీకు చెయ్యెత్తి దణ్ణం పెడ్తానయ్యా. దేవుడు మిమ్మల్ని సూపించకపోతే నాగతి నా బిడ్డగతి యేమైయుండేదో !

వెంకట : నీవూరుకో అమ్మా ! ఊరికే మాట్లాడితే అలసిపోతావు. నరసింహం, ఏమైనా పాలు తాగిందా బిడ్డ ?

నర : కొద్దిగా తాగిందండి.

రోగి : దాహమెత్తుతుందయ్యా, పుల్లగెంజిలో వూరగాయవూట కలిపిస్తే ముంతెడైనా తాగుతాను.

వెంకట : ఇక్కడ యీ సమయంలో పుల్లగంజి దొరకవు. నరసింహం, ఆ బిడ్డను నా చేతికిచ్చి సోడా బాటిల్ కొట్టించుకొని తీసుకరా. పరుగెత్తు.

నర : (బిడ్డను వెంకటరెడ్డి చేతికిచ్చి సైకిల్ తీసుకొని వెళ్ళును.)

రంగారావు : మిస్టర్ వెంకటరెడ్డి.

వెంకట : (రెండడుగులు ముందుకు పెట్టి) ఏమండి ?

రంగా : (ఒక అడుగు వెనుకకు పెట్టి) మీరక్కడనే వుండండి. ఫరవాలేదు. (కర్పూరం బిళ్ళ ఒకటి విసరివేసి) దీన్ని కర్‌చీఫ్‌లో పెట్టి మూచ్చూస్తుండండి. ప్రివెన్షన్ ఈజ్ బెటర్ దేన్ క్యూర్ అని అరిస్టాటల్ చెప్పాడు.

వెంకట : (కర్పూరపు బిళ్ళ తీసుకొని నలిపి రోగిపక్క దగ్గర చల్లును.)

రంగా : ఏమిటి యీ తనకుమాలిన ధర్మం ? (సిగరెట్టు ముట్టించును)

కళ్యాణ : వీళ్ళు లోకాన్ని - (హఠాత్తుగా జ్ఞప్తికి వచ్చి మొలత్రాడు తడవుకొనును:)

రంగా : ఏమిటండీ ?

కళ్యాణ : తాయెత్తులేండి.

రంగా : (చిఱునవ్వుతో) తలిస్‌మాన్ తాయెత్తా ?

కళ్యాణ : కాదండి. (రహస్యముగా చెప్పువానివలె) అదృష్టవశాత్తుగా ఆశ్రమంలో అమ్మగారి వెంట్రుక ఒకటి దొరకింది. దాన్ని బంగారు తాయెత్తులోవేసి మొలకు కట్టుకొన్నాను. ఏ చీడాపీడా ఆశించదు.

వెంకట : ఓ ! (నవ్వుచు) అందువల్లనే ధైర్యంచేసి వచ్చారు.

రంగా : ఎస్ ! ఇట్ ఈజ్ ఫెయిత్ క్యూర్.

కళ్యాణ : వీళ్ళు లోకాన్ని తాము వుద్ధరిస్తూన్నామని అనుకొంటారు. ఆ దివ్యశక్తి ప్రపంచ చక్రం నడుపుతున్నది. పుట్టించేదెవరు ? చంపేదెవరు ? రోగాలు భూకంపాలు, విప్లవాలు, యుద్ధాలు నేచరుస్కీమ్‌లో వుండేవే. ఇవిలేకపోతే నేచరులో ఈక్విలిబ్రియం వుండదు. ఆత్మకు ఎప్పటికి నాశనంలేదు.

*నైనం ఛిందంతి శస్త్రాణి, నైనం దహతి పావక :,*

అనిన్నీ -

*వాసాంసి జీర్ణాని యథావిహాయ*

*నవాని గృహ్ణాతినరో ఆపరాణి -*

అనిన్నీ గీతా శాస్త్రమే చెబుతున్నది. మామహర్షి అందువల్లనే సోషల్ సర్వీస్ వుత్తమిథ్య - బూటకమని దాన్ని బహిష్కరించాడు.

రంగా : (సిగరెట్టుముక్క క్రిందపడవేయును)

కళ్యాణ : (అటుపోయి సిగరెట్టుముక్కను త్రొక్కి యెగిరిపడి) అబ్బా ! తేలుకుట్టింది. (సిగరెట్టుముక్కను చూచి కోపముతో) ఏమండి, మనుష్యులు తిరిగేచోట ఆర్పకుండా సిగరెట్టుముక్కలు పడవేస్తే కాళ్ళు మండుకపోతవని తెలియదూ?

రంగా : సారీ, ఎక్స్‌క్యూజ్‌మీ. పరధ్యాన్నంలో క్రింద వేశాను. (తన బూడ్సుకాలుతో దానిని రాచివేయును.)

కళ్యాణ : (కాలు చూచుకొని) బొబ్బపోయిందండి.

వెంకట : నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః !

కళ్యాణ : చురుక్కుమని చస్తుంటే యిప్పుడుకూడా వేళాకోళమేనా ?

వెంకట : తమరు సెలవిచ్చిందే కదండి ?

(ఇంతలో నరసింహం వచ్చి సైకిల్ అచ్చటపెట్టి సోడా ఆమెనోటిలో పోయును.)

రోగి : (సోడా త్రాగి) అబ్బా ! తండ్రీ , నా బాధ యెవరు తీరుస్తారయ్యా ?

రంగా : ఈ పోజ్ చాలా అద్భుతంగా వుంది. మొగం లో ట్ర్యాజిక్ బ్యూటి తాండవిస్తూ వుంది. ఇప్పుడు గాన నందలాల్ బోసు వుండి ఈ మాడల్ ప్రకారం ఒక చిత్రం వ్రాస్తే డయింగ్‌ప్రిన్సు అనే మొగల్ చిత్రానికంటే బాగుంటుంది.

(హ్యాండ్ క్యామిరా తెరచి ఫోకస్‌చేసి ఫోటోయెత్తును)

మీకుగూడా ఒక కాపీ యిస్తానులెండి.

కళ్యాణ : ఈతూరి సిగరెట్టుముక్క జాగ్రత్తగా పాఱవేయండి.

రంగా : థాంక్స్.

వెంకట : నరసింహం, ఇక మనము ఆలస్యం చేయడం బాగులేదు. ఈమెను సెగ్రిగేషన్ హౌసుకు తీసుకొనివెళ్ళాలి. మన గ్రహచారం మన వూళ్ళో అంబులెన్సు కూడా లేదు. మఱి జట్కావాళ్ళను పిలిచాను. కలరా పేషంటంటే ఒక్కడూ రాలేదు.

రంగా : ఎట్‌లీస్ట్ దే ఆర్ రీజనబుల్.

వెంకట : ఇప్పుడెట్లా మఱి ?

నర : మనమే తీసుకొని వెళ్లదాం. ఆమె దుప్పటితో వుయ్యాల కట్టి మధ్యవొక కఱ్ఱదోపి మోసుకొని పోవచ్చు.

వెంకట : బిడ్డ ?

నర : ఇంకొక్కరు కావాలనే మఱి. (రంగారావు తట్టుచూచును)

రంగా : (గమనించనట్లు ఒక తట్టుకు మరలును)

వెంకట : రంగారావుగారు, ఈ బిడ్డని కొంచెం అక్కడిదాకా యెత్తుకొని వస్తారా ?

రంగా : మా గురువుగారు పసిబిడ్డలను గుఱించి అద్భుతంగా కవిత్వం వ్రాశారు. ఆ పద్యాలు ఒరిజినల్ లో చదివితే బిడ్డల్ని ముద్దాడవలెననే కోరిక పుడుతుంది.

పూచిన తమ్మివంటి పసిబిడ్డల మోమున నవ్వు దొంతరల్
కేసర గుచ్ఛమట్లు కనువిందొనరింపగ చేరదీసి, నా

నాయన, రార యంచు చిరుబుగ్గల ముద్దిడువాని భాగ్యమే
భాగ్యము ; కోటులున్న పెఱభాగ్యము భాగ్యమె ? రెడ్డిమిత్రమా !

అనే మోస్తరుగా కవిత్వంలో పసిపాపలు చాలా అందంగా వుంటారు. అయితే ప్రాక్టికల్ ప్రాబ్లం సాల్వ్ చేయడంలోనే వుండే చిక్కంతా.

(ఇంతలో మూడో ఫారం విద్యార్థులిద్దరు పుస్తకములు చంక బెట్టుకొని ఆ దారిన పోవుచుందురు.)

ప్రథమ విద్యార్థి : ఒరే, మన మేష్టరు స్టూడెంట్స్ సోషల్ లీగ్ స్టార్ట్ చేశాడు. మొన్నటి ఆదివారం మేము ఆసుపత్రులన్నీ తిరిగి వచ్చాం ; చాలా గమ్మత్తుగా వుణ్ణింది. పేషంటొకడు నిద్రపోతుంటే పక్కన బెంచిమీద రొట్టెముక్కలు పెట్టివుండినాయి. నేను మెల్లగా రెండుముక్కలు జోబీలో వేసుకొన్నాను. ఇంటివద్ద తింటే యెంత టేస్టుఫుల్‌గా వుండిందనుకొన్నావు ? నీవు కూడా ఒక వాలంటీర్‌గా చేఱ్ఱాదు ?

ద్వితీయ విద్యార్థి : అది సరే కాని, మన పాఠం రాకపోతే యీ వేళ బుగ్గలు నులిమేస్తాడు. అందులో యీ వేళ మంగళవారం. తలగొరిగించుకొని వస్తాడు. నీకు జామెట్రీ పాఠం వొప్పజెప్పను వచ్చిందీ ?

ప్ర.వి. : ఓ, వచ్చు ; త్రీ యాంగిల్స్ ఆఫ్ ఎ రైట్‌యాంగిల్ ఈజ్ ఈక్వల్ టు టు ట్రియాంగిల్స్.

ద్వి.వి. : నాన్‌సెన్సు నీకు జామెట్రీరాదు. వ్యాకరణం రాదు. (వత్తిచెప్పుచు) త్రీ యాంగిల్స్ ఆఫ్ ఎ ట్రియాంగిల్ ఆర్ ఈక్వల్ టు టు రైట్ యాంగిల్స్.

ప్ర.వి. : ఓహో ! ట్రయాంగిల్ లో వచ్చిందీ గల్భాఅంత ! ఇప్పుడు విను. (ప్రతిపదము ఒత్తిచెప్పుచు) త్రియాంగిల్స్ ఆఫ్ ఎ ట్రయాంగిల్ ఈజ్ ఈక్వల్‌టు టు రైట్ యాంగిల్స్.

ద్వి.వి. : రైట్. నేను వ్యాకరణ సూత్రాలు వొప్పచెబుతాను. అత్తకు ఇత్తు పరంబగునపుడు.

ప్ర.వి. : రాంగ్. అత్తునకు.

ది.వి. : అత్త గ్రాంధికం - అత్తు గ్రామ్యం. మీ అత్తను అత్తు అంటావా యేం ?

ప్ర.వి. : మేనత్తలో అత్తకాదోయ్ ఇది.

ది.వి. : కాకపోతే పిల్లనిచ్చిన అత్త. అత్త అత్తుకాదు ; ఏం పందెం ? ఇంకొక సూత్రం వొప్పజెప్పుకో.

కొన్నియెడల మశూచికార్థంబుగా భావిలో భూతంబుచూపట్టెడి.

ప్ర.వి. : మశూచి కార్థం కాదురా. తద్ధర్మార్థం.

ద్వి.వి. : నా నోట్సులో నేను చెప్పినట్లే వుంది.

రంగా : అబ్బాయీ, భావిలో భూతం కనబడితే భయంపుట్టదూ ?

ద్వి.వి. : ఒరే ! యీన యెవర్రో పిల్ల టాగూర్రో !

ప్ర.వి. : ఒరే సర్దారు ఇక్కణ్ణేవున్నాడ్రో.

(వెంకటరెడ్డి దగ్గరకు పోయి) ఈ వేళ యెంతమంది జైల్లో పడ్డారండి ? గాంధీ బైటున్నాడా ? జైల్లో వేశారా ?

వెంకట : బైటే వున్నాడు గాని, ఈమెకు కలరా తగిలింది.

ప్ర.వి. :
ద్వి.వి. : } (అదురుకొని ఒక్కటిగా) ఏంటి, కల్రానా!

రంగా : ఒన్ - టు - త్రీ

(త్రీ చెప్పగానే విద్యార్థులు"ఓరి బాబో" అంటూ పరుగెత్తుదురు. ఒకని చంకలోని పుస్తకములు క్రిందపడును. జవురుకొని పరుగెత్తును.)

రంగా : గుడ్ ! దే కెన్ యాజ్ వెల్ రెప్రెజెంట్ ఇండియా ఇన్ ది ఒలంపిక్ రన్నింగ్‌రేస్ (సిగరెట్టు కేసు తెరచి సిగరెట్లు లేకుండుటను చూచి) సిగరెట్ ప్యాకెట్టు పట్టుకొస్తాను.

కళ్యాణ : నాకుకూడా వొక కిళ్లీపట్టుకరండి.

రంగా : మీరింకా సెల్ఫ్ హెల్ప్, డిగ్‌నిటీ ఆఫ్‌లేబర్ నేర్చుకోవాల. ఫోర్డు వంటి కోటీశ్వరుడు తన బ్యాగ్ తానే తీసుకొని వెళ్ళతాడు. కిళ్లీ కొనుక్కోడానికి ఒక మీడియేటర్ ఎందుకు ? (అని కళ్యాణిరెడ్డి చేయిపట్టుకొని లాగుకొనిపోవును)

(మోటారు హారన్ వినబడును ; ఒక ప్లీడరు ఆయన భార్య ఆ దారిన వత్తురు. ఆయన ఖద్దరు పంట్లాము కోటు వేసుకొని యుండును. ఆమె సిల్కుచీర కట్టుకొని యుండును)

భార్య : టైమైందండి. ఇంకకొంచెం ముందుగా కోర్టునుంచి రమ్మంటే వచ్చారుగారు. నేనిప్పుడొక మీటింగులో ప్రెసిడెంటుగా వొప్పుకొన్నాను.

ప్లీడరు : ఏమ్మీటింగేంటి ?

భార్య : స్త్రీ జనోద్ధరణం మీటింగండి. నేనొక వుపన్యాసం వ్రాసుకొచ్చాను.

ప్లీడ : ఏం వ్రాశావు ?

భార్య : ఆంధ్రపత్రికలో వస్తే చూస్తురుగాని లెండి. ఇప్పుడు చెబితే స్వారస్యం పోతుంది.

(బిడ్డ యేడ్చును. వెంకటరెడ్డి లాలించును)

ప్లీడ : ఎవ్వరది ? (తిరిగిచూచి) హలో ! గుడ్ ఈవినింగ్ మిస్టర్ రెడ్డి.

భార్య : (కొంచెం ముందుకు వచ్చి) ఆ బిడ్డెవరండి ?

వెంకట : (రోగితట్టు చూపించి) పాపం ! ఆమెకు కలరా తగిలింది

ప్లీడ :
భార్య : } (ఒకటిగా) కల్రా!

భార్య : ఇక రాండి. మనమీదార్నే వెళ్లవద్దు. కార్ తిప్పమనండి. కాసిం, (అంటూ వెళ్ళును)

వెంకట : మీ కారు కొంచెమివ్వండి. ఈ పేషెంటును సెగ్రిగేషను హౌస్‌కు తీసుకొని వెళ్ళాలె.

ప్లీడ : (ఆశ్చర్యముతో) వాట్ ? ఓ! నో కలరా పేషంట్ ! న్యూమోడల్ బూయిక్ సెడన్-ఇంపాజిబుల్ (వెళ్ళును)

(ఇంతలో గమళ్ళవెంకటేసు, అతని భార్య, రెండుసంవత్సరముల బిడ్డ ప్రవేశింతురు. వెంకటేసు, దిట్టమైన యెదురు కఱ్ఱకు ఒక కొనన అన్నముమూట, చెంబు, సీసా, ఇంకొక ఒకొన అరటి పండ్ల చీపు కట్టి భుజముపై పెట్టుకొని యుండును. భార్య చంకబిడ్డను క్రింద దించును)

వెంకటేసు : ఈ సత్రంలో కూసోని రెండు మెతుకులేసుకొంటామె. అబ్బబ్బా ! ఏంపెజ, ఏంపెజ ! ఇశికేస్తే రాలటంలేదు. (కఱ్ఱదించి పెట్టి క్రింద కూర్చుండును)

(రోగి బాధపడును. భార్యా భర్తలు ఆమె తట్టు చూతురు. వెంకటరెడ్డి చేతిలోని బిడ్డ యేడ్చును. ఆయన లాలించును)

భార్య : ఆమెకు ఏం జబ్బు పాపం ! అట్లా బాధపడుతుండది.

(రంగారావు సిగరెట్టు త్రాగుచు, కళ్యాణరెడ్డి కిళ్ళీ నములుచు ప్రవేశింతురు)

వెంకట : ఈమెకు కల్రా తగిలింది ?

వెంకటే : (చివుక్కున అదరిపడి లేచి) ముందుగా చెప్పగూడదంటయ్యా, మాకాపరం ముంచడానికి చేశావా యీ పని ? (కళ్ళు భుజాన పెట్టుకొనును)

భార్య : ఈ బిడ్డకూడా ఆమెదేనా ?

వెంకట : అవునమ్మ

వెంకటే : ఇంక సొలుగాని రావే పెసంగం.

రంగా : అనదర్ రేస్

భార్య : పాలగ్గామాల యేడుస్తుంది.

వెంకట : మేము లోటాతో తాగిస్తే తాగలేదు.

భార్య : పాపం! నా చేతికిట్లియ్యండి, గుక్కెడు పాలిస్తాను.

రంగా : ఆహా ! డివైన్ మదర్‌హుడ్ !

కళ్యాణ : మొరటుతనం.

వెంకటే : నీకేం పిచ్చిపట్టిందా ? దెయ్యంపట్టిందా ? కుడిచికూసోని కల్లరతగిలిన మనిషి బిడ్డకు పాలిస్తానంటావేమే ? నీకేం చేటుకాలం ?

భార్య : వుండవయ్యా, పాపం ! పశిబిడ్డ ఏడుస్తుంటేను.

వెంకట : (బిడ్డను అందిచ్చును)

భార్య : (ఒక తట్టుకూర్చుండి బిడ్డకు పాలిచ్చును)

రంగా : గ్ర్యాండ్, గ్ర్యాండ్

వెంకటే : ఎంత గుండెలు తీసిన ఆడదానివె ! మళ్ళీ మనల్ని వూళ్ళోకి రానిస్తారంటే ? నువ్వేమి చావాల్నని వుండావంటే ?

కళ్యాణ : ఏమంటారు ? ఇన్‌స్టిక్ట్ ఆఫ్ సెల్ఫ్ - ప్రిసర్వేషన్ !

రంగా : విత్ వెంజన్సు

వెంకటే : ఏం ? బెల్లంకొట్టిన ఆాయాల ఊరికే కూసోనుండావు పలక్కుండా ? అట్లయితే నువ్వేచావు. నేపోతాను. (తన బిడ్డను చంకపెట్టుకొనును)

రంగా : ఒన్ - టు - త్రీ

భార్య : నా ఊపిరి గూడా పోసుకొని నువ్వే నూరేళ్ళు బతుకు.

వెంకటే : నేనేం అంత పనికిమాలినవాణ్ణనుకొన్నావా యేం నీ మతిలో ? నీ తస్సాదియ్యా, అట్నే కూసో, నేనూ కూసొంటాను. (బిడ్డను దించి తాను కొంచెము దూరముగా కూర్చుండును)

కళ్యాణ : ఈ మొరటు ముండాకొడుకు మీకు డిసపాయింట్‌మెంట్ కలిగించేలాగుంది.

రంగా : వెయిట్ అండ్ సీ

వెంకట : ఆమెను ఆసుపత్రికి తీసుకొని పోవాలంటే జట్కా వాళ్ళు రాలేదు. మేమిద్దర మున్నాము. బిడ్డనెత్తుకొని రావడానికి యింకొక్కమనిషి కావాల.

వెంకటే : (వెంకటరెడ్డితట్టు ఉరిమి చూచును)

భార్య : కల్లర తగిల్నోళ్ళకు ఆసుపత్రిలో మందిస్తారా ? ఇస్తే నయమవుతుందయ్యా?

వెంకట : మందిస్తారు. ఇంజక్షన్ చేస్తారు. తప్పకుండా నయమవుతుంది.

భార్య : అట్లయితే ఆసుపత్రికి తీసుకొని పొండయ్యాపాపం !

వెంకటే : ఈ పట్నవాసాల్లో వాళ్ళ మాటలు గాని, అంకమ్మ తగిలితే ఆసుపత్తిరిలో బాగవుతుందా ? మేకపోతుని మొక్కోండయ్యా నీకేం ముశించిందేమె అపాట్నే కూసోనున్నావు ? ఇంతా వచ్చిందానికి ఆతీర్థం దొరక్కపోయెను. పెసాదం కూడా దొరకనేలేదు. కాశముందుగా పొయ్యి దేవళంలో కూర్చుంటాము రావె. (లేచును)

భార్య : (కోపంతో) పసిబిడ్డకు పాలియ్యవద్దంటావాయేంటి ?

వెంకటే : పెసాదమె.

భార్య : (కోపముతో) నీ పెసాదం పెన్నలో కలిసింది. తీర్థం దిగబడ్డది. పాపం ! ఆ అమ్మ యెవరో దిక్కులేకుండా పడిపోయుంటే కాశ ఆసుపత్తిరికి తీసుకపోకుండాను. మనమేమన్నా రాయికట్టుకొని శిలా శాశిపితంగా వుంటామా? (వెంకటరెడ్డితట్టు తిరిగి) మీరొకతట్టు ఎత్తుకోండి. మా యింటాయన యింకొకతట్టుఎత్తుకుంటాడు. బిడ్డను నేను ఎత్తుకొని వస్తాను.

రంగా : దట్ ఈజ్ రియల్ వర్‌షిప్ ! గ్రాండ్ !

వెంకట : (ఆనంద పులకితుడై) తల్లీ, దండం పెడ్తున్నాను.

భార్య : మీబోటి గొప్పవాళ్ళు అట్లనవద్దండి. ఇదెంతబాగ్గెంలేండి.

వెంకటే : బయటికొచ్చినప్పుడుకూడా నామీద పెత్తనమేనా ? ఈ ఆడోటితో యేగేది కనాకష్టం. అయితే కానియ్యండయ్యా.

(వెంకటరెడ్డి వెంకటేసు దుప్పటి ఉయ్యేలగా కట్టి రోగిని దానిలో కూర్చుండబెట్టుచుందురు)

రంగా : (కల్యాణ రెడ్డితో) ఈ విలేజర్సుకు చదువులేదు. ఆర్టు, పొయిట్రీ తెలియదు. అయినప్పటికి హృదయంలో మాత్రము సింపతి విశేషంగా వుంది. గాంధీ టోపీల వాళ్ళుకూడా - గ్రాండ్ ! ఐ ఫీల్ (మనస్సులో భావ సంఘర్షణము కలిగిన వానివలె అటునిటు తిరుగును)

(ఉయ్యాలలో మధ్య కఱ్ఱదూర్చి ఒక తట్టు వెంకటరెడ్డి యింకొకతట్టు వెంకటేసు ఎత్తుకొందురు. వెంకటేసు భార్య రోగి బిడ్డనెత్తుకొనును. నరసింహం వెంకటేసు సామానులను తీసుకొని సైకిలుసీటు వెనుకనున్న స్ట్యాండ్ పై పెట్టి కట్టును. వాళ్ళ బిడ్డను సైకిలు సీటు పై నెక్కించుకొని తాను పట్టుకొని సైకిలు నడిపించును)

రోగి : (ఉయ్యేల యెత్తుకొన్న వెంటనే) నాయన్లకందరికి దండ్ణమయ్య. మీ చాత మోయించుకుంటున్నాను. పాపిష్టురాల్ని. మీ యింట్లో కుక్కగానైనా పుట్టి మీ రుణం తీర్చుకొంటాను తండ్రీ.

రంగా : (గద్గద స్వరముతో, కన్నుల నిండ నీళ్ళు క్రమ్ముచుండ) రెడ్డి ఐ ఫీల్ - నీ మానవసేవాపరాయణత్వం, ఆ పల్లెటూరి యిల్లాలి అవ్యాజ కారుణ్యం - నన్ను ముగ్ధుణ్ణి కావించింది. సిగ్గుపఱిచింది. (రోగిని నిర్దేశించి) ఈమె కృతజ్ఞతలో వుండే అ వ్యక్త మాధుర్యం నా హృదయాన్ని కరిగించింది. ఓహ్! ఇట్ ఈజ్ గ్రాండ్ - గ్రాండర్ - గ్రాండెస్ట్. డామ్ మై పొయిట్రీ - డామ్ మై ఆర్ట్. (వెంకటరెడ్డి వెనుకకువచ్చి భుజము కఱ్ఱకు ఆనించి) ఇప్పుడు నేను కృతార్థుణ్ణి. ఐ ఫీల్ హేపీ. హెయిల్ కాంగ్రెస్ ! హెయిల్ (కదలుదురు)

కళ్యాణ : మా మహర్షి యీ దృశ్యం చూస్తే !

(తెరపడును)



# నా దేశాటనం డైరి

## దువ్వూరి రామిరెడ్డి గారు

ఈ డైరీని ప్రకటింపవలసిన యక్కఱను గుఱించి కొన్ని మాటలు ఉపోద్ఘాత ప్రాయముగ చెప్పవలసి యున్నది. చిరకాలమునాడు దేశసంచారము చేయుటకై పోయియుండిన నాబాల్యమిత్రుడు రాఘవశాస్త్రి మొన్ననే యొకయుత్తరము వ్రాసెను.

ఆయుత్తరమును చదివిన వెంటనే ప్రవాసమునుండివచ్చిన మిత్రుని చూచినంత సంతోష ముదయించెను. ఈ జాబు చేరిన మఱునాడు రిజిస్టర్డు పోస్టుద్వారా పంపబడిన నోటుబుక్కు కూడ నాకు చేరెను. పాఠకులకు ఉత్తరములోని విషయములు తెలియుటకొఱకు దాని నిచ్చట పొందుపఱచితిని :

ప్రియమిత్రుడా :-

ఇంతకాలంవఱకు నీకు ఉత్తరము వ్రాయకుండా ఉండినందుకు మన్నించవలసిందని హృదయపూర్వకంగా వేడుకొంటున్నాను. రయిలుమార్గంగా యాత్రచేయవలసిందని మొట్టమొదట అనుకొన్నానుగాని, అదినాకు ఇష్టంలేక నైతేనేమి, ద్రవ్యాభావంచేతనైతేనేమి, తుదకు కాలిమార్గంగా యాత్రచేస్తున్నాను. ఈమధ్య నాకు జ్వరబాధచేత శరీరం అస్వస్థంగా వుండి ఈవూరి ఆసుపత్రిలో వారం దినములనుండి మంచం కరుచుకొని వున్నాను. ఈ విషయం మాయింట్లో చెప్పవద్దు - నాకేమైన అపాయం సంభవిస్తే నాడైరి అన్యాక్రాంతం అవుతుందనే భయంచేత నీకు పంపుతున్నాను. నీకంటె నాకు ప్రియమిత్రులులేరు. నాడైరీలో సారస్వతవిషయాలు, నాటకవిషయాలు, చిల్లరపాలిటిక్సు, ఇంకా యేమేమొ వ్రాసిపెట్టియున్నవి. అవి అన్నీ ప్రకటింపవలెననుకొంటె ఆనందరంగంపిళ్ళ డైరీకంటె పెద్దదవుతుంది. కాబట్టి ముఖ్యమైన విషయాలుమాత్రం ప్రకటింపవలసింది. దీనితో కూడా నాజీవితచరిత్రం లంకించినాను. ఆదర్శక ప్రాయంగా జీవితచరిత్రం వ్రాయదలచు కొన్నానుగాని కవిని కానందువల్లనూ, లేనిదాన్ని సృష్టించడం నాచేత కాని దానివల్లనూ తుదకు ఉండినది ఉండినట్లె వ్రాయవలసివచ్చింది. ఈ లోపాన్ని మన్నించవలసింది. ఇప్పటికే పెద్దజాబు వ్రాసి విసుగు పుట్టించినాను. ఒక్కమాట : మాతల్లిదండ్రులు, మామగారు, నాభార్య యేలాగా వుందోకూడా నాకు వుత్తరం వ్రాయవలసింది. నేను మళ్ళీ యెప్పుడు వస్తానో ముందుగా చెప్పలేను.

- ప్రియమిత్రుడు, రాఘవశాస్త్రి.

మొట్టమొదట అతని జీవిత చరిత్రమును ప్రకటించి తర్వాత నాతీతిక ననుసరించి డైరీ లోని విషయములను క్రమక్రమంగా ప్రకటించెదను.

## జీవితచరిత్ర

అసలు నాడైరీని ప్రచురించడానికి పూర్వం నా సొంతచరిత్రంకూడా వ్రాసి డైరీకి అనుబంధంగా లంకించమని నాస్నేహితుల కొందరి అభిప్రాయం. "నాస్నేహితులు" అని అనడంతోనే మీకు అనుమానం కలగడానికి యేలాటి అభ్యంతరమూ లేదు. "నా గ్రంథమును తిలకించి భాషాభిమానులైన నాప్రియస్నేహితులు కొందఱు దీనిని ప్రచురించుడని నన్ను పదేపదే కోరినందువలన వారిమాటలకు మాఱాడలేక యీ చిన్ని కావ్యమును మీకందించుటకు సాహసించితిని." అని పీఠికల్లో వ్రాసుకోవడం పోతన్న స్వప్నవృత్తాంతంలాగా చాలామంది గ్రంథకర్తలకి ఆచారమైంది కాబట్టి నా స్నేహితులుకూడా కవిసమయంలో అవతరించిన ఊహామూర్తులని మీరు భ్రమపడవద్దు. నేను వ్రాసేది కావ్యంగాదు కనుక ఆలాటిసందేహాలు కలగనవసరంలేదు.

డైరీలో విషయాలకి గౌరవం కలిగించడానికి వ్రాసిన పెద్దమనిషి జీవితవృత్తాంతంకూడ కొంచెం తెలిసి వుండడం భావ్యమని నామిత్రుల నమ్మకం. ఒకవేళ నా వుద్దేశంకూడాను. ఎవరికైనావొక గ్రంథం పట్టుకెళ్ళియిస్తే ముందుగా గ్రంథకర్తపేరు, అచ్చాఫీసు పేరు, ఉపోద్ఘాతం వ్రాసిన పండితుడి పేరు, అభిప్రాయా లిచ్చిన గొప్పమనుష్యుల పేర్లు చూచుకొని తర్వాత పుస్తకం వెల గమనించి ముందుగా గ్రంథంపైన తమ అభిప్రాయం యేర్పరచుకోని అనంతరం చదవడం ప్రారంభిస్తారు. నాన్ కో-ఆపరేషన్‌లో కాస్తాకూస్తా తిరిగిన గ్రంథకర్తలు వ్రాసే పుస్తకాల్ని పత్రికలు ఆదరిస్తాయి. కొందరికి గ్రంథంయోగ్యత వెల తీర్మానిస్తుంది. కొందరికి ఉపోద్ఘాతం ప్రమాణం. మరికొందరికి అచ్చులోపడ్డదంతా ప్రమాణం. ఈలాటి ఆచారం నాకు తెలియకుండా నాలోనే దాగి వున్నదని నాకు సందేహంగూడాను. మాసపత్రికల్లో వచ్చే వ్యాసాలని, పద్యాలని ఆథరు పేరు చూచే తోసివేస్తుంటాను. దురాచారాలు చాలాతొందరగా పట్టుబడతాయి. వదిలించుకోవడం కనాగష్టం.

ఇంగ్లాండుదేశంలో ఒకరాజ్యాంగ తంత్రవేత్త "If you want to succeed flow with the current good or bad" అని అన్నాడు. నేనుకూడా ఆలాంటి Easy going philosophers తెగకు సంబంధించినవాణ్ణె కనుక లోకాన్ని ప్రతిఘటించి నిలుచుకోవడం ఇష్టంలేక, ఎట్లయినా సొంతచరిత్రం వొకటి వ్రాసి డైరీకి ఉపోద్ఘాతంమోస్తరుగా అంటింతామని సంకల్పించాను. అందులో మధ్య వొకసందేహం. సొంతచరిత్రం వ్రాస్తే యెక్కడ గొప్పమనిషి

నౌతానో అనేభయంకూడా పీక్కుతింటుంది. సామాన్యులెవరు తమచరిత్రాలను వ్రాసుకోరు. సామాన్యులెవరు స్వీయచరిత్రాలు వ్రాసుకోరు కాబట్టి వ్రాసుకొన్న వారందరూ సామాన్యులు కారు అనే లాజిక్కులో పడ్డాను.

నేను కొంతమంది జీవితచరిత్రాలు చదివినాను. వాటన్నిట్లో సామాన్యంగా వుండేలక్షణాలు కొన్ని అవపడుతవి. తల్లిదండ్రులు బీదవాళ్ళుగానో, అనామీకులుగానో, అప్రయోజకులుగానో వుంటారు. గొప్పవాడు కాబొయ్యే కుఱ్ఱవాడు స్వయంకృషిచేతనూ, తెలివి తేటలచేతనూ అభ్యంతరా లన్నీదాటి తుదకు పొద్దుపొడుపు సూర్యడిమాదిరిగా ప్రకాశిస్తాడు. నాచరిత్రకూడా ఈమసోదాకు సరిపొయ్యేరకంగా వ్రాయవలసి వుంటుంది అన్నాను. నామిత్రుడు Mind, you are writing for the future అని అన్నాడు. వాడికి ఉత్సాహం కలిగినప్పుడు ఇంగ్లీషులో మాట్లాడే అలవాటు. త్వరితం కొంచెం తగ్గినప్పుడు ఇంగ్లీషులో చెప్పినదానిని తెలుగు లోకి తర్జుమా చేస్తాడు. “writing for the future” అంటె ఏమిటి? అని అన్నాను. అది Genius యొక్క లక్షణం అని వాడు వాదించాడు. సమకాలికులు తన్ను తెలిసికోలేరని చెప్పడం, భవిష్యత్ కాలానికిగా వ్రాస్తున్నానని తన్ను తాను వోదార్చుకోవడం Genius లో అంతర్గర్భితమని నామిత్రుడి విశ్వాసం. ఈ గొడవ గద్యం వ్రాసేవారికి పనిలేదని నేను చెప్పినాను. అర్థము స్ఫురింపని పదసమాసాలు గుప్పించే స్వతంత్రకవులు కొందరు భావప్రకటనా సామర్థ్యములేని లోపాన్ని ప్రతిభగా సమర్థించి యితరులను దూషించడమే గాకుండా భవభూతి తెచ్చుకొన్నంత కోపము తెచ్చుకోని “యేనామకే చిదిహనః ప్రథయంత్యవజ్ఞాం” అనే శ్లోకం నమూనాపెట్టుకోని పద్యాలు వ్రాస్తారు. కొందరిపట్టుదలలు చూస్తే చిత్రంగావుంటుంది. Present generation నోట్లో మట్టిగడ్డకొట్టాలనే వుద్దేశం మనస్సులో పెట్టుకోని కవిత్వాలల్లుతున్నారు అనిఅన్నాను. నామాటలు నామిత్రుడికి కర్ణకఠోరంగావుండేవి.

నేను - ఒకవేళ నేను జీవితచరిత్రం ఆదర్శక ప్రాయంగా వ్రాస్తే నాసంగతి తెలిసినవాళ్ళు చూచి నవ్వుతారనుకొంటాను.

మిత్రుడు - నీకేమాత్రం సందేహం వద్దు. ఎవరైనాసమకాలికులు కొంచెము హేళనంగా మాట్లాడినప్పటికీ “మానావమానములు దేహంబునకేగాని ఆత్మకులేవు” అనే పెద్దలవాక్యం చొప్పున philosopher’s breadth of mind. తో కొంచెం వోర్చుకొంటే భవిష్యత్ కాలమంతా నీదే అవుతుంది. కాలం ప్రతివాడికీ గౌరవంతెస్తుంది. బ్రతికి నన్నిదినాలు తిట్టిపోస్తుండే అత్తగారు కోడలు చచ్చిన తరువాత “ మాకోడలంత వినయవతి నేను పుట్టిబుద్ధెరిగినాక చూడలే”దని వొట్టుపెట్టుకొంటుంది.

మిత్రుడి వాదధోరణి నాకునచ్చింది. No greatness with out sacrifice అని అన్నాడు. ఏసుక్రీస్తు ప్రజలను ఉద్ధరించడానికిగా కొరతబడి దేవుడి కొడుకై ప్రతిక్రీస్తుదేవాలయంలో శిలువ అవతారంతో వెలుగుతున్నాడు. నేనుమాత్రం మానాన్ని యెందుకు బలియ్యకూడదు. Any sacrifice అని అన్నారు.

అయితే యిందులో నాకొక్క అనుకూలం. ఆదర్శకప్రాయమయిన జీవితచరిత్రవ్రాయడానికి సగము సామగ్రి చేకూరినట్లే. నేను గొప్పమనిషినౌనో కాదో అనేవిచారం లోకానికి వదిలిపెట్టివేశాను. కాని దైవదత్తంగా మాతల్లిదండ్రులుమాత్రం బీదవాళ్లే. ఉద్యోగం వల్ల జీవనం. ఉద్యోగం అంతపెద్దదికూడా కాదు. తాలూకా కచ్చేరిలో మాతండ్రిగారు Despatching clerk గా నౌకరీచేసి ఆపదవికి చలనంలేకుండా పించెను పుచ్చుకొన్నారు. మేము యిద్దరము అన్నదమ్ములము. నేను పెద్దవాణ్ణి. చిన్నవాడు థర్డుఫారమువరకు చదివి పరీక్షలదినాల్లో అయ్యవారిపై తిరగబడి సస్పెండయి శుభ్రంగా యిల్లుచేరినాడు. పరీక్షకు పోకపోతే పరువుదక్కుతుందనే వుద్దేశంతో వాడల్లా చేశాడని బడిపిల్లల అభిప్రాయం. అందులో నేనుకూడా యేకీభవించాను.

నాయనగారి నసకొట్లుపడలేక వాడు పంచ పాకేశయ్యగారి కాఫీహోటలులో నవుకరికి ప్రవేశించాడు. ఈనౌకరి మాతల్లిగారికి అవమానకరంగా వుండింది. ఈనౌకరీమూలంగా వాడిపైన కసితీర్చుకోవాలని మాతండ్రిగారి పట్టుదల. ఎవరివుద్దేశాలు ఎట్లాగైతేనేమి వాడికిమాత్రం మంచికాలం. చేరిన రెండునెలలు దాకా వాడు అమ్మినదానికంటె రెట్టింపుగా ఫలహారాలు తిన్నాడని హోటలుఅయ్యరు నాతో చాలావిసుగు కొన్నాడు. మంచిమాటలతో సరసపెట్టినాను. మాతమ్ముడు నేననుకొన్నంత తిండిపోతురామన్నగాదు. ఇప్పుడు స్వతంత్రంగా వొక కాఫీహోటలుపెట్టి కర్చులుపోను యిన్నూరురూపాయలు సంపాదించుకొంటూ యే గ్రాడ్యుయేటు కంటె గూడా నెమ్మది నెమ్మదిగా సంసారము జరుపుకొంటున్నాడు.

మానాయనగారు Old lower secondary చదివినారు. ఆయన గుమస్తాగిరి చేస్తుండేటప్పుడు పొరిగింటి కామాక్షమ్మ "మీ యజమానుడు మాజిస్ట్రేటు అవుతాడటే?"అని మాతల్లిని అడిగిందట. ఆమాట యెట్లానోతల్లోదూరి మళ్ళీ బయటికి రాలేదు. నీవెప్పుడు మేజిస్ట్రేటు అవుతావు అని పాప మాముసలాయన్ని ప్రతిదినం పీడిస్తూ వుండేది. "మనకెవ్వరిస్తారే మేజిస్ట్రేటు ఉద్యోగం" అని మానాయనగారు ఒక్కొకసారి బతిమాలుకొన్నట్లూ ఒక్కొక్కసారి విసుగుకొంటూ కోపగించుకొంటూ చెప్పేవాడు. మాతల్లి నమ్మేదిగాదు. "మీదంతా ప్రతిదీరహస్యమేనండీ" అని నిష్ఠూరా లాడేది. ఈపరస్పరం వాదప్రతివాదాలతోనే యిరవయినాలుగు సంవత్సరాలు గడచిపోయి మానాయనగారు ఫించను పుచ్చుకొన్నారు. నేను

స్కూల్లో చదివేటప్పుడు "అబ్బాయీ, ఒకవేళ మీనాయన గొప్పవుద్యోగాలు చేయక పోయినా నీవైనా బియ్యే పాసయ్యి మేజిస్ట్రేటు ఉద్యోగంచేసి నాముచ్చట తీరుస్తావుగదూ" అని నన్ను ముద్దుపెట్టుకోని మా నాయనమ్మ నాకు జోబీనిండా పతనాలుగింజలు పోసేది. ఆమెకు అధికారంపైన కొంచెంప్రీతి. మాతండ్రిగారికి గొప్పతనం మీద యిష్టంలేక మేజస్ట్రేటు కాకుండా పోయినాడని ఆమె కనుమానం. నేను గొప్పవుద్యోగం చేస్తే చుట్టుపట్టుఇండ్ల ఆడవాళ్ళని మజ్జిగ తెచ్చిపోసే గొల్లదాన్ని కొంచెంగద్దించి మాట్లాడవచ్చునని ఆమెయిష్టం.

మానాయనగారి యిష్టంవేరే. నన్నువకీలు వృత్తికి తయారుచేయవలసిందని ఆయన పట్టుదల. నా బియ్యే చదువుకే చాలాడబ్బు కర్చుపడ్డది. మాకుండే రెండెకరాల భూమి ఆడుమానంలో చిక్కుకొన్నది. మా అమ్మనగలు గూడా కొన్ని అమ్మివేసి నాచదువుకే అర్పించింది. ఇక నాబియ్యేల్ చదువుకు డబ్బుయెవరిస్తారు ? అవిషయం నాకు వదలి పెట్టవోయ్, నేనొకప్లాను వేసినాను అన్నాడు మాతండ్రి. వకీలైతే గౌరవానికి గౌరవం, ధనానికి ధనం Independence కు independence, public life, politics, patriotism హడావిడి రభసం, every blessed nonsence లో ప్రవేశింప వచ్చునని ఆయన తలంపు. నాన్నా, యీ కాలంలో ప్లీడరువృత్తిలో లాభంలేదు. ఇంటికి రెండేసి మూడేసి బోర్డులు తగిలించి వుండడమేగాని గ్రాసానికి కూడా జరగడం కనాగష్టం అని నేను జాలిపడ్డాను. ఇదంతా వుత్తఅబద్ధం. మననెల్లూరుజిల్లా పుష్పకవిమానం వంటిది. ఎందరెక్కినా యింకొక్కరికి చోటువుంటూనే వుంటుంది. ఆహా! Nature లో సూశావా యెంత inter-dependence యెంత com-pensation! మన జిల్లాలో రెడ్లున్నారు. కల్పతరువులు ! పాడియావులు ! మనకు దేవుడు తెలివిచ్చినాడు. వాళ్ళకి తెలివితక్కువ తనం యిచ్చినాడు. గోటితో పొయ్యే తగవును కొండంత చేస్తారు. ఆ - వూ - అంటే పార్టీలు పెట్టుకోవడం, కూనీలు, దొంగ సివిలు కేసులు. కష్టపడి సంపాదించిన డబ్బు ప్లీడర్ల కాళ్ళముందర పోసి దాసానుదాసులై ప్రవర్తించడం ; పెద్దవాళ్ళు సంపాదించిన మాగాణిభూములను అడుమానం పెట్టడం ; ప్రయివేటు బ్యాంకులలో రెండు రూపాయలకు వడ్డీకి తేవడం ; మూడుసంవత్సరాల్లో వడ్డి అసలంత కావడం ; అయ్యకులోకం తెలియడం ; పశ్చాత్తాపపడడం; వెనుకచింతించుట వెఱ్ఱితనమని స్నేహితులు తమాషాగా వోదార్చడం ! ఇట్లాంటి పరిస్థితులలో ప్లీడరీ వృత్తి లాభకారి కాదని చెప్పడం బుద్ధిమాంద్యమని మాతండ్రి నొక్కి చెప్పినాడు. ఆయన వుత్సాహాన్ని తొలగించడం కష్టము. ఎట్లా అయితేనేమి నాబియ్యేల్ చదువుకు, నావివాహానికి కలసి వచ్చేటట్లు మానాయన ఒక పన్నాగం ఆలోచించాడు.

మాబంధువుల్లో కొంచెం డబ్బుగలిగిన శ్రోత్రియందారు డొకాయన వున్నాడు. వచ్చినమక్తాధాన్యం యింటికర్చులకు పెట్టుకొంటూ, యితరుల పనులుచేసి పెడ్తూ సాయంకాలం

నాలుగుగంటలయ్యేసరికి ప్రోగ్రసివ్ యూనియన్ రీడింగు రూములో హాజరవుతాడు. న్యూసుపేపర్లకి యీయనంత faithful గా వుండేమనిషిని మరెవ్వరిని నేను చూళ్ళేదు. అడ్వర్టైస్మెంట్ల పేజీల మొదలుకొని Printed and published by so & so అనేవరకు వోపికతో చదువుతాడు. ఈయనగారు పేపరుతీసుకొంటె సాయంకాలము యెనిమిదిగంటల వఱకు యింకొక నరమానవుడికి ఆశలేదు. యుద్ధకాలంలో కామయ్యశాస్త్రిఅంటె రీడింగురూముకు వచ్చేవారికంతా హడలు. లేటుగా ఆఫీసులకు పొయ్యేవారు, తొందరపని వుండి ఆదలా బాదలా పొయ్యేవారు కామయ్య శాస్త్రి కనుబడితే దూరంగానేచూచి సందుదారిలో జారుకొనేవారు. గ్రహచారంచాలక దొరికితే కనీసపక్షం ఒకగంటైనా నిలవేసి జర్మనుయుద్ధాన్ని గుఱించి సేనలునడిచిన స్ట్రాటజిక్ పాయింట్లగుఱించి laborious గా వివరించేవాడు. ఎవరూ అడగకపోయినా తానువ్రాస్తుండేయుద్ధ చరిత్రం యింకా పూర్తిగాలేదు ఇంకాకొన్ని అథార్టీసు కావలె అని బలాత్కారంగా ప్రస్తాపించేవాడు. ఆయన్నుకొంచెము భూషించవలసింది అని అనుకొంటె short-cut వొకటివుంది. " యేమండి కామయ్యశాస్త్రులుగారు మిమ్మల్ని walking encyclopaedia of war news అని రీడింగురూములో అంటుండినారండి" అంటెచాలు.

రీడింగురూము న్యూసుపేపర్లలో కొంతకాలము War news columns బహుచిత్రంగా మాయమైపోతుండేవి. కారణం తెలిసేది లేదు. Librarian కు కామయ్య శాస్త్రిపై అనుమానం తట్టింది. కొంచెం ముక్కుపొడిపెట్టండి అని హఠాత్తుగా జోబీలో చేయిపెట్టేసరికి రెండు కాలముల రూటరు టెలిగ్రాముల తునకలు దొరికాయి ! పాప మాయన బిత్తరపోయాడు. నాయుద్ధచరిత్రంలోకి అథారిటీసుకావాలె అందుకోసం చింపుకొన్నాను అని గౌరవంగానె చెప్పినాడు. నీయుద్ధచరిత్రందొంగలుదోలా, అందరు చదివిందాకానైనా వుండనీయవయ్యా అని అందరూ చీవాట్లు పెట్టినారు.

ఒకతూరి రీడింగురూములో ఆయనకు, చాలాపరాభవం అయింది. ఆంటివెర్పుకోట జర్మనీవాళ్ళు పట్టుకొన్నారని ఆవేళ పేపర్లో తెలిసింది. ఇక అక్కడ చదువుకొనేవాండ్లను సరిగా చదువనిచ్చినవాడు కాడు. ఆయన దగ్గర యుద్ధం జరిగిన నాలుగేళ్లు సర్వకాల సర్వావస్థల్లో రాయల్ అట్లాసు వుండేది. యూరపు మ్యాపునిండా యెఱ్ఱసిరాచుక్కలూ గీతలూ, పేపరు చదువుకొనేవాళ్ళ ముందు అట్లాసుపెట్టి " ఏమండి సూచారా యీ మార్గంగా సేనలు నడిచాం అనేసరికి "యిశ్శూ-మమ్మల్ని వూర్కేవదలి పెట్టండి. మాకు గూడా దేవుడిచ్చిన మెదడుంది. కళ్ళున్నాయి." అనే వాళ్లు. పాపము యీలాగా ప్రతివారిదగ్గిర విసిరికొట్లుతిని మెల్లగా ఇంటికి పొయ్యేవాడు.

కామ - ఏమె; యిట్రా. మళ్లీపోదువు. నేను నిన్ననుకొన్నట్లే అయింది.

భార్య - ఏమీ - వాళ్లాపయికం యిచ్చారా. అయితే తేండి - పెట్టెలో పడవేస్తాను.

కామ - నీకేం పగలు నలభయిగెళ్ళు పయికంతోనే కలవరింపుగా వుంది. ఆవెధవ విషయాలు నీతో చెప్పవచ్చినాననుకొన్నావా.. అదికాదే - ఆంటివర్పు కోట జర్మనీవాళ్లు పట్టుకొన్నారె. ఏడుమైళ్ళదూరంలో వుండి మూడుదినాల్లో నాలుగుఫిరంగి దెబ్బలతో ఝుమాయించి పట్టివేశారె !

భార్య - యిందుకేనా నన్ను పిలవడం. మీకు యింతకంటె వేరే వుద్యోగం కనబళ్ళేదు. ఆపెద్దవాళ్ల పుణ్యాన సంపాయించిన ఆకాస్త్రాశ్రోత్రియం వుండబట్టి ఈగంజి నీళ్ళయినా దొరుకుతున్నాయి. కట్టెలదొడ్డికి పోయి కట్టెలు ఎత్తించుకరమ్మని నెత్తిన నోరుపెట్టుకొని కొట్టుకోంగా యానాది వెధవను పంపించారు. ఆకుంక పచ్చికట్టెలు తెచ్చి పడవేశాడు. ప్రొద్దుటినుండి వూదుతుంటె యింతవఱకు పొయి మండాలేదు మాడా లేదు. గంటలప్రకారం విస్తరిముందు కూసోవాలి. పాపం వండన్నా పెడ్తే తినవైనా తింటారు. అదెంత సుగుణం అని విసుగుకుంటూ భార్యయింట్లోకి పోతుంది. "ఇంట్లోగాని బయటగాని డబ్బు-డబ్బా-డబ్బా- అని ఒకటేగోల ! విజ్ఞానంపైన యేమాత్రం ఆసలేదు. ఆదరణ లేదు. ఎక్కడపట్టినా స్వార్థపరత్వం - ఎగతాళి - హేళన - ఏదో పెద్దమహమ్మారిరోగం యీలోకాన్ని చుట్టుకొని పీల్చేస్తుంది" అని కామయ్యశాస్త్రిగారు మంచంమీద తుండుగుడ్డ పఱచుకొని నిదురపోవడం సామాన్యంగా ఆయన యుద్యోగం.

శాస్త్రిగారికి పెండ్లికి యెదిగిన వొక కొమార్తె వుంది. ఆస్తిలేకపోతే అంతసొగసైందని చెప్పడానికి వీలులేని సామాన్యరూపవతి. మానాయన లేనిపోని పనులుకల్పించుకొని వారియింటికి పోతూవస్తూ పాతబంధుత్వం కలియవేస్తూ మధ్యేమధ్యే నా తెలివి తేటలు పొగుడ్తూవుండేవాడు. ప్రస్తుతరాజకీయ విషయాలనుగుఱించీ ఆంధ్రవాఙ్మయాన్ని గుఱించీ విధవా వివాహాలనుగుఱించీ ఆంధ్రపత్రికకు వ్యాసాలు వ్రాస్తుండేవాణ్ణి. ఆవ్యాసాలు పడ్డపత్రిక తీసుకొని మెల్లగా as if nothing happened to the world అన్నట్లు మానాన్న కామయ్యశాస్త్రి యింటికిపోయి యేవోన్యూస్ చదివినట్లుగా అభినయించి అకస్మాత్తుగా నావ్యాసాన్ని చూచినట్లుగా నటించేవాడు. అంతలో యేమండి సోమన్నశాస్త్రులు గారూ అందులో యేమన్నా చిత్రమైన న్యూస్‌వుందా అని ఆయన అడిగేవాడు. ఏమీలేదండి, మనవాడున్నాడే రాఘవుడు భారతాన్ని గుఱించి వొక వ్యాసం వ్రాశాడు. అది అచ్చులో పడ్డాదండి. మనవా డిప్పుడిప్పుడు కొంచెం ప్రయోజకుడవుతున్నాడు. వాడికి వివాహం గూడ తలపెట్టుకొన్నాను అని మెల్లంగా unconcerned గా ఒకముక్క జారవిడిచేవాడు మా నాన్న. నాకున్నూ

శాస్త్రిగారికిన్ని రీడింగురూములో మాటలు జరిగాయి. ఆయన వస్తుండగానే తలావొక్కొక్క న్యూసుపేపరు అందరు జాగ్రత్త చేసుకొన్నారు. తీసుకొంటె ఇవ్వడని భయం. నేను గతసంవత్సరం పేపర్లో వొక అడ్వరుటయిసుమెంటుకొరకు వెదుకుతూ వుండినాను. కామయ్యశాస్త్రి నాదగ్గరకూర్చొని బహుదీనంగా పేపరు అడిగినాడు. నేను ధారాళంగా యిచ్చినాను. నమ్మకంమీద తేదీచూడకుండా పేపరంతా చదివి టేబిలుపైన పెట్టినాడు. ఇట్లా అప్రయత్నంగా ప్రారంభమైన మాపరిచయం అన్యోన్యప్రశంసలవల్ల మతికొంత గాఢమైంది. ఆయనవ్రాసిన యుద్ధచరిత్రను నాకంటే వోపికతో వినేవాళ్ళు ఇంకెవరూలేరు. నా వ్యాసాన్ని ఆయనకంటె మెచ్చుకొనేవాళ్ళు అంతగా లేరు. వొకరికి వొకరు అంతా ఆదరింపూను.

నావోర్పు మానాయనగారి ప్రయత్నం గట్టెక్కింది. కామయ్యశాస్త్రిగారి కూతురినే నాకిచ్చి వివాహం చేసినారు. పెళ్ళి అయింది మొదలుచేసి "ఏమండో మీ అల్లుణ్ణి బియ్యేల్‌కు చదివించరూ" అని మానాయన అడిగేవాడు. మీ కెందుకండీ ఆవ్యామోహం. వాడి tendencies ప్రకారం develop కానీయండి. వాడికి పత్రికలకు వ్యాసాలు వ్రాయడంలో మహానిపుణత్వం వుంది. Geniusను ఇప్పుడెవ్వరును recognise చెయ్యరు. second rate మనుష్యులదే కాలము. నాయుద్ధచరిత్రను గురించి యెవరైనా శ్రద్ధతీసుకొంటున్నారా. నేను మరణించినతర్వాత ఏసాహిత్య పరిషత్ వారికో నాపుస్తకం దొరికితే అప్పుడువారు ప్రచురిస్తే అది బయటికి వస్తుంది అని మా మామగారు చెప్పేవారు. సాహిత్యపరిషత్తు వాళ్ళు పాతపుస్తకాలేగా అచ్చువేస్తారు అని మానాయనగారు అన్నారు. నేను వ్రాసినపుస్తకంగూడా పాత కాకితాలపైన్నే వ్రాసిఉంది. చాలాకాలం అయ్యేవఱకు వారిచేతుల్లో పడకుండా భద్రంచేస్తాను, అని మామాగారన్నారు. మీ పుస్తకాన్ని వాళ్ళు అచ్చువేయురండి. ఆ పరిషత్తు కొన్ని మూలసూత్రాలపైనడుస్తుంది. పుస్తకం పాతదిగావుండవలసింది. ఎంతపాతదైతే అంతమేలు. అచ్చువేయుటకు తగని చెత్తగావుండినప్పటికిన్నీ సరే కనీసపక్షం మున్నూరేండ్ల వయస్సుండవలెను. మనుష్యులతలకాయలు Literary museums అని వీరిఅభిప్రాయం, అని మానాన్న అన్నాడు. అందుకైతే నాపుస్తకం ఉపకరిస్తుందని మామగారు సంతోషపడ్డారు. 'అయితే మనపిల్లవాణ్ణి బియల్‌కు చదివించవద్దంటారా?' 'ఎందుకండి వాడు యెడిటర్ కావలసినంత మనిషి. ఇటువంటివా డున్నాడని తెలిస్తే ఆంధ్రపత్రికకు సంపాదకుడుగా రమ్మనిపిలుస్తారు. ఇప్పటికే తెలిసివుంటుందనుకొంటాను.' ఈసంభాషణలు వినివిని నాయోగ్యతపై కొంచెము నాకు నమ్మకం పాటమరిస్తూవుండేది.

మా తండ్రిగారి యిష్టప్రకారం బియల్ చదవడమున్నూ, మా మామగారి భ్రాంతిప్రకారము నేను సంపాదకుణ్ణి కావడమున్నూ, మాతల్లిగారి అధికారేచ్ఛ ప్రకారం నేను మేజస్ట్రేటు

కావడమున్నూ నాకు ఏమాత్రం యిష్టంలేదు. మాతల్లిదండ్రులకు ఆశాభంగం కలిగించే దుర్బుద్ధి నాకొకటి కలిగింది. దేశాటనం చేయవలసిందనేకోరిక అంతరంగంలో అడుగుభాగాన్నుంచి బొగడబొడిచి నేటికి పైకితేలింది. దినదినంప్రేరేపణ మిక్కుటమైంది. విదేశాలు చూడడానికి ప్రస్తుతం వీలు లేక పోయినప్పటికిన్నీ స్వదేశమైనా చూడవలసిందనే కోర్కె నన్ను బాధిస్తుండేది. చెప్పితే నాన్న వొప్పుకోడు. మామగారు కోపగించుకొంటారు. తల్లి కంటికి కడివెడునీళ్ళకు ఏడుస్తుంది. భార్య యింకా సంసారానికి రాలేదు. ప్రణయసంబంధమైన చిక్కులు విరహాలు ఏమీ లేవు. యోచించినాను. ఏమీ తోచలేదు. మామగారు యింట్లో లేని సమయంచూచి శారదా అన్నాను భార్యను. ఏమండీ అన్నది.

నేను - నేనొక రహస్యం చెబుతాను. దాచివుంచు కోగలవా ? మీ నాన్నకు అమ్మకు మరెవ్వరికి చెప్పగూడదు.

భార్య - పూర్వపతివ్రత లెవరైనా యిలా భర్తల రహస్యాలు దాచిపెట్టున్నారా ?

నేను - చాలామంది.

భార్య - అట్లయితే చెప్పండి.

నేను - నాకు హిందూ దేశమంతా ఒకమాటు తిరిగి చూడాలని బుద్ధిపుట్టింది. నాప్రయత్నానికి నీవుకూడా సహాయం చేస్తావుగదూ ?

భార్య - నేను మిమ్మల్ని వదిలిపెట్టి వొక్కనిమిషంగూడా వుండలేనండి. రాముడితో గూడ సీత అరణ్యాలకు పోయింది. హరిశ్చంద్రుడితోగూడా చంద్రమతి అన్ని అష్టకష్టాలు పడ్డది. దమయంతి సమాచారం మొన్న ఆంధ్రసభవాళ్ళు వేసిన చిత్రనళీయంలో చూశాంగా; పతివ్రతలెప్పుడు వాళ్ళభర్తల్ని వదిలిపెట్టి వుండరట. యుద్ధం లోకిగూడా వాళ్ళవెంబడి పోతారట. సత్యభామయుద్ధం చేసిందట గదండీ.

నేను - నేను రాముడిమోస్తరుగా పితృవాక్యపరిపాలనం చేయడానికి బియల్ చదవడానికి పోవడం లేదు. హరిశ్చంద్రుడి మాదిరిగా వొకసుగుణాని కొరకు నూటతొంభయి సుగుణాలను బలిచ్చి కష్టపడడానికి పోవడంలేదు. నలుడిమోస్తరుగా మీనాపు ఆటలో రాజ్యం పోగొట్టుకొని అడవిదారిపట్టడానికి తయారుకాలేదు. అట్టాంటి సమయంలో పతివ్రతలు భర్తవెంటపడవచ్చును. నేను దేశంచూడడానికి పోతున్నాను.

భార్య - నేను మీవెంటరాకపోతే పతివ్రతను కానో యేమోనని భయమేస్తుంది (కళ్ళనీళ్ళు పెట్టుకొనును)

నేను - ఎందుకు ఏడుస్తున్నావు. నీకీపిచ్చ యెప్పుడు తల్లోకి యెక్కింది ?

భార్య - మొగవేషంతో వుండే ఆడవాళ్ళని మా నాన్న మీకిచ్చి పెండ్లిచేయలేదు.

నేను - వోయిబాబో ! యెక్కడ దీపురాణధోరణి ? ఒక్కనిమిషంలో మనము నాయికానాయకుల మైనాము. ఏ ఆశుకవియైనాదగ్గరవుంటే మనలను గురించి అడుగుతిప్పకుండా ప్రబంధం అల్లేవాడు ! శారదా నిజం చెప్పు. ఎక్కడివీమాటలు.

భార్య - రాముడు అరణ్యానికి పొయ్యేటప్పుడు సీతనుకూడా తీసుకొని పోనంటే సీత అట్లానిందించిందట.

నేను - అట్లాచెప్పు, My good god ! నీవెక్కడచదువు కొన్నావు ?

భార్య - National school లో

నేను - ఓ say so, అందువల్లనే యీ patriotic పాతివ్రత్యము ! నీవు పతివ్రతవేనని certificate యిస్తాను. నీకాభయంలేదు.

భార్య - అయితే పతినివదిలి పెట్టివుండిన పతివ్రత పేరు వొకటి చెప్పండి సూస్తాం.

నేను - నీకాపిచ్చ యింకాపోలేదు. ఎవరో వుంటారు, తలంపునకు రాలేదు - ఆ - ఊర్మిళ. లక్ష్మణుడి భార్య పణ్ణెండేళ్ళు భర్తనువదిలిపెట్టి అమ్మగారింట్లో వుణ్ణింది.

భార్య - ఆమెపేరు పతివ్రతలపట్టీలో లేదండి.

నేను - లేకపోతే మనము చేరుస్తాము. లక్ష్మణుడిభార్య పతివ్రతకాదని యెవరంటారో చెప్పమను చూస్తాం.

భార్య - అట్లయితే మీ ప్రయాణానికి నేనొప్పుకొంటానండి.

నేను - వొప్పుకోవడమేగాదు. ఈ సంగతి యెవ్వరికీ తెలియకూడదు. మామగారు నిన్నడిగితే స్నేహితులను చూడడానికి ఉత్తరాదికి వెళ్లవలెనని అనుకొంటూ వుండినాడని చెప్పు. తెలిసిందా. సరేనన్నది భార్య. ఆవేళరాత్రే నెల్లూరు వదలినాను - ఇంకా నాజీవితచరిత్రం పూర్తికాలేదు. నేను దేశాటనంచేసి ఊరుచేరిన తర్వాత నన్నెవరైనా గొప్పమనిషి అంటే కొరవ పూర్తి చేస్తాను.

భారతి - 1927 ఆగష్టు (ప్రభవ-శ్రావణము) సంచిక నుండి ఉద్ధృతము.

# కవిత్వ తత్త్వ నిరూపణము

## 1. కవి

ఓ కవీశ్వరుడా, నీవు సృష్టికర్తవు. నీ సృష్టి లోకోత్తరము, అనన్య పరతంత్రము, ఆనందదాయకము. నీ మహిమ వర్ణనాతీతము. నీ నిర్మాణము దైవసృష్టిని సైత మధఃకరించు చున్నది. నీ కల్పన యాదర్శప్రాయము.

నీ సృష్టియందు లతికలు జంగమములు; శంపాలతలు నిశ్చలములు; కలువకంటులు, కలకంఠ కంఠులు, చంద్రముఖులు విద్యుల్ల తాంగులు నీ పట్టణములలో చరియించు సామాన్య స్త్రీలు! నీకు పరిచితలైన యువతులెల్లరు సౌందర్యవతులు; హృదయ సమ్మోహన మంత్రాధిదేవతలు! అందఱు సీతలు, సావిత్రులు, దమయంతులు, చంద్రమతులు, ద్రౌపదులు, శకుంతలలు.

ఓయి కవితాశిల్పీ, నీచే సమ్మానింపబడిన పురుషులందఱు వీరులు, లోకోత్తరకార్య ధురంధరులు! భూమిని చాపకట్టుగా చుట్టగలిగిన హిరణ్యాక్షులు; విశ్వమును మూడడుగులతో కొలువగలిగిన వామన మూర్తులు; రాజలోకమును గండ్రగొడ్డంట నఱికి రక్తప్రవాహముచే పితృతర్పణము గావించిన పరుశురాములు; ఆల్గరగంగ వేణుగానము గావించిన శ్రీకృష్ణమూర్తులు : సముద్రమును మథింపగల దేవదానవులు; స్వర్గమందు ప్రవహించు గంగానదిని భూమికి నవతరింప జేయగల భగీరథులు; సృష్టికి ప్రతిసృష్టి గావింప గలిగిన విశ్వామిత్రులు!

నీ పట్టణములోని చంద్రశిలాసౌధములు సూర్యచంద్రుల రాకపోకలు నడ్డగింపగల యంతటి యున్నతములు, నీ తోటలోని వృక్షములెల్ల ఫలవంతములు, లతలెల్ల కుసుమభరితములు, షడృతుధర్మము లేక కాలమున నీ యుద్యానమును సేవించుచుండును; ప్రకృతియంతము నీ దృష్టికి సచేతనము; మేఘములు, హంసలు, కాముకీకాముకుల ప్రణయసందేశముల గొనిపోవుచుండును.

ఓయీ, నీ సృష్టి కాలబద్ధముగాదు. అనుక్షణ యౌవన విజృంభణమువలన, కంచెల బిగియుచుండ "ప్రియంవద నిర్దయముగ నా కంచెలవల్కలమును బిగించి ముడివేసినది. నీవు కొంచెము సడలింపుము" అని యనసూయతో ముగ్ధముగ బలుకుచు పూదీవలకు జలసేచనము సేయుచుండిన శకుంతల దుష్యంతుని కన్నులకు నిర్వాణసామ్రాజ్యమై కనుపట్టిన శకుంతల, నేటికిని అదేవిధముగా మా కన్నులకు పొడకట్టుచున్నది! కాని, ప్రకృతి సృజించిన శకుంతల యేమైనది? యౌవనమును, సౌందర్యమును కాలక్రమముగ కోలుపోయినది. జరాభార

మామెను సైతము పీడించినది. తుట్టతుదకు ఆ మోహనదేవత, ఆ శకుంతల యనంతకాల సాగరమున బుద్బుదమువలె మఱగిపోయినది!

ఓ యైంద్రజాలికుడా, నీవు కుంచె నొక్కసారి విసరి నంతనె మాయాత్మలు తేలికయై పూలతేకులు తెక్కలుకట్టుకొని నిర్వృతి పదంబునకు చల్లగ నెగిరిపోవును. మొగము మొత్తినట్లు, కన్నులు మిటారించుకొని మమ్ములను గనుగొనుచున్న ప్రాపంచిక యాథార్థ్యము, మెల్లమెల్లగ సమసిపోయి యనిర్వచనీయమగు నానంద స్వప్నము అవతరిచును! ఓయీ, నీ కలము సోకిన ప్రతివిషయము, ప్రతి పదము, ప్రతి భావము, ప్రతిరూపము శాశ్వతమై యమృతమై యొప్పారును! ఒక్క నిమిష మనంతకాల స్వరూపముగ గన్పట్టును, భూమి స్వర్గముగ పరిణమించును. ఓ కవీ, మానవ జీవితమును ఆనందమఖముగ నొనరింపుము.

## 2. కవిత్వావతరణము

"ఋషే. ప్రబుద్ధో2 సి వాగాత్మని
తత్ బ్రూహిరామచరితం
అవ్యాహత జ్యోతిరార్షం తే చక్షుః
ప్రతిభాతి; ఆద్యఃకవి రసి"

"నీవు మొదటి కవివి" అని బ్రహ్మ వాల్మీకి మహర్షితో జెప్పినటుల రామాయణమున గూర్పబడియున్నది. అందువలన వాల్మీకి యాదికవియనియు రామాయణ మాదికావ్యమనియు కాలక్రమముగ ప్రజలు విశ్వసించుచువచ్చిరి. నేటికిని విశ్వసించుచున్నారు. బోయచే గూల్పబడిన క్రౌంచమును గాంచినప్పుడు వాల్మీకికి గలిగిన శోకావేశమే ప్రథమ కవిత్వావతరణమని లోక ప్రసిద్ధి. కాని. నేను వేఱుగదలంచెదను. క్రౌంచ మిధునగాథ వాల్మీకి కవియైన విషయమును మాత్రము తెలుపుచున్నది. రసార్ద్రమైన వాల్మీకి హృదయము క్రౌంచపక్షి శోకమునకు మఱింత యుద్రిక్తమైశ్లోకరూపమున బయలువెడలెను. కవితాశక్తి అతని భావమున పిక్కటిల్లుచు వెలికుఱుకుటకు సమయము వేచియుండెను. అట్టి సమయము క్రౌంచపక్షి యాక్రోశ వేదనవలన సిద్ధించినది. అప్పుడు వాల్మీకి నోటినుండి యొక లయాన్వితమైన వాక్యము అకాంక్షితముగను, అప్రయత్న పూర్వకముగను బయలువెడలెను. అది యపూర్వము, కావున వాల్మీకి యాశ్చర్యపరవశుడై దానినే తలపోయుచుండెను. అంతట బ్రహ్మ ప్రత్యక్షమై ఆ యనుష్టుప్ఛ్లోకములతో రామకథను రచింపుమని యా దేశించెను.

వేదములు ఛందోబద్ధములు. ఛందస్సు వేదాంగములలో నొకటిగ పరిగణింప బడుచున్నది. రామాయణముకన్నను వేదములును వేదాంగములును పూర్వము లనకతప్పదు. ఇట్లగుట వైదిక కవులేల ఆదికవులు కాకపోయిరి? దీనిని గుఱించి నే నిట్లూహించుచున్నాను.

వేదములు విరాట్స్వరూపుని నిశ్వాసములనియు కావుననే యవి యపౌరుషేయములనియు ఆర్యులు విశ్వసించియుండినందున ఆ ఛందములు మానవు లనుకరింప సాధ్యములు గావని తలంచియుందురు. కొంత కాలమునకు వాల్మీకి యుద్భవించి, అంతకుమున్నె కథల మూలమున ప్రజలయందు వ్యాపించియున్న రామాయణ గాథను కావ్యముగ రచియించెను. ఇట్లనుటవలన వేదముల కనంతరమును రామాయణమునకు పూర్వమును కవిత్వరచన లేదని చెప్పుటగాదు. నన్నయ భారతమునకు పూర్వము తెలుగు దేశమును వ్యాపించియున్న గ్రామ్య సారస్వతము, తరువాత, అభినవమార్గ మవలంబించిన ఆ యుద్గ్రంథముతో పోటీకి నిలువలేక యెట్లు నశించెనో, అట్లే రామాయణమునకు పూర్వమున్న చిన్నచిన్న కావ్యములు, గేయములు, ఈ బృహత్ప్రబంధముధాటికి నిలువలేక యాత్మహత్య గావించుకొని యుండును. రామాయణమునందు వర్ణింపబడిన నాగరకతను గమనించిన యెడల ఆ కాలమున కవిత్వశిల్పము కొదువబడి యుండెనని చెప్పుట కెవ్వరును సాహసింపరు. సత్యము భూతకాలగర్భమున దాగియున్నది. వాల్మీకి ఆదికవియైనను కాక పోయినను, రామాయణ మాదికావ్యమైనను కాకపోయినను సీతారాములు చారిత్రక నాయికానాయకులైనను లేక, వాల్మీకి మహాకవి యగాధ భావసాగరము మథింపగా పైకుబికిన యమృత నవనీత రాసులైనను మనకొక్కటియే! ఇందలి సత్యాసత్యములు చరిత్రకారులకు వదలిపెట్టెదము. వారికి సాధ్యముగాని రసాస్వాదనమునకు మనము పూనుకొందము. రామాయణము శాశ్వతకల్పనయైనది! దాని యధికార మనంతము! సర్వకాలీనము!

కవిత్వము ప్రత్యేకముగ నొక దేశమునకును, ఒక జాతికిని, ఒక నాగరికతకును సంబంధించియుండునదిగాదు. అది విశ్వజనీనమైనది. మొట్టమొదట మానవ హృదయమెప్పుడు రసార్ద్రమాయెనో, అప్పుడే కవితాబీజ మంకురించెను; అప్పుడే మానవుని కల్పనాశక్తియు, ప్రతిభయు బయులయ్యెను. అప్పటి నుండియు కవితామహాలత శాఖోపశాఖలుగ చీలి, మానవ సంఘమునం దల్లుకొనుచున్నది. మానవజాతి యజ్ఞాన నిమగ్నమై బాల్యదశయందున్నప్పుడు, రామాయణము, మహాభారతము మున్నగు పెద్దకల్పనలకును, శాకుంతలాది మనోహర నాటక రచనలకును కావలసినంత లోకానుభవమును, సృజన శక్తియు, శిల్పనైపుణియు నలవడి యుండదనుట స్పష్టము. హైందవ సమాజము చాల ఉన్నతదశకు వచ్చిన యనంతరము అట్టికావ్యములు, నాటకములు పుట్టియుండునని నిర్ణయించుటకు, వానియందు వర్ణింపబడిన సాంఘికాచార వ్యవహారములే తగిన సాక్ష్యములుగ నున్నవి.

మానవునికి భావప్రకటనము గావించపవలసిన యక్కఱ జ్ఞానమంకురించినప్పటి నుండియు గలదు. ఉద్దేశములు వెలిపుచ్చుటకు తగిన భాష యుత్పన్నముగాని ప్రథమ దశయందు గూడ, చేసైగలు, కనుసైగలు మున్నగువానిచేత మనుజులు తమ వ్యవహారములను

సాగించుకొనుచుండిరి. ఆ కాలమున వారిబుద్ధి యంతగా వికసింపకుండినందువలన వివిధ భావోత్పత్తి కంతయవకాశ ముండియుండదు. కాని, బహిః ప్రకృతి సంబంధమువలన వారి హృదయములందు క్రమక్రమముగ భావవికసనమును, అభావమును ప్రకటించుటకు కావించు ప్రయత్నము వలన భాషయు నభివృద్ధిచెందుచు వచ్చెను. ఉరుములు, మెఱుములు, మేఘములు,వర్షములు,వడగండ్లు,ఉల్కాపాతములు,నక్షత్రములు, సూర్యోదయాస్తమానములు, నదులు, కొండలు మున్నగు నైసర్గికచిత్రములను దర్శించి నప్పుడు ఆయా కారణముల తెలియమి, ఆదిమమానవులు సంతోషాశ్చర్య భయవిషాదముల వెలిపుచ్చుచుండిరి; నాట్యములు సలుపుచుండిరి; పాటలు పాడుచుండిరి; ప్రార్థనలు సలుపుచుండిరి. కాని, వారి యాటపాటలకు నియమములు లేవు. మానవసంఘము రానురాను నాగరకత నొందుకొలది ఆ యాటపాటలు నియమబద్ధములు గావింపబడినవి.

నాట్యము, గానము, కవిత్వము, ఆద్యకళలు, ఇతరకళలు పరికర సాధ్యములు గావున తదనంతరము పుట్టినవి. అన్ని జాతులవారి ఆద్యకవిత్వమును పరిశీలించిన యెడల సామాన్యముగ నది గేయరూపముగ నుండును. వేదములుగూడ నొకవిధమైన గేయములె, వానిని ఉదాత్తానుదాత్తాదిస్వరములతో చదువకుండిన శ్రుతిహితములుగ నుండవు. ముఖ్యముగ సామవేదమును సామగానమని చెప్పుటయు గలదు. రామాయణముగూడ గేయకావ్యమె. దానిని కుశలవులు గానము చేసినట్లు రామాయణమందు మనము చదువుచున్నాము. నేటికిని, అక్షరములులేని "కొడగు" మున్నగు అనాగరకభాషలుగలవు. వానియందు, కవిత్వము గేయరూపమున ప్రచారములో నున్నది. అనాగరక జాతులయందు గేయప్రతిభ మిక్కుటముగ నుండును. వారియం దొక్కడొక్కడును కవియె! ఒక్కడొక్కడును నటకుడె! ఈ విషయమును, మనము ప్రత్యక్షముగ జూచుచున్నాము. ఏనాది, యెఱుకల, జోగుల, మాలమాదిగ జాతులవా రొకసారి యొక క్రొత్తపాటనుగాని వర్ణమెట్టునుగాని వినుట తటస్థించెనేని, మఱునాడె అట్టివి యెన్నియో వారు రచించి పాడుచుందురు. హృదయమునాకర్షించు నేవిషయమును గుఱించియైన క్రొత్తక్రొత్త ఛందస్సులలో, అకృత్రిమముగ వారు పాటలల్లి పాడుచుందురు. కోటప్పకొండమీద పోలీసువారికిని, అచ్చట మ్రొక్కుబడి ప్రజల నూరేగించుచుండిన రెడ్లకును పరస్పరము కలహము సంభవించి హత్యలు జరిగిన విషయమును గుఱించి, బిచ్చమెత్తు జోగుల జాతివారు "ఔరా? చెన్నప్పారెడ్డి, నీ పేరేబంగార్పాకడ్డీ" అను వీరరసోద్రేకపూరితమైన యొక గేయమును రచించి పాడుచుండిరి. ఇట్టివి యెన్నియేనియుంగలవు. కలుపుదీయు కాలమున నిట్టి చిత్రవిచిత్ర గేయములను యథేష్టముగ వినవచ్చును. పల్లెటూరి కాపులకీ విషయము చక్కగ బోధపడగలదు. మధురమైన గ్రామ్యసాహిత్యముతో వారికెక్కుడు పరిచయము గలదు.

ప్రకృతితత్త్వ జిజ్ఞాసయు, శాస్త్రజ్ఞానమును, విమర్శశక్తియు, మానవసంఘమునందు హెచ్చుకొలది కవిత్వశక్తియు తగ్గిపోవుచుండును. ఎన్నియో బుక్కులకు కారణభూతములైన ఉరుములు, మెరుములు, ఉషస్సులు నేడు మనకు సామాన్యములైనవి. వానిని గాంచినప్పుడు మనము ఆశ్చర్యపడుటలేదు. వెఱపొందుటలేదు. ఈకాలమున పిడుగును ఇంద్రుని చేతి శతార ధారనుగ మనము తలంచుటలేదు. ఎందువలన? "వాతావరణమున సంచరించు సవ్యాపసవ్య విద్యుత్ప్రవాహములు మేఘముల మూలమున కలసికొన్నప్పుడు భూమిని దాకును అదియే పిడుగు" అని మనము పాఠశాలలో చదివితిమి. స్త్రీల ముఖములకు చంద్రబింబమును సరిపోల్చి పూర్వకవులు సంతసించుచుండిరి. కాని, నేటి కవుల హృదయములో నొక మాలిన్యము ప్రవేశించినది. చంద్రబింబమును చూచినంతనే యందలి సౌందర్యము గోచరించుటకు పూర్వమే ఖగోళశాస్త్రములో చదివిన చంద్రవర్ణనము పెనుభూతమువలె మనమునందు పొడకట్టును. చంద్రబింబము సుధాకర బింబముగాదు. అందు అగాధములగు పల్లములు, ఎత్తైన కొండలు, అగ్నిపర్వతములు గలవు. చంద్రునిలోని మచ్చ కుందేలుగాదు, మఱ్ఱిచెట్టుగాదు, జింక గాదు, ఏకులు వడుకు అవ్వయుగాదు. అది అంతులేని చీకటి పల్లము. మనమునందు ఈ భావము లుదయించుటతోడనే సుధాకర మండలము నావరించియున్న కవిత్వము నాశనమై పోయినది.

ఇట్లనుటవలన నింకమీద కవులు లోకములోపుట్టరా? నూతన కావ్యములు రచియింపబడవా, అని కొందఱు ప్రశ్నింపవచ్చును. కవులును బుట్టుదురు. నూత్న కావ్యములును రచియింపబడును. కాని, గుణమునందును కల్పన యందును వ్యత్యాసమగుపట్టును. ఇందుకు చాల కారణములుగలవు. పరిస్థితులు మాఱినవి. ప్రజల విశ్వాసములు, భావములు, ఆదర్శములు మాఱినవి. బుద్ధికి బలము హెచ్చినది. భావమునకు బలము తగ్గినది. కవులేకాలమున బుట్టినను వారి మనఃస్థితి కవిత్వ రచనకు తగినదియే యయ్యును, సమకాలీన భావములకును, నాగరకతకును, వశవర్తియై యుండును. వాల్మీకి మహాకవి యీ కాలముననే జన్మించి యుండియుండిన రామాయణమువంటి మహాకావ్యమును రచియింపజాలడనియే చెప్పవలయును. నాగరకదేశములలో నగ్రగణ్యమగు అమెరికా దేశమునందు నేడు రచింపబడు కవిత్వమును చదివినయెడల ఈ రహస్యము కొంతవఱకు తెలిసికొనవచ్చును. ఆ కవిత్వమునందు మోటారుకారుల శబ్దము, ట్రాంబండ్ల గడగడలు ప్రతిధ్వనించుచుండును. యంత్రాగారములలోని పొగ, రస్తాలలోని దుమ్ము ఆ దేశపు కవిత్వమును క్రమ్ముకొనినట్లుండును. ఆ కవితలందు కోకిలాలాపములు వినబడుటకు మాఱు శ్రవణదారుణములైన రైలుబండి కూతలు వినబడుచున్నవి !

మన తెలుగు కవిత్వమున కీ గతి యెప్పటికిని పట్టకుండుగాక.

# 3. కవిత్వ తత్త్వము

కవిత్వ తత్త్వమును గుఱించినచర్చ లాక్షణికులు తలచూపినప్పటినుండియు జరుగుచున్నది. కవిత్వమన నేమి? అను ప్రశ్న అన్ని దేశములందును, అన్నికాలములందును అడుగబడుచున్నది. కవులును లాక్షణికులును, విమర్శకులును వారివారికి తోచినరీతిని కవిత్వ లక్షణములను తత్త్వమును నిర్వచించిరి. నేడును ఆ ప్రశ్న యంతరింపలేదు. చాల తేలికగ నడుగబడి యసంపూర్ణముగ ప్రత్యుత్తరము పొందు ప్రశ్నలలో నిది యొకటిగ నున్నది.

ఛందోబద్ధమగు పదసముదాయమె కవిత్వమని యభిప్రాయపడువారును కొందఱుగలరు. కాని, యీ యూహ యవిచార మూలకమైనది. యథార్థకవిత్వమునకు ఛందస్సు అనివార్యముగ ననుగతమగును. అయినను ఛందమును కవిత్వమనుసరింప వచ్చును, లేకపోవచ్చును. నిఘంటువులు, వైద్యశాస్త్రములు, వ్యాకరణములు మున్నగునవి ఛందోబద్ధములై యున్నను వానియందు కవిత్వము పొడసూపకుండుటయు, కాదంబరి, వాసవదత్త మున్నగు గద్యకావ్యములందు రసస్ఫూర్తి గన్పట్టుటయు నందుకు నిదర్శనము. సంస్కృత లాక్షణికులు గద్యములు గూడ కావ్యముగ పేర్కొనిరి.పద్యకావ్యములను రచించి సహృదయులను మెప్పించుట కన్న గద్యముల రచించి మెప్పించుట కష్టతరమను నభిప్రాయము ఆకాలమున నలవాటులో నుండినటుల, వామనుడుదాహరించిన "గద్యం కవీనాం నికషం వదన్తి" అను లోకోక్తి వలన మన మూహింపవచ్చును.

కవిత్వమునకు వలయు వస్తుగుణ సామగ్రి యంతయు గద్యపద్యములకు సామాన్యమయ్యును ఛందము పద్యమునకు విశేషము. ఇట్లనుటవలన వాని రెంటికింగల భేదము ఛందస్సునందేగాదు, దానిననుసరించు మఱికొన్ని గుణములయందు గూడ. కాన లయా సమ్మేళనమువలన గలుగు శ్రుతి మనోహరత్వమును భావప్రేరకశక్తియు ఛందమునందు గలదు. ఛందస్సు కేవలము మానవ నిర్మితమగు కృత్రిమశాస్త్రముగాదు. ఇందుకు ప్రకృతియందె బీజములు గలవు. శోకరసావేశుడైన వాల్మీకినోట అప్రయత్నపూర్వకముగ ఛందోబద్ధమగు వాక్యము వెడలుట స్వభావ విరుద్ధముగాదు. కవి హృదయము భావశబలితమై యుద్రిక్తమైనపుడు, భావములు తమంతతాము ఉచితమయిన భాష వెదకికొని లయాన్వితముగ ప్రవహించును. కోపభయాదులచే చిత్తము చంచలమయినప్పుడు మనము మాటలాడు భాషకును, ఉచ్చారణకును, సామాన్య మనస్థితిలో నున్నపుడు మాటలాడు భాషకును చాల భేదము గనుపట్టుచుండును. భావతీవ్రతయు గాంభీర్యమును ననుసరించి వాక్యమునందు మాటలు వెనుక ముందు ముందు వెనుక లయి యేదోయొక లయాధర్మమున కనుగుణముగ కుదురు పడుచుండును. "వచ్చెడువాడు ఫల్గుణుడవశ్యము గెల్తుమనంగ రాదు" అను

పద్యపాదమును "ఫల్గుణుడు వచ్చెడువాడు " అని మార్చిన యెడల మొదటివాక్యమున పిక్కటిల్లు ఆతురతయు భావతీవ్రతయు రెండవ వాక్యమున సన్నగిల్లి చప్పిడియగును. ప్రకృతియందు బీజరూపముగను అస్పష్టముగను, అసంపూర్ణముగను, సంకీర్ణముగ నున్న రామణీయకమును కేంద్రీకరించి సహృదయుల భావమునందు పరిపూర్ణముగ స్ఫురింపజేయుట శిల్పముయొక్క ప్రధాన ధర్మముగావున, కవిత్వమునందు లయాస్వరూపము సర్వాంగసుందరమై పొడకట్టుచున్నది.

గద్యము పద్యముతో కొంచె మించుమించుగ తులతూగుచున్నను, ఛందోలోపము వలన రూపసౌందర్యమును కొంత కోల్పోవుచున్నది. గద్యము రసవంతముగను భావస్ఫోరకముగ నుండవచ్చును. కాని దానిని గద్యకావ్య మందుమే గాని కవిత్వమనము. * కవిత్వమునంగల శ్రుతిరంజకత్వము గద్యమున నుండుటకు వీలులేదు. "మనకు భావము, రసమే గదా ప్రధానము, ఛందస్సుతో నేమిపని?" యని కొందఱు ప్రశ్నింపవచ్చును. అర్థములేని శబ్దముల సంయోగ వియోగ భేదములవలన నుత్పత్తి యగు రాగములు మనల నానంద పరవశుల గావించుచున్నవి. ఒక్కొక్క రసము నుప్పతిల్ల జేయుటకు నొకొక్క రాగ మనుకూలించు నని గాన శాస్త్రవేత్తలు నిర్ణయించి యున్నారు. వీరణము (వీరంగము) వాయించినపుడు కొందఱికి ఆవేశము వచ్చుటగలదు. యుద్ధపు బ్యాండు విన్నంతనే పిఱికివాని హృదయమునందైన రణోత్సాహము చిప్పిల్లును. ఇట్టి వికారములన్నియు కేవలము శబ్దసంయోగ సారస్యమువలన హృదయమున గలుగు మార్పులేగదా! ఇక భావయుక్త పద్యములమాట వేఱుగ జెప్పవలయునా?

ఒక ఇంద్రియమునకంటె రెండింద్రియములకు సుఖము గూర్చు వస్తువు ననుభవించునపుడు మన యానందము ఇమ్మడించును. శిల్పముయొక్క పరమప్రయోజనము "సద్యఃపర నిర్వృతి"ని గలిగించుటయెగాన నొకేనమయమున నొకటికన్న నెక్కు డింద్రియములకు సుఖము గల్గించునదియె యుత్తమ శిల్పమని మనము నిర్ణయింప వచ్చును. * కావున ఛందోబద్ధమగు కావ్యము వచనముకంటె నెక్కుడు సుఖదాయక మనియె చెప్పవలయును.

---

* పూర్వము పద్యకావ్యములు చెవికి వినబడునటుల పెద్దగజదువ బడుచుండెడివి. అందువలన కర్ణేంద్రియ ద్వారమున గూడ సుఖము నొందుచుండెడి వారము. కాని నేడు అలవాటు మాఱినది. చెవులు చేయవలసిన పని కన్నులు చేయుచున్నవి. పెదవులు కదలింపక నవలలు చదువ నలవాటు పడిన మనము పద్యకావ్యములనుగూడ నట్లే చదివి, పొందవలసినంత యానందమును బొందుటలేదు.

* There is something magical in rhythm. It even makes us believe that the sublime lies within our reach - *Goethe.*

సంస్కృత లాక్షణికుల కవిత్వ తత్త్వ నిర్వచనములు కొన్నియెడల పాక్షికములుగను అసంపూర్ణములుగనున్నవి. లాక్షణికులు తత్త్వవేత్తలును తార్కికులును కావున వారి బుద్ధి యవయవ పృథఃకరణమునందు నిశితముగ బ్రవేశించును. వారొకరూపము యొక్క యంగాంగ సంయోగతను సమష్టి సౌందర్యమును గమనింపక, యవయవములను, గుణములను ఆత్మను వేఱుపఱచి వానిలో నేవి ముఖ్యములో యను దీర్ఘ చర్చలకు దొడంగి తుదకు తమ యభిమానమునకు పాత్రమైనదానికి పట్టాభిషేకము గావింతురు. కాని, వానివాని స్థానములందు ఉచితమైనరీతిని అవియవి ముఖ్యములనియు, వానిలో నేవి లోపించినను అంగవైకల్యమో గుణవైకల్యమో లేక ప్రాణాపాయమో సంభవించుననియు వారు తలంపరు.

“తదదోషౌశబ్దార్థౌసగుణౌ అనలంకృతీపునఃక్వాపి” అని మమ్మటుడు కావ్యలక్షణమును నిర్వచించెను. కాని, యీ వాక్యమును సాహిత్యదర్పణకారుడును, రసగంగాధరకర్తయు విమర్శించి తీవ్రముగ ఖండించియున్నారు. నిర్దోషత్వము చేత కావ్యత్వము సిద్ధించునెడల ప్రాణరహితములగు కావ్యములు గూడ సమ్మానార్హములగును. పేరువడసిన యుత్తమ కావ్యము లందేవో కొన్ని దోషములున్న యెడల అట్టికావ్యములు ఆదరణపాత్రములు గాకపోవలసివచ్చును. ఇట్టి ప్రమాణము నంగీకరించిన యెడల మన కావ్య ప్రపంచము చాల సంకుచితమై పోగలదు. ఎట్టి యుత్తమ కావ్యమందైనను ఏవోయొక విధమైన దోషములు కొన్ని యుండకపోవు. రామాయణ మహాకావ్యమునందు పునరుక్తిదోషములు గలవు. మమ్మటాది సంస్కృత లాక్షణికులు రసౌచిత్యముల యుత్కర్షాపకర్షములను దెలుపుటకు కాళిదాసాది మహాకవుల గ్రంథములనుండి యుదాహరణములను గ్రహించిరి. కావున అటువంటి కావ్యములు పరిత్యాజ్యములు కావలయునా? బండి ఱాకును మేలు రాకును యతి ప్రాసమైత్రి గూర్చెనని అప్పకవివలె పోతన్నను దిట్టిపోసి భాగవతమును నీట గలుపుదుమా! ఏవో కొన్ని వ్యాకరణ విరుద్ధ ప్రయోగములను చేమకూర వెంకన్న యంగీకరించెనని యాతని విజయవిలాసమును, క్త్వార్థక ఇకార సంధులు గలవని ఆముక్తమాల్యదను మనము నిరాదరింతుమా? రసాస్వాదన నిమిత్తము కావ్యము చదువువారికి నిటువంటి దోషములపై బుద్ధి చొరదు. ఈలాటి భాషావిషయక దోషములకంటెను అనౌచిత్యము, నీరసకల్పనము మున్నగు రచనాలోపములు రమణీయతకు భంగము గలిగించును.

మమ్మటుడు కావ్యముల కిట్టి కఠినమైన బహిష్కార దండనము విధించునా? ఇది చింత్యము. పూర్వాపరముల యోచించిన యెడల ఆయన యభిప్రాయమును మఱికొంత విరివిగ మనము తెలిసికొనవచ్చును. కావ్యప్రకాశిక యందు ప్రారంభముననే మమ్మటుడు కవి సృష్టి నిట్లు కొనియాడెను.

"నియతికృతి నియమ రహితాం
హ్లాదైక మయీ, మనన్య
పరతంత్రాం నవరస రుచిరాం,
నిర్మితి మాదధతి భారతీ కవేః"

ఇందలి యెుకొక్కపదము నొకొక్క వ్యాసమునకు శీర్షికగ నుండదగినంత భావగంభీరముగ నున్నది. కవియెుక్క భారతి ప్రకృతి నియమ బద్ధకముగాదు! హ్లాదైకమయమును నవరస రుచిరమునైన యొక స్వతంత్ర నిర్మాణము! మఱియు లోకోత్తర వర్ణనానిపుణ కవికర్మ కావ్యమని మమ్మటుడు వివరించెను. ఈ యభిప్రాయమును లాక్షణికు లందఱు నేదో యొకవిధముగ నంగీకరించియున్నారు. లోకోత్తరత్వమనగా అనుభవ సాక్షికమయిన యాహ్లాదగత చమత్కారమని పండిత రాయలును, చమత్కార మనగా చిత్త విస్తార రూపమగు విస్మయమని విశ్వనాథుడును వివరించిరి. ఇట్లనుటవలన చమత్కార రహితములగు కేవల శబ్దార్థములకు కావ్యయోగ్యత సిద్ధింపదనియు, అవి ప్రతిభాశాలియగు కవి రచనా నైపుణ్యము వలన నలౌకిక రూపగుణ సౌందర్యములను దాల్చి, కావ్య మనిపించుకొనుననియు మన మూహింపవలయును. లోక సామాన్యమైన రూపములను జూచినప్పుడు మన కేలాటి విస్మయము జనింపదు. దానియందు మన చిత్తము నాకర్షింపజాలినంత యసాధారణ విశేష మేదియు గోచరింపదు. కాని, మనమెన్నడునుజూచి యెఱుగని యొక సౌందర్యవతిని దారిలో గనుగొన్నపుడు, ఆహా! యీమె యెంతరూపవతి? అని యచ్చెరువొందుచు కొంతసేపు నిలబడి నిర్వ్యాజముగ నామెతట్టు చూచుచుందుము. అసామాన్య రూపసందర్శనము వలన నిటువంటి వింతపొడముచుండుట సహజము. కవిత్వమున గూడ నీలాటి లోకోత్తరత లేనియెడల కావ్యము చదువరుల హృదయమును లౌకిక వ్యాపారములనుండి మరల్చి తనయందు లగ్నమగు నట్లొనరింపజాలదు. చిత్రకారునికి రంగులకు నెట్టి సంబంధముగలదో కవికిని కవితా సామగ్రికిని అట్టిసంబంధమె. అంగాంగ సంయోగిత, ఔచిత్యము, వర్ణనా సౌందర్యము, జీవకల్పనము మున్నగునవి కవియెుక్క శిల్పనైపుణ్యమునకు జెందినవి. కావున కవి ప్రతిభా శక్తివలన కావ్యమునకు సాధుత్వమును, ప్రతిభా దౌర్బల్యమువలన అసాధుత్వమును సిద్ధించును. ఇట్లనుటవలన కావ్యములు వ్యాకరణదోష భూయిష్ఠములుగ నుండవలయుననుట నామతముగాదు. కాని, భాషావిషయక దోషములకన్న శిల్ప కల్పనాదోషములె రస రామణీయకములకు భంగము వాటిల్లజేయునని నామనవి.

* విశ్వనాథుడొక దోషమును ఖండించి మఱియొక దోషమును దెచ్చిపెట్టెను. ఆయన "వాక్యం రసాత్మకం కావ్యం" అని కావ్యలక్షణమును నిర్ణయించెను. ఇది (ఆచార్య దండిమతముతప్ప) పూర్వలాక్షణికుల మతములకన్న విశాలముగ నున్నట్లు తోచినను, విమర్శించిచూడ నీ వచనము కూడ కవిత్వావరణమును సంకుచితము చేయుచున్నది. ఏల యన :- "విభావానుభావ వ్యభిచారి సంయోగా ద్రసనిష్పత్తిః" అని భరతుని రసలక్షణము. దీనిబట్టిచూడ రసము కేవలము మానవ చర్యలకు సంబంధించినదని తేలుచున్నది. తిర్యగ్జంతువుల చేష్టలయందు రసాభాసము (రసస్పర్శ) మాత్రము గలదని విశ్వనాథుని యభిప్రాయము. కావున రసమనునది మానవ చర్యలయందు పూర్ణముగను, పశుపక్షి మృగాదుల చేష్టలయందు ఆభాసముగను ఉండునని తెలియ వచ్చుచున్నది. కాని, యచేతన వ్యాపారములందు ఏలాటి రసస్పర్శకుగూడ చోటులేదు. కావున 'వాక్యం రసాత్మకం కావ్యం' అను లక్షణమును మన మంగీకరించిన యెడల పాశ్చాత్యుల ప్రకృతి కవిత్వమును, (Lake Poetry, Nature Poetry) సూర్యాస్తమయములు, ఉద్యానవనములు, నదులు, కొండలు, మేఘములు, నక్షత్రములు, చంద్రుడు మున్నగువాని వర్ణనములకు కావ్యత్వము సిద్ధింపదు.

'ఉపవన జల చంద్రికోత్సవార్తవలీల లాత్మవిహారంబులనబరగు' అని యుండుటవలన పైన పేర్కొన బడిన యుద్యానాది విషయములు ఉద్దీపన విభావములకు నాధార భూతములు గావున రసవ్యంజకములగును. అట్లగుట 'వాక్యం రసాత్మకం కావ్యం' అను లక్షణములో నివిగూడ నిమిడియున్నవి, అని కొందరు తలంపవచ్చును. కాని, యీలాటి వర్ణనములు నాయికా నాయకుల వ్యాపారములలో కలసిపోయి వారి చర్యలకు సంబంధ పడినప్పుడె అవి యుద్దీపన విభావములకు కారణములగును. కాని, కవియె యట్టిదృశ్యములను నాయికానాయక సంబంధమపేక్షింపక, తన యాంతరంగిక ప్రేరణమువలన రచియించిన యుద్యాన విషయాది వర్ణనములకు ఉద్దీపనత్వము సిద్ధింపదుగాన, వానిని నీరసములనియె నిర్ణయింపవలయును. ఇదియొక సందిగ్ధ విషయము. ఇప్పుడు మనము విశ్వనాథుని లక్షణము

---

* నేను "రసరామణీయకములు" అను వ్యాసమున దెలిపినటుల చేతనాచేతన భేదములేక రమణీయ భావము లన్నిటియందు రసముండునను మతము నంగీకరించు పక్షమున "వాక్యం రసాత్మకం కావ్యం" అను నిర్వచనముగూడ నంగీకృతమైనట్లె. అట్లుగాక రసము కేవలము మానవ చర్యలకు సంబంధించినదే యని తలచునెడల ఈ వ్యాసమునందు జూపబడిన యభ్యంతరమువలన విశ్వనాథుని నిర్వచనము సంకుచితమగును.

• "(ఇష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళీ)"

ఇచ్చట "ఇష్టార్థ"మనగా హృద్యార్థము, లేక రమ్యార్థము.

నంగీకరింపవలసియున్న, సంకుచితమైన రసలక్షణమును మఱింత విరివిచేసి, యుద్యానాది వర్ణనములకు గతి కల్పింపవలయును. లేక, పూర్వికుల రసలక్షణ మంగీకరింతుమేని విశ్వనాథుని కావ్య లక్షణమును సంకుచితమైనదని తలంపవలయును.

సాహిత్య దర్పణకారునికన్నను, నర్వాచీనుడైన పండితరాయలు 'రమణీయార్థప్రతిపాదక శబ్దః కావ్యం' అని రామణీయకమునకు ప్రాధాన్య మొసగినందువలన కవితానర్తకి నాట్యరంగము విశాలమైనది. కావ్యమున మనము చూడ వలసినది చిత్తాకర్షకమగు రామణీయకము. అట్టిగుణ మే కావ్యమునందు పూర్ణముగ నుండునో నదియెల్ల సాధువును, ఉత్తమము నగును.

పాశ్చాత్య లాక్షణికులును, కవులును కవిత్వ లక్షణములను వచియించియున్నారు. * భావోత్కర్షతను వెలిపుచ్చుటయె కవిత్వమని వర్డ్సువర్తును, షెల్లీయు (Wordsworth, Shelley) అభిప్రాయపడిరి. కాని, యీ లక్షణము సందిగ్ధముగ నున్నది. భావోత్కర్షతను బ్రకటించుట యంతయు కవిత్వమగునా? ఇదియె యథార్థమైనయెడల కోపోద్రిక్తుడై తిట్టెడి వాని మాటలను, సభ్యుల హృదయము చెలరేగునటుల నేదోయొక రాజకీయ విషయమును గుఱించి యుపన్యసించు నాయకుని వాక్యములును కవిత్వము కావలసివచ్చును. కేవలము భావప్రకటనము కవిత్వము కానేరదు.

కార్లయిల్ పండితుడు (Carlyle) గానాన్వితమైన యాలోచన కవిత్వమని నుడివియున్నాడు. ఈ లక్షణము సత్యమునకు కొంచెము సమీపముననున్నది; అయినను పూర్ణ సత్యముగాదు. కార్లయిలు పండితుడు గానాన్వితమైన యాలోచన యనుటలో కావ్యమునందు భావములకును శిల్పమునకునుగల సంబంధము నించుక సూచించెను. ఇంతకంటెను లేహంటుగారి (Leigh Hunt) నిర్వచనము మఱికొంత సత్యసమీపవర్తిగ నున్నది. ఆయన కవిత్వమునకు సత్య సౌందర్యముల స్పర్శను గలిగించెను. కాని, యమెరికా దేశపు ప్రఖ్యాత కవియగు ఆలన్‌పో గారి (Allan Poe) నిర్వచనమునందు కవిత్వలక్షణము

---

*(1) Poetry is the spontaneous out flow of powerful feelings. It takes its origin from emotion recollected in tranquility. - *Wordsworth.*

(2) Poetry we will call Musical Thought - *Carlyle*

(3) Poetry may be defined as the expression of the imagination. - *Shelley*

(4) (Poetry is) the utterence of a passion for truth, beauty, and power, embodying and illustrating its conceptions by imagination and fancy and modulating its Language on the principal of variety in unity. - *Leigh Hunt.*

(5) Poetry is the rhythmic creation of beauty. - *Allan Poe.*

పరిపూర్ణత నొందినది. ఆలన్ పో గారిని అమెరికా దేశపు పండితరాయలని చెప్పవచ్చును. 'రామణీయకమును లయారూపమున సృజించుటయె కవిత్వము' అని ఆయన తెలిపియున్నాడు. ఈ లక్షణము ప్రాచ్యపాశ్చాత్యులకు పరమసమ్మతమైనదిగ నుండవచ్చును.

కవిత్వప్రభవమును తెలిసికొన్న కొంతవఱకు కవిత్వ స్వభావమునుగూడ మన మూహింపవచ్చును. సహజమైన ప్రతిభయె కవిత్వమునకు కారణము. ఇతరములు సంస్కారములు. అవి కవిత్వమునకు వన్నెదెచ్చును. * నవనవోన్మేషణ శాలినియగు ప్రజ్ఞయె ప్రతిభ యని భామహుడు నుడివియున్నాడు. ఇట్టి శక్తి కవియందు లేనియెడల నాతని రచనలన్నియు నిర్జీవములుగ నుండును. అట్లయిన కవికి పాండిత్యమక్కఱలేదా; కవుల పాండిత్యమునకును పండితుల పాండిత్యమునకును చాలభేదమున్నది. కవుల పాండిత్యము సహజమయి ప్రతిభాంతర్భూతమయి యుండును. పండితుల పాండిత్యము విశేషగ్రంథపఠనము వలనను శిక్షణవలనను నలవడు విషయజ్ఞానము.

కవి యందఱివలె నూరకుండక రమ్యమైన భావప్రపంచము నేల సృజింపవలయును? ఇది కవియొక్క యాంతరంగిక ప్రేరణము; శమనాతీతమైన సౌందర్యపిపాస; అనివార్యమైన రసావేశము! భావోన్మాదము; కవి హృదయైకవేద్యము. 'తుమ్మువచ్చినను నవ్వువచ్చినను పట్టరాదు' అనెడి సామెత యొకటికలదు. కవి ఆవేశముగూడ నిట్టిదియె. మనోహరమైన దృశ్యమును జూచినపుడు మన మానందము నొందుదుము. అంతట మన యనుభవమును నితరులకు దెలుపవలయు నను కోరిక యొకటి పుట్టును. విననవారు సంతసించుచుండ మన యానందమును వర్ణించి వర్ణించి సంతృప్తి నొందుచుందుము. కోరిక పుట్టిన వెనుక దానిని దీర్చుకొననిదే మన మనసు కుదుటబడియుండదు. మన యనుభూతి నితరులకు జెప్పుటకు చేతకానియెడల నొకవిధమైన యతృప్తి గలుగును. మన భావములను పదిమంది స్నేహితులకు వెల్లడిచేయనిదే ఆనందము పరిపూర్ణమైనటుల తోపదు. అందువలననే మన మేదైన సంతోషవార్త విననప్పుడు దానిని నందఱికి జెప్పుచుందుము. ఇది సామాన్యమైన మానవ స్వభావము. కాని, కవియందిట్టి స్వభావ మతి బలీయముగ నుండును. నిశితములును, శిక్షితములును, సంయమితములును. అందువలననే యుత్పతన క్షమములును నైన కవి మనోవికృతులు తుట్టతుదకు నిర్భరములై లయాన్విత వాగ్రూపమున ప్రవహించును. భావోద్రేకము గలిగినపుడు ఆయా వికారములకు తగినటుల వాక్యములు వెడలుట మానవులకందఱికి సహజమైనను, కవియందు మఱొక విశేషము గలదు. కవి వాక్యములు ఏవోకొన్ని నిర్మాణన్యాయముల కనుగుణముగ మూర్తీభవించుచుండును.

* "ప్రతిభా అపూర్వ వస్తునిర్మాణ క్షమా ప్రజ్ఞా; తస్యా విశేషో రసావేశ వైశద్య సౌందర్య కావ్యనిర్మాణ క్షమత్వం." · లోచనవ్యాఖ్య - అభినవ గుప్త పాదాచార్యులు

ముత్తెపుచిప్పలో వానచినుకు పడినపు డది మంచి ముత్యముగ మాఱును గాని, కాకిచిప్పలో బడినపుడు మార్పునొందదు. ఎందువలన? ముత్తెపుచిప్పయందుగల సృజనశక్తి కాకిచిప్పయందుండకపోవుటవలన. నీటిబొట్టు ముత్తెపుచిప్పకడుపులో పడినప్పుడు అందొక వికారము పుట్టును. అందువలన చిప్ప లోపలిభాగమున కంటుకొనియున్న పింగాణిరంగు వానచినుకుపై చుట్టుకొని దానినొక యమూల్యమైన ముత్యముగ మార్చివేయును. ఇటులనే బహిఃప్రపంచసంగతి వలన కవి మనమున కొన్ని వికారము లుప్పతిల్ల అవి యాతని రసార్ద్రభావములందలి యింద్రధనుర్వర్ణములతో వెలికుఱికి లోకమోహన స్వరూపమును దాల్చును. కవిభావ మేవస్తువుపై ప్రసరించునో యదియెల్ల రూపాంతరము నొందును. అని ర్వాచ్యమైన సౌందర్యము దాని నాశ్రయించి యుండును. ఎన్నియో వస్తువులను పలుమాఱు చూచియుందుము. కాని, అవి మన చిత్తముల నాకర్షింపజాలక పోయియుండవచ్చును. ఆ వస్తువే కవిభావముతో మెలాముచేయబడినప్పుడు ఇది వఱకు లేని క్రొత్తందనమును చక్కందనమును వహించి మన దృష్టి నాకగొనును. ఎన్నిమాఱులు ఆషాఢమాసమునందలి మేఘములను మనము చూచియుండలేదు? ఆ మేఘమె కాళిదాసమహాకవి కావ్యాంబరమున భావకిరణ శబలితమయి పొడకట్టి మనలను ఆనందపులకితులను జేయుట లేదా? ఇదియే కవిత్వేంద్రజాలము!

## 4. కావ్య జీవితము

నిర్జీవములగు కావ్యములు సహృదయానురంజకములు గానేరవు. అట్టివి చచ్చుబిడ్డలు. అవి నిరాదరణ పాత్రములై యెట్టకేలకు నశించిపోవును. కొందఱి కవుల యొక్కయు కావ్యములయొక్కయు పేరులు కవుల చరిత్రలందు మాత్రమే భద్రపఱుప బడియుండును. కాని, మఱికొందఱి కవుల నామములు అనుదినమును స్మరింపబడుచున్నవి. వారి కావ్యములు నిరంతరము ప్రజల హృదయములపై ప్రభుత్వము చేయుచున్నవి. రామాయణము, మహాభారతము, భాగవతము, అభిజ్ఞాన శాకుంతలము, ఉత్తర రామచరిత్రము, మేఘసందేశము మున్నగు కావ్యములును నాటకములును, షేక్స్పియరు మహాకవి రచియించిన నాటకములును (అందు ముఖ్యముగ విషాదాంతములు) స్వదేశములందేగాక పరదేశములందుగూడ సమ్మానింపబడుచున్నవి. ఎందువలన? అవి యుత్తమశిల్ప లక్షణముల కనన్యసాధారణ లక్ష్యములయి ప్రధాన కావ్యప్రయోజనమగు సద్యఃపరనిర్వృతిని గలిగించు చున్నవి. కావున నిట్టి యానంద ముప్పతిల్లజేయు ప్రతికావ్యమును సజీవమని మనము తలపవలయును. కావ్యములను ప్రాణవంతములుగ జేయు చిచ్ఛక్తి యేది ? ఇందుకు సంస్కృతలాక్షణికు లేమి ప్రత్యుత్తర మిత్తురో దానిని మొదట దెలిసికొందము.

1. రీతిరాత్మా కావ్యస్య. - వామనుడు.

2. వక్రోక్తిః కావ్యజీవితం - కుంతకాచార్యుడు.

3. అలంకారాస్త్వలంకారా గుణా ఏవ గుణాః సదా
ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్యజీవితం - క్షేమేంద్రుడు

4. కావ్యస్యాత్మా ధ్వనిరితి బుధైర్యః సమామ్నాతపూర్వః - ఆనందవర్ధనాచార్యులు.

5. శబ్దార్థౌ మూర్తి రాఖ్యాతౌ జీవితం వ్యంగ్యవైభవం- విద్యానాథుడు.

6. యే రసస్యాంగినో ధర్మాః శౌర్యాదయ ఇవాత్మనః - మమ్మటుడు.

7. వాక్యం రసాత్మకం కావ్యం - విశ్వనాథుడు.

పైలాక్షణికులలో వామనుడు రీతియు, కుంతకాచార్యుడు వక్రోక్తియు, క్షేమేంద్రుడు ఔచిత్యమును, ఆనందవర్ధన విద్యానాథులు ధ్వనియు, మమ్మట విశ్వనాథులు రసమును, కావ్యజీవితమని నిర్వచించియున్నారు. కాని, వీని యన్నిటిలో నిశ్చితమైన ప్రమాణమేది? ఆలంకారికులిట్లు భిన్నాభిప్రాయులైనపుడు సహృదయుల యంతరాత్మయె కడపటి ప్రమాణముగ దలంపవలయును. పై మతములను విమర్శించి చూడ లాక్షణికుల తీర్మానములు, * ఏనుగును జూచుటకై పొరుగూరికిపోయి వివాదములు పెంచుకొన్న గ్రుడ్డివారి రూపజ్ఞానముగ నున్నది.

రీతి, రసపోషణమున కనుకూలమైన వర్ణసంఘటనము; కావున కావ్యాంగమునకు సంబంధించినది. అంగము జీవితమున కాశ్రయమగునుగాని, తానే జీవితము కాజాలదు.

వక్రోక్తి యొకవిధమైన అలంకారము. అలంకారమస్ఫుటముగ నున్న వాక్యములకు గూడ (అనగా అలంకారము తర్కముచే మాత్రము సాధింపబడి, దాని మూలమున రాదగిన

---

* కొందఱు గ్రుడ్డివారు ఏనుగును చూచుటకై పొరుగూరికి పోయిరి. వారిలో మొదటివాడు తొండమును తాకి, ఏనుగు తనచేయివలె నున్నదనియు, రెండవవాడు కాలునుతాకి ఏనుగు స్తంభమువలె నున్నదనియు, మూడవవాడు పొట్టనుతాకి ఏనుగు గాదెబొట్టవలె నున్నదనియు, నాల్గవవాడు తోకనుతాకి ఏనుగు కఱ్ఱవలె నున్నదనియు దలంచి తమయూరికి తిరిగి వచ్చుచు దారిలో తాము చూచిన విషయములను సరిపోల్చుకొనిరి. ప్రతివాడును సత్యమే చెప్పినను వారిజ్ఞానము పాక్షికమైనందున భేదాభిప్రాయములు గలిగి వివాదములు పెరిగి తిట్టుకొనసాగిరి. అంతలో ఏనుగును చూచిన మరియొకరు వచ్చి వారు చెప్పునదంతయు సత్యమేయనియు, పరిపూర్ణసత్యము తెలుటకు వారొకరొకరు తాకిన యంగములను కలిపి చూడవలయుననియు తెల్పెను.

సౌందర్యము, 'యః కౌమార హరః' అను శ్లోకమునందువలె * అభావ మయినపుడు కావ్యత్వము సిద్ధించుచున్నదిగాన, అలంకారములు కొన్ని యెడల నావశ్యకములయ్యు, ఔపచారికములు గావునను వానికి జీవత్వములేదు.

ఔచిత్యము అన్ని శిల్పములకు పరమావశ్యక మగునియమము. ఇది రసపోషకము. సౌందర్యమున కొకయంగము.

ధ్వన్యాత్మకముగాని వాక్యము సైతము కావ్యమని నిరూపింపబడియుండుట చేతను, వ్యంగ్యవైభవము ఉత్తమ కావ్యలక్షణమని పలువురచే నంగీకరింపబడి యుండుటచేతను, ఉత్తమ మధ్యమాధమ కావ్యవిచారము, జీవత్వము సిద్ధించిన వెనుక జరుగు చర్చ యగుటచేతను, ధ్వనిని కావ్య సౌందర్యాపాదకము లగు నుత్తమ గుణములలో నొకటిగ గ్రహింపవచ్చును.

రసము కేవలము మానవచర్యలకు సంబంధించినదేయైనయెడల అవ్యాప్తిదోషము వలన కావ్యాత్మ కానేరదు.

అట్లయిన నిక కావ్యాత్మ యెట్టిది ? ఆత్మ అంతస్సారభూతమయినది. ఇదమిత్థమని వర్ణించుటకు నలవిగానిది. కావుననే భిన్న నిర్ణయములకు పాత్రమయినది! ఉపనిషత్తులు బోధించు ఆత్మ వేఱు; ఆ యాత్మ అవాఙ్మానసగోచరము. కావ్యాత్మ ఇంద్రియ గోచరమును అనుభవసాక్షికము నగు సౌందర్యస్ఫురణము. పాంచభౌతికమయిన ప్రకృతి చిత్సంబంధమువలన ప్రాణవంతమగునట్లు, కావ్యసామగ్రి కవిప్రతిభతోడ సంయోగమునొంది జీవన్మూర్తిని దాల్చుచున్నది. కావ్యమునకు కవిప్రతిభయె జీవితము. కావ్యమునందలి చిత్ప్రకాశము సౌందర్యస్ఫురణముగ గోచరించును. శిల్పనైపుణ్యము కవితాసామగ్రియు నవిభాజ్యముగ నొకదానియం దొకటి లీనమయినపుడు సజీవవిలసనము కావ్యమునందు తేలియాడుచుండును. అది సహృదయ హృదయైకవేద్యము. గాలి కంటి కగుపడక యున్నను స్పర్శేంద్రియమువలన

---

* శ్లో. యః కౌమారహరః సఏవ హి వరస్తా ఏవ చైత్రక్షపా
స్తేచోన్మీలిత మాలతీ సురభయః ప్రౌఢాః కదంబానిలాః,
సాచైవాస్మి తథాపి తత్ర సురతవ్యాపార లీలా విధౌ
రేవా రోధసి వేతసీ తరుతలే చేతః సముత్కంఠతే.

(మమ్మటోదాహృతము)

పరస్పర విరుద్ధములగు విభావనావిశేషోక్తుల సాంకర్య మిందుస్ఫుటముగ నున్నదని విశ్వనాథుని యభిప్రాయము. కాని, యీశ్లోకమును మనము చదువునపుడు మనకు గలుగు ఆనందము అలంకార మూలకమైనదికాదు. రసమూలకమైనది.

తెలిసికొనబడునటుల, కావ్యాత్మ యిట్టిదని వచియింప నలవిగాకున్నను ఆనందజనక శక్తివలన నూహింప సాధ్యమగును.

ప్రతిభావంతులగు కవుల రచనలను మనము విమర్శించి చూచితిమేని, అవి చిరంజీవములగుటకు కారణములు మనకు గోచరింపకపోవు. వానియందు కాలమును ధిక్కరించు శాశ్వతగుణమేదియో యొకటి తప్పక యుండితీరును. ఉత్తమకృతుల విమర్శనమువలన తేలిన సామాన్యాంశముల నిటపొందుపఱచుచున్నాను :

1. అంగాంగ సంయోగిత.
2. అనురూపత,
3. వస్తువునందలి సర్వజనీన స్వభావము.
4. కవి వ్యక్తిత్వము.

అంగాంగ సంయోగిత ప్రతి రూపమునకును ఆవశ్యకమైన నియమము. విచ్ఛిన్నావయవ సమూహము సమష్టి రూపజ్ఞానము బుట్టింపనేరదు. కావున 'సంయోగిత' శిల్పశాస్త్రమునందు ప్రధాన సూత్రము. ఈ సూత్రమునకు లోబడని కావ్యములు నిర్జీవములుగ నుండును. ఉత్తమ కావ్య నిర్మాణమునం దీనియమము బహుజాగరూకతతో ననుసరింపబడును.

ఉచితానుచిత జ్ఞానము లేనివాడు కవి కానేరడు. అనౌచిత్యము రసభంగమునకు ప్రధానహేతువు. కాండ జ్ఞానము, కళాభిరుచియు లేనందునను, లోభమువలనను, కవి యనౌచిత్యదోషమునకు పాల్పడుచున్నాడు. అది వఱకు వ్రాసికొనియుంచిన రసవంతములగు పద్యములందలి లోభముచేత కొందఱు కవులు అనవసరముగను, అసందర్భముగను తమ కావ్యములయందో, నాటకములయందో వాని జొప్పించి రసభంగమునకు సహాయ పడుచున్నారు. అట్టివారియందు కళాభిరుచి లోభ తిరస్కృతమై యడగియుండును. మఱియు కవి మొట్టమొదట తన ప్రతిభ కనురూపమైన వస్తువును, రసమును రూపమును గుర్తెఱిగి యేర్పఱచుకొనవలయును. ఇది చాల ముఖ్యము. కొందఱు కవులు కొలది యెఱుగక కొండను కౌగిలించుకొనబోయి భగ్నమనోరథు లగుటయు, మఱికొందఱు తమ ప్రకృతి కనుకూలింపని రసములపోషింప ప్రయత్నించి చెడగొట్టు కొనుటయు మనము చూచుచున్నాము. కాళిదాసు శృంగారమును పోషించుటలో నసదృశుడు. భవభూతి కరుణయందద్వితీయుడు కాని, ఆయన ప్రతిభ నాటక రచన కనుకూలించునది గాదు. కావుననే యుత్తరరామ చరిత్రము దృశ్యప్రబంధమునకన్న శ్రవ్యప్రబంధముగ నెంచబడుచున్నది. సర్ వాల్టర్‌స్కాటు మొట్టమొదట కవిత్వము వ్రాయుచుండెను. కాని, యంతకన్న తన ప్రతిభ నవలలు రచియించుట కనుకూలించునని యెఱింగి, యపూర్వ కథాసాహిత్యమును నిర్మించెను. రవీంద్రనాథ

టాగూరునందు గేయ ప్రతిభ మిక్కుటముగ నున్నది. ఆయన వేలకొలది చక్కని గీతములను రచియించెను. కాని, మయికేలు మధుసూదనదత్తువలె 'మేఘనాథవధ' వంటి పెద్ద కావ్యమును రచియింపలేదు. ఒక్కొక్క కవి అంతఃప్రకృతి యొక్కొక విధమయిన కావ్యకల్పనకు దగియుండును. కావున వారివారి కనుకూలమైన త్రోవలు వెదకికొనుట విజయమునకు మూల సాధనము. అందుకు భిన్నముగ ప్రవర్తించువారు ఏటికి నెదురీదినట్లు శ్రమకు పాత్రులయ్యు గమ్యస్థానము చేరజాలరు. ఉత్తమ కవులెల్లరు తమ ప్రకృతి కనుకూలించిన రచనల యందె శక్తిసామర్థ్యములను వినియోగించి కృతకృత్యులైరి.

కావ్యము చిరంజీవముగ నుండవలయునన్న అందలి వస్తువుగూడ సర్వజనీన స్వభావమును, తదనుగుణమయిన మనోవికారములను వెల్లడించుట కనుకూలమైనదిగ నుండవలయును. ఏలయన, దేశ కాలపరిస్థితులకు లోబడిన సంకుచిత విషయములును, భావములును అన్ని కాలములయందు నందఱిని రంజింపజేయజాలవు. ఆచార వ్యవహారములు, భాషలు వేఱైనను మానవుల మనోవికారములు అంతట నొకేవిధముగ నుండును. సుఖదుఃఖములు, మంచిసెబ్బరలు, జన్మమరణములు సర్వసామాన్యముగ మానవజాతికంతయు సహజము. శృంగార వీర కరుణాదిరసము లందఱకు ననుభోగ్యములుగ నుండును. అట్టిరసము లాదర్శప్రాయముగ చిత్రింపబడినపుడు దేశకాలపాత్రాతీతములై సర్వజనానురంజకములుగ నుండగలవు. ఇంగ్లీషు నాటకములు చదివి మనమానందించు చున్నాము; సంస్కృత నాటకములను చదివి పాశ్చాత్యులు సంతోషము నొందుచున్నారు. ఎందువలన ? నోటిగుండ వెడలు భాష రెండు దేశములవారికి వేఱయ్యును హృదయము నుండి వెడలు మనోవికారముల భాష మానవజాతికంతయు సామాన్యము. కావున నొక కావ్యము చిరంజీవముగ నుండవలయునన్న సర్వజనీన స్వభావ ద్యోతక వస్తు సంవిధాన కల్పనా చమత్కృతితో నొప్పియుండవలయును. ఇందుకు భారతాది మహాగ్రంథములును, శాకుంతలాది నాటకములును నిదర్శనములు.

కవి వ్యక్తిత్వము ఆతని రచనలయందు పరిస్ఫుటముగ నంకితమైయుండును. ఒకే విషయమును పలువురు కవులు కావ్యములుగ రచియించిరేని వానియందొకటొక్కటియు బ్రత్యేకరూపగుణవిశిష్టముగ నుండును. ఒక్కొక్కరియందు కళా నైపుణ్యమును, ప్రతిభయు, నభిరుచియు భిన్నభిన్నముగ నుండుటవలన వారి కృతులందు సైత మట్టి భేదములు గనుపట్టుచుండును. సర్వసామాన్య వస్తువైనను, అది కవి యంతః ప్రకృతితో సమ్మిళితమయి రూపాంతరమునొంది, కావ్య కుటుంబమునకు చేరినదయ్యు ప్రత్యేకత వహించి యుండును. కవి తనకు మాత్ర మిష్టమైన వస్తువును భావమును మనోవస్థను సర్వజనీనము చేయుటకు ప్రయత్నించుట కన్న, సర్వజనీన వస్తుభావ మనోవస్థలను తన వ్యక్తిత్వముచే నంకితము చేయుట

మేలు, అనగా అన్ని ప్రకృతులకు సామాన్యమైన భావావస్థలకు రూపముగల్పించి యే ప్రకృతి నైన రంజింప జేయవచ్చునుగాని, యొక ప్రకృతికి మాత్రము సమ్మతమైన దానిని సర్వజనీన మొనరించుట యసాధ్యము.

మహాకవుల కావ్యములందు పైన చర్చింపబడిన నాలుగంశములు ననివార్యముగ నుండును. ఇంకను విమర్శించుకొలది యెన్నియైన సూక్ష్మాంశములు తేలవచ్చును. కాని గ్రంథ విస్తర భీతిచే వానిని చర్చింప మానుకొంటిని.

## 5. కవిత్వశిల్పము - అనుకరణము

కవిత్వము లలితకళలకు చేరినది కావున, నిచ్చట శిల్పవిచార మనివార్యమైనది. శిల్పము నిదర్శక మనియు నాదర్శకమనియు రెండు విధములు. కొంచెమైనను భేదములేక ప్రకృతి ననుసరించునది మొదటిది. వలసినంతవఱకు ప్రకృతి ననుసరించి దానిని మించిపోవునది రెండవది. మొదటిది మాతృకకు సరియైన నకలు; రెండవది, స్వతంత్ర కల్పనము. శిల్పులు భూమ్యాకాశములందు సంచరించు రససిద్ధులు. కావున వారి సృష్టియు మర్త్యలోకమునకును స్వర్గలోకమునకును సంబంధించి యుండును. నిదర్శ కాదర్శక శిల్పములలో రెండవది యుత్తమమైనది. ఒక రూపమును పొల్లుపోక యనుకరించి చిత్రించుట నయనేంద్రియము యొక్కయు బుద్ధియొక్కయు కార్యము. కాని, అందు శిల్పకారుని భావనాప్రదర్శనమునకు చోటులేదు. అనుకరణమునందు నూతనసృష్టి యుండదు గాన అది యుత్తమ శిల్పము గానేరదు.

శిల్పము అనుకరణమా? లేక సృష్టియా? అను విషయమును గుఱించి చాల అభిప్రాయ భేదములు గలవు. వానిని కొందఱు అనుకరణ మనియు, మఱికొందఱు సృష్టియనియు పలుపలు విధములుగ దలంచుచున్నారు. శిల్పము అనుకరణమని తీర్మానించిన వారిలో ప్రథముడు గ్రీసు దేశస్థుడైన అరిస్టాటిల్ అనుతత్త్వ శాస్త్రజ్ఞుడు. అప్పటి నుండియు పాశ్చాత్యులెల్లరును శిల్పము ప్రకృతియొక్క యనుకరణ మనియే విశ్వసించుచుండిరి. కాని; *అరిస్టాటిలు నిర్వచించిన అనుకరణము (imitation) నకును మన మిప్పుడు అనుకరణ మను మాటకు చేసికొను నర్థమునకును చాల భేదమున్నది. ఆయన యుపయోగించిన పదము విశాల భావగర్భితముగ నున్నదని ఆయన యొనరించిన నియమముల వలననే మనము తెలిసికొనగలము.

---

* అరిస్టాటిలు కవిత్వతత్త్వ నిర్వచనములను సంపూర్ణముగ దెలిసి కొనవలయునన్న ప్రొఫెసర్ బుచ్చెరుగారి ''Aristotel's theory of poetry and fine art'' అను గ్రంథమును జదువవలయును.

శిల్పము తన మాతృకను ఉన్నదియున్నట్లు అనుకరింపక యింద్రియములకు గోచరించినవిధమున పునర్నిర్మాణము చేయుననియు, ఆదర్శప్రాయ మగు మానవజీవితము, ప్రవర్తనములు, చర్యలు మున్నగునవి శిల్పమున ప్రతిబింబించుచుండు ననియు అరిస్టాటిలు చెప్పియున్నాడు. •ఇందువలన శిల్పి యనుకరించువాడు గాడనియు, రసార్ద్రమైన యాతని భావమున నింద్రియములద్వారా ఏవేవి యంకిత మగునో వానిని మాత్రమే మూర్తీభవింపజేయు ననియు ? తేలుచున్నది. శకుంతలనాటకములోని కథ షుమారు ఆఱు సంవత్సరముల కాలపరిమితి గలదిగా దోచుచున్నది. కాని కాళిదాసమహాకవి దానిని రెండుమూడు గంటలలో ప్రదర్శింపబడుటకు వీలగు నాటకముగ రచించెను. ఏయే కథాభాగములు గ్రహించినయెడల కథావిషయమునకు లోపము వాటిల్లక, శిల్పధర్మమునకు విరుద్ధముగాక యుండునో అట్టిరీతిని ఉచితమైన సన్నివేశములను గల్పించి, ఆది మధ్యాంతములు గల యొక మనోహర దృశ్యమును రచించెను. లోక సామాన్యము లగు మానవచర్యలను గ్రహించి, వానిని లోకోత్తర వర్ణనాచమత్కృతి వలన అపూర్వమును, ఆదర్శప్రాయమునైన యొక విచిత్ర సృష్టినిగ మార్చివేసెను. ఇట్టి నిర్మాణమును సృష్టియందుమా? లేక యనుకరణ మందుమా ? దీనిని అనుకరణ మనుటకంటె ప్రతిసృష్టి యనుటయే సమంజసము. అరిస్టాటిలు గ్రంథమును చాల శ్రద్ధతో తర్జుమాచేసి, చక్కగ విషయము బోధపడుట కొఱకు విపులమైన వ్యాఖ్యానము వ్రాసిన ప్రొఫెసరు బుచ్చెరుగారు, అరిస్టాటిలు ఉపయోగించిన 'అనుకరణము' అను పదమునకు, 'నిర్మాణము' 'ప్రతిసృష్టి' అను అర్థములు కలవని వ్రాసియున్నారు. *

మమ్మటాచార్యులు కవిత్వమును నియతికృత నియమ రహిత మనియు, అనన్య పరతంత్రమనియు నిర్మితి యనియు జెప్పియుండుటవలన సంస్కృతలాక్షణికులకుగూడ, శిల్పము స్వతంత్రసృష్టి యను నిర్వచనము సమ్మతముగ నున్నట్లు తోచుచున్నది.

అపూర్వ వస్తునిర్మాణమునందు కావ్యశిల్పము ప్రకృతి సృష్టిని మించుచున్నది; కావుననే కళకు ప్రత్యేకమైన స్థితి కలిగినది. జంగమ వల్లులు, నిశ్చల చంచలా లతికలు, నొక్కిన పాలుగాఱు చెక్కిళ్ళు, పుప్పొడికట్టల నొరసి కొనుచు ప్రవహించు తేనె వాకలు, ఆకసము నంటు మేడలు మున్నగునవి కవికల్పనములు; వాస్తవజగత్తులో లేనివి.

---

• (1) The art may imitate things as they ought to be.
(2) A work of art reproduces its original not as it is in itself, but as it appears to the senses.
(3) A work of art is in idealised representation of human life - of character, emotion, action, under forms manifest to sense.
- *Aristotle.* (Butcher's translation)

* Imitation' so understood is a creative act. It is a Rivalry of Nature, a completion of her unfulfilled purpose, a correction of her failures.
- *Butcher.*

# లయవిభాతి

చలువగల వెన్నెలల చెలువునకు సౌరభము
గలిగినను, సౌరభము చలువయు తలిర్పం
పొలుపెసగు కప్పురపు పలుకులకు కోమలత
నెలకొనిన, సౌరభము చలువ పసయుం కో
మలతయును గలిగి జనముల మిగుల పెంపెసగు
మలయ పవనంపు కొదమలకు మధురత్వం
బలవడిన, నీడు మఱి కలదనగవచ్చు కడు
వెలయగల యీ సుకవి పలుకులకు నెంచన్.

ఈ పద్యమునందు పింగళి సూరనార్యుడు ప్రకృతిపై నొక పంతము వేసినాడు. వెన్నెల చెలువునకు సౌరభము గలుగవలయును! కప్పురమునకు కోమలత నెలకొనవలయును! పైగుణము లెల్లను గల మలయపవనమునకు మాధుర్య మలవడవలయును! అప్పుడు మాత్రమే అది సుకవి పలుకులకు ఈడనవచ్చును! కోటి సంవత్సరములు తలక్రిందయి తపసుజేసినను ప్రకృతి యిట్టి యపూర్వ వస్తు గుణ సమ్మేళన మొనరింపలేదు. కావున సుకవిపల్కులకు అసంపూర్ణమయిన సృష్టి యెట్లు ఈడనవచ్చును? వస్తుగుణములను అపూర్వముగ నేర్చి కూర్చుటయందు కవి అత్యంత నిపుణుడు. ఈ నైపుణ్యము భావనకు సంబంధించిన మహిమ. కవికల్పనములు కొన్నియెడల అలౌకికములైనను చదువరులకు బోధపడకపోవు. ఏలయన : సంయోగము క్రొత్తదైనను వస్తువులు మాత్రము పూర్వపరిచితములె. తాను సృజించిన వస్తువు స్వభావికమా, లేక యస్వాభావికమా యను విచారము కవికనవసరము. ఇట్టి వస్తువు భావప్రపంచమున నుండిన నెంత రమ్యముగ నుండును అను తలంపె కవికి ముఖ్యము; రసనిష్పత్తికి సాధక మగునేని నెట్టి యలౌకి కేంద్రజాలమునైన పన్నవచ్చును. ఏలయనగా కవిసృష్టి యానందమాత్ర ప్రయోజనము గలది.

అదర్శప్రాయమగు రూపమును చిత్రించు చిత్రకారుడు ఏదో యొక బహిరాకృతిని తన రచనకు ఆలంబముగ గొనడు. ఆ రూపమును తాను భావనచేసిన తన మనమునందు ప్రతిబింబించిన విగ్రహమును పటముపై చిత్రించును. అటులనే కవియు భావనా కల్పితమైన చర్యలను వాగ్రూపమున వెలిపుచ్చును. ఒక యుదాహరణము : చిత్రకారుడొకడు రతీదేవి స్వరూపమును లిఖింపవలయునని తలంచి యొక సౌందర్యవతిని ఆదర్శముగ దీసికొని తత్ ప్రతిబింబకముగ చిత్రించును. రతీదేవి స్వరూపమునందు స్త్రీ సౌందర్య పరమావధిని మూర్తీభవింప జేయువలయునని ఆతని యుద్దేశము. తాను రచియించిన రూపమునకన్న

రమణీయవతి యగు మఱొకకాంత కాన్పించిన యెడల చిత్రకారుడు పూర్వచిత్రమును చించి పాఱవైచి, క్రొత్తరచనకు బూనుకొనవలయును. ప్రకృతి పరిణామ శీలము; రూపములను సృజించుటకు ప్రకృతి యెన్ని నమూనాలను వ్రాసి చింపివేయవలయునో, యెన్నివేల సంవత్సరములు పట్టునో యెవరి కెఱుక? నిపుణుడైన చిత్రకారుడు స్వయముగ సౌందర్యమును ధ్యానించి తదనుసరణముగ లిఖించిన చిత్రము చిరంజీవముగ నుండగలదు. శకుంతలాది యద్భుతసృష్టులీ తెగకు జేరినవే.

## 6. రస రామణీయకములు.

'విభా వానుభావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః' అని భరతముని రసలక్షణము నిర్వచించెను. అప్పటి నుండియు రసస్వరూప విచార చర్చ నిరంతరముగ జరుగుచు వచ్చినది. వ్యాఖ్యాతలును ఆలంకారికులును వారివారికి తోచినట్లు భిన్నభిన్నముగ భరతసూత్రమును వివరింపుచు వచ్చిరి. సూత్రమునకు అనుకూలమును ప్రతికూలము నగు నెన్నియో మతములు బయలుదేరినవి. * కాని వానినెల్ల నిచ్చట వివరింప నవసరము లేదు. సంస్కృతలాక్షణికుల వాదప్రతివాదముల వలన తేలిన సారాంశములను క్రింద పొందుపఱచు చున్నాను.

(1) విభావము (ఆలంబనోద్దీపనములు), అనుభావము (సాత్వికము అనుభావము నందె చేరియున్నది.), వ్యభిచారి యని భావములు మూడు విధములు.

(2) విభా వానుభావ వ్యభిచారి సంయోగమువలన నొకభావము పరిపూర్ణతనొంది 'స్థాయి' అని పేర్కొనబడుచున్నది.

(3) ఆ స్థాయిభావము, చర్వణమువలన రసత్వమునొందుచున్నది.

(4) భావత్రయ సంయోగము వలన రూపాంతర పరిణామము గలుగుచున్నది. (దధ్యాదులవలె)

(5) * భావ్యమాన భావత్రయములో నేదైన నొకటి రసమగును.

పై సారాంశములను వలసిన చోట్ల గ్రహించి విమర్శించెదము.

పాంచ భౌతిక ప్రపంచమును మనము శబ్ద స్పర్శ రూప రస గంధముల వలన

---

* మతభేదముల వివరములను, వాద ప్రతివాదములను దెలిసికొన గోరువారు కావ్యప్రకాశికను, రసగంగాధరమును జదువవలయును.

* భావ్యమానో విభావ ఏవ రసః అనుభావ స్తథా,

వ్యభిచార్యేవ తథా పరిణమతి.

ఇవి రసగంగాధరమునం దుదహరింప బడినవి.

తెలిసికొనుచున్నాము. ఇంద్రియములు సాధనమాత్రములు. వాని నుపయోగించునది బుద్ధి. మన మనస్సు పరాయత్తమైనపుడు దగ్గర నిలుచుండు వారిని గూడ (చూచుచుండియు) కనుగొనలేము. ఇంద్రియములు కొంపోవు నూచనలను బుద్ధి గ్రహించునప్పుడె జ్ఞానముదయించుచున్నది. అది యెట్లన : మన మొక పుస్తకమును జూచి దానిని పుస్తకమని గుర్తింతుము. నయనేంద్రియములు కొనిపోయిన రూపమును ఇదివఱకు స్మృతియందడగియున్న పుస్తక రూపముతో సరిపోల్చి, దానివంటిదే ఇది కావున 'ఈ రూపము పుస్తకము' అని బుద్ధి నిర్ణయించును. కాని, యీ వ్యాపారము అమిత త్వరితముగను అలక్షితముగను జరుగుచుండును కావున సామాన్యముగ దెలిసికొనుట కష్టము. మొట్టమొదట బుద్ధికి పుస్తక రూపజ్ఞానము లేనియెడల అట్టి వస్తువును జూచినపుడు 'ఇది ఫలానిది' యని నిర్ణయించుటకు వీలులేదు.

వస్తు స్వభావ జ్ఞాన ముదయించిన వెంటనే ఆలోచనయు, దాని వెంట భావమును (మనోవికారమును), తరువాత కోర్కెయు, దానితోడ సంకల్పమును, అనంతరము కార్యమును బుట్టుచుండును. ఉదాహరణము : మనమొక దారిలో నడుచుచుండగా నొక పుట్ట యొద్ద, కాలికి మూరెడు దూరమున పామును జూచితి మనుకొందము. దానిని చూడగనె పైన వివరించిన విధమున వస్తుస్వభావ జ్ఞానము గలుగును. పాము దగ్గరనున్నందువలన కఱచునని తలంతుము (ఇది ఆలోచన), తలచిన వెంటనే భయము గలుగును (ఇది భావము), తరువాత దానినుండి తప్పించు కొనవలయునని కోరిక పుట్టును (ఇది కోరిక), దానిని నెఱవేర్చు కొనుటకు ధృఢసంకల్పము గలుగును (ఇది సంకల్పము), అనంతరము వెనుకకు పరుగెత్తి తప్పించు కొందుము (ఇది కార్యము). అట్లుగాక మనము చూచినది నిరపాయకరమగు నీళ్ళపామని తెలిసికొన్నయెడల భయము శమించి యూరక నిలుచుందుము. ఇంద్రియ సందేశమును బుద్ధి గ్రహింపని యెడల భావములు పుట్టవనియు వ్యతిరేకముగ గ్రహించిన యెడల వ్యతిరేక భావములే కలుగు ననియు నిందువలన మనము తెలిసికొనవచ్చును. వస్తువు లెట్లు అనుకూల ప్రతికూలములో వాని వలన కలుగు భావములుగూడ నట్టివియె. వస్తువుల సుఖదుఃఖ భావజనకతా పరిమితికి సమముగ ఆకర్షణ వికర్షణములు పుట్టును.

ప్రతి వస్తువును చిత్తము నందొక భావమును రేపును. అట్టి భావములు ఆనుకూల్య ప్రాతికూల్యముల ననుసరించి సుఖ దాయకములుగనో క్లేశ దాయకములుగనో యుండును. సుఖ దుఃఖ తారతమ్యముల కనురూపముగ భావములు కొన్ని దుర్బలములుగను, మఱికొన్ని తీవ్రములుగ నుండును. భావములవలె రసములును అనంతములు. అయినను ఇందు ప్రధాన రసములు తొమ్మిది వాని సాంకర్య సాజాత్య యొక్క భేద సంబంధముల వలన రసములు వివిధములగు చున్నవి.

ఒక్కొక్క భావము తనకనురూపమైన రసమును బుట్టింప గలుగునెడల భరతాదులు భావత్రయ సంయోగము నేల బోధించిరని కొందఱు శంకింపవచ్చును. ప్రధాన రసములు పుట్టుటకు విభావానుభావ వ్యభిచారి సంయోగ మావశ్యకము ఏలన, భిన్న ప్రకృతులందు నొకేవిభావము పరస్పర విరుద్ధములగు రసముల బుట్టించును. పులిని చూచినపుడు పిఱికివానియందు భయమును, శూరునియందు శౌర్యమును పొటమరించును. భావానుభావములకు కారణ కార్య సంబంధము గలదుగాన, భావము తీవ్రముగ రేగినప్పుడు అనుభావములు తప్పకపుట్టును. మనము గ్రహింపని యెడల పులిని చూచినవానికి కలిగినది పిఱికితనమా లేక శౌర్యమా యని నిర్ణయింప జాలము. గడగడ వడకుచు కంటనీరు వెట్టుచు పరుగెత్తబోయి తొట్రుపడుచుండుట కని అతడు భీతిల్లెననియు, లేక, బొమలు ముడివైచి, పండ్లు పటపట గొఱుకుచు కత్తిదూసి పులిపైకి దూకుటనుగని, యాతనియందు శౌర్యము దొనికినదనియు మన మూహింప వచ్చును. వీనికి వ్యభిచారి భావమును తోడ్పడిన ప్రధాన భావము పరిపూర్ణత నొందును. అనగా మూడు చిన్న దీపపు వత్తు లొకటిగ జేరినపుడు వేడిమియు, కాంతియు హెచ్చు నటుల, మూడుభావములు చేరి యొకస్థాయి భావమయి తీవ్రతను దాల్చును. కావున పరిస్ఫుటమగు రసము పుట్టింపవలయునన్న ప్రధానభావమునకు పరిపోషకముగ ననుభావాదులు గూడ వలయును.

ఇక రసస్వరూపమును చర్చింతము. స్థాయి భావమో లేక మఱియేదైన నొక భావమో చర్వితమగునపుడు రసత్వము నొందుచున్నది. అనగా ఆ భావమును సహృదయుడు తన హృదయమునందు నిలిపికొని పలుమాఱు భావించుట వలన ఆనంద ముప్పతిల్లును. రసము ఆనందమాత్ర గ్రాహ్యము. కావున, భావము అనుభవయోగ్యమైనది. రసము అనుభవ సిద్ధమగునది. భావచర్వణము, రసానుభవము నేక కాలమున జరుగుచుండును.

వస్తువునందు భావములేదు; కాని భావస్ఫోరక హేతువున్నది. అటులనే కావ్య సమర్పిత విషయములు అనుభవ రసికుల హృదయములందు భావముల స్ఫురింపజేయును. ఉదాహరణము :- నీటియందు ఱాయి రువ్వబడినపుడు తరంగములు రేగును. నీటియందు లీనమైయున్న యలలు కారణమలవడుటవలన వ్యక్తములయినవి. అటులనే మన మనమునందు వాసనారూపముగ లీనమైయున్న సుఖక్లేశాది భావములు కావ్యగత హేతు ప్రేరితములై స్వరూపములు దాల్చి యనుభూతము లగుచున్నవి.

అట్లయిన కావ్యమునందు రసములేదా? కావ్యమునందు భావ ప్రేరక విషయములు గలవు. ఆ భావములె అనుభూతము లగునపుడు రసత్వము నొందుచున్నదని యిదివరకే తెలిసికొనియుంటిమి. అట్లయిన కావ్యము రసవంతముగ నున్నదని యేల చెప్పుదురు?

సామాన్యమైన వాడుకనుబట్టి బియ్యము అన్నమునకు వలెనే భావమునకును రసమునకును గొంత భేదముగలదు. అప్పుడె యెసటిలో బియ్యమును బోసి ప్రొయ్యి మంటపెట్టు వంటవానిని 'నీ వేమి చేయుచున్నా' వని యడిగిన, 'నేను అన్నము వండుచున్నా' నని జవాబు చెప్పును. అన్నమే యైనయెడల వండనక్కఱలేదు, ఈ సందర్భమున పక్వము కాని బియ్య మెట్లు అన్నమని పేర్కొనబడినదో అటువలెనే కావ్యము గూడ, అంత్యఫలము దృష్టియందుంచు కొనబడి, రసవంతమని యూహింపబడుచున్నది.

రసము మానవచర్యలకే సంబంధించియుండుననియు, తిర్యగ్జంతువుల చేష్టల యందు రసస్పర్శ గలదనియు, అచేతన వస్తువర్ణనములు రసాభాసము లనియు, ఆలంకారికులు చెప్పు చున్నారు. ఇది చింత్యము. ఏలయన, అచేతన వస్తువులు గూడ రమణీయ భావముల బ్రేరించును. అవి యనుభవింపబడునపుడు ఆనందము పుట్టును. సుఖానుభవ యోగ్యమగు ప్రతిభావమును రసత్వము నొందగలదు, క్రౌంచపక్షి శోకము వాల్మీకిని అశ్రుగద్గద కంఠుని గావించినది. గొఱ్ఱెపిల్ల బుద్ధుని హృదయమున కరుణారసము నొలికించినది. ఉషస్సులను దర్శించిన వైదికఋషులు ఆనంద నిర్మగ్నులై వాని నత్యద్భుతముగ గొనియాడిరి. ఆషాఢమేఘము నీరసభావద్యోతకమైనయెడల, కాళిదాసుడు దానిని తన కావ్యమునకు ఆలంబముగ గొనునా ? అయిన మఱియొకటి, మానవచర్యలు హృదయమునకు దగ్గఱివి కావున వాని మూలకముగ భావోత్కర్షత గలిగింపవచ్చును; కాని యింతమాత్రమునకె తదితరములు నీరసములని శాసించుట సాహసము. తేనెలో మెదిపిన వస్తువేదైనను రుచిపుట్టించునటుల ఏభావమైనను సౌందర్యావాహకమై సుఖానుభోగ్యమగును. రస నీరసత్వములు కావ్య సమర్పిత వస్తువుల చేతనాచేతనత్వమునకు సంబంధించియుండక కేవలము అలౌకిక కల్పనా చమత్కృతియొక్క భావాభావములపై నాధారపడియుండును. రసమునకు చమత్కారమె ప్రాణమని విశ్వనాథుడు నుడివియున్నాడు. కల్పనా చమత్కృతి లేనిదే వాక్యమునకు కావ్యత్వము సిద్ధింపదు. కావున ప్రతి కార్యమును స్వగత చమత్కార తారతమ్యమున కనురూపముగ రసవంతముగ నుండవలయు ననియె నిర్ణయింపవచ్చును. పండితరాయలు రసమునందు రామణీయకమున్నదని నుడివియున్నాడు. అంతకన్న రామణీయకమునందు (రమణీయ భావమునందు) రసమున్నదని చెప్పుట సమంజసముగ నుండును.

లోకమున శోక బీభత్సాదిభావములు మనకు కష్టమును గలిగించును. అట్టివి కావ్య సమర్పితము లైనపు డెట్లు ఆనందము గలిగించుచున్నవి? ఎట్లన, అటువంటి భావములు శిల్ప నిపుణుడగు కవి హృదయమునుండి వెడలి సహజ కర్కశత్వమును బోనాడి, లోకోత్తర

రమణీయములై అద్భుతానంద సంజనకములయి సహృదయులకు సుఖానుభోగ్యములగు చున్నవి. కావుననే విషాదాంత నాటకములుగూడ ననుభవింపబడుట. కావ్యగతమైన ప్రతిభావమును రుచికరముగ నుండును. ఇందుకు కవియొక్క శిల్పకల్పనా నైపుణ్యమును, భావనేంద్ర జాలమును కారణము.

రామణీయకము ఇట్టిదని నిర్వచించుటకు సాధ్యముగాని భావము. ఒకేరూపము చూచు వారి హృదయ పరిపాకము ననుసరించి కొందఱికి సుందరముగను మరికొందఱికి నసహ్యముగను దోపవచ్చును. ఇది యందఱికి దెలిసిన విషయమె. లంబాడి వారికిని యెఱుకల వారికిని చాలయింపుగనుండు గవ్వలదండలు దంతపు కడియములు మన యాడువారికి నేవ పుట్టించును. వీరికి రమ్యముగ నుండు కాసులదండలు తావళములు మున్నగునవి ఆంగ్లేయ స్త్రీలకు మోటు నగలుగ దోపవచ్చును. అట్లయిన, సౌందర్యము వస్తుగతమా లేక మనోగతమా? ఈ విషయమై తుద ముట్టని చర్చలు జరిగియున్నవి. జగన్మిథ్యావాదులు (Idealists) సౌందర్యము మనోగతమనియు, జగత్సత్యవాదులు (realists) సౌందర్యము వస్తుగతమనియు తీర్మానించియున్నారు. కాని, యిరువురి వాదములందును సగము సగము సత్యము గలదు. రూపమునందు సౌందర్య భావము రేపు శక్తిలేని యెడల భావజ్ఞత యుండియు నిరుపయోగము. అట్టి భావము ప్రేరించు శక్తి రూపమునందుండియు దానిని తెలిసికొనగల యనుభవజ్ఞానము బుద్ధికి లేనియెడల రూపగత సౌందర్యమును నిరుపయోగము. అనగా అటువంటి మందబుద్ధికి రూపమునందు సౌందర్యము లేనట్లె తోచును. ఇంద్రియ వ్యాపార మందఱికి నొకే విధముగ జరుగుచుండును; కాని తత్సందేశములను చక్కగ నర్థము చేసికొనుటపై జ్ఞానమాధారపడి యున్నది. కావుననే యాలంకారికులు సహృదయుల హృదయములందు మాత్రమే కావ్యము రసము పుట్టింప గలదని పలుమాఱు నొక్కి చెప్పియున్నారు. భావ స్ఫోరక శక్తి బుద్ధి యందును గలదు. కావున రెండును ముఖ్యములె.

రామణీయక మనునది యేకవస్తువుగాదు. అది సమష్టి భావము. రోజాపువ్వు రమ్యముగ నున్నదనుటలో, దాని యాకారము, రంగు, పరిమళము మున్నగునవి చేరియున్నవి. సౌందర్యమును గ్రహింపవలయునన్న సింహావలోకము చేయవలయును. అనగా సమష్టి దృష్టితో జూడవలయును. ఆకారము మన సమష్టి దృష్టికి నందక మించిపోవునంత పెద్దదైన యెడల దానిని మెచ్చుకొనజాలము.

సౌందర్యమున కేదోయొక లక్షణమును గల్పించి దానిని బందిఖానాలో వేయుటకంటె స్వేచ్ఛగ వదలుట మేలు. ప్రతి మానవుని బుద్ధి నిర్ణయమె సౌందర్యమునకు ప్రమాణము. అది ప్రత్యేకము. సామాన్య వస్తువులలో గూడ ననంత సౌందర్యమును దర్శించిన మహానుభావులెందరోగలరు.

"In all poor foolish things that live a day
Eternal beauty wandering on her way''

అని సుప్రసిద్ధ ఐరిషు కవి ఈట్సు గానము చేసియున్నాడు.

## 7. శిల్పసీమలు

లలితకళలన్నియు, నొకే మూలసూత్రమునకు బద్ధములయ్యును, ఒకే యంత్య ప్రయోజనము గలవయ్యును వాహక భేదముల ననుసరించి వానివాని యధికార సీమలును భిన్నములుగ నుండును. కళలన్నియు నొకే విధమైన శక్తి పరిమితులు గలిగియున్నయెడల; గానము, కవిత్వము, చిత్రలేఖనము, భాస్కర్యము మున్నగునవి పృథగ్భావము భజింప నవసరముండదు. ఒక్కొక కళయందు నితరకళలో లేని యానుకూల్యమును గుణమును హెచ్చుగ నుండుటచేత కళలన్నియు మనకు నావశ్యకము లైనవి.

గానమున రాగము ప్రధానము. తక్కిన గుణములన్నియు రాగమునకు లొంగియుండును. కవిత్వమున రామణీయకము ముఖ్యము; ఇతర గుణములు దానికి పోషకములుగ నుండును. భాస్కర్యమునందు నిమ్నోన్నత స్థలములును ఘనిష్టతయు చక్కగ ప్రదర్శింపబడును. చిత్రకళ మూలమున వివిధ వర్ణములతో సూక్ష్మాతి సూక్ష్మములైన వివరములనుగూడ చిత్రించి దృశ్యమును కన్నులకు కట్టినట్లు చేయగలము. కావున నొక్కొక కళకు నొక్కొక విషయము ప్రధానముగ నేర్పడినది. కవిత్వమునకు ప్రతిక్షణభిన్నములగు మానవచర్యలును, చిత్రలేఖనమునకు విశాల దృశ్యములును, భాస్కర్యమునకు విగ్రహ రచనయు ననుకూల వ్యాపారములు. ఇట్లగుటవలన, కళలన్నిటిని పృథఃకరించి వాని వానికి గల సంబంధమును త్రెంపివైచుటకు నేను సాహసింపను. కళలన్నియు పరస్పర సాపేక్షకములు. కవిత్వమున కొంత చిత్రలేఖనము చిత్రలేఖనమునందు కొంత కవిత్వమును అవిభాజ్యముగ మిళితమైయున్నది.

చిత్రకారుడు స్థలపరిమాణ బద్ధములగు రంగుల నుపయోగించును. కవి కాల పరిమాణ బద్ధములగు శబ్దముల నుపయోగించును. చిత్రకారుడు రూపమునకు చర్యను వశవర్తిని జేయును. కవి చర్యకొఱకు రూపమును వర్ణించును. చిత్రకారుడు అనంత కాలమునుండి యేదో యొక క్షణమును (అనగా ఆక్షణములో జరుగు కార్యమును) గ్రహించి దానికి శాశ్వతస్థితి గల్పించును. కవి క్రమముగ ప్రతిక్షణమున జరుగు కార్యముల వర్ణించుచు బోవును.

ఇంతింతై వటు డింతయై మఱియు తానింతై నభోవీధిపై
నంతై తోయద మండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రునికంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుం డగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై.

ఈ పద్యమందు అనుక్షణ వర్ధమానమైన వామనుని స్వరూపము వర్ణితమైయున్నది. ఈ విషయమును స్ఫురింపజేయుటకు చిత్రకారుని కన్నను కవికి ఆనుకూల్య మెక్కువ. ఏ నిమిషమున జరుగుచున్న కార్యము (విజృంభణము) చిత్రించినయెడల ముందు జరిగిన విషయమును ఇకముందు జరుగబోవు విషయమును సూచితమగునో అట్టి చర్యను మాత్రము చిత్రకారుడు చిత్రింపవలయును. చిత్రమును మ్యాజికులాందరు బొమ్మకును, కవిత్వమును బయస్కోపు బొమ్మలకును బోల్చవచ్చును.

చిత్రకారు డొకరమణీయ రూపమును లిఖించి మనలను ఆనంద పరవశులను జేయును. మనకానంద మెట్లు కలిగినది? ఆరూపముయొక్క సర్వావయవములు సమష్టి యాకారమున కనురూపముగను, రమ్యముగను చిత్రింపబడియుండును. అవి యెల్లను సమష్టిగా నొకేసమయమున గోచరించును. అప్పుడా రూపసౌందర్యమును మెచ్చుకొనుట వలన ఆనందము మనకు గలుగును. కవియునొక సౌందర్యవతిని వర్ణింపవలయునన్న నేమి చేయవలయును? చిత్రకారునివలె ప్రత్యంగము తాను వివరముగ వర్ణించి అట్టి యానందమును మనకు గలిగింప గలడా? ఎన్నటికి గలిగింపలేడు. ఎందువలన? కవి యొక్కొక్క యవయవమును ప్రత్యేకముగ వర్ణించును. శరీరవర్ణనము వివరముగ పూర్తియగువఱకు నిరువది ముప్పది పద్యములు పట్టును. ఆ పద్యములన్నిటియందు నిమిడియున్న అవయవ వర్ణనమునంతయు నొక్కచోటికిచేర్చి యొక యాకారముగ నిర్మించి సమష్టి సౌందర్యమును గ్రహించుట యసాధ్యమైన యుద్యోగము. అంగములను విడివిడిగ కత్తిరించి వేఱుపఱచి వాని యందచందముల మనము కనుగొనజాలము. కావున, కవి యెల్లప్పుడును సమష్టివర్ణనము చేయుట యుపయోగకరము. చిత్రకారుడు ఆనందకార్యమును చిత్రింపక తత్కారణ భూతమగు రూపమును ప్రత్యక్షముచేయును. కవి కారణమును వర్ణింపక కార్యమును (కారణమైన రూపమును జూచుట వలన గలుగు ఆనందమును) వర్ణించును. అట్లయిన అవయవ వర్ణనము కవికి నవసరము లేదా? కొంతవఱకు అవసరము కలదు. అటువంటి వర్ణనములు సమష్టివర్ణనమును సార్థక పఱచు నట్లుండిన నదియొక విశేషము.

అలరుం దండలు తమ్మి దుద్దులను గ్రీవాలంకృతుల్ చేసి కా
మలతో తెచ్చిన కల్వలం చెవుల గ్రమ్మన్మాటి, వాసంత పు

ష్ప లతారమ్యత గేరుచున్ నయన నిర్వాణమ్ము గావించు నా
కలకంఠింగని గౌతముం డెదను జిక్కంబట్టు యత్నంబునన్.

గోరంటాకురసాన పాణితలముల్ గోళుల్ పదాబ్జంబులున్
సారాశోక కిసాల రోచి రుదయ స్థానమ్ములై రక్తిమల్
వాలం, కాటుక చీకటిం కనులక్రేవంజేర మోహంబు శో
భారాజ్యంబును నేలు రాణియయి దైవాఱుం గురంగాంక్షియున్.

(కడపటి వీడుకోలు)

మొదటి పద్యమున 'నయననిర్వాణమ్ము గావించుట' అనువాక్యమునందు కార్యము వర్ణితమైనది. ఎంత సౌందర్యవతియైన కాంతను జూడనిదే గౌతమునికి అంతటి యానందము గలిగియుండునా! అని మన మూహించుచుందుము. కవి సూక్ష్మముగ స్ఫురింపజేసిన భావములను అవలంబముగ గొని మనము మఱికొంత భావింప మొదలిడుదుము. అనంతరం మా భావములే ఘనీభవించి మనకొక సుందర స్వరూపము పొడగట్టును. రెండవ పద్యమున 'శోభారాజ్యంబును నేలు రాణి' అనువాక్యమున సమష్టివర్ణనము చేయబడియున్నది. అందుకు తక్కిన వర్ణనములు పోషకములుగ నున్నవి.

చెలువుగ వ్రాసి దిద్ది విధి చిత్తము రంజిల జీవమిచ్చెనో ?
పొలుపుల గూర్చి మానస విభూతిని కౌతుకియై రచించెనో?
మెలతుక మేనిజూడ బరమేష్ఠి ప్రభావము నెంచిచూడ నా
నెలతుక దోచు నొండు తరుణీమణి సృష్టియటంచు నామదిన్.

* (శాకుంతలము)

పై పద్యమునం దంతయు సమష్టివర్ణనమే. దుష్యంతుని యీమాటలవలన శకుంతల అసదృశ లావణ్యవతియనియు లోకమోహన సౌందర్యవతియనియు మనమూహింపగలము.

పై చర్చయంతయు చిత్రకారుడును కవియు రూప గత సౌందర్యము నెట్లు స్ఫురింపజేయవలయునను విషయమునకు సంబంధించినది. కాని, చర్యను వర్ణింపవలసి వచ్చినప్పుడు కవి కేవలము సమష్టివర్ణనముతో సంతుష్టిపడి యుండరాదు.

---

* మహామహోపాధ్యాయ వేదము వేంకటరాయశాస్త్రిగారి తర్జుమా.

ఏవిహంగముగన్న నెలుగిచ్చుచును సారెకును సైకతంబులగూడతాఱు
తాఱి కన్గొని యది తనజోడుగాకున్న మెడయెత్తి కలయంగ మింటనరయు
నరసి కన్నీటితో మరలి తామరయెక్కి వదన మెండగ సరోవారి నద్దు
నద్ది త్రావగసైప కట్టిట్టు కన్గొని ప్రతిబింబ మీక్షించి బ్రమసియుఱుకు.

నుఱికి యెఱకలు దడియ వేఱొక్కతమ్మి
కరుగు నరిగి రవంబుతో తిరుగు తేంట్ల
పొడుచు ముక్కున మఱియును బోవువెదక
సంజ ప్రియుబాసి వగ నొక్కచక్రవాకి.

(మనుచరిత్ర)

పై పద్యమున విరహచంచలయైన యొక చక్రవాకి చర్యలు వర్ణింపబడినవి. కవి యెచ్చోటనైనను 'ఆ చర్యలు మనోహరములుగ నున్నవి' అని చెప్పలేదు. ఎందువలన? అవసరములేదు. ఆ చక్రవాకి చర్యలు మన భావమునకు తట్టిన వెంటనే అవి హృద్యములుగ నున్నవని మనమే యెఱుంగుదుము. కార్యకారణములను రెంటిని జెప్పుట రచనా కౌశలమునకు లోపము. ఒకటి తెలిసిన మఱియొకటి తప్పక తెలియగలదు. కళానియమబద్ధుడై కవి వదలిపెట్టిన వివరములను పాఠకుడు తన సొంతభావముతో పూరించు కొనవలయును. కావుననె పాఠకులు సహృదయులుగ నుండవలయుననుట.

## 9. కవిత్వ ప్రయోజనము

కావ్య ప్రయోజనములను గుఱించిన మన యాలంకారికుల మతము ఈ క్రింది శ్లోకము వ్యక్తపఱచుచున్నది.

శ్లో. కావ్యం, యశసే2ర్థకృతే, వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యఃపరనిర్వృతయే కాన్తాసమ్మితత యోపదేశయుజే.

ఇందు "సద్యఃపరనిర్వృతయే" అనునది ముఖ్య ప్రయోజనము. ఆనందాస్పదమయిన రసోత్పాదకత్వమె లలిత కళల గంతవ్యము. శాస్త్రముయొక్క కార్యము వస్తుతత్త్వ పరిశోధనము, శిల్పముయొక్క పని వస్తువు నావరించిన మనోహరత్వమును మూర్తీభవింప జేయుట. మొదటి దాని ఫలితము విజ్ఞానము. రెండవ దాని ఫలితము అహ్లాదము.

కవి యే మనోవస్థలో తనకావ్యమును రచియించెనో ఆ యవస్థనే సహృదయు డా

కావ్యమును జదివినప్పుడు పొందును. సంకుచితములైన ప్రపంచసీమలను భేదించుకొని మనస్సు విశాలమయిన భావప్రపంచమున అనిర్వచనీయమైన యానందము ననుభవించును. కావ్య జగత్తునందు చిత్తము లగ్నమైనపుడు అదియు బాహ్యప్రపంచము వలె యథార్థముగ దోచును. ఒకనాడు నే నభిజ్ఞాన శాకుంతలము చదువుచుండ, మనోహరారణ్యముల సంచరించి నట్లును శకుంతల పూదీవలకు నీరుపోయుచుండ నేను ప్రత్యక్షముగ జూచినట్లును, ఆమె నత్తవారింటికి వీడ్కొలుపుటకు నీటి కాలువవఱకు వచ్చిన కణ్వమహర్షియు ననసూయా ప్రియంవదలు మున్నగు సఖులలో నేను గూడ నొకడ నియు తలపోసి వారి సుఖ దుఃఖములను నేనును పంచుకొనుచుంటిని. కణ్వుని యాక్రోశము నాకర్ణపుటముల గింగురుమని మాఱు మ్రోయుచుండెను. కాని నేను చదువుచుండినది నాటకమనియు కాళిదాసుని యసదృశమైన రచనా చమత్కృతియు ప్రతిభయు నన్నటుల ముగ్ధుని గావించినదనియు తెలిసికొనుటకు నాకు చాలసేపు పట్టెను. మనసు సామాన్య శ్రుతిలో బడిన వెనుక, కల గని నిదుర లేచిన యనంతరము స్మృతి లేశములు స్ఫురించునటుల కణ్వుని సంసారము నా భావమునకు పొడకట్టుచుండెను. హీస్రీవుడ్ అనునామె రచియించిన 'ఈస్టీను' అను నవలలోని కడపటి యధ్యాయమును, 'ఒథెలో' నాటకములోని 'హత్యరంగమును' చదువుచుండినపుడు నాకు తెలియకయే నేను కన్నీరు నించుచుంటిని. ఈయవస్థ నాకెంత సేపుండెనో తెలియదు. తెలిసినప్పుడు, నేలపై జారిపడిన వాడు తన్నెవరైన జూచుచున్నారాయని యటు నిటు పరికించునటుల లజ్జాకరమైన నాస్థితిని ఎవరైన కాంచుచున్నారాయని పాఱజూచి అచ్చట నెవరును లేకుంట నెఱింగి తృప్తిపడితిని. కావ్యలోకము ఆ సమయమునకు సత్యమని తోపనిదే మనకు సహానుభూతి యెట్లు కలుగును?

జర్మను కవిశేఖరుడగు గెతె కావ్య ప్రయోజనములను కొంచె మించుమించుగ మన యాలంకారికుల వలెనే నుడివియున్నాడు.

"Each age has sung of beauty,

He who perceives from himself set free"

మానవసంఘమున యథార్థమగు నాగరకత హెచ్చుకొలది ప్రజలయందు సౌందర్య పిపాసయు నభివృద్ధి నందు చుండును. అట్టికాలమున సామాన్యజనులుగూడ లలిత కళల నభిమానించుచుందురు. ఇది యెంతయు సహజము. కాళిదాసుని కాలమున హైందవ సంఘము చాల నాగరక స్థితి యందున్నదనుటకు ఆనాటి యాచార వ్యవహారములును, కళాకౌశలమును, సాక్ష్యములుగ నున్నవి. అందుకు కాళిదాస మహాకవియె మొదటి తార్కాణము! కవుల కావ్యములందు సమకాలీనమయిన సాంఘిక పరిస్థితులు, తదభ్యుదయ పరిణామములు

ప్రతిబింబించుచుండును. సారస్వతము సంఘముయొక్క యుచ్చ నీచస్థితులను దెలియ జేయు 'భారమితి' యని చెప్పవచ్చును.

కాళిదాసుని కాలమున చిత్రలేఖనము, నృత్యము, సంగీతము, నాటకము మున్నగు లలితకళలు చాల వ్యాప్తిలో నుండినవి. మాళవికాగ్నిమిత్రమునం గల యంతర్నాటికయందు కాళిదాసు ఆకాలపు రాజకుటుంబముల నృత్యవినోదములను చూపించినాడు. శకుంతలను అత్తవారింటికి పంపు సమయమున వనస్పతు లొసగిన యాభరణముల చేత తమ సకియ నలంకరింపబోవుచు ననసూయ 'మే మింతవఱకు భూషణముల నుపయోగించి యెఱుగము. అయినను చిత్తరువు వ్రాత యలవాటునుబట్టి నీ యంగములయం దాభరణ వినియోగము చేసెదము' అని పలికెను. వనమున నివసించు ఋషి కుమారికలె చిత్రలేఖనమునం దంత నిపుణులై యుండ, నిక నాగరక యువకులమాట వేఱ చెప్పవలయునా? ఆదర్శక కవుల కావ్యము లందైనను దేశ కాలములు తమ పద చిహ్నముల ముద్రింపక పోవు. రామాయణ మహాభారతములు ఆయా కాలమునాటి హైందవ సంఘముయొక్క ఆదర్శక ప్రతికృతులని తలంపవచ్చును.

మన మనోవికారములను, భావములను శిక్షించి, సంస్కరింపగల యనుభవములు మాటిమాటికి లోకమున దటస్థింపవు. ఒకవేళ తటస్థించినను, అవి పరిపూర్ణముగను, ఆదర్శక ప్రాయముగను నుండవు. కాని, అట్టి యనుభూతులను కావ్యములందు మనము యథేచ్ఛముగ పొందవచ్చును. కవిత్వ సంపర్కమువలన సంకుచితభావము తొలగి యఖండ జీవముయొక్క పరతటము నంటగలము. క్రమముగ మన స్వభావము సున్నితముగ మాఱి తిలకించు ప్రతి వస్తువునందు సౌందర్యమును గుర్తించి యానందింపగల యభిరుచి హెచ్చును. కావున కావ్యము మానవప్రకృతి నుద్ధరింపగల యొక మనోహర సాధనము.

సంఘము యొక్క సంయోగితను బోషించుటకుగూడ కావ్యము లమోఘ సాధనములు. అట్టి ప్రబంధముల యందలి సర్వజనీన భావములు ప్రజలనందఱిని నేక సంప్రదాయ బద్ధులను గావించి, సంఘముయొక్క యైక్యమును బలపఱచును, రామాయణ, మహాభారతములు లేకుండిన హైందవ సంఘమేమై యుండునో! హిమవత్పర్వతము మొదలు కన్యాకుమారి వఱకు గల యీ విశాల భారతదేశమున నీ రెండు జాతీయ కావ్యములను చదువని, వినని హైందవుడుండునా ? ఎన్ని శతాబ్దములనుండి యీ కావ్యద్వయము మన సంఘమును బాలించుచున్నది! కాలము మాఱినది, చక్రవర్తులు గతించిరి. రాజ్యములు బంతులవలె నొకరిచేతినుండి మరియొకరి చేతికి దుమికినవి, మతములు పుట్టి చచ్చినవి, చచ్చిపుట్టినవి, అన్యదేశ నాగరకతా సంఘర్షణము గలిగినది. ఆచార వ్యవహారములు మాఱినవి.

పూర్వార్యావర్తమె రూపము మార్చుకొని క్రొత్తదేశమైనది కాని, మన జాతీయకావ్యములు ప్రాతపడలేదు, వాని యధికారమింకను మొక్కవోలేదు. హైందవ జీవన ప్రవాహమునకు ఆ కావ్యములు తటములవలె నున్నవి. కాలమా, నీవు చచ్చితివి! రామాయణ మహాభారతములు చావలేదు; అవి చిరంజీవములు!

## 9. కావ్యము : నీతి

మతము, శాస్త్రము, ధర్మము, లలితకళలు మున్నగునవి వానివాని కుచితమైన రీతుల మానవ శిక్షణమునకు దోడ్పడు సాధనములు. కొన్ని బుద్ధిని ఉత్తేజన మొనరించునవి. మఱికొన్ని హృదయమును పరిపక్వపఱచునవి.

ప్రతి యుగమునందును, ప్రతి సంఘమునందును కాలమున కంటె ముందు నడచు ప్రతిభావంతులు, విప్లవకారులు, దూరదృష్టి గలవారు కొంద ఱుదయించుచుందురు. అట్టి మహనీయుల భావములు, సృష్టులు ఆ యుగమునకు, ఆ సంఘమునకు ఆదర్శకములుగ నుండును. ఆ పురుషపుంగవులు మార్గదర్శకులు; అస్ఫుటముగను, అవ్యక్తముగనున్న భావికాలమును మనకన్నులకు పొడకట్టునట్లు చేయగల మహిమావంతులు. వారి పలుకుబడివలన మానవసంఘము క్రొత్త క్రొత్తదారులు ద్రొక్కుచుండును. జాతీయత అట్టి యుదార హృదయుల భావసంపర్కముచేత నంతర్జాతీయతగ పరిణమించుచుండును. బుద్ధుడు, వాల్మీకి, ఏసుక్రీస్తు, మహమ్మదు మున్నగు మహాపురుషు లీతరగతికి సంబంధించినవారు. వారి జీవితమే యొక యుత్కృష్టమైన కావ్యము. వారి ప్రవర్తనమే నీతికి ఆదర్శకము.

ప్రతియుగమునం దొక్కొకభావము ప్రముఖమై యుండును. అది యాధ్యాత్మికమైనను, సాంఘికమైనను, రాజకీయమైనను, లేక మఱి యింకేవిధమైన మానవచర్యకు సంబంధించినది యైనను గావచ్చును. ఆభావములందు ప్రజల యాంతరంగిక దృష్టి లగ్నమై యుండును. ఇట్టిభావము సార్వజనీనముగ నుండక తప్పదు. దానిని కవియో, చిత్రకారుడో, ప్రవక్తయో, తన సృష్టిమూలమున బయలుపఱచును. మన మెల్లర మానాయకుని ననుసరింతుము. ఎందువలన ? మనయందు అస్పష్టములుగను నిగూఢములుగను నున్న భావములను ఆయన వెలిబుచ్చును. ప్రజాబాహుళ్యము యొక్క భావములు అతని సృష్టియందు ఆదిశేషావతారము దాల్చి రెండువేలనాలుకలతో మాటలాడుచుండును. ఆయనకును మనకును సహానుభూతి గలదు. కావుననే యా నాయకుడు మనలనాకర్షించును. అట్టి మహనీయుల యుద్దేశములు, సంభాషణములు, ప్రవర్తనములు విశ్వశ్రేయమును చేకూర్చుచుండును. ఏది విశ్వశ్రేయమును సంపాదింపగలదో యది నీతిబాహ్యముగ నుండనేరదు.

లలితకళలు జాతీయ జీవితమునందు అంతర్వాహినులై ప్రవహించు భావముల రమణీయాభివ్యక్తులే. కావున, వాని యందు ముఖ్యములును, సర్వజనాదరణీయములును అగు భావములను ఆకర్షించి, శిల్పులు తమ రచనాచమత్కృతి వలన వానిని ఆదర్శకములుగ నొనరింతురు. ఇట్లనుట వలన మానవసమాజమును కళలును పరస్పర సాపేక్షకములని మన మూహింపవలయును. తాత్కాలికములైన భావములు కొన్ని ప్రజలను శిల్పులను ఆకర్షింపవచ్చును. అట్టివి క్షణికములు. కాని, కాలపారంపర్యముగ నొకజాతి యందు అస్థిగతమై మజ్జలో నాటుకొనియున్న భావములను మూర్తీభవింపజేయుట జాతీయశిల్ప మనబడును. అదియే లోకాదరణపాత్రము. తన వ్యక్తిత్వమును పోగొట్టుకొనక చిరంజీవముగ నుండును. తాత్కాలికములైన విజాతీయానుకరణములు మన స్వభావమునకుగూడ విజాతీయములే కావున సత్యపటుత్వము కొఱతపడి కళాప్రపంచమునందు నిరాదరింపబడును.

ప్రాచ్యపాశ్చాత్యశిక్షణ మార్గములందు పరస్పర వైరుధ్యము గోచరించుచున్నది. ఒకరికి శాంతియు నిరాడంబరమైన జీవనము ప్రధానము. మఱియొకఱికి, తృష్ణ, చిత్త సంక్షోభము, ఆటోపము ముఖ్యము. నేతిచే తడుపబడిన అగ్నిహోత్రమువలె భోగము లనుభవింపబడుకొలది వృద్ధిచెందుచుండుననియు, కావున భోగముల నియతముగ గ్రహింపవలయుననియు నొకరిమతము. భోగముల వీలైనంతవఱకు వృద్ధిపొందించి వాని ననుభవింపనిదే నాగరకతగాదని మఱియొకరి యభిప్రాయము. ప్రాచ్యులకు జీవితము పరమార్థమును సాధించుటకై ఏర్పడిన యొకయుపకరణము. పాశ్చాత్యులకు, జీవితమే యొక పరమార్థము. కావున యిట్టి మార్గభేదములు రెండు ఖండములయొక్క లలితకళల యందు నస్థిగతముగ నంకితమైయున్నవి. ప్రాచ్యశిల్పమునందు రూపయాథార్థ్య మంతముఖ్యముగాదు. ఏలయన, వారిశిల్పము చాలవఱకు సాంకేతికము. సాంకేతిక శిల్పమెప్పటికి కొన్ని శిల్పసమయములకు కట్టువడి యుండును. అజంతాగుహలయందలి రేఖాచిత్రములు ఈతరగతి శిల్పమునకు ప్రబలమైన నిదర్శనములు. మనశిల్పము ధ్యానమూలకము; వారిశిల్పము ప్రకృత్యనుకరణము.

‘కళలయందు రసరామణీయకములె ప్రధానములు, కాని, నీతికిని ఆధ్యాత్మిక భావములకును నేమిసంబంధము గలదు? అని కొందఱు విమర్శకులు ప్రశ్నించుచున్నారు. ఇది మనకు నవీనమును విజాతీయమునునైన సందేహము. ఆస్కర్ వైల్డు (Oscar Wilde) అను నొక ఆంగ్లేయ విమర్శకుడు * కళలన్నియు నీతిబాహ్యములనియు, నీతియనునది యేదోకొద్దిపాటి తెలివితేటలు గలవారికేగాని, ప్రతిభావంతులకు నీతి యనవసరమనియు చెప్పియున్నాడు. ధర్మశాస్త్రములయందు వలె కావ్యములందు నీతిబోధ యనవసరమనుటయే

---

* All the arts are immoral. To morals belong the lower and less intellectual spheres. - *Intentions.*

ఆయన యుద్దేశమైనయెడల మే మిరువురము ఏకాభిప్రాయులమే. కాని నీతికిని కావ్యమునకును ఏలాటి సంబంధము లేదని వాదించువారికిని నాకును భిన్నాభిప్రాయము గలదు. ఈ విషయమును కొంచెము చర్చింతము.

కావ్యమందు రామణీయకము ముఖ్యము; తక్కిన గుణములు అందుకు పోషకములుగ నుండవలయును. రామణీయకమనునది ప్రతిభావంతుడైన కవియొక్క రచనా నైపుణ్యమునకు సంబంధించినది. గుణమెప్పుడు తనకాలంబనమైన వస్తువును ఆశ్రయించి యుండును కాన, వస్తుగుణములు రెంటికిని ప్రాధాన్యము గలదు. ఒకవేళ నీతిబాహ్యమైన వస్తువు రమణీయమై యుండినయెడల షేక్స్పియరు (Shakespeare) మహాకవి సృజించిన క్లియోపాత్రా (Cleopatra) కన్యవలె మానవలోకమున కుపద్రవము గలుగజేయును. శకుంతలవలె అనుభోగ్యము గాదు.

మఱియొక పూర్వపక్షము గలదు : 'శిల్పముకొఱకే శిల్పము' (Art for Art) అనగా శిల్పమున కేలాటి బాధ్యతలు లేవు. కవి భావోద్రేకమువలన తనకిష్టమైనరీతిని గానము చేయును. అట్లుచేయుట యితరులకొఱకుగాదు; తన సంతోషమునకు. కోకిలకూయుట యెవరిని ఆనంద పెట్టుటకొఱకు? ఈ వాదము మొట్టమొదట వినుటకు ఇంపుగానే యుండును కాని విమర్శించుకొలది యందలి లోపములు బయలువడును. కోయిలకూతను విని మన మానందించుచున్నాము; నిజమే, దానికూత మధురముగ నుండుటవలనను ఆ కూత మనకు సమ్మతమగుటవలనను మనము సంతోషించుచున్నాము. అది తన కిష్టము వచ్చినట్లు కూయుటవలన గాదు. కాకిగూడ తనకిష్టమువచ్చినట్లే కూయును. దానిని మన మేమాత్ర మాదరించుచున్నాము? అటులనే కవి చేయు గానము మానవ సమాజము నుద్ధరించుటకు యోగ్యమైనదిగ నుండుటవలననే గౌరవింపబడుచున్నది. 'నాకు నోరున్నది. తిట్టుటకు చాల మాటలు తెలియును. కావున నేను తిట్టుకొనుచుందును' అని చెప్పి వీధులవెంబడి తప్పుదారి కూతలు కూయుచు తిరుగుచుండిన 'ఆతనికి పిచ్చి పట్టిన'దని పిచ్చివారి ఆసుపత్రికి పంపుదుము. సమాజ మెట్లు తనయందలి వ్యక్తికి బాధ్యమో, వ్యక్తికూడ అట్లె సమాజమునకు బాధ్యుడు.

కవి యొకమూల గూర్చుండి తన సంతోషముకొఱకు నొక కావ్యము రచియించుకొని దానిని పదిలముగ నింట దాచుకొని యుండినయెడల నేలాటి యిబ్బంది లేదు. అట్లు గాక కవిరచనలు వ్యాప్తిలోనికివచ్చి, లోకజీవనము పై నధికారము చేయుచుండును. కావున నందఱికంటెను కవికి బాధ్యత యెక్కువ. ఉత్తమకవి సృష్టియం దా కాలపు మానవ సంఘమునందలి సమంచిత భావములు మూర్తీభవించి యుండును. అతని రచనలందు భవిష్యద్వాణి రహస్య మర్మర రవములతో సంభాషించుచుండును.

మానవ జీవితమునకును శిల్పమునకును సహజమైన సంబంధము గలదు. జీవిత ప్రయోజనము ననుసరించి శిల్పప్రయోజనము కూడ నిర్ణయింపబడుచుండును. మన జీవితమును గుఱించి ఉమ్రఖయ్యాం (Omar Khayam) అను పారసీక కవి యిట్లు నుడివియున్నాడు.

One thing is certain and the rest is lies:
The flower that once has blown for ever dies.

Many knots unravelled by the road,
But not the knot of human death and fate;
There was a door to which I found no key,
There was a veil past which I could not see.

While you live, drink
for once dead, you never shall return.

ఉమ్రఖయ్యాము కొంచె మించుమించుగా చార్వాక మతస్థుడు. 'వికసించిన పూవు మరల వికసింపబోదు. మరణించిన మానవుడు మరల తిరిగి రాబోడు. ప్రాణముండగనే భోగము లనుభవించెదము. చచ్చిన వెనుక యేమగునో ఆ విషయము నాకు తెలియదు. ఆ ముడిని నేను విప్పజాలక పోతి'నని చెప్పెను. అట్టివారికి జీవితము భోగమాత్ర ప్రయోజనము. జీవితము ననుసరించి శిల్పము గూడ విషయభోగముల ప్రతిబింబముగ నుండును.

కాని, మన విశ్వాసములు వేఱు. ధర్మార్థ కామమోక్షములను నాలుగు పురుషార్థములను మానవజీవితము సాధింపవలయునని మన పెద్దలు నిర్ణయించిరి. వారు ఇహపరముల రెంటికిని సమాన గౌరవమును చూపియున్నారు. సన్న్యాస మనునది అతీత ధర్మము. లోకసామాన్యము గాదు. ధర్మార్థ కామమోక్షములు పరస్పర సాపేక్షములు కావున, మన కవిత్వ ప్రయోజనము, జీవితాదర్శకము ననుసరించి బ్రహ్మానంద సోదరమైన పరనిర్వృతిగ నిర్ణయింప బడినది. కావ్యము లనగా పసిబిడ్డ లాడుకొనుటకై మనమిచ్చు రంగుల బొమ్మలుగావు; అనాగరకతా దోషము పాపుకొనుటకు మేజా బల్లలపై ప్రదర్శింపబడు భూషణ గ్రంథములనుగా కావ్యములను మన మెప్పుడు తలంపలేదు. మన జీవితమునందు కావ్యములు మిళితమై పోయినవి. ఆర్యసాంఘిక జీవన ప్రవాహమునకు రెండు తటములుగ నున్న రామాయణ మహాభారతములే యిందులకు దృష్టాంతము. సీత, దమయంతి, సావిత్రి, ద్రౌపది మున్నగు పౌరాణిక సతీరత్నములు భారతదేశమునం దెందఱు పతివ్రతల సృజింప లేదు?

సంసారమందు నిర్భర దారిద్ర్యమును, కష్టపరంపరలను ననుభవించుచున్న సతీమణులకు దమయంతి, ద్రౌపది, చంద్రమతి మున్నగు నిల్లాంండ్ర చరిత్రము లెంత యూఱట నొడగూర్చియుండలేదు. ఈ నారీవతంసము లందఱు వ్యాస, వాల్మీకి మహాకవుల భావప్రపంచమున బుట్టి పెంపొందిన ఆదర్శక సృష్టులేకదా! అట్టి కవులెన్నటికైన నిర్బాధ్యులగుదురా; వారి రచనలు నీతి బాహ్యములగునా ?

కీట్సు (Keats) అను ఆంగ్లేయకవి Beauty is truth, truth beauty అని చెప్పియున్నాడు. మన పూర్వీకులు సత్య సౌందర్యములకు శ్రేయమునుగూడ జేర్చిరి. కావ్యము విశ్వశ్రేయము చేకూర్చునదిగ నుండవలయును. అనీతిదాయకమైన దేదియు లోకకల్యాణము నాపాదింపలేదు.

ఇక నీతియననేమి? దానినెవరు కల్పించిరి ? దాని వలన ప్రయోజనమేమి? అను నీ విషయములు మనసునకెక్కనిదే కావ్యములందు నీతి యావశ్యకమా?లేదా? యను సందేహమును మనము తీర్చుకొనలేము. నీతి యనుపదమును విశాల భావము గల దానిగా నూహించి నేనిచట ప్రయోగించుచున్నాను. దేశకాల పాత్రములకు లోబడి నీతులు భిన్నములుగ నుండవచ్చును. ఒక సంఘమువారికి నొక దేశమువారికి ననుకూలమయిన నీతులు మఱియొకరికి విరుద్ధముగ దోపవచ్చును. కాని, యిట్టి పరస్పర విరుద్ధములైన నీతులందు నంతర్వ్యాపియగు నుద్దేశ మొక్కటియే. అది యేదన : మానవ జీవితోద్ధరణము, లోకయాత్రా సౌకర్యము. నేనిచట ప్రయోగించిన నీతి అను పదమును దేశకాల పాత్రాచార వ్యవహారములకు వశవర్తియయి సంకుచితమయిన నీతినిగ నర్థము చేసికొన గూడదు. అన్ని నీతులకు జన్మకారణమయిన యావశ్యకతనుగ తలంపవలయును. ఇది జగదేకము.

సంఘ సమష్టికిని తదంశమైన వ్యక్తికిని భిన్నభిన్న వ్యక్తులకును గల ప్రవర్తన సామరస్యము, ఆనుగుణ్యము నీతి యనబడును. ఈ నీతి మానవుల యావశ్యకతనుబట్టియు ననుభవము ననుసరించియు, క్రమక్రమముగ రూపముదాల్చి సంఘయంత్రమును నడపు చుండును. ఈ నీతులు సకల విధములైన మానవచర్యలకు సంబంధించియున్నవి. ఇట్లనుటవలన, విశేష సంఖ్యాకులగు ప్రజల యభిప్రాయము ఘనీభవించి నీతిగను శాసనము గను మాఱును. కాని, నీతిశాసనములకు కొంత భేదముగలదు. రాజాధికార ముద్రగలది శాసనము, సంప్రదాయ సిద్ధమయి మానవుల భావములను పరిపాలించునది నీతి. నాగరకత హెచ్చుకొలది అధికార ముద్రాంకితములగు శాసనములకంటె స్వయమారోపితములగు నీతులే మనుష్యసంఘమును పాలించుచుండును. విరుద్ధ శాసనమునకు లొంగియుండుట దాస్యమైనను స్వయంకృత నియమమునకు వశవర్తియై యుండుట స్వాతంత్ర్య మనబడును.

నీతులును, శాసనములును (స్వయంకృతములైనను, పరకృతములైనను) సంఘమును శాసింపనియెడల వ్యక్తి స్వాతంత్ర్యము నశించి మానవజాతికి ప్రళయము సంభవించును. కావున నీతి మానవుల యం దన్యోన్య ప్రవర్త నానుగుణ్యమును పోషించును.

కళలు సాంఘిక జీవితముయొక్క యుచ్ఛ్వాస నిశ్వాసముల యాదర్శక లేఖనములని యిదివఱకే తెలిసికొని యుంటిమి. కావున జీవిత మొక వంకను, కళలు వేఱొక వంకను ప్రవహింప నేరవు. సాధారణ జీవితమునందు నేవేవి నీతిబాహ్యములుగను, నేవము పుట్టించునవిగనుండునో అట్టివి కళలయందును నింపుగొలుపవు. అట్లగుట కావ్యమునకును నీతికిని సంబంధ మెట్లు తెగిపోవును?

ధర్మశాస్త్రములు వేఱు; కావ్యములు వేఱు, వాని వాని ప్రయోజనములు భిన్నములు, పాలనాదండము చేత బట్టుకొని 'సత్యంవద' 'ధర్మంచర' అని వేదములు శాసించును. కవి 'సత్యంవద' అని శాసింపక హరిశ్చంద్రుని సృజించెను. 'సత్యమేవజయతి' అను ధర్మవాక్యమునకు హరిశ్చంద్రోపాఖ్యానము లక్ష్యము. ఆ కథను చదివినవారికి హరిశ్చంద్రునిపై భక్తి గౌరవములు గలుగక పోవు. మనమెవరిని ఉత్తములని మెచ్చుకొందుమో వారి ననుకరింపవలయుననియో, వారివలె ప్రవర్తింపవలెననియో మనమభిలషింతుము. ఈకోరిక మనయందు సహజముగ బుట్టును. సత్కావ్యములయందు ఇట్టియున్నతాశయములను, ఆసలనుప్రేరించు శక్తిగలదు. * బలాత్కార నీతిబోధనమునకు కావ్యము లెన్నడును పూనుకొనగూడదు. అట్టివి కావ్యములుగాక మనుధర్మ శాస్త్రములవంటి స్మృతులు మాఱును. కళలయందలి నీతి యంతర్లీనమై యలక్షితముగ మన హృదయమున ప్రవేశించును. దాని పదచిహ్నములదృశ్యములు. ఇట్లు రచించుట కళానైపుణ్యము.

కావ్య మర్థింపవలసినది రససౌందర్యము లేకదా! అంతర్లీనమైన నీతియైనను వానికెటుల నుపకరించును; అను సంశయము కొందఱకు గలుగవచ్చును. నీతిస్పర్శలేనిదే సౌందర్యము పరిపూర్ణముగాదని నాయుద్దేశము. ఈ దృష్టితో మనము విమర్శింపబూనినయెడల ఏ దేశము యొక్క యుత్తమశిల్పమునందుగాని యనీతిపరత్వము గోచరింపదు. ఒకచిత్రకారుడు రమణీయువతియగు కాంతను విగతవస్త్రనుగ చిత్రించి మనకు జూపినయెడల ఆ సౌందర్యమునంతయు మ్రింగివేయగల యసహ్యముపుట్టి మొగము చిట్లించుకొందుము. ఎందువలన? ఆ చిత్రపటమునకును జీవితమునందు మన కలవాటుపడియున్న యౌచిత్యమునకును వైరుధ్యము సంభవించినది. అందలి రమ్యత సర్వజనోపభోగ్యమగు

---

* The office of poetry is not moral instruction, but moral emulation; not doctrine, but inspiration - *G.H. Lews,* 'The Inner Life of Art'

నంతలేదు. సభ్యముగ ఇట్టి చిత్రములు ఆహ్లాదమును గలిగించి మనసు నుద్ధరించుటకు మాఱు, ఇంద్రియచాపల్యమును, అసభ్యములగు మనోవికారములను ప్రేరేపించు చుండును. అట్లుచేయుట యుత్తమకళయొక్క ధర్మముకాదు.

అట్లయినయెడల మానవచర్యలకు సంబంధింపని వనములు,కొండలు, మేఘములు, ఉషస్సులు, సూర్యాస్తమయములు మున్నగు దృశ్యముల ప్రతిలేఖనములు కాంచువారలకు ఆనందము గలిగించునుగదా! అట్టి చిత్రమునందు గూడ నీతి అంతర్లీనమై యున్నదా? అని కొంద ఱడుగ వచ్చును. అట్టి చిత్రములు అనీతిస్ఫోరకములు గాకుండుట చేతనే వానియందలి రామణీయకమును ప్రతిబంధకము లేక మన మనుభవింతుము. నీతి సౌందర్యమునకు హేతువుగాదు; పరిపూర్ణతకు ఆవశ్యకమైన యొక ఔచిత్యము.

కావ్యమునందు శిల్పనైపుణ్యము హెచ్చుకొలది యందలి కథాభాగమునకు చదువరుల హృదయము నాకర్షించు శక్తియు హెచ్చుచుండును. గుణ మెప్పుడు వస్తువు నాశ్రయించి యుండును. కావున నితరకళలయందు వలెనే కావ్యమునందును వస్తుగుణములు రెంటికిని వానివానికి తగిన ప్రాధాన్యము గలదు.

మానవుని ప్రతికోరికకును రెండుదిక్కులు గలవు. మొదటిది వాంఛాపరిపూర్తి; రెండవది తజ్జనితమైన యుపయుక్తి. ఒక యుదాహరణము; మిఠాయిని జూచినపుడు తినకోరిక పుట్టును. ఇది జిహ్వాచాపల్యము. మనదృష్టి కోరికతీర్చుకొనుట యందే లగ్నమయి యుండునుగాని, దాని యుపయోగమును గుఱించిన తలంపు సాధారణముగ కలుగదు. కాని, మనము తలంచినను, తలంపకపోయినను మిఠాయి తినుటవలన రెండులాభములు చేకూఱినవి. ఒకటి: కోరిక తీరుటవలన గలుగు తృప్తి; రెండు : దేహపుష్టి. ఇచ్చట మిఠాయిలోని మాధుర్యము రుచిచూచుటవలన కోరిక తీరినది. మాధుర్యము, ఆహారవస్తువు నాశ్రయించియుండుటవలన దేహమునకు బలము కలిగించినది. కాని మాధుర్యము మాత్రము కోరిక తీర్చునదిగా నుండి తదాశ్రయవస్తువు అనారోగ్యకరమై యుండినయెడల దాని ప్రతిఫలమును మనము తప్పక యనుభవింతుము. ఈ సాదృశ్యమును కావ్యములో రససౌందర్యములకును, కథా భాగమునకును వాని ననుభవించు మానవ సమాజమునకును నన్వయించి చూడుడు; అంత్యఫలితము మీరే యూహింపగలరు.

మానవస్వభావ నిర్మాణమునందు పరిస్థితులు చాల ముఖ్యములని మనస్తత్త్వ శాస్త్రజ్ఞులెల్లరు నొప్పుకొన్నవిషయమే! కావ్యములందట్టి పరిస్థితులు గలవు. ఇంద్రియ గోచరములగు విషయములు మనల నెట్లు లోగొనునో కావ్యాంతర్గత విషయవర్ణనముకూడ నట్లే మనల వశవర్తుల జేసికొనును. కావున కావ్యములతో కవికి గల సంబంధము కన్నను

దానిని చదివి యానందించు లోకులకెక్కుడు సంబంధము గలదు.

మతమును శిల్పమును ఒక పూవులోబుట్టిన రెండురేకులని చెప్పవచ్చును. వానిరెంటికి మిక్కిలి సమీప బాంధవ్యముగలదు. ఒక దానినొకటి యపేక్షించి యవి యన్యోన్య సహకారమువలన నభివృద్ధి చెందినవి.

వైదిక ఋషుల భావమును, కవిత్వ కల్పనాశక్తియు సమ్మిళితమయి, యందుండి యపూర్వ సృష్టులు బయలుదేరినవి. పౌరాణిక ప్రపంచమంతయు నిట్టి మతకవిత్వ సాంకర్యముయొక్క యద్భుత సృష్టియేకదా! ఇట్టి కల్పనలు లేకున్న మానవజీవిత మెంత సంకుచితముగ నుండియుండెడిదో!

మతమును, శిల్పమును ఆనంద సాక్షాత్కారమునకై పాటుపడుచున్నవి. గంతవ్య మొకటి; మార్గములు భిన్నములు.

“ఆనందా దేవ ఖల్విమాని భూతాని జాయంతి,
ఆనందా దేవ జాతాని జీవంతి.
ఆనందం ప్రయాన్త్యభి సంవిశంతి.”

ఈ భూతసృష్టియంతయు నానందమునుండి యుత్పన్నమగుచున్నది. ఆనందమున వర్ధిల్లుచున్నది. ఆనందము దిక్కునకే ప్రవహించుచున్నది. తుదకాయానందమును బ్రవేశించు చున్నది. శిల్పిసృష్టియు నిట్టిదే. భక్తుడును శిల్పియు నేది ‘సత్యం శివం సుందర’మో దానిని దర్శించుచున్నారు. ఈ యంతస్తునందు నిద్దఱికి గల భేదము నశించినది. కవి భక్తుడు, భక్తుడు కవి; శిల్పము మతము నొక్కటియే యైనవి.

మొదటి యనాగరక దశయందు మానవుడు పశుప్రాయుడై కామ్యసౌఖ్యములతో సంతృప్తిపడియుండును. అంతకు మించిన సంతోషము నత డెఱుగడు. రెండవ దశయందు ప్రాపంచిక జ్ఞానము కొంత యుదయించి, మనోవికృతులు శిక్షితములయి శాస్త్రములు, శిల్పములు మున్నగువాని మూలమున నానందము బొందును. మూడవ దశయందు రానురాను ఆతనిజ్ఞానము విశేషముగ నభివృద్ధినొంది పూర్వమున కన్న శాశ్వతమైన యానందము నన్వేషింపమొదలిడును. అదియే యమృతానందము.

“ఏకం రూపం బహుధా యః కరోతి ........
తమ్ ఆత్మస్థం యే2ను పశ్యంతి ధీరా,
తేషాం సుఖం శాశ్వతం నేత రేషామ్.”

ఒక రూపమును బహురూపములుగ నెవ్వడొనరించుచున్నాడో, ఆత్మస్థుడైన ఆ పరమాత్మను ఏ ధీరులు దర్శించుచున్నారో వారు శాశ్వత సుఖమును బొందుదురు. అన్యులు పొందరు. * శిల్పము తన యాదర్శకమును క్రమక్రమముగ మార్చుకొని, యెట్టకేల కీ శాశ్వత సుఖమును మానవుల కందింపగల యంతటి యున్నతపదవి నారోహించినంగాని, కృతకృత్యము కానేరదు.



* Fine art is not real art till it is in this sense free, and only achieves its highest task, when it has taken its place in the same sphere with religion and philosphy. - *Hegel* 'Philosophy of Fine Art'

# మర్మ కవిత్వము

పాశ్చాత్యదేశములందు శాస్త్రవిజ్ఞానము పెచ్చు పెరిగి లలితకళలస్థానమును సైతము నాక్రమింపజొచ్చెను. కావ్యములందు మనోమోహనమయిన దివ్యానుభూతికి మాఱు మేధోవ్యాపారము అధికారస్థాపనము గావించెను. ఆతరుణమున ఫ్రాన్సుదేశమునందు నిందుకు ప్రతీకారముగ నొక కవిత్వోద్యమము బయలుదేఱెను. అయుద్యమకారకులు సమకాలీన కవిత్వముతో తృప్తిపడియుండక, యింద్రియముల నంతర్ముఖముల గావించి, యగాధమును విశాలమునైన సూక్ష్మ ప్రపంచమును జొచ్చి, యందలి యనిర్వచనీయమయిన సత్యమును సౌందర్యమును గానము చేసిరి. ఈ తెగకు సంబంధించిన కవులను పాశ్చాత్యులు మర్మ (Mystic) కవులనియు, సాంకేతిక (Symbolists) కవులనియు నామకరణము గావించిరి. బాడిలేర్ అను ఫ్రెంచి కవి ఇటువంటి కవిత్వమునకు మొదటమార్గము సిద్ధపఱచెను. అనంతరము వెర్లైన్, మ్యాలర్మీ అను కవులు సుప్రసిద్ధులైరి. ఈ మర్మకవిత్వము యూరపుఖండమునందు తన ప్రకృతి కనుకూలించిన దేశములందెల్ల వేరు నాటుకొనెను. జర్మనీ దేశమందు డెమ్మెల్ అను యువక కవియు ఆతని యనుచరులును, అయిర్లాండునందు ఈట్సు, యే యి, ఆర్థరు సిమ్మన్సు, *జేమ్సు హెచ్. కజిన్సు మున్నగు కవులును ఈ మర్మకవిత్వసంప్రదాయమునకు సంబంధించిన వారు.

మర్మకవిత్వము సామాన్యముగ గీతి (Lyric) రూపమున నుండును. ఆ గీతములందు గానమునకును భావమునకును సమానగౌరవము గలదు; ఒకవేళ గానమే ప్రాధాన్యము వహించినదని గూడ జెప్పుటకు వీలున్నది. కావ్యరూపములలో గీతమే యుత్తమోత్తమ మని కొందఱి యాధునికుల యభిప్రాయము. మర్మకవులు తక్కువపదములలో నెక్కువగానమును, సూచనలను గర్భీకరింతురు. పాల్ వెర్లైన్ ఈ తెగ కవిత్వమునకు లక్షణముగ క్రిందిగీతముల రచించెను.

Music, Music before all things
The eccentric still prefer,
Vague in air, and nothig weighty,
Soluble, yet do not err,
Choosing words, still do it lightly,
Do it too with some contempt.

---

* వీరిప్పుడు మదనపల్లి థియొసాఫికల్ జాతీయకళాశాల ప్రిన్సిపాల్‌గా నున్నారు.

Music always, now and ever
Be they verse the thing that flies
From a soul that's gone escaping,
Gone to other loves and skies.

ఈ కవిత్వమునకు మర్మకవిత్వ మని యేల పేరు రావలయును? ఈ కావ్యములందు సామాన్యప్రజల కగమ్యగోచరములైన విషయము లుండును. సాధారణముగ నీ తరగతి గీతముల వస్తువు ఆధ్యాత్మికవిషయముగ నుండును. కవియొక్క యాంతరంగికానుభవమును విశ్వజనీనతయు గీతములయం దంకితమై యుండును. కవులయం దాధ్యాత్మిక స్వభావము నిర్నిద్రము. కావున వారు బహిరింద్రియ నిర్ణీతములైన సీమలనుదాటి సూక్ష్మప్రకృతిని ప్రవేశించి యందు గలిగిన యనుభూతిని ధ్వనిమూలకముగనో, సూచనగనో, సాంకేతికముగనో వెలిపుత్తురు. ఈ మర్మకవిత్వము కేవలము ఆత్మానుభవ జనితముగను, ఆత్మోపభోగమునైయున్నది. జీవనముయొక్క యవ్వలిగట్టు ఈ గీతములందు పొడకట్టుచుండును. యూరపుదేశపు సామాన్యజనులకు ఆధ్యాత్మిక గంధము శూన్యము. కావున వారి కీకవిత్వము మర్మముగ దోచినది. బాడిలేర్ కవిత్వము ఆధునిక పాశ్చాత్య మర్మకవిత్వమునకు మార్గదర్శకమైనదని యిది వఱకు తెలిపియుంటిని. ఆతని రచనలో చాలప్రసిద్ధమైన ఈ క్రింది పద్యములలోని యగాధాశయములను గమనింపుడు :-

Earth is a temple, from whose pillared mazes
Murmurs confused of living utterences rise;
Therein man thro' a forest of symbols paces,
That contemplate him with familiar eyes.
As prolonged echos, wandering on and on,
At last in one far tenebrous depth unite,
Impalpable as darkness, and as light,
Scents, sounds, and colours meet in unison.

ఈ తెగ కవులలో మఱల ఫ్రెంచివారికిని ఐరిషువారికిని కొంత భేదము గలదు. అయ్యది దేశకాలపరిస్థితులకు సంబంధించినది. ఐరిషుకవుల కుండినంత ప్రకృతి సాంగత్యము ఫ్రెంచికవులకు లేదు. అందువలన వారి కావ్యములందు కొంత కృత్రిమత పొడకట్టుచున్నది. మనకు సమకాలీనుడైన ప్రసిద్ధ ఐరిషు కవి, *ఈట్సు రచియించిన ఈ పేరిన తేనెగడ్డను చవిచూడుడు :

* వీరికి నోబెల్ వాఙ్మయ బహుమానము వచ్చినది.

## మర్మ కవిత్వము

In all poor foolish things that live a day
Eternal beauty wandering on her way,

ఈ కవి తన యాత్మానుభూతిని పై రెండు పాదములలో నిమిడ్చియున్నాడు; అనంతసౌందర్యమును ప్రతివస్తువునందు సందర్శించినాడు.

"............................ సత్కవీశ,
భావలోచన మెరవుగా బడయకున్న
కాంచనేర వంతర్లీన కాంతిసరణి."

- కృషీవలుడు.

సత్యము! సత్కవీశుని భావలోచనముగాక, అంతర్లీన కాంతిని సౌందర్యమును తక్కిన కన్నులు చూడగలుగునా!

మర్మకవిత్వమునందొకవిధమున యస్పష్టతయు ననూహ్యమైన భావనేంద్రజాలమును గోచరించుచున్నది. ఆ గీతములందు భావములు అంటీయంటక-చిక్కీచిక్కక-దక్కీదక్కక-మనతో దాగుడుమూత లాడుచుండును. 'ఆకావ్యము నుండి నీవేమి గ్రహించితివి?' అని యితరులు ప్రశ్నించినపుడు 'ఏమో నేను జెప్పజాలనుగాని, యొక విధమైన యవ్యక్త మాధుర్యమును, ఆనందమును అనుభవించితిని' అని చెప్పుటకు మాత్రము సాధ్యమగును. కళయొక్క పరమావధియు నిట్టి యనిర్వచనీయమైన రసానుభూతిని గలిగించుటయే యని యన్ని సంప్రదాయములకు సంబంధించిన రసజ్ఞులును, శిల్పులును నిర్ణయించిన విషయమే. 'When one art can fully be explained by another then, it is a failure' అని రవీంద్రుడు కళయొక్క యనిర్వచనీయతను బోధించెను. 'It (art) is to be felt, not to be explained.' శిల్పము అనుభవింప దగినదిగాని, వివరింపవలసినదిగాదని డాక్టరు అవనీంద్రనాథ టాగూరు నుడివియున్నాడు. ఇట్లనుటవలన ఉత్తమశిల్పము నందు వివరించి చెప్పనలవిగాని యొకవిధమైన రసస్ఫురణము గలదని మనము తెలిసికొనవచ్చును.

అడయారునందు జేమ్సు హెచ్. కజిన్సు గారియింట నేను మూడు చిత్రపటములను జూచితిని. ఒకటి నందలాలు వసువు రచియించిన 'శివనాట్యము' మఱిరెండు కజిన్సుగారు జపానునుండి తెచ్చినవి. వానిలో నొకదానియందు జపాను స్త్రీలు మంచుకాలమున కాగితపు గొడుగులు వేసికొని సంచరించుట చిత్రింపబడియున్నది. మఱియొకదానియందు కేవలము సన్ననిగీతలతో - నవియు నేడెనిమిదింటితో, నొక జపాను దేశపు స్త్రీముఖము అత్యద్భుతముగ లిఖింపబడియున్నది. ఈ మూడు చిత్రములు నాహృదయమునుహరించినవి. మర్మకవిత్వము

(Mystic poetry) యొక్క రహస్యము ఆ చిత్రపటముల మూలమున నేరుగ నామనమున నంకితమైనది. అంతవఱకు ఆకవిత్వములోని యస్పష్టత (Vagueness) యొక్క గుణమును నేను పూర్ణముగ గ్రహింపలేకుంటిని. శివనాట్యమును, మంచుకాలమున జపాను స్త్రీల సంచారమును చిత్రింపబడిన పటమును సాధారణమైన బొమ్మలపటములవలె పరిస్ఫుటముగ రంగులు పూయబడినవి కావు. వానిలోని యాకృతులు మనకు అస్పష్టముగ పొడకట్టును. ఆ యస్పష్టత శిల్పకళానైపుణ్యముయొక్క పరసీమయని తలపవలయునేగాని అల్పకౌశలముగల చిత్రకారుల వచ్చీరాని బీరకాయపీచుదనముగాదు. అట్లు చిత్రించుటకు శిల్పి చాల కళాభిరుచి గలవాడుగను, చేయితిరిగినవాడుగను, వర్ణసమ్మేళనాదివిషయములందు పరిపూర్ణజ్ఞానము గలవాడుగను నుండవలయును. ఆ పటములయందలి రూపములను తిలకించినపుడు మన మనస్సు గాలిలో తేలిపోవునటుల తేలికయై చిత్రసారూప్యమును పొందినట్లుండును. ఆ రూపము ఏదో యొక యగాధ రహస్య వాతావరణమున, వెన్నెలరాత్రియందు తేలియాడు మేఘశకలములవలె పొడకట్టును. చూడజూడ నవి గాలిలో కఱగిపోవుచున్నవా యేమి? యను సంశయముగూడ పొడమును. ఇట్టియస్పష్టతామాధుర్యమే నాకు మర్మకవిత్వమున దోచుచున్నది. రేఖలతో లిఖింపబడిన పటమును గాంచినపుడు 'ఎన్ని కొద్ది గీరలతో నెంత సుందరమైన యాకృతిని నేర్పరి యైన చిత్రకారుడు సృజింపగలడు ? అను నాశ్చర్యము దోపకమానదు. జపానుకవుల * 'హొక్కు' కవిత్వమునందువలె ఈ చిత్రపటమునందును అనవసర కళాప్రదర్శనము నాకగపడలేదు. అయినను అందు సౌందర్యమును నిరాడంబరతయు తొలకాడుచున్నవి. అట్టియస్పష్టతయు సంక్షిప్తతయు కేవలము అనల్పకళానైపుణ్యసాధ్యములని నేను గ్రహించితిని.

మర్మ కవిత్వమునందలి యస్పష్టతను గుఱించిన కొందఱి యభిప్రాయము నిట సంకలించితిని :

I. And the very perfection of such poetry often appears to depend, in part, on a certain suppression or vagueness

---

* జపాను కవిత్వ పద్య భేదములందు 'హొక్కు' అనునది చాల చిన్నపద్యము. అది పదునేడు నేకాచ్చు శబ్దముల పరిమితిగలది. ఈ పద్యములలోని విషయము జపానుదేశస్థులకుదప్ప, ఇతరులకు సాధారణముగ బోధపడనంతటి సంక్షిప్తముగ నుండును. అందువలననే జపానువాఙ్మయ విమర్శకులు 'కవి యెట్టివాడో పాఠకుడును నట్టివాడుగ నుండవలయును' అని చెప్పుట. హొక్కుపద్యముల రచించుట చాల కష్టమనియు, బాషో అను సుప్రసిద్ధ 'హొక్కు' కవి తన జీవితమునందు మూడునూర్ల పద్యములను మాత్రమే రచియింపగలిగెననియు, యోన్‌నొగూచి తెలిపియున్నాడు. విషయము దెలుపుట కొక ఉదాహరణము ననువదించితిని :

of mere subjects, so that the meaning reaches us through ways not distinctly traceable by the understanding.

- *Yone Noguchi.*

కాలిపోయెను శాల ; రాలెడుపూవు

లెంత నిశ్చలశాంతి నెసగెడు నిపుడు!

తనయిల్లు కాలిపోవు సమయమున రాలెడుపూవుల నిశ్చలశాంతిని గమనింపగల కవి మనోవస్థయే యీ పద్యమునందలి విశేషము.

2. vagueness is often a virtue; a god lives in a cloud, truth cannot be put on one's finger tip - *Walter pater.*

3. I think there should be nothing but allusions. The contemplation of objects, the flying image of reveries evoked by them are sung ............... To name an object is to take the three quarters from the enjoyment of the poem, which consists in the happiness of guessing little by little, to suggest that is the dream - *Jues Huret.*

ఈ లక్షణములు ముఖ్యముగ గీతకవిత్వమున కన్వయించును.

మర్మకవిత్వమును టాల్‌స్టాయి 'శిల్పమననేమి ?' అను తన గ్రంథమందు చాలతీవ్రముగ ఖండించియున్నాడు. అందు కా కవిత్వమున గల యగమ్యగోచరత్వము కారణము. అయినను టాల్‌స్టాయి తర్కమంత సహేతుకముగ దోపదు. ఆయన ప్రజాపక్షవాది. కావున సామాన్యజనుల కర్థముగాని శిల్పము వ్యర్థమనియు నింద్యమనియు ఆయన యభిప్రాయము. ఈ యపూర్వమైన మానదండమును గల్పించి టాల్‌స్టాయి రషియా దేశమునందలి వేగాక యూరపుఖండమునందలి యన్ని దేశముల లలితకళలను దానితో కొలిచి, సరిపడనివానిని తన విపరీతపు విమర్శనమునకు గుఱిగావించెను. ఒక పెద్దసౌధమునుగాని, క్రైస్తవుల ప్రార్థనాలయమునుగాని తిలకించినప్పుడు వానిసౌందర్యము తోచుటకు పూర్వమే 'ఈ కట్టడము లెందరి **పాట**కపుజనుల నిట్టూర్పుల తోడను, కన్నీటితోడను, కడుపు మంటలతోడను **రూపొందినవో**' యను కారుణ్య మా దయాశాలి మెత్తనిమనసును తడిసేయును. కావున టాల్‌స్టాయి నిర్వచనములందు కళాన్యాయనిర్ణయమునకంటె కరుణారసమె యెక్కుడుగా నుండును. ఒక కళయొక్క శ్రేష్ఠత్వము దాని నర్థముచేసికొనగల ప్రజలసంఖ్య ననుసరించి యుండుననియు, నట్లుగాక యెవరో కొందఱి భాగ్యవంతులకును, కేవలము శిల్పాభిరుచి గలవారికిని మాత్రమే పనికివచ్చు కళ యొకకళ గాదనియు ఆయన సిద్ధాంతీకరించెను. ఇది చాల యన్యాయ్యమును, శిల్పతత్త్వమునకు పరమవిరుద్ధమైన తీర్మానముగను నున్నది.

మన మొక కావ్యమును జదువునపుడు హృదయము రసాతిరేకమైనదా? లేదా? యనుదాని ననుసరించియు, ఐన యెడల దానితీవ్రతనుబట్టియు ఆ కావ్యముయొక్క గుణాగుణములను నిర్ణయింతుము. ఒకప్పుడు కావ్యము రమ్యమైన దయ్యు చదువరి హృదయము సంస్కారపక్వము కానియెడల రసోత్పాదనము గాకపోవచ్చును. ఈ రెండు సందర్భములయందును కృతికిని చదువరి స్వభావమునకుం గల సంబంధము ముఖ్యము. కాని, 'ఇతరు లెందఱీకావ్యమును జదివి యానందించిరి?' అను ప్రశ్నపై అతని యనుభూతి ఆధారపడియుండవలసిన యక్కఱలేదు. చిత్రముల విషయముగూడ నిట్లే యూహింప వలయును.

టాల్‌స్టాయి సిద్ధాంతమంగీకరింపబడినయెడల లోకమునందలి చాల యుత్త మోత్తమములగు చిత్రములు, కావ్యములు, శిల్పములు, కట్టడములు ధ్వంసముకావలసి యుండును. ఒక రచనయొక్క రసవత్తతయు, కళానైపుణ్యమును, సూక్ష్మబుద్ధిగ్రాహ్యము లగు గుణ విషయములును హెచ్చుకొలది వానిని గ్రహించి తదనురూపానందమును బొందు రసికుల సంఖ్యయు తగ్గుచుండును. కావుననే కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలము జంగమ కథలవలె సామాన్యప్రజానురంజకము కాకుండుట. రసజ్ఞత కుశాగ్రముగ నుండనిదే యుత్తమమైన కళాసృష్టిని మెచ్చుకొనుటకు సాధ్యముగాదు. అట్లు మెచ్చుకొనుటకు శిక్షితమైన అభిరుచియు అవసరము. అట్టి రసజ్ఞత ప్రజాసామాన్యమునందు నభివృద్ధి చెందియుండదు. వారికి తగిన శిల్పము లుండనేయున్నవి. ఇంకను కావలసినయెడల అట్టివి వేనవేలుగ కల్పించి క్రమక్రమముగ ప్రజల యభిరుచిని శిక్షించి యుత్తమశిల్పముల మెచ్చుకొనునట్లొనరింప వచ్చునుగాని, యాదర్శమును మాత్రము జనబాహుళ్యమునకు తెలియగల క్రిందిమెట్టులోనికి దింపరాదు. మేఘసందేశములోని రామణీయకము ఒక పల్లెటూరికాపునకు గోచరింపని కారణము చేత దానిని సరస్వతీదేవి యంకపీఠమునుండి క్రిందికి ద్రోయవలసిన దేనా ?

కాళిదాస భవభూతులు సమకాలీనప్రజల యభిరుచిననుసరించి వారి నాటకములను రచియింపలేదు. అట్లే వారు రచియించి యుండినయెడల అవి యెల్లకాలమునకు నాదర్శప్రాయములుగనుండనోపవు. ప్రజల యభిరుచిమాఱిన వెనుక వాని మొగము చూచువారుండరు. కాని శకుంతలనాటకము కాళిదాసుని యభిరుచి ననుసరించి సృష్టింపబడిన దగుట చేతనే చిరంజీవమైనది. ఈ విషయము కవులకు దెలియనిది గాదు. తన నాటకములోని సారమును భవభూతిమహాకవి తెలిసికొని, సమకాలీనుల యజ్ఞాన జనితమైన నిరాదరణమునిట్లు తూలనాడెను.

యేనామ కేచి దిహ నః ప్రథయం త్యవజ్ఞాం
జానంతి తే కిమపి తా న్ప్రతినైష యత్నః
ఉత్పత్స్యతే2 స్తిమమ కో2పి సమానధర్మా
కాలో హ్యాయం నిరవధి ర్విపులాచ పృథ్వీ.

ఈ విశాల ప్రపంచమునందు ననంతకాలమున తనతోడి సమాన ధర్మముగలవా డెవ్వడైన జన్మించి, తన నాటకమును చదివి యానందింపడా! యను తలంపు భవభూతిని నూరడించినది. ఎంతసహనము! ఎంత స్వార్థ త్యాగము! నేటి కవులు అప్రయాస లభ్య జనరంజకత్వమునకయి తమ శక్తిని వ్యర్థపుచ్చుచున్నారు.

మాలర్మి ప్రభృతుల కావ్యములలోని సూచనలను, అస్పష్టతను దోషములుగ పరిగణించి టాల్‌స్టాయి ఖండించుటయందు తప్పులేదు. ఏలయనగా : ఆయనకు దోచినట్లును, ఆయన భావించినట్లును దాపఱికములేక విమర్శించెను. ఇది చాల గొప్పతనము. కాని, సామాన్యప్రజల మనస్తత్త్వమును ప్రమాణముగ గొని, ఆకావ్యములలోని విషయములు వారి కగ్రాహ్యములు గాన దోషము లని తీర్మానించుట సాహసము.

మన దేశమునందు 'మర్మకవిత్వ' మనాదియైనది. దానిని మర్మకవిత్వమని పేర్కొనక ఆధ్యాత్మిక కవిత్వమని వ్యవహరించెదను. ఏలయన, ఆలాటి రచనలను మర్మకవిత్వముగ మన మెన్నడును భావించినదిలేదు. హైందవజనసామాన్యమునకు అవి మర్మములు గావు. పంచేంద్రియగోచరమగు స్థూలప్రపంచమున కన్న భిన్నమగు మరియొక యంతః ప్రకృతి గలదనియు, నశించునది పాంచభౌతిక శరీరమే గాని యాత్మ గాదనియు, జన్మాంతరము గలదనియు, నేమియుందెలియని కూలివాని మొదలు సకలశాస్త్ర పారంగతు డగుపండితుని వఱకు హిందూదేశమున నందఱును విశ్వసింతురు. ప్రతిదినము మనయింటికి బిచ్చమునకు వచ్చు దాసరిగూడ.

"మనది తనది యనుచు నరుడా, మాయలో బడబోకురా
మరణ మొందిన మనది తనది మంటలో యే మౌనురా!
బంకమట్టి యిల్లురా యిది బగ్గిబుగ్గీ యౌనురా
ఆత్మ యొక్కటె బ్రహ్మరూప మ్మంతటా తానుండురా."

అని పాడుచుండును. కావున మనవారు ఆధ్యాత్మిక గీతములను, కీర్తనలను మర్మ కవిత్వమని పేర్కొనలేదు.

మొట్టమొదట ఆర్యావర్తమున వేదములయం దీయాధ్యాత్మిక కవిత్వము జన్మించి,

యుపనిషత్తులయందు పరిపూర్ణత నొందినది. అనుక్షణము విస్తరించుచుండిన వైదికకవియాత్మ బహిఃప్రపంచమున తనివినొందక, అంతర్ముఖేంద్రియమై యగాధమైన యమృతానందమున నోలలాడి ఆ యనుభూతిని వెలికి నిట్టూర్చినది.

"శృణ్వంతు విశ్వే అమృతస్య పుత్రా, ఆయేధామాని దివ్యాని తస్థుః
వేదాహ మేతం పురుషం మహాన్త మాదిత్యవర్ణం తమసః పరస్తాత్"

అని వైదికఋషి ఘోషించినాడు. ఇంతటి మహానందము వెలికుఱుకక కవి హృదయమున నెట్లుదాగియుండగలదు? పిపీలికాది బ్రహ్మపర్యంతముగల ప్రాణికోటులను "అమృత సంతానములారా" యని సంబోధించినాడు. ఎంత ప్రేమ! ఎంతయానందము! ఎంతసత్యము! తాను దర్శించిన తేజస్సు అప్రాకృతము. కావున నది వర్ణింపనలవిగానిది. సామ్యముచే మాత్రము నూహింపసాధ్యమైనది. అదియు విలోమమార్గమున -

"నతత్ర సూర్యోభాతి న చంద్రతారకం
నేమా విద్యుతో భాంతి కుతో2య మగ్నిః
తమేవ భాంత మనుభాతి సర్వం
తస్య భాషా సర్వ మిదం విభాతి."

ఆత్మానుభవజన్యమైన యిట్టి యపూర్వసత్యములను వైదిక ఋషులు వర్ణించిరి. వారు ఆధ్యాత్మిక కవిగురువులు, ప్రథములు.

వివిధమత సంప్రదాయములయందును ఇట్టి కవిత్వమంకురించి శాఖోపశాఖలుగ నభివృద్ధినొందినది. వైష్ణవకవుల కీర్తనలయందు రసమాధుర్యములు పొంగిపొరలినవి. ఇందుకు కొన్ని కారణములు గలవు. వైష్ణవులకు భక్తి ప్రధానము, ప్రేమ యాలంబము. ఆత్మకును బరమాత్మకును గల సంబంధమును రాధాకృష్ణుల ప్రేమలీలలుగ సంకేతించి వారు సంకీర్తనము చేసిరి.

విరహిణియైన నాయిక యెన్ని యవస్థలకు పాల్పడునో, తన్ను రాధనుగను సర్వేశ్వరుని కృష్ణునిగను సంకేతించుకొన్న భక్తుడును అన్ని యవస్థల ననుభవించును. నాయకుని నెడబాసిన నాయిక పునః సమాగముకొఱ కెట్లు త్వరపడుచుండునో, అటులనే పరమాత్మ విశ్లేషమును సహింపజాలని భక్తుడును వేదన బొందుచుండును. ఇట్టి పారవశ్యము సాధారణముగ నందఱిభక్తులకు గలుగునది గాదు. ఇది భవముయొక్క పరపారము నంటు కడపటియవస్థ. పన్నిద్దరాళ్వారులలో నమ్మాళ్వారులకే యాదశకలిగెను. చైతన్యుడును నట్టియవస్థ ననుభవించెను. రామకృష్ణ పరమహంసయు నట్టి విశ్లేషవేదన నొందెనని వివేకానందస్వామి నుడివి యున్నారు.

నమ్మాళ్వారులు రచించిన "తిరువాయిమొழி" అంతయు కొంచె మించుమించుగ విరహిణీ గీతములని చెప్పవచ్చును. మీరాబాయియు, మహారాష్ట్రదేశపు భక్తులును అట్టి కీర్తనలను రచియించిరి.

తెలుగు దేశమున మఱియొక విధమైన యాధ్యాత్మిక కవిత్వము ప్రచారములోనికి వచ్చినది. పోతులూరి వీరబ్రహ్మము, ఆతని శిష్యుడగు సిద్దయ్య, వేమన్న మొదలగు తత్త్వజ్ఞాను లీ సంప్రదాయమున ముఖ్యులు. బ్రహ్మంగారి కాలజ్ఞాన కీర్తనలను వేదాంత కీర్తనలను తరుణాయి దాసరులు పాడుచుండగ మనము చాలమాఱులు వినియుందుము. భక్తిగీతములందువలె వానియం దంతరసము చిప్పిల్లుటకు వీలులేదు. అయినను అవి నీరసములుగ నుండవు. ఇచ్చటనొకటి రెండు ఉదాహరణములు అప్రస్తుతములు గావని తలంచెదను.

1. తెలుసుకొండి యన్నలార, తేట తెరువు బట్టాబయలు
నట్టనడుమా పుట్టాలో గురునాథూ డున్నాడు,
మూడుచుట్లా కోటలోన ముప్పయిముగ్గు రున్నారన్నా
ధ్యానాము కోటాకు ఎక్కూ పెడితే తలుపులూ దీసేమన్నారు.
ఇంపుకాదూ మెప్పూగాదు ఎన్నరాని యీ బ్రహ్మపదవి
చప్పరించీ చూడండన్న సారా మున్నాది.

2. తనకు బొందెకు ఎపుడో తగులాట మాయెను
వీరెవ్వరో గురుడ ! వా రెవ్వరో !
పుట్టి బూరగమాను పూసి లెస్సా కాసి
గట్టీగ కొమ్మలు కదిలాడగా
సుడిగాలి దెబ్బకు తొడిమజాఱిన పండు
తొడిమాతో యేమైన నుడివిపోయిందా ;

తనకు బొందెకు ..........................................
వీ రెవ్వరో గురుడ ....................................

3. చిత్తాస్వాతులు రెండు సంధింప ముత్తెపు
చిప్పాలో పడ్డాది చిను కొక్కటి,

ముత్యమై నీళ్ళల్లో మునిగీ పొయ్యేనాడు
చిప్పతో యేమైన చెప్పిపోయిందా ?

తనకు బొందెకు ......................................
వీ రెవ్వరో గురుడ ....................................

వేమనపద్యములలోని భావములను గ్రహించి కొందరు, వానిని కీర్తనలలో నిమిడ్చిరి. అట్టికీర్తనలె యిప్పుడు తెలుగుదేశమునందు చాలవఱకు వ్యాపించియున్నవి.

సమకాలీనమైన ఆధ్యాత్మిక కవిత్వమును గుఱించి కొంత విచారించి యీ వ్యాసమును ముగించెదను. బెంగాలు దేశమున రవీంద్రనాథ టాగూరును, ఆయన కవిత్వమార్గమును మెచ్చుకొని దాని నవలంబించు సత్యేంద్రనాథదత్తు మున్నగు నితర యువక కవులును ఆధునిక కవిత్వ సంప్రదాయమునకు సంబంధించినవారు. ఈ తెగకు రవీంద్రుడు మార్గదర్శకుడు. కావున మొట్టమొదట ఆయన కవిత్వమును గుఱించి తెలిసికొందము. రామమోహనరాయలు కలకత్తా నగరమున బ్రహ్మసమాజమును స్థాపించిన వెనుక బెంగాలీ సారస్వతమున నూతన జీవసంచలనము ప్రారంభమయి, దినదినాభివృద్ధి గాంచినది. బ్రహ్మసమాజపు ప్రార్థన మందిరములందు చదువుటకును, మతప్రచారము గావించుటకును క్రైస్తవుల పాటలు (Psalms) వంటి గీతములు రచియింపబడినవి. ఈ గీతారచనమే బెంగాలుదేశపు ఆధుని కాధ్యాత్మిక కవిత్వమునకు బీజము. రవీంద్రుడు బాల్యమునందే ఇంగ్లీషు కావ్యములను జదివెను. అందు ముఖ్యముగ కీట్సు, షెల్లి, బ్రౌనింగు అను ఇంగ్లీషుకవుల కవిత్వములలోని సారమును తనివి దీఱ నాస్వాదించెను. కాళిదాసుని శాకుంతలము, కుమారసంభవము, మేఘసందేశము రవీంద్రుని హృదయమును ప్రబలముగ నాకర్షించిన వనుటకు ఆయన 'ప్రాచీన సాహిత్యము' అను గ్రంథమున గావించిన తత్సంబంధములైన విమర్శనములే సాక్ష్యములుగ నున్నవి.

చైతన్యుడు, జయదేవుడు మున్నగు వైష్ణవభక్తుల కీర్తనలను టాగూరు గానము చేసిచేసి, యానందించెను. ఆ కీర్తనల యధికారము ఆయన రచించిన 'భానుసింహపదావళి' యను గీతములందు సుస్పష్టముగ నంకితమై యున్నది.

కీట్సు సౌందర్యమును పోషించిన కవి. షెల్లీ యింద్రియాతీతములైన ఆధ్యాత్మిక విషయములను గానము చేసిన తపసి. రవీంద్రుని కవిత్వమందు కీట్సు రచనలలోని రామణీయకము, షెల్లీ కావ్యములలోని యాధ్యాత్మిక తృష్ణయు, వైష్ణవ గీతములలోని భక్తిపారవశ్యమును - వీని మూటిని ఆత్మసాక్షాత్కరించుకొని మించిన స్వకీయ

ప్రతిభావ్యక్తిత్వములును సామరస్యము నొందినవి. కావున రవీంద్రుని యాధ్యాత్మిక కవిత్వము ప్రాచ్యపాశ్చాత్య మనస్తత్వముల కనుగుణమైన సంధిస్థానమై యున్నది.

"తుమి యేన్ ఒయ్ ఆకాశ్ ఉదార్
అమి యేన్ ఎయ్ అసీమ్ పాథార్
ఆకుల్ కొరేచె మాఝు కానే తా'ర్
ఆనందపూర్ణిమా' (మానసి - ధ్యానము)

(నీవు విశాలమైన ఆ యాకాశమవు ;
నేను సీమారహితమైన యీ సముద్రమును ;
వాని రెంటిమధ్య ఆనందపూర్ణిమ
తాండవించుచున్నది.)

ఆంగ్లేయ సారస్వత సంబంధమువలన బెంగాలునందువలె తెలుగుదేశమున సైతము కొంత యాందోళనము గలిగినది. యువక కవులు సంప్రదాయసిద్ధములైన పురాతన పద్ధతులను త్యజించి స్వతంత్రముగ క్రొత్తదారులు త్రొక్క సాగిరి. ఇప్పుడు తెలుగుదేశమున నాంగ్లేయ వాఙ్మయ పరిచితి గల యువక కవు లందఱు కొద్దిగనో గొప్పగనో (Romantic) కవులనుటకు యోగ్యులు. రవీంద్రుడు 'నోబెల్' బహుమానముచే సత్కరింపబడి యాతని కావ్యములు హిందూదేశమంతటను వ్యాప్తిచెందిన యనంతరమున తెలుగు రొమాన్టిక్ ఆధ్యాత్మిక కవిత్వముగ పరిణమింప మొదలు పెట్టెను. తత్పరిణామ చిహ్నములు ఇప్పుడిప్పుడు తెలుగు కవుల రచనలయందు పొడకట్టుచున్నవి. కాని, యిది ప్రథమదశ యగుటవలన కొందఱి రచనలయందు అనవసర పదాడంబరత్వమును, కళా కౌశలమువలన ప్రాప్తమైన భావనేంద్రజాలముగాక, భావ ప్రకటనము గావింపజాలని గజిబిజితనమును గోచరించుచున్నది. ఈ లోపము మొట్టమొదట అనివార్యమైనది. కావున సహింపదగినది. ఇందుకు లక్ష్యములుగ సమకాలీనుల కావ్యములనుండి కొన్ని యుదాహరణములను సంకల్పింపవచ్చును గాని, అనవసర వివాద హేతువుగ పరిణమించు నని మానితిని.



# నాటక కళా సంస్కరణము

## ఉపోద్ఘాతము

సంఘసమష్టి తనయందలి వ్యక్తిని నైతిక బంధముల జిక్కించుకొని యెట్లు అధికారముచేయునో, ఒక్కొక్కప్పుడు వ్యక్తియు తన సంకల్ప బలముచేత సంఘసమష్టిని తన యభిప్రాయమువంకకు త్రిప్పుకొనుచుండును. ఇందుకు మన సాంఘిక జీవితమునందు లెక్కలేని నిదర్శనములను జూచుచున్నాము. సంఘమునకును, అందలియంశమైన వ్యక్తికిని పరస్పర సంబంధము గలదు. కావున నొకజాతి నాగరక మైనదని చెప్పుటలో నూటికి తొంబైమంది మనుష్యులైనను నాగరకులుగ నుందురని మన మూహింతుము.

జాతీయ జీవితమార్గము కొండదారివలె నిమ్నోన్నతముగ నుండును. వాతావరణములోని మార్పులను భారమితి (Barometer) సూచించునటుల శిల్పము జాతీయ జీవితమునందలి నీచోచ్చదశలను తెలియజేయుచుండును. కవులు స్వతంత్రముగ వస్తుకల్పనము చేయుచున్నను, సమకాలీన భావములును, ఆచార వ్యవహారములును వారి రచనల యందు ప్రవేశించియుండును. కాళిదాసుని నాటకములను మనము చదివినయెడల ఆ కాలపు నాగరకతను మనము కొంచె మించు మించుగ నూహింపగలము. వాల్మీకిమహాకవి లోకోత్తర వీరుడైన శ్రీరాముని చరిత్రమును సృజించినప్పటికిని, సమకాలీనమైన హైందవ సంఘముయొక్క నాగరకతయు ఆచార వ్యవహారములును అందు నంకితమైయుండక తప్పవు.

ప్రస్తుతవిషయమునకు వత్తము : మన తెలుగుజాతి చాల మంది కవులకును, శిల్పులకును, నటకులకును ఆకరమైయున్నది. వారి రచనలు, సృష్టులు, అభిప్రాయములు భావిసంతతికి మన కళాభిరుచిని, కల్పనానైపుణ్యమును, ఔచిత్యగౌరవమును, మీదుమిక్కిలి మన శిక్షణమును, తెలియబఱచును కావున ఇప్పటి కవులును, తక్కుంగల శిల్పులును సమకాలీన ప్రజా బాహుళ్యముయొక్క యశిక్షితమైన యభిరుచి యడుగులకు మడుగులొత్తి సునాయాస లభ్యమయిన కీర్తికొఱకు పాటుపడుటయే వారి బాధ్యతయని తలంచుకొనక, భావిసంతతులకు గూడ మన శిల్పసిద్ధిపైని గౌరవముండునటులు, తమ యభిరుచిని మఱికొంత సభ్యముగను, ఔచిత్యదృష్టిని మఱికొంత నిశితముగను అలవఱచుకొనుట యావశ్యకము.

సుమా రొక సంవత్సరముక్రిందట ఒంగోలునందుండిన నామిత్రులు రావుసాహెబ్ డాక్టరు శేషాద్రిరెడ్డిగారికి (ఇప్పుడు స్వర్గస్థులు) అతిథినై యచ్చట రెండు మూడు దినములు గడపితిని. ఆయూరియందు స్థాపింపబడియున్న యొక నాటక సమాజమువారిచే

ప్రయోగింపబడిన * "సుమతి" అను నాటకమును చూచుట మా కిరువురకు తటస్థించినది. రెండు మూడు గంటల వినోదము కొఱకును, ఆ వినోదమున అలక్షితముగ మిళితమైన రీతిని నమకూరుచుండు భావశిక్షణము కొఱకును మనము సాధారణముగ నాటకశాలకు బోవుచుందుము. చేతిడబ్బు వదలించుకొని, నిద్రలేమి మున్నగు శ్రమలకు బాల్పడియు మనము నాటకము చూచుట కవిచేతను నటకులచేతను "మీరు సభ్యతా శూన్యులు ! మీరు మృగప్రాయులు" అని చెప్పక చెప్పించు కొనుటకు గాదు. సహృదయుల భావములు దూషింపబడుటకు గాదు ! కాని, దురదృష్టవశమున మా కా నాడట్టి యసభ్యవినోదము ప్రాప్తించినది. ఆ నాటకమునందలి యనౌచిత్యముల నుదహరించి సభ్యలోకమునకు విసుగుపుట్టించి నా యభిరుచినిగూడ దూష్యముగ నొనరించుకొనుటకు నా కిష్టము లేనప్పటికిని 'శిల్పము' కొఱకు అట్లు చేయక తప్పినది కాదు. మేము నాటకశాలయం దున్నంతవఱకు జఱిగిన కథ యీ క్రిందివిధముగ నున్నది : భాగ్యవంతుడైన బ్రాహ్మణయువకుడొకడు ఒక భోగముసాని నుంచుకొని తన యాస్తినంతయు కొల్లగొట్టుకొనును. కొంతకాలమునకు తన భార్యనుగూడ ఆ సానికి పరిచారికనుగ నియమించును. అటుపైని కొల్లగొట్టుటకు విటునియొద్ద నొక గవ్వయైనను లేదని తోచిన వెంటనే ఆసాని యాతని విడనాడి, మఱియొకనిని దగుల్కొనును. రెండవ విటుడును ఆభోగముదియు నేక శయ్యాగతులయి యుండునప్పుడు పరిత్యక్తుడైన మొదటి విటుడు వచ్చి చూచి "బ్రతికి చెడిన వాని వైరాగ్యావేశముతో" ఆసానిని తిట్టుటకు ప్రారంభించును. భోగమువారిని తిట్టుటయే సంఘ సంస్కరణము యొక్క ప్రధానసూత్రమని తలంచువారును కొందఱు గలరని, అట్టి కోటిలో మన నాటక రచయితనుగూడ చేర్చుకొని నాటకమునందలి ఆ సంవిధానమును సహించినను, సహింప నలవిగానివి మఱికొన్ని బయలు దేరినవి. ఆ నాటకశాలయందు స్త్రీలు చాలమంది యుండిరి. ఆతిట్లు భోగమువారికి సంబంధించినవే కాక సామాన్యముగ స్త్రీజాతికంతటికి సిగ్గును రోతను బుట్టించునట్లు తోచినవి. ** "సాని వాకిటిలో నొకనిని, ముందువాకిటిలో మఱియొకనిని పెట్టుకొని చిత్తకార్తిలో కుక్కలవలె ................ వారి ....................... సొరకాయలవలె నుండును; అవి ................ కావు. రోగములబొందలు" మొదటి మాటతో నిప్పుఅంటింపబడి రెండవమాటతో కిరసనాయిలు పోయబడి, మూడవమాటతో భగ్గని మండిన నా హృదయము సంయమన సాధ్యముకాక పోయినది. ఏవో రెండు మాటలని నాటకశాల వీడివచ్చితిని. రెడ్డిగారును నావెనువెంట వచ్చిరి. బయటికివచ్చి మనము స్థిమితపఱచుకొనునప్పటికి నా యొడలంతయు కంపించుచుండెను.

---

* ఆ నాటకము పేరునుగుఱించి నాకు సంశయము గలదు. సుమతియని జ్ఞప్తి, కవిపేరును మఱచిపోతిని.

** నాటకము నాయొద్దలేదు. జ్ఞప్తియున్నటులు వ్రాయుచున్నాను.

నాటకము ముగిసిన వెనుక మా దుర్ణయమును గుఱించి ఆ సమాజము యొక్క కార్యదర్శి యుపన్యసించెనని వింటిమి.

మఱునాటి యుదయమున ఆ సమాజములోని యొక సభ్యుడు, తాము రాత్రి ప్రదర్శించిన నాటకమును, చింతామణియను నాటకమును దీసికొనివచ్చి, ఆ నాటకము చింతామణివలె నున్నదనియు, అందులో లేనిబూతులు ఇందులో గూడ లేవనియు, మేము నాటకశాలనుండి వెడలివచ్చిన యనంతరము చాల నీతిప్రదమైన కథ జరిగినదనియు చెప్పెను. మొదటి విషగుళికతోడనే మా జీర్ణశక్తి నాశనమైనది ! ఆపైని విరివిగా పంచిపెట్టబడిన నీతిఖాద్యములు మే మొక వేళ గైకొన్నను నిరుపయుక్తములై యండును.

తరువాత ఆ రెండు నాటకములలోని సంవిధానములను నేను జూచితిని. సుమతి నాటకము చింతామణికి ప్రతిబింబముగ వ్రాయబడి యున్నదనుటకు సందియములేదు. నే నిప్పుడు చింతామణిని సమర్థించుటకు బూనుకొనలేదు. కాని, ఆ రెండు నాటకములను నరిపోల్చినప్పుడు మాత్రము, సభ్యతయందు చింతామణియే మెఱుగుగనున్నది. చింతామణికారుడు రచనా నైపుణ్యముతో వెల్లడించిన బూతులను సుమతి నాటకరచయిత జట్కాబండివారి సభ్యతలోనికి దింపి, శృంగార రసమును సిరాబుడ్డిలో ఊరవేసినాడు. ప్రకరణమున కిట్టి వస్తువు ఆవశ్యకమని అలంకారశాస్త్రము యొక్క మఱుగు సొచ్చినను, అభిరుచి విషయకమైన చర్చ వచ్చినప్పుడు, దానిని కవియొక్క చిత్తసంస్కార పరిపాకములకు సంబంధించినదిగ మన మెఱుంగుదుము. మృచ్ఛకటికము ప్రకరణమయ్యు సహృదయులకు ఏవపుట్టించు బూతుకూతల మట్టునకు దిగలేదు. అట్లనుటవలన సంస్కృతమునందు, అధమములైన ప్రహసనములు లేవని నేను నుడువుట లేదు. కాని, అవి సహజముగ నిరాదరింపబడినవి. నింద్యవిషయ మేభాషయందున్నను నింద్యమే. భావమువలన భాషకు గౌరవము కలుగుచున్నది గాని, భాషవలన నింద్యభావమునకు గూడ ప్రశస్తి గలుగదు.

నేను సుమతి నాటక ప్రదర్శనమును చూచినప్పటినుండియు, నాటక రచయితలయందును, నటకులయెడను, ప్రేక్షకులయందును నాకొకవిధమైన శ్రద్ధపుట్టినది. అప్పటినుండియు కొందఱి యాధునిక కవుల నాటకములను జనరంజకములని ప్రజలచే తలంపబడు మఱికొన్ని నాటకములను సుప్రసిద్ధులని తలంపబడు నటకులచే ప్రదర్శింప బడుచుండినపుడు చూచుచుంటిని. జనరంజకత్వమునకు కారణములను, అందుకై కవులును నటకులును చేయుచున్న వ్యాపార రహస్యములను, మోసములనుగూడ గ్రహించి నా యభిప్రాయములను ఈ వ్యాసమూలమున ప్రకటింప దలంచితిని. ఇట్లు చేయుటవలన, నే నెందఱెందఱి యనుమానములకు, విమర్శనములకు పాత్రుడను కానున్నానో నే నెఱుంగుదును.

ఈ వ్యాసమునందు నే నెచ్చటనైనను నిదర్శనపూర్వకముగ నాయభిప్రాయములను వెలిపుచ్చవలసివచ్చునప్పుడు, ఎవరినైన నాటక రచయితలను నటకులను సమాజములను విమర్శించి దృష్టాంతములుగ గైకొనుట నాకు వారిపైగల ద్వేషముచే గాదు. కాని, శిల్పముపై గల గౌరవముచేత. నేను కొన్ని నాటకములలో ననౌచిత్యములకు నుదాహరణములను గైకొంటిని గావున, ఆనాటకములెల్ల ననౌచిత్యభూయిష్ఠములనియు, ఆ యా నాటక రచయితలు కల్పనానిపుణులు కారనియు పాఠకమహాశయులు తలంపరాదు. ఆ గ్రంథములపైనను ఆకవులపైనను నా కత్యంత గౌరవము కలదు. నటకుల విషయమైగూడ నేనిట్లే మనవిచేసికొనుచున్నాను. కావున నేను నిర్మలహృదయముతోడను శిల్పదృష్టితోడను రచియించిన యీ వ్యాసమును నాటక కళాభిమానులెల్లరును అన్యథా తలంపక నా సదుద్దేశమును గ్రహింతురని నాప్రార్థనము.

## నాటక కవి.

ఇప్పుడు వెలువడుచున్న నాటకములలో 100 కి 90 నాటకములు 'నాటక'మని పేర్కొనుటకు తగినవి కావు. ఒకకథలోని కొన్నిసీనులను ఒకటిగా జోడించినంతనె అది యొకనాటక మగునని కొందఱు నాటకరచయితల యుద్దేశమైయుండును. నాటకమునకు ఆదిమధ్యాంతములు కలవనియు, సంధిబంధమును, సంయోగతయు సడలిన యెడల నాటక శరీరము విచ్ఛిన్నావయవ సమూహమువలె నుండుననియు వీరెఱుగరు. ఒక వేళ నెఱింగియు ఆచరణమున నసమర్థులై యున్నారు. ఇప్పటి కొన్ని నాటకములలో, 'మేకపోతుమెడ చన్నులు, ఆఱవవ్రేలు' మున్నగు రచనావిశేషము లగపడుచున్నవి. ప్రజలకన్నులలో తేలికగా దుమ్ముకొట్టుట కలవాటుపడి రంగ సంప్రదాయములను చక్కగా తెలిసినకవులు అట్టి రచనావిశేషముల నాశ్రయింతురు. వానితో నాటకసమష్టికి నవసరమైన సంబంధమేమియుండదు. నిరుపయోగములును, విపరీతములును నైన అట్టియవయవములను కత్తిరించినను లోప మేర్పడదు. ఇది రచనాన్యూనతయైనను, లేక ప్రేక్షకులను సులభముగ వలలో వేసికొనుటకు కవి ప్రయత్నపూర్వకముగ నొనరించిన వంచనమైనను గావలయును. ఒక ఉదాహరణము : రామదాసు నాటకములో 'అహమక్కుసీను' లవకుశలో 'చాకలివానియింటిసీను' వానిని వేఱుపఱచి, అట్టిసీనులు ప్రత్యేకముగ ప్రదర్శింపబడినపుడు హాస్యరసోత్పాదకములయి వినోదము కలిగింపవచ్చును. కాని ఆనాటకములందు ఆయాకథాభాగమున వాని కంతప్రాముఖ్యము లేదు. మొగమునకు ముక్కు అందమని యొకశిల్పి మూరెడుముక్కునుజేసి యొక మానవ విగ్రహమున కంటించి నట్లున్నది. నాటక శరీరమందు అంగానుగుణ్యము చాల ముఖ్యము. కేవలము లోభముచేత అనుచితమైన కల్పనలకు పూనుకొనుట నింద్యము.

ధర్మవరము రామకృష్ణాచార్యులవారి నాటకరచన తోడ క్రొత్తక్రొత్త నాటక లక్షణములేర్పడినవి. సంక్షేపముగ భావమును ప్రకటించుటయన్న ఆకవి యెఱుగని పరమరహస్యము. రెండుమూడు మాటలలో చెప్పదగిన భావమును అచ్చులో అరపేజీకి తక్కువగా చెప్పడు. దుఃఖముయొక్క పరిమాణము వాక్యముల దీర్ఘత్వము ననుసరించియు సంఖ్య ననుసరించియు నుండునని తలంచికాబోలు బాహుకునికి కొండవీటి చేంతాడువంటి స్వగతమును గల్పించి ప్రేక్షకులపై ఆయనకుగల కసియంతయు దీర్చుకొన్నాడు. వ్రాసిపెట్టిన పద్యములు గ్రంథస్థములు కాకపోయినయెడల విస్మృతములగు నను తలంపుతో బాహుకుడు చంద్రుని దూషించు కథాభాగమున నిక్షేపించినాడు. వీని నన్నింటిని తలదన్ను చాపల్యము మఱియొకటి గలదు. ప్రహ్లాదనాటకమున లీలావతి పాడునట్టి 'రారా - ధీలోలా - నాబాల' అను పాటయందు, 'సుకుమారా - గుణశాలి' అను పాటయందును 'రామకృష్ణకవిరత్నము బ్రోవ' అనియు 'కవి రామకృష్ణ' అనియు, కవిగారు తనపేరును ఇముడ్చుకొన్నారు. అచ్చట ఒక చుక్కగుర్తును బెట్టి జ్ఞాపికలో 'లీలావతి యీ పాట చదువునప్పుడు అంకితము పేరును తీసివేయవలయును' అని యైన హెచ్చరించలేదు. నటకులును ఆ యంకితముయొక్క యనౌచిత్యమును గ్రహింపలేదు. లీలావతి పాత్రము ధరించిన యొక నటకుడు 'రామకృష్ణకవిరత్నము' అని పాడుచుండగా విని నేను ఆశ్చర్యపడితిని. లీలావతిని ఇంద్రునివలె చెంగు పట్టుకొని రామకృష్ణకవి కాలమునకు లాగవలయునో లేక కవినే లీలావతి కాలమునకు నెట్టవలయునో తోపకున్నది. అట్లు చేసినను లీలావతి రామకృష్ణకవిపేరు నేల స్మరింప వలయునో నా కనూహ్యముగ నున్నది. నాటకములో కవి దాగియుండవలయునేకాని ముక్కు వెళ్ళబెట్టవలసిన యావశ్యకతలేదు. అట్టినాటకములనాదరించు నభిరుచిగల మనము కాళిదాసాదుల నాటకముల నెట్లు మెచ్చుకొనగలము?

'నాటకము చాల బాగుగానున్నది' అని యనిపించు కొనుటకు మఱియొక యుపాయము గలదు. స్థానికమైనను అస్థానికమైనను దేశభక్తి దేశానుసారము మున్నగుభావములను వెండ్రుకపట్టు మాత్రమైనను సందు కల్పించుకొని బారెడుపొడుగు ఉపన్యాసములో పొదిపి ప్రవేశపెట్టుట; హిందువులు మహమ్మదీయులు కలసియున్న నాటకకథయైన యెడల (ఆ కథ జరుగు కాలమందు అట్టిభావములు ప్రజలలో లేకున్నను) హిందూ మహమ్మదీయ మైత్రిని గుఱించిన యుపన్యాసము నొక పాత్రమునోట జెప్పించి నాట్యశాలను రాజకీయోపన్యాస మందిరముగ మార్చుట; పుట్టిన దాది అడవులలో కాలము పుచ్చుచు, గ్రంథములలో వర్ణింపబడిన లక్షణములచేత గుఱ్ఱమును గుర్తించిన కుశలవులు మాతృదేశాభిమానమును గుఱించి నేటికాలపు భావముల వెడలగ్రక్కు ఉపన్యాసముల బలాత్కారముగ ప్రేక్షకులపై కురిపించుటచూడ, "ఆంధ్రపత్రిక" వాల్మీకి ఆశ్రమమునకు గూడ

బంపబడుచున్నదా యను భ్రాంతి పొడముచున్నది. దేశకాలపాత్ర విరుద్ధమైనను పురాతన వస్తువునకు ఆధునికవాసన దగిలించుట చాలమంది నాటక రచయితల కభ్యాసమైయున్నది. ఇది యొక వ్యాపార రహస్యము.

చాలమంది నాటకకవుల రచనాలోపములను, పాటలును పద్యములును గప్పిపుచ్చుచున్నవి. నాటకములోని కల్పనను పృథక్కరించినయెడల ఆ లోపములు బయలుపడును. ఎట్టినాటకమునైనను చక్కగా పాడగలిగిన యొకరిద్దఱు నటకుల నాశ్రయించి ప్రసిద్ధికి రావచ్చును. అల్లూరు నాటక సమాజమువారు రామదాసు నాటకమును ప్రదర్శించుచుందురు. పర్వతరెడ్డి రామచంద్రారెడ్డిగారు (ఆ సమాజమున ప్రధాన నాయక పాత్రము ధరించు నటకుడు) కబీరు పాత్రమును ధరింతురు. ఆప్రదర్శనములను చాలమంది కొనియాడుచుందురు. రెడ్డిగారు నాట్య ప్రపంచమున ఆర్జించిన పేరు ప్రతిష్ఠలకు ఆ నాటకము పట్టుగొమ్మ. ప్రజల ప్రశంసకు నాస్పదమైన విషయము నెఱుంగవలయునని చాలమంది యభిప్రాయములను గనుగొంటిని. కొంచె మించుమించుగ అందఱును ఈ క్రింది విధమున జవాబిచ్చుచుందురు. 'రామచంద్రారెడ్డి హిందూస్థాని పాటలను చక్కగా పాడగలడు. నాటకము ప్రారంభమునుండి తుదివఱకు పాడుచున్నను, కొంచెముగూడ ఆయనగొంతు రాపు పుట్టదు. ఆయన పాడుచున్నపుడు మఱికొంతసేపు పాడుచుండిన బాగుగానుండునని తోచును. నామట్టుకు నేను రెండుమారులు Once more, అన్నాను'. రామచంద్రారెడ్డిగారిని గుఱించి చెప్పబడునదంతయు యథార్థమె. కాని నాటకము ఏ విధముగ మెచ్చుకొనబడవలయును? షేక్స్పియరు మహాకవియొక్క ప్రతిభ, గ్యారిక్కు ననుసరించి యుజ్జీవింపవలయునా? లేక యాతని రచనలకు స్వతంత్రమైన యంతస్సారముగలదా? చదువరు లూహింపగలరు. భూటకపు టాధారము నాశ్రయించి ప్రసిద్ధికెక్కిన నాటకములు ఆశ్రయచ్యుతి గలిగిన వెంటనే విస్మృతములగును. ప్రేక్షకుల యభిరుచిననుసరించి వ్రాయబడు నాటకములు వారి యభిరుచి మాఱువఱకే గౌరవింపబడును. తర్వాత నధఃపతనము.

పాత్రోచితమైన భాషనుపయోగించు టావశ్యకము. మహోపాధ్యాయ, కళాప్రపూర్ణ వేదము వేంకటరాయ శాస్త్రులవారు బొబ్బిలినాటకమున బుస్సీ దొరపాత్రమునకు వ్యాకృత భాషనే యుపయోగించిరి. కోలాచలము శ్రీనివాసరావుగారు రామరాజు నాటకమున పటానునకు ఉత్తమ భాషనే యుపయోగించిరి. వారిని ఉత్తమ పాత్రలనుగ చిత్రించి అట్టిభాష నుపయోగించి యుందురు. కాని, ప్రదర్శనమునందు వారి వేషములకును వారిభాషలకును చాల వైరుధ్యము గోచరించుచుండును. దాని నొప్పుకొన్నను, ఆ పాత్రముల హైందవపురాణ పరిచితి చూడ చిత్రముగనున్నది. బుస్సీదొర 'స్తంభము నుండి పైకురికి' అను పద్యమును చదువును. పటాను సంస్కృతపద భూయిష్ఠమైన పొడవగు సమాసములతో సప్తమారుతములను చిల్లర దేవుళ్ళను

తన్ను చంపుటకుగా ఆహ్వానించును. హైందవేతర జాతులకు సంబంధించిన యుత్తమ పాత్రములచే నుత్తమభాషను మాట్లాడించుట యొకవిషయము. కాని, వారికి మనశాస్త్ర పురాణములయందు పరిచయము గలిగినట్లు వ్రాయుట వేఱొకవిషయము. మహమ్మదీయుల యుత్తమ పాత్రత్వమునకు హైందవ పురాణ పరిచయము ఆవశ్యకముగాదు. దుఃఖము కలిగినప్పుడు తమతమ మనస్సులలో నెలకొనియున్న దైవమునో దేవతలనో స్మరించుట స్వాభావికముగ నుండునుగాని, అట్టిసమయమున మహమ్మదీయుడు పౌరాణిక దేవతలను తలంచుట విరుద్ధముగ గనుపట్టును. బుస్సీదొర బైబిలునుండి యుపమానమును గ్రహించిన యెడల నుచితముగ నుండెడిది. పటాను ఖొరానునందో లేక మఱియేవిధమైన మహమ్మదీయ పురాణమునందో పరిచితమైన దేవతలను ప్రవక్తలను ఆహ్వానించియుండిన మెఱుగుగనుండెడిది.

చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు రచియించిన గయోపాఖ్యానమున కృష్ణార్జునుల దెప్పిపొడుపులు, ఆత్మగౌరవముపై దృష్టిగల యే పెద్దమనుష్యుడును మాట్లాడియుండడు. ఇక కృష్ణార్జునుల మాటయేల? సంవాదములలో అంతమాత్రము గాటులేనిదే ప్రజలకు రుచింపదు. పాపము! కవియేమిచేయును? శతావధానులు పిశుపాటి చిదంబర శాస్త్రులుగారు, గయోపాఖ్యానమును జూచి దానిని మించవలయునను కోరికతో శ్రీరామాంజనేయమను నాటకమును వ్రాసి శ్రీరామునికిని ఆంజనేయునకును వైరము గల్పించి యిరువురిసంవాదమును ముదిరిన కొండమిరపకాయ పాకములోనికి దింపినారు. రామకృష్ణాచార్యులవారు ప్రమీలార్జునీయనాటకమును రచించి, నాగరక విద్వాంసులచే వ్రాయబడు నాటకములలో బూతు ఎంతవరకు నొప్పుకొన దగ్గది యనువిషయమును దృష్టాంతపూర్వకముగ దృఢపఱచినారు. వ్రాయుకొలది యిట్టి యుదాహరణములకు లెక్కయుండదు. రెండుమూడు ఊరక మచ్చుచూపితిని.

## నటకులు

కొంచె మించుమించు ఇరువది యిరువదియైదు సంవత్సరములకు పూర్వము తెలుగుదేశమున, నాటకవృత్తి నవలంబించిన వారే నాటకము లాడుచుండిరి. (మరల నిప్పుడు కూడ) ఆకాలమున నాటకములన్నను, నటకులన్నను ఒక విధమైన యనుమానము, హైన్యమును దోచుచుండెడిది. ఇందుకు కారణము లేకపోలేదు. ఆ నటకులలో చాలవఱకు దేశద్రిమ్మరులు, తల్లిదండ్రులను, దారపుత్రాదులను వదలినవారుగనో లేక యితరుల సంసారములను చెడగొట్టిన వారుగనో యుండిరి. వారు ప్రదర్శించుచుండిన నాటకములెల్లను వారి సొంతసృష్టులు. ఈకాలమున పాపట్ల కాంతయ్యగారు రచియించిన నాటకగీతావిశ్వకోశము వంటిది వారికి గూడ నొకటి యుండినది. ఇదివరకు రచియింపబడినవి, యిపుడు రచియింప

బడునవి, ఇకమీద రచియింపబడబోవు సర్వనాటకములకును అందు పాటలు గలవు. రేపటి రాత్రి నాటకము వేయవలయునని యనుకొన్నయెడల, ఈ నాటి ప్రొద్దున నాటకపాత్రములును, సీనులను వారే తీర్మానించుకొని సందర్భానుసారముగ పాటలు చొప్పించి సొంతకవిత్వముతో నాటకమును తుదముట్ట ఆడివేయుదురు. ఇట్టి దురవస్థనుండి నాటకములను రక్షించినందులకు నేటికాలపు శిక్షిత నాటకసమాజములవారు ప్రశంసాపాత్రులు!

పూర్వపునటకులకన్న నేటికాలపునటకులకు బాధ్యత యెక్కువ; ఏలయన - ఇప్పటినటకులు విద్యావంతులు, నాగరకులు. ప్రేక్షకులుకూడ నట్టివారే. కావున నటకులు నిర్బాధ్యముగ ప్రవర్తించుటకు వీలులేదు. వారు గమనింపవలసిన విషయములు చాల గలవు. కాని, వ్యాసవిస్తర భీతిచే నిచ్చట కొన్నిటిని మాత్రము వ్రాయుచున్నాను.

తాను ధరింపబోవు పాత్రమును, కవి పోషించినవిధమును, ఆపాత్రయొక్క గుణగణములను, మనస్తత్వమును, నాటక బంధమునందు ఆపాత్రమునకుగల స్థానమును, ప్రయోజనమును, తన కార్యప్రవృత్తికి హేతువైన భావమును నటకుడు మొట్టమొదట గుర్తెఱుగవలయును. వారు మాటాడు ప్రతిమాటకును అర్థము చక్కగ తెలిసియుండవలెను. అర్థము తెలియనిదే భావోదయముగాదు; భావోదయము కానిదే తాను అభినయించు పాత్రముయొక్క యవస్థయందు సహానుభూతి యుండదు. నటకుడెప్పుడును పాఠ మందిచ్చు వానిపై (Prompter) ఆధారపడియుండగూడదు.

నాటకమునకు అభినయము (చేష్ట) ప్రధానము. కార్యప్రచలనము లేనియెడల నాటకమనిపించుకొనక యొక యుపన్యాసమగును.* కార్యప్రచలనమును,అభినయనమును అడ్డగించుపాటలను పద్యములను నటకు లంగీకరింపరాదు. కాని పాట పద్యములపైని చాపల్యముచేత కవి యుద్దేశింపని చోటులలో గూడ క్రొత్తక్రొత్త పద్యములను పాటలను జేర్చి కార్యగతికి భంగము గలిగించుకొందురు. ఏల? అభినయలోపమును సంగీతముచే పూరించుకొనుటకు ఒకదానియందలి లోపమును భిన్నముగుమఱియొక దానితో పూరింపప్రయత్నించుట ● చింతకాయ బహుమానమువలె నున్నది.

---

* ఇది నాటకరచనకు సంబంధించిన విషయము, "ఇందుకు నటకులు బాధ్యులకారు. నాటకలక్షణమునకు సరిపోవునదియు తమ ప్రతిభను చక్కగ ప్రకటించుకొనుటకు అనువైన పాత్రపోషణము కలదియు నగు నాటకమును నటకులు ప్రదర్శనమున కేర్పఱచుకొనవలయును. కాని యిప్పటినటకులపద్ధతి వేఱుగ నున్నది. ఏ నాటకములో పాటలు పద్యములు మెండుగనుండునో అదియే యుత్తమనాటకమని వారి యభిప్రాయము; అట్టినాటకములవలన నటకులకు వచ్చుకీర్తి నాట్యపరమైనది కాదు. గానపరమైనది.

● ఒక రాజునకు ఒకరైతు నిమ్మపండును దెచ్చి బహుమతిచేసెను. దానిని జూచుచుండిన మఱియొకడు పాడవాటి చింతకాయను దెచ్చి రాజునకు సమర్పించెను. రాజు చిఱునవ్వుతో "ఇదియేమి బహుమాన ?"మని ప్రశ్నించెను. అందున కాత డిట్లు జవాబు చెప్పెను : "లావువాసి పొడుగులో నున్నది, పులుసునకు దానమ్మా మొగుడు."

నాకు సంగీతముపై ద్వేషబుద్ధికలదని నామానవత్వమును సంశయింపబోకుడు. తగవుకానిచోట మంచిదియైనను చెడ్డదిగ దోచును. ఒకవేళ పౌరాణిక నాటకములలోని నాయికానాయకులు పాటలు పాడినప్పుడు అనిష్టముగనైన మన్నింపవచ్చును. పౌరాణిక నాయకులు అమానుషశక్తి సంపన్నులగుటవలన వారిజీవితము మనజీవితముకన్న భిన్నముగను, ఊహ్యాముగను, కొన్నియెడల నలౌకికముగను గనుపట్టుచుండును. మానవసహజములగు సుఖదుఃఖములను వారనుభవించునప్పుడే మనము వారితో నేకీభవింతుము. కాని, చారిత్రక సాంఘిక నాటకములలోని నాయకు లట్లుగాదు. వారు మనుష్యులు. అమానుషశక్తి వారియొద్ద నించుకేనియు లేదు. కావున వారి సుఖదుఃఖములతో మనకుసమీప బాంధవ్యము గలదు. అందులో ముఖ్యముగ సాంఘిక నాటకముల నాయకుల ప్రవర్తనము ప్రస్తుతపు సాంఘికజీవితముయొక్క ఆదర్శక ప్రతిబింబముగ నుండును. అంగడివీధిలో గుడ్డల వ్యాపారముచేయుచుండ మనము ప్రతిదినమును జూచుచుండిన సుబ్బిశెట్టియు జిల్లాకోర్టులో మనము చూచుచున్న ప్లీడరు వెంకోజీరావుగారును మనము ప్రతిదినమును ఇంటిలో సంభాషించుచున్న తల్లిదండ్రులు, ఆలుబిడ్డలు, స్నేహితులు మున్నగువారు స్టేజిమీదకువచ్చి "తులువా పలువా", యనియు "ఛీఛీ, పోపో" యనియు ఫార్సీమెట్లకు అనువుగ విఱిగెడి అర్థములేని పాటలతో సంవాదములు సలుపుకొనుచుండ చూచినప్పుడు వారిని పిచ్చివారి ఆసుపత్రికి పంపింప బుద్ధిపుట్టునుగాని అందలి యానందము ననుభవింపజాలము. గొంతులేని నటకులకు, పాటను సైతము మ్రింగివేయగల హార్మోనియము శ్రుతి మేలుచేసి పుణ్యము గట్టుకొనునట్లు, అభినయ చాతుర్యము కొఱతపడిన నటకులకు పాటలు అభయప్రదానము చేయుచున్నవి. ఇట్లనుటవలన నటకుడు బొంగురుగొంతుపడి సంగీతజ్ఞాన శూన్యుడై యుండవలయునని నా సిద్ధాంతముకాదు. నాటకమున సంగీతము అభినయమునకు కేవలము ఔపచారికముగ నుండవలయును; కార్యగతికి నేలాటి యభ్యంతరము కల్పింపరాదు.

నేడు కొందఱు నటకులు పద్యములు చదువుటలో నొక యపూర్వపద్ధతిని గనిపెట్టినారు. ఒక పద్యమును రెండు మాఱులు చదువుట. సీసపద్యమైనయెడల ప్రతిచరణమును రెండు రెండు మాఱులు చదువుట. మొదటి తూరి రాగముకొఱకు జదువుట! రెండవతూరి అర్థముకొఱకు జదువుట! తా నొక సభయెదుట నటించుచున్నాడనియు తానుజేయు అభినయము, తాను పలుకు మాటలు సభాస్తారులు గ్రహించిరో లేదో యను విచారము, తర్కము, నటకుని కెప్పటికి నుండగూడదు. అట్లుండినయెడల తానునటకుడు కాక, విద్యార్థులకు ఉక్తలేఖనము చెప్పు బడిపంతుల వంటివాడగును. రామకృష్ణమాచార్యుల నాటకములలో భూమికలు ధరించు నటకులందు పునరుక్తి దోషమొక గుణముగ వెలసినది. ఇందులకు మార్గదర్శకుడు కవియె. పద్యములోని భావమునే గద్యములోను పాటలోను

గూడ జెప్పును. పాపము, ప్రేక్షకుల గ్రహణశక్తి ననుమానించి కాబోలు రెండుమూడు విధముల నయ భయములతోడ కవిగారు తనభావములను వారి మనస్సులోనికి పిచికారి చేయును.

"భామ వేషగాడికి మఱింత నెయ్యిపొయ్యండి. తిత్తి వూదేవాడికి పప్పుకూడా కావాల్నా" అను ప్రాత భాగవతుల పాత్రగౌరవములు ఇప్పటి నాటకసమాజములలో గూడ పొడకట్టుచున్నవి. ఏ నాటకమందైనను, ఆయాస్థలముల ఆయాపాత్రము ప్రముఖమనియు, ఎంతనీచపాత్రమైనను తన నియోగమును జక్కగా నిర్వర్తించినయెడల ప్రశంసార్హమనియు, నటకునికి వచ్చు పేరుప్రతిష్ఠలు తానుపోషించు పాత్రయొక్క యుదాత్తగుణముల ననుసరించికాక, పాత్రోచితాభినయ చాతుర్యమువలన ననియు, నటకు లెఱుంగరు. ఒకవేళ యెఱింగియు చాపల్యమును చిక్కబట్ట లేకున్నారు. ప్రతినటకునకును తాను నాయకపాత్రమును ధరించిననేగాని సుప్రసిద్ధుడు కానేరడను అపోహ గలదు. ఇట్టి దురభిప్రాయముచేతనే చిల్లరపాత్రములను అభినయించిన కొందఱు తమ పాఠములను జదువక ఉదాసీనులయి నాటకము యొక్క సమష్టి రంజకత్వమునకు లోపమువాటిల్ల జేయుదురు. ఒక్కొక్కప్పుడు చెడగొట్టుదురు.

తాను ధరింపబోవు పాత్రముయొక్క గుణపోషణమునకు, స్వభావమునకు తన మనస్తత్వము సరిపోవునా లేదాయను విచారము నటకుని కుండవలయును. మొట్టమొదట తాను తన మనస్సును స్వభావమును పృథక్కరించుకొనుట యావశ్యకము. తన స్వభావమునందు గాంభీర్యమును Tragic element ను లేని నటకుడు పాత్రమును స్వభావసిద్ధముగ అభినయింపలేడు.

భూమికా ధారణమును గురించి యించుక వ్రాయవలసియున్నది. పాత్రోచిత గౌరవమును బోషించునది వేషము. వేషమునుబట్టి సాధారణముగ మన మొక మనుష్యుని స్వభావశీలాదులను, అభిరుచిని, శిక్షణము మున్నగు వానిని గురించి కొంచె మెచ్చుతక్కువగ తెలిసికొనగలము. కాని చాలమంది నటకులు పాత్రోచితవేషములు ధరించుట లేదు. సావిత్రి, సీత, దమయంతి మున్నగు పౌరాణిక నాయికలు మోచేతుల క్రిందికి జాఱుచుండు జాకెట్టులు, ఎఱ్ఱనిపట్టుతో జేయబడిన "బో" అమర్పబడియున్న టోపా, ఉల్లిపొరలవంటి సిల్కులు ధరించుచుందురు. వారి వేషములను జూచినప్పుడు గౌరవమునకు మాఱు లాఘవము మన మనస్సులలో నుత్పత్తియగును వారి కులుకు బెళుకులు మూతి త్రిప్పుటలు మున్నగు పోకు లక్షణములు బజారీజంతలకు గూడ సిగ్గుపుట్టించును. చేటికలు నాయికల తల దన్నునట్లు అలంకరించుకొందురు. వారిలో నాయిక యెవతయో చేటిక యెవతయో గుర్తించుటకు కొంత సంభాషణము జరిగినగాని సాధ్యముగాదు. హిరణ్య కశిపుడు మున్నగు రాక్షస నాయకులు

పదియాఱవశతాబ్దమున రోమను వీరులు ధరించు ఉడుపులను వేసికొందురు. ఆ యుడుపుల్లలోని చీలికలకు కత్తిరింపులకు ఏలాటి యర్థముండదు. ఇతర రాజపాత్రలు పదునెనిమిదవ శతాబ్దమునాటి ఫ్రెంచివిగ్గులను ధరించుకొని సర్వకాల సర్వావస్థల యందు తలలు విరియబోసికొని తిరుగుచుందురు.

కవికల్పనమును తమయిష్టమువచ్చిన రీతిని కత్తిరించు అలవాటు నటకులకు మిక్కుటముగ నున్నది. కవి నటకుల కన్న తక్కువప్రతిభ గలవాడయినప్పుడును, కథ కొంచెము దీర్ఘమైనప్పుడును నాటకమిట్టి శస్త్ర చికిత్సకు పాల్పడుచున్నది. కాని యిట్టికత్తిరింపు జరిగిన వెనుక నాటక మెట్లు స్వరూపలోపమును బొందకయుండునో, సంయోగత చెడిన ఆ నాటకమును సహృదయరంజకముగ నటకు లెట్లు ప్రదర్శింపగలరో తోపకున్నది. వీని నన్నిటిని తృణప్రాయ మొనరించు సాహసము మఱియొకటి కలదు. తెలుగు నాటకములలో భిన్నమగు మరియొకభాషను జొప్పించుట ! ఇది కవి యొనరించిన పాపముకాదు. నటకులు Stage effect కొఱకు (అందేమి Stage effect ఉన్నదో గోచరించుటలేదు. Effect కు మాఱు defect కనబడుచున్నది.) స్వచ్ఛమైన యుర్దూభాషను ఎవరిచేతనైన వ్రాయించుకొని గుడ్డిపాఠముజేసి సభాస్తారులపై కసిదీర్చుకొందురు. సుప్రసిద్ధనటకులని పేరు వహించిన వారు కూడ సామాన్య ప్రజల కన్నులలో దుమ్ము కొట్టుటకు వీలయిన యీ యథమమార్గము నవలంబించుచుండిరన్న, ఇక ఈ రంగసంప్రదాయముల పయిని మమతపోవని నటకు లుండుట యరుదు. పఠాను వేషము ధరించిన రాఘవాచార్యుల వారిపద్ధతి నవలంబించియే కాబోలు పర్వతరెడ్డి రామచంద్రారెడ్డిగారు కబీరుపాత్రమును ధరించి రామదాసుతో ఉర్దూభాషలో మాటలాడుదురు. పాపము! రామదాసునకు ఉర్దూభాష శ్రుతపాండిత్యమే కావున చెప్పినమాటల నెటులో అర్థము చేసికొనునే కాని, ఉర్దూభాషలో తిరిగి జవాబు చెప్ప భాషాజ్ఞానము లేక తెలుగుతో మాటలాడును. తెలుగువారు ఉర్దూభాష చక్కగా నేర్చుకొనునంతవఱకైన నటకులిట్టి చాపల్యము వంకకు బోకుందురని నాప్రార్థనము.

మహమ్మదీయ పాత్రోచితమైన భాష నుపయోగింప నిష్టమైన యెడల మహా మహోపాధ్యాయ వేదము వేంకటరాయశాస్త్రులవారు ప్రతాపరుద్రీయమున వలీఖాను ప్రభృతులకును బొబ్బిలియుద్ధనాటకమున హైదరుజంగు మున్నగువారికి నుపయోగించిన **మిశ్రభాష** రమ్యముగ నుండును; కాని, పఠాను మొట్టమొదటి ప్రవేశమున స్వచ్ఛమైన యుర్దూ భాషయును కడపటి సీనులలో అందుకు విరుద్ధముగ సంస్కృతపద భూయిష్ఠమైన సమాసములను మాటలాడుట విపరీతముగ దోచును.

ఒక్కొక్కప్పుడు నటకులు సామాన్య ప్రేక్షకులను నవ్వించి చప్పటులు కొట్టించుటకు, ౹౹వసరమైన యభినయము చూపి కవి యుద్దేశించిన రసమునకు విరుద్ధమైన రసము

నుప్పతిల్లజేయుదురు. ఒక్కయుదాహరణము :- హిరణ్యకశిపుని యొద్దకు చండామార్కులు విద్యాపారంగతుడైన ప్రహ్లాదుని దీసికొనివచ్చి పరీక్షచేయుడని చెప్పుదురు. రాజు పరీక్షచేయును. ప్రహ్లాదుడు విష్ణువునేస్మరించును. హిరణ్యకశిపుడు కోపగించుకొని గురుపుత్రులతట్టు చూచును. అంతట వారికి వడకురోగముపుట్టి కాలుసేతు లతితీవ్రముగ వడకింతురు. ఈయసామాన్యమైన యభినయ కౌశలము చూచినంతనె కొందఱు ప్రేక్షకులు పొట్టలుపిసుకుకొని నవ్వుదురు. ఈ మెచ్చుకోలుచే ప్రోత్సహింపబడి చండామార్కులు మఱికొంత తీవ్రముగ వడకుదురు. పాపము! వారి నిస్సహాయతకు ప్రేక్షకుల మనస్సులో కవి కరుణారస ముప్పతిల్లజేయవలయునని తలంచెనుగాని,నటకుడందుకు భిన్నమైన హాస్యరసమును బుట్టించెను. ఇతరులను నవ్వించుటకు నాట్యకళా కౌశలము అవసరములేదు. చీలమండలవఱకు గుడ్డకట్టుకొని యుండినయొకడు స్టేజిపైకివచ్చి మోకాళ్ళవఱకు గుడ్డ నెగదీసికొన్నయెడల ఆవైచిత్ర్యమునకు చాలమంది నవ్వుదురు.

నటకులు కవులవలెనె వారివారి శిల్పనైపుణ్యము చేత లోకము నుద్ధరింప దగినవారు. వారిబాధ్యతయు కొంచెముకాదు. కావున ప్రజాసామాన్యము యొక్క యభిరుచికి వారు తమ శిల్పమును దింపుటకంటె ప్రజల యభిరుచిని క్రమక్రమముగ సంస్కరించుటకు ప్రయత్నము సల్పవలయును.

## నాటకశాల

నాట్యరంగ మెప్పటికిని యాథార్థ్యభ్రమను గొల్పవలయును కాని, మన ముపయోగించు పర్దాలకును, మనము ప్రదర్శించు నాటకములకును దేశకాలపరిస్థితి వైరుధ్యము కనుపట్టుచున్నది. సారంగధరనో లేక కృష్ణార్జునులనో మద్రాసు మౌంటురోడ్డులో తిరుగుచున్నటుల ప్రదర్శింతుము. కన్యాశుల్కములోని గిరీశమును రాజాంతఃపురములో సంచరించు చున్నటుల చూపింతుము. పిడుగునకు బియ్యమునకు ఒకే మంత్రము వేయుటవలన అట్టివైరుధ్యము సంభవించుచున్నది. పౌరాణిక నాటకములాడినను లేక చారిత్రక సాంఘికనాటకము లాడినను మొదటిపర్దా, వీథి, అంతఃపురము, దర్బారు, అడవి అను నీ అయిదు పర్దాలనే యుపయోగింతురు; ఒక నాటకములోని నాయకుడును ప్రతినాయకుడును ఒకే యంతఃపురములోనో, లేక యొకేదర్బారులోనో మార్చిమార్చి కనబడుచుందురు. నేడు నాటకశాలలో అగపడుచున్న పర్దాలు సీనులును ఇరువదియవ శతాబ్దపు సంకర శిల్పముయొక్క ప్రతికృతులు.

ఇట్టివైరుధ్యము సంభవింపకుండుటకు కొన్ని ప్రయత్నములు చేయవచ్చును. నాటకములను పౌరాణికములనియు చారిత్రకములనియు సాంఘికములనియు విభజించి

ఒక్కొక్క నాటక సమాజమువారు ఒక్కొక్క వర్గమునకు సంబంధించిన నాటకములకు దగిన యుపకరణముల నేర్పఱచుకొని నాట్యకళయందుత్తమ సిద్ధిని పొందవచ్చును. అట్లుగాక సమాజము భాగ్యవంతమైనయెడల ఆమూడువిధములైన నాటకములకు ఆయాదేశ కాలపరిస్థితులకు సంబంధించిన పర్దాలను ఇతరోపకరణములను సేకరించి తరువాత అట్టి నాటకముల ప్రదర్శింపవలయును. కాని, యిట్టి ప్రయత్నములు జమీందారుల పోషణమున నభివృద్ధియగుచుండు మైలవరం సమాజము, ఏలూరు సమాజము మున్నగువానికే యొకవేళ సాధ్యము.

పౌరాణిక నాటకముల పర్దాలకు సీనులకు రామాయణ మహాభారతములందు గానవచ్చు రాజప్రాసాదాది శిల్ప వర్ణముల నాదర్శకముగ గొనవచ్చును. చారిత్రక నాటకములకు బౌద్ధ మొగలాయి శిల్పములను గ్రహింపవచ్చును. వర్తమాన స్థితిగతుల దెలుపు సాంఘిక నాటకములకు నేటికాలపు సంకరశిల్పముపయోగపడును. ఏదియెట్లున్నను, ప్రస్తుతము నాట్యరంగము ఆపాదమస్తకము మార్పునొందవలయును.

ఏ నాటక సమాజమువారైనను పదునైదు నాటకములను అవకతవకగ నాడుటకంటె నొకటిరెండు నాటకములనైనను సరియైన యుపకరణములతో యోగ్యముగ ప్రదర్శించిన యెడల అదియే యశస్కరము. సంఖ్యకన్నను రాశికన్నను, గుణమే ప్రధానము. ఇంగ్లండులో అయిదాఱు సంవత్సరములు విద్యనభ్యసించి మరల హిందూదేశము చేరిన నామిత్రుని అచ్చటి నాటకవిషయములను గుఱించి ప్రశ్నింపగా ఆయన యిట్లుచెప్పెను : "నేనొక నాటకము ఆఱునెలలకు పూర్వమునుండియు ప్రదర్శింపబడుచున్నదని విని యొకనాటిరాత్రి చూడబోయితిని. అప్పటికిని ప్రేక్షకులు క్రిక్కిరిసియుండిరి. నాప్రక్కన గూర్చుండియున్న యొక పెద్దమనిషిని విచారింపగా ఆయన ఇట్లు చెప్పెను - 'ఇంక ఆఱునెలల వఱకు నాడినగాని చూడదలచుకొన్నవా రందఱును చూడలేరు. ప్రతిదినమును క్రొత్తప్రజలే వచ్చుచుందురు'. కంపెనీవారు ఈనాటకమును సంవత్సరముపాటు ఆడనిదే పర్దాలు మున్నగువానికై వారు వెచ్చించిన పెట్టుబడి ద్రవ్యముపోను లాభము మిగులదు.'' నాటకరంగమున యాథార్థ్యభ్రమకల్పించుటకెంత ద్రవ్యమైనను యూరపియను నాటకసమాజములవారు ఖర్చుపెట్టుదురట! అంత ద్రవ్యమును మనము వెచ్చింపలేకపోయినను వెచ్చించు ద్రవ్యమైనను ఉచితముగ వినియోగించు టావశ్యకము.

## ప్రేక్షకమండలి

ప్రేక్షకమండలిలో అన్నివిధములైన శిక్షణముగల మనుష్యులుందురు. బహిర్వేషములను చూచి "వీరు నిక్కువమైన కళాభిరుచిగలవా"రని యూహించుట యసాధ్యము.

నేనట్లూహించి చాలమాఱులు పొరపడితిని. ప్రేక్షకునికొక దురభ్యాసముగలదు. అది దురభ్యాసమేకాదు, దురభిరుచియు, ఒకనటకుడు శ్రావ్యముగ పద్యమునో పాటనో పాడిన వెంటనే (Once more, once more) అని కేకలువేసి చప్పటులు తట్టును. హల్వా తీపుగానున్నదని అజీర్ణవ్యాధి పుట్టువఱకు దినవలయునని వీరిమతము కాబోలు! ముక్కు ఒక వేళ అందముగా నున్నదని మఱిరెండుముక్కులు చేయించుకొని చెంపలకతికించుకొనుటకు వీరిష్టపడుదురా? పునరుక్తి యితరశిల్పములం దెంతదోషమో అంతకన్న నాటకకళ యందును మహాపాతకము. శ్రుతిచాపల్యముచేత నొక పద్యమునకు చెప్పబడిన (Once more) ను మన్నించెదమను కొన్నను సీనునకంతయు (Once more) చెప్ప ప్రేక్షకుల యభిరుచి మన్నించుటకు వీలుకానిది. అల్లూరు నాటకసమాజము వారు రామదాసు నాటకమును నాగరకులకు ఆకరమైన యొకపురమున ప్రదర్శించినపుడు అచ్చటి ప్రేక్షకులు అహమక్కుసీను పునరభినీతము గావలయునని ప్రార్థించిరట!!

నటకుని సద్యః ప్రేరితమైన యభినయములోని యౌచిత్యమును, సౌకుమార్యమును, సూక్ష్మతను గ్రహించుటకంటె పాటలోని మాధుర్యమును చవిచూచి యానందించుట తేలిక. కావున చాలమంది మెచ్చుకోలు పాటపద్యములకు సంబంధించియుండును. నేను జూచినంతవఱకు మెచ్చుకోదగిన అభినయమునకు (Once more) చెప్పిన ప్రేక్షకులు చాల అరుదు. చేయికదలింపనేరని నటకుడు గూడ రాగయుక్తముగ పాడెనేని ప్రేక్షకమండలి యాతని నద్భుతమైన నటకునిగ శంకించి బంగారు పతకములు దానము చేయుచుండును.

ఇకమీద నెన్నటికైనను కవి నటక ప్రేక్షకుల సహకార సాహాయ్యములచేతనే నాటకశిల్పము సంస్కరింపబడవలయును; అభ్యున్నతి నొందవలయును. ఈ మువ్వురును వారి వారి బాధ్యతను చక్కగ గుర్తెఱిగి ప్రవర్తింతురేని నాటక కళకు మంచిదినములు రానున్నవని నాతలంపు.

ఈ వ్యాసమునందలి నాయభిప్రాయములు నాట్యశిల్పమును నిబద్ధీకరించు బిరుసు సిద్ధాంతములుగావు. స్నేహపూర్వకమైన సలహాలు; కావుననే దిద్దుకొనుట కనుకూలములు.



# అల్లసాని పెద్దన

## సమకాలీన భావ ప్రతినిధి

సమకాలీన భావములు సాంఘిక పరిస్థితులు కావ్యదర్పణమునందు ప్రతిఫలించు చుండును. కవి స్వతంత్రుడయి పూర్వాచార బద్ధుడు కాకపోయినయెడల రచనాపద్ధతి యందును కావ్యవస్తు నిర్ణయమునందును భావ ప్రకటనము నందును తన కాలమునందు వ్యాప్తిలోనుండు పద్ధతులను గ్రహించును; లేక క్రొత్తభంగుల నావిష్కరించును. లక్షణములు ప్రతిభావంతులైన కవులరచనల పరిశీలనము వలన తేలిన సామాన్యధర్మములే కావున, అట్టి కవులను అన్యలక్షణములు బంధింపలేవు. ఒక్కొక్కప్పుడు వారి రచనలు పూర్వ సంప్రదాయములకన్న భిన్నములుగనుండి మార్గదర్శకములగును. ఒక్కొక్క కాలమునకు ఒక్కొక్క సంప్రదాయము రూఢియై యుండును. ఒక కాలముయొక్క సృజనశక్తి తగ్గిన యనంతరము సంప్రదాయము కరుడుకట్టును.

శాస్త్రముకాని శిల్పము కాని ఏకాలమందైనను అప్పటి కన్న నభివృద్ధిచెందుటకు వీలులేనంత పరిపూర్ణత చెందియుండదు. నిర్దోషతయును పరిపూర్ణతయును ఈలోకమునకు సంబంధించిన గుణములుగావు. కవి కేవలము క్రొత్తపద్ధతులను కనిపెట్టవలయునను దీక్షతో పద్మాసనము వేసికొని కూర్చుండడు. ప్రాచీన సంప్రదాయములు నిస్సారములయి పండిన పండ్లవలె కాలక్రమమున వృంతచ్యుతములగును. కాలార దిరుగనేర్చిన బిడ్డ రక్షకత్వగర్వము వహించిన ముసలి దాది పట్టియుంచినను పెనగులాడి పట్టు వదలించు కొనునటుల స్వతంత్రమైన కవి హృదయము సంకుచిత నియమ బద్ధముగాక యెదురు తిరుగును. అసంతృప్తి కలిగినప్పుడు అజ్ఞాతముగనే కవి ప్రతిభ అనుకూలమైన ప్రచలనావరణము నేర్పఱచుకొనును. ఈ కార్య మాతనియందు అప్రయత్నముగనే జరిగిపోవుచుండుట వలన స్వాభావికముగ నుండును :- కవి నిరంతరము నేక సంప్రదాయ బద్ధుడే యైనయెడల రచనలయందు వివిధత్వముండదు. ఇట్లనుటచేత కవి నియమరహితుడని చెప్పుటగాదు. స్వయంకల్పిత నియమములు కలవు. నియమబద్ధముగాని శిల్పమునందు ఔచిత్యముండదు. అరాజకత్వముండును. స్వాతంత్ర్యముకూడ నియమబద్ధమె.

జాతీయ జీవిత ప్రవాహమును ఆనకట్టలుకట్టి నూతన మార్గముల మరలింపగల నాయకులు, కవులు, చారిత్రక మహాపురుషులు ప్రతిదినమును పుట్టుచుండరు. అట్టివారిని సృజించుటకు ప్రకృతికూడ కొంతకాలము వేచియుండి శక్తిని సంపాదించుకొనవలయును. అట్టి ప్రతిభావంతులు పుట్టినపుడు ఆకాలమునకు వారివాక్కు ప్రాతినిధ్యము వహించును.

ఆంధ్రదేశ రాజకీయ చరిత్రమునందు కృష్ణదేవరాయల రాజ్యకాలమొక సువర్ణఘట్టము. హరిహర రాయలచే ప్రారంభింపబడిన విజయనగర సామ్రాజ్యము కృష్ణదేవరాయలనాటికి పరిపూర్ణతనొంది, భోగభాగ్యముల తులతూగుచు నడిమింటి సూర్యునివలె ప్రకాశింపజొచ్చెను. తెలుగు శౌర్యము, తెలుగుకీర్తి నల్గడల బ్రసరించెను. ఆ కాలమునందు ఆంధ్రసారస్వతమును కళలును విశేషముగ వృద్ధిచెందినవి. "గులాబిపూవు లంతటను అమ్మబడుచున్నవి. ఆప్రజలు గులాబిపూలను ఆహారముకంటె ఆవశ్యకములయినవిగా భావించుచుండిరి." ఇక విజయనగర ప్రజల నాగరకతయు సౌందర్య ప్రీతియు భోగలాలసత్వమును వేఱుగ జెప్పవలయునా?

పరస్పర భిన్న ప్రకృతులుగల రెండు నాగరకతలకు సంబంధము గలిగినప్పుడు రెంటి యందును కొంత మార్పు గలుగును, బలిష్ఠమగు నాగరకత దుర్బలమగుదానిని మ్రింగివైచి తనయందు జీర్ణించుకొనును. అట్లుకాక రెండును తుల్యబలయుతము లయ్యేనేని ఇచ్చిపుచ్చుకొనుటలు, అనుకరణములు, ఆత్మీకరణములు జరుగుచుండును. భిన్ననాగరకతల సంఘర్షణము అభివృద్ధికి అత్యంతావశ్యకము. ఈ కాలమున ఆంధ్రదేశమునందు హిందూ మహమ్మదీయ నాగరకతలకు కొంత సంబంధమును స్పర్ధయు కలిగినది. "ప్రాతయొక రోత, క్రొత్తయొక వింత" యనునట్లు మొగలాయీల భోగప్రియత్వము విజయనగర ప్రజలకు నచ్చినది. మహమ్మదీయ స్త్రీల రవికెలు పావడలు ఆంధ్రకాంతల మనముల నాకర్షించినవి.

విజయనగరము సుమారు నూటనలుబది చదరపు మయిళ్ళ వైశాల్యముగల గొప్ప పట్టణము. ఆంధ్రసామ్రాజ్యమునకు రాజధాని. సింహళమునుండికూడ సామంత నృపాలురు రాయలకు కప్పములను చెల్లించుచు రాయబారులను పంపుచుండిరి. పోర్చుగీసు సిపాయిలుకూడ కృష్ణదేవరాయల దండయాత్రలందు పాల్గొనుచుండిరి. వ్యాపారము నిమిత్తము వివిధదేశముల ప్రజలు ఆపట్టణమున నివాస మేర్పఱచుకొని సుఖజీవనము సల్పుచుండిరి. చక్కని నీటివసతి యేర్పడుట వలన ఎచ్చట చూచినను పైరుపచ్చలు చెట్టుచేమలు ద్రాక్షతోటలు బలిసియుండినవి. విజయనగరమను మూసయందు వివిధసంప్రదాయములు, ఆచారములు, నాగరకతలు కరగి నూతన నాగరకతగ కరుడు కట్టుచుండినది. కృష్ణదేవరాయల దండయాత్రలలో పాల్గొనని కుటుంబము విజయనగరమున నుండియుండదు. విజయగర్వ మొకవంకయు, విరోధి. పట్టణములు కొల్లగొట్టుటవలన ప్రాప్తించిన ద్రవ్య మొకవంకయు ప్రజల ఆత్మగౌరవము నకు, సుఖజీవనమునకు సాయపడుచుండినవి. దేశానురాగము, స్వభాషాను రాగము పొటమరించినది. తెలుగుమాటకు చెల్లుబడి హెచ్చినది. "దేశభాషలందు తెలుగులెస్స" యను నానుడి పుట్టినది.

ఇట్టి సందర్భములలో సంఘమునందు స్వాతంత్ర్య ప్రీతియు పూర్వాచార వైముఖ్యమును హెచ్చినదనుట యతిశయోక్తిగాదు. ఈ మార్పు ఆనాటి సారస్వతము నందును

గోచరింపవలయును. రాయల యాస్థానమునందు అల్లసాని పెద్దన, నంది తిమ్మన, అయ్యలరాజు రామభద్రుడు, పింగళి సూరన, ధూర్జటి, మాదన, రామరాజ భూషణుడు, తెనాలి రామలింగన్న అను అష్టదిగ్గజములుండిరని ప్రతీతి కలదు. వీరి సమకాలీనతలో కొంత కాలవిపర్యాసదోషమున్నది. ఒకవేళ ఉండిరనుకొన్నను, వీరిలో నెవ్వరి రచనయందు ఆనాటి పరస్పర భిన్నాదర్శక సంఘర్షణమును నూతన దృక్పథమును గనబడుచున్నది? పెద్దన మనుచరిత్రమునందు. కృష్ణదేవరాయలకు పెద్దనపై ప్రీతిగౌరవములు మిక్కుటము, కావుననే

సీ. *"ఎదురైనచో దన మదకరీంద్రము డిగ్గి*
*కేలూతయొసగి యెక్కించుకొనియె;*
*మనుచరిత్రం బందుకొనువేళ పురమేగ*
*పల్లకి దన కేల బట్టి యెత్తె;*
*బిరుదైన కవిగండపెండేరమున కీవె*
*తగుదని నాదు పాదమునదొడిగె*
*కోకట గ్రామాద్య నేకాగ్రహారము*
*లడిగిన సీమల యందునిచ్చె;*

గీ. *ఆంధ్రకవితా పితామహ యల్లసాని*
*పెద్దనకవీంద్ర! యని నన్నుబిలిచె......"*

ఇట్టి సత్కారమును గౌరవమును కృష్ణదేవరాయలు మఱే కవికిని జేసియుండలేదు. పెద్దన రాయలకు ప్రియస్నేహితుడు కూడ. రాజు వేటకు వెడలునప్పుడు కవీంద్రుని వెంటబెట్టుకొని పోవుచుండెనట * కడపజిల్లా బద్వేలియందొక సరస్సుగలదు. పెద్దన వేటకువచ్చినప్పుడాసరస్సులో స్నానము చేయుచుండెనని యచ్చట ప్రజలు చెప్పుకొనుచుందురట.

"ఆంధ్రకవితా పితామహుడ"ని కృష్ణదేవరాయలు పెద్దనను సంబోధించుట కేవలము ప్రీతి మూలకమనియు, తక్కినవారి రచనలకన్న అందు ముఖ్యముగా నందితిమ్మన కవిత్వముకన్న పెద్దన కవిత్వమేమంత రసవంత మనియు కొందఱు వితర్కింతురు. అది కేవలము ప్రీతిమూలక సంబోధనముగాదు. పెద్దన కవిత్వమునందు సౌకుమార్యము, తెనుగుమాటల తియ్యందనము, తేలిక మాటలలో నియమింపబడిన భావగాంభీర్యము, ప్రకృతి రామణీయక ప్రీతియు, నవ్యతయు గలవు. పెద్దన ప్రబంధపు నమూనాను సృజించిన వాడు

---

* గూడూరులో సబ్‌రిజిస్ట్రారుగా నుండిన నీలం గోవిందరాజులు నాయుడుగారు, బి.ఎ., బద్వేలియందున్నపుడు ఆసరస్సును దర్శించిరని నాతోజెప్పిరి. వారియొద్ద పెద్దన వంశవృక్షముకూడ కలదు. ఈ నాయుడుగా రిప్పుడు స్వర్గస్థులైరి.

కాకపోయినను, ఆంధ్రీకరణముగాక స్వతంత్ర కథా వస్తువును గ్రహించి కావ్యము రచించి నూతన సంప్రదాయ మేర్పఱచెను. శ్రీనాథుని నైషధము ఆంధ్రీకరణమయ్యును స్వతంత్ర ప్రబంధమువలె నొప్పారుచు పెద్దనకు మార్గము సిద్ధపఱచెను.

ఇతివృత్తము మార్కండేయ పురాణము నుండి గ్రహింపబడినది. తన మనమును ఆందోళనపఱచుచున్న భావయుద్ధమును ద్వైధీభావమును ప్రతిఫలింపజేయుట కనువైన కథనే కవి యేర్పఱచుకొనెను. మూర్తీభవించిన రెండు ఆదర్శకములు మన కన్నుల యెదుట పొడకట్టుచున్నవి. ఒకటి :- హృదయములేని నైతిక కర్కశత్వము - రెండు :- భోగలాలసత్వము. మొదటిదానియందు ఆచార పరాయణత్వమును రెండవ దానియందు మానుషత్వమును గలవు. కవి యీ రెండు ప్రకృతులను సృజించి శీలపోషణమునందు తారతమ్యము జూపించి యొకదాని కొకటి భిత్తిగ నొనరించెను.

ఆంధ్రదేశమునందు భిన్నమతములు ప్రబలుటవలన వైదిక మతమునందును వర్ణాశ్రమధర్మములందును ప్రజలకు కొంత అశ్రద్ధ జనించినది. మాధవ శాయణులు వేద భాష్యమును రచించియు రాజకీయ విషయములందు పాల్గొనియు వైదికమతమును కొంతవఱకు పునరుద్ధరించిరి. కాని, కాలక్రమమున ఆ యుద్యమముగూడ సన్నగిల్లినది. దేశ పరిస్థితులు సౌమ్యముగ లేవు; మాటిమాటికి యుద్ధములు కొల్లలు. సర్వజన సామాన్య కష్టములు కలుగుచున్న సమయములందు నీతులు ఆచారములు వర్ణాశ్రమ ధర్మములు నిర్వర్తింపబడుటకు వీలులేదు. యుద్ధకాలములందు వర్ణ సాంకర్యము సామాన్యము.

ఒక జాతిగాని సంఘముగాని బలశౌర్యములు గలిగి పరాక్రమవంతమై యితర జాతులపై దండయాత్రలు వెడలి జయముగాంచినప్పుడు ఆ విజయఫలము ననుభవించుచు వారు భోగపరాయణులయ్యెదరు. వైరాగ్యము మందునకైన లభింపదు. గృహస్థ జీవితమె ఆదరణీయమగును. మతము అభ్యాసవశమున అర్థములేని యాచారముగ మాఱియుండునేగాని, దైనందిన జీవితమునందు దాని యావశ్యకత అంతముఖ్యముగ దోపదు. కృష్ణదేవరాయుల రాజ్యకాలమునందొకప్పు డిట్టి పరిస్థితులు సమకూడినవి. పెద్దన హృదయమును వంశపారంపర్యముగ వచ్చు ఆచారప్రీతి యొకవంకకు, నూతన గతులు మఱొక వంకకు ఆకర్షింపజొచ్చినవి. ఈ గుంజులాటయె వరూధినీ ప్రవరుల వ్యవహారమునందు మనకు గోచరించును.

కవికి ఎవరిపై ప్రీతియెక్కువ? వరూధినియందా లేక ప్రవరునియందా? ఈ విషయము గనుగొనుటకు సాధ్యమగునా? ఈ రెండు పాత్రలను కవి చిత్రించిన విధమును విమర్శించితిమేని ఈ రహస్యము బయలు పడును. కవుల కిట్టి పక్షపాతముండునా? ఏల యుండకూడదు'

వారును మానవులే! వారికిని రాగ ద్వేషములు కలవు, ఇష్టానిష్టములు కలవు. మానవుని లోపత్వమునందును అసంపూర్ణతయందును కవికి సానుభూతికలదు. అపుడే యాతడు మానవ స్వభావమును గుర్తించినవాడగును. పీడించుటయు వేధించుటయు నీతియుతమైనను నీతిబాహ్యమైనను దస్ార్ద్రహృదయుని చిత్తమును గాయముసేయును, "ధర్మమునిర్వర్తింప వలయును : పరధర్మము కంటె స్వధర్మము శ్రేయము"అని చెప్పబడినది. ఎఱుకలవాని ధర్మము పక్షులను జంపి జీవించుట. అయినను, వాని కఱకుటమ్మునకు గుఱియైన క్రౌంచముయొక్క దుస్థితిని జంటపక్షి యొక్క శోకావేగమును గాంచినప్పుడు నవనీత సదృశమైన వాల్మీకిచిత్తము కరగి ధారలుధారలుగ స్రవించినది. యజ్ఞము సేయుట అధర్మముగాదు; బలిపీఠముయొద్దకు దీసికొని పోబడుచుండిన గొఱ్ఱెపిల్లను బుద్ధభగవానుడు చూచినప్పుడు ఆ మహాపురుషుని హృదయము కరుణారస తరంగితమై దానిని కాపాడుట కుద్యుక్తుడాయెను. ధర్మము హృదయములేని యంత్రము, మానవుడు హృదయముగల యంత్రము. రాముడు స్వప్రయోజనమును సాధించుట కొఱకు అక్రమముగ వాలిని సంహరించెను. వాల్మీకి యీ విషయము నెఱుంగును; ఆక్రోశనినాదముచే దిక్కులు మాఱుమ్రోగించుచున్న తారపై ఆ మహాకవికి మిక్కుటమైన సహానుభూతికలిగి, రాముడు జవాబు చెప్పుటకు వీలు లేని ప్రశ్నలను ఆమెచేతను వాలిచేతను నడిగించెను. తరువాత రాముని ధర్మైకపరత్వమునకు హానికలుగునని శంకించి తాను వత్తాసివచ్చి రాముడు దేవుడు గావున ఆయనచేసినదంతయు ధర్మమనిచెప్పి పై పెచ్చు వాలిచేతగూడ నొప్పించెను ? వ్యాసుడు పాండవ పక్షపాతి; వారు ఇడుమలు పడిరన్న కనికరముచే వారి తప్పులకు సున్నపు పూతలు కొట్టి మాలిన్యమును మాయించెను. తమ సృష్టులను తామె మోహించిన వారు కూడ కలరు! వీరిలో పైగ్మ్యాలియన్ అను గ్రీకు శిల్పి ముఖ్యుడు. ఆతడొక రమణీయవతియగు స్త్రీ విగ్రహమును చలవఱాతితో నిర్మించి ఆ సౌందర్యమునకు ముగ్ధుడయి మోహించి తన పడకటింట బెట్టుకొనెనట!

ప్రవరుడు నీతిశాస్త్రమునందు నిర్ణయింపబడిన కొలతలకు సరిపోవునట్లు కత్తిరింపబడిన తోలుబొమ్మ. వరూధిని విద్యుల్లతవలె మన కన్నులయెదుట సంచరించు జీవన్మూర్తి. బయోస్కోప్ చిత్రము! వరూధిని చైతన్యము పరిస్ఫుటముగ గోచరించుటకు ప్రవరుడు సృజింపబడెను. కవికి ఆతనిపై సానుభూతిలేదు. "బుద్ధి జాడ్య జనితోన్మాదుల్‌గదా శ్రోత్రియుల్!" అని ప్రవరుడు తన లోకజ్ఞాన శూన్యతను ఆత్మదూషణప్రాయముగ ఒప్పుకొనెను. ఈ వాక్యము వేఱు సందర్భమున జెప్పబడినప్పటికిని ఆతని శీలమును ఆ వాక్యార్థము నిరంతర మాపాదించియే యుండును. పాదలేపము కరగిపోయిన యనంతరము తన నిస్సహాయతను గుఱించి దుఃఖించునప్పుడు మన కథానాయకుని సంగతులు మఱికొన్ని బయలుపడును. తల్లిదండ్రులకు తానొక్కడె యల్లారు ముద్దుబిడ్డ. పెండ్లియయి శిష్యులకు పాఠముచెప్పు వయస్సు

వచ్చినప్పటికిని, తన్నుజూడనిదె తండ్రి యొక నిమిషమైన యోర్చుకొని యుండలేడు. అసుర సంధ్యవేళ ఈ బిడ్డ బయట కాలుపెట్టిన యెడల బూచులు పట్టుకొను నను శంకచే వాకిలి దాటనీయక తల్లి యెల్లప్పుడు రక్షించుచుండును. ప్రవరుడు తల్లిదండ్రుల ప్రేమాతిశయము చేతను అనావశ్యకమగునంత జాగ్రత్త చేతను, నిస్సహాయుడుగను లోకజ్ఞాన రహితుడుగను జేయబడిన అమాయకుడు. వరూధిని చెలికత్తె యాతడు "గోలయున్ బాలుడు" అని కనిపెట్టినది.

ప్రవరుడు మృగమదసౌరభము మోసికొనివచ్చుమందమారుతము వలన అచ్చోటు జనాన్వితమని తెలిసికొని చేరబోయి యొక దేవకన్యను గాంచెను. ఆమెయె వరూధిని. ఆ యువతి యసమాన రూపలావణ్యవతి; సౌందర్యమునుగాంచి యానందించుటయు దానిని మెచ్చుకొనుటయు అనీతికరము గాదు కాని, మన నీతిమంతుని చిత్తము సౌందర్య ప్రతిరోధకమైన కవచమునందు మగ్గిపోయినది; పాషాణత్వమె ధీరత్వమైన యెడల ప్రతిమంటపస్తంభమును ధీరుడే!

నిరుపమాన సౌందర్యవతులైన కామినులయెదుట లోకమే యెఱుగని ఋశ్యశృంగుని వంటి ఆజన్మ మునీశ్వరులును, అపారసంకల్పశక్తిసంపన్నులైన విశ్వామిత్రులవంటి యోగీశ్వరులను చలించిరి. ఇంతయేల? "బమ్మకైనబుట్టురిమ్మతెవులు" ఇట్లు చిత్రించిన వారు మానవ స్వభావముయొక్క లోతుపాతుల నెఱింగిన మహాకవులు. నీతిశాస్త్రమునకు వెఱచి శిల్పమును ద్యజించినవారు గారు. ఆ కాలమునందు ఆర్యసంఘ మింతటి యాచారబద్ధముకాదు కాబోలు!

ప్రవరుడెట్లు చిత్రింపబడియుండిన ప్రాణవంతుడుగ నుండెడివాడు? ఆయన యింతకు ముందెన్నడును వరూధినివంటి యందకత్తెను జూచియెఱుగడు; చూచినప్పుడు ఆశ్చర్యపడి యుండవచ్చును. అనంతరము మానవప్రకృతికి సహజమగు కోరిక పుట్టియుండవచ్చును. మఱుక్షణము నందె - ఆలి మగనికి అన్యకాంతలపై మనసు తగులుట యోగ్యముకాదు. తుచ్ఛసుఖములు "మీసాలపై తేనియ" లని విరక్తిపుట్టియుండవచ్చును. మరల ఆ లతాంగి రామణీయకమునకు వశుడయి, "అప్సరస, అందును నేను వలపింపలేదు, నన్ను వలచినది, అనన్యగృహీత, నేనేల భోగింప రాదు?" అని తన మనమును సమాధాన పెట్టుకొని యుండవచ్చును. మఱునిముసమునందె " ఇంతకాలము అవిచ్ఛిన్నముగ నెఱవేర్పబడిన నావ్రతమునేల నేడు భంగముచేసి కొనవలయును?" అని నిరతము తనమనములో వర్తించి అనుకూలవతియైన యిల్లాలిని అన్యాయము సేయుటగా తలంచి, ప్రయత్నపూర్వకముగ తనకోరికల చిక్కబట్టవచ్చును. ఇట్టి పరస్పర భావసంఘర్షణమునుండి

ధీరుని సంకల్పము నిర్మలమయి దృఢమయి యెట్టకేలకు జయము నొందును. ప్రవరుని యీ మనోనాటకము మనకు చూపట్టిననే యాతని పై మనకు సానుభూతి కలుగును; లేకయున్న అతడు పాషాణహృదయుడని దూషింతుము.

పెద్దన కీ శిల్పనైపుణ్యము కొఱవడి యుండినదా? కొఱవడియుండిన అంతటి మానుషత్వముగల వరూథిని నెట్లు సృజింపగలడు? అట్లయిన ప్రవరుని ఏల యిట్లు యంత్ర విగ్రహముగ తీరిచెను? ఒకటిరెండు కారణములు కలవు. పెద్దన రాజసము కలవాడు. "రమణీ ప్రియదూతిక తెచ్చి యిచ్చు కప్పురవిడె మాత్మకింపయిన భోజన ముయ్యెలమంచము" కావలసిన భోగప్రియుడు. పోతనవలె "హాలికులైన ఏమి?" యని స్వశ్రమార్జితము పట్టెడన్నము తినుటకు వలయు త్యాగశక్తికలవాడు కాడు. కావుననే రాజాశ్రితుడు. పూర్వాచార ప్రియమైన పండితాభిప్రాయమును బొత్తిగ నిరశించుటకు వీలులేనివాడు. అందువలన, పండిత లోకమును సంతృప్తి పరచుటకు ప్రవరుని ఆ విధముగ చిత్రించెను. జీవితయాత్ర సునాయాసముగ జరిగిపోవుట కిట్టి రాజీయే అవసరమేమో!

పెద్దన ప్రవరుని అంతటి కర్కశహృదయునిగ సవరింపక పోయినయెడల మనుచరిత్ర అథమకావ్యమని దూషింపబడియుండెడిది. వరూథినిపై కనికరము చూపెనని ఇప్పటికిని పెద్దనపై కత్తినూఱు నీతిమంతులు గలరు!

"కలంచునే సతుల మాయల్ ధీరచిత్తంబులన్" అని పెద్దన వ్రాసెను. మన యాలంకారిక సంప్రదాయము ప్రకారము ఒకవేళ ప్రవరుడు ధీరుడైన గావచ్చునేమొ కాని, పాపము! వరూథిని మాయలాడి యెట్లయినది! మాయలాడియయ్యును సతియయ్యేనేని దోషము లేదుగదా, తెలుగు కవులు సంస్కృత కవులవలె పదప్రయోజనము పాటించువారు కారనియు, పెద్దన 'సతి'ని కేవలము స్త్రీ పర్యాయపదముగ వాడెననియు సమాధానము చెప్పుకొన్నను వరూథిని పన్నిన మాయలేవి? ఆమె వలచినది; వలచుట మాయలాడితన మైనయెడల ఆమెయు మాయలాడియె. పెద్దన గారాబపు తిట్లు తిట్టుచున్నాడు కాబోలు! లేక మొగమాటపు తిట్లో!

వరూథిని కన్యక - అనన్యగృహీత - నిష్కల్మషమైన ప్రేమగలది; మొట్టమొదట ఎవనిని ప్రేమించెనో అతనినే వివాహమాడినది (గంధర్వుని మోనము తెలియదుగావున) ధనమార్జించుటకొఱకు ప్రవరుని ప్రేమించుటలేదు. లేని ప్రేమ నటించుట లేదు. జారిణికి ఇంతటి గాఢానురాగ మెక్కడిది? "ఇందునిభాస్య వా డనగ నింద్రుడొ చంద్రుడొ యా యుపేంద్రుడో" అని చెలికత్తెలు ఆతనిపై లాఘవము పుట్టించుటకు యత్నించినను "పూతపసిండివంటి వలపుంబచరించుకులంబు నీతికిన్, లేతగదమ్మ" అనిదుర్నీతులు

బోధించినను చెవినిబెట్టక ప్రవరునే వరించినది. ఆమె యచ్చర కొలమున నుద్భవించినను ప్రవర్తనము భిన్నము. తుదకు 'పేశల హృదయ' ఆత్మహత్యకూడ చేసికొన ప్రయత్నించినది. వరూధిని ప్రవరుని వరించునప్పటికి కన్యాత్వము చెడినది కాదు. "ఆవధూటి ప్రథమసురతంబు గంధర్వపతి గరంచె" అని చెప్పబడియున్నది.

వరూధిని ప్రవరుల సంగమము తన కిష్టమయ్యును కవి వదలివేసెను. అందుకు పరిహారముగ మాయాప్రవరుని మూలమున కొంత రహస్య సంతృప్తిగాంచెను. కవి చంద్రవర్ణనమునందు (సందేశమునకు తావుండదు గదాయని) తన యభిప్రాయమును వెల్లడించెను. "ప్రకృతి నచ్చుండైన సన్మార్గి యెన్నటికిం కూటమి వంకవచ్చు వికృతిన్ మగ్నుండుగా నేర్చునే" అని వెల్లడించెను. ప్రవరుడు శుద్ధప్రకృతి గలిగిన వాడేయైనయెడల వరూధినీ సంగమమువలన వచ్చు వికృతికి భయపడవలసిన యవసరముండదు, అది క్షణికము. ప్రవరుడు అసంతృప్త హృదయమును సంతోషపెట్టి యోదార్చి పోయి యుండవచ్చును.

రావణుడు సీత నెత్తుకొని పోయినప్పుడు రాముడు పలవించెను. ఆ శోకవేదనకు చెట్లుకూడ తలలువాంచి యల్లాడెను. ప్రకృతియంతయు కన్నీరునించెను. పెద్దనకూడ దుఃఖితయగు వరూధినిపై ప్రకృతి కనికరించినదని వర్ణించెను. కర్మసాక్షియగు సూర్యభగవానుడు ప్రవరుని పాషాణహృదయత్వమునకు వెక్కసమంది రోషభీషణ స్ఫురణ వహించెను :

తరుణి ననన్యకాంత, నతిదారుణ పుష్ప శిలీముఖ వ్యథా
భరవివశాంగి నంగభవు బారికి నగ్గము సేసి క్రూరుడై
యరిగె మహీసురాధము డహంకృతితో నని రోషభీషణ
స్ఫురణ వహించెనో యన నభోమణి దాల్చె కషాయదీధితిన్!

ప్రవరుడు క్రూరుడు - మహీసురాధముడు - అహంకార యుతుడు - శెభాష్ ! పెద్దనా, మునుగులో దాగుకొని నీ అక్కను వెళ్ళబుచ్చినావు! కసిదీర్చుకొన్నావు! ఈ సహానుభూతియె, యీ హృదయ వైశాల్యమె నిన్ను మహా కవి పట్టమునకు అర్హుని జేయుచున్నది.

వరూధిని ప్రశ్నలలో వాద నైపుణ్యము మెఱయు చున్నది; ప్రవరుని చప్పిడిజవాబులు, యజ్ఞకోటులంబావను లౌటకున్ ఫలము మా కౌగిళ్ళ సుఃఖించుటేగదా! క్రతువు లొనరించుట స్వర్గభోగములకొఱకు, స్వర్గమునందు అవశ్యానుభోక్తవ్యమును ధర్మమును యోగ్యమునైన రంభాది భోగములు ఇచ్చటయేల నిషిద్ధములయ్యెను? అశ్రమముగ సశరీర స్వర్గసుఖము సమకొనియుండ వ్రతోపవాసముల కృశుడవయి ఆత్మ నలచుట యెందుకు?' అని వరూధిని ప్రశ్నించు చున్నది.

పెద్దన కళానైపుణ్యమును గుఱించి యొకటి రెండు విషయములు సూచించి యీ వ్యాసము ముగించెదను. ఈ కవికి ప్రకృతి రామణీయక ప్రీతి విశేషముగనున్నది. పద లాలిత్యము - అందు ముఖ్యముగ తెలుగుమాటల తియ్యని పోకడలు ఈతనియొద్ద నేర్చుకొనవలయును. 'అల్లసానివాని యల్లిక జిగిబిగి' అను పూర్వ విమర్శ కాభిప్రాయము నానుడియై యున్నది. పెద్దన కవిత్వము లలితముగ దీర్చి దిద్దబడి యున్నదనుటకు సందియము లేదు. "నిలుకడ వలయుకృతికి" అను అప్పకవి వచనమునందు కళారహస్యమున్నది. ఒక మనుచరిత్రమే కాదు - కొంచెమించుమించుగ పూర్వకావ్యములలో చాలవఱకు నిలకడగా రచింపబడినవే. "ఏకైక దినప్రబంధఘటికా సద్యశ్శత గ్రంథకల్పను" అని రామరాజభూషణుడు తన్ను గుఱించి చెప్పుకొనియున్నను వసుచరిత్రము ఒక్క దినములో వ్రాయబడిన ప్రబంధము కాదు. కడపటి సవరణయయి పూర్తియయిన దనుటకు కొన్ని సంవత్సరములు పట్టియుండును; అనగా తన జీవితకాలమునందు రెండుమూడు కావ్యములకన్న నెక్కుడుగ రచించియుండడు. (నెఱవడి కుదురుటకై వ్రాయబడు కాపీ పుస్తకములవంటివి యెన్నియేని ఉండవచ్చును, అవి లెక్కలేదు) ఆ కాలమున రాజాస్థానములె కవులకు శరణ్యములు. ఆస్థానపండితులు స్తనశల్య పరీక్షచేయు బిరుసువిమర్శకులు. ఇట్టి అగ్ని పరీక్షలో తేరి తెప్పరిల్లిన కావ్యములె గౌరవ యోగ్యము లగుచుండెడివి. ఇట్లనుట వలన పూర్వకావ్యములన్నియు నీతరగతికి జెందినవని కాదు.

ఇప్పటి పరిస్థితులు వేఱు : వార్తాపత్త్రికలు మాసపత్త్రికలు ప్రబలినవి. ఆ పత్త్రికల పుటలు నిండుటకు విషయములు కావలయును. కవులును, వ్యాసకర్తలును ఏదో యొక మొగమోటమిచేత ఏదియైన కొంత (కాగితములు నిండుటకు) వ్రాసిపంపవలసి యుండును. కాగితముపైని సిరాతడి యారకముందె ఖండకావ్యము పోస్టులోబడును. ప్రూఫులు సరిచూడక పూర్వమె (అవకతవకగా చూచి యని యర్థము) పత్త్రికలలో ముద్రింపబడును. పత్త్రికాధిపతులు మంచి సెబ్బరలు పరిశీలించి ముద్రించుటకు వీలులేదు. అట్లయిన వారిపుటల నియమమునకు హాని గలుగును. ఇట్టి పరిస్థితులలో నిలుకడ నియమమెట్లు కొనసాగును ? తన గ్రంథము తొందరగ ప్రకటింపబడవలయునను అక్కఱ పెద్దన కుండియుండదు.

Take time for thinking ; never work in haste,
And value not yourself for writing fast ;
A rapid poem with such fury writ ;
Shows want of judgement not abounding wit.

* * *

A hundred times consider what you have said ;

Polish, repolish, every colour lay,
And sometimes add, but often take away.

*- John Dryden.*

అను ఇటువంటి రచనా నియమమును పెద్దన చాల జాగరూకతతో పాటించినట్లున్నది.

ద్రౌపది, కైకేయి, చిత్రాంగి మున్నగువారివంటి నాయికలు మన సారస్వతమునందు అరుదు. కొంచె మించుమించు నాయికలందరు ముగ్ధలు. మౌగ్ధ్యము రమణీయముగ నుండవచ్చును; కన్యలందరు ముగ్ధలుగ నుందురను ప్రకృతి నియమములేదు. వరూథిని ప్రాగల్భ్యముగల కన్యక. తానే వలచినది. ఎట్టకేలకు "నిక్కముదాపనేల ధరణీసురనందన యింక నీపయిం, జిక్కెమనంబు" అని తన భావమును బహిరంగముగ వెల్లడించెను. ఇట్లు చెప్పుట స్త్రీసహజమా? కాంతలు తమ ప్రేమాతిశయము హావభావములచే సూచింతురు. పాపము! వరూథిని సైత మట్లె చేసినది కాని, ప్రవరుని మనస్సు ఒత్తిడిపడునది గాదు. ఆలసించిన యాతడు మోరకించుకొని పోవచ్చునను అనుమానముచే ప్రేమను వచించినది.

వరూథిని ప్రవరునివలె కర్కశహృదయ గాదు. భావోద్రేకము కలది. పేశలమైన మనస్సు - సౌందర్యపిపాస మిక్కుటము - ప్రవరుని సౌందర్యమున కచ్చెరు వందినది - వర్ణించినది - ఇంకను తనివి సనక యాతని ప్రేమించినది. వరూథినీ ప్రవరుల సందర్శనమును కవి అద్భుతముగ వర్ణించెను. వరూథిని "అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసింప కాంతి పెల్లుబ్బి కనీనికల్ వికసితోత్పల పంక్తుల గ్రుమ్మరింపగా, గుబ్బ మెఱుంగు చన్గవ గగుర్పొడువన్" ప్రవరుని గాంచినది. మరియు "ఝళంఝళత్కటక సూచిత వేగ పదారవిందయై లేచి కుచంబులుం తుఱుము లేనడు మల్లలనాడ నయ్యెడం బూచిన యొక్కపోక నునుబోదియ జేరి విలోకన ప్రభావీచికలం దదీయ పదవీ కలశాంబుధి వెల్లిగొల్పి" నది.. ఇంకను "మునుమున్ బుట్టెడు కొంకు లౌల్యమునిడన్ మోదంబువిస్తీర్ణతం, జొనుపం గోర్కులు కేళ్ళుద్రిప్ప మదిమెచ్చుల్ తెప్పలల్లార్ప నత్యనుషంగస్థితి తెచ్చపాటొసగ నొయ్యారంబునం జంద్రికల్, దనుకం జూచి" నది. ఈ పద్యములందు ప్రతిక్షణ వ్యాప్తమైన కార్యసంచలనము జీవకళావిలసనము నిబిడీకృతమై యున్నది. ఇట్టి పద్యములు ఆంధ్రసారస్వత మకుటమునందు ప్రకాశించు జీవమణులు. ఈ చాకచక్యమునందు పెద్దన తిక్కనకు మాత్రమె రెండవవాడు.

నిర్జన ప్రదేశమందు ప్రవరుని గాంచినపుడు వరూథినికి మొట్టమొదట కన్యా సహజమైన సిగ్గుపుట్టినది; పుట్టి పూచిన పోకచెట్టు చాటునకు పోయినది ! ఇంక నే చెట్టు చాటునకు బోయినను ఆమె సౌందర్యము ప్రవరుని కగపడదు. కావుననే సిద్ధహస్తుడగు కవి సందర్భానుసారముగ పోక చెట్టును దెచ్చి పెట్టినాడు.

"ఇంతలు కన్నులుండ" అను పద్యమునందు లోకోక్తియు చమత్కారమును ధ్వనితముగ ప్రవరుని నేత్రసౌందర్యమును వర్ణింపబడినది. పద్యములోని మాటలు తేటతెలుంగైనను భావము గంభీరముగను ప్రౌఢముగ నున్నది.

పొంగిపొరలివచ్చు ప్రేమప్రవాహమును ఆపుకొన లేక వరూధిని ఆ ఛాందసుని "పాలిండ్లు పొంగార పైయంచుల్ మోవగ" కౌగిలించుకొనినది. ఆ బ్రాహ్మణుడు ఓరమోమిడి హా శ్రీహరీ! యని అంసద్వయమంటి పొమ్మని త్రోసిపుచ్చెను. వీలైనయెడల అంసద్వయమంటి యుండడు! సమయమునకు చేతికఱ్ఱ మఱచివచ్చెను. పాపమావనజగంధి మేని జవ్వాజిపస ! కందంబించు నొడలుకడిగికొని పాపపరిహారముగ సంధ్యవార్చినాడు. వరూధిని యొక్క యీ యస్త్రముకూడ నిరుపయోగమైనది. తన సౌందర్యము నిరాకరింపబడినందుకు కోపమును, కోరికతీఱనందుల కసహనమును,స్త్రీజన సహజమైన అళీకనిందారోహణ నైపుణ్యమును, కొంచెము లేతపాకములోబడిన గయ్యాళితనమును, కసిదీర్చుకొను నిచ్చయు వరూధిని మనమునందు చెలరేగి ముప్పిరిగొన్నవి; దుఃఖము పొంగిపొరలి వచ్చినది.

*"పాటున కింతులోర్తురె ? కృపారహితాత్మక, నీవు త్రోవ ని*
*చ్చోట భవన్నఖాంకురము సోకె కనుంగొను ...."*

తన యమ్ముల పొదిలోని మన్మథాస్త్రములన్నియు వ్యయమైనవి. తుట్టతుదకీ యస్త్రమొక్కటి నిలిచి యుండినది. ఇది యమోఘము కావచ్చును. అయ్యో! దేవుడా, యీ యస్త్రముకూడ ఆఱాతిపై దగిలి మొక్కవోయినది.



# నాటకము : చరిత్రము

నెలదినములకు పూర్వము * కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు కళాప్రపూర్ణ వేదము వేంకట రాయశాస్త్రిగారి "ప్రతాపరుద్రీయము" లోని కథ చారిత్రకము కాదని ఒక విమర్శనము గేయముగ వ్రాసి "ప్రజామిత్రలో ప్రకటించిరి. ఆ విమర్శనము ప్రతాపరుద్రీయ నాటకమును గుఱించి వ్రాయబడినప్పటికిని, అందలి విషయము నాటక రచయితల కందఱకు సంబంధించి యున్నది. కావున ప్రస్తుతము చర్చనీయముగా ఏర్పడినది.

వాఙ్మయ వివాదములలో ప్రవేశించుట నాప్రకృతికి విజాతీయమైన పని, అందులో ఇప్పుడు నాకు ఓపికగాని,తీఱికగాని యసలే లేదు. అయినను ఈ విషయము చాల ముఖ్యమని నాకు తోచినందువలన, సారస్వత ప్రపంచమున పలుకుబడి కలవారు ఒకప్పుడు పొరపడుదు రేని (పొరపడుట మానవ సహజమేగద!) ఆ పొరపాటు తత్త్వదర్శనమునకును, సారస్వత పురోభివృద్ధికిని ఆటంకముగ ఏర్పడవచ్చునను భయముతో ఈ వ్యాసమును వ్రాయదల పెట్టితిని.

దృశ్యశ్రవ్య కావ్యములకు రచనా విధానమున తప్ప అంత్య ప్రయోజనమునందు ఏవిధమైన భేదములేదు. లలిత కళల ప్రయోజన మేదో దృశ్యకావ్యప్రయోజనముకూడ నదియె - సద్యఃపరనిర్వృతి.

నాటకము సామాజికుల రసానుభూతికి హేతువయి, హృదయాహ్లాదము, వినోదము కలిగించిన చాలునా? లేక, యింక నేదియైన సాంఘిక ప్రయోజనమును, ఉపదేశమును ఆశింపవచ్చునా? ఇట్టి ప్రశ్నలకు ప్రాచ్యపాశ్చాత్య విమర్శకులు భిన్నభిన్నముగ ప్రత్యుత్తరము లిచ్చియున్నారు. అయినను నాటకమును సాంఘికోద్ధరణము కొఱకు ఉపయోగింప వచ్చునని తీర్మానించిన విమర్శకుల సంఖ్యయే హెచ్చు. నాటకములయందు ఉపదేశముండవచ్చునుకాని, అయుపదేశము రసాత్మకమయి, ప్రత్యేకముగ ఒక యుపదేశమని యనిపించుకొనక, అలక్ష్యముగ సామాజికుల హృదయములోనికి ప్రవేశింపవలయును. ఇట్లు నిర్మించుట కళానైపుణ్యము. కవి వాక్కును హ్లాదైకమయయమని వర్ణించుచు ప్రయోజనములను లెక్కించునపుడు "కాంతా సమ్మితతయోపదేశ యుజే" అని మమ్మటుడు చెప్పెను. దీనినే పాశ్చాత్య విమర్శకులు "Delightful instruction" అని నుడివి యున్నారు. "ఆనందమున ఉపదేశమును మెదిపి మానవసంఘోద్ధరణమునకు కావ్యము తోడ్పడవలయు"నని హొరేస్‌కవి చెప్పెను. విక్టరు హ్యూగో, ఇబ్‌సన్ మొదలు బెర్నార్డుషా వఱకు గల పాశ్చాత్యనాటక రచయితలు నాటకమును మానవసంఘ శ్రేయమునకుగా వినియోగించిరి.

"Art for art's sake", అనగా, కళ ప్రయోజన నిరపేక్షకముగ నుండవలయునను వాదమొకటి కలదు. ఇది మన దేశమునకు క్రొత్త. కావ్యము ఆనందమాత్ర ప్రయోజన

---

* 1935 మేనెల 5 తేదికి ముందు నెలనాడు.

మయ్యును. విశ్వశ్రేయమును చేకూర్చునదిగ కూడ నుండవలయును అని మనలాక్షణికుల మతము. విశ్వశ్రేయ మనుమాటయందు సాంఘిక ప్రయోజనత్వము ధ్వనించుచున్నది. ప్రయోజన నిరపేక్షక వాదుల సిద్ధాంతప్రకారము కవి నిర్బాధ్యుడు. తన యానందమును పట్టలేక పాడుకొనుచుండును. సంఘమునందు తన రచనల మూలమున కలుగు అనుకూల ప్రతికూల ప్రవర్తనములతో కవి కేలాటి సంబంధము లేదు. కోకిల ఏమి ప్రయోజనము నాశించి గానము చేయుచున్నది ? సెలయేరు ఎవరిని సంతృప్తి పఱచుటకు బిలబిల ధ్వనులతో ప్రవహించుచున్నది? అని వీరు ప్రశ్నించెదరు.

చింతా దీక్షితులుగారు ఈకోయిల, సెలయేటివాదములను ఇమిడ్చి సొగసుగా వ్రాసిన గేయములను నేనెప్పుడో చదివినట్లు జ్ఞప్తియున్నది. ఇట్టి ప్రశ్నలడుగువారు కోయిలకు, సెలయేటికి ప్రయోజనము నాశించు జ్ఞానమున్నదా? లేదా? యని విచారించినట్లు కనబడదు. కోకిలపాట మనకు రుచించుట అది ఆనందముతో పాడుచుండుట వలనగాదు; దాని కంఠస్వరమున మాధుర్య ముండుటవలన. కాకికూడ అట్టి ఆనందముతోనేగదా పాడును! దాని గానము మనకేల రుచింపదు ?

కవి నిర్జరారణ్య ప్రదేశమున కూర్చుండి తన యిచ్చవచ్చినట్లు పాడుకొనిన చిక్కేమియులేదు. ఏనీతియు, నియమము అవసరములేదు. తానేతుమ్మి తానే దీవించుకొనవచ్చును. కాని, కవి మానవ సంఘములో నొక వ్యక్తిగనుండి, తన కావ్యవస్తువు మానవసంఘము నాశ్రయించి యుండునెడల, తానెట్లు నిర్బాధ్యముగ పాడుకొనగలడు?

ఈవాదమునందు అనుభవ వ్యతిరేకమైన అసత్యము ఒకటికలదు. కవి ఆనందము పట్టలేక పాడుకొనునా? కవి రచించునప్పుడు తన మనస్సులోనుండు ఒత్తిడిని ఆనంద మనవచ్చునా? లేక వేదన యనవచ్చునా? మనస్సు ఱెక్కలు విప్పుకొననిదే ( mental relaxation కలుగనిదే) ఆనందము జనింపదు. రచనా సమయమున కవి మనస్సు చక్కగ శ్రుతి చేయబడిన వీణాతంత్రివలె బిఱ్ఱబిగిసికొని యుండును; ఏ మాత్రము తగిలినను తెగును; ఆసమయమున నెవ్వడైన పిలిచినయెడల అమాంతముగ వానిపైనబడి గొంతు నులిమి వేయవలయునను కోపము పుట్టును. ఒకప్పుడు మంచముపై కూర్చుండి వ్రాయుచున్నామా? లేక క్రింద కూర్చుండి మంచముపై నోటుబుక్కు పెట్టుకొని వ్రాయుచున్నామా? యను జ్ఞానముకూడ నుండదు. కలలో పద్యములు, నిదురమేలు కొనునపుడు పెదవులపై పద్యములు, రేయుంబవళ్ళు నాలుగైదు దినములవఱకు ఏకధారగా ఆవరించియుండు ఇటువంటి యున్మాదావస్థను, సూక్ష్మ మానసిక ప్రళయమును ఆనందమందుమా? బాధయందుమా? ప్రసవవేదనపడుచుండు తల్లిని చూచి, " ఈమె యెంత ఆనంద మనుభవించుచున్నది! అని తలంచువారుందురా? ప్రసవించిన తదుపరి తల్లి బిడ్డను చూచుకొన్నపుడు ఆనందమనుభవించును. ప్రాసెస్ ఎప్పటికి ఆనందకరముగ నుండదు.

ప్రాసెస్‌ను రిజల్టును కలగుమ్మటం చేయుటవలన ఈభ్రాంతి కలుగుచున్నది.

మానవావస్థానుకృతి అభినయము. అభినయము ప్రధానముగా గలది నాట్యము. నాటక రచయిత ప్రకృతిని యథాతథముగ అనుకరింపడు. సామాన్యముగ మానవ జీవితమునందు సంభవించు ప్రతిసంఘటనము, ప్రతివిషయము కళయందు మూర్తీభవింపజేయుటకు తగినంత ముఖ్యమైనది గను, ఆవశ్యకమైనదిగ నుండదు. ప్రకృతిపరిపాలనమునందు శక్తి అనవసరముగ వ్యయింపబడుచుండును. కవి కళాదృష్టితో అనావశ్యకములైన వివరములు వదలిపెట్టి, ఏర్చికూర్చి, చేర్చితీర్చి, కొన్ని సంవత్సరముల కాలపరిమితిగల కథను మూడు నాలుగు గంటలలో ముగియు నాటకముగ నిర్మించును. ప్రకృతి అంతగ పాటింపని పొదుపును కవి జాగరూకతతో అభ్యసించును. కొంచె మించుమించుగ నాటకము ప్రకృతియొక్క యుత్తమ పునర్నిర్మాణమని చెప్పవచ్చును.

"అద్దములోవలె ప్రకృతిని (నాటకములందు) ప్రతిఫలింపజేయుట" అను షేక్స్పియరు సూక్తికి మెఱుగుపెట్టినట్లుగను, వ్యాఖ్యాన ప్రాయముగను పరాసు మహాకవి అద్భుత నవలా రచయిత విక్టరు హ్యూగో ఇట్లు వ్రాసెను. :-

" It seems to us that someone has already said that the drama is a mirror wherein nature is reflected. But if it be an ordinary mirror, a smooth and polished surface, it will give only a dull image of objects with no relief, faithful but colourless; every one knows that colour and light are lost in a simple reflection. The drama, therefore, must be a concentrating mirror, which, instead of weakening, concentrates and condenses the coloured rays, which makes a mere gleam a light, and of a light a flame. Then only is the drama acknowledged by art."

నాటకవస్తువు పౌరాణికమైనను, చారిత్రకమైనను, సాంఘికమైనను కవి తన భావనాగ్నిచేత కరగించి పరిశుద్ధము చేసి, కల్పనాశక్తియను అచ్చులో అసామాన్యమూర్తిని తయారుచేయును. ఈ మూర్తి ప్రకృతికంటె భిన్నముగ నున్నను, దానికి వ్యతిరేకముగ నుండదు. ఇట్లనుట చేత కథను తమ కల్పనకు అనుకూలముగ మార్చవలసిన ఆవశ్యకము కవికి కలదు. కార్యకారణ సంబంధము నాటకమున పరిస్ఫుటముగనో, వ్యంగ్యముగనో గోచరింపవలయును; ఏదియును కారణరహితముగ సంభవింపగూడదు. కావున కవి ఆది మధ్యాంతములుగల నాటకమును సృజించునప్పుడు, కథలో నెన్నియో మార్పులు చేయవలసియుండును. కవి చేతి కావ్యవస్తువు ప్రతిమాకారుని చేతి బంకమట్టి వంటిది.

ఈ విషయమును ఎడ్గార్ యాలన్‌పో అను అమెరికా కవీంద్రుడు ఇట్లు చెప్పియున్నాడు :

" In the hands of the true artist the theme is but a mass of clay, of which anything may be fashioned at will or according to the skill of the workman. The clay is, in fact, the slave of the artist. It belongs to him."

రామాయణము, మహాభారతము ప్రసిద్ధములైన కావ్యేతిహాస గ్రంథములు. ఇవి చారిత్రకములని విశ్వసించు వారు అప్పటికిని ఇప్పటికిని గలరు. అట్టికథల తీసికొని నాటకములు రచించిన భాసుడు, కాళిదాసు, భవభూతి, భట్ట నారాయణుడు మున్నగు కవులు మూలకథలను ఎట్లు మార్చినదియు మన మెఱుంగుదుము. షేక్స్పియరు తాను రచించిన చారిత్రక నాటకములోని పాత్రలను యథార్థచారిత్రక పురుషులకంటె భిన్నమైన స్వభావశీలములు గలవారినిగ చిత్రించెను. ఇది ఆవశ్యకమైన యొక శిల్పలక్షణము. తెల్లని కాగితముపై నల్లనిగీతయు నల్లని కాగితముపై తెల్లని గీతయు గీచిన స్ఫుటముగ నగపడును. ఏకవర్ణమయ్యేనేని రెండిటికింగల భేదము గోచరింపదు. అందువలననే కవియు చారిత్రక నాటకములందు సైతము వివిధప్రకృతులు గల వారిని ఒకచోట ప్రవర్తింపజేసి, స్వభావ తారతమ్యమును స్ఫురింపజేయును.

నాటకమునందు కథకంటెను మానవస్వభావ చిత్రణమె ముఖ్యము. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాది చిత్తవికారములు సర్వజనీనములై, సర్వ కాలీనములై, మానవసంఘముపై నధికారము సల్పుచుండును. అట్టి మానవ స్వభావ శీలములను, మానసిక రహస్యములను కవి నాటకరంగమున మూర్తీభవింపజేసి సామాజికులను ఆనందపరవశుల గావింపవచ్చును.

"Poetical works belong to the domain of our permanent passions; let them interest these, the voice of all subordinate claims is at once silenced."

అని శాశ్వతములగు మనోవికారముల ప్రాముఖ్యమును మ్యాథ్యూ ఆర్నాల్డు కవి వివరించెను.

ఒకప్పుడు ఫ్రెంచి నాటక రచయిత యగు మోలియర్ కవిని విమర్శకులు, " నీ నాటకములు లక్షణవిరుద్ధముల"ని తూలనాడిరట. అందుకు "సామాజికులను సంతోష పెట్టుటకు ఏ నాటకలక్షణము లావశ్యకములో అంతకన్న భిన్నములైన లక్షణములతో నాకేమివని?'' అని ఆయన జవాబు చెప్పెనట! నాట్యకళా ప్రపూర్ణుడగు బళ్ళారి టి. రాఘవాచార్యులవారు ఒకయుత్తరమున, "నేను నాటకమును సామాజికుల దృష్టితో చదివెదను" అని వ్రాసియుండిరి. నాటకయోగ్యతను ఒరయుటకు ఇంతకన్న శ్రేష్ఠమైన నికషోపలము మఱియొకటి యుండదని నా యుద్దేశము.

చరిత్రయొక్కయు, నాటకము యొక్కయు ఉద్దేశములు ప్రయోజనములు వేఱు; చరిత్ర జరిగినది జరిగినట్లుగ చెప్పును. జరిగిన దన్నంతమాత్రముననే సకల సబ్బండును చరిత్రకారుడు గ్రంథస్థము చేయును. మంచిచెడ్డల ననుసరించి అతడు విషయములను ఏర్పఱచకూడదు. ఎంతవఱకు జరిగియుండవచ్చునో, ఎట్లు జరిగియుండిన చిత్తాకర్షకముగ నుండునో దాని నూహించి కవి కావ్యమును వ్రాయును. చారిత్రకవిషయము సైతము కవితాస్పర్శచేత రూపాంతరము పొందును. ఇట్లు వారిరువురి మార్గములు భిన్నమైయుండగా కవి చిత్రకారుడు కానందుకు మనమేల యాతనిని ఎత్తి పొడువవలయును ?

మనము నాటకశాలలకు పోవునది పురాణములు, చరిత్రములు నేర్చుకొనుటకు కాదు. రెండుమూడు గంటలకాలము నిరపాయకరమగు నానందము ననుభవించుటకు. చారిత్రక విషయములు తెలిసికొనవలయునన్న అందుకు తగిన గ్రంథములు గలవు. ప్రతాపరుద్రీయములోని కథ చారిత్రకము కానందువలన అది ప్రదర్శింపబడినప్పుడు సామాజికుల ఆనందమున కేమైన కొఱతయుండునా ? పేరిగాడు, యుగంధరుడు చారిత్రక పురుషులు కాకపోయినను వారిచేష్టలు, మాటలు మనకు సంతోషము గల్గించును.

చౌదరిగారు ఢిల్లీ యెక్కడ, గంగ యెక్కడ? అని ప్రశ్నించినారు. నాటక ప్రపంచమును యథార్థ ప్రపంచదృష్టితో చూడజనదు. నాటకము కొన్ని కవి సమయములకును కళానియమములకును లోబడియున్న అనన్య పరతంత్రమైన సృష్టి. చిత్రకారుడు గోడపై తెలుపు, నలుపు రంగులతో లిఖించినచిత్రము చదునుగా (Flat surface) నుండినను, వెలుగు నీడలవలన మిట్టపల్లములను స్ఫురింప జేయును. నల్లగానుండుచోటు పల్లము, తెల్లగానుండుచోటు మిట్ట అను చిత్రసమయమును మన మంగీకరించి యున్నాము. ఏలయన, చదునుగానుండు తలమున మిట్ట పల్లములు చూపుట అసంభవముగాన, విధిలేక కొన్ని సంకేతములను అంగీకరించితిమి.

అట్లే నాటకములందుగూడ కొన్ని సంకేతములు, సమయములు రూఢియైనవి. నాటకప్రపంచమున కాలము స్థలము సంకుచితమై యుండును. అచ్చట మన భావము సంచరించువఱకు అందలి పరిస్థితులు స్వాభావికముగను, యథార్థముగను ఉండునట్లు తోచును. బహిఃప్రకాశము యొక్క వృద్ధిక్షీణతల ననుసరించి కంటిలోని పాప (రంధ్రము) సరియొత్తుకొనునట్లు, ప్రకరణము ననుసరించి సరియొత్తుకొను శక్తి మన భావమునకు కలదు. అందువలననే నాటక ప్రదర్శనము మనకు ఉపభోగ్య మగుచున్నది.

సునిశితమైన విమర్శకదృష్టితో నాటకము చదువునపుడు అసంభవములుగా కనబడునవి నాటక ప్రయోగమును చూచునప్పుడు అట్లు తోపవు. అప్పటి మన భావస్థితి వేఱు.

చరిత్రమును నాటకకర్త ఎంతవఱకు మార్చవచ్చును? అను విషయమును గుఱించి ఫ్రెంచి, జర్మను కవులయు, విమర్శకులయు అభిప్రాయములను ఈ క్రింద నుదాహరించుచున్నాను :-

"It is besides most commonly asked how far the poet may venture in the alterations of the true story, in order to the fitting of it for the stage. Upon which we find different opinions among both the ancient and modern critics; but my opinion is that we may do it, not only in the circumstances, but in the principal action itself, provided he makes a very good play of it. For , as the dramatic poet does not much mind the time, because he is no chronologist, no more does he, nor the epic poet, much mind the true story because they are no historians. They take out the story so much as serves their turn and change the rest not expecting that anybody should be so ridiculous as to come to the theatre to be instructed in the truth of history".

*- Francois Hedlin's*

*"The whole art of the Stage".*

"In short, tragedy is not history in dialogue. History is for tragedy nothing but a storehouse of names wherewith we are used to associate certain characters. If the poet finds in history circumstances that are convenient for the adornment or individualising of his subject, well, let him use them. only this should be counted as little a merit as the contrary is a crime ........."

"The dramatic poet is no historian, he does not relate to us what was once believed to have happened , but he really produces it again, not on account of mere historical truth, but for a totally different and nobler aim. Hostorical accuracy is not his aim, but only the means by which he hopes to attain his aim; he wishes to delude us and touch our hearts through the delusion."

*- G.E. Lessing's*

*"Dramaturgy."*

ఈ యభిప్రాయములు ముఖ్యములు కావున కొంచెము దీర్ఘములైనను పూర్ణముగ నుదాహరించితిని. పఠితలు వ్యాసగత విషయములను ఆలోచించి వారివారి బుద్ధికి సూటియగు పర్యవసానము తేల్చుకొందురుగాక!



# అలంకార తత్త్వము

కావ్య లక్షణములను విధించు గ్రంథములకు అలంకార గ్రంథములని యేల పేరువచ్చినది ? ముఖ్యములైన రసధ్వనులుండగా అలంకారములకేల యింత ప్రాముఖ్య మీయబడినిది ? "తదదోషౌ శబ్దార్థౌ సుగుణౌ వనలంకృతీ పునఃక్వాపి" అను నిర్వచనము ప్రకారము అనలంకృతములైన శబ్దార్థములకును కావ్యత్వము సిద్ధించును గదా.

లక్షణ గ్రంథములు అలంకార గ్రంథములని పేరు పడునప్పటికి అలంకారమను పదము కటకాంగదముల వంటిదను సంకుచితార్థమున రూఢికాలేదు. ఈ యర్థము వామనుని కాలమున ప్రారంభమయి మమ్మటుని కాలమునకు బాగుగ రూఢమైనది. అయినను తరువాతి వారుకూడ అలవాటువలన లక్షణ గ్రంథములను అలంకార గ్రంథములని వ్యవహరించు చుండిరి. కావ్య శోభాకరములైన హేతుగుణములన్నింటికిని అలంకారనామము సార్థకమగును.

భామహుని కాలమున, మాధుర్యము, ప్రసాదము, ఓజస్సు అను కావ్యశోభా హేతువులకు గుణములను పేరు రాలేదు. కావ్యమునకు శరీరసామ్యము తెచ్చిపెట్టిన యనంతరము సాదృశ్య పరిపూర్ణతకొఱకు, శరీరము, ఆత్మ, గుణములు, అలంకారములు మున్నగునవి పృథఃకరింప బడినవి.

కావ్యశోభాకరధర్మములు అలంకారములని దండిమతము. వామనుడు దండి యభిప్రాయము ననుసరించి యించుక మార్పుతో "కావ్యం గ్రాహ్యమలంకారాత్" అనియు "సౌందర్యమలంకారః" అనియు నిర్వచించెను. సౌందర్యము సౌందర్యాపాదక హేతువుల సమష్టి ఫలము. ఒక్క కటకాంగదములవలననే సౌందర్యము చేకూరదు.

వామనుని కాలమున గుణములకు ప్రాముఖ్యము కలిగినది. అలంకారములకు ప్రత్యేకత పొడచూపినది. కావ్యమునకు శోభ నాపాదించు ధర్మములు గుణములనియు తదతిశయ హేతువులు అలంకారములనియు గుణశూన్యమైన కావ్యము అలంకారయుతమయ్యు శోభావహము కాదనియు వామనుని యభిప్రాయము.

సంస్కృతలక్షణ గ్రంథములు క్రీస్తువెనుక నాలుగైదు శతాబ్దుల మధ్య ప్రభవించి క్రమక్రమముగ వ్యాపింపజొచ్చినవి. లక్షణ గ్రంథముల అధికారము హెచ్చిన వెనుక రచింపబడిన కావ్యములు చాలవరకు స్వతంత్ర రచనా విధానమును గోల్పోయి అలంకార గ్రంథములలోని లక్షణములకు ఉదాహరణ ప్రాయములైనవి.

లాక్షణికులు తార్కికులుగావున అలంకారములు వారి పృథఃకరణశక్తి ననుసరించియు, సూక్ష్మాతి సూక్ష్మ భేదగ్రహణ బుద్ధిననుసరించియు కాలక్రమమున పెచ్చు పెరిగినవి. మనము

ఏ మాట మాటాడినను అది యేదో యొక యలంకారమగును. అలంకారములు శరీరముకంటే భిన్నములని వానిని తీసివేసిన అసలు కవితా శరీరమె అదృశ్యమగును.

భరతముని కాలమున "ఉపమా రూపకం చైవ దీపకం యమకంతథా, కావ్యస్యైతేహ్యలంకారాశ్చత్వారః పరికీర్తితాః" అను ప్రమాణము ననుసరించి ఉపమ, రూపకము, దీపకము అను మూడు అర్థాలంకారములును యమకమను శబ్దాలంకారమును గుర్తింపబడినవి. రుద్రటుని కాలమున "వాస్తవ మౌపమ్య మతిశయః శ్లేషః" అను నాలుగు అలంకారములు గుర్తింపబడినవి. తర్వాత ఉపమాలంకారము బహువికారములను పొందినది.

"ఉపమైకా శైలూషీ సంప్రాప్తా చిత్రభూమికా భేదాన్, రంజయతి కావ్యరంగే నృత్యంతీ తద్విదాంచేతః-

అలంకారములు పరిమితపదజాలముతో అపరిమిత భావచ్ఛాయలను ప్రకటించుట కేర్పడిన భావ ప్రకటన సాధనములు. వాని రమణీయతకు కారణము భావగాఢత్వము, శబలత్వము; తన్మూలమున రసత్వమును.

వాల్మీకి కాళిదాసాది మహాకవులు ఉపమాలంకారమునే విశేషముగ వాడిరి. "ఉపమా కాళిదాసస్య" అను నానుడి లోకమున గలదు. ఉపమయె అన్ని యలంకారములకు మూలకందము. అలంకారములు కావ్యశరీరమునకు భూషణములను శాస్త్రీయ సాంప్రదాయానుసారముగ వచ్చు మాటలటుండనిచ్చి, భావ ప్రకటనమునకు సంబంధించినంత వఱకు అలంకార ప్రయోజనము నారయుదము. కవి చెప్పదలచుకొన్న భావము స్ఫుటముగ సూటిగ పఠిత హృదయమున ప్రవేశపెట్టుటకు ఉపమాద్యలంకారములు తోడ్పడును. కొంతసేపు తర్కించి విమర్శించి వివరించినగాని మననమునకు పట్టని విషయములు సైతము అలంకారద్వారమున సునాయాసముగ మనమున హత్తుకొనును.

"ఉప్పుకప్పురంబునొక్క పోలికనుండు
చూడజూడ రుచుల జాడ వేఱు;
పురుషులందు పుణ్య పురుషులు వేఱయా."

అరగంటసేపు ఉపన్యసించి వివరింపవలసిన విషయమును సాదృశ్యబలమున కవియొక వాక్యమున సాధించినాడు. భాషపొదుపునకు అలంకార మొక సాధనము.

భాషస్థూలము. భావములు సున్నితములు. ఏ భాషయందైనను పదజాలము పరిమితము. భావచ్ఛాయలపరిమితములు. కావున పరిమితపదజాలముతో అపరిమిత భావములను ప్రకటింపవలసియున్న యెడల ఏవో కొన్ని సంకేతములు, సమయములు, శబ్దశక్తులు అక్కఱనుబట్టి సహజముగ ఉద్భవించును.

కవిత్వము భాషకు అలంకారము. కావ్యము భాషాలత పూచిన నెత్తావిపూలగుత్తి; భాషాపయోనిధి మథింపగా పైకిదేలిన అమృతకలశము. కావ్యమునందు భాషయు భావప్రకటనము ఉత్తమస్థితి నందియుండును. కావ్యమున కవికి లోకోత్తర భావచ్ఛాయలు ప్రకటింపవలసిన యవసరము కలదు. కాని పదజాలము పరిమితము. ఈ భాషాలోపమును పూరించుటకై కవిపడిన బాధకు ప్రతిఫలముగ ఉపమాలంకారము పుట్టినది.

ఒకడు చలినీటిని తాకె ననుకొనుడు. ఆ నీటి చల్లదనమును గుఱించి ఆతడిట్లు చెప్పును : చల్లగానున్నవి. ఎక్కువ చల్లగా నుండెనేని ఎక్కువ - మిక్కిలి - చాలా - యెంతో అను విశేషణముల నుపయోగించును.

ఈ విశేషణములన్నియు సమానార్థకములె. తారతమ్య మంతగా స్ఫురింపదు. అయినను వాడనుభవించిన చల్లదనమును వర్ణించుటకు ఈ విశేషణములలో నొకటియు చాలదు. అంతటవాడు లోకానుభవజ్ఞానము వలన మిక్కిలి చల్లగానుండు వస్తువు మంచుగడ్డ యొకటి యున్నదని తెలిసికొని "ఈనీళ్ళు మంచుగడ్డవలె చల్లగా నున్నవి" అని చెప్పును. అంత కంటెను చల్లగానుండు నెడల, మంచుగడ్డ కన్న చల్లని వస్తువు నాతడెఱుగని యెడల, ఇక "చల్లని"యను పదమును సాగదీసి యుచ్చరించుచు ఆ పదార్థమును తాకినప్పుడు కలుగు ముఖవికారము నభినయించుచు " అబ్బ! యీ నీళ్ళు చల్ ల్ ల్ ల్ ల్ లగా ఉన్నవి" అని నొక్కిచెప్పును. ఇంతటి శీతలత్వమును ప్రకటింపగల పదము భాషలో రూఢియై యున్నయెడల అతడు సాదృశ్యసహాయము పొందవలసిన యవసరముండదు. కాని యే భాషయు ఎప్పటికిని అట్టి పరిపూర్ణత పొందజాలదు.

"అరవిందాలు గదోయి కన్నులు" అని కవియొక రమణీయవతి కన్నులను వర్ణించును. కవులు భావోద్రిక్త మానసులు. వారి దృష్టి భావరంజితము; శబలితము. అందు వలన సామాన్యులు చూడజాలని అంతర్లీన గుణసౌభాగ్యమును కవి దర్శించును. కవి ప్రకటింప దలచుకొన్న భావము లివి :- ఆమె కన్నులు విశాలముగ నున్నవి. కనుగ్రుడ్డు కొనల నాజూకైన యెఱ్ఱరంగు కలదు. కన్నులలో జీవకాంతి తొలకాడు చున్నది. తెల్ల వెలుగు పొడచూపుచున్నది. మెత్తదనము ఆర్ద్రత్వముగలదు. ఈ భావములన్నియు కవి వర్ణింపవలయునన్న ఒక సీసపద్యము వ్రాయవలసి యుండును. ఈ భావములన్నియు స్ఫురింపజేయు ఒక్కపదము ఏ భాషలోను ఉండదు. కావున కవి తాను వర్ణింపదలచుకొన్న గుణములన్నియు అరవిందమున నున్నవని తెలిసికొని యుండుటచేతను అరవిందముయొక్క అనుభవజ్ఞానము సామాన్యముగావునను "అరవిందాలు గదోయి కన్నులు" అని సంక్షిప్త లేఖనమున (Short hand) లిఖించినట్లు ముక్తసరిగ వర్ణించెను.

ఇట్టి సంకేతముల వలన భావముల యిమిడికయు భాషపొదుపును సిద్ధించును. పసుపు ఎఱుపు నీలము అను మూడు రంగులే ప్రధానములు. చిత్రకారుడు ఈ మూడు రంగులను మిశ్రమము చేయుటవలన వేలకొలది వర్ణచ్ఛాయలను సృజించును. కవియునట్లే పరస్పర భిన్న వస్తువులలోని గుణములను మేళవించి నూత్న సృష్టిని చేయును.

కావ్యకళకు చిత్రలేఖనమునకు దగ్గరి సంబంధముండినను వాహక భేదముల (Difference of medium) ననుసరించి వారి మార్గములు భిన్నములు. చిత్రకారుడు ఉపమానోపమేయములను మేళవించి లిఖించును. అనగా అరవిందములలోని వైశాల్యము నిగనిగ మొదలగు రమణీయగుణములను కన్నులలో మూర్తీభవించునట్లు చిత్రించును. వేఱుగా అరవింద పత్రములను కంటి ప్రక్కన వ్రేలాడ గట్టవలసిన యవసర ముండదు. చిత్రకారుడు రంగులు కలుపునట్లే కవి భావములను కలుపును; అట్టి భావసమ్మేళనము స్ఫురింపజేయుటకు ఉపమాద్యలంకారములను ఆశ్రయించును.

విరటుని గృహమునందు సైరంధ్రి వాలకముతో నున్న ద్రౌపదిపై కీచకుని మనసు లగ్నమైనది.

క॥ నా యున్నబాము దలపవ
యీ యొడ లీ చీర యిట్టి యేవపుజందం
బోయన్న, మదన వికృతిం
జేయుననుట యెంతయునే నిషిద్ధముగాదే.

అని ఆమె యెంత వారించినను కీచకుడు వినడు. వినజాలడు. కామోద్రిక్తమానసుడైన కీచకునకు ప్రకృతిలోని రామణీయకమంతయు సైరంధ్రిగా మూర్తీభవించినట్లు కనుపట్టినది. ఈ భావగాఢత్వము, తన్మూలమున గలిగిన రసతన్మయత్వము ప్రస్ఫుటము చేయుటకు తగిన భాష కావలయును. కీచకుడు ఆమె యడుగులను చూచెను. సామాన్య భాషలో వానిని వర్ణింపవలయునన్న, అవి మెత్తగను, యెఱ్ఱగను ఉన్నవని చెప్పవచ్చును. అట్లుగాక ఒకవేళ వర్ణించువాడు సహృదయుడైన యెడల అవి "శిరీషకుసుమ పేశలములు" అని వర్ణించును. ఈ మాటలేవియు కీచకుని హృదయమును ఉఱ్ఱూతలూచుచున్న ప్రగాఢ భావోద్రేకమున శతాంశమైనను ప్రకటింపలేవు. కావున కీచకుడే తన భాషతో ఆమెను వర్ణింపవలయును.

సీ॥ నెత్తమ్మిరేకుల మెత్తదనము దెచ్చి
యచ్చున బెట్టినట్లంద మొంది;
చక్రవాకంబుల చందంబు కొనివచ్చి
కుప్పలుచేసిన ట్లొప్పుమెరసి;

చందురునును కాంతికందేర్చికూర్చి బా
గునకు దెచ్చిన యట్లు కొమరు మిగిలి
అళికులంబుల కప్పుగలయంతయును దెచ్చి
నారువోసిన భంగినవకమెక్కి
అంఘ్రి తలములు కుచములు నాననంబు
కచభరంబును నిట్లున్న రుచిరమూర్తి
అనుపమానభోగములకు నాస్పదంబు
గాదె ..................

ఒక నెత్తమ్మిరేకుల మెత్తందనము చాలదు. లోకములోని నెత్తమ్మిరేకుల మెత్తందనము తెచ్చి కరువుపోసినగాని అతడు భావించిన మెత్తదనమునకు సరిపోదు. ఈ భావప్రగాఢత్వము ఇంతకన్న తక్కువగా చెప్పుటెట్లు ? సామాన్యమైన మాటలు చాలనప్పుడు కవికి అలంకారమే శరణ్యమని Newman వచించెను.

(Poetry) from living thus in a world of its own, it speaks the language of dignity, emotion, and refinement. Figure is its necessary medium of communication with man; for in the feebleness of ordinary words to express its ideas, and in the absence of terms of abstract perfection the adoption of metaphorical language is the only poor means allowed it for imparting to others its intense feelings (Newman).

దుష్యంతుడు కణ్వాశ్రమ ప్రాంతమున వేటాడుచు ఆశ్రమకురంగముపై విల్లెక్కుపెట్టు సమయమున వైఖానసు లిట్లనిరి.

*నఖలు నఖలు బాణాః సన్నిపాత్యో2య మస్మిన్*

*మృదుని మృగశరీరే పుష్పరాశా వివాగ్నిః ॥*

రాజులు మృగయా ప్రియులు, వేట యందు కరుణారహితులు కూడ. అట్టి వారిని మృగమును చంపవద్దనిన ప్రయోజనమేమి? రాజు హృదయమున కారుణ్యము పుట్టింప వలయును. ఈ మృగము మృదువైన శరీరముగలది. బాధకోర్వ జాలదు. బాణప్రయోగము చేయకుడు అని వైఖానసులందురేని రాజు సరకు చేసియుండడు. కాని మృదువైన మృగశరీరము పుష్పరాశికిని బాణము అగ్నికిని పోల్చబడినది. రాజా, నీవు జింకపై బాణము వేసిన పూలరాశిలో నిప్పు పెట్టినట్లెసుమా అని వైఖానసులు చెప్పినట్లైనది. రాజునకు తన క్రూర కార్యముయొక్క ఘోరత్వము హృదయమున సూటిగా నాటినది. జింక బ్రతికినది. కవి మృదు అను

విశేషణములోని సామాన్యభావముతో పుష్పరాశిలోని సుగుణములన్నియు మేళవించి అపూర్వమును హృదయంగమమునైన మార్దవమును మృగశరీరమును కాపాదింపజేసెను.

కంటి కగుపడని ఉపమేయమును అగుపడు ఉపమానముతో పోల్చుదుమేని భావమున కాలంబము దొరకి బోధ సులభమగును. "వాని మనస్సు కాసార జలమువలె స్వచ్ఛముగ నున్నది" మనస్సు అదృష్టము, జలము దృష్టము. ఉపమాన సహాయముచేత ఉపమేయము నూహింపగలము. ఇట్లుగాక విపరీతమయ్యెనేని ప్రయోజనముండదు. ఉపమానము ఆత్మ గుణసంయోగము వలన ఉపమేయమును శోభింప జేయునదిగ నుండవలయును.

తారకాభరిత గగనము, సముద్రము, మహోన్నత పర్వతపంక్తులు మున్నగు ప్రకృతి విశాల గభీర రమణీయ సృష్టులకు ఉపమానములు లేవు. అయినను కవులు వానిని అంతకంటెను తక్కువ రమణీయములైన వస్తువులతో సరిపోల్చియున్నారు. విశాలమైన దృశ్యమును మనస్సు ఆకళించుకొని అనుభవించలేదు. ఆ దృశ్యమునే చిత్రకారుడు పరిమితమైన భిత్తిపై చిత్రించినప్పుడు చూచి ఆనందింతుము. ఎందువలన? ప్రకృతి దృశ్యముయొక్క వైశాల్యము అనావశ్యకములైన వివరములు ఇందుండవు. ఆవరణము సంకుచితమగును. చిత్రము అన్ని మూలలు ఏకకాలమునచూచి ఆనందింపగలయంత పరిమితమైయుండును. కవులుకూడ కొంచె మించుమించు ఈ మార్గమునే యవలంబించిరి.

"సపది ముకులితాక్షీం రుద్ర సంరంభభీత్యా
దుహితర మనుకంప్యా మద్రి రాదాయ దోర్భ్యాం
సురగజ ఇవ బిభ్రత్ పద్మినీం దంతలగ్నాం
ప్రతిపథగతి రాసీద్వేగ దీర్ఘీకృతాంగః"

రుద్రసంరంభ భీతిచే కన్నుమోడ్చిన పార్వతిని హిమవంతుడు మోసికొనిపోవుటను కాళిదాస మహాకవి అద్భుతముగ వర్ణించెను. అద్రి పార్వతిని మోసికొని పోవుట ఊహించుట కష్టము. అద్రిని సురగజమునకును మూర్ఛపోవుచున్న పార్వతిని, పెళ్ళగించుటవలన యించుకవాడి దంతలగ్నమైన తామర తీవకును పోల్చి, పరిమిత దృశ్యముగ మార్చి అనుభవింపదగిన రమణీయతను, కవి సృజించినాడు. కాని

"అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా
హిమాలయో నామ నగాధిరాజః
పూర్వాపరౌ వారినిధీ విగాహ్య
స్థితః పృథివ్యా ఇవ మానదండః."

ఇందు హిమవత్పర్వతమును కొలగఱ్ఱకు పోల్చుటలో కవి ఏ విధమైన సౌందర్యమును నర్థించెనో నాకు గోచరించుట లేదు. -

కొన్ని సమాసములు అలంకారములు నిత్యపరిచితములయి యొకవిధమైన తిరస్కారభావము కొల్పుచుండును. పద్మనేత్ర, లతాంగి, శంపాలతాంగి అను సమాసములు కేవలము స్త్రీ పర్యాయపదములైనవి, పద్మనేత్ర యన్నంతనే యేదోయొక స్త్రీ యని దాటిపోదుము. కాని ఒక్క క్షణమైన ఆగి ఆ నేత్రపద్మముల సౌందర్యమును మన హృదయమున చిత్రించుకొనము. కావున కవిత్వములోని సౌందర్యమును మన మనుభవింపవలసినంత యనుభవించుట లేదు.

అలంకార తత్త్వమును వానిప్రయోజనమును గుర్తెఱిగినచో అలంకారము లావశ్యకములా కావా యను చర్చలకు దిగ నవసరములేదు. ప్రతిభావంతులగు కవుల రచనలందు అలంకారములు ఆవశ్యకములగు చోటుల అప్రయత్నపూర్వకముగనే దొరలును.

వాల్మీకి మహాకవికి పూర్వము అలంకార గ్రంథము లుండి యుండవు. క్రౌంచపక్షిశోకము హేతువుగా కవిత్వము శ్లోకరూపమున ప్రవహించినది. ఆయన యుపయోగించిన యలంకారములన్నియు భావ ప్రకటనావశ్యకతా సంభవములు, అలంకారశాస్త్రములు వ్యాప్తిలోనికి వచ్చినతర్వాత కొందరు కవులు కేవలము అలంకారముల వాడిరి. నీరసములైన వింత వింత యలంకారములు పుట్టినవి. ఉపమయొక్క ప్రయోజనము విస్మృతమైనది. పిరుదులు ఇసుకతిప్పలైనవి. వక్షోజములు కొండలైనవి. కేవలము ఆకృతిని సూచించు ఉపమానము లధమములు. రానురాను ఇట్టి వర్ణనములు కవితా సంప్రదాయము లైనవి.

అలంకారములు కుయుక్తులతో నిండిన మేదో వ్యాపారములు కావు. భావ ప్రకటనావశ్యకతయే అలంకారములకు ప్రభవము. ఇవి కటగాంగదములవలె శరీర బాహ్యములైన భూషణములు కావు.



# తెలుగు కవితలో క్రొత్త తెన్నులు

(ఈ వ్యాసము రెడ్డిగారి అసంపూర్ణ రచన. సాహిత్యాభిలాషులకు ఉపకరించునను ఉద్దేశముతో ఈ సంపుటిలో చేర్చినాము. - సం.)

పూర్వకాలమున మానవ సంఘమునందు మార్పులు చాల ఆలస్యముగ జరుగుచుండినవి. దేశములకు అన్యోన్య సంబంధము పరిమితముగా నుండుటయే దీనికి కారణమై ఉండవచ్చును. సంఘమున కలుగు మార్పులు వాఙ్మయమున కూడ కలుగుట సహజము. ఈ కాలమున పరదేశ గ్రంథబాహుళ్యమువల్లను వార్తాపత్రికల మూలమునను మార్పులు అనతికాలమున జరుగుచున్నవి. ఈ మార్పులు అనుకూలములా ? ప్రతికూలములా? అనిగాని ఆవశ్యకములా ? కావా? అనిగాని యోచించుటకు కూడ తడవులేదు. సుడిగాలిలో తగులుకొన్న యెండుటాకువలె మన సంఘము గింగిరీలు కొట్టుచున్నది. పరదేశమున మ్రోగు ప్రతిధ్వనికిని ఇచ్చట ప్రతిధ్వనులు పుట్టుచున్నవి.

జీవవిలసనము ఉన్నప్పుడు కదలిక ఉండుట స్వాభావికము. ఈ కదలిక రెండు విధములు. సోపానములను ఎక్కు కదలిక యొకటి; దిగు కదలిక మఱొకటి. మన వాఙ్మయ ప్రపంచమున నేడు జరుగుచున్న మార్పులు ఏ కదలికకు సంబంధించినవా అని నిర్ణయించుట అంత తేలికగా కనిపించుటలేదు. అయితే, కాలము మాత్రము అన్నిటిని తూర్పార పట్టును. పొల్లుగింజలు చెత్తాచెదారము గాలికి ఎగిరిపోవును. గట్టిగింజలు మాత్రము నిలిచి ఉండును, ఇది మానవులకు కొంత సంతృప్తి.

ప్రాణములేని యంత్రమునందు ఆజ్ఞాతృణీకరణము శాసనోల్లంఘనము లేదు. ఒక్కసారి తాళము త్రిప్పిన గడియారము ఏమి మార్పులేక 24 గంటలు నడచును. ప్రాణముకలిగిన జంతువులో ఇటువంటి యాంత్రిక ప్రవృత్తి లేదు.

నిర్బంధ విమోచనము భావదాస్య విముక్తికలిగిన ప్రథమ దశలో, స్వాతంత్ర్యము విశృంఖలత్వముగ భావింపబడును. విశృంఖలత్వము నాగరిక స్వాతంత్ర్యము కాదు. అది నయాగరా ప్రవాహ పాతమువంటి అసంయమిత శక్తి. దానిని నియమబద్ధము కావించినప్పుడే జనోపకారి యగును.

స్వాతంత్ర్యము నియమరహితమైనది కాదు. ప్రజాప్రభుత్వము (Democracy) శాసనబాహ్యమైనది కాదు. రెంటికిని నీతులు నియమములు బాధ్యతలు కలవు.

మానవుడు బహువిధములైన భోజన పదార్థములను జీర్ణించుకొని వానికంటె భిన్నమైన తన శరీరమును పోషించుకొనునట్లే ఒక జాతికూడ ఇతరదేశ నాగరకతలలోని ఉత్తమ

ధర్మములను తనలో జీర్ణింపజేసుకొని సాంఘిక శరీరమును పెంపుచేసుకొను చున్నది. తన దేహతత్త్వమునకు వికటించిన పదార్థములను వెడలగ్రక్కు చున్నది. ఒకప్పుడు ఇతర దేశములకు జాతులకు వాని పరిస్థితులకు అనువైన వెన్నో మనకు సరిపడక పోవచ్చును. ప్రతి జాతికి ఒక జాతీయ వ్యక్తిత్వమున్నది. జాతీయ సంప్రదాయములలో వేరు నాటుకొననిదే ఏదైనను చిరకాలముండదు.

1914వ సంవత్సరమున ప్రారంభమైన ప్రపంచ యుద్ధము ముగిసిన తర్వాత యుద్ధ విచ్ఛిన్నమైన యూరపు దేశమునందు ఎన్నో వాఙ్మయోద్యమములు, పుట్టగొడుగుల వలె పుట్టి పరిస్థితులు కొంచెము మారునప్పటికి, నశించినవి. వాని ప్రతిధ్వనులు మన దేశమున కూడ వినబడినవి.

చిత్రలేఖనమున 'క్యూబిజం' (Cubism) అను పద్ధతి ఫ్రాన్సు దేశమున పుట్టి ఇంగ్లాండు జర్మనీలకు వ్యాపించినది. 'క్యూబిజం' అనగా మనము చూచు ప్రతివస్తువు Cubes గా అగపడునట్లు చిత్రించుట. ఇది మన యింద్రియజ్ఞానమునకు అనుభూతికి అతీతమైనది. జగదేకమైన భావమును, సార్వజనీనానుభూతిని కవిగాని చిత్రకారుడుగాని వ్యక్తిగతమైన భావసౌందర్యముతో మేళవించి అందరకు రుచించునట్లు ఆకృతి బద్ధము చేయగలడు. కాని తనకు మాత్రమే అనుభూతమైన దానిని ఏ కవికూడ జగదేకము చేయలేడు. ఈ క్యూబిజము గతి కూడ అట్లే అయినది.

అస్టిగ్మాటిజం (Astigmatism) అను కంటిరోగము అందరకు లేదు. ఆ జబ్బు ఉండువారికి రస్తా హెచ్చుతగ్గులుగా కనబడును. అది రోగమని తెలియక, స్పర్శేంద్రియ జ్ఞానము కూడ లేనియెడల అట్టివానికి ప్రపంచము మిట్టపల్లములుగా కనపడును. అట్టివాడు చిత్రలేఖకు డయ్యేనేని తన చిత్రములలో సమతలముండదు. అట్టి చిత్రములను మనము మెచ్చుకొన జాలము. అది క్రొత్త ఉద్యమము కావచ్చును. కాని ఆ చిత్రములను మెచ్చుకొనుటకు మనకు కూడ అస్టిగ్మాటిజం అను కంటిజబ్బు రావలయును. కొన్ని ఉద్యమములు ఇటువంటి అసామాన్య ప్రకృతులకును కాలమునకును సంబంధించినవి. Cubism, Dadaism, Futurism, Impressionism అను చిత్రలేఖన పద్ధతులు కూడ abnormal psychology కి సంబంధించినవె. యుద్ధమునందు చూచిన రక్తపాతము, ఘోరత్వము మృత్యువు ఈలాటి మార్పులకు కారణమై యుండును.

True, it is a ghostly Company : Expressionistic and cubistic shapes, the forms of Futurism, moving and caught in movement; Picutres of horror and protest which have arisen out of the great Death of the War.

జర్మనీలో ఈ చిత్రముల సంత పెట్టినప్పుడు దానిని బహిరంగపఱచుచు అధ్యక్షుడు ఇట్లు చెప్పినాడు.

Cubism, Dadaism, Futurism, Impressionism and the rest have nothing in common with our German people. For all these notions are neither old nor are they modern. They are simply the artificial stammering of people whom God has denied the boon of genuine artistic talent and given instead the gift of prating and deception.

ఈలాటి విపరీత కళాచాపల్యము వారికే నచ్చలేదు. ఇక అటువంటి పరిస్థితులు లేని మనకెట్లు సంతోషము కూర్చును.

ప్రస్తుతపు మహాసంగ్రామము ముగిసిన తర్వాత కూడ శ్మశానవాటికయైన యూరపునందు విపరీతోద్యమములు పుట్టవచ్చును. ఈ యుద్ధమునందు ఇండ్లు ఆస్తులు ప్రాణములు జాతుల స్వాతంత్ర్యము నాశనమైనవి. వాఙ్మయము భగ్నము కాలేదు. అది మాత్రము ఎందుకు భగ్నము కాకూడదు అను భావములుగల ఒక వాఙ్మయ హిట్లరు పుట్టి యూరపున ఒక విపరీతోద్యమము లేవదీయునేని దాని క్రొత్తందనము వలన మన దేశమునందు కూడ ప్రతిధ్వనులు పుట్టును. ఎద్దు ఈనినదనిన గాటకట్టివేయుమని చెప్పుటయేకదా యిప్పటి మన పరిస్థితి. జాతీయ గౌరవము జాతీయ వ్యక్తిత్వము పరిస్ఫుటము కానంతవఱకు మనకీ యనుకరణ దురవస్థ తప్పదు.

అయినను కాలప్రవాహమున మార్పులు అనివార్యములు. ఆంధ్రుల సాంఘిక జీవనమునందు వాఙ్మయమునందు కొన్ని మార్పులు కలిగినవి. వీరేశలింగంపంతులుగారు ఇంగ్లీషు రచనా మర్యాదలను తెలుగులో ప్రవేశపెట్టిరి. గురజాడ అప్పారావుగారు, గిడుగు రామమూర్తి పంతులుగారు వ్యావహారిక భాషోద్యమమునకు మూలపురుషులైరి. ఇట్టి మార్పులు నేటికాలపు తెలుగు కవితలో పొడచూపినవి. విస్మృతమైన పల్లెపదాలు మరల చెలామణియైనవి. ద్విపదకు గౌరవము కలిగినది. క్రొత్తఛందస్సులు పుట్టినవి. ఆంగ్లేయుల కావ్య మర్యాదలు ఆకృతులు మన కావ్య పద్ధతులందు కొన్ని మార్పులు కలిగించినవి. ఖండకావ్యములు ప్రముఖములైనవి. కవితావస్తువునందు మార్పు కలిగినది. నవలలు ఉపకథలు పుట్టినవి.

ఆఫీసుకు పోవునప్పుడు కోటు బూటు హ్యాటు తగిలించు కొని యింటికి వచ్చినతర్వాత ఎప్పటివలె ధోవతి తుండు గుడ్డతో ఉండినట్లే ఈ మార్పులన్నియు బాహిరములే. కవితాంత రంగమున, కవితా మూల సూత్రములలో మార్పులు కలుగలేదు. ఏలయనగా అవి సార్వకాలీనములు. సార్వలౌకికములు.

ఈ మూల సూత్రము లెట్టివి ?

యథార్థమైన కవిత్వమునకు అనివార్యముగా ఛందస్సు అనుగతమౌను.

కవి ప్రతిభయే కవితకు ప్రాణము.

కవితా ప్రయోజనము సద్యః పరనిర్వృతి. తక్కిన ప్రయోజనములు ఆనుషంగికములు.

కవితయందు రసరామణీయకములు ప్రధానములు. తక్కినవి పోషకములు.

రసప్రతిబంధకములైన హేతువులు కావ్య దోషములు.

కవితాకళ జగదేకమైనది కావున దాని నిర్మాణ సూత్రములుకూడ జగదేకములుగ నుండును. ఈమూల సూత్రములకుకూడ ఈనాడు చేటుమూడు అవస్థ వచ్చినట్లు సూచనలగపడు చున్నవి.

రాజకీయ విషయములలో Democracy ప్రవేశించి జనసామాన్యమునకు మేలుచేసినది. అట్లే వాఙ్మయములోనికినీ ప్రవేశించినది. ఉపకారము కంటే అపకారమే చేసినది. ఎందుచేత? రాజకీయమైన Democracy నియమబద్ధము. వాఙ్మయములోని Democracy విశృంఖలము. ఆ డెమొక్రసి తప్పుత్రోవ త్రొక్కినపుడు అధికారముగల ప్రజాప్రతినిధుల చేతిలో కళ్ళెమున్నది. సరియైనదారికి త్రిప్పగలరు. వాఙ్మయములోని డెమోక్రసి తప్పుదారి పట్టినప్పుడు దానిని మరలించు కళ్ళెము చేతపట్టుకొన్న ప్రతినిధులులేరు. అందువలన ఈ డెమొక్రసీ యింతవరకు విశృంఖలముగానే ప్రవర్తించుచున్నది.

తెలుగు కవితలో నేడు జరుగు మార్పులలో ఛందోబద్ధముకాని వచనపు తుంటలను వ్రాసి దానిని కవిత్వమని నామకరణము చేయుట ఒక పెద్దమార్పు. ఈ నావెల్టి తెలుగులో క్రొత్తగా ప్రవేశించినది. ఈ కవిత్వము వ్రాయువారు, ఏడెనిమిదిమంది నవకవులు. మన దేశములో ఈ కవిత్వము కూడ ఒక ప్రతిధ్వని. ప్రతిధ్వనులు ప్రతిఫలించిన కాంతులు సారభూతములు కావు. అనుభూతి జన్యములును కావు.

అమెరికా దేశమున Walt Whitman అను నతడు Leaves grass అను గ్రంథమును రచించెను. దానికి Verse libre అని పేరు పెట్టినారు. అనగా Free verse-ఛందోబద్ధముకాని పద్యము. ఈ పద్యములు అమెరికాలోకంటె ఇంగ్లాండులో ప్రజల మనస్సుల నాకర్షించినవి. కారణమేమనగా, వానిలో ఛందస్సు లేనందువలన కాదు, అమెరికా దేశస్థుల Democratic భావములు సర్వమానవ సౌభ్రాత్రము విశాలమైన Cosmopolitanism ఆ పద్యములలో అద్దమునందు ప్రతిబింబమట్లు ఇంగ్లీషువారికి గోచరించినది. ఆభావములు అందర హృదయములను ఉద్ధరింపగల సమర్థములు. నేనా గ్రంథమును మొట్టమొదట చదివినప్పుడు మఱెంత రమణీయముగా నుండెడివో యని తలంచితిని.

Walt Whitman రచించిన కొన్ని పద్యములు లయాన్వితమై ఛందోబద్ధ పద్యములకు దాదాపునకు వచ్చుచున్నవి. హృదయములోని లయను మొదలంట యెవరు కోయగలరు? ఛందస్సునందు లయపుట్టును. లేక మనసులోని లయవలన ఛందస్సు పుట్టును. లయ కృత్రిమముగా కల్పించుకొన్న కవితోపకరణముగాదు. అది సహజము. కావుననే జగదేకము. ప్రపంచములోని అన్ని జాతుల భాషలలోను అక్షరబద్ధము కాని అనాగరిక భాషలందును కవిత్వము ఛందోబద్ధముగానే ఉన్నది. ఈ నియమము స్వాభావికము కానియెడల జగదేకత్వము సిద్ధింపదు.

ఇప్పటి పదార్థ విజ్ఞాన శాస్త్రజ్ఞులు కూడ Radiation, matter అనియు స్థూలముగా మన కంటికి కనబడు వస్తువులు కూడా bottled up radiations అనియు చెప్పుచున్నారు. ఈ radiation కాలావకాశ బద్ధములైన తరంగములుగ ప్రసరించును. ఈ అలలు లయాబద్ధములు. ఈ ప్రకృతియే లయాబద్ధము - లయసహజము. లయయొక్క శ్రుతి సుభగత్వమే ఛందస్సు.

కవితా విషయములందు మనలాక్షణికులకును యూరపియన్ విమర్శకులకును గమనింపదగిన భేదములు లేవు. Poetry is the rythmic creation of beauty అని అలన్‌పో అన్నాడు. Musical thought అని కార్లయిలు చెప్పినాడు. There is something magical in rythm. It even makes us believe that the sublime lies within our reach అని జర్మను కవి గెతె లయా సౌందర్యముల సాహచర్యమును వివరించినాడు. ఛందస్సు యథార్థమైన కవికి ఆటంకము కాదు. సహాయకరమె. హృదయములో నేమూలనో దాగియున్న భావములు ఉద్రిక్తములయి ఉత్తేజితములయి లయాశక్తి మూలమున ఉత్పతన క్షమములు కాగలవు. 'A metrical garb has in all languages been appropriated to poetry. It is but the outward development of the music and hormony within. The verse far from being a restraint on the true poet, is the suitable index of his sense and is adopted by his free and delibarate choice' అని ఛందస్సునకు కవి మనసులోని లయాశబ్ద సారస్యములకును గల అవినాభావ సంబంధమును Newman గారు వచించినారు.

ఛందస్సులేని పద్యము విన్నప్పుడు ఉప్పులేని చప్పిడికూరతో అన్నముతిన్నటు లుండును. శ్రుతిరంజకత్వము అభావమగును. ఆనందదాయక హేతువులలో ఒకటి లుప్తమయి మన ఆనందము పరిపూర్ణముకాదు. ఇంకను వీలైన యెడల ఆనందహేతువులను చేర్చుట న్యాయముగాని ఉన్నవానిని ఊడబెరుకుట సమంజసము కాదు. ఆపని చేయుటకు కవులే అవసరములేదు. ఏ అసమర్థుడు కూడ చేయవచ్చును.

రాయప్రోలు సుబ్బారావుగారు నవ్యకవులకు ప్రతినిధిగ రమ్యాలోకమను కావ్యనియమ గ్రంథమును రచించిరి. దానిలో

*ప్రాతవైనంతనే త్యజింపరు; నవీన*
*మయినమాత్ర వరింపరు; ప్రియములైన*
*హృదయ సేవ్యమానము లైనవెల్ల స్వీక*
*రించి భావాంబరమలంకరింతు రర్థి.*

*చిర యశః స్థాయిగొనిన ప్రాచీన సుకవి*
*వాఙ్మయమునను ఆకర్షవంతమయిన*
*రమ్యభావకలాపముల్, శ్రావ్యమైన*
*శబ్దరీతి విధానముల్ సంగ్రహింత్రు.*

*శీలమట్టుల నౌచితి చెదరనీక*
*అహివిధాన అశ్లీల మనాదరించి*
*ప్రేమమంత్ర మహోపాసనామయులగు*
*నవ్యుల కుపాధియయ్యె సౌందర్యమొకటె.*

ఈ రమ్యాలోకము సుబ్బారావుగారు ఉద్దేశించిన నవ్య కవుల Manifesto గా కనబడుచున్నది. శ్రీశ్రీగారు కూడ వారు ఉద్దేశించిన నవకవుల పక్షమున మరొక Manifesto ప్రకటించినారు. ఇది 'ఫిడేలు రాగాలడజన్'కు Intro గా ఉన్నది. Intro అంటే Introduction; ఈ రాగాలడజన్ అనునది ఛందోబద్ధముకాని పద్యముల సంపుటి. దీనిని రచించిన కవి మావాడె. Introలో సారాంశమేమనగా :

ఒక మాటకు ఒక అర్థం దీని న్యాయం. కాని యీ ప్రపంచంలో చూడండి. ఒక మాటకు పది అర్థాలు. ఒక అక్షరానికే లక్ష అర్థాలు. ఇక రెండో కొసను ఒక అర్థానికే కోటి పదాలు. ఈ అర్థాల నిరంకుశత్వం భరించలేదు నవకవి. వ్యాకరణం మాత్రం? వాక్యానికి కర్త కర్మ క్రియలు విధిస్తారుకదూ. వీటికి నవకవి విడాకులిస్తున్నాడు. కర్తలేకుండా ఒక క్రియమాత్రం నిరంకుశంగా విహరిస్తుంటే కొందరు కళ్ళు పొడుచుకొంటున్నారు. కాని కవి సర్వతోముఖ స్వాతంత్ర్యదూత, స్వేచ్ఛాదాత. విభక్తి విశృంఖలంగా షికారు పోవచ్చు. ప్రతిఫలం విచిత్ర సౌందర్యం. విచిత్రమే సౌందర్యం - సౌందర్యమే విచిత్రం.

ఛందస్సుల చండ శాసనానికికూడా కాలం వెళ్లిపోయింది. కవి హృదయంలో రాగాలపన ఎట్టి తీగలు సాగితే అదే గీతానికి ఆకారం నిర్ణయించాల. నవకవికి అనుకరణ అసహ్యం. ఇవన్నీ ఋణపక్షాన నవకవుల తిరుగుబాటు. వారు సాధించిన ధనం ఏమైనా ఉన్నదా అని ప్రశ్నిస్తారా చదవండి ఫిడేలు రాగాలడజన్.

శ్రీశ్రీగారు ఉద్దేశించిన నవకవులు ఒకరిద్దరు తప్ప శ్రీశ్రీగారితో సహ నాకు మిత్రులు. వారి సౌజన్యముపైన నాకు నమ్మకముకలదు. ఒకవేళ వారు "వచన పద్యాలనే దుడ్డుకర్రలతో పద్యాల నడుములు విరుగ దంతాము" అని నిరాఘాటముగా చాటినప్పటికిని వారిలో ఎవ్వరిలోను ఇటువంటి గడుసుదనము నాకు కనిపించలేదు. అందుచేత అభిప్రాయ భేదములు నాగరకుల స్నేహమునకు భంగము కలిగించవని నానమ్మకము.

రాయప్రోలు సుబ్బారావుగారి Manifesto లో సిద్ధాంతీకరింపబడిన కొన్ని విషయములను గురించి నాకు అభిప్రాయ భేదము లున్నప్పటికిని కవితావిషయమై వారు కావించిన నిర్ణయములను గురించి నాకు భిన్నాభిప్రాయము లేదు. అవి సర్వాంగీకార పాత్రములయి సాంప్రదాయికముగ అలవాటులోనున్న నియమములె. కవిత్వమున రస రామణీయకములు ఔచిత్యము ఉండ నక్కరలేదని యెవరు చెప్పరు. శ్రీశ్రీగారి నవకవులకంటె సుబ్బారావుగారి నవ్యకవులె తెలుగు దేశమున ఎక్కువగ నున్నారు. అందుకు వారి రచనలే సాక్షులు.

శ్రీశ్రీగారి Intro లో ప్రతి వాక్యము విమర్శకు పాత్రమగునంతటి బలహీనముగా నాకు గోచరించినది. ఒక అక్షరమునకు లక్ష అర్థములుండిన కవులకు ఏమీ యిబ్బందిలేదు. ఒక మాటకు పది పర్యాయపదములుండిన ఏమీ చిక్కులేదు. అవి అన్నియు వాడుకలో రూఢియైనవి కావు. నానార్థరత్నమాలను ముందు పెట్టుకొని ఏకవి కవిత్వము వ్రాయడు. పూర్వము శ్లేషకావ్యములు వ్రాయు దినములలో అట్టి నిఘంటువులు ఉపయోగపడి యుండవచ్చును. ఇప్పుడెవ్వరు శ్లేష కావ్యములు ద్వ్యర్థికావ్యములు వ్రాయుటలేదు. ఆ ప్రస్తావనయే అనవసరము.

నిఘంటువులో ఉన్నదన్న మాత్రమున కవి ఆ పదమును గ్రహింపడు. కవి గ్రహించుపదము శ్రవణ సుభగముగను తన భావము ప్రకటించునదిగను ఉండును. కావుననే తిక్కన "కావ్యంబు సరసులైన కవుల చెవులకు నెక్కిన గాని నమ్మడెందు పరిణతిగల్గు కవీశ్వరుండు" అని చెప్పెను. దీనిలో శబ్దసారళ్యము సౌకుమార్యము ధ్వనించుచున్నది. చెవికికూడ ప్రాధాన్యము. పింగళి సూరన "పొసగ ముత్తెపు సరుల్ పోహళించినలీల దమలోన దొరయు శబ్దములు గూర్చి" అని word hormony సూచించినాడు. నానార్థ నిఘంటువు లుండినందువలన, ఆంధ్రమహాభారతము భాగవతము మున్నగు గొప్ప గ్రంథములను రచించిన పూర్వకవులకుగాని నేటి కవులకుగాని ఏలాటి యిబ్బంది కలుగుట లేదు. నవకవులకుమాత్రము ఈ బాధ యెందుకు కలుగవలయును ?

ఒకవేళ నవకవులు నానార్థ రత్నమాలాది నిఘంటువులు మునిసిపాలిటీవారి చెత్తదిబ్బల

స్టోరు అని అనుకొను పక్షమున ఆ చెత్తదిబ్బలు మనము నడచు రాజమార్గమున లేవు. వానిని వెదకుకొని పోవువారికే కనబడును. ఆ చెత్తదిబ్బల భారము ఏకవియు మోయుటలేదు. అందులో నవకవులు తాము మోయుచున్నామనియు భరింపలేమనియు అనుకొందు రేని అది వారి భ్రాంతి.

వాక్యమున కర్త కర్మ క్రియల అనుబంధానికి నవకవి విడాకులిస్తున్నాడు. ఒక క్రియమాత్రం నిరంకుశంగా విహరిస్తే కొందరు కళ్ళు పొడుచుకోవడం ఎందుకని శ్రీశ్రీగారి ప్రశ్న. చిన్నయసూరిగారి బాలవ్యాకరణాన్ని దండిస్తామని నవకవుల ప్రతిజ్ఞ. చిన్నయసూరిగారిని విమర్శింపవలసిన భాగములు వేరేవున్నవి. అవి కర్త కర్మ క్రియలలో కాదు. ఆ పని దక్షులైన పండితులు పూర్వమే చేసియున్నారు.

మనుష్యులు అన్యోన్యము మాటలాడుకొనుటకు తమ భావములను వెల్లడి చేయుటకు భాష పుట్టినది. మనము వాక్యములతో మాటలాడుకొందుము. ఒక వాక్యమునకు కనీసము ఒక కర్త ఒక క్రియ ఉండుట అవసరము. ఈ నియమము అనుభవ జన్యమైన అక్కరవలన పుట్టినది.

ఒకప్పుడు ఇద్దరు మనుష్యులు మాటలాడుకొనునప్పుడు ఒక క్రియనే ఉపయోగించవచ్చును. "ఏంరా వస్తావా? అంటే "వస్తున్నారా" అనవచ్చు. అప్పుడు కర్త తేలికగా ఊహించుకొనబడును. మూడవ వానిని గురించి చెప్పునప్పుడు "వస్తాడురా" అని అంటే "ఎవడురా" అని రెండవాడు ప్రశ్నింపవలసి యుండును. "రాముడురా" అని మరల వీడు జవాబు చెప్పవలసియుండును. ఇట్టి సంశయము, కాలహరణము, ఇబ్బంది తొలగించుటకే ఒక వాక్యమున ఒక కర్త ఒక క్రియ అవసరమని చెప్పిరి. ఈ నియమము మన భాషకే కాదు. అన్ని భాషలలో నున్నది. ఈ నియమము ప్రాచీనము కాబట్టి నవకవులకు గ్రాహ్యముకాదని చెప్పుటకు వీలులేదు. కొన్ని నియమములు మనము వదల దలచుకొన్నను అవి వదలవు. ఈ నియమమును బహిష్కరించి శ్రీశ్రీగారి కోరిక ప్రకారము ఒక్కక్రియకే యేకచ్ఛత్రాధిపత్యము కట్టిపెట్టిన యెడల మన భాష మూగ చెవిటి వారి భాషయగును. ఇది క్రొత్త ఆవిష్కరణము కాదు. ఒక గొప్ప సిద్ధియు కాదు.

కవులకు భాషను పొదుపుచేయు గుణమున్నది. కవి ఎన్ని తక్కువ మాటలతో క్లిష్టాన్వయ దోషములేకుండ చెప్పగలడో అన్ని తక్కువ మాటలతో తన భావమును వెల్లడించును. అట్లు చేయలేనియెడల కవిదే దోషము. ప్రకరణమునుబట్టి కర్తనుగాని కర్మనుగాని ఊహించుకొనుట సులువైనయెడల వానిని పరిత్యజించును. "వచ్చెడువాడు ఫల్గుణుడవశ్యము గెల్తుమనంగ రాదు" అని తిక్కన వ్రాసెను. గెల్తుము అను క్రియ కర్మను అపేక్షించుచున్నది.

ఎవరిని గెల్తుము? పాండవులను. తిక్కన పాండవులను అని వ్రాయలేదు. ప్రకరణమునుబట్టి ఊహించుకొనవచ్చును.

పూర్వము సిద్ధమైయుండినవి చక్కగ తెలుసుకొనకపోవుటచేత నవకవులకు ఇట్టివి అపూర్వసిద్ధులుగ తోచును. ఇంతయేల ? శ్రీశ్రీగారు ఎంతవరకు తమ వాదమును ఆచరణలో పెట్టగలిగిరో తెలుసుకొనుటకు వారు రచించిన Intro ను ఉదాహరణముగ తీసుకొనవచ్చును. వారు తమ వాదము ప్రకారము పీఠిక యంతయు క్రియలతో నింపియుండిన ఇతరులు విమర్శింపవలసిన యవసరము ఉండియుండదు. ఏలయన ఆ భాష మనుష్యులకు అర్థముకాదు. శ్రీశ్రీగారు కూడ విభక్తి విశృంఖలముగా షికారు పోజాలనందుకు సంతోషము. విభక్తులు లేని వాక్యము లన్యోన్యసంబంధము లేని పదసమూహముగ తోచునేగాని భావము తెలుసుకొనుట దుర్లభము. తామే అనుసరింపలేని తియరీలను ఇతరులపై పారవేసి వారిని చీకాకుపెట్టుట యెందుకా అని నాచింత. అయితే దీనికొక సమర్థనమున్నది. నవకవులు, తమ కవిత్వమునకు తమకు ఏలాటి సంబంధములేదను నమ్మకముకలవారు కావున వారి తియరీలు ఒకవంక వారి రచనలు మరొకవంక నడువవచ్చును.

"కవులు స్వాతంత్ర్య దూతలు - స్వేచ్ఛా దాతలు." నిజమే. 'నిరంకుశాః కవయః' అనే పలుకుబడి పూర్వమునుండి వ్యాప్తిలోనున్నది. అయితే ఒక్క భేదము మాత్రము కనబడుచున్నది. పూర్వులది నియమబద్ధమైన స్వాతంత్ర్యము. మనవారిది అరాజకమైన విశృంఖలత్వము. కాళిదాసువంటి ప్రతిభాసంపన్నుడైన మహాకవికికూడ "ప్రాంశు లభ్యే ఫలేలోభా దుద్బాహురివవామనః" అని అడకువచేత తన గొప్ప తనమును తెలుపుకొనగా, ఒకటిన్నర పేజి చక్కగా వ్రాయలేని మాబోటివారము దుడ్డుకర్రలెత్తుకొని బయలుదేరి నడుములు విరుగదన్నామనడము, అహంభావ కవులమని కంచు గంట మ్రోగించడము - ఇదీ ఒక నావల్టిగానే కనపడుచున్నది. వారి సిద్ధులను విమర్శింతుమేని మిగులునది అహంభావమే. తక్కినది అభావమే.

నవకవికి అనుకరణ అసహ్యమని వారన్నారు. అనుకరణము నిస్సారమని అందరు ఒప్పుకొనతగిన విషయము, కాని వీరికి మనదేశపు కవులను అనుసరించడము అసహ్యము. పరదేశ కవుల ననుకరించడము పరమార్థము. ఈ వచన పద్యములు Walt Whitman పద్యముల కనుకరణము కాదని యెవరు చెప్పగలరు.

ఛందస్సుల చండశాసనానికి కూడా కాలం వెళ్ళిపోయిందని శ్రీశ్రీగారు వ్రాసినారు. ఇది కేవలం భ్రాంతి. పది సంవత్సరములకు పూర్వము భావకవి అని అనిపించుకొనుట ఒక గౌరవము. నాడు భావకవులమని యనుకొన్నవారుకూడ నేడు ఆపేరువహించుటకు

సిగ్గుపడుచున్నారు. ఇప్పుడు ఆ నావెల్టీ పోయినది. అంతే యీ నవకవుల వచనపద్యాల నావెల్టీకూడ. తెలుగుజాతి పరాయిది కానంతవరకు, తెలుగు వారి హృదయమున రసజ్ఞత నశించనంతవరకు, తెలుగు వారి సాంఘిక జీవన ప్రవాహమునకు గట్లుగా ఆంధ్ర మహా భారతము భాగవతము రామాయణము జీవించి ఉండునంతవరకు తెలుగు కవిత్వమునకు ఛందస్సునకు విరహము కలుగదు. ఎన్ని రాజ్యములు పుట్టిచచ్చినవి? ఎందరు రాజులు గతించినారు? ఎన్ని నాగరకతలతో మనకు సంబంధము కలిగినది? అయినప్పటికిని ఇప్పటివఱకు తెలుగువారము తెలుగువారముగానే ఉన్నాము. భాగవతము చదివినప్పుడు ఒడలు పులకరింపని ఆంధ్రు డుండడు. భారతము విని తలయూపని తెలుగువా డుండడు. ఇవి మన జాతీయసిద్ధులు. వీనిముందు తక్కిన నావెల్టీలు హనుమంతుని యెదుట కుప్పిగంతులు.

నారాయణబాబుగారు తాము రచించిన వచన పద్యములను ఒకతూరి వినిపించిరి. వానియందు ఈ ఫిడేల రాగాల డజన్‌లో వలెకాక, ఉన్నతములైన భావములుండినవి. ఆయనకు ఏపద్యమైనను చక్కగా చదువగల శక్తి కలదు. ఆ పద్యములందు ఒక దానితో నొకటి పొందిపొసగని లయాఖండములు (Mosaic of rythm) వినిపించినవి. ఛందస్సును త్యజించితిమంటిరే వీనిలో లయాఖండములు గోచరించుటకు కారణమేమని యంటిని. (వానిలో ద్విపద పాదములు, గీత పద్యముల తుంటలు కనబడినవి.) ఇవి అకాంక్షితముగ పడినవని వారనిరి.

గుడిపాటి వెంకటచలంగారు రాగాలడజన్‌పై అభిప్రాయము ఒక వచన పద్యమున వ్రాసిరి. ఆ పద్యము చదివినప్పుడు, వీరు ఛందోబద్ధముగ వచ్చు కవిత్వమును కేవలము నవత్వముకొరకు అవయవ విచ్ఛేదము చేసియుందురని నాయూహకు తట్టినది. నాయూహ యథార్థము కాకపోవచ్చును. ఈ నిదర్శనములు గమనింపుడు.

*వేయి కన్నీటిచుక్కల వేడిగాను,*
*చెవులఘోషించి కలవరపరచగలవు,*
ఇవిరెండును పరిపూర్ణముగ తేటగీతి పాదములు.
*వాడిఅయినట్టి కొనగోళ్ళతోడ (నొక్కి)*
*చురుకుమనునట్లు పెట్టిన (షోకులాడి)*

మొదటి పాదమున 'నొక్కి' అనియు రెండవ పాదమున 'షోకులాడి' అని చేర్చిన తేటగీతి పాదములగును.

*నూరువెక్కిరింపులనాలికల్ (గవెలికి)*
*దిక్కుదిక్కుల పకపకల్ (తేజరిల్ల)*

ఈ పాదములలో మొదటిదానికి 'గ వెలికి ' అనియు రెండవ దానికి 'తేజరిల్ల ' అని చేర్చిన తేటగీతి పాదములగును.

వీరి హృదయములలో దేవుడు ప్రసాదించిన లయాశక్తి ఉన్నది. నవత్వముకొరకు సహజశక్తిని అడగ ద్రొక్కి పరిపూర్ణమైన ఆకారమునందు అవయవములు ఛేదించి వీరు సాధించిన ఆ మహాప్రయోజనమేది? ఈ అపకారము వారికే కాదు, లోకమునకుకూడ. ఒక చిత్రమును యిరువయితుంటలుగ కత్తిరించి చీట్లప్యాకీ కలిపినట్లు కలిపి మరల మేజాపై నెరపిన ఒక అసంబద్ధమైన (dis - harmonious) చిత్రము కనబడును. ఈ విచిత్ర సౌందర్యమేనా ఛందో వైకల్యమునందు వీరు ఆశించునది?

ఈ నవకవులు రచించు వచనపు తుంటలకు పద్యములని ఎట్లు పేరువచ్చినది ? జామెట్రీవలన, ప్రోసు పేరాను లయిను ప్రకారము కత్తిరించి వివిధ పరిమితులుగా తుంటలు చేసి, ఒకదాని క్రింద నొకటి అతికించిన ప్రోసు,పొయెట్రీగా మారును. ఇది జామెట్రి కవిత్వము. ఈ కవిత్వమున, తిక్కన చెప్పినట్లు చెవి ప్రధానము కాదు, కన్ను ప్రధానము. ఇది తను భంగమువలన గద్యమూ కాదు. ఛందోవిరహితమై నందున పద్యమూ కాదు; త్రిశంకునివలె నడుమంతరమున వ్రేలాడుచు రెంటికిం జెడిన రేవడ యైనది.

ఎంతకాలమైనను తెలుగు కవిత్వమునకు ఆ వృత్తాలు ఆ సీస గీత పద్యములేనా వేరేమీ గతిలేదా యని యందురేని, కలదని నేను మనవిచేయుచున్నాను. క్రొత్త ఛందస్సులు ఆవిష్కరించుకొని కవిత్వము వ్రాయవచ్చును. అవి శ్రవణ సుఖముగా నున్నయెడల నిలిచియుండును. ప్రస్తారము వలన ఎన్నివృత్తములు పుట్టలేదు? అవి అన్నీ మన చెవికి రుచించుటలేదు. రుచించినవి మాత్రము నిలిచియున్నవి.

ఆడినదల్లా ఆటకాదు. పాడినదల్లా పాటకాదు. శిల్పము నకు సంయమనము (restraint) అవసరము. వీనియందు అటువంటిది కన్పించదు.

శ్రీశ్రీగారు నవకవులు సాధించిన మహాసిద్ధి యని తెలుగుదేశమునకు శిఫారసుచేసిన ఈ ఫిడేలరాగాల డజన్‌ను గురించి రెండుమాటలు. ఆ పుస్తకము చదివినప్పుడు నాకు కలిగిన భావమిది : యౌవన ప్రాదుర్భావ సమయమున కామోద్రిక్తుడయి "కామార్తాహి ప్రకృతికృపణా చేతనా చేతనేషు" అను కాళిదాసు సూక్తికి ఉదాహరణప్రాయుడయి వలపు పస్తులతో నవసి మతిచెడిన యువకుని ఉన్మత్త ప్రలాపములు (mad ravings) గా నాకు స్ఫురించినది. బుర్రా వెంకట సుబ్రహ్మణ్యంగారు చెప్పినట్లు ఒక్క Cleverness ఉన్నంతనే కవిత్వము కాదు.

---

# అభినవాంధ్ర సాహిత్యము

( శ్రీ కొంపెల్ల జనార్ధనరావు గారి సంపాదకత్వమున వెలువడుచుండిన 'ఉదయిని' పత్రికలో ఈ వ్యాసము ప్రకటింపబడినది.)

సంఘమునందును వాఙ్మయమునందును మార్పులు అనివార్యములు. అన్య నాగరకతా సంసర్గమను బాహ్య నిమిత్తమువలన మార్పులు అలక్షితముగ తలసూపుచుండును. ఒక వాఙ్మయము యొక్క బాగోగులు, మంచిసెబ్బరలు తెలిసికొనవలయునన్న దానికన్న భిన్న సంప్రదాయముననుసరించు మఱియొక వాఙ్మయముతోడి పరిచయము మనకుండవలయును. అద్వైతావస్థయందు తరతమజ్ఞానముండదు. మన దేశీయ వాఙ్మయములన్నియు ఏకసంప్రదాయ బద్ధములయి సంస్కృత వాఙ్మయమునకు ప్రతిబింబములుగ నుండినవి.

ఆంగ్లేయుల సంబంధమువలన పాశ్చాత్యనాగరకతతో మనకు పరిచయము కలిగినది. వారి వాఙ్మయము, వారి ప్రకృతి విజ్ఞానము మనదృష్టి నాకర్షించినవి. వారి పరిపాలనా పద్ధతి మనయందు స్వాతంత్ర్యేచ్ఛ పురికొల్పి జాతీయైక్యమును పెంపొందించినది. సంఘమునం దవతరించిన ఈ నూతన స్వాతంత్ర్య ప్రియత్వము రాజకీయ విషయములందే కాక వివిధ సాంఘిక చర్యలయందును తలసూపినది. కట్టుబాట్లకు లోనయి బహిర్వ్యాప్తిని కోల్పోయిన సర్జన శక్తులు నేడు సంకుచితావరణమునుండి వెలి కురికి ఆత్మోచిత కార్యకల్పనకు సిద్ధములైనవి. వాఙ్మయము సాంఘికజీవనముయొక్క ప్రతిబింబమే కావున సంఘమున చెలరేగిన ఈ సంచలనము, ఈ ఆందోళనము, ఈ స్వాతంత్ర్యేచ్ఛ దానియందు మాత్రమెట్లు ప్రకటితము కాకుండును ?

ప్రబంధములలోని పచ్చి శృంగారము నేటి యభిరుచులబట్టి మొరటుగ తోచినది. అందలి శబ్దాలంకారములు, భావప్రేరకములుగాక కేవలము బుద్ధిపరిశ్రమకు వినియోగపడు తెచ్చికోలు అర్థాలంకారములు "intellectual gymnastics" అని నిరసింపబడినవి. ఈ యసంతృప్తి ప్రతికూల విమర్శనముతోనే వ్యయమైపోక వాఙ్మయ నిర్మాణమునకు తోడ్పడినది. కందుకూరి వీరేశలింగం పంతులుగారు Vicar of Wakefield, Gulliver's Travels అను ఆంగ్లేయ నవలలను మానాగా పెట్టుకొని తెలుగు నవల రచనకు మార్గదర్శకులైరి. వారు షేక్స్పియరు నాటకములను తెనిగించిరి. నాటకములు, ప్రహసనములు, వ్యాసములు, ఖండకావ్యములు, కవిజీవితములు వ్రాసి పంతులుగారు ఆంగ్లేయ వాఙ్మయములోని కొన్ని రచనావిధానములను, సంప్రదాయములను తెలుగులో వెలయించిరి.

వాఙ్మయ రచనలలో కలిగిన మార్పులతోపాటు భాషా విషయములందు కూడ కొంత సంచలనము ప్రారంభమైనది. గ్రాంథిక భాష కృత్రిమమనియు సహజమైన వ్యావహారిక భాషలో

వ్రాయుట ఆవశ్యకమనియు గురజాడ అప్పారావుగారు, గిడుగు రామమూర్తి పంతులుగారు తలంచి అందుకు కావలిసిన మందుగుండు సామగ్రితో గ్రాంథిక భాషావాదులను ముట్టడించిరి. ఈ యుద్యమమునకు ఫలితముగ వ్యావహారిక భాషావాదములోని సహేతుకత్వమును ఇప్పుడు అందరున్ను అంగీకరింపక తప్పినదికాదు.

ప్రపంచ వాఙ్మయముల నెల్ల జీర్ణించుకొని తన శరీరమునకు కావలసిన నెత్తురు కండలుగ మార్చుకొనుటచేతనే ఆంగ్లేయ వాఙ్మయము నేడు అపరిమితముగ వృద్ధి చెందుచున్నది. విదేశ వాఙ్మయ సంబంధము నూత్న సృష్టికి ప్రతిబంధకము కాదు. ఒకవేళ అపూర్వసృష్టి ప్రేరకము కావచ్చును. ఇందుకు ఆంధ్రదేశమున సుమారు ముప్పది సంవత్సరములనుండి ప్రబలుచున్న అభినవ కవితోద్యమమె తగిన తార్కాణ. ఆంధ్ర కవుల ప్రతిభానర్తకికి నూత్న నాట్యరంగముల నేర్పఱచిన తప్పేమి ?

అప్పారావుగారి ముత్యాలసరములతో అభినవ కవితోద్యమము ప్రారంభమయినది. సంక్షుబ్ధసాగర కల్లోలములలో గాలివీచినట్లెల్ల కొట్టుకొని పోవుచున్న అభినవ కవితా నావకు కట్టమంచి రామలింగారెడ్డిగారు కర్ణధారులై నిలిచిరి. వారు రచించిన కవిత్వతత్త్వ విచారమను విమర్శన గ్రంథము ఈ నవీనోద్యమమునకు మార్గదర్శకమైనది. ఈ నవయుగ కవితా ప్రభాతముయొక్క ప్రథమరోచులు రాయప్రోలు సుబ్బారావు గారి కుటీర గవాక్షములో ప్రసరించి ఆయనను ప్రబోధించినవి. సుబ్బారావుగారు అంతకు పూర్వమే కవిత్వ మల్లుచుండిరి. ఆయన రచించిన 'లలిత' యను ప్రథమ కావ్యము శబ్దాలంకారయుతమై పూర్వ ప్రబంధ శైలిని తలపించుచున్నను, అందే భావకవితా పరిణామముయొక్క సూచనలు పొడకట్టుచుండినవి. ఆ కాలమున నెల్లరకు పూర్వ ప్రబంధములే పాఠ్యగ్రంథములు. అభినవ కవితకు మానా లేదు. ప్రతి కవియు సొంతమానాలు సృజించుకొనవలసియుండెను. ఒక సంప్రదాయము కరుడుకట్టిన వెనుక వ్రాయువారి కంతకష్టముండదు. పిఠాపురమున సుబ్బారావుగారు స్థాపించిన అభినవ కవితా గ్రంథమండలిని (లేక గ్రంథమాలయో నాకు జ్ఞప్తిలేదు.) గుఱించిన యొక కరపత్రమును పూర్వమొకప్పుడు సి.వి. కృష్ణయ్యగారి యొద్ద నేను చూచితిని. ఆంగ్లేయ సాహిత్యములోని పేరిన తేనెగడ్డలను అభినవాంధ్ర కావ్యములలోనికి తెచ్చుట ఆ గ్రంథమండలి యుద్దేశములలో నొకటియని అందు వ్రాయబడి యుండినది. ప్రథమమున సుబ్బారావుగారి యుద్దేశ మెట్లుండినను తరువాత వారు రచించిన కావ్యములు స్వతంత్ర సృష్టులనియే చెప్పవలయును. ఆయన వెనువెంటనే ఆమార్గ మవలంబించిన వారు అబ్బూరి రామకృష్ణారావుగారు. 1915, 1916 మొదలు పింగళి లక్ష్మీకాంతం, వెంకటేశ్వరరావుగార్లు, విశ్వనాథ సత్యనారాయణగారు, వెంకటపార్వతీశ్వర కవులు, శివశంకరశాస్త్రిగారు, కృష్ణశాస్త్రిగారు మఱి యింక కొందఱు ఈ నవీనమార్గము నవలంబించిరి. తరువాత క్రమక్రమముగ ఇప్పుడు

వ్రాయుచున్న కవులందఱు కొద్దిగనో గొప్పగనో స్వతంత్రముగనే రచించుచున్నారు. వీరందఱు ఏక మార్గావలంబకులయ్యును వ్యక్తిగత శిల్పపరిపాకము ననుసరించి రచనలలో తారతమ్యము గోచరించును.

ఈ అభినవ కవితోద్యమ ఫలితముగ కొంత పునరుద్ధరణము, కొంత నూతన సృష్టి కొనసాగినది. "ద్విపద కావ్యంబు ముదిలంజ....." అని తిరస్కరింపబడిన ద్విపదలు, పల్లెపదములు, పునర్గ్రహణ యోగ్యములైనవి. ఖండకావ్యములు, గేయములు, నవలలు, నాటకములు, ఏకాంక నాటికలు, ఉపకథలు, వ్యాసములు పుట్టినవి. ఇవి యన్నియు తెలుగువాఱికి నూత్నాలంకారములే. ఈ ఇరువది యైదు సంవత్సరములనుండి పుట్టిన వాఙ్మయము విమర్శించుటకు తగినంత విరివిగా నున్నది. ఏ సమర్థుడైనను నిష్పక్షపాత బుద్ధితో ఈ వాఙ్మయమును విమర్శించినయెడల చాల ఉపయోగకరముగ నుండును.

అభినవ కవిత్వమును గుఱించి యిప్పుడిప్పుడే కొన్ని యాక్షేపములు, ప్రత్యుత్తరములు బయలుదేరు చున్నవి. కాని, ఆక్షేపములవలెనే ప్రత్యుత్తరములు కూడ మూకఉమ్మడిగనున్నవి. ఈ కాలమున వ్రాయబడునదంతయు చెత్తయని తృణీకరించుట యెంత అసమంజసమో ఈ నాటి రచనలన్నియు మహోత్కృష్టములని ప్రశంసించుటకూడ నంత యవిచారమూలకమె. బాగోగులు ఒక వర్తమాన కాలమునకే సంబంధించినవి కావు. చెత్త వ్రాసిన వారు పూర్వముకూడ కలరు. అయితే ఆచెత్తకును మనకును నూరులకొలది సంవత్సరముల అంతరమున్నది కావున, ఆచెత్త యంతయు క్రుళ్ళి కాలప్రవాహమున కొట్టుకొని పోయి అంతస్సారముగల యేకొన్ని కావ్యములో నిలిచినవి. ఎచ్చటనో దాగియుండిన చెత్తలు పురాతనములన్నంత మాత్రముననే అచ్చొత్తింపబడినవి యిప్పటికిని మనకు దొరకుచునే యున్నవి. ఈ కాలమున వ్రాయబడున దంతయు బ్రతికియుండునని యెవరు చెప్పగలరు? ఈ సంశయము కాలమే తీర్పగలదు. ప్రతిభావంతులగు కవులు ఏకాలమందైన నుందురు. అయితే వారిమార్గములు భిన్నములుగ నుండవచ్చును.

పోలవరపు రామబ్రహ్మముగారు 'ప్రజామిత్రలో' ఆధునిక కవిత్వమును విమర్శించిరి. వారి విమర్శలో కొంత సత్యమున్నది. కొంత తొందరపాటు, కొంతపొరపాటుకూడ ఉన్నది. వీరికి వడ్డాది సుబ్బరాయుడుగారు మున్నగు పెద్దకవులతో ఏలాటి తగాయిదా లేదు. రాయప్రోలు సుబ్బారావు రామకృష్ణారావుగార్ల కావ్యములతో గూడ వీరికేలాటి యిబ్బందిలేదు. కాని ఇతర కవులు రచించిన కావ్యములన్నియు చెత్తలని వీరభిప్రాయపడిరి. సుబ్బారావు, రామకృష్ణారావుగార్ల కావ్యములను మెచ్చుకోగలవారు తదితరులు వ్రాసినదంతయు చెత్తయని యెట్లుతలంచిరో నాకు బోధపడుటలేదు. వారి కావ్యములలో నున్న గుణములును దోషములును తక్కినవారి కావ్యములలోకూడ నున్నవి. పింగళి లక్ష్మీకాంతం వెంకటేశ్వరరావుగార్ల 'సౌందర నందనము',

విశ్వనాథ సత్యనారాయణగారి 'ఆంధ్రప్రశస్తి' శివశంకరశాస్త్రిగారి 'హృదయేశ్వరి', కృష్ణశాస్త్రిగారి గీతములు, వేదుల సత్యనారాయణశాస్త్రిగారి ఖండకావ్యములు, జాషువాగారి 'ఫిర్దౌసి', నాయని సుబ్బారావుగారి మాతృగీతములు, సుబ్బారావుగారి 'హంపీక్షేత్రము', బసవరాజు అప్పారావుగారి గేయములు, నండూరి సుబ్బారావుగారి యెంకిపాటలు, కుందుర్తి నరసింహారావుగారి 'పంపాసరస్సు' (ఇదియొక ఖండకావ్యము),బొడ్డు బాపిరాజుగారి 'విపంచి' యే వాఙ్మయమునకైన అలంకారప్రాయములుగ నుండగలవు. మచ్చునకుగా కొందఱి కవులను, వారికావ్యములను పేర్కొంటిని. చక్కగా కవిత్వము వ్రాయగల కవులు ఇక నెందఱో నేడు ఆంధ్రదేశమున నున్నారు. ఈ రచనలన్నియు చెత్తని చెప్పుటకు రామబ్రహ్మముగారు సాహసింతురా? అట్లు సాహసింతురేని వారి యభినవ కవితా పరిచయము 1916వ సంవత్సర పర్యంత మనియే మన మూహింప వలయును. అట్లు గానిచో వారి సహృదయత్వమును మనము శంకింపవలసి యుండును.

రామబ్రహ్మముగారు చూపించిన కావ్యదోషములు నేటి కవిత్వమున కానవచ్చుచున్నవి. దూరాన్వయము, క్లిష్టాన్వయము, అర్థము బోధపడని పదములకూర్పు, నిరర్థక పదాడంబరత్వము, భావప్రకటనము చక్కగా చేయులేని గజిబిజితనము, మున్నగు కావ్యదోషములు ప్రత్యేకముగ ఆయాకవికి సంబంధించిన రచనాలోపములే కాని అవియెల్ల అభినవకవితకు లక్షణములు కావు. కవి మనస్సులోని భావము స్ఫుటముగా ప్రకటించుటకు తగినంత తీవ్రము కాకపోవుట చేతను, భాషపై కావలసినంత ప్రభుత్వము లేకపోవుట చేతను భావోచితమైన పదమును వెదకికొన లేకపోవుట చేతను ఇట్టిదోషములు కలుగుచుండును. స్వాతంత్ర్యము చేకూరిన వెంటనే సంప్రదాయములమీది ప్రమాణగౌరవము నశించును. అట్లు నశింపనిదే.నూత్న సృష్టిని పురికొల్పు సాహసమలవడదు. ఒకొక్కప్పుడు మనము స్వాతంత్ర్యమును దుర్వినియోగ పఱచుచుండుటయు కలదు. స్వాతంత్ర్యము దుర్వినియోగపడునను భయముతో పారతంత్ర్య మనుభవించుట భావ్యము కాదు. తప్పులు చేయనిదే యొప్పులు నేర్చుకొనము. ఒక నూత్న సంప్రదాయము కరుడుగట్టు ప్రథమదశయందు యిట్టి దోషము లుప్పతిల్లుచుండును. రవీంద్రనాథ టాగూరుగారు కవిత్వము వ్రాయ ప్రారంభించిన కాలముననే నూత్నసంప్రదాయము కూడ అంకురించుచుండినది. దానికి టాగూరుగారుకూడ కొంతవఱకు బాధ్యులు. ప్రథమమున వీరు వ్రాయుచుండిన బంగాళీ కవిత్వము అర్థమగుటలేదని అందఱు గోలపెట్టిరి. ఇప్పుడు మన కవిత్వమున గోచరించు దోషములు అప్పుడు ఆయన కవిత్వములో కూడ దొరలినవి. దీనిని గుఱించి తన "జీవనస్మృతి" యందు కొంత సమర్థించిరి.

ఈ సందర్భమున అభినవకవుల కష్టములను గూడ మనము గుర్తింపవలయును. వార్తాపత్రికల మూలమునను, వివిధ గ్రంథబాహుళ్యము వలనను నేడు ప్రపంచమంతటితో మనకు సంబంధమున్నది. కావున మన భావములుకూడ విరివియైనవి. మన భాష మన

భావములతో పాటు వృద్ధిపొందలేదు. " New phraseology to express new ideology" అన్నట్లు, కొత్తభావములను, అందలి తరతమ చ్ఛాయలను వెలిపుచ్చుటకు క్రొత్తరకపు పదముల కూర్పు ఆవశ్యకమగును. కవి యొక్క భాషాప్రభుత్వము, పదములు కూర్చు నేర్పు ఇట్టి యెడ నుపకరించును.

భాష యెప్పటికిని భావములకంటె వెనుకపడియుండును. భావములు మాఱినంత సులువుగా భాష మాఱదు. అయినను కార్యకుశలుడు కొఱముట్లులేని లోపమును ఎట్లో పూర్తిచేసికొనును. ప్రతిభావంతులగు కవులు, గ్రంథకర్తలు జన్మించి సమకాలీన భాషను సమకూర్పునేర్పుచేత వివిధ భావ ప్రకటనార్హముగ నొనరింతురు. పదజాలము సంకుచితమయ్యున్నను కవి ఆవశ్యకమును బట్టి ఒక యింద్రజాలముపన్ని భాషా దారిద్ర్యమును అతిక్రమించును. పూర్వమునుండియు కవులు కావ్యములలో ఉపమాద్యలంకారములను వాడుచున్నారు. భామహునికాలమున నాలుగు అలంకారములె గుర్తింపబడినవి. కాని క్రమక్రమముగ విమర్శకుల పృథక్కరణ శక్తివలన అలంకారములు పెక్కులయి మనమువ్రాయు ప్రతి వాక్యము, సమాసము, ఏదో యొక యలంకారము క్రిందికి వచ్చునట్లైనది. కాని మొట్టమొదట ఈ యలంకారముల నుపయోగించిన కవి, అవి యలంకారములని, కవితకు మెఱుగుపెట్టుటకుగా వాని నుపయోగించుచున్నానను జ్ఞానముతోకాక, తాను ప్రకటింపదలచిన భావ తీవ్రతను మొక్కవోక స్ఫురింపజేయుటకు పడిన కడగండ్లే యీ యలంకారములని నా యుద్దేశము. తాను చెప్పదలచుకొన్న భావమునకు ఉచితమైన పదము భాషలోనుండిన ఈ యుపమాద్యలంకారములకు అవసరముండదు. భాషకు సహజమైన లోపమె యీ యలంకారములకు మూలము. ఒక యుదాహరణము చూడుడు.

నఖలు నఖలు బాణః సన్నిపాత్యోऽయమస్మిన్

మృదుని మృగశరీరే పుష్పరాశా విహాగ్నిః.

దుష్యంతుడు ఆశ్రమ మృగమును తరుముకొని వచ్చుచుండగా కణ్వశిష్యులుచూచి దానిని రక్షింపనెంచి, "ఓ రాజా, యిది యాశ్రమ మృగము, దీనిని చంపదగ"దని చెప్పిరి. ఆశ్రమ కురంగమని బెదరు పెట్టినంతనే సార్వభౌముడు భీతిల్లి దానిని వదలునా ? దుష్యంతుడు మృగయాప్రియుడు. వేటాడుటకొఱకే వచ్చెను. జీవహింస క్షత్రియులకు క్రొత్తదికాదు. కావున వైఖానసులు ఎట్లయిన రాజు హృదయమును కరుణార్ద్రము కావించి మృగమును రక్షింప వలయును. అట్టియెడ "మృదువైన మృగశరీరమునందు బాణము ప్రయోగింపవలదు" అని బ్రతిమాలిరి. మృదువు అను విశేషణము బాధ నోర్చుకొనలేని కోమలత్వమును స్ఫురింపజేయునుగాని, ఎంతసుకుమారమని వైఖానసుడు చెప్పిన రాజు హృదయము

అర్ధమగునో అంత సౌకుమార్యమును స్ఫురింపజేయుట కీ విశేషణము చాలదు. కావున వైఖానసుడు ఆభావ తీవ్రతను, సాంద్రతను ఇట్లు ప్రకటించెను : రాజా, నీవు మృగముపై బాణము వేయుదువేని పూలరాశిలో అగ్గి పెట్టినట్లే! పూవులు చాల పేశలములైనవి. తాకిన కందిపోవునవి. తలనిడికోదగినవి. తన ప్రేయసి ధరియించునవి. తాను ప్రణయ బహుమానముగ గొన్నవి. దేవుని పూజించుట కర్హమైనవి. ప్రకృతి దేవీదరహాసముల వంటివి. మనోహరములైనవి. ఇట్టి పూలకు నగ్ని రగిల్చినట్లగునా ! ఈ కార్యము క్రూరము ఘోరము. ఎంత కర్కశాత్ముడైనను ఈ కార్య మొనరింపడు. ఇక సరసుడైన దుష్యంతుని మాట వేఱ చెప్పవలయునా ? ఈ సాదృశ్య ప్రభావము "మృదువు" అను విశేషణము అంతకు పూర్వము స్ఫురింపజేయలేని యెన్నో భావములు ఇప్పుడు దానికి సంక్రమించినవి.

కవి గాఢమైన తన రసానుభూతిని చెక్కు చెదరనీయక పఠితల హృదయముల స్ఫురింపజేయును. భావమునకు భాష కేవలము సంజ్ఞా మాత్రమె. ఒక్కొక్కప్పుడు మనము భావించిన దొకటి, ప్రకటించిన దొకటిగా ఏర్పడును. ఏలయన, భావము సున్నితమైనది. భాష స్థూలమైనది. కావున దీనికొక Momentum కలదు. ఇందుకు ప్రతీకారముగ భావము తీవ్రతరముకానిదే భాష భావమునకు లొంగదు. కవి యుపయోగించు సంజ్ఞలు పఠితలకుగూడ తెలిసినవిగనో తెలిసికొన తగినవిగనో యుండవలయును. పదమునకు నిఘంటువు ప్రసాదించు అర్థమునకంటె వేఱు శక్తులుకూడ కలవు. ఆ శక్తుల యన్నిటిపైనను కవి యాధారపడి తన భావమును స్ఫురింపజేయును. తన భావము ఇతరుల కెఱుకపడనియంత క్లిష్టసంజ్ఞలతో ప్రకటింపబడియున్న ఆ పద్యము మూగ చెవిటి వారల సంభాషణమువలె వ్యర్థమగును. కావ్య ప్రయోజనమందు శూన్యమగుటవలన దానికి కావ్యత్వహానికూడ సిద్ధించును. F.T.Palgrave గారు "Golden Treasury" అను ఖండకావ్య సంపుటమునకు తాను రచించిన యుపోద్ఘాతమున నిట్లు వ్రాసియున్నారు :-

'.......... that passion, colour, and originality can not atone for serious imperfections in clearness, unity or truth.'

కావ్యమునకు ముఖ్యమైన గుణములలో భావ స్ఫుటత్వమొకటి యని ఈ విమర్శకుని యభిప్రాయము.

భావములు వాచ్యములుగనె యుండవలయునా? వ్యంగ్యముగ నుండకూడదా ? అని కొందఱు ప్రశ్నింపవచ్చును. భావస్ఫుటత్వము వ్యంగ్య మర్యాదకు విరోధికాదు. ప్రకరణార్థము గోచరించుచునే తదతిరిక్తమైన వేఱొక భావము స్ఫురించవచ్చును. క్లిష్టార్థ సమన్వితములైన పద్యములను దీసికొని యవి వ్యంగ్యప్రధానములని సమర్థించుట ఇప్పుడొక యాచారమైనది. ధ్వని ప్రధానములని యెన్నబడు సంస్కృత శ్లోకములలో ప్రకరణమునకు

సంబంధించిన యర్థము సులభ గ్రాహ్యముగనే యుండును.

రామబ్రహ్మముగారు బూతు కథల విమర్శించిరి. వీరికి బూతుకథలపై గలిగిన ఆగ్రహము అభినవసాహిత్యము నంతటిపై ప్రసరించి వారి విమర్శనమునకున్న విలువను తగ్గించినది. బూతుకథలు వెలువడుచుండుట యథార్థమేగాని అభినవ సారస్వతమంతయు ఈ బూతులుతప్ప మఱి యింకేమి లేదని చెప్పుట ఆ సాహిత్యము తోడి వీరి పరిచయ మెంతపాటిదో మనకు గోచరించుచున్నది. మున్నటివైనను నేటివైనను బూతులు బూతులే. నాగరకాభిరుచిగలవారికి అట్టి కథలు ఏవము పుట్టించును. అట్టి కథకులు ఏ స్త్రీలను సంస్కరించుటకు (గిరీశమువలె) ప్రయత్నించుచున్నారో ఆ స్త్రీల ఆత్మగౌరవమునకే అట్టి కథలు సంగకారులుగ నున్నవి. కథలు వ్రాయువారందరు ఇట్టి బూతుకథలే వ్రాయుట లేదు. ఇట్టికథలు ప్రచురించుటకు రెండు, మూడు మాసపత్రికలె కంకణము కట్టుకొన్నవి.

"సుబోధిని" పత్రికయందు "నవకవులు - బూతుకవనము" అని రామబ్రహ్మముగారు రచించిన వ్యాసము, "ప్రజామిత్ర"లోని వ్యాసముకన్న మఱింత తీవ్రమై బూతుకథలలో వారికిగల పరిచయమును సార్థకపఱచుచున్నది. నవకవులెవ్వరును బూతుకవనము వ్రాయుటలేదు. వారి కవిత్వములోని శృంగారము సభ్యముగను నాజూకైన యభిరుచిగలదిగ నుండును. కవిత్వము వ్రాయువారి సంఖ్య చాల తక్కువ. వారి కథలలో గూడ బూతులేదు. అందులో ఒక్కరు మాత్రము అట్టి కథలను వ్రాయుచుందురు. ఇక మీదనైనను రామబ్రహ్మముగారు విషయ పృథక్కరణమునందు కొంతపరిశ్రమ చేయుదురుగాక యనియు, అభినవ కావ్య సాహిత్య పరిచయము కలిగించుకొందురుగాక యనియు నా మనవి.

# చిత్రలక్షణము *

(శ్రీ పి.వి. రాజమన్నారుగారి సంపాదకత్వమున వెలువడుచుండిన 'కళ' అను మాసపత్రిక యందు, ఈ వ్యాసము ప్రకటింపబడినది. -సం.)

తొమ్మిది సంవత్సరములకు పూర్వము బెర్తోల్డు లౌఫర్ (Berthold Laufer) అను నొక జర్మను పండితుడు టిబెట్ దేశపు "తాంజుర్" గ్రంథమాల నుండి "రెమొఈశాన్యి" లేక "చిత్రలక్షణము" అను నొక శిల్పశాస్త్రమును జర్మను అనువాదముతోడ ప్రకటించెను. గ్రంథమునందలి విషయమును సంక్షేపముగ క్రింద వివరించు చున్నాను.

టిబెటు దేశమున బౌద్ధధర్మము ప్రతిష్ఠింపబడిన యనంతరము, ఆ దేశపు భాషలోనికి చాల సంస్కృత గ్రంథములు తర్జుమా చేయబడినవి; ఇట్టి పుస్తకములతోడ 'కాఃజుర్', 'తాంజుర్' అను రెండు గొప్ప గ్రంథమాలలు సమకూర్పబడినవి. ప్రస్తుతము మేము పర్యాలోచించు గ్రంథము "తాంజుర్"గ్రంథమాలలోనిది.

పై గ్రంథమాలయొక్క సూత్రవిభాగమున 123 -వ ఖండమందు నాలుగు శిల్ప శాస్త్రములు గలవు. అవి యేవన :-

1) దశతలన్య గ్రోధపరిమండల బుద్ధ ప్రతిమా లక్షణము.
2) సంబుద్ధభాషిత ప్రతిమాలక్షణ వివరణము.
3) చిత్రలక్షణము.
4) ప్రతిమా మానలక్షణము.

మరల చిత్రలక్షణము మూడధ్యాయములుగ విభజింపబడియున్నది. కడపటి యధ్యాయమున పలు తెఱగులైన కొలతలను గుఱించియు గ్రంథకారుడు వివరించి యున్నాడు. ముప్పదియారు విధముల నయనభంగుల వర్ణనమందు గలదు. ఆ యధ్యాయమందె చిత్రశిల్ప పద్ధతిని గుఱించియు చెప్పబడియున్నది. ప్రథమాధ్యాయమందు చిత్రవిద్యయొక్కయు చిత్రలక్షణమను గ్రంథముయొక్కయు నుత్పత్తి వర్ణింపబడినది. ద్వితీయాధ్యాయమునందు చిత్రవిద్యయొక్క దైవిక సంబంధపుగాథ వ్రాయబడినది. మొదటి రెండధ్యాయముల చివర "నగ్నజిత్ కృత చిత్ర లక్షణము" లని గ్రంథ రచయితపేరు తెల్పబడియున్నది.

---

* చిత్రలక్షణమను శీర్షికతో, వంగసాహిత్యపరిషత్ పత్రికయందు రవీంద్రనారాయణ ఘోషుగారొక వ్యాసమును ప్రకటించిరి. అందలి ముఖ్య భాగమును సంకలించి రామానంద చట్టోపాధ్యాయగారు 'ప్రభాసి' చైత్రసంచికయందు ప్రకటించిరి. దానిని "కళ" కొఱకు నేను తెనిగించితిని. - దు. రామిరెడ్డి.

మొట్టమొదట భూలోకమున చిత్రవిద్యను సృజించి నది నగ్నజిత్తు అను నొక రాజు. పూర్వకాలమున, యశస్వియు, ధార్మికుడునయి భయజిత్తు అను రాజొకడుండెను. ఒకప్పుడొక బ్రాహ్మణు డాతని యొద్దకువచ్చి "నాపుత్రకుడీవేళ నకాలమరణము నొందెను; నాప్రియపుత్రకుని యమాలయమునుండి మరల దెచ్చి యియ్యవలయు" నని యడిగెను. రాజు తక్షణమె తన యమోఘ తపఃప్రభావము చేత యముని సమ్ముఖమునకు రప్పించి "బ్రాహ్మణ పుత్రకుని పునర్జీవునిగ నొనరింపు" మని కోరెను. యముడందులకు సమ్మతింపక పోవుటవలన నిరువురికి ఘోర యుద్ధముజరిగెను. తుదకు యముడు పరాజిత ప్రాయుడుకాగా, బ్రహ్మయరుదెంచి వారిరువురిని సమాధానపఱచి, "నీవు బ్రాహ్మణ పుత్రకుని రూపము ననుసరించి రంగులతో నొక చిత్రపటమును లిఖింపుము" అని రాజుతో జెప్పెను. అందుకు సమ్మతించి రాజు చిత్రమును లిఖించెను, అంతట బ్రహ్మ యీచిత్రమును ప్రాణవంతముగావించి బ్రాహ్మణునకొసగెను.

"నీవు నేడేవిధముగ నగ్నప్రేతముల జయించితివో, యదేవిధముగ చిరకాలము నగ్నజిత్తుడవగుదువుగాక'" అని బ్రహ్మ రాజును దీవించెను. చిత్రకారుడు దేవదానవుల రూపములను చిత్రించి వారిని వశ్యము చేసికొనగలడు అను ఉద్దేశమె చీనా, టిబెట్ దేశముల చిత్రవిద్యల మూల తత్త్వము.

నగ్నజిత్తు రచించినదె భూలోకమున ప్రథమ చిత్రము. ప్రాచీన భారతీయ గ్రంథములందు కొన్ని స్థలములలో నగ్న.జిత్తు సమాచారము గోచరించుచున్నది. శకుని గాంధారుల తండ్రియగు గాంధారరాజునకు సబలుడనియు, నగ్నజిత్తనియు పేరులుగలవు. ఆయన "ప్రహ్లాద శిష్యుడని"యు పేర్కొనబడియెను. "ప్రథమమున వేదమును యజ్ఞమును ఆవిర్భవించినవి. చైత్యనిర్మాణ మొనరించుటకు చిత్రవిద్య యావశ్యకము. అందుకొఱకు చిత్రవిద్య వేద స్వరూపముగ పరిగణింపబడినది. నేనె మొట్టమొదట మానవ రూపమును లిఖించితిని; నేనె మానవునికి మొట్టమొదట నీ చిత్రలేఖనవిద్య నేర్పించితిని". అని బ్రహ్మచెప్పెను. నగ్నజిత్తు అను శబ్దము చిత్రశిల్పి అను అర్థమున వ్యవహరింపబడినది. నగ్నజిత్తు విశ్వకర్మకు శిష్యుడు. నగ్నజిత్తు రచియించిన చిత్రలక్షణము ఆఱవ శతాబ్దము నాటికె వ్యాప్తిచెంది యుండవలయును. ఏలనన వరాహమిహిరుడు తన బృహత్సంహితయందు నగ్నజిత్తు శిల్ప మతమును రెండుచోట్ల నుదహరించెను.

చిత్రలక్షణ గ్రంథమున ముఖమండలముమూడు భాగములుగ విభాగింపబడి యున్నది. చిబుకము నాలుగంగుళులు; నాసిక నాలుగంగుళులు; నుదురు నాలుగంగుళులు, ఇదిగాక చక్రవర్తులు ధరించుకొను ఉష్ణీషము అను కేశగుచ్ఛము నాలుగంగుళులు. చిత్రలక్షణము సంపూర్ణముగ బ్రాహ్మణ్య గ్రంథము. మహాదేవుని పలుమాఱునుతించుటవలన, ఆ గ్రంథమును సంకలించిన యతడు శైవుడని యనుమానింపవలసియున్నది. కాని గ్రంథ

మధ్య భాగమందు బ్రహ్మకే ప్రాధాన్య మొసగబడి యున్నది. వైదిక యజ్ఞమందు విగ్రహములకు స్థానములేదు. బ్రాహ్మణ్య ధర్మమునందు విగ్రహారాధన మెప్పుడు ఏ రీతిని ప్రవేశపెట్టబడినది తెలిసికొనుటకు వీలుపడదు. బౌద్ధమతవ్యాప్తికి పూర్వమె విగ్రహారాధనము అలవాటులో నుండినట్లు జాతక కథలు, లలితవిస్తారము మున్నగు బౌద్ధగ్రంథములందు ప్రమాణములు దొరకుచున్నవి. వైదిక మంత్రములందు ఋషులు వ్యక్తపఱచిన కవిత్వశక్తిని జూడ వారి కల్పనా నైపుణ్యము అసామాన్యమని తెలియవచ్చుచున్నది. కాని వాస్తవ జగత్తునందు అట్టి కల్పవలను మూర్తీభవింపజేయుటకు వారు ప్రయత్నింపరైరి. అయినను, యజ్ఞవేదికా యూపస్తంభ నిర్మాణములందు తమ శిల్పకల్పనము, నేదోయొక రీతిగ కనబఱచిరి. చిత్రలక్షణకర్త వైదిక యజ్ఞములను గుఱించి చెప్పు సందర్భమున చైత్యములను వర్ణించియున్నాడు. వైదిక సాహిత్యమునందు చైత్యశబ్దము చాల అరుదు. మనకు బౌద్ధచైత్యములను గుఱించియె విశేషముగ తెలియును అయినను వైదిక యజ్ఞవర్ణనా సందర్భమున నొక విధమైన చైత్య చిత్ర లక్షణము మహాభారతమునందలి యాదిపర్వము యొక్క తొంబదినాలవ యధ్యాయమున మనము చూడ వచ్చును.

చిత్రలక్షణము యొక్క ద్వితీయాధ్యాయమునందు, దేవలోకమున చిత్రవిద్య యుత్పత్తియైన విషయము వర్ణింపబడినది. విశ్వసృష్టియైన యనంతరము దేవతలు తమ మూర్తులను తామె చిత్రించుకొనిరి. ఈ విధముగ పూజయు బలి విధులును ఉత్పన్నములైనవి. ప్రథమాధ్యాయమునందు, మనుష్యుడు స్వాభావిక స్నేహప్రీతులకు వశవర్తియయి మనుష్య చిత్రముల రచియించుట కెట్లు ప్రవృత్తుడాయెనో, ఆ కథ వివరింపబడియున్నది. విశ్వకళ్యాణము కొఱకు, మనుష్యసమాజమునకు దేవోపాసనమార్గము సుగమ మొనరించుటకు బ్రహ్మచే ప్రేరితులైన దేవతలు తమతమ మూర్తులను కల్పించుకొన్న విధానము ద్వితీయాధ్యాయమున వివరింపబడియున్నది.

చక్రవర్తి చిత్రలక్షణములను ఈ గ్రంథము ముఖ్యముగ బోధించుచున్నది. శిల్పరచనా పద్ధతియందును, శిల్ప నియమములందును ప్రాచీన హైందవ, బౌద్ధ,జైన సంప్రదాయములకు విశేష భేదము లేవియు గానరావు. గాంధార దేశమునందలి యనేక భాస్కర్య నిదర్శనములవలన అందొక ప్రాచీన చిత్రకళా సంప్రదాయముండె నని యూహింప దగియున్నది. టిబెట్ దేశముయొక్క మతసంబంధమైన చిత్రరచన గాంధార చిత్రకళకు సంబంధించిన యొక శాఖగ తలంపవచ్చును.

బాజ్నాయును ఒయాయ్-చి-ఇ-సొంగ్ అను నిరువురు చిత్రకారులు భారతీయ చిత్రశిలాదర్శనములను కొరియా, చీనా దేశముల ప్రవేశపెట్టిరని చీనాదేశమందొక నానుడి కలదు.

ప్రతిమలు కొలత వేయుటయందు అంగుళియె ప్రమాణముగ గైకొనబడినది. ఎవని (యే దేవత) చిత్రము లిఖింపబడునో యాతని (ఆ దేవత) అంగుళియె ప్రమాణముగ తీసికొనవలయును. భిన్నభిన్న పరిమాణములు గలవిగ నున్నను ఆయా చిత్రములందు అంగప్రత్యంగ పరస్పరానుగణ్యము కొఱకు నిట్టి నియమము ఉద్దేశింపబడినది.

చక్రవర్తి పురుషుని రూపవర్ణనము :- చక్రవర్తియైన భూపతి మేఘ ముక్తాకాశము నందలి చంద్రునితోడ తులతూగును. ఆతని శరీరము చుట్టును ప్రభామండలము చిత్రింపబడవలయును. ఆతని ముఖమండలము చంద్రప్రభవలె శుభ్రమైయుండును. ఆతని భ్రూయుగళమును, గ్రీవమును, ఫాలమును అత్యంతసుందరములు. ఆతని కేశముల వర్ణము ఉజ్జ్వలముగను కోమలముగ నుండును; నాసిక యున్నతముగను చక్కగ నుండును; అధరోష్ఠములు రక్తవర్ణభూషితములు. ఆతని దంతములు ముక్తాఫల ధవళములు; నేత్రద్వయము ఆకాశమురీతి నీలమును, సుదీర్ఘవిశ్రాంతమును. ఆతని భ్రూయుగళ మధ్యప్రదేశమున తేజఃపుంజము శోభించుచుండును. ఆతని శుభ్రకాయ మతిసుందరరూపముగ చిత్రింపబడును. కర్ణద్వయము సమభావముగ చిత్రింపబడును. ఆతని కంఠము శంఖసదృశము; స్కంధద్వయ మధ్యవర్తిస్థానము పరిస్ఫుటము; పదములు హస్తములు పుష్కలములు; శరీరము మాంసలము, నాభిదక్షిణా వర్తనమును గంభీరమును; ఆతని శరీరము సకలప్రదేశములందు గుండ్రముగ నుండును. మఱియు సంధిస్థలములు (కీళ్ళయుబ్బులు) దృష్టిగోచరములు కావు. ఆతని యూరు ద్వయము ఏనుగతొండమువలె గుండ్రముగ నుండును; గోళ్ళు అర్ధచంద్రాకారములు; పదతలము ఛత్రచిహ్నితము; అంగుళి పొడవుగను గుండ్రముగ నుండును. ఆతని వర్ణము చంపక పుష్పమువలె గౌరవముగ నుండును.

ఆదర్శ పురుషుల శరీరము మాంసలముగ నుండును; కాని, నరములు, కండలు, మున్నగునవి కానరావు. వక్షము సుపుష్టముగను, విశాలముగను, సమతలముగను చిత్రింపడును. చక్రవర్తులకును, లేక దేవమూర్తులకును కోరమీసములుండవు. వారిని షోడశవర్ష యువకులనుగ చిత్రింప వలయును. వారి శరీరము సింహోదరమువలె పొడవుగను, విరివిగనుండును. ఈ సకల లక్షణములు టిబెట్ భారతీయ చిత్రములందు సామాన్యముగ గోచరించును.

చిత్రలక్షణకారుడు నయనములను చిత్రించుటను గుఱించి యెంత విరివిగ నుపదేశించియున్నాడో, అంత యెక్కుడుగ మఱియే యంగమును గుఱించియు చెప్పియుండలేదు. ఏలనన నేత్రమె భావవ్యంజనమునకు ప్రధాన సహాయకారి. గ్రంథకర్త యాకారభేదముల ననుసరించి క్రింది విధమున నైదు విధములైన కన్నులను వర్ణించి యున్నాడు.

1) ధనురాకృతి 2) ఉత్పల పత్రాకృతి 3) మత్స్యోదరాకృతి 4) పద్మపత్రాకృతి 5) * కపర్దాకృతి. ఈ నయనాకృతుల పరిమాణములు నిర్ణయింపబడినవి. ధనురాకృతి గల నేత్రము నిమీలితప్రాయము, దాని విస్తృతి మూడు # యవలప్రమాణము. ధనురాకృతి మొదలు క్రమముగ నొకదానికన్న నొకటి విరివియైనది. ధనురాకృతికన్న నుత్పలాకృతి పెద్దది. అన్నిటికన్నను కపర్దాకృతి పెద్దది. అది పదియవల ప్రమాణము గలది. ధ్యానముద్రాకలితులైన యోగుల నేత్రములు ధనురాకృతిగలవి. సాధారణుల కన్నులు ఉత్పల పత్రాకృతి నొందియుండును. భయమును క్రందనమును సూచించు కన్నులు + పద్మపత్రాకృతిగ చిత్రింపబడవలయును. యాతనాక్రోధవ్యంజకములగు నేత్రములు కపర్దాకృతిగ లిఖింప వలయును. దేవతల కన్నులు చక్కగ చిత్రింపబడిన యెడల రాజులకును ప్రజలకును మంగళము గలుగును. దేవతల నేత్రములు పాలవలె శుభ్రములుగ నుండును. స్నిగ్ధములైన నయన పల్లవములందు నేలాటి కర్కశత్వమును గోచరింపదు. నయనశోభ, పద్మపత్ర సదృశముగను, ఇంద్రనీలమణి మధ్యమున తరళించు చంచలకాంతిపుంజమువలె నుండును. తారకలు నల్లవిగను పెద్దవిగను నుండవలయును.

కన్నులకువలె కనుబొమ్మలకు గూడ ప్రకారభేద ములు వివరింపబడియున్నవి. ప్రశాంతవ్యక్తియొక్క కనుబొమలు అర్ధచంద్రాకారముగ నుండును. క్రోధావిష్టుని కనుబొమలు ధనురాకృతి గలిగియుండును. భీతునియొక్కయు విలపించు వానియొక్కయు కనుబొమలు నాసికాసంధియొద్ద నుండి ఫాలమునందు సగము వఱకు వ్యాపించియుండును.

వర్ణవిన్యాసమును గుఱించిన కొన్ని నియమములు క్రింద వివరింపబడుచున్నవి.

1) రక్తవర్ణము :- ఉత్పలాకృతి నయనముల యంచులకును, అధరోష్ఠములకును (బింబఫల సదృశముగ) గోళ్ళకును, గోళ్ళ మధ్య ప్రదేశములందును (ఉత్పల నాగఫణముల వలె ) హస్తమునందును (యెఱ్ఱతామరవలె) నాలుకకును (నెత్తురువలె) పదతలమునందలి లత్తుక పూతకును నిర్ణయింపబడినది.

2) శుక్లవర్ణము :- దేవతల కన్నులకు (పాలవలె) దంతములకు (ముత్యములు, పద్మబీజములు, తుషారము, మల్లెపువ్వులవలె) చక్రవర్తి పరిచ్ఛదమునకు, నిర్ణయింపబడినది.

---

* గవ్వయాకారము

# ఒకయవ యంగుళిలో మూడవభాగము

+ ఇచ్చట పత్రముల యాకృతియె కేవలము గ్రాహ్యము.

3) నీలవర్ణము :- తారకలకు (ఆకాశమువలె) కేశములకు, (ఇంద్రనీలములు, భ్రమరములు, అంజనము, మయూరకంఠము, ఆకాశములవలె)

4.) కృష్ణవర్ణము :- తారకలకు నిర్ణయింపబడినది.

5) జాబురాయి (పసుపు) వర్ణము :- కరనఖర ప్రసాదనములకు నిర్ణయింపబడినది.

6) సువర్ణము :- చక్రవర్తుల శరీరమునకు (జాంబూనద సువర్ణము, ప్రస్ఫుటిత పద్మబీజము, చంపకములవలె).

ఈ యారువర్ణములందు ఎఱుపు, తెలుపు, నీలము, సువర్ణములకె ప్రాధాన్య మొసగబడినది.

(రుధిరోద్గారి : వైశాఖము)



# సాహిత్యములో రమ్యత

ఏ కావ్యము సహృదయుల రంజింపజేయునో ఆ కావ్యమునందు రామణీయకము తప్పనిసరిగా ఉండును. అట్లు లేనియెడల రంజకత్వమునకు హేతువుండదు. మన ఆలంకారికులలో అర్వాచీనుడైన పండితరాయలు "రమణీయార్థ ప్రతిపాదక శబ్దము కావ్యమ"ని చెప్పినట్లుగనే అమెరికా దేశపుకవి, కథకుడు ఆలన్‌పో కూడ "లయాబద్ధమైన సౌందర్యసృష్టియే కవిత్వమ"ని నిర్ణయించినాడు. కావ్యము నందు రామణీయక ముండవలెనన్న అభిప్రాయము ప్రాచ్య పాశ్చాత్య లాక్షణికులకు కవులకు సమ్మతమైయున్నది.

కావ్యసమర్పితమైన రామణీయకము ఎట్టిది? ఇదమిత్థమని నిర్ణయించుటకు తగిన జగదేకమైన మానదండము లేదు. రామణీయకము బాహిరమేకాక ఆంతరిక మనఃస్థితికి కూడ సంబంధించినది. ప్రతివ్యక్తికి అనుభవైకవేద్యముగా నుండు సౌందర్యము ఆవ్యక్తియొక్క సంస్కారము, హృదయ పరిపాకమును అనుసరించి వృద్ధిక్షీణతలను పొందును. అయినప్పటికిని స్థూలముగను, మార్గసూచకముగను కొన్ని సామాన్య లక్షణములు గోచరించకపోవు.

కవిత్వములోని రామణీయకము ఏకవస్తువుగాదు, ఏక గుణమును గాదు. వస్తుగుణములు ఉచితమైనరీతిగా సమ్మేళింపబడి, కవిప్రతిభచేత సచేతనమై ఆకృతిబద్ధమైన భావము యొక్క సమష్టి మోహనత్వమె సౌందర్యము.

ప్రతిభావంతుడైన కవికి అపూర్వవస్తునిర్మాణక్షమమైన ప్రజ్ఞ ఉండును. అద్దములో బింబము ప్రతిఫలించినట్లుగా సహృదయుల హృదయములందు భావచిత్రములను ప్రతిఫలింపజేయు వర్ణనా శక్తి కవికి స్వభావసిద్ధముగ ఉండును. ఈ శక్తి యేకవికి పరిపూర్ణముగ నుండునో ఆతడు అమర కవి. వానిది సార్వకాలీనమైన అమరకవిత.

కవికులగురువైన కాళిదాసునందు ఇట్టి భావ చిత్రరచనా కౌశలము పరమావధి నొందినది. మేఘసందేశ మంతయు ఇట్టి రమణీయ చిత్రముల పరంపరయేగదా! రమణీయవస్తువు నిరంతరము సంతోషమును చేకూర్చునని కీట్సుకవి చెప్పినట్లుగా మనోహర భావచిత్రములు, దృశ్యములు, జరామరణావస్థలు పొందక మన భావలోకముపై అధికారము చెలాయించు చుండును.

చూడండి, కాళిదాసు చిత్రించిన జింక ఎంత రమణీయముగను ప్రాణవంతముగను మనకు భావగోచరమగు చున్నదో.

*గ్రీవాభంగాభిరామం ముహు రనుపతతి స్యందనే బద్ధదృష్టిః*
*పశ్చార్ధేన ప్రవిష్ట శ్శరపతనభయాద్ భూయసా పూర్వకాయం*

దర్భైరర్ధావలీఢై శ్రమవివృతముఖభ్రంశిభిః కీర్ణవర్త్మా
పశ్యోదగ్రప్లుతత్వా ద్వియతి బహుతరం స్తోక ముర్వ్యాం ప్రయాతి.

దుష్యంతుడు మృగయావినోదలాలసుడయి రథమెక్కి విల్లెక్కుపెట్టి జింకను వెన్నంటి తరుము కొనుచున్నాడు. జింక శరవేగముతో పరుగెత్తుచున్నది. అది చెంగలించి పరుగెత్తుటచేత కొంత భూమిపైన కాళ్ళానుచున్నవి. ఎక్కువగా ఆకాశములో పోవుచున్నది. రథం కనబడినపుడెల్లా మెడతిప్పి చూచుచున్నది. శరపతన భయముచేత వెనకటి భాగము పూర్వకాయములోకి చొచ్చుకొన్నట్లుగా కనబడుచున్నది. పరుగెత్తు అలసటచేత నోరు తెఱచుకొనడము వల్ల సగంసగం కొరకిన దర్భలు అక్కడక్కడ దారిలోపడి అదిపోయిన జాడ తెలుపుచున్నవి. కవులు సౌందర్యప్రియులు కాబట్టి దుఃఖావస్థలో కూడ కాళిదాసును ఆ జింక రమణీయ భంగిమమే ఆకర్షించినది. ఈ చిత్రము చాలా అభిరామముగా ఉన్నదని కవియే సర్టిఫికేటు ఇచ్చుకొన్నాడు.

శకుంతల సఖీసహితముగ పూలతీవలకు నీళ్ళుపోయుచు "ప్రియంవద నిర్దయముగ నాకంచెల వల్కలమును బిగించి ముడివేసినది. కొంచెము సడలించు" మని అనసూయను అడుగుచున్నది. "అనుక్షణ విజృంభమాణమైన నీ యౌవనాన్ని అడగవమ్మా" అని అనసూయ చలోక్తులాడు చున్నది. ఈ మాటలకు సిగ్గుతో తలవంచుకొన్న ముద్దరాలు, శకుంతల, దుష్యంతుని కన్నులకు నిర్వాణ సామ్రాజ్యమై కనుపట్టిన శకుంతల నేటికికూడా మన కన్నులకు ఆ విధముగనే పొడకట్టుచున్నది.

క్షణేక్షణే యన్నవతా ముపైతి,
తదేవ రూపం రమణీయతాయాః

అను సూక్తికి ఉదాహరణ ప్రాయములయి ఈ దృశ్యములు మనలను మంత్రముగ్ధులను చేయుచున్నవి.

కాళిదాసుని కవితా సమ్మోహన ప్రభావమునకు చిక్కి సహానుభూతివలన తామె దుష్యంతుల మనుకొని శకుంతల వనవిహార శృంగారము ననుభవించి, పుస్తకము మూసిన వెనుక, కలగని మేల్కొన్నవారివలె లోకముదెలిసి, దుష్యంతుడు తుమ్మెదనుగురించి అనుకొన్నట్లుగనె తామున్ను దుష్యంతుని ఉద్దేశించి "కృతార్థుడవు నీవేనోయ్:" అని దీర్ఘనిశ్వాసము విడిచిన పఠితలు ఎందరుండరు?

నలకూబరసన్నిభుడైన ప్రవరాఖ్యుడు వరూధినికంటబడినాడు. ఆమె అబ్బురమొంది నయనాంబుజములు వికసించునట్లు చూచినది.

చూచి, ఝళంఝళత్కటకసూచితవేగపదారవింద యై
లేచి కుచంబులున్ దురుము లేనడు మల్లలనాడ నయ్యెడన్

బూచినయొక్కపోకనునుబోదియ జేరి విలోకనప్రభా
వీచికలం దదీయపదవీకలశాంబుధి వెల్లిగొల్పుచున్.

పెద్దన వరూధినిని ప్రతిక్షణవ్యగ్రమైన కార్య సంచలనముతో జీవత్ప్రతిమవలె మనకన్నులకు కట్టునట్లు చిత్రించినాడు. ఆమె తత్తరము ఆశ్చర్యము ఈ పద్యములోని ప్రత్యక్షరములో అంకితమై ఉన్నది. తాను కన్యాత్వసహజమైన సిగ్గుగల వినయవతి యని ప్రవరాఖ్యునికి తోపవలయును. ఆయన వరూధిని సౌందర్యమును చూచి ముగ్ధుడు కావలయును ఈ రెండుకార్యములు ఒక్కసారిగా సాధించవలయును. ఆమె ప్రక్కనన్న పోకచెట్టువెనుక నిలుచున్నది. ఏచింత చెట్టుచాటున నిలుచున్నయెడల ఆమె సౌందర్యము ప్రవరాఖ్యునికి గోచరించదు. ఈ చిత్రముకూడ మన హృదయము చొచ్చుకొని వదలిపోదు. ఒక్కొక్క కావ్యము చదువుకొలదీ మన భావప్రపంచము వృద్ధిపొందుచుండును. సుందరమూర్తులైన స్త్రీ పురుషుల జనాభాకూడ విరివిచెందుతూ ఉండును. భూమిపైన స్వర్గము స్థాపించినట్లగును.

సర్. సి.ఆర్. రెడ్డిగారు ఒక కావ్యమునకు వ్రాసిన ఉపోద్ఘాతమునందు "ప్రతిపద్యము చిత్తరువున కనుకూలించు నదిగా ఉన్నది" అని కావ్యములో మనము చూడవలసినది రామణీయకమే"నని వ్రాసియున్నారు. వారు కవి యొక్క భావ చిత్రరచనాకౌశలమునకు ప్రాముఖ్యమొసగియున్నారు. ఇట్టి నైపుణ్యము ప్రతి కవికిని వాని వాని సంస్కారపరిపాకము ననుసరించి నిర్మాణశీలమైన భావబంధురత ననుసరించి కొద్దిగనో గొప్పగనో అలవడి యుండును.

కవి కావ్యమునందు సౌందర్యము సంపాదించుటకు హేతుభూతములైన వానిలో భావప్రకటనా విధానము ముఖ్యమైనది.

" A perfect expression is beauty. An imperfect expression is ugliness".

"నిర్దుష్టమైన భావప్రకటనము సౌందర్యమనియు, దోషయుక్తమైన భావప్రకటన అందవికారమనియు" ఒక ఆంగ్లేయ విమర్శకుడు చెప్పియున్నాడు. పాల్‌గ్రేవు మహాశయ తాను చేకూర్చిన పద్యసంపుటమునకు వ్రాసిన ఉపోద్ఘాతమునందు "భావప్రకటనము తే తెల్లముగ నుండవలయును. అట్లులేనియెడల అపూర్వకల్పనా శక్తి యున్నను ఆలోపమున పూరించలేదు." అని వ్రాసియున్నాడు.

భావమునకు ప్రకటనకు బింబ ప్రతిబింబ భావసంబంధము గలదు. కవి మనస్సులో ప్రస్ఫుటముగ ఏర్పడిన భావము అట్లె ప్రకటితమగును. అట్లుకాదేని అపూర్ణముగను క్లిష్టముగను ప్రకటింపబడును. మన భావములు వాచ్యముగను వ్యంగ్యముగను ప్రకటింపవచ్చును.

వాచ్యమునకన్న వ్యంగ్యమే రమణీయమని అందరును ఒప్పుకొనియున్నారు. అయినను ఏ మహాకవి రచించిన కావ్యమునందు గూడ ప్రతి పద్యము ప్రతివాక్యము ధ్వని ప్రధానముగ ఉండదు. గుణము హెచ్చుకొలది రాశి తగ్గుచుండును. ప్రయత్న పూర్వకముగ శ్రమపడి వ్రాయుదుమేని శ్లేషకావ్యములవలె సహజ సౌందర్యమును కోలుపోయి హృదయాకర్షకముగ నుండదు. కొందరు ఆధునికులు భావశబ్ద క్లిష్టత్వమును ధ్వనియని పొరపడినట్లు కనుపించును. ధ్వని ప్రధానముగా నున్న పద్యమునందు, శ్లోకమునందు ప్రకృతార్థము చక్కగా బోధపడుచూ వ్యాఖ్యాతిశయ మయిన వేరొక భావము స్ఫురించును. ధ్వని యెప్పుడు నేల విడిచి సాముచేయదు. ధ్వనికి బీజము పద్యములోనే ఉండును.

కావ్యమునందు సౌందర్యాపాదక హేతుసామగ్రిని స్వీకరించుటయేగాక తద్భంగ హేతువులను వర్జించుటకూడ అవసరమె. దూరాన్వయము, దురన్వయము, అన్వయ కాఠిన్యము, భావక్లిష్టత్వము, అర్థము.పొసగని పదముల కూర్పు, భావదారిద్ర్యమును అచ్ఛాదించు అనుచిత నిరర్థక శబ్దాడంబరత మున్నగు కావ్యదోషములు భావమును అవగతము చేసికొనుటకు ప్రతిబంధకములు కావున అవి పరిహరింపదగినవి.

అనౌచిత్యము రసభంగహేతువుగాన అది ముఖ్యముగ పరిహరింప తగినది. ఔచిత్యమనగా Commonsense. లోకజ్ఞానము జీవితమునందెంత అవసరమో కావ్యమునందు కూడ ముఖ్యమె. ఆది మధ్యాంతములుగల కావ్యాకృతియందు అంగాంగ సంయోగిత, అవయవాను రూపత్వము పరిపూర్ణతను చేకూర్చి రామణీయకమునకు సహాయకారి యగును.

కవి తన కావ్యమునందు ఇట్టి సౌందర్యాపాదక సామగ్రిని చేకూర్చి, శబ్దార్థములకు సమాన గౌరవముచూపి శ్రోత్రపేయత్వము సంతరించి రమణీయసృష్టి చేయుచున్నాడు. కావున సాహిత్యములో సౌందర్యము ఘనీభవించి యుండును.

- (ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో)



# నేటికవిత - ప్రకృతిపూజ

ప్రకృతిని అర్చించుటలోను ప్రకృతి సౌందర్యమును అభివర్ణించుటలోను, పూర్వ కవులకును, నేటి కవులకును కొంత మార్గభేదము కనుపడుచున్నది. ప్రబంధకవులు కృత్రిమాలంకార ప్రియులు. నేటి కవులు సహజ సౌందర్యప్రియులు. కాలానుసారముగ మానవసంఘము, దాని ఆచార వ్యవహారములు మార్పుచెందుట సహజము. సాంఘిక పరిణామము ననుసరించి దాని నాశ్రయించి బ్రతుకు కళలుకూడ మార్పు చెందుచుండును. భూత భవిష్యద్వర్తమాన కాలములకు అవినాభావ సంబంధము కలదు. కావుననే యొకటి లేక మరియొకటి యుండదు.

కవులు ఏకాలమునకు సంబంధించిన వారైనను, వారి రచనా విధానము మార్పుచెందినను, వారికి లోకమే ప్రమాణము. ప్రకృతి సౌందర్య వర్ణనము మానవ స్వభావ చిత్రణము వారికి ముఖ్యమైన విషయము. అందువల్లనే కాబోలు ఒక ఆంగ్లేయ విమర్శకుడు "Nature is the Goddess of poets" "కవులకు ప్రకృతి ఆరాధ్య దేవత" యని చెప్పినాడు.

పూర్వ కవిత్వములో అసంతృప్తిచెంది నవ్య కవిత్వము వ్రాయవలయునను కోర్కె ఈనాటి కవులకు మాత్రమే సంబంధించినదికాదు. మన పూర్వులకును వారి కంటె పూర్వులున్నారు. నవ్య కవిత్వము వ్రాయవలయునని ప్రయత్నించియే యున్నారు. శ్రీనాథుడు తన కవిత్వమును నవ్యమని చెప్పుకొనెను. తెనాలిరామకృష్ణకవి "స్కందపురాణ నీరనిధి కౌస్తుభమై ప్రభవించి దేవకీనందను సత్కథోద్యమము నవ్యకవిత్వ కళాకలాపమన్ కుందనమున్ ఘటించి కడుక్రొత్తగు సొమ్మొనరించి" అని నుడివియున్నాడు. ఇచ్చట నవ్యకవిత్వ కళాకలాపము, క్రొత్తగు సొమ్ము అను మాటలు ముఖ్యముగ గమనింపతగినవి. చేమకూర వెంకన్న తెలుగు కవిత్వమున క్రొత్తపద్ధతిని ప్రవేశపెట్టెను. ఆ రచనలోని నవ్యతను, అపూర్వతను తన సమకాలికులు మెచ్చుకొనవలసినంత మెచ్చుకొనలేదని పాప మా నవ్యకవి "ఏ గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరేగదా!" అని ఆశాభంగమును వేడినిట్టూర్పుతో ప్రకటించెను. మార్పులు కోరినది నేటికాలపు కవులు మాత్రమేనని పొరపడుటవలన మన చారిత్రకదృష్టి నశించి, పూర్వకవిత్వ మన్నంతనే అసహ్యపడుట ఒక నాగరక ఆచారముగ పరిణమించినది. 1910 వ సంవత్సరము మొదలు ప్రారంభించిన నవ్య కవుల రచనలు 1935 వ సంవత్సరమునాటికే పూర్వకవిత్వముగా మారిపోయినదన్న విషయము నవ్యకవులు జ్ఞప్తిపెట్టుకొన్నయెడల పూర్వ కవిత్వమును అంతగా ద్వేషింపవలసిన అవసరముండదు. మొదటి నవ్యకవులకు పూర్వకవుల రచనలేగదా మానాలు. అభిరుచుల ననుసరించి కొందరకు తిక్కన, కొందరకు శ్రీనాథుడు, మరికొందరకు పింగళి సూరన పెద్దనలేగదా అభిమాన కవులు; తరువాత

వారివారి నైజప్రతిభ ననుసరించి మార్పులు చెందియుండవచ్చును.

ప్రకృతి రామణీయకము వర్ణించుటయందు పూర్వకవులకును ఆధునికులకును దేశకాల పాత్రభేదముల ననుసరించి కొంత తారతమ్యము కొంత విభిన్నత అగపడుచున్నది. దీనికి ఆలంకారిక మతముకూడ యొక కారణమై యుండును.

రసవాదము భరతముని నాట్యశాస్త్రమున నిర్వచింపబడినది. బహుశా ప్రభవించినదని కూడ చెప్పవచ్చును. నాట్యమునందు నాయికా నాయకులు ముఖ్య పాత్రలు. తక్కినవెల్లను ఔపచారికములు. కావుననే ప్రకృతి మానవ చర్యలకు కేవలము భిత్తిమాత్ర ప్రయోజనము (Back ground) గా రెండవస్థానము నలంకరించినది. కావ్యములు గూడ క్రమక్రమముగా ఈ పద్ధతినే అవలంబించినవి. వాని యందును మానవచర్యలే ముఖ్యములు. మానవచర్యలతో సంబంధములేని ప్రకృతివర్ణనమునకు తావులేదు. మానవ చర్యలకు సంబంధించి, రసపోషణకు కావలసిన మాత్రము ప్రకృతివర్ణనము గ్రాహ్యమని వారి మతము. అనాగరక జాతుల చర్యలు మానవేతరములైన పశుపక్ష్యాది జంతువుల చర్యలలో రసాభాసముతప్ప రసమునకు పరిపూర్ణత చేకూరదని వారి తలంపు.

ఈ మతమును ప్రతిఘటించినవాడు ఆలంకారికులలో అభినవుడు జగన్నాథ పండితరాయలు. రమణీయార్థమును ప్రతిపాదించు శబ్దమే కావ్యమని నిర్వచించి కవితానర్తకి నాట్యరంగము సువిశాలమొనర్చి మహాకవుల రచనలకు గతికల్పించినాడు. లేక, మహాకవుల ప్రతిభను పండిత రాయలు గౌరవించినాడనికూడ చెప్పవచ్చును. అట్లు కానియెడల, రసవాదప్రకారము కాళిదాసుని కుమారసంభవములోని "మధుద్విరేఫః కుసుమైక పాత్రే పపౌప్రియాంస్వామను రక్తమానః" అను శ్లోకమును, దానివంటి మరికొన్ని రమణీయ శ్లోకములును రసాభాసమునకు దృష్టాంతములు కాగలవు. మనుచరిత్రలోని "ఏ విహంగముగన్న యెలుగించుచునుసారె" అను చక్కని సీసపద్యము రసాభాసమగును. ఇంత యెందుకు రతి ఉభయనిష్ఠము కానందువలన మనుచరిత్రకథే రసాభాసము. లోకము ననుసరింపని శాస్త్రమెట్లున్ననేమి, మనుచరిత్ర రమణీయముగ నుండుట లేదా ? కావ్యలక్షణములు కొన్ని నాట్యశాస్త్రమునుండి దిగుమతి యగుటవలన యిట్టి యిబ్బంది కలిగినది. లోకము ప్రమాణమన్న సంగతి యేమైనది.

ధునిక కవులు అస్వాభావికపు కట్టుబాట్లను ఉల్లంఘించినారు కావున వారు కావించు ప్రకృతివర్ణనములు ఒకొక్కప్పుడు నాయికా నాయక నిరపేక్షకముగాకూడ నుండును. ప్రొద్దుపొడుపులు, మునిమాపులు, సెలయేళ్ళు, వనములు, కొండలు, మేఘములు, చంద్రోదయము, అవి యివి యననేల, రమణీయమైన బాహ్యప్రకృతి యంతయును

మానవచర్యల సంబంధములేకున్నను తమంతతామె మనోహర దృశ్యములుగ నున్నవి. అవి కవికి ప్రత్యేక వర్ణనీయములు. ఇంగ్లీషువారి Lake poetry, Nature poetry ఈ తెగకు చేరినవి.

కవులు పూర్వులైనను, ఆధునికులైనను ప్రకృతిని వర్ణించుటయందు రెండుపద్ధతులను అవలంబించిరి. కవుల దృష్టికి ప్రకృతిలోని ప్రతి అణువును ప్రాణవంతముగ నగపడుచుండును. అందువలన ప్రకృతిని మానవీకరించుట, మానవుని కష్టసుఖములతో ప్రకృతి సహానుభూతి చూపుచున్నట్లు వర్ణించుట మొదలైనవి ప్రథమ విధానము. ప్రకృతి సౌందర్యమును స్వాభావికముగ వర్ణించుట రెండవ విధానము. ఈ రెండు విధానములను మన కవులు, ఇంగ్లీషు కవులు సమానముగ నవలంబించిరి. మనుచరిత్రమున "తరుణి ననన్యకాంత, నతిదారుణ పుష్ప శిలీముఖ వ్యథాభరవివశాంగి నంగభవుబారికి నగ్గముచేసి క్రూరుడైయలిగె మహీసురాధము డహంకృతితోనని రోషభీషణ స్ఫురణవహించెనో యన నభోమణి దాల్చెకషాయ దీధితిన్" ఇచ్చట సూర్యునకు మానవత్వ మారోపింపబడినది. వరూధిని దురవస్థకు మనసు మెత్తవడి, అందుకు కారకుడైన ప్రవరాఖ్యునిపై కోపముగల్గి "వీని మొగమునైన చూడగూడద"ని సూర్యభగవానుడు అస్తమించుచున్నట్లుగ వర్ణింపబడినది. ఒక యాధునిక కవి, తన దుఃఖమున ప్రకృతి మిత్రునివలె పాల్గొనుచున్నదని రచించెను.

*చిత్తతాపంబు పాపుకో చేలగట్ల*
*కరిగి కూర్చుండ, మూకసహానుభూతి*
*పైరు తలవంచు భారంబుపంచికొన్న*
*ప్రాణసఖులట్లు; కవులకు ప్రకృతితోడు.*

*అపరదిక్కాంతసైతము అస్తమించు*
*అరుణబింబంబుతో కన్నులవియజేయు*
*తనదు పూజారియిక్కట్లు తలచి కుంద*
*ఎఱ్ఱవుండాయెనో యేమొ హృదయమనగ.*

ప్రకృతిని మానవీకరింపక స్వాభావికముగ వర్ణించిన రచనలు ఆధునిక కవులు చేసియున్నారు. అట్టిరచనలు పూర్వ కావ్యములందును అచ్చటచ్చట గోచరించుచున్నవి. ఆ రచనలసంఖ్య తక్కువ అనియే చెప్పవచ్చును.

రమణీయ వస్తువులు తమంత తావే వర్ణనా యోగ్యములయ్యును అవి మానవచర్యలకు భిత్తికయయి కావ్యవర్ణనములో మిళితమైనప్పుడు మరింత సుందరముగ నుండును. మానవ నాటకరంగమునకు బాహ్య ప్రకృతి పరదావంటిది. ఇందుకు వివిధ

దేశములలోని మహాకవుల రచనలే సాక్ష్యము.

ఈ రహస్యమును కవులేకాక చిత్రకారులును గ్రహించిరి. వారు కొండలను, పచ్చిక బయళ్ళను, వనములను, సెలయేళ్ళను మాత్రమే చిత్రించి తృప్తిపడరు. ఆ దృశ్యమును ప్రాణవంతము చేయుటకు, మేయుచున్న ఆవునో, పూవులుకోసికొనుచున్న పిల్లనో లేక చలన శీలమైన ఏదేని జంతువునో చిత్రింతురు.

సముద్రము తరంగ సుందరమయ్యు దానిలో నౌక యోడ త్రుళ్ళింతలాడుచున్నట్లు చిత్రింతురు.

ఒక పెద్ద తుపాను వీచుచున్నది. చెట్లు నిర్మూలములగుచున్నవి. ఇంటికప్పులు ఎగిరిపోవుచున్నవి. పెళపెళార్భటులతో మేఘములు గర్జించుచున్నవి. కుండపోతగా వర్షము కురియుచున్నది. కాని ఈ భౌతిక దౌర్జన్యమునకు గురియయి నిస్సహాయుడై బాధపడుచున్న మానవుడు ఆచిత్రములో కనిపించిన యెడల అది మానవ హృదయమును ఆకర్షించును. కవులు అవలంబించిన రెండు పద్ధతులు రమణీయములైనను మానవచర్యలకు సంబంధపడిన ప్రకృతి వర్ణనమె మరింత ప్రాణవంతముగను మనోహరముగ నుండును.

ఆధునిక కవులుచేసిన గొప్పమార్పు కథావస్తువునకు మానవస్వభావ చిత్రణమునకు సంబంధించి యున్నది. సామాన్య మానవ జీవితమునందు కూడ కవితార్హమైన రసోత్పాదక ఘట్టములున్నవని రుజువుచేయు కావ్యములను రచించిరి. మానవస్వభావ చిత్రమునకు అవకాశముకలిగించి, పాలిపోయి ప్రాతపడ్డ కవితా సరస్వతి యొడలు క్రొత్తనెత్తురు పెట్టుటకు తోడ్పడిరి. అందుకు వారు మనకందరకు వంద్యులు.

- ( ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో)



# సాహిత్యంలో వైచిత్రి

"యా వ్యాపారవతీ రసాన్రసయితుం కాచిత్ కవీనాం నవాదృష్టిః" అను ఆనందవర్ధనుని నిర్వచనమును, "క్షణేక్షణే నూతనైర్వైచిత్రైః జగన్త్యా సూత్రయంతి" అని నవ అను విశేషణమును అభినవ గుప్తపాదులు వివరించినారు. అనుక్షణము నూతనమైన వైచిత్రులతో జగత్తులను సూత్రిస్తూ ఉంటుందట కవి ప్రతిభ.

ఈ "వైచిత్రి"నే Romantic element అనే మాటకు పర్యాయపదంగా నేటి విమర్శకులు రూఢి చేయుచున్నారు. ఈ వైచిత్ర్యమునే "లోకోత్తర చమత్కారమ"ని పూర్వలాక్షణికులు చెప్పియున్నారు.

ఈ Romantic element - వైచిత్రి అనునది కవిత్వమునకు సహజమైన జీవమువంటిదా, లేక అనుషంగికముగా వచ్చిన కావ్యశోభాహేతువులలో నొకటియా ?

యథార్థమైన కవిత్వమునకు వైచిత్ర్యము జీవము. నవ్యతయే యీ వైచిత్ర్యమునకు మూలము. Romantic poetry అంటే భావనాపటిష్ఠమైన స్వేచ్ఛా ప్రియ కవిత్వమని మనము నిర్ణయించుకొను పక్షములో మహాకవుల కావ్యములన్నియు ఈ వర్గమునకే చెందును.

మహాకవి కవిత్వము స్వేచ్ఛాప్రియమని యంటివిగదా అట్లయిన అది లక్షణబద్ధముగాదా? లక్షణబద్ధముకాని కళయేు ఉండదు. కాని ఆలక్షణములు స్వయంకల్పితములు. ప్రతిభోచితములు. ప్రత్యేకములు.

కాళిదాసు, భవభూతి మున్నగు సంస్కృత కవుల యందునూ "భావాంబరవీధి విశ్రుత విహారిణి" అని సరస్వతిని ప్రశంసించిన నన్నయ మొదలు ఈ కాలమువరకు గల తెలుగు కవులయందును ఈ Romantic element దేశకాల పాత్రభేదముల ననుసరించి కొద్దిగనో, గొప్పగనో గోచరించుచున్నది. నేటికాలపు కవులే Romantic కవులని చెప్పుటకు వీలులేదు. కాలభేదం, ఆచార వ్యవహారభేదం ఉండుటవలన అందుకు తగువైనవిధముగా ఈ Romantic element మారుతూ వచ్చినది.

18వ శతాబ్ది ఇంగ్లీషు వాఙ్మయ చరిత్రలో నీరసమైన ఘట్టమని కొందరి ఆంగ్లేయ విమర్శకుల అభిప్రాయము. ఆకాలపు Neo-Classic పద్ధతికి ప్రతిస్పర్థిగా Romantic కవితోద్యమము 19వ శతాబ్ది ఆరంభమున బయలుదేరినది. ఆ కాలపు నవ్యకవులకు లక్షణ నిర్బంధములు, ఛందో నిర్బంధములు, వ్యాకరణపు కట్టుబాట్లు అసహ్యములుగా తోచినవి. పూర్వ రచనపై అసంతృప్తి కలిగినది. ఈలాంటి స్వేచ్ఛా ప్రియత్వం కలుగుటకు ఫ్రెంచి విప్లవంవల్ల ఇంగ్లాండులో వ్యాపించిన నూతన భావముల ప్రభావమే కారణమని చెప్పవచ్చును. బందాలు

వదలించుకొని కాలుసేతులు హాయిగా చాపుకొన్నారు కవులు. ఈ మార్పు రచనలలో గోచరించినది.

"A little noiseless noise among the leaves
Born of the very sigh that silence heaves"

"నిశ్శబ్దమైన కంఠధ్వని ఆకులలో వినబడుచున్నది. నిశ్శబ్దత ఊర్చిన నిట్టూర్పువలె నున్నది" అని ఒకచోట "కీట్సు' (Keats) అంటాడు. అప్పటి Neo-Classic కవులు యీ విధముగా వ్రాసియుండరు. నిశ్శబ్దమైన శబ్దమేమి ? దానిని చెవియెట్లు గుర్తించును ? దానిని శబ్దమనుటెట్లు? ఈలాటి మీమాంసలోపడి తుదకు దానిని తప్పని త్రోసిపుచ్చెదరు. శబ్దములేని కంఠస్వరం అనుప్రయోగం హేతువాదమునకు నిలువలేకపోయిననూ పంచేంద్రియాతిరిక్తమైన యేదోయొక రహస్యేంద్రియముద్వారా బుద్ధివ్యాపార నిరపేక్షముగ హృదయములో ప్రవేశించి అనూహ్యమైన నిశ్శబ్దతను గల్పించి మనలను రసతన్మయులను చేయుచున్నది. "వినిన మధుర గీతికలు ఆనందదాయకములేకాని వినని మధురగీతికలు, మరీ ఆనందదాయకములు" అని పాడిన కవికి నీరవవాణిని విను దివ్యశ్రోతస్సు ఉండవలెను. ఆనందవర్ధనుడునిర్వచించినాడు.

"శబ్దార్థ శాసనజ్ఞానమా త్రేణైవ నవేద్యతే,
వేద్యతేసహి కావ్యార్థ తత్త్వజ్ఞైరేవ కేవలం'

మహాకవుల వాక్యములలో పదాతిరిక్తములైన భావములు స్ఫురించుచుండును. వానిని తెలుసుకొనుటకు శబ్దార్థ శాసన జ్ఞానముమాత్రమే చాలదు. కావ్యార్థ తత్త్వజ్ఞత అవసరము.

వైచిత్ర్యమునకు మూలము నవ్యత్వమంటిరిగదా? మానవుని రసావేశము లలితకళల మూలమున బహిర్గతమగుటకు మొదలుపెట్టి కొన్ని వేల సంవత్సరములైనవి. ఇంకను క్రొత్తదనమేమి ఉండును? అని సంశయమా? ప్రకృతి అనంతము. అనుక్షణ పరిణామశీలము. దేశకాలపరిస్థితుల మార్పులు, కవుల ప్రత్యేక ప్రతిభావిశేషములు ఈ నవీనత్వమునకు హేతువులు.. ఒకేవిషయము పదిమంది కవులు చెప్పినయెడల తలకొక విధముగనుండును. కవిత్వముపుట్టి నప్పటినుండి స్త్రీ వర్ణనము కవిత్వము లోనికిదిగినది. ఎన్నివేల సంవత్సరముల నుండియో కవులు స్త్రీలను వర్ణించు చున్నారు. ఆకళ్ళు, ఆముక్కు, ఆ మొగమె కాని యిన్ని వేలమంది కవులకు పరిమితమైన స్త్రీశరీరము కవితాలంబము కావడమెట్లు? వస్తువు ఒకటే అయినను భావప్రకటన వివిధత్వము వలన చమత్కారమువలన నవ్యముగా కనపడును.

తేనెవాకలంకల్లో పెరిగిన చేమకూర రుచిచూస్తాం !
కడుహెచ్చు కొప్పు, దానిం
*గడవం జనుదోయిహెచ్చు, కటియన్నిటికిన్*

*గడు హెచ్చు, హెచ్చులన్నియు;*
*నడుమే పస లేదుగాని నారీమణికిన్.*

సాధారణమైన భావమే. సాధారణమైన వర్ణనయే. కాని భావప్రకటనలో చమత్కారమున్నది. తిట్టినట్టె తిట్టి పొగడినాడు కవి.

ఇక, 'యతి విటుడు గాకపోవుటెట్లని' ప్రతిజ్ఞచేసిన సంకుసాల కవి :

*"ఒత్తుకొనివచ్చు కటికుచోద్వృత్తి చూచి*
*తరుణి తనుమధ్యమెచటికో దలగిపోయె"*

అనిచెప్పి, అంతటితో తనివి సనక "ఉద్ధతులమధ్య పేదలకుండదరమె" అని లోకోక్తిప్రాయంగా నిలిచిపోయేటట్లు ఒక అర్థాంతరన్యాసం విసరినాడు.

శ్రీనాథుడు "అస్తినాస్తి విచికిత్సాహేతు, శాతోదరిన్" అని యింకొక తీరున నడుము వర్ణించినాడు. ఈ వర్ణనములన్ని ఒకే విషయమును గురించి వెలసినప్పటికిని భిన్నత్వమువలన, నవ్యత్వమువలన, చమత్కారమువలన రసవంతములయి అనుభోగ్యములగుచున్నవి.

ఉన్నది ఉన్నట్లే చెప్పుట కవిత్వముగాదు. న్యూసు పేపరు రిపోర్టు కావచ్చును. కేవలము వార్తలను ప్రకటించడం కావచ్చును. లోకోత్తర వర్ణనానిపుణ కవికర్మ కావ్యమని మమ్మటుడు నిర్వచించినాడు. ఈ అభిప్రాయము లాక్షణికులందరు అంగీకరించినదే. లోకోత్తరత్వమనగా అనుభవసాక్షికమైన ఆహ్లాదగత చమత్కారమని పండితరాయలున్నూ, చమత్కారమనగా చిత్తవిస్తార రూపమగు విస్మయమని విశ్వనాథుడును వివరించినారు. ఇట్లనుటవలన చమత్కార రహితములగు కేవల శబ్దార్థములకు కావ్యయోగ్యత సిద్ధింపదు. కావుననె చేమకూర వెంకట కవి :

*"ప్రతి పద్యమునందు జమ*
*త్కృతి గలుగం జెప్పనేర్తు వెల్లెడ, బెళుకౌ*
*కృతి వింటి మపారముగా*
*క్షితిలో నీమార్గ మెవరికిన్ రాదుసుమీ"*

అని రఘునాథరాయలు తన్ను నుతించినట్లు చెప్పుకొనియున్నాడు. ఇది ప్రగల్భముగా కనబడినప్పటికిని ఈ కవిపట్ల సత్యమే యని యనవలయును. ప్రతి పదరసోదయముగా కవిత్వము చెప్పిన తెలుగు కవులలో చేమకూరు వెంకన్న ముఖ్యుడు. అయన మార్గం నిజంగా యెవరికీ అబ్బలేదు. మహాకవుల పోకడలు అనుకరణ సాధ్యములుగావు.

*చిత్తజుడల్లి తూపుమొన చేసిన జేయగనిమ్ము పై ధ్వజం*
*బెత్తిన నెత్తనిమ్ము వచియించెద గల్గినమాట గట్టిగా*

అ త్తరళాయతేక్షణకటాక్ష విలాసరస ప్రవాహముల్
కుత్తుకబంటి తామరలకున్ దలమున్కలు గండుమీలకున్.

ఈ పద్యము

ప్రతీయమానం పునరన్యదేవ
వస్త్వస్తివాణీషు మహాకవీనాం
యత్తత్ ప్రసిద్ధావ యవాతిరిక్తం
విభాతి లావణ్యమివాంగనాసు.

అను లక్షణమునకు ఉదాహరణ ప్రాయముగనున్నది. అంగనలయందు అవయవాతిరిక్తమైన లావణ్యమువలె మహాకవుల వాక్యములందు నిఘంటు అర్థములకు మించిపోవు భావస్ఫురణలు ఉన్నవనుట నిజమె.

సత్యభామకడకు కృష్ణుడు రావడము పారిజాతాపహరణములో తిమ్మన ఈ విధంగా వర్ణించినాడు.

అరదమునెక్కి కేతన పటాంచల చంచలమైన తాల్మితో
తురగజవంబు మున్నడవద్రోచి కడంగెడు తత్తరంబుతో
దిరిగెడు బండికండ్లపగిదిన్ భ్రమియించుమనంబుతోడ నా
హరి సనుదెంచె సత్యసముదంచిత కాంచనసౌధవీధికిన్.

ఈ పద్యమున కృష్ణుని యాతురత మనఃస్థితి అద్భుతముగ వర్ణింపబడినది. కంటికి గోచరించని తాలిమి, మనస్సు, తత్తరము, దృగ్గోచరములగు కేతన పటాంచలము, తురగ జవము, బండికండ్లు వీని సంబంధమువలన మూర్తిమంతములయినవి. రథమును దానిలోనున్న కృష్ణుని ఒక్కసారిగా మనము చూచుచున్నాము. కృష్ణుని మనః స్థితితో పోల్చబడిన ఉపమానములును రథములోనివె. ఫిలిముడైరెక్టర్లు చూపించే Super imposed dissohes లాగా ఇది శోభించుచున్నది. దీనిలోని వస్తుసామగ్రి సర్వసామాన్యమైనదే. కాని వానికి కల్పింపబడిన పరస్పర సంబంధము కవి భావనా పటిష్ఠతను చాటుచున్నది.

Romantic కవులకు ప్రకృతి అనుసరణముకంటె భావ సృష్టి అత్యంతప్రియము. పూర్వరచనలపై అసంతృప్తి కలిగినప్పుడు నవ్యరచనకు దారి యేర్పడును. ప్రాణముకలిగిన వేవైనా ప్రతికూల పరిస్థితులు సంభవించినప్పుడు తిరుగబడును. కాలార తిరుగనేర్చిన బిడ్డ దాది నిర్బంధములకు ఎదురుతిరుగును. ప్రబంధరచనా విధానముపై కలిగిన అసంతృప్తియే యీనాటి కవుల క్రొత్తపోకడలకు హేతువైనది.

- (ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో)

# నా కవితానుభవములు

కవుల అనుభవాలను వినడానికి లోకం ఉవ్విళ్ళూరుతుంటుంది. కవికి కావ్యానికి అవినాభావసంబంధం ఉంటుంది. కవి మనస్తత్వం, భావప్రపంచం తన కావ్యాలలో ప్రతిఫలించడం సహజం. కవి జీవితం కావ్యాలకు, కావ్యాలు కవి జీవితానికి వ్యాఖ్యాప్రాయంగా కనిపిస్తాయి. అందువల్లనే కవిజీవితానుభవాలను తెలుసుకొని రెంటిని సమన్వయ పరచుకొని ఆనందం అనుభవించడానికి రసికలోకం ఆశపడుతుంటుంది. ప్రోగ్రాం డైరెక్టరుగారు కాకతాళీయంగా నాకిటువంటి అవకాశం కలిగించడం సంతోషకరం.

నాకు ఒక కుగ్రామం నివాసం ఇప్పటివరకు నా జీవితమంతా ఆ గ్రామములోనే కొనసాగిపోయింది. ఆపరిసరాల ప్రభావంవల్లనో యేమో నాజీవితంలోను కవిత్వంలోను గ్రామీణత్వం పరిస్ఫుటంగా అంకితమై ఉంటుంది. ఒక యువకవికి కవితాకన్యకు జరిగిన సంభాషణములో ఒకప్పుడు నేనీ విధంగా వ్రాసినాను.

*గ్రామవాసిని, ఎఱుగను కైతవంబు,*
*ప్రకృతి తల్లి స్తన్యంబున ప్రబలినాఁడ;*
*పొలముల విహరించుచు ప్రొద్దుబుచ్చుచుందు*
*నట్టి నా ముద్దువలపును నరయలేవె?*

తనకు దైనందిన చర్యగా ఉన్న కవితాపూజను గురించి ఉత్కంఠనుగురించి ఈవిధంగా అన్నాడు.

*ప్రత్యుషస్సుల నూత్నపత్రములువిచ్చి*
*విమల హిమబిందువులు రాల్చు సుమవితతుల*
*తోడ ప్రమదాశ్రువులు వీడిపాడుచుందు*
*కలికి, నీమనంబంటెడు గానములను.*

*సందెమబ్బుల చిఱువేరు చాయదీసి*
*పండువెన్నెల పసరున పదనుచేసి*
*తరుణి, నీ పట్టుముసుగు నద్దకమువైవ*
*విఫలయత్నంబులంజల్పి వెఱ్ఱినైతి.*

*పారిజాతపుష్పంబులు పవనహతిని*
*మృదులతృణములరాలెడు నెడల, నీదు*
*చరణవిన్యాస కోమల శబ్దమనుచు*
*నడుగుగుర్తుల పలుమాఱు నరయుచుందు.*

నా మిత్రులు కొందరు నా కావ్యాలు కొంతవరకు ఆత్మచారిత్రస్ఫోరకాలుగా ఉంటవని అంటున్నారు. పూర్వం నేను వ్రాసేటప్పుడు అజ్ఞాతంగా నాకాభావము ఉండినదో లేదో చెప్పలేనుగాని మిత్రుల వ్యాఖ్యానాలవల్ల యిప్పుడు నాకానమ్మకం కలుగుతున్నది.

నాకు కవిత్వం యాదృచ్ఛికంగా లభ్యమైనది. అంటె Love at first sight అన్నమాట. ప్రథమ కవితా సందర్శనానికి దారితీసినవి యీ క్రింది పరిస్థితులని స్ఫురిస్తున్నది.

*గూళులకువచ్చు పక్షుల కూజితములు*
*సంజకెంజాయ గారడి చక్కదనము*
*వరుల వినవచ్చు కీటకావ్యక్తగీతి*
*కాపువానిని సైతము కవినొనర్చు.*

నా కవితావధువు సంపన్నుల యింటి ఆడపడుచు. అందువల్ల నా పెట్టుపోతల్లోను చెప్పుచేతల్లోను అణిగిమణిగి ఉండదు. పిలిస్తే రాదు. వస్తేనిలవదు. తలవని తలంపుగా వస్తుంది. సగములో ఏమో పుట్టిమునిగిపోయినట్లు వెడలిపోతుంది. ఒకొక్కప్పుడు అలక్ష్యంగా వచ్చిపోయిన జాడకు యీ పరాగ రంజిత పదాంకాలే దుఃఖకరమైన సాక్ష్యంగా నిలిచి ఉంటవి.

*పొలతి రానూవచ్చె పోవనుం బోయె*
*పచ్చిలత్తుక పూత పైదలియడుగు*
*ముద్రలు వాకిటి ముంగలం దనరె!*
*సకియ మేలు ముసుంగు సందడివినియు*
*పవనకంపితవర్ణ రవమనుకొంటి*
*ప్రేయసిచేతి దీపక కాంతిగాంచి*
*యమల తారాశోభయని భ్రాంతిపడితి*
*వింతముగ్ధుడనైతి - ఎంత పొరపడితి.*

భాగ్యవంతుల యింటి బిడ్డను పెండ్లిచేసుకొన్న నిరుపేద సంసారికి ఏ అవస్థ కలుగుతుందో నాకూ అదే అవస్థపట్టించినది. చూచారా, నాకూ ఆవిడకు ఎంత తారతమ్యముందో

*నీవురాణివె యౌదువు; నేను బిచ్చ*
*మెత్తు పిచ్చిబికారినె ; యిద్దఱకును*
*తారతమ్యంబు కొండంత ; తరుణి యింత*
*పొల్చ లేనైతి ; నినునమ్మి మోసపోతి.*

*జలదపథంబునందిరుగు చక్కనిచుక్క వె యయ్యు నాపయిం*
*గల ప్రణయంబునం పసిడిగద్దియడిగ్గి పొలాన పచ్చకం*

*చెలకడ గూరుచుంటివి కృషీవలబాలికయట్లు; గడ్డిపూ*
*దలిరుల కాన్కతో ప్రథమదర్శన ముత్సవమయ్యె తొయ్యలీ.*

అంటూ పలవిస్తూ ఉండేవాణ్ణి. ఒక వేళ నేను ఎంత బీదవాణ్ణి అయినప్పటికి నేను మనిషినే కాబట్టి నా భార్య నాకు లోబడి ఉండవలెననే కోరిక, నేను భర్తనుగదా అన్న అహంకారము ఉంటుందిలేండి. నీవేమన్నా నాకు తాళిగట్టి మంత్రపూతంగా నన్ను పెండ్లి చేసుకొన్నావా ? అనేమాట ప్రత్యక్షంగా ముఖాముఖి యెత్తిపాడవదు. ఇక్కాంత అహంభావ Ultra Moderen Wife తత్వం పట్టుపడనందువల్ల కొంచెం చాటుమాటుగా హావభావాలచేత నామనస్సుకు తగిలేటట్లు స్ఫురింపచేస్తూ ఉంటుంది.

అయితే మనలో మాట చెబుతున్నాను. నేనూ అంతనిరపరాధుణ్ణి కానులేండి. "కంఠాశ్లేష ప్రణయిని జనే కిం పునర్దూరసంస్థే" అని భార్యా వియోగంవల్ల యక్షుడు దుఃఖించినట్లు నేనూ దుఃఖించి :

*రసపిపాసలనడచు నీరమ్యమూర్తి*
*మెరుపువలెనైన గనుపించి మరగిపొమ్ము*

అని చాల దీనంగా వేడుకొన్నాను. వేడేకొందీ యింక కొంత బిగిసి ఏదో కొంతకాలం కుదురుగా కాపురం చేశాము. సంతానంకూడా కలిగింది. కాలంగడిచి పోతున్నది. కాస్త యింటిపట్టున వుంటే బాగుంటుందని నాకోరిక. కాని నాకోరిక నిష్ప్రయోజనమైంది. కసితీర్చుకో దలచుకొని 'వెంకటచలం' గారి నవలలు, కథలు అన్ని పట్టుపట్టి చదివాను. వ్యభిచరించడం ఒక గుణమని సిద్ధాంతం చేసుకొని, అందుట్లో మా వివాహం Convenience Marriage కాబట్టి, అంత చచ్చుదనంగా ఉండడం మరీ లోకువగా వుంటుందని అహంభావ కవులవద్ద కొంత అహంభావం ఎరువుతీసుకొని సాహసం సంపాదించి, చిత్రలేఖను చేరదీశాను.

చూచారా మానవస్వభావంలో ఉండే చిత్రం. నాయిల్లాలికి మనసులో ఈర్ష్యపుట్టింది. నన్ను వేటాడడం మొదలుపెట్టింది. నేను కొంచెం మూతిబిగింపు చూపినాను. మౌనము ధరించాను.

*నేటికైనను నా యున్కి నీకు తలపు*
*వచ్చె; నది కొంతభాగ్యంబు మెచ్చుకాడ,*
*బహుళ సంతానవతియైన భార్యవలపు*
*సాటిగాదయ్యె కొందగు లాటమునకు.*

*ప్రేమసూత్రాల ద్రెంపెడి బిగువుసడలి*
*బిచ్చకత్తియపొల్కి నీ పిలుపు లేక*

వచ్చినిలిచితి ముంగిట, నిచ్చకాల
కైన దలయెత్తి చూడవు మౌనివైతె ?

అంటూ పూర్వప్రేమను తోపింపజేస్తూ, బొటన వ్రేలు నేలరాస్తూ కన్నీరునింపింది. చిత్రలేఖకు నాకు కలిగిన సాంగత్యం ఫలప్రదం కాకపోయినప్పటికినీ కవితకు నామీద ఉన్న పూర్వప్రేమ యింకా మాసిపోలేదని ఋజువుచేసింది. బయటికి తెచ్చికోలు బిగింపుచూపినా లోలోపల నాహృదయం వెన్నవలె కరగిపోయింది. అన్నానుగదా.

నిలునిలుమోసఖీ, మనసు నీరయిపోయె; నవజ్ఞగాదు; నీ
వలె ననుజేరవచ్చె బహువర్ణ సుశోభిత చిత్రలేఖ ; నే
వలదన జాలనైతి ; నెలప్రాయము మోసముజేసె ; నిక్క ముం
దెలిసిన నీవునుం జెలిని దియ్యని కౌగిటజేర్తు వింతకున్.

అని ఓదార్చినాను. ఇద్దరం భాయిభాయి అనుకొన్నాము. విరహాంతరమువల్ల మా సమాగమం ప్రణయ చిక్కణంగా కనిపించింది. తర్వాత పలితకేశం కనుపించి :

చెలువలు ప్రేముడిం గదుము చిక్కని కౌగిళులన్ సుఖించి ని
చ్చలు మధురాధరామృతరసంబున మత్తిలి యౌవనంబు ని
శ్చలమని యెంచి కామపరిచర్య యొనర్చుచు భావికాల చిం
తలు తలపెట్టబోని పశుతత్త్వుని నిద్దురలేప వచ్చితిన్.

అంటూ హెచ్చరించింది. పాపం! నా యిల్లాలి ముఖం మేఘాచ్ఛన్నమైంది చూచాను.

అతివ పొరపాట్ల ప్రహసనం బాడినాము
భరత వాక్యంబుగా పెట్టు వలపు ముద్దు;

అని ఒక ముద్దు ముద్రించాను.

- ( ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో.)



# తిక్కన

మహాభారతాంధ్రీకరణముతోడ ఆంధ్రుల నాగరక జీవితము ప్రారంభమైనదని చెప్పవచ్చును. గాసట బీసటే చదివి సంతృప్తిపడు ఆంధ్రులకు సర్వలక్షణ సమన్వితమైన భాష, కవిత్వము చేకూడినది. వైదికమతము వ్యాపింపజేయ వలయుననే కోర్కియే భారతాంధ్రీకరణమునకు మూల కారణము. రాజరాజు వైదిక మతాభిమాని కావున నన్నయను ఆ మహాకార్యమున నియోగించి ఆదరించెను. మొట్టమొదటి యుద్దేశమెట్టిదైనను ఆంధ్రులకు ఆంధ్రభాషకు మహోపకార మొనగూడినది.

అరణ్యపర్వము పూర్తి కాకపూర్వమె నన్నయ అస్తమించెను. ఆయన మరణము వింతవింత కింవదంతులకూ ఊహలకూ ఆకరమైనది. "అసలు సంస్కృత భారతమును తెనుగు చేయడమే ఒక గొప్ప అపచారము. కాబట్టి దుఃఖభాజనమైన అరణ్యపర్వము పూర్తిగాకమునుపే నన్నయ మరణించినాడు" అను నమ్మకము దేశమున వ్యాపించినది. దీనిలో ఆశ్చర్యమేమిన్నీలేదు. నాగరకయుగమని చెప్పుకోబడే యీ యిరవయ్యో శతాబ్దమునకూడ ఇట్టి విశ్వాసములు నాటుకొనియున్నవి.

రెండువందల సంవత్సరములు గడచిన వెనుక తిక్కన యవతరించి ఈ యాంధ్రీకరణ భారము వహించువరకు ఈ పనికి పూనుకొన్నవారు లేరు. తలపెట్టినవారుండవచ్చును. అధర్వణాచార్యుడు భారతము రచించెనని వినికిడి. అదేమైనది? దానినిగుఱించి కొన్ని కట్టుకథలు ప్రబలినవి. అయితే యీ మధ్యకాలమున భారతమును తెనిగింపగల మహాకవి ఆంధ్రదేశమున లేడా? రామాయణమంతటి బృహత్కావ్యమును నిర్వహించిన భాస్కరాదులున్నారుగదా. బహుశా అరణ్యపర్వమును గుఱించిన మూఢవిశ్వాసము కొద్దిపాటి మార్పులతో తిక్కన నాటికిగూడ వ్యాపించి యుండినదేమొ? ఇటువంటి విశ్వాసములకు కారణభూతమైన అరణ్యపర్వ శేషమును వదలిపెట్టి విరాటపర్వము మొదలు పదునేనింటిని తెనిగించెను.

నన్నయకును తిక్కనకును షుమారు రెండువందల సంవత్సరముల కాలవ్యత్యాస మున్నది. ఈ మధ్యకాలమున రాజకీయ సాంఘిక విషయములందేమి భాషా విషయము నందేమి, ప్రజల యాచార వ్యవహారము లందేమి కొన్ని మార్పులు తప్పక జరిగియుండ వలయును. నన్నయ తిక్కనల కావ్యప్రయోజన దృష్టి భేదములకు ఈ మార్పులే బాధ్యములై యుండవచ్చును. నన్నయ వైదిక దృష్టితోను, జగద్ధిత బుద్ధితోను భారత రచనకు పూనుకొనెను. తిక్కన శిల్పదృష్టితోను "ఆంధ్రావళి మోదముం బొరయించు" బుద్ధితోను భారత రచన కొనసాగించెను.

తిక్కన కాలమునకే ఆంధ్రులు, ఆంధ్రత్వము అనునొక ప్రత్యేకత, సాంఘికజ్ఞానము అంకురించి యుండినది. ఈనాటి గ్రాంథిక, వ్యవహారిక భాషావాదముల వలెనే ఆనాడును మార్గకవితా దేశికవితావాదములు పుట్టియుండినవి. దీనికి కారకులు శివకవులు. జాను తెనుగున కావ్యగతార్థము సామాన్యజనులకు బోధపడునట్లు వ్రాయుటయే వారి యుద్దేశము. అట్టి గ్రంథములే మన ప్రచారమున కనుకూలముగ నుండును. ఇట్టి యుద్దేశముగల కవులలో ప్రబంధ పద్ధతిని వ్రాసి ప్రబంధ రచనకు మార్గదర్శియైనవాడు నన్నెచోడుడను రాజకవి. నిర్వచనోత్తర రామాయణమున తిక్కన చేసికొన్న నియమములనుబట్టినీ తర్వాత కొంత కాలమునకు భారతమును రచించిన విధానమునుబట్టినీ ఈయనకూడ జాను తెనుగు ఉద్యమమునకు సంబంధించిన వాడేనని చెప్పవచ్చును. సంస్కృతశబ్ద బహుళమైన దీర్ఘసమాసములకంటె "అలతి యలంతి తునియలుగ" విరుగు తెనుగు శబ్దములపైననే యీయనకు అభిమానము మెండు. "జాత్యముగామి నొప్పయిన సంస్కృత మెయ్యెడజొన్ప' 'డు. శివకవులవలెనే తిక్కనకూడ యిట్టి నియమములు చేసి కొన్నను ఆచరణలో మాత్రము విధిలేక కొంత ప్రతిజ్ఞా భంగము కలిగినది. ఇది కాలపరిస్థితినిబట్టి అనివార్యము కూడ. అదివఱకే సంస్కృతము ఆంధ్రమునందు తిలతండుల న్యాయముగ కలసిపోయినది. అరబ్బీభాష మూలమున పారసీభాష మఱింత సంపన్నమైనట్లు సంస్కృత సంబంధము వలన తెనుగు భాషకు పదజాల సమృద్ధి కలిగినది. కాని ఆ కాలమున ఈ జాను తెనుగు ఉద్యమమే లేనట్లయిన తిక్కన కాలము నాటికే తెనుగు పద్యములు ఇనపగుండ్లుగా తయారైయుండెడివి.

కేతన రచించిన దశకుమార చరిత్రమువలన తిక్కననుగుఱించి కొంత తెలిసికొన వచ్చును. తిక్కన బహుకళాసంపన్నుడు. వాక్పతినిభుడు. సకలాగమార్థతత్త్వవేత్త. ఉభయకవిమిత్రుడు. ఇంతేకాదు. తిక్కన అభిరూప భావభవుడు. కామినీ చిత్తచోరుడు. పూజాతత్పరుడు. ధీరుడు.

తిక్కన నిర్వచనోత్తర రామాయణమున "నేనుభయకావ్యప్రౌఢి బాటించు శిల్పమునం బారగుడం గళావిదుడ"నని చెప్పియున్నాడు. కవిత్వము శాస్త్రముకాదనీ, శిల్పమనీ కళయనీ తిక్కన గ్రహించినాడు. తిక్కన మహిమను పూర్ణముగ తెలిసికొన్న పూర్వకవులలో ఎఱ్ఱన ప్రథముడు.

తనకావించిన సృష్టి తక్కొరుల చేతంగాదునా, నేముఖం
బున దాబల్కినపల్కులాగమములై పొల్పొందునా, వాణిన
త్తను నీతండొకరుండ నాజనుమహత్త్వాప్తిం గవిబ్రహ్మ నా
వి నుతింతుం గవి తిక్కయజ్వ నఖిలోర్వీదేవతాభ్యర్చితున్.

తిక్కన కావించిన సృష్టి. అది యితరులచేత గానిపని. ఆయన కవిబ్రహ్మ. ఇదియెట్లు?

సంస్కృతమునుండి తెనిగించి నది స్వతంత్ర సృష్టి యెట్లయినది ? సంస్కృత మూలముతో తిక్కన భారతమును సరిపోల్చి చూచినప్పుడే తాను కావించినది సృష్టియని గోచరించును.

ఒకటి రెండు వాక్యములలో సంస్కృత భారతమునకును తిక్కన యాంధ్రీకరణము నకునుగల తారతమ్యము చెప్పదలతుమేని - మూలము అస్థిపంజరము - తిక్కన ఆంధ్రీకరణము రక్తమాంసయుతమైన జీవన్మూర్తి.

కవియే కథచెప్పినట్లుగాక పాత్రలే మనయెదుట నిలబడి వ్యవహరించునట్లు, వారి మనోవృత్తులు భావవికారములు, అభినయ వర్ణనమూలమున మూర్తీభవించినట్లు రచించుటే తిక్కనగావించిన గొప్ప మార్పు. నాటక పద్ధతివలన తెలుగు భారతమునకు అపూర్వమైన చైతన్యము కలిగినది. తిక్కన యెక్కడెక్కడ రసాభ్యుచితముగ మూలాతిక్రమణముచేసెను, ఎక్కడెక్కడ ఔచిత్యమును పోషించెను. అను చర్చకు నిదర్శనపూర్వకముగ పూనుకొందుమేని భారతమంత పెద్ద విమర్శన గ్రంథము వ్రాయవలసియుండును. అయినను ఆ మహాకవి అవలంబించిన రచనా పద్ధతులను కొన్నిటిని చూచెదము.

1) సంభాషణమూలకమైన నాటక పద్ధతిలో కథనడుపుట.

2) రసపోషణకుగా యథేచ్ఛముగ మూలమునతిక్రమించుట, అమూలకమును చేర్చుట, మూలమును మట్టగించుట.

3) వస్తువుయొక్క ఐక్యమునకూ కథాగమనమునకూ అభ్యంతరములైన భగవద్గీతలవంటి వానిని వదలుట.

4) పాత్రలు ప్రాణవంతములుగ స్ఫురించుటకు అంగవికారాద్యభినయములను కన్నులు గట్టినట్లు వర్ణించుట.

5) పాత్రల వ్యక్తిత్వము భిన్నత్వము పరిస్ఫుటమగునట్లు శీలమును పోషించుట.

6) ఔచిత్యమును పోషించుట.

7) ఉదయాస్తమయాది వర్ణనములు కథలో మేళవించునట్లు చేయుట.

8) భావరసానుగుణమైన శైలి.

వీని యన్నిటి సమష్టి ఫలితమేమనగా ఆంధ్రీకరణము సంస్కృత మాతృకకంటె వేయింతలు కళావిశిష్టమయి సినిమా చిత్రమువలె అనుక్షణ భిన్న కార్యశీలమయి ఆంధ్రసారస్వతమునకు పట్టుగొమ్మయయి నిలిచినది.

కొన్ని ఉదాహరణములు :

1) విరహవిహ్వాలుడైన కీచకుని యవస్థావర్ణనములు, సంభాషణములు, ఆ ఘట్టములోని ద్రౌపదీ వర్ణనములు చాల వఱకు అమూలకములు. అవి లేతపాకపు ప్రబంధధోరణి లోపడినను చాల మనోహరములై యున్నవి.

2) సుధేష్ణ వారుణిదెమ్మని ద్రౌపదిని కీచకుని యింటికి పొమ్మనినప్పటిస్థితి మూలమున "శంకమానారుదతీ" అని చెప్పబడియున్నది. ఇది కొంచె మించుమించు "ద్రౌపది సందేహించుచూ ఏడ్చును" అన్న Stage direction కు సరిపోవును. కాని యిక్కడ లోపించినది ఆ direction ననుసరించి అభినయించే పాత్ర. ఆ లోపాన్ని తిక్కన పూరించినాడు. అట్టి ద్రౌపది పాత్రను నాట్యరంగమున నిలబెట్టి మన కన్నులయెదుట అభినయింపించినాడు.

3) "ఉల్లము తల్లడిల్ల దనువుద్గత ఘర్మజలంబు దాల్చుచున్ డిల్లవడంగ" ఇంతవఱకు ఈ చిడిముడి పాటంతా అభినయము. "నాకిది కడింది విచారముపుట్టె; అందుబోనొల్లననంగరా, దచటి కూరక పోవనురాదు, నేర్పు సంధిల్లగ దీని బాపికొను దీమసమెట్టిదొ" - ఇది స్వగతము. మనసులోని ఉరిమాట. తలపోతల పోరాటము. To be or not to be - that is the question అనే మానసిక సంఘర్షణము. ఒక చిన్నను అభినయించు పాత్రగా మార్చగలిగిన Stage direction తిక్కనయింద్రజాలమె తెలుగు భారతమునకు అనన్యమైన విశిష్టతను చేకూర్చినది.

4) తిక్కన నిశితమైన లోకజ్ఞానము కలవాడు కావున ఔచిత్యములను చక్కగ పోషించెను. బృహన్నలను ఉత్తరకు ఆట నేర్పుటకు నియోగించుటకు పూర్వము అతడు నిజముగ నపుంసకుడా లేక పుంసత్వముకలవాడా అను సంగతి ప్రమదలచేత పరీక్షచేయించి విరాటుడు తన సంశయము తీర్చుకొన్నట్లు మూలమున నున్నది. ఇది చాల మొరటుగాను బూతుగాను కనిపించును. దీనిని "నైపుణంబున నుచితంబుమై నరసి" యని తిక్కన నాజూకుగా మార్చి తన సున్నితమైన యభిరుచిని వెల్లడించెను.

5) "నిగూఢస్త్వం తథా పార్థ కీచకం తం నిషూదయ" అని కీచకుని రహస్యముగ చంపవలయునని భీమునితో ద్రౌపది చెప్పినట్లు మూలమున నున్నది. దీనికి విరుద్ధముగా భీమ కీచకుల యుద్ధము ఇట్లు వర్ణింపబడినది.

" ...సమభవద్ఘోరో వేణుస్ఫోట సమోయుధి" అని "అన్యోన్యం ప్రతిగర్జతాం" "విరురావ మహాబలం" అని "నదంతంచ మహానాదం భిన్నభేరీ సమన్వితం" అని - అంటే, పూరిండ్లు కాలునప్పుడు వెదురు బొంగుల గణుపులు పగిలి పెట్లు దిమ్మలవలె శబ్దించును. అటువంటి శబ్దములతోను, అట్టహాసాది గర్జనములతోను, భేరి వాయించు నప్పుడు దానిచర్మము

పగిలిన ఎంత శబ్దమువచ్చునో అంత శబ్దముతోను వారు పోరినారట ! ఈ అల్లకల్లోలమునకు రాజగృహములోని వారేకాక యూరివారందరు ఉలిక్కిపడి లేచి యుందురు. తిక్కన పూర్వాపర సందర్భ వైరుధ్యము కలగకుండునట్లు -

తనయగ పాటొరు లెఱుగుదు
రని సూతుడు, సమయభంగమగుటకు భీముం
డును గొంకుచు చప్పుడు సే
యని గూఢవిమర్దన ప్రహారముల దగన్.

అని యుచితముగ మార్చి రహస్య యుద్ధమునకు కారణములుకూడ చూపెను.

నూటికి నూలుపోగనునట్లుగా తిక్కన కావ్యగుణములను సూక్ష్మముగ తడవి యింతటితో విరమించుచున్నాను.

- ( ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో.)



# "మీరాబాయి" - ఒక విషాదాంతము

(శ్రీ దువ్వూరి రామిరెడ్డి గారిచే రచింపబడిన "మీరాబాయి" నాటకము నెల్లూరి వెంకటగిరి రాజాగారి కళాశాల "ప్రాతవిద్యార్థి సంఘము" వారిచే 7-5-1933 న ప్రదర్శింపబడి సహృదయులగు ప్రేక్షకుల సంస్తుతికి పాత్రమైనది. అప్పటినుండి కొంతకాలమువఱకు ఆ నాటకమును గుఱించిన బాగోగుల వివాదములు స్థానిక పత్రికలయందు ప్రచురింపబడినవి. అప్పుడు నెల్లూరినుండి వెలువడుచుండిన "Scrutator" అను పత్రికయందు "రసలుబ్ధుడు' "మీరాబాయి" నిగురించి ఒక విమర్శనము రచించి ప్రకటించెను. శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారు "కళాప్రియుడు" అను పేరుతో అదే పత్రికయందు "రసలుబ్ధుని" యాక్షేపములకు ప్రత్యుత్తరమిచ్చెను. ఈ విమర్శనము పాఠకులకు ఉపయోగపడునను ఉద్దేశముతో ఈ సంపుటిలో చేర్చినాము - సం.)

" శృంగారమేగాని వీరమేగాని ఒకటేరసము అంగి, కడమరసములన్నియు అంగములు" అను నిట్టివి మఱికొన్ని సాహిత్యదర్పణములోని నాటక లక్షణముల నుదాహరించి, ఆ లక్షణములనుబట్టిచూడ మీరాబాయి నాటకమున రసాభాసము కలిగినదని తీర్మానించి, (రసాభాస మన్నంతనే, అదేదో గుణలోపమని పామరుల యూహ; అది యట్టిది కానేకాదు. అదియొక పారిభాషిక పదమని పెద్ద లెఱుగుదురు.) "ఇత్యాది శాసనవ్యాప్త సాహిత్య రాజ్యమున హూణాది విదేశబల సాహాయ్యమున శాసనము నుల్లంఘించి పితూరీలు రేపుచున్నారుగదా ఇప్పుడు కవులు !" అని కాల విపర్యాసమునకు వగచి, ప్రాణమైన రసము దెబ్బతినగా కళేబరము నేల వ్రాలదాయనియు, ఒకవేళ అట్లు వ్రాలనీయక "బ్రాడ్లీ ప్రభృతుల ట్రాజెడీ సంచిలోని క్రొత్తసంజీవనిందెచ్చిపోసి నిలుప గలమా? ఆమందు త్రాగి కులముచెడినను ఎందేని బ్రతికి ఊర్జితముగా నుండునేమొ" అని కులము చెడని తన పౌరాణిక మనస్తత్వమును, సందేహమును, రసలుబ్ధుడు వెల్లడించినాడు. ఈ పురాణ పురుషుని వగపునకును సందేహమునకును కారణము కాలానుగుణముగ తలసూపు మార్పులను గుర్తింపనేరమి యనియే నాతలంపు.

లక్షణములు శాసనములా? లాక్షణికులకు అను శాసించు అధికారము ఎవరివలన గలిగినది ? ఆ యధికారము వారు స్వయముగ తెచ్చిపెట్టుకొన్నదా ఇతరులిచ్చినదా? లక్షణములకు లక్ష్యములకు గల సంబంధమేమి? నాటక లక్షణము లికమీద పుట్టుటకు అవకాశ ... దా? సాహిత్య దర్పణములోని నాటక లక్షణములు ఇప్పటి నాటక రచయితల నెంతవఱకు బంధించును? శృంగార వీరములే నాటకమున ప్రధాన రసములుగ నుండవలయునా? రసాభాస సిద్ధాంతము 'ట్రాజెడీ' లకును జెల్లునా ? అను విషయములను మనము విచారించి నిగ్గుదేల్చిననే గాని "శాసనవ్యాప్త సాహిత్య రాజ్యమున పితూరీలు" రేపు

స్వాతంత్ర్య ప్రియులైన నేటికాలపు కవుల యుద్యమముయొక్క గౌరవమును మనము గ్రహింపలేము.

కళలువోలె తదంతర్గతములగు లక్షణములును స్వయంభవములు. అవి ప్రతిభాశాలులైన కవుల భావప్రపంచమున నుద్భవించి రచనాముఖమున వ్యక్తమగును. కొంతకాలము గడచునప్పటికి వివిధములగు రూపకములేర్పడును. మొట్టమొదట రచియించువారికి మార్గదర్శకముగ లక్షణ గ్రంథము లుండనేరవుగదా! అందువలననే వివిధత్వమునకు అవకాశముండును. తరువాత కొన్ని నూఱుల సంవత్సరములకు (అనగా నిర్మాణయుగము దాటిన వెనుక) లాక్షణికులు తమకు పూర్వము రచియింపబడియున్న రూపకములను పరిశీలించి నిర్మాణపద్ధతి, ఇతివృత్తము, నాయికానాయకులు, రసము మున్నగువాని యందలి భేదముల ననుసరించి రూపకములను కొన్ని వర్గములుగ విభజింతురు. లక్షణ గ్రంథములు వ్యాపించిన క్రమమిదియే. తరువాత స్వతంత్ర రచనము సన్నగిల్లి అనుకరణములు బయలుదేరినవి. నేటి కవులు సాహిత్య రాజ్యమున పితూరీలు సలుపుట అన్యాక్రాంతమైన స్వరాజ్యమును తమపరము చేసికొనుటకే యని రసలుబ్ధుడు గ్రహించుగాక!

నాటక రచనముగూడ నొకప్పుడు ప్రభవించి క్రమక్రమముగ నభివృద్ధి చెందినదే. భరతముని నాట్యశాస్త్రమునకు పూర్వము ఎట్టి ప్రేక్షణీయకము లుండినదియు మన మెఱుగము. కంసవధ, బలిబంధనము, అను రూపకముల పేరులు పతంజలి యుదాహరించెనేగాని యాపురాతన రచనల తత్త్వమెట్టిదో మనమెఱుగము. సౌమిల్లి కవిపుత్రాదుల రూపకములు మనకు లభింపలేదు. మన పూర్వపుణ్యవశమున భాసుని రచనలు లభించినవి. భాసుని రూపకములకును తరువాతి కాళిదాసాదుల నాటకములకును గల తారతమ్య మరయుదుమేని కాలక్రమముగ వచ్చు మార్పులను మనము గమనింపగలము. తనకు పూర్వము రచింపబడిన 'కంసవధ' యందువలెనె భాసుడును 'ఊరుభంగము' అను రూపకమున వధను 'స్టేజి'పై చూపించెను. కాని తరువాత నాటకములలో అట్టి సంవిధానము వర్జింపబడినది; ఇట్టి మార్పులు అనేకములు పొడకట్టును. మార్పులు అనివార్యములు. కళలకును మానవ సంఘమునకును సన్నిహిత సంబంధముగలదు. అందుపొడసూపు మార్పులు కళలయందును ప్రతిబింబించు చుండును.

లక్షణ గ్రంథములలోని నియమములను పొల్లువోక అనుసరించిన సంస్కృత కవుల నాటకములెన్ని యిప్పుడు ప్రదర్శనయోగ్యములై యున్నవి? పూర్వీకుల నియమములను అనుకూలమైనంతవఱకు గ్రహించి, వలయుచోట్ల క్రొత్త లక్షణముల తెచ్చుకొని రచియించు నేటికవుల నాటకములెన్ని ప్రజారంజకములుగ నుండుటలేదు? లక్షణములు శాసనములుకావు; మార్గదర్శకములు. కాలము గడచుకొలది భిన్నమార్గము లేర్పడుచుండును. "భావిపరిణామ

మెవ్వరు పలుకగలరు?"

నాట్యరంగ పరికరములయందు ఇప్పటికిని అప్పటికిని ఎంతయో తారతమ్యము గలదు. ఈ భేదము నాటకరచనయందును చూపట్టదా? నాయకుడు ఏ స్థలమున సంచరించుచుండునో ఆస్థలమును స్ఫురింపజేయగల ఆలేఖ్యపటములు పరదాలు లేని యాకాలమున నటకులు వర్ణింపవలసిన అంశములు మెండుగ నుండును. కావుననే కార్యసంచలనమునకు కథాప్రసరణమునకు ప్రతికూలమైనను సంస్కృత నాటకములందు కవిత్వభాగము హెచ్చుగనుండును. ఈ కాలపు నాటకములలో నట్టివర్ణనములకు అంత యవసరముండదు. షేక్స్పియరు నాటకములకును, ఇబ్సన్, బియరన్‌సన్, గాల్స్వర్థి, బెర్నార్డుషా మున్నగు ఆధునికుల నాటకములకును గల "Technique" భేదమును గ్రహింతుమేని నాటకరచనాపద్ధతి యెంత అభివృద్ధియైనదో మన మెఱుంగకపోము. కాని అభివృద్ధి సూచకములుగా నున్నను మార్పులు కలిగినపుడెల్ల పూర్వాచారపరాయణులగు పండితులు ప్రపంచము తలక్రిందై పోవుచున్నదో యనునట్లు గగ్గోలు పడుచుందురు. క్రొత్తప్రాతల సంధికాలమున నిట్టిపోరాటములు తప్పక సంభవించుచుండును.

ఇతర కళలవలెనే నాట్యకళసైతము రాజాశ్రయముననే యభివృద్ధి చెందినది. రాజప్రాసాదములందు నాట్యమండపములుండెను. వసంతోత్సవ సమయములందు రాజుల యొక్కయు పండిత నాగరకులయొక్కయు వినోదముకొఱకు నాటకములు ప్రదర్శింపబడుచుండెను. రాజులు శృంగారప్రియులు; అంతఃపురములను స్వర్గతుల్యముగ నొనర్చుకొనిన సంపన్నులు. వారికి జీవితము సుఖమయము. కావుననే మనదేశమున శృంగార రసప్రధానములైన నాటకముల సంఖ్యయే హెచ్చుగనుండును. వీరరసము గ్రాహ్యమయ్యును దానికి ప్రాధాన్యమొసగి వ్రాయబడిన నాటకముల సంఖ్య అల్పము. కాలక్రమమున పరిస్థితులు మాఱినవి. శృంగార వీరములకన్న నన్యములగు కరుణ శాంతములు నాటకమున ప్రాధాన్యము వహించుటకు ఆటంకమేమి యను విచారము బయలుదేరెను. భవభూతి కరుణము అంగిగా ఉత్తర రామ చరితమును రచించి 'రసేషు కరుణో రసః' అను ఆర్యోక్తికి కారణభూతుడాయెను. శాంతరసప్రధానముగ కృష్ణమిశ్రుడు ప్రబోధ చంద్రోదయ నాటకమును రచించెను. పాపము! ఉత్తరరామ చరితము లాక్షణికుల తత్తఱపెట్టినది. ఇందలి రసము శృంగారము కాదు; వీరముకాదు. ఇక ఉత్తరరామచరితము లక్షణ బాహ్యమనవలయును. ఇదెట్లు పొసగును? లోకము అంగీకరించునా? భవభూతి నెట్లయిన లక్షణ బద్ధుడని తీర్మానించుకొనకున్న లక్షణములకే గౌరవము తగ్గునుగదా! అందువలన లాక్షణికులు, ఉత్తరరామచరితమున ప్రధాన రసము కరుణము గాదనియు, అది విప్రలంభ శృంగార మనియు ధర్మవీరమనియు తర్కవాదములు సలిపి కొంత ఆత్మ సంతృప్తివడసిరి. అట్లుగాక, లక్ష్యము ననుసరించి

క్రొత్తలక్షణమును నెలకొలుపుకొని యుండిన భవభూతి స్వాతంత్ర్యమును మనము గౌరవించిన వారమై యుందుముగద!

రతి ఉభయనిష్ఠము కానందువలన మీరాబాయి నాటకమున రసాభాసము గలిగినదని రసలుబ్ధుని వాదము. ఈపాటి విషయము కవియు నెఱింగియుండును. కాని, రసాభాస సంవిధానముకూడ ప్రదర్శన యోగ్యమని కవిమతము కాబోలు కావుననే యీకవి "రస" సిద్ధాంతమును త్రోసిపుచ్చి "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్య"మ్మను పండితరాయల నిర్వచనమునకు ఉదాహరణ ప్రాయముగ, తాను రచించిన 'వనకుమారి', 'కడపటి వీడుకోలు' అను కావ్యములందును ఇట్టి 'రసాభాస' సంవిధానములను చేకూర్చియున్నాడు. కవి మీరాబాయి నాటకమున శృంగారరసము పరిపూర్తి సేయ దలచుకొనలేదనుట స్పష్టము. రతి ఉభయ నిష్ఠము కానియపుడు చూపట్టు మానము, ద్వేషము, ఈర్ష్య, రోషము, వానిమూలమున గలుగు దురవస్థలు, మనోవిప్లవము కవి రూపింప దలచుకొనెను. ఈ తెగకు సంబంధించిన ప్రబంధములు పూర్వమే రచింపబడియున్నవి. కీచకవధ, శుకరంభాసంవాదము, సారంగధర చరిత్రము, మనుచరిత్రము మొదలయిన ప్రబంధములు ఈ కోటిలోనివే. ద్రౌపదీ కీచకులయందు రతి ఉభయనిష్ఠము కానందువలననే కీచకుడు దుర్మరణము పొందెను. చిత్రాంగీ సారంగధరులలో గూడ రసము ఉభయనిష్ఠము కానందువలననే సారంగధరునకట్టి పాటు గలిగెను. లాక్షణికుల సిద్ధాంతముల ననుసరించి యిట్టి కావ్యములు, నాటకములు, తగులబెట్టబడ వలసినవే గదా! వేయి సాహిత్యదర్పణములనైన బుగ్గిచేయనోర్తుముగాని, లోకోత్తర రామణీయకము కనులగట్టించు మనుచరిత్రమును మంటవేయగలమా ?

"It is that the artist as such must have no creed;...... Rules, conventions, theories, principles, inhibitions of any sort not born of his own immediate feeling are no concern of his. They proceed from an inferior part of human nature, being the work of gapers and babblers."

*- J.W.Von Goethe*

రతి ఉభయనిష్ఠముకానిచో, రచన హాస్యాస్పదమగునని రసలుబ్ధుడు లక్షణ గ్రంథములలోని కొన్ని ప్రమాణముల నుదాహరించెను. ఈ లాక్షణికులు 'శృంగా రాను కృతిర్యాతు స హాసః' అను భరత నిర్వచనమునే యనుకరించి లక్షణము లల్లిరేగాని, సొంతముగ నాలోచించి యందలి భేదముల నరయరైరి.

రతి ఉభయనిష్ఠముకాని యపుడు హాస్యము పుట్టుటకు నాయికా నాయకులలో నొకరియందో లేక యిరువురందో లాఘవము (frivolity) అగపడవలయును. అట్లుగాక,

యుభయులందును గౌరవమును, seriousness of purpose పొడకట్టు నేని హాస్యము పుట్టదు. నాయికకైనను నాయకునికైనను మానము, ఈర్ష్య, క్రోధము; కసితీర్చుకొన వలయునను తలంపు పుట్టును. ఈ భేదమును లాక్షణికులు (గతానుగతికులగుటవలన) గుర్తింపలేదు. ఇట్టి విషయములందు కేవలము సచేతనుల యనుభవమేగదా ప్రమాణము!

## II

"In Short, tragedy is not history in dialogue. History is for tragedy nothing but a storehouse of names where with we are used to associate certain characters, ........ For the dramatic poet is no historian, he does not relate to us what was once believed to have happened, but he really produces it again before our eyes, and Produces it again not on account of mere historical truth, but, for a totally different and a nobler aim. Historical accuracy is not his aim, but only the means by which he hopes to attain his aim he wishes to delude us and touch our hearts through this delusion."

*- G.E. Lessing.*

మీరాబాయి నాటకములోని మీరా కుంభరాణా అగ్బరు తాన్‌సేన్‌లు చరిత్రకు సంబంధించిన వారయ్యు కథమాత్రము చారిత్రకము కాదు. అగ్బరును కుంభరాణాయు సమకాలికులు గారు. రాణా క్రీస్తువెనుక 1419 వ మొదలు 1469 వ సంవత్సరము వఱకును, అగ్బరు 1556 మొదలు 1605 వ సంవత్సరము వఱకును రాజ్యమేలిరి. రాణా సింహాసన మధిష్ఠించిన 137 సంవత్సరములకు అగ్బరు పట్టము గట్టుకొనెను. కాని, సంప్రదాయానుగతముగ లోకమున వ్యాపించి యున్న కథయందు మీరా అగ్బరులకు సంబంధము కల్పింపబడియున్నది. మీరా కథ మూడునాలుగు విధములుగ గ్రంథస్థమై యున్నది. ఒక కథకును మఱియొక కథకును భేదములున్నవి. అచ్చమాంబగారి "అబలా సచ్చరిత్ర రత్నమాల" యందును "మీరా గీతావళి" అను హిందీ గ్రంథమునందును, "భక్తవిజయము" నందును మీరా కథగలదు. "రాజస్థాన కథావళి" యందు రాణాచరిత్ర కనబడుచున్నదే గాని మీరావిషయమై అందుగానబడదు. కాలము మీరా కథకు కొంత 'పౌరాణిక స్పర్శ' కలిగించినది; యథార్థచరిత్రము పురాణ గాథలలో లీనమైనది.

హిందూదేశ చరిత్రాంశములను బోధించుటకు కవి యీ యితివృత్తమును గ్రహించి యుండడు; తాను రూపింపదలచుకొన్న భావస్పర్ధకు ఈ యితివృత్తము అనుకూలముగ నుండునని యూహించి దీనిని గ్రహించి యుండును. పాత్రపోషణ సరణికూడ చారిత్రకముగాదు.

అగ్బరు ఒక క్రొత్తమతమును స్థాపించిన వాడయ్యు ఈ నాటకమున జూపబడినంత భక్తితత్పరుడు కాడు. రాణా అంత హేతువాదియుగాడు. కథ చారిత్రకము కానియపుడు పాత్ర పోషణము చరిత్ర సమ్మతమా కాదా యను విచారముతో మనకు పనిలేదు. ఈ నాటకమున నాయికా నాయకుల పాత్రపోషణము 'ట్రాజెడి' లక్షణములకు సరిపోవునా లేదా యను విషయమే ప్రస్తుతము విచారింపవలసిన యంశము. ట్రాజెడీ తత్త్వనిరూపణము దేశకాల పాత్రాను గుణముగ మాఱుచుండెను. గ్రీకు ట్రాజెడీలనుండి అరిస్టాటిలు సమకూర్చిన లక్షణములె చాల కాలమువఱకు అనుసరింపబడుచుండినవి. స్థూలముగ, ఈ ట్రాజెడీలను గ్రీకులవి, ఎలిజెబెతు కాలమునాటివి, ఆధునికులవి, అని మూడు వర్గములుగ విభజింపవచ్చును. గ్రీకు ట్రాజెడీయందు హాస్యజనకములగు సంభాషణము లుండకూడదు. వస్తువు కాలస్థల క్రియైక్యములను పొంది యుండవలయును. ఒక్క దినమున జరుగ గలవిషయమె నాటక నిబద్ధము కావలయును. కాలము చెల్లుకొలది ట్రాజెడీ రచనయందు కొన్ని మార్పులు అజ్ఞాతముగను, అనివార్యముగను గలుగుచుండెను. కొందఱు పండితులు ఇట్టి మార్పులకు సాధుత్వము ప్రసాదించు కొఱకు అరిస్టాటిలు లక్షణసూత్రములను సాగదీసి క్రొత్తవ్యాఖ్యానములు చేయుచుండిరి. మఱింత లాగునప్పటికి ఆసూత్రములు తెగిపోయెను. అప్పటినుండియు ప్రాతలక్షణములు క్రొత్త నాటకములకు మార్గదర్శకములు కావు అను వాదము బయలుదేరినది. షేక్స్పియరును అతని సమకాలీనులును నాటకములను రచియించిరి. ఈ నాటకములలోని విశిష్టత యేమనగా : స్థలైక్యముండదు - కథ కొన్నేండ్లపాటు జరిగినదిగనైన ఉండవచ్చును. ట్రాజెడీ చూచునప్పుడు కలుగు జాలి, భయము, చిత్తసంక్షోభము మున్నగువానియొక్క యొత్తిడివలన జనించు మనోనిర్భరత్వమును సడలించు హాస్యము కొన్ని పాత్రలమూలమున సంపాదింపబడును. ఈ కాలముననే Tragi - Comedy అను మిశ్రనాటకము ప్రభవించినది. ఇటువంటి నాటకము గ్రీకు నాటక లక్షణములకు వ్యతిరేకము కావున గ్రాహ్యము కాదు అని కొందఱు ఆకాలపు రసలుబ్ధులు వాదించిరి. కాని, ఈ తరగతి నాటకము గ్రీకు లక్షణములకు వ్యతిరేకముగ నున్నను, మానవ జీవితమునకు ప్రతిబింబకముగనున్నదనియు ఇట్లు రచించుట కళానైపుణ్యమనియు జాన్సను పండితుడు సిద్ధాంతము చేసెను. పూర్వలక్షణ విరుద్ధము లయ్యును ప్రజానురంజకము లగునేని అంగీకృతములయి అట్టి నాటకములు భావినాటక లక్షణములకు లక్ష్యములై పెంపొందగలవు.

కొంతకాలము జరిగినది. రాజకీయ సాంఘిక విప్లవములు, మానవసంఘమున చిరకాలము వేళ్ళునాటుకొని యున్న పూర్వనీతులను, భావములను, పెకలించివైచినవి. మానవుని విజ్ఞానప్రపంచము దినదినము విరివి యగుచున్నది. ప్రజాస్వామ్యములు గుర్తింపబడినవి. ప్రజాప్రభుత్వమే ఆదర్శకమను మూలసూత్రము అంగీకరింపబడినది.

సర్వమానవ సమత్వము నిరూపించుటకు ప్రవక్తలు, వక్తలు, సంస్కర్తలు తమజీవితముల ధారబోయుచున్నారు. ఈ విప్లవము, ఈ సంచలనము కళలయందును ప్రతిఫలింపదా? ప్రతి ఫలించినది. ఈ నవయుగ ప్రభాతమును సూచించు వేగుజుక్కయో యనునట్లు 1828 వ సంవత్సరమున నార్వేదేశమున ఇబ్సన్ అను నాటకకర్త జన్మించెను. ఈతని సిద్ధాంతము లేవి యనిన : స్వగతము,జనాంతికము, ఆకాశభాషణము మొదలయిన నాటకసమయములు రచన యొక్క బాల్యావస్థను దెలుపునవి. ఇట్టి అస్వాభావిక సాధనసంపత్తి సాహాయ్యమపేక్షింపకయె నాటకములు రచింపవచ్చును. ట్రాజెడీ కథానాయకుడు రాజుగా నుండవలసిన యవసరములేదు. కడపటి రంగమున నెత్తురు కాలువలు పాఱింపకయె అద్భుతమైన ట్రాజెడీని సృజింపవచ్చును. సామాన్య మానవుడు సాంఘిక జీవితమునందు బ్రతిదినము అనుభవించు విషయములో నెంతో ట్రాజెడీకలదు. నాటకము వినోదముకొఱకై రచింపబడునది కాదు, సంఘమును శుద్ధిపఱచుటకు. ఈ సిద్ధాంతములే "Problem Plays" అను సాంఘిక నాటకములకు మూలములైనవి. షేక్స్పియరు నాటకములలోని "విధి బలీయము" అను ధ్వని యిబ్సన్ నాటకములలో "వంశపారంపర్యాగత మానసిక శారీరక గుణావగుణము"ల బలముగా మాఱినది. ఈ విధముగ ప్రాణవంతమైన మానవసంఘముయొక్క మార్పుల ననుసరించి శిల్పతత్త్వ నిర్ణయమునందును భేదములు తలయెత్తుచుండగా ఈ రహస్యమును గుర్తింపలేక, విత్తనము నుండి చెట్టు మొలచినను వేళ్ళకు నంటుకొని నిరుపయోగమయి క్రుళ్ళిపోవుచున్న ప్రాత బొళ్ళెములను పట్టుకొని వ్రేలాడు రసలుబ్ధుల సంకుచితస్వభావము అనుకంపనీయము కదా!

ఇట్లనుట మన పూర్వీకుల లక్షణ గ్రంథములనెల్ల త్రోసిపుచ్చుటకాదు. వారి శక్తి సామర్థ్యములను గుర్తెఱుగక పోవుటకాదు. అనితరసాధ్యములగు వారి సిద్ధులను విస్మరించుటకాదు. వారి కీర్తికి భంగము కలిగింపవలయునను తలంపును కాదు. అట్లుచేయుట మనకాలి క్రింది కొమ్మను మనమె నఱకు కొనజూచుటయె. నేజెప్పవచ్చినది ఏమనగా : ఎవ్వరును - అందువలననే మన పూర్వీకులును సర్వజ్ఞులుకారు. ఎప్పుడో వేయిసంవత్సరములకు జరుగబోవు మార్పులను ముందే యూహించి వానికెల్ల లక్షణములు వ్రాయుట మనుజులకు సాధ్యముకాదు. అందుకయి పూర్వులపయి ధ్వజమెత్తవలసిన యవసరమునులేదు. కాని, మనకులేనివి యితరులవలన గ్రహించినతప్పేమి ? మనవిజ్ఞానమంతయు మనసొంతముదేనా? ఎన్నిజాతులు హిందూదేశముపై దాడి వెడలినవి? ఎన్ని విధములైన నాగరకతలతో మనకు సంబంధము కలిగినది? ఇట్టి సాంగత్యమువలన మనజాతియందును, విజ్ఞానమునందును, మార్పులు కలుగలేదా? ఇది క్రొత్తయా? కులము చెడుటకు రసలుబ్ధుడు ఇప్పుడు ఉలుకనేల? ప్రాతవానిపై గౌరవము క్రొత్తవానిపై ద్వేషముగ మాఱకూడదు. సనాతన లాక్షణికుల యజ్ఞవేదికల

కడ ఆధునిక కవికుమారుల సృష్టులను బలి యీయరాదు, సృష్టికి క్రొత్తపాతలు లేవు. అది యెప్పటికిని అభినవమే.

## III

నాటకము రచింపదలచుకొన్నపుడు, కవి భావము నందు ముఖ్యపాత్రలు పాదకట్టి భావింపను భావింపను ప్రస్ఫుటములగును. వానిచుట్టును, అయస్కాంతముకడకు ఇనుపముక్కలు పరుగెత్తునట్టుల తక్కినపాత్రలు మూగుదురు. ఈభావప్రతిమలు ప్రాణవంతములై యథార్థములట్లు తోచును. ఈయంతర్నాటకము బహిరాకృతి తాల్చబోవునప్పటి యావేదనమును, మనో నిర్భరత్వమును, సృష్టిప్రేరకములగును - కళాసృష్టికి ఆదిమధ్యాంతములు గలవు. అది యవయవ సమన్వితమైన యాకృతి. అందు అవయవములకు అనురూపత్వము సహజముగ పొసగియుండును.

నాటక స్వరూపము "గోపుచ్ఛాకృతి" అని పూర్వులు నిర్వచించియున్నారు. నాటక వస్తువు ఏదియైన నొక స్పర్ధను (conflict) ఆశ్రయించుకొని యుండును. ప్రాణికిని విధికిని, వ్యక్తికిని సంఘమునకును, మంచితనమునకును చెడ్డతనమునకును, భిన్న సంకల్పములు గల మనుష్యులకును, భిన్న మతములకును స్పర్ధపుట్టినపుడు దాని యుత్పత్త్యున్మీలనోప సంహారములే నాటకరూపమును ధరించును. ఈ పరస్పరస్పర్ధ వధాంతనాటకములయందు మఱింత వ్యక్తమగు చుండును.

ట్రాజెడి లక్షణములను కొన్నిటిని వివరించి యా లక్షణములకు మీరానాటక మెంతవఱకు సరిపోవునో చూతము : కథానాయకుడు రాజుగాగాని లేక యంతటి గొప్పవాడుగా గాని యుండవలయును. ఇట్లనుట సర్వజనీనత సంపాదించుట కొఱకు. రాజు దురవస్థయు, మరణమును రాష్ట్రమునకెల్ల సంబంధించి యుండును. కావున అట్టినాయకుని యధఃపతనము జూచినపుడు మనకును సహానుభూతి కలుగును. నాయకునకు ధీరత్వము, ఉదాత్తత, దృఢ సంకల్పశక్తి, మానవ సహజములగు గుణదోషములను ఉండవలయును. నాయకుడు సకల సద్గుణ సముపేతుడగా నుండెనేని మనకు జాలిపుట్టదు, వికర్షణము కలుగును. నాయకుడనుభవించు దుఃఖమునకు ఆతడును కొంతవఱకు బాధ్యుడను సూచన లేనిదె మనము సహించియుండలేము. ఎట్టి కొఱంతయు లేనట్లు నాయకుని శీలము చిత్రించుట నీతిమంతులకు గుణమైనను, శిల్పులకు అది అవగుణమనియె నామనవి. ముఖ్యముగ వధాంత నాటకముల లోని నాయకునకు ఏవైన కొన్ని గుణలోపములు లేనియెడల దురవస్థ సంభవింపదు; నాయకుని పూర్వసుఖస్థితిని ప్రదర్శింప వలయును, లేక, సూచింపవలయును. ఉత్తరోత్తరము సంభవించు దురవస్థకును మున్నటి సౌఖ్యమునకు గల తారతమ్యము వలన

నాయకుని కష్టపాటు మఱింత నిశితముగ మన మనస్సున నంకితమగును. ఈవధాంత నాటక ప్రపంచమున నాయకుని యుద్దేశములు, కోర్కెలు, కార్యరూపమున పరిణమించునపుడు విరుద్ధ ఫల ప్రదములగును. "తానొకటి తలచిన దైవమొకటి తలచె"నను నానుడి యీ నాయకుని యెడ ముఖ్యముగ వర్తించును. తనకుగలుగు దురవస్థ ఆకస్మికముగ వచ్చును, కాని అందులో తనకును కొంత బాధ్యతగలదు. నాయకునికి కలుగు కష్టపరంపర వాని చేష్టలనుబట్టి అనివార్యముగను, ఒక్కొక్కపుడు విధి ప్రేరితమైనట్టును స్ఫురించును. ఉఝ్ఝాతలూచు సుడిగాలిలో గిరికీలుగొట్టు ఎండుటాకు వలె, తన్నేశక్తి ఆకర్షించుచున్నదో కనుగొనలేక, మనస్సులోని భావోద్వేగమును, బయట సంఘటనముల యుద్వేగమును ఏకమై ప్రవహింప, అందు చుక్కానిలేని నావికుని వలె నాయకుడు పయనించి యెట్టకేలకు దుర్మరణము నొందును.

నాయకుడు తానుజేయుపని దుష్టమని విశ్వసించెనేని న్యాయమార్గ మవలంబించినట్లు నటింపడు; తాను పొరపాటుపడినను, దానిని పొరపాటని తెలిసికొనజాలక, న్యాయముకొఱకు, ధర్మము కొఱకు పాటుపడుచున్నాను అను దృఢవిశ్వాసముతో దురవస్థకు పాల్పడును కావుననే మనకు జాలిగలుగును. ఒకేదృష్టియందు పక్షపాతము, ఒకే మార్గమునందు పట్టుదలయు నతనికి సహజము. ఇందేదియు కార్యకారణ సంబంధమునకు వెలియై యుండదు. నాయకునకు సంభవించు కష్టములు దైవదత్తములుగావు; మానవచేష్టాజనితములు. నాయకుని యధఃపతనము, అతని దుష్టత్వము వలన కలుగునదికాదు ; పొరపాటువలననో తొందరపాటువలననో కలుగును. గొప్పగుణములతో పాటు అజాగరూకతయు, కొన్నిటియందు అజ్ఞానమును, గర్వమును, ఉద్రిక్తభావమును, సంశయమును ఈ నాయకున కుండును. కావుననే యొక యింగ్లీషు విమర్శకుడు షేక్స్పియరు ట్రాజెడీలలోని నాయికా నాయకులను గుఱించి యిట్లు చెప్పెను :-

"Hamlet, the "religious" and the lover, doomed to set the world aright; Othello, stupid and unintellectual, fiery in his passions, set opposite to lago; lago, unscrupulous and clever; literally tempted by Othello's imbecility ; Lear conceited and proud, unobservant and credulous, faced by his evil daughters and Cordelia; Macbeth, emotional and weak, yet ambitious, met by the witches and goaded on by his wife; Lady Macbeth hard and self seeking, confronted by temptation; Coriolanus over weening in his pride condemned to stoop to plebians: Antony, amorous and doting met by Cleopatra; all of these are placed in the exact situation which they are incapable of mastering"

నాయికా నాయకులలోని యిట్టి గుణలోపములవలననే ట్రాజెడి సంభవించును.

"మఱియు యీ చావు నాటకముల మార్గమున మీరా నరయుదుమేని" అని రసలుబ్ధుని వ్యంగ్యచమత్కారము! "కుంభుని యుదాత్తత తటాలున ఉపస్థితము కాదు. నిపుణముగ చూచినను కాదు. ఎంత గొప్పవాడురా అని సూక్ష్మమైనను సూటియైన సూచన వినంబడదు. అభిమాని, విషయలోలుడు, ఉద్ధతుడు, మొండికట్టె, జాల్ముడు, అని గ్రహింపబడుచుండును. ఎంత పదోచ్ఛ్రితుడో అంత గుణోచ్ఛ్రితుడు చిత్తమునం బాదుకొనని వాని పతనము ఏపాటి యుపదేశపటువు?'' అని దోషారోపణము. ఈ రసలుబ్ధుడు "ఉపపత్త్యుపన్యాసపూర్వకముగ వాగారంభముం బొరయించు'' వాడయ్యు నేకారణముం జూపక యిట నిట్లు వాగారంభముం బొరయించుట తనతర్కమునందే తనకు ప్రత్యయము చాలమిని సూచించుచున్నది.

రాణాహేతు వాది (Rationalist) గా నగపడుచున్నాడు. అతని యభిప్రాయములు కొన్ని హిందూమతవిరుద్ధములు. ఆతనికి స్వర్గనరకములయందు నమ్మకము లేదు. ప్రజలను భయపెట్టి ధర్మమాచరింపజేయుట కొఱకును, పరలోక సుఖముపై నాసపెట్టుకొని యిహలోక కష్టములను సహించియుండుటకును, నరకము స్వర్గము పౌరాణికులు సృజించిన గాలిమేడలని ఆతని నమ్మకము. ఊహామాత్రమైన పాలసముద్రమును నమ్మి చేతిలోని పాయసపు పాత్ర జాఱవిడువడు. యౌవన సౌందర్యములెట్లు కాలబద్ధములో మానవుని భోగాభిలాషకూడ నట్లె యనియు ఆ కామ్యాను రాగమె అనుభుక్తమయి వార్ధక్యమునందు తప్త కాంచనము వలె నిష్కల్మషమయి బహుకాల సహవాస జనిత బాంధవ్యముగ మాఱుననియు తలంచుకొని సామాన్యగృహస్థ ధర్మములను కుంభుడు ఆచరించుచుండెను. కపటగురువులు లోకమును మోసగించు చున్నారనియు, వారి పలుకుబడి సన్నగిల్లిననేగాని లోకులకు మూఢభక్తి నశింపదనియు నాతడు తలంచెను. లోకాతీత ధర్మములు కుక్కమూతి పిందియలని యాతని భావము. వైదిక మతమునకు విరుద్ధములైన మతములు లేవదీసిన ఆచార్యులందఱు అవివేకులు కారు, అవి వారి మత విశ్వాసములు.

రాణా పౌరుషవంతుడు : మొగలాయీలు హిందూ రాజ్యమును ధ్వంసము చేయ నుద్యుక్తులైనపుడు వారికి ప్రతిస్పర్థిగనిల్చి రసపుత్ర గౌరవమును నిల్పిన మహాయోధుడు ; మాన సింహాదులవంటి కొందఱు రసపుత్రులు అగ్బరునకు లోబడి చుట్టఱికములు కల్పించుకొని గులాములై యుండ తానొక్కడె యగ్బరును ధిక్కరించెను. పౌరుషము నందును వీరత్వమునందును గొప్పతనము లేదా? రాణా అగ్బరునకు ప్రబలద్వేషి. అతని నామము నుచ్చరించుట గూడ తనరాజ్యమున అపరాధము. అగ్బరు హిందూమత పక్షపాతమను అచ్ఛాదనము మఱుగున దాగి మెల్లమెల్లగ హిందూరాజ్యముల కబళించు చున్నాడు ; ఆతని

రాజనీతి అతలస్పర్శి అని రాణా యెఱుంగును. కావుననే అతనిపై రాణాకు ద్వేషము. ఇది క్షత్రియ సహజము, వారు సన్న్యాసులు కారుగదా!

రాణా సంస్కరణాభిలాషి : ప్రజల మనస్సులే కాదు పాలనాయంత్రముకూడ సంస్కరింప బడవలయును అని తలంచెను. లౌకిక విజ్ఞానమును, జీవితమును ద్వేషింపజేయు ప్రతిమతమును మానవుని మనోవికాసమునకు అంతరాయమనియు, అట్టిసంకుచిత మతములను తనరాజ్యమున సమ్మార్జింపవలయుననియు కుంభుని అభిప్రాయమును సంకల్పమునై యుండెను. కాని, కాలము ప్రతికూలము. పాపము! ఈ సంస్కర్తలు ఎప్పటికిని 'Tragic hero' పాత్రములుగానే పరిణమించుచుందురు. ఏసుక్రీస్తు మతమును సంస్కరింపబోయి "సిలువ" పై బ్రాణములు విడిచెను. అమానుల్లా సంఘమును సంస్కరింపబోయి రాజ్యభ్రష్టుడాయెను. ఇట్టి వీరి పతనమునందును గొప్పతనము గలదు!

రాణా మేవాడు రాజ్యాధిపతి యయ్యు సర్వసులభుడు. తలారి దర్శనము కోరినపుడు మంత్రులాటంక పెట్టినను "నా దర్శనము గోరిన వారినెవ్వరిని ఆటంకపెట్టకుడు. నాకంతకంటె ఉత్తమ కార్యమేమున్నది", అని వారిని మందలించి తన విధి పరత్వమును స్ఫురింపజేసెను.

రాణా ధీరుడు : న్యాయైక పక్షపాతి. "నిజమెఱింగిన వెనుక నాకర్తవ్యమును అనుకూలముగ మఱచు నంతటి భీరువునుగాను; స్వార్థపరుడను గాను. నా సంకల్పము న్యాయ్యము. నా న్యాయ్య సంకల్పము శాసనము. నాశాసనముపొల్లువోవక కొనసాగి తీఱవలయును" అను వీరుని దృఢ నిశ్చయమున గొప్పతనములేదా?

రాణా అభిమాని. అభిమానము దాసునియందు అవగుణముగ నుండవచ్చును; రాజునందు అది గుణమె యగును.

రాణా ఉద్ధతుడు. అవును. తప్పేమి ? అగ్బరునంతటి వానినే యెదిరించి మొగలాయి ప్రభువులకు గుండెగాలమయి శిశోదియా వంశకీర్తి దిగంత విశ్రాంతము గావించిన కుంభరాణాయందు గర్వము అస్థానికముగాదు. ఉచితమే.

రాణా విషయలోలుడా? సంస్కృత నాటకములలోని నాయకులతో సరిపోల్చిచూచిన, వారికంటె రాణా విషయలోలుడు కాడు; వారికంటె నెల్లవిధముల నుత్తముడు. వేటకుగా తపోవనమునకు బోయి, బ్రాహ్మణ ఋషియైన కణ్వుని యాశ్రమమున అపూర్వ లావణ్యవతిని శకుంతలనుజూచి కామప్రేరితుడై తండ్రియనుమతి లేక ఆమెను (అంతఃపురము దేవేరులచే నిండియున్నను) గాంధర్వ విధి పరిణయమాడి గర్భవతినిజేసి, ఆర్యమైన మనసు ఉచిత మైనదానినే కోరినదని తనతప్పును తుడిచివేసికొని, ధర్మప్రకారము పట్టమహిషి కుమారునకే రాజ్యము చెందవలసియుండగా, మోహాంధీకృత చిత్తుడయి శకుంతల కుమారునకే రాజ్యము

నొసగునట్లు వాగ్దానముచేసి, పరారియైన దుష్యంతుడు విషయలోలుడు కాకుండుటెట్లు? ఏకపత్నీ వ్రతుడయి, విరాగిణియైన తనభార్యను ఏయుపాయముచేత నైనను తనవంకకు త్రిప్పుకొని పూర్వమువలె గార్హస్థ్య జీవితము గడుపుకొన ప్రయత్నించిన రాణా విషయలోలుడగుటెట్లు ? రాణా పరస్త్రీ పరాఙ్ముఖుడైనందుననేగదా మీరాకొఱకంతపాటుపడును. గృహస్థులకు తమభార్యలతో సంసారము చేయవలయునను కోర్కె విషయలోలత్వమైన యెడల ఇక గార్హస్థ్యము గతియేమియగును?

రాణా మొండికట్టెయా ? కాదు; తనకు యథార్థమని తోచినదానిని నిర్వహించుకొను పట్టుదలయు సంకల్పశక్తియుగల తేజశ్శాలి.

రాణా జాల్ముడా ? జాల్ముడనుటకు మూడర్థములు గలవు. యోచించి పనిచేయలేనివాడు. క్రూరుడు, అజ్ఞుడు. అజ్ఞతయేదో యొకవిషయమునందు; అది తాత్కాలికము. క్రూరత్వము కడపటి దశయందు వచ్చును; అదియు తాత్కాలికమే, స్వభావముకాదు. తాను జేయు ప్రతికార్యము నిశ్చలమును నిర్వికారమునగు మనస్సుతో యోచించి చేయునేని 'ట్రాజెడి' అసంభవము. ఈర్ష్యాగ్రస్తుని చిత్తము యోగి మనస్సువలె నిర్వికారముగ నుండదు. ఆ సమయమున నెట్టి వానికిని బుద్ధి మందగించును. బంగారుజింక లోకముననుండునా యుండదా అను వివేచనముకూడ లేదాయెగదా రామునకు? రాక్షసుల మాయా తంత్రములు ఆయన యెఱుగనివికావు. రాము డా జింకనేల తరుముకొని పోవలయును? మొట్టమొదటినుండియు సీత లక్ష్మణుని భక్తి విశ్వాసముల నెఱుంగును గదా! అతనిని శంకించి సీత యేల కర్ణకఠోరముగ దూషింపవలయును ? అంతమాత్రము తెలియదా ? వారిరువురు "నిశ్చలముగ నిర్వికారముగ"యోచించుకొని చరించియుండిన సీత రావణాపహృతయైయుండదుగదా, దీనికి సమాధానమేమి? కాలముకానియపుడు ఎట్టివారికైనను బుద్ధిమాంద్యముకలుగును - అట్లనుట చేత వారు స్వాభావికముగ మందబుద్ధులని చెప్పుటకు వీలుకలదా ?

రాణా యధఃపతనమునకు హేతువులయిన స్ఖాలిత్యము లేవి? - అతిలోక మనస్తత్త్వమును గుర్తెఱుగలేని యజ్ఞానము, పౌరాణిక మతమునెడ సహానుభూతిలేకయుండుట, భావప్రకోపము, సంశయశీలత, అభిమానము, తొందరపాటు, అగ్బరుపైని ప్రబలద్వేషము, నిశ్చలన్యాయైకనిరతి, దృఢసంకల్పము. వీనిలో కొన్నిగాని అన్నియుంగాని కొఱతపడియుండిన కుంభ రాణా జీవితము మఱియొక తీరుగా నుండి యుండెడిది.

## IV

"ఆ మీరాదేవి సౌజన్య సతీత్వములు ఇతర స్త్రీజన విలక్షణములు; పతిదేవత కాకున్నను

మీరా కృష్ణైక నిరతచిత్త; మీరా తమ యిల్లుదాటి ఊరుదాటి హిమశైల నలసేతువులందు విశ్రమించినది.... మీరాపాట భూలోక దుర్లభము.... పతియెడ ఆమెకావించిన యపచారము కానరాదు. అట్టి తేజోమూర్తియందు తొలుత అపరాగ శంకయు తరువాత (కృష్ణగతమునందె) అన్యరాగశంకయు వహించి హిందువు, వివేకి, రాజు, ఉపశ్రుతి కులికినవాడు ఆస్తికుడు కానేకాడా? ఆమెసర్వము చేతను పవిత్రీకరింపబడిన భావములనడుమ నుండువాడయ్యు కుంభుడు భ్రాంతిచెంది ఈర్ష్యపొంది... దాని నిముడ్చుకొనజాలక.... అమాత్యులును ప్రజలును బెడిసి పోగా..... మీరాను ఆచావునకు పాత్రీకరించెను. తరువాత ఒకయలంతిపొరచే తానునుంజ.చ్చెను - ఇదేమి ట్రాజెడి ! దీన నేమి యుపదేశము? నాస్తికపితయు ఆస్తికపుత్రుడు హిరణ్య ప్రహ్లాదులు ..మఱి పతియు పత్నియు మీరా కుంభులు... ప్రజామాత్య కింకరాది సర్వజనాంగీకారానంగీకారములు వినంబడుచు పదరనీక విమర్శకు ఎడమిచ్చుచునే యుండగా అట్లుచంపను చావను అంత అనురూపులా? అసంభావ్యవస్తువు చిత్తమున కెక్కదు." అని రసలుబ్ధుని వాదధోరణి. దీనినుండి కొన్ని సిద్ధాంతములు ప్రశ్నలు విడదీయవచ్చును.

మీరా భక్తురాలు; కృష్ణధ్యానపరాయణ. రాజు హిందువు, వివేకి; ( ఇంతకుముందు జాల్మడని నిందించియుండెను) పవిత్రభావముల మధ్యనుండిననాడు ఆస్తికుడెట్లు కాక యుండును? అట్టివాడు మీరాకు అట్టిచావు ఎట్లువిధించును? అట్టిసతిపై శంకయెట్లు కలుగును? ట్రాజెడి సంభవించుటకు కులభేదము మతభేదముండవలయును. ఏడెనిమిది సంవత్సరములు సుఖజీవనము చేయుచుండిన భార్యాభర్తల నడుమ ట్రాజెడి పుట్టదు. రాణా నెమ్మదిగ నాలోచించుకొని తన భ్రాంతిని తొలగించుకొని యుండవలయును. అట్లు జరుగలేదు కావున ఇది అసంభావ్యవస్తువు. కావుననే ఈ వస్తువు రసలుబ్ధునిచిత్తమున కెక్కలేదు!

రసలుబ్ధుడు మీరాను ఆటజూచు సామాజికుల దృష్టితో జూచుచున్నాడేగాని కుంభరాణా దృష్టితో జూచుటలేదు. ఇదిగొప్ప పొరపాటు. ఈ పొరయే రసలుబ్ధుని 'ట్రాజెడీ'కి హేతువైనది. రాణాకు మీరా ఎట్లగపడును? అతని మనస్తత్త్వమేమి? అని విచారింపవలదా? పాండవులు, భీష్ముడు, విదురుడును శ్రీకృష్ణుని దైవస్వరూపమని తలంచినను, రాజబంధువు బంధించుటకు తగినవాడు అనియే గదా దుర్యోధనుడు తలంచెను. వేనవేలు సంవత్సరములు ఘోర తపమాచరించి చావులేని వరముగొన్న హిరణ్యకశిపుడు పరమభక్తుడైన ప్రహ్లాదుని భక్తి ప్రభావము నడుమనుండియు ఏల విష్ణుభక్తుడుగ మాఱలేదు? ఎవరి ప్రభావము నడుమనుండి విభీషణుడు రామభక్తుడాయెను? అది వారివారి మనస్తత్త్వముల బట్టియుండును. హిందువుల కుటుంబములలో బుట్టిన యందఱును ఆస్తికులు కావలయునను నియతియున్నదా? మతము వంశపారంపర్యాగతమగు ఆస్తి వలె వారసులకు లభించునదిగాదు. అది వ్యక్తుల చిత్తసంస్కారముల ననుసరించి భిన్నభిన్నముగ నుండును. మీరా పరమభక్తురాలని ప్రజలు

అమాత్యులుతలంచిరి. రాణా మాత్రము "మతావేశము కూడ నొక మానసిక వ్యాధి" యని తలంచెను. 'Modern psychology' 'abnormal Psychology' అను మనస్తత్త్వశాస్త్రగ్రంథముల జదువుదుమేని రాణా నిశ్చయమునకు హేతువులు కలవని తెలియకపోదు - మన మతాభిప్రాయములకును రాణా అభిప్రాయములకును భేదము కలిగినంత మాత్రమున నాటకమును నిందింపదగదు - నాటకమున నాయకుని కవి యెట్లు చిత్రించెనని మాత్రమే విచారింపవలయును.

ఈ సందర్భమున T.G. Wainewright గారి యభిప్రాయ మెంతయు సమంజసముగ నున్నది : " I hold that no work of art can be tried otherwise than by laws deduced from itself : whether or not it be consistent with itself is the question."

మీరారాణాలకు రసలుబ్ధుడు కోరిన మతభేదమును గలదు. కాని ఆమత భేదమే ఈ నాటకమున ట్రాజెడీకి మూలకారణము కాదు. అది ట్రాజెడీ బీజములు సులువుగా నంకురించి వృద్ధిచెందుటకు దగిన ద్వేషమును బుట్టించి అనుకూల పరిస్థితుల సంపాదించినది. ఏడెనిమిదేండ్లు సుఖజీవనముసలిపి అన్యోన్యము మనసు కలిసియుండిన భార్యాభర్తల మధ్య 'ట్రాజెడీ' సంభవించిననే అది మఱింత ఘోరముగ నుండును. మీరా యందు సద్గుణములేకాక యామె చరమదశకు కారణమైన గుణలోపములుకూడ కొన్ని గలవు. వాని ఫలితమేమి? అవి కుంభునెట్లు సంక్షోభపెట్టినవి? అనువిషయములే మనకు చర్చనీయాంశములు. అతిలోక మతావేశము, నిశ్చల వైరాగ్యముగల కులకాంత సామాన్యగృహస్థుల కుటుంబములో ఇముడదు. పతి యిష్టానుసారము వర్తింపకుండుట, గృహకృత్యములందు నిరాదరణము, పతి హృదయమును తన మాటలు ఎట్లు నొప్పించునో తెలిసికొన నేరక తాను విన్నసంగతి దాపరికములేక మాటలాడు అమాయకత్వము, విషయ పరాఙ్ముఖతచే అజ్ఞాతముగ నలవడిన తృణీకరణ భావము, మీరాశీలములోని రంధ్రములు. మీరా మాటలు కొన్ని సామాన్య ధర్మ ప్రవచనములుగ నుద్దిష్టములయ్యును శాప ప్రాయములుగ నగపట్టును. ఈ సంగతి మీరా యెఱుంగదు. బేడిసను గుఱించి చెప్పునపుడు "మీనరాజ, విధియదృశ్య హస్తము వెనువెంట నంటి మృత్యుపదములకడకు నిన్నీడ్చునయ్యో!' అనియు మఱియొకచోట "పాలనా దండశక్తి నశ్వరమటన్న పిడుగువంటి సత్యంబును వినెద వెపుడొ' అనియు మీరా యన్నపుడు రాణా ఏవిధముగ నర్థము చేసికొనును?

రాణా పదరక యేల ఆలోచింపలేదు అను ప్రశ్న అవిచార మూలకము. కొందఱు విమర్శకులు రాణాను ఒథెల్లోతో సరిపోల్చిరి. పాత్రపోషణమునందు జూపట్టు ఇతర భేదములే కాక వారిరువురకు ఈ క్రింది భేదము కలదు : ఒథెల్లో యేమాత్రము విచారించినను ట్రాజెడి

# V

"కొన్ని యసంభవములు" అనుశీర్షిక క్రింద పదునేడు అసంభవములను మీరా నాటకమునందు రసలుబ్ధుడు చూపించెను. ఈ యసంభవములను గుఱించి కొంత తెలిసి కొనవలయును. నాటకమును కొందఱు "ప్రతిరసంబున తన్మయ భావమొంది" చదువుదురు. అట్టి పఠితలు, ఆటచూచునప్పుడు ఎట్టి యానందముంబొందుదురో అట్టి యానందమునే చదువునప్పుడును పొందుదురు. కొందఱు దోషనిరూపణము కొఱకే చదువుదురు. ఇట్లు చదువువారికి అసంభవములని తోచినవి ఆటచూచు వారికిగాని, మొదటివిధము చదివిన వారికిగాని తోవవు. నాటకము చదువునపుడు కొన్ని సంభవములుగ తోచినవి ప్రదర్శింపబడినపుడు అసంభవములుగ నగపడును. ఉదాహరణము : ఉత్తరరామచరితమున, దండకాటవియందు రాముడు సీతను స్మరించుకొని దుఃఖించు ఘట్టమున, వనదేవతల ప్రభావముచే అదృశ్యమానయగు సీత రాముని ప్రక్క నిలబడియుండును. ఈభాగము చదువునపుడు అసంభవమేమియు గోచరింపదు. ఏలయన సీత అదృశ్యగానున్నదని యనుకొనుటకు మనభావము ఉపకరించును. కాని, యీ ఘట్టము ప్రదర్శింపబడినపుడు, సీత యగపడుచుండగా అగపడలేదని భావించి మనకన్నులను వంచించు కొనజూచుట యసాధ్యము.

వ్యవహార సిద్ధమైన ప్రపంచము వేఱు; నాటక ప్రపంచము వేఱు ; ఒకదానిని వేఱొకదాని దృష్టితో విమర్శించుట - ఉభయము నెఱుంగమికి తార్కాణము. కొన్నిదినములు, నెలలు, సంవత్సరములలో జరిగిన విషయము మూడు నాలుగు గంటలలో ప్రదర్శింపబడవలసిన రూపకముగ నిర్మితమగుటచేత కొన్నిసమయములను నియమములను కవులు అంగీకరించిరి. సామాజికులు నాటక ప్రదర్శనములోని కాల సంకోచమునకు అలవాటుపడిన వారగుట అందు అసంభవత్వము గోచరింపదు.

ఒకప్పుడు సంభవములు కొన్ని అసంభవములుగ నగపడును. "Truth is stranger than fiction" అను సామెత మనము విననిది కాదు. నాటకము చూచువారికిని చదువు వారికిని అసంభవములని తోపదగువానినే కవి ఆలోచింపవలయును.

రసలుబ్ధుడు నాటకములోని విషయములను జ్ఞప్తి పెట్టుకొని యుండిన ఇన్ని సందేహములకు ప్రశ్నలకు అవకాశముండి యుండదు; వ్యాసమును ఇంతనిడివియై యుండదు. తన ప్రశ్నలకు చాలవఱకు నాటకమునందె ప్రత్యుత్తరములున్నవి. అసంభవముల విచారించునప్పుడు రసలుబ్ధుని సంఖ్యాక్రమమునే అనుసరించెదను.

1) ప్రబల శత్రువైన కుంభరాణా రాజ్యమున తాను ప్రవేశించుట సాహస కార్యమని

ఆమె మహిమలు (miracles) చూపింపలేదు. ప్రహ్లాదుడు ఏనుగులచే త్రొక్కింపబడియు, కొండచరులనుండి క్రిందికి త్రోయబడియు, విషమిప్పింపబడియు చావలేదు. ఇదిగదా యమానుషత్వము! మీరాబాయి ప్రహ్లాదునివలె మృత్యువును జయింపలేదు. ఆమెయందు మానవ సహజములగు కొన్ని లోపములును గలవు. అవి యింతకు ముందే ప్రస్తావింప బడినవి. డెస్‌డెమోనా వధ అట్లు చూపింప బడవలయునా లేదా అనువిషయమును గుఱించి ఆంగ్లేయ విమర్శకులలోనే భిన్నాభిప్రాయములు గలవు.

"To some readers again, parts of Othello appear shocking or horrible. They think... that in these parts Shakespeare has sinned against cannons of art, by representing on the stage a violence or brutality the effect of which is unnecessarily painful and rather sensational than tragic."

ఇట్టి విషయములందు సామాజికుల మనస్తత్వముల ననుసరించి భిన్నాభి ప్రాయములు పొడసూపుచుండును.

"పురుషేర్ష్యాకారణమును" రచ్చకెక్కించి మంత్రుల యెదుట విచారించుట మందమనియు, ఇందు రహస్యముండవలయుననియు మఱియొక యాక్షేపము. కుంభ రాణా మంత్రులను పిలిపించినది పురుషేర్ష్యాకారణమును విచారించుటకు గాదు. అమూల్యమైన వజ్రహారము తన యంతఃపురదాసి సుశీల ధరించుకొనియున్నదను సంగతిని, బలవంతరావు వలన కొన్నిసంగతులు తెలియగా, ఆ విషయములను విచారించుటకు మంత్రులను రావించెను. ఆవిచారణయందు వైద్యుల వృత్తాంతమును ఆవైద్యులలో నొకడు అగ్బరగుటయు దెలియవచ్చెను. పురుషేర్ష్యాకారణము రహస్యముగ నుండుటకు వీలులేదు. రాణా ఈర్ష్యాగ్రస్తుడగు భర్తయేగాదు; న్యాయాధిపతికూడ. ఈరెంటికింగల భేదమును గ్రహించుట వలననే రాణాగొప్పతనమును ధర్మబుద్ధియు గోచరించుచున్నవి. ఏదో యొకనాటకమును తీసికొని దానికిని ఈ నాటకమునకును సాదృశ్యము కల్పించి 'అందుండినట్లే యిందేల యుండలేదు' అని ప్రశ్నించుట కూడ ఒకవిమర్శన చమత్కృతి కాబోలు!

అగ్బరు తాన్‌సేనుల సంభాషణము మెట్టవేదాంతము కాదు - ఆ సంభాషణ మూలమున మనకు వారి మనస్తత్త్వము చక్కగస్ఫురించును. ఇట్టిభాగములు చదువునప్పుడు ఇంపుగనే యుండును. కాని ప్రదర్శన పరముగ జూచినపుడు, కార్యప్రచలనము లేనందువలన, కొంత (విసువు) monotony గోచరించును. కవి యీ "సీనును" కొంత సంస్కరించిన బాగుగనుండుననియే నాయాశయమును.

# V

"కొన్ని యసంభవములు" అనుశీర్షిక క్రింద పదునేడు అసంభవములను మీరా నాటకమునందు రసలుబ్ధుడు చూపించెను. ఈ యసంభవములను గుఱించి కొంత తెలిసి కొనవలయును. నాటకమును కొందఱు "ప్రతిరసంబున తన్మయ భావమొంది" చదువుదురు. అట్టి పఠితలు, ఆటచూచునప్పుడు ఎట్టి యానందముంబొందుదురో అట్టి యానందమునే చదువునప్పుడును పొందుదురు. కొందఱు దోషనిరూపణము కొఱకే చదువుదురు. ఇట్లు చదువువారికి అసంభవములని తోచినవి ఆటచూచు వారికిగాని, మొదటివిధము చదివిన వారికిగాని తోపవు. నాటకము చదువునపుడు కొన్ని సంభవములుగ తోచినవి ప్రదర్శింపబడినపుడు అసంభవములుగ నగపడును. ఉదాహరణము : ఉత్తరరామచరితమున, దండకాటవియందు రాముడు సీతను స్మరించుకొని దుఃఖించు ఘట్టమున, వనదేవతల ప్రభావముచే అదృశ్యమానయగు సీత రాముని ప్రక్క నిలబడియుండును. ఈభాగము చదువునపుడు అసంభవమేమియు గోచరింపదు. ఏలయన సీత అదృశ్యగానున్నదని యనుకొనుటకు మనభావము ఉపకరించును. కాని, యీ ఘట్టము ప్రదర్శింపబడినపుడు, సీత యగపడుచుండగా అగపడలేదని భావించి మనకన్నులను వంచించు కొనజూచుట యసాధ్యము.

వ్యవహార సిద్ధమైన ప్రపంచము వేఱు; నాటక ప్రపంచము వేఱు ; ఒకదానిని వేఱొకదాని దృష్టితో విమర్శించుట - ఉభయము నెఱుంగమికి తార్కాణము. కొన్నిదినములు, నెలలు, సంవత్సరములలో జరిగిన విషయము మూడు నాలుగు గంటలలో ప్రదర్శింపబడవలసిన రూపకముగ నిర్మితమగుటచేత కొన్నిసమయములను నియమములను కవులు అంగీకరించిరి. సామాజికులు నాటక ప్రదర్శనములోని కాల సంకోచమునకు అలవాటుపడిన వారగుట అందు అసంభవత్వము గోచరింపదు.

ఒకప్పుడు సంభవములు కొన్ని అసంభవములుగ నగపడును. "Truth is stranger than fiction" అను సామెత మనము విననిది కాదు. నాటకము చూచువారికిని చదువు వారికిని అసంభవములని తోపదగువానినే కవి ఆలోచింపవలయును.

రసలుబ్ధుడు నాటకములోని విషయములను జ్ఞప్తి పెట్టుకొని యుండిన ఇన్ని సందేహములకు ప్రశ్నలకు అవకాశముండి యుండదు; వ్యాసమును ఇంతనిడివియై యుండదు. తన ప్రశ్నలకు చాలవఱకు నాటకమునందె ప్రత్యుత్తరములున్నవి. అసంభవముల విచారించునప్పుడు రసలుబ్ధుని సంఖ్యాక్రమమునే అనుసరించెదను.

1) ప్రబల శత్రువైన కుంభరాణా రాజ్యమున తాను ప్రవేశించుట సాహస కార్యమని

అగ్బరెఱుంగును; అయినను మీరా సందర్శనము అవశ్యకర్తవ్యమని తలచెను. ఇందువలన అగ్బరుని సాహసికత్వము (Adventurous spirit) మనకు గోచరించును. రహస్యముగ పరదేశమును ప్రవేశించువారు రాజులయ్యును మందుగుండుసామగ్రి వెంటబెట్టుకొని పట్టపుటేనుగునెక్కి రారుగదా! అగ్బరు, విరోధి రాష్ట్రమున నిస్సహాయుడై కాలువెట్టడు అను ప్రజల నమ్మకమె వానికి రక్షక కవచమైనది. యూరపుదేశమున జరిగిన మహాసంగ్రామమున కైజరు పుత్రులలో నొకడు మాఱువేసమున, సీన్‌నదిప్రక్క విడిసిన ఫ్రెంచి పటాలపు బిడారున ప్రవేశించి కావించిన యద్భుత సాహసకార్యములు చదివిన అవి సత్యములా లేక కల్పితములా యను సందేహమునకు పాల్పడుదుము.

అగ్బరు వజ్రహారమును గురుకట్నముగ సమర్పించెను తానట్లుచేయుట పొరపాటని వెనుకచింతించెను. ఇట్టి పొరపాటులుపడు మనుష్యులొకచోట జేరినప్పుడే ట్రాజెడీ కలుగును.

2) ఇచ్చట రసలుబ్ధుడు పొరపడినాడు. రాణా కుమారసింహుని మొదటితూరి పంపినపుడు అగ్బరును చంపుటకుగా పంపలేదు; మీరాను అనుసరించుటకు పంపెను. చంపుటకు తనకు ఆజ్ఞలేదుగావున రాణాయొద్దకు వచ్చెను. రసలుబ్ధుడు తలచినట్లు "చంపుమన్న యాజ్ఞను" తాను దాటలేదు. ఆ యాజ్ఞ రెండవతూరిది.

3) రసలుబ్ధుడు తన సంచిలోని "రేడియం కాటుక"ను తానుకన్నులకు చరుముకొన్నట్లు తోపదు. అట్లయిన అప్పటి పరిస్థితులు చక్కగ గోచరించియుండును.. ఆ సమయమున మంత్రులును ఇతరసేవకులును బెడిసిపోయి యుండిరి. కుమారసింహుడొక్కడే రాణాకు పట్టుగొమ్మ. కావున వానినే పంపెను. ఇదంతయు రాత్రికాలమున రాజప్రాసాదమున జరిగెను. బెడిసిపోయిన మంత్రులకును దండనాథునకును ఈ సంగతి యెట్లు తెలిసి రాణాకు సహాయపడుదురు ? రాణా సొంతముగ వారి సహాయము కోరునా? అగ్బరు సిబ్బందితో రాలేదని రాణా యెఱుంగును. అట్లు వచ్చియుండిన వేగుల వారు తెలిసికోకయుందురా? తలారి చెప్పినపుడుగూడ ఇద్దఱు బాటసారులనియేగదా చెప్పెను. అగ్బరును చంపుటకు ఒక్క రసపుత్రుని బంపుట తప్పట! పద్మినీ సందర్శనమునకై వచ్చిన యల్లాయుద్దీనుని ముప్పదివేల సైన్యమును ఏడు వందలమంది రసపుత్రవీరులేగదా చించి చెండాడినది.

4) సంభవమే. ఏలయన అగ్బరు మరణము రాజునకు ప్రియము - ఆజ్ఞాతృణీకరణాపరాధము వలనగలుగు నప్రియముకంటె ఈ వృత్తాంతము నెఱిగించుటవలన గలుగు ప్రియము హెచ్చుగా నుండునని తలచి కుమారుడు రాణా యొద్దకు పరుగెత్తెను.

5) ఇచ్చట రసలుబ్ధుని సందేహము సహేతుకము. మీరా మరణవార్తను అగ్బరుచే నొకమాటలో చెప్పించి యున్న ఈ సందేహమునకు తావుండదు.

6) తన యాజ్ఞను నిర్వర్తించునను నమ్మకము చేతనే రాణా మీరాను ఆజ్ఞాపించెను. ఆమె తిరస్కృతియు గాన రాదు. రెండవతూరి కుమారుడు అగ్బరు ఉదంతము చెప్పవచ్చినపుడు మీరా యమునామార్గమున చనుచుండెనని చెప్పెను. రాణా సేవకవర్జితుడయ్యును ఆజ్ఞాపింపగల స్థితిలోనే కదా యున్నాడు. మీరా తన యాజ్ఞను తృణీకరించిన అప్పటి యతని నిర్ణయమెట్లుండునో మనమెట్లూహింపగలము?

7) కుమారసింహుడు ముందు బయలుదేరెను; అగ్బరు తాన్‌సేనులున్న స్థలమున వెదకెను. వారచ్చటలేరు. అతడు వారిని వెదకుచుండెను. కుంభరాణా అతనికన్న అయిదు (లేక) పదినిమిషములకు వెనుక బయలుదేరెను. అడ్డదారిబట్టి వెనుకవచ్చు కుమారసింహునికి ముందు బోవు రాణా యగపడుటయెట్లు అసంభవము? కుమారుడు "తండ్రీ, నీవేల యింతలో నిచ్చటికి వచ్చితివి?" అనెను. తాను వచ్చుటకు ముందుగనే యెట్లువచ్చితివను భావమే గదా ఆ వాక్యమున ధ్వనితమగుచున్నది.

8) కుమారుడు తన్నుదాను పొడుచుకొనెను; పొడుచుకొన్నట్లు నటించి రాణాచే పొగడించుకొనుటకుగాదు; దుఃఖభారమును సహింపలేకయే, పొడుచుకొనెను. తన్నుదానే కుదురుపాటున పొడుచుకొనెను కావున 'ఆయపుపట్టు' చూచి పొడుచుకొనెను. అప్పటికిని గ్రుక్కుమిక్కుమనక చావలేదు. తన విషాదమును వెలిపుచ్చు మాటలు పలికియే మరణించెను. ఇచ్చట కుమారుడు మహోపన్యాసము నొసగలేదని కాబోలు రసలుబ్ధుని కొఱత!

కుమారసింహుడు కుంభుని చీకటిమఱుగున పొడిచెను. ఆసమయమునకు తనవైపున కేప్రక్క కనబడుచుండెనో ఆప్రక్కనే పొడిచెను. బహుశః వెనుక ప్రక్కగ నుండవచ్చును. ఆపోటు సద్యోమరణ సంపాదికాక పదినిమిషములు బ్రతుకనిచ్చునదిగా నుండును. ఇందేమి నిర్వహణంపు తబ్బిబ్బు కనబడుచున్నది? అది యెచటనున్నదో రసలుబ్ధుడు తన బుద్ధిని శోధించుకొనవలయును.

9) ఎ) ఒకేవిధమైన యాక్షేపములు చర్వితచర్వణముగ అందందు తలయెత్తు చున్నవి. అందువలన నేనును పునరుక్తి దోషమునకు అగ్గము కావలసియున్నది. రాణా హేతువాదియని యిదివఱకె తెలిపియుంటిని. మీరా మతము నెడ నతనికి సహానుభూతిలేదు; తన గార్హస్థ్య సుఖమునకు భంగము కలుగుటవలన మతద్వేషము మఱింత నిశితమైనది. కాని, యామతద్వేషమొక్కటియే యైన ఇట్టి ట్రాజెడీ జరిగియుండదు. అగ్బరు అంతఃపురములోనికి వచ్చుటయె ట్రాజెడీకి కారణము. మీరా ప్రసిద్ధభక్తి అగ్బరును రప్పించుటకు హేతువైనది. రాణా మీరాను శిక్షించుట తనమతము కన్న భిన్నమతము నవలంబించినందుకు గాదు; అగ్బరుపై మరులుగొన్నందుకు. అగ్బరు ఒట్టుపెట్టుకొని చెప్పిన మాటల వలన మీరా

నిరపరాధయనియు తానే భ్రాంతి పడెననియు తెలిసికొని చింతించెను. కష్టములు తలదాకినపుడు మనస్సులో కొంత మాఱుపాటు సహజమేగాని, అవి మనఃప్రకృతిని మునుముట్ట మార్చజాలవు. మతముమాఱదు -శైవుడు వైష్ణవుడుకాడు, వైష్ణవుడు శైవుడు కాడు. క్రైస్తవుడు మహమ్మదీయుడు కాడు, నాస్తికుడు ఆస్తికుడుకాడు. భ్రాంతిచే నిరపరాధను, భార్యను, చంపితినిగదాయను దుఃఖాగ్ని హృదయమును పరితపింపజేయుచుండ మతభేదముల మంచి సెబ్బరలు తలపోయుటకేమి యవకాశముగలదు ఆ దశలో ?

9) బి) రాణా మీరాను నిర్బంధమునందుంచినది - తనభార్య వీధుల వెంబడి పిచ్చిపట్టి తిరుగుచున్నదను అపవాదమునుండి కాచి కొనుటకును, కృష్ణమందిరమునకు పోనీయకుండుటకును, మిగతదానికి సమాధానము 9) ఎ) లోనే కలదు.

10) ఇది స్టేజిలో సరియైన దీపసౌకర్యములు లేనందున కలిగిన లోపము, నాటకమున నట్లులేదు.

11) ధ్యాననిర్మగ్న చిత్తులై యొడలెఱుంగనివారు ఎల్లకాలమట్లే యుండరు; కొంతసేపటికి వారికి సామాన్య మనఃస్థితి గలుగును. రామకృష్ణ పరమహంసయు నిట్లె కొన్ని గంటలో (లేక) యొకటి రెండు దినములో ధ్యాననిర్మగ్నుడై యుండి మరల సామాన్య మనఃస్థితిని పొందుచుండెను. ఇది సహజమే. యమునాతీరమునకు వచ్చుచుండినపుడు మీరాబాయి సామాన్య మనఃస్థితియందే యుండెను. కావుననే అగ్బరు తాన్‌సేన్‌లతో సంభాషించెను.

12) నాటకమునకు సంబంధింపని హల్లకల్లోలముతో రసలుబ్ధునకు పనియున్నను ఇతరులకుండదు - మీరాబాయి రాముడు కాదు. ఉదయపుర ప్రజలు అయోధ్యాప్రజలుకారు.

13) మేవాడ్ అనగా మధ్యదేశము. అది రసపుత్రుల రాజ్యము. చితోడ్‌గడ్ పూర్వరాజధాని, తరువాత రాజధాని ఉదయపురమునకు మార్చబడినది. యమున మేవాడులో ప్రవహించుటలేదు. బనాస్‌నది ఉదయపురముప్రక్క ప్రవహించుచున్నది. ఈ యుపనదియు యమునలో గలయును. ఈ నదికేమైన యమున యని మాఱుపేరున్నదో యేమొ తెలియదు - కథలో మాత్రము యమున యనియున్నది. కవియు ఆ యముననే గ్రహించియుండునేమొ.

14) సుశీల యెల్లపుడును దొంగిలించు స్వభావము కలదియో కాదో చెప్పుటకు నాటకమున ఆధారములులేవు. సుశీల తాను సొగసుకత్తెనను భ్రాంతికలది; తన్నలంకరించు కొనుటకాహారమును దొంగిలించియుండును. దానికి ఆహారపు విలువ తెలియదు. సహజముగ దొంగ కాకపోయినను ఒక్కొక్కప్పుడు ఒకనికి దొంగిలించుబుద్ధి కలుగుట అసంభవముకాదు. ఈ ప్రశ్నలు నాటక విమర్శకుడు అడుగ వలసినవికావు - ఇట్టి ప్రశ్నలు పోలీసు స్టేషనులో ఉచితములుగా నుండును.

15) తానెప్పుడో విన్న యుపశ్రుతి మరణసమయమున ఏల కుంభునకు జ్ఞప్తికి రావలయును? అట్లగునేని జ్ఞప్తికి రాదగినవికూడ చాలగలవు; నాటకములోని పాతిక భాగము పునరభినీతము కావలసియుండును! తనజీవితమును సింహావలోకనముగ జూచుకొన్న ఘట్టము ముందే దాటి పోయినది. ఈ మరణ సమయమున తనమనము నాక్రమించుకొనదగిన భావములేవి? తన భ్రాంతి, మీరా మరణము, తనమరణము,వీనిని గుఱించిన తలపోతలేగదా సహజములును, సమంజసములును.

16) మీరా పాటను గుఱించి యొకమాత్రైన కుంభుడు ప్రస్తావము చేయలేదట! ఇదియొక యసంభవమట! ప్రసక్తిలేనియపుడు ప్రస్తావమెట్లువచ్చును- మీరా పాట కుంభునకు క్రొత్తదికాదు; లోకమునకు వింతగ నుండవచ్చును.

17) ఇందలి యితివృత్తము సంప్రదాయాగతమై లోకమునను వ్యాపించి యున్నదనియు చారిత్రకము కాదనియు ముందే తెలిపియున్నాను.

రసలుబ్ధుడు నాటక భాషను గుఱించియు నిట్లు విమర్శించెను :- "మీరా నాటక భాషయందు ఉత్తమ మధ్యమ పాత్రలకిడిన యాంధ్రమందె ఇంగ్లీషు జాతీయము, వ్యాకృతాభాసము గ్రామ్యమును అందందు చెవిబడుచుండెను. ఎన్ని వాక్యములో ఇంగ్లీషున కనువాదములుగాని తెలుగు జాతివి కావని తోచుచుండెను" శుద్ధ శ్రోత్రియుడై మడి గట్టుకొన్న రసలుబ్ధుడె Tragic, conversion, అను ఇంగ్లీషు ముక్కలు వేయనిదే తన అభిప్రాయము వెల్లడింప లేని యపుడు ఇంగ్లీషుజాతీయము లేకయే వాక్యము రచింపలేని యపుడు ఇక ఇంగ్లీషు తెలుగు నేర్చుకొన్న వారి విషయము వేఱుగ జెప్పవలయునా? ఇంగ్లీషుభాష వ్యాపించి యున్న యీ కాలమున నెందైన నొకచోట ఇంగ్లీషు జాతీయములు దొరలుటలో ఆశ్చర్యమేమియులేదు. ఇంగ్లీషు జాతీయములు తెలుగు రూపముతో వాఙ్మయమున ప్రవేశించినపుడు అవి రమణీయములుగ నుండునేని అంగీకరించిన తప్పేమి ? ఒప్పేయగును. ఇట్టి మార్పులు మన భాషలో నెన్ని జరిగియుండలేదు? గుంటచిక్కుల సంస్కృతాన్వయము ధాటికే నాశనముగాని తెలుగుభాష ఇంగ్లీషు జాతీయములు కొన్ని చేరినంతనే చెడిపోవునా ?



# ద్విపదరచన - గణభేదము

## దువ్వూరి రామిరెడ్డి

(ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము 17-6-1922 సంచిక నుండి)

నాగరకాంధ్ర సారస్వతము పురాణముల తర్జుమాతో ప్రారంభమగుట వలన నవ్వలి యాంధ్రవాఙ్మయ మంతయు సంస్కృత పద భూయిష్ఠమై, సంస్కృత కావ్యరచనా మర్యాదలకు లోబడి, సుదీర్ఘ సమాస ఘటనములకనువగు స్రగ్ధర, శార్దూలము, మత్తేభము మున్నగు వృత్తముల కాశ్రయభూతమైనది. వృత్తముల గతి ప్రసరణముల కభ్యంతరము లేక, గణభంగము గలుగకుండుటకయి కొన్ని యెడల సంస్కృత సమాసములు తప్పక యుపయోగింపవలసి యుండును ఒక భాషయందు సహజసిద్ధమైన ఛందమునందు మఱియొక భాషను నిమడ్చవలసి వచ్చినప్పుడు ఇట్టి కష్టము లనివార్యములగు చుండును.

నన్నయకు పూర్వము తెలుగునందు కవిత్వరచన లేదనియు, ఆయన కర్ణాట ఛందోభేదముల ననుసరించి యాంధ్ర భారతమును రచియించెననియు కొందరు విశ్వసింతురు. నన్నయకు పూర్వము గణప్రస్తారము వలన గలిగిన Mechanical వృత్తములు లేకపోయినను తెలుగు భాషయొక్క ప్రతిభకు తగిన కొన్నిగతులు స్వతస్సిద్ధములై యుండినవి. కాని యవి యవ్వలి పద్యరచనల దాడికి నిలువలేక నశించియుండును. "క్రొత్త యొక రుచి, ప్రాత యొక రోత" యనునటుల నన్నయచే తెలుగునందు ప్రవేశపెట్టబడిన పద్యరచన ప్రజల హృదయముల నాకర్షించి పిమ్మటి కవులకు మార్గదర్శకమై యుండును. సీసములు, గీతములు, ద్విపదలు, రగడలు, పదములు మున్నగు పోకడలు తెలుగు భాషకు సహజసిద్ధములు. కర్ణాట ఛంధస్సు నందు గూడ నిట్టి రీతులగుపడుటవలన నివియెల్ల వానినుండి యనుకరింపబడినవని కొందరు తలంతురు. కాని యిది యంత యథార్థముగ దోపదు. ద్రావిడ భాషా కవిత్వములందు మాత్రాత్మక గణములు ప్రధానములైనవి. ఆ గణములతో నిర్మింపబడిన పద్యములందు elasticity and flexibility యెక్కుడుగానుండును. ఈ రచనలు ద్రవిడ భాషల ధోరణి ననుసరించి యుద్భవించినవే గాని యొక భాషనుండి మఱియొక భాషలోనికి గొని తేబడినవిగావు.

ప్రాచీనాంధ్ర సారస్వతమును, ఆంధ్రప్రతిభయు, పాటలు, కీర్తనలు, జంగమకథలు, ద్విపదలు, ఏలలు, జావళీలు మున్నగు రచనలలో నిండి తెలుగు దేశమందంతటను వెదచల్లబడి

యున్నవి. ఈ పురాతన రీతులను పునరుద్ధరించుట యాంధ్ర కవుల ప్రధాన కర్తవ్యము. ద్విపదకవిత్వము కొంతకాలము వరకు నిరాదరింపబడినను, ప్రజాసామాన్యము కొఱకు సోమనాథుడు, రంగనాథుడు, శ్రీనాథుడు, గౌరన్న మున్నగుకవులు ద్విపద కావ్యముల రచియించిరి. వృత్తములందు కంటె ద్విపదయందు భావములను నిరాటంకముగ వెలిపుచ్చవచ్చును. ఇంగ్లీషునందు Blank verse భావప్రకటనమున కెంతటి యకుంఠ సాధనమై యున్నదో తెలుగునందు ద్విపదకూడ యట్టి పరిపూర్ణతనే పొందగలదు. కావున గతి ప్రసరణములకు భంగము కలుగకుండ గణములలో కొంతమార్పు గావించియు ద్విపద రచన మఱింత సుళువు చేయవచ్చును.

నీయందు లీనమై నినుగాంచువేడ్క
నాతురపడు మతి నాపంగలేక
వాకిట నిలుచుండి వనవీథినెపుడు
కనికని నాకన్నుగవ నీరు గ్రమ్మె?
నింతకక్కస మేల యింతకసి యేల ?
చంపనెంచిన నింత చాటుదనమేల ?

ఈ పై ద్విపదను చదివినప్పుడు వినువారికి గణ భంగమైనట్లు తోపదు. గతియందును లోపమగపడదు. ఈ ద్విపదను నేను చాలమంది కవుల యెదుట పరీక్షార్థము చదివితిని. నాకెవ్వరును ఇందు గణభంగము కలిగినదని వాకొన్నవారుకారు. ఏలనన చెవికి వినబడునప్పుడు గతి భేదింపలేదు. కాని యా ద్విపదనే కాగితము పై వ్రాసి వారిచేతికి నిచ్చినప్పుడు కడపటి రెండు పాదములలో గణభంగము కలిగినదని చెప్పిరి. శబ్దమును కొలుచుట యందు చెవియే ప్రమాణముగాని కన్నుగాదు.

కావుననే మహాకవి తిక్కన "కావ్యంబున సరసులైన కవుల చెవుల కెక్కవలయు" నని నుడివియున్నాడు. అయిరిషు దేశపు అభినవ సారస్వత ప్రబోధమునకు సంబంధించిన జె.హెచ్. కజిన్సు అనుకవి టోకియో విశ్వవిద్యాలయమున కవిత్వమును గుఱించి యుపన్యసించుచు నిట్లు నుడివియున్నాడు.

" We should be far nearer the secret of poetry if the ear had a larger share in our judgements of verse. Once upon a time, before printing called away the attention of the world from the ear to the eye, sound was poetry's main characteristic".

ఇంత కక్కసమేల యింత కసియేల ?

చంపనెంచిన నింత చాటుదనమేల ?

అనుపాదములందు నాలుగవ గణము యొక్క కడపటి యక్షరము గురువుగా నుండవలయుటకు బదులు రెండు లఘువులుగ మార్చబడినది. ద్విపద రచనయందు ఒక గురువునకు మాఱు రెండు లఘువుల నుపయోగించు నలవాటు నిదివఱకే గలదు. ఎట్లన అయిదవగణము హగణ, నగణములలో నేదైన నొకటి యుండవచ్చును.

క॥ ఒక గురువు రెండు లఘువులు
నకలంకత సమముగాన హనములు తమలో
నొకడొకడు వీడుపడుచున్
వికటింపక చెల్లు నొక్కవృత్తము దక్కన్

(కావ్యాలంకార చూడామణి)

తెలుగు ఛందస్సు మాత్రాత్మకముగాన నొక గురువునకు మాఱు రెండులఘువుల నుపయోగించుట వలన నేమాత్రమును గతిభంగముకలుగదు. కాని శార్దూలాది వృత్తములయందు నియత గణభంగమువలన గతిభంగము కూడ గలుగును.

నేనీ మార్పుసూచించుట, చాలాగొప్ప యావిష్కారమని తలపోసి యీ వ్యాసమును వ్రాయబూనుకొనలేదు. భాషకును భావములకును తగిన ఛందస్సు మనకు సిద్ధము కావలయును. ఛందస్సు కొఱకే మనము కవిత్వమల్లుటలేదు. తెలుగుకవిత్వమునకు గల వైశాల్యమును సులభవశ్యతయు నితరభాషా ఛందస్సుల నంగీకరించుటవలన కొంతవరకు నశించినది. తెలుగు కవిత స్వచ్ఛంద విహారిణియు గాక, శిల్పమునకు వలయు కొన్ని నియమములకు లోబడి, స్వతంత్రయగుటకు తెలుగు కవులందరు ప్రయత్నించుట పరమకర్తవ్యము.



## ANDHRA FOLK-LORE : A WORD TO STUDENTS

*By D. RAMI REDDY.*

*I have gone through almost all of the numbers of the "Triveni" and I am very much impressed with the neat execution and the valuable articles it contains. The selection of fine frontispieces is a regular delightful feature of your esteemed "Triveni". The Andhra pubilc sincerely feel grateful for the admirable part your Journal is playing in the cultural revival of India at large. I hope that you would try to maintain the same dignified standard in future, even though, I am sure that it will inflict a heavy financial sacrifice for a year to come. The long-felt want of the Telugu country which required a high-class English magazine to voice its aspirations and to communicate its cultural achievements to a wider public, remained unfulfilled until the 'Triveni' came into existence, and it is not too much to hope that the Telugu country would put into practice its usual generosity and see your noble venture a complete success.*

*Times have changed and with the times the traditional values. Any nation which cannot adapt itself to the inevitable changing conditions of life is sure to be superseded and utilised by the more adventurous nations of the world. This fundamantal law of evolution whose keynote is the struggle for existence can never be overlooked at least in the present stage of the World's moral progress. A nation, like an individual, grows and ripens into old age. When the vital sap is run out, it becomes disorganised and crumbles into insignificance. But the same nation, after a period of rest, is revitalised into active life by the repetition of the cyclic law which operates through external circumstances. Foreign contacts are not bad even when the prime motive is selfishness. By the contact of the aggresive civilisation of the West, our age long lethargy was shaken to its roots, though followed by its attendant evils, and a new vista of the golden future is presented to our sight. The destructive and reconstructive forces are now awakened to their legitimate duties and a receptive atmosphere has been created all over India for the inauguration of the new era. Our country too is not slow to respond to the call of progress, even though the softer notes of the cultural Renaissance*

*seemed to be drowned for a while in the trumpet voice of the political agitation. We behold everywhere in the Andhra country the signs of a healty life. New standards of education which culminated in the establishment of the Andhra Jatheeya Kalasala, a new school of painting which owed its genesis to the creative genius of the late Damerla Ramarow, and the modern school of poetry which had for its poineer the famous Gurazada Appa Rao who led a crusade against the sanscritised Telugu of the classics, and many other activities of importance go to show that our contribution to the present cultural upheaval of India is by no means insignificant.*

*One of the signs of life is growth and expansion. The growth presupposes assimilation. Any undigested material causes disease and decay, apart from the wastage it entails. As the discriminative adaptation and assimilation of whatever is conducive to our national well-being in other cultures are the essential factors of social and intellectual elevation and progress, our false sense of partriotism should not deprive us of the new possessions and advantages. Conservatism in any branch of human activity may be economical, self-preservative and useful up to a certain stage of growth as an outer shell of a seed, but if it persists in taking an undue advantage of its own good intentions, it is sure to prove detrimental.*

*When two nations with divergent civilisations are brought together by some historical happening, it is the weaker nation that is more influenced than the stronger. Then again, the weaker nation passes through the four stages of development, namely, imitation, adaptation, assimilation and independent creation. We have completed the third stage and are on the threshold of the fourth. No nation in the world has escaped this ordeal and we are no exception.*

*Anybody who is acquainted with the march of science and invention in modern times cannot think of keeping himself aloof from the rest of the world. Time and space have been conquered by the inventive genius of the west, and the religious, social and political differences are being minimised every day. If I am not accused of poetical idealism, I can safely predict that there will come a day when all the peoples of the world will join together as a family of nations and work in concert for the commonweal of mankind. The day may be far off in the hazy mists of the future. But, who knows - a happy*

తరువాత వెంకట్రావును కలసికొంటిని. 1912 సంవత్సరము మొదలు తాను గేయవాఙ్మయము రచియించు చున్నాడనియు, గేయములు వ్యాప్తిలోనికి వచ్చుటకై తాను చాల ప్రయత్నములు సలుపుచున్నాడనియు చెప్పెను. మంచి హృదయము, మంచి కంఠస్వరము గలవాడు. చక్కగ ఏల పాటలు పాడగలడు.

## 23-2-1926

పెమ్మారెడ్డిపాళెము చేరితిని.

## 4-3-1926

హైదరాబాదు "కృష్ణదేవరాయ భాండాగారము" వారు తిక్కన జయంత్యుత్సవ సందర్భమున నన్నాహ్వానించి యుండుటవలన తిక్కన కవితాపద్ధతులను గుఱించి కొంత విచారించితిని. సంస్కృత విరాటపర్వమును తెలుగు విరాటపర్వమును సరిపోల్చిచూచితిని. తిక్కన కవిబ్రహ్మయని అప్పుడు నా మనమునకు దట్టినది. ఇంతకు పూర్వము తిక్కన కవిత్వమును గుఱించి చాలగౌరవ ముండినదిగాని, మూలమునకు సరిపోల్చువఱకు ఆయన శిల్పప్రతిభ గోచరించినదికాదు. మూలమునకును తిక్కన భారతమునకును, తోలుబొమ్మలాటకును బయస్కోపునకు, గలయంత భేదమున్నది. పాత్రల చేష్టలను, ఆంగిక వికారములను, మనోగతములను వర్ణించి, మూలమున కవిచెప్పిన విషయములుగూడ పాత్రముఖమున చెప్పించి, నాటకపద్ధతిని, పాత్రలు మనకన్నులకు గట్టునట్లు చేసినాడు. నన్నయకంటె తిక్కనకు ఎక్కువ feeling and emotion + కలదు.

## 7-3-1926

ఈ దినము మధ్యాహ్నము ప్యాసింజెరుకు పెమ్మారెడ్డి పాళెమునుండి హైదరాబాదుకు ప్రయాణమైతిని.

## 8-3-1926

ప్రొద్దున 8 గంటలకు సికింద్రాబాదు చేరితిని. అచ్చటికి డాక్టరు రమణయ్య, వేణుగోపాలు, వెంకటరెడ్డి మఱికొందఱు వచ్చియుండిరి. అందరము కలసి హైదరాబాదుస్టేషను చేరితిమి. అచ్చటికి బాలసరస్వతీసమాజముయొక్క కార్యదర్శియు, శ్రీకృష్ణదేవరాయల గ్రంథాలయ కార్యదర్శియు, కేశవరెడ్డి, మాడపాటి హనుమంతరావు ఇంకను కొందఱు స్నేహితులు వచ్చియుండిరి. అమరచింతారాణిగారింట బసచేసితిని.

---

+ అనుభూతి, ఉద్రేకము.

## 9-3-1926

గ్రంథాలయ భవనమునందు సాయంకాలము 5-30 గంటలకు సభప్రారంభమాయెను. ప్రొఫెసరు తణికెళ్ళ వీరభద్రుడుగారు అధ్యక్షులుగ నెన్నుకొనబడిరి. వారు నా కవిత్వమును గుఱించి కొంత యుపన్యసించి, తిక్కనను గుఱించి చెప్పవలసినదని నన్ను కోరిరి. నేను తిక్కన జీవితచరిత్రమును గుఱించి కొంతచెప్పి, ఆకాలమున నలవాటులోనున్న కవితాపద్ధతులను, తిక్కన యొనరించిన కవిత్వనియమములను చర్చించి, తిక్కనకు భాషాతత్త్వమేగాక ముఖ్యముగ ఆంధ్రభాషాతత్త్వమును దెలిసియుండెనని సప్రమాణముగ నిరూపించితిని. తిక్కన యాంధ్రీకరణమును గుఱించియు, శిల్పానుకూలముగ ఆయన యొనరించిన మార్పులను, తిక్కన కవిబ్రహ్మయని పేర్కొనబడుటకు దగు కారణములను సవిస్తరముగ వివరించి, మూలమును ఆంధ్రీకరణమును సరిపోల్చి తారతమ్యమును చూపించితిని. ఉపన్యాసము రెండుగంటల సేపు పట్టినది. అయినను చెప్పవలసిన విషయములు ముగియలేదు. సభ్యులందరు సంతోషముతో సావధానచిత్తులై యుపన్యాసమును వినుచుండిరి.

## 11-3-1926

బాలసరస్వతీసమాజమువారు ఒక యుపన్యాసమిచ్చుటకు నన్ను ఆహ్వానించిరి. నాటకతత్త్వమును గుఱించి యుపన్యసించితిని. సురవరం ప్రతాపరెడ్డిగారు బి.యె., బి.యల్., అగ్రాసనాధిపత్యమువహించిరి. సామాన్యముగ నాటక తత్త్వమును గుఱించి చెప్పి, ప్రస్తుత ఆంధ్రనాటకముల దుఃస్థితిని వర్ణించి, నటకుల మోసమునకు నిదర్శనముగ రాఘువాచారి పఠాణిపాత్రమును చూపించితిని. తెలుగు నాటకములందు అచ్చము ఉర్దూ మాటలాడుట అసంగతమనియు ఈ మోసమును రాఘువాచారిగారు మనఃపూర్వకముగ చేయుచున్నాడనియు ప్రేక్షకులను తన యిష్టమువచ్చినట్లు గొఱ్ఱెలను చేసి ముక్కుబట్టుకొని తిప్పుచున్నాడనియు చెప్పితిని.

## 12-3-1926

కొత్వాలు వెంకటరామిరెడ్డిగారిని చూచితిని. ఆయన చాల పెద్దమనిషి. సరళస్వభావుడు. పరోపకారశీలుడు. కులాభిమానముగలవాడు, తెలుగువారికి అనుకూలుడు. రెడ్డి విద్యార్థులనిలయము కొత్వాలుగారి సహాయమువలనను ఆదరణమువలనను చాల యభివృద్ధిచెందుచున్నది.

## 13-3-1926

గోలుకొండ కోట చూడదలచుకొంటిని. అందుకు కొత్వాలుగారు తగువైన యేర్పాటులు గావించిరి. నేను, ప్రతాపరెడ్డి, డాక్టరు రమణయ్య, వేణుగోపాలు, ఇంకను కొందఱు రెడ్డి విద్యార్థులు కలసి గోల్కొండకోటకు పోతిమి. కోటలు నిర్మించు శిల్పములో పూర్వులు చాల నేర్పరులని నాకు తోచినది. వారు కోటగట్టునపుడు నైసర్గికానుకూల్యములను, సౌకర్యములను ముందు ఆలోచించునట్లున్నది. గోల్కొండకోటకు చుట్టును ప్రహరీగోడవలె ఎత్తైన తిప్పలు చిన్నకొండలు గలవు. విరోధి సైన్యములు వచ్చునప్పుడు ఆ కొండలెక్కి దాటి రావలయును. అందువలన వారు రెండు మూడు మైళ్ళ దూరమునుండియె కోటలోనివారికి అగపడుదురు. కోటకు రెండు ప్రాకారములు గలవు. మొదటి ప్రాకారము గోలుకొండనంతయు చుట్టియుండును. రెండవది కోటను మాత్రము చుట్టియుండును. కోటద్వారముకడకు దారి చక్కగ నుండక వంకులుబింకులుగనుండును. ద్వారమునకు యెదుట అడ్డగోడయుండును. ప్రక్కల దారులుండును. ఇదియొక సంరక్షక పద్ధతి. విరోధులు ఒక్కసారి గుంపుగా ప్రవేశించుటకు వీలులేదు. కోటలో దారికి రెండు వైపులను ఫిరంగిగుండ్లు చిన్ని చిన్ని గుట్టలుగ పేర్చబడియుండినవి.

కొండపైన, నబాబు దర్బారుచేయుటకు ఒకమేడ కట్టబడియున్నది. మహమ్మదీయ శిల్పులు చాలనిపుణతతో లాదుదురు. ఎంత పెద్దహాలైనను దంతెలులేకయే లాదబడియున్నది. రామదాసు కారాగృహమని చూపింపబడు గదిని చూచితిని. అందొకగోడకు సీతారాముల విగ్రహములు చెక్కబడియున్నవి. ఈ విగ్రహములు క్రొత్తగా చెక్కబడినట్లు చూపట్టినవి. ఒక పెద్ద బండకు మోటించికట్టబడిన యొక చిన్ని దేవాలయముగూడ కోటయందుగలదు. మూడు నాలుగు పెద్ద బావులును ఒక తోటయును గలదు. కోటయంతయు జూడగా, అది యొకని హయామునందు కట్టింపబడినదిగాక అప్పుడప్పుడు ఒక్కొక నబాబు అభివృద్ధిచేయుచు, మరమ్మత్తుచేయుచు వచ్చుచుండినట్లు కనుపట్టినది. హిమాయత్ సాగరు, ఉస్మానియాసాగరు అను రెండు పెద్దడెల్టా చెరువులను చూచితిని. అవిరెండును కలిసి కలిగిరి చెరువునకు సరిపోలవచ్చును. ఇప్పటి నబాబు Public works కును గొప్పగొప్ప భవనములు కట్టుటకును ధనము వెచ్చించును.

ఈనాడు సాయంకాలము వేమన గ్రంథాలయము వారి ఆహ్వానము మేరకు, వేమన జీవితముగుఱించియు, ఆయన మతమును, కవిత్వమును గుఱించియు ఉపన్యసించితిని. మాడపాటి హనుమంతరావుగారు అగ్రాసనాధిపత్యము వహించిరి.

## 14-3-1926

బారిష్టరు గోపాలురెడ్డిని, ఆయన తమ్ముడు బారిష్టరు సత్యనారాయణరెడ్డిని చూచితిని. వారిరువురు నన్ను చూచుటకు చాలసంతోషించిరి. గోపాలురెడ్డిని అదివఱకె నాకు కొంచెము తెలియును. సత్యనారాయణరెడ్డి క్రొత్తపరిచయము. సత్యనారాయణరెడ్డి కేంబ్రిడ్జిలో బి.యె. చదివి బారిష్టరు పరీక్షలోనుత్తీర్ణుడయి యిప్పుడు హైదరాబాదులో C.I.D. # లో పనిచేయుచున్నాడు. ఈయన Scotland yard @ లో తరిఫీదై వచ్చియున్నాడు. స్నేహోచితస్వభావుడు.

## 15-3-1926

వనపర్తి రాజాగారి బంగ్లాయందు వేణుగానపుకచ్చేరి జరుపబడెను. అచ్చటకు పోయియుంటిని. కొత్వాలు వెంకటరామిరెడ్డిగారు, పింగళి వెంకట్రామిరెడ్డిగారు, కొండారెడ్డిగారు ఇంకకొందరు వచ్చియుండిరి.

## 16-3-1926

నేనును ప్రతాపరెడ్డియు కలసి తణికెళ్ల వీరభద్రుడుగారి యింటికి పోయియుంటిమి. వీరభద్రుడు ఉస్మానియా విశ్వవిద్యాలయమున ఇంగ్లీషు ఉపన్యాసకుడు. ఇంగ్లీషు నాటకములను గుఱించి చక్కగా తెలియును. బాగుగ నుపన్యసింపగలడు. దంబములేనివాడు. మొగమున పాల తేటవంటి వర్చస్సు గలదు. సామాన్యముగ తాను చేసికొనవలసిన పనులుగూడ చేసికొనలేనో యేమొ అని యనుమానపడువాడు. రయిలు టిక్కెటుకూడ యితరులువచ్చి కొనిపెట్టవలయునని కోరును.

## 17-3-1926

నేను హైదరాబాదుకు పోయినతర్వాత స్పేటుదొర ఉస్మానియా యూనివర్సిటీలో యింగ్లీషు Professor (ప్రొఫెసర్) అని తెలియవచ్చినది. స్పేటుదొర పదునైదు సంవత్సరములు జపానుదేశమునందు ఆంగ్లేయోపాధ్యాయులుగనుండి, భూకంపముకలుగుటకు రెండు నెలలకుముందు, హైదరాబాదు దొరతనమువారిచే నాహ్వానింపబడి హైదరాబాదు చేరెను. ఆయన యొద్ద జపానుదేశపు పురాతనపు రంగు బొమ్మలు చాల కలవు. వానిని చూడవలయునను తలంపు నాకు కలిగెను. అదివఱకె స్పేటు గొప్పకవియని నే నెఱింగియుంటిని. స్పేటుదొరను చూడ కోరికగలదని మాటచెప్పిపంపితిని. ఆయన

---

\# సి.ఐ.డి. శాఖ.

@ స్కాట్లండు యార్డు.

తనకారుపంపి నన్ను రప్పించుకొనెను. నేను పోవునప్పటికి టేబిలుపైన టీ పుచ్చుకొనుటకు ఏర్పాటు గావింపబడియుండెను. టీ త్రావుచు మేము కొంత సంభాషించితిమి.

Speight : Do you write poetry always or now and then ?

(స్పెయిటు : మీరు నిరంతరము కవిత్వమును వ్రాస్తారా, లేక అప్పుడప్పుడుమాత్రమే వ్రాస్తూవుంటారా ?)

Myself : I write stray poems now and then, but my big poems are witten only in a particular season. My poetry seems to prefer the rainy season.

(నేను : అప్పుడప్పుడు ఖండకావ్యాలను వ్రాస్తూవుంటాను. అయితే పెద్దకావ్యాలను ఏదేనొక ఋతువులో వ్రాశాను. నాకవిత్వానికి వర్షర్తువు అచ్చినట్లున్నది.)

Speight : It must be so. Once I had put the same question to Dr. Tagore. He also told me that he had his own poetic seasons. Generally I write poems in dewy mornings.

(స్పెయిటు : అంతకాక తప్పదు. నేనొకతూరి డాక్టరు టాగూరుగారికి యిటువంటి ప్రశ్ననే వేయగా, తనకుగూడ కవిత్వఋతువులు కొన్నికలవని, ఆయన చెప్పినాడు. నామట్టుకునేను మంచుకురిసే ప్రాతస్సమయాలలో పద్యాలు వ్రాస్తాను.)

స్పేటుగారు జపాను చిత్రములను చూపుచు వాని ప్రాచీనతను వర్ణ విన్యాసమును వివరించుచుండెను. సగము చిత్రములను చూచునప్పటికె సాయంకాలము 5 గంటలు కావచ్చినది. అంతలో రెడ్డివిద్యార్థినిలయమునుండి పిలుపు వచ్చినది.

హైదరాబాదు రెడ్లు రెడ్డివిద్యార్థిసంఘమున నాకు టీ పార్టీ జరిపించిరి. ఇందుకు మూలకారణము కొత్వాలు వెంకటరామిరెడ్డిగారు. ఈ టీ పార్టీకి చాలమంది ప్రముఖులు వచ్చియుండిరి. వనపర్తి, ఆత్మకూరు రాజాలు, కొత్వాలు వెంకటరామిరెడ్డి, పింగళి వెంకటరామిరెడ్డి, పింగళి కోదండరామిరెడ్డి, బారిస్టరు సత్యనారాయణరెడ్డి, కొండారెడ్డి, జస్టిసు కృష్ణరావు, ప్రొఫెసరు హనుమంతరావు, మాడపాటి హనుమంతరావు, వామన్‌నాయక్, ఇంకను మఱికొందరు వచ్చియుండిరి. ప్రొఫెసర్ హనుమంతరావుగారును, సురవరం ప్రతాపరెడ్డి గారును నన్ను సభ్యులకు పరిచితునిగావించిరి. అనంతరము నేను రెడ్ల పూర్వచరిత్రను గుఱించి కొంత చెప్పుచు, వారి భాషాసేవను, నాగరకతౌన్నత్యమును కొంత ముచ్చటించి, అట్టి గొప్పవారికి దగిననంతతులమని చెప్పుకొనుటకు వలయు యోగ్యతను సంపాదించి పూర్వులకీర్తిని నిలుపవలయుననియు, ఎల్లకాలమును తాత ముత్తాతల కీర్తియె పెట్టుకొని తాము బ్రదుకజూచుట మానవంతులకు తగిన పని గాదనియు, తామును స్వయముగ పేరు ప్రతిష్ఠల

నార్జింప వలయుననియు చెప్పితిని.# తరువాత నేను రచియించిన పద్యములను చదువవలయునని సభ్యులలో కొందఱు కోరిరి. "కృషీవలుడు", "నక్షత్రమాల"లలోని కొన్ని పద్యములను చదివితిని.

సభ్యులకు ఆసమయమున వినోదముకొఱకు తెలుగుదేశపు శాండో ఒకరు బలప్రదర్శకములగు కొన్ని పనులు చేసెను. గొలుసు చేతితోకొట్టి తెంపెను. రూపాయను కుడిచేయి (అరచేతి)లో పెట్టుకొని పిడికిలించి దానిని వంచి వేసెను. నూవులను పిడికిట పిప్పిచేసి నూనెను తీసెను. ఈ శాండోకు నూరురూపాయల బహుమతి చేసిరి.

## 18-3-1926

పింగళి కోదండరామిరెడ్డిగారి యింటను, కొత్వాలు వెంకటరామిరెడ్డిగారి యింటను విందు గుడిచితిని.

ధ్రువనాడిగల శేషయ్యంగారు హైదరాబాదులో నుండినాడు. నాజాతకము చూపించితిని. ముప్పదియేండ్లవఱకు సరిపోవు జాతకము దొరికినది. అంతవఱకు అంతయు సరిపోయినది. తర్వాత భేదించినది. అందువలన నఖలు వ్రాసుకొనలేదు.

మనకు లభించియుండు కృష్ణదేవరాయల చిత్రములు రెంటిలో మొదటిదానిని (అనగా బస్టును) హైదరాబాదునందలి సత్వాలేకరు అను శిల్పి రచించెనట. ఆ చిత్రము కృష్ణదేవరాయల గ్రంథనిలయమున నున్నది. ఒక రాగి రేకుపై కృష్ణదేవరాయల ప్రతికృతి చెక్కబడి యుండినదట. దానిని అనుసరించి సత్వాలేకరు కృష్ణదేవరాయల చిత్రమును రచియించెను. అది యథార్థమైన ప్రతికృతియైనను కాకుండినను చూచుటకు బాగుగనున్నది. దానిని చూచి మఱియొక చిత్రకారుడు అనుకృతిగ మఱియొక చిత్రమును రచియించెను. ఇదియె రెండవ చిత్రము. అది అంత బాగుగలేదు.

హైదరాబాదునందు చాలరమ్యమైన Public garden * గలదు. దానిని చూచిన ప్రతిమానవుడును కవికాగలడని నాయూహ!

## 20-3-1926

రాత్రి 9 గంటల బండికి హైదరాబాదులో బయలుదేరితిని.

---

# ఈ యభిప్రాయములనే రామిరెడ్డిగారు "రెడ్డికుల ప్రబోధము" పేరిటి పద్యములలో నిమిడ్చిరి.

* ప్రభుత్వము వేయించిన ఉద్యానము.

## 21-3-1926

మధ్యాహ్నము రెండుగంటలకు ఇల్లుచేరితిని. ఈ దినము రాత్రి 9 గంటలకు గుండలమ్మపాళెంలో తిరుమూరు వరదారెడ్డి హృద్రోగమువలన మరణించెను. ఈయన నా శ్రేయోభిలాషులలో నొకరు.

## 24-4-1926

బుచ్చిరెడ్డిపాళెములో పెల్లేటి వెంకటసుబ్బారెడ్డి@ గారి అధిపత్యముక్రింద ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుల సభజరిగినది. నేనుకూడ పోయియుంటిని. డెప్యుటి యిన్‌స్పెక్టర్లుగూడ వచ్చియుండిరి. నేను చాలమంది స్నేహితులతో కలసికొంటిని. ఈనాటి సాయంకాలము బెజవాడ రామచంద్రారెడ్డి¥ అధ్యక్షులకును ఇంకను తక్కుంగల స్నేహితులకును టీ పార్టీ నొసంగిరి. రాత్రి టీచర్ల సంఘమువారు "వరవిక్రయము" అనునాటకమును ప్రదర్శించిరి. అందు లింగరాజు పాత్రమును కవి చాలనిపుణముగ మొదటినుండి తుదివఱకు పోషించినాడు. తాలూకాబోర్డు ప్రెసిడెంటును స్కూలు మాస్టరు తిట్టుటలో చాల మోటుదనము కనబడినది. పురుషోత్తమరావుకూతురు బావిలో దూకుటకు పూర్వము సభ్యులకు పెద్దయుపన్యాసమిచ్చుట వినుగుపుట్టించి శిల్ప దారిద్ర్యమును స్ఫురింపజేసినది. మొత్తముమీద నాటకము చక్కగనుండినది. ఇందుకు కారణము, అందలి కథావస్తువును everyday life ~ నుండి తీసికొనుటయె.

## 25-4-1926

డి.యం.కె. రెడ్డి, యం.యస్‌సి.,* ని చూచితిని. ఆయన అమెరికానుండి మూడునాలుగు నెలలక్రిందట వచ్చియుండెను. వ్యవసాయశాస్త్రము అందుముఖ్యముగ Cattle breeding () నందు నైపుణ్యముగడించి యమ్.యస్‌సి., డిగ్రీని గడించియున్నాడు. వ్యవసాయమును గుఱించి బోధించు చక్కని గ్రంథములు గలవు. ఆయనకు శిల్పాభిరుచి గలదు. ప్రవర్తనమును మంచిదని వింటిని. తాను సొంతముగ ఒక farm )( పెట్టదలచు కొన్నాడని చెప్పెను.

---

@ గూడూరు నివాసి. కొన్ని నాళ్ళు జిల్లాబోర్డు ప్రెసిడెంటు.

¥ జస్టిసు పార్టీ ప్రముఖుడు. లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు కొన్నినాళ్ళు అధ్యక్షుడు.

~ దైనందిన జీవితము.

* దొడ్ల ముద్దుకృష్ణారెడ్డి, బుచ్చిరెడ్డిపాళెం నివాసి.

() పశుపోషణ.

)( వ్యవసాయక్షేత్రము.

## 20-8-1926

ఇరువదిదినములు విషజ్వర పీడితయై నా ముద్దుబిడ్డ (కుముదమ్మ) గూడూరునందు యీదినమురాత్రి 9-30 గంటలకు పరలోకగతయయ్యెను. పిందెబుట్టిన నశియించు పువ్వువలె తల్లియు మరణించెను. ఆపిందెకూడ రాలిపోయెను.

## 24-9-1926

తే॥గీ॥ "కాలచక్రంబు మును శీఘ్రగామివోలె
నంచుజాడలు గనరాక యరుగుచుండె;
నేడు ప్రియురాలి పోకకు గోడుగుడుచు
కతన, నిమిషంబు యుగముగాగడచునాకు.

తే॥గీ॥ పూవురాలిన జిఱుబిందె పూపయైన
నంటుకొనియుండునన్న పేరాసనుంటి;
మృత్యునిశ్వాస పవనంబు రేగి సుడిసి
భావిఫలమును కసుగందుపైకి విసరె.

తే॥గీ॥ చెట్టుపోయిన విత్తైనజిక్కెనన్న
యాసయుంగూడ నేటితోనంతరించె
నకట! నాపూవుదోట కాడాయెనోయి
తోటమాలి, వసంతుడా, తొలగిపొమ్ము!

శా॥ పూవుంగిన్నెలదేనెలాని, లతికాపుంజంబులుయ్యాలకుం
దావుల్గాగ, నిరంతరంబు సుఖయాత్రల్ సేయుతేటుల్ ననున్
భావాభ్రంకషపక్షు గాంచి మదిలోభావించునాత్మీయ లీ
లా వాల్లభ్యము గ్రిందుసేయు నితడేలావచ్చునంచెప్పుడున్.

మ॥ ఇపుడన్నన్ విధివేటకాని వలలోనేకాకినైచిక్కి, పూ
ర్వపుటుత్సాహముగోలుపోయి, గఱులున్భగ్నంబులైచిందగన్
గృపతోవీడిన, నీడసంస్థితుడనై రేయుంబవల్ చీకటిన్
అపనోదించు తలంపుతోబ్రదుకు నా యాధిక్యమింకేటికిన్.

తే॥గీ॥ చిత్తతాపంబు బాపుకో జేలగట్ల
కరిగి కూర్చుండ, మూకసహానుభూతి
బైరుతలవంచు, భారంబుబంచికొన్న
ప్రాణసఖులట్లు; కవులకు బ్రకృతితోడు.

తే॥గీ॥ అపర దిక్కాంతసైతము నస్తమించు
నరుణ బింబంబుతో గన్నులవియజేయు,
దనదు పూజారి యిక్కట్లు తలచి కుంద
నెఱ్ఱపుండాయెనో యేమొ హృదయమనగ.

తే॥గీ॥ ఎంతకాలంబు చీకటి యింటియందు
గాపురంబుంట? యడుగంట గాలిపోయి
స్నేహహీనంబుగా వట్టి శెమ్మె నిలిచె;
ఎవరువెలిగింతురో? తైలమేడదింక?

ఉ॥ యౌవన నవ్యసౌరభ విహంగ మనాది కులాయవీథికిం
బోవనుపక్రమించె జెలిపోయినదారి; శరీరవల్లికిన్
రావికరెండుమాఱులు, తిరంబువసంతశుభోదయంబు; లిం
కా వివరంబు లేల? గతమయ్యె సుఖంబు, శ్రమంబె దక్కెడిన్.

ఉ॥ ఆసవమింకి క్రొన్నురుగులారిన కొంచెపు మట్టిపాత్రలో
నాసలునింపి, క్రొత్తదనమంటుకొనం బునరుద్ధరించు నా
యాసమదేలనీకు? బ్రభువా, యికనన్నొక భగ్నపాత్రలన్
వేసెడి మూలలో విసరివేయుము, భుక్తము సంస్మరింపగన్.

*ఉ॥ చాల ప్రసిద్ధశిల్పివని చాటుచు నుండును బండితాళి నీ
లీల లనంతముల్; దెలియలేమురహస్య; మదేలకో నమూ
నాలను వ్రాసి వ్రాసి కరుణంబును దృష్టియులేక చింపె దీ
కీలెఱుగంగరాని కృతికిన్ లభియించునదేమి, దెల్పుమా?

* "శిశువియోగము" క్రింద ఖండకావ్యములలో మిగత పద్యములున్నను, యిది అందుల అచ్చుకాలేదు కాని దీనితర్వాతి నాల్గుపద్యములు "మనోవిప్లవము" పేర ప్రకటింపబడినవి. (ఖండకావ్యములు : పు. 111)

*ఉ॥ కొందఱు సృష్టినీదయని, కొందఱు కర్మఫలంబటంచు నెం
దెందఱొ వ్రాసినారలదియెట్లగు? కర్తవు నీవయేని నీ
చందము దూష్యమౌను; మఱిసర్వము కర్మఫలంబటన్న నీ
వెందు కజాగళస్తనమ వీయపదూఱు వహింపదైవమా?

*ఉ॥ తీవలునాటి, పాదులకు దీయక నీరమువోసి, యామనిం
బూవులుపూవనున్నతఱి మూలములంబెకలించివైచు నీ
భావమదేమి? యీముడిని బండితు లైనసడల్పలేరు; కా
లావధి దగ్గఱించు; వృధయయ్యెనుజీవిత ముత్తచర్యలన్.

*చ॥ మనమున కందరాని యనుమానపుజిక్కును విప్ప యత్నముల్
దినదినముం బొనర్చి కడతీరముగానక బమ్మరింపజా
లను; నెటులైన రాగలఫలంబులు, కాగల మంచి చెడ్డలున్
బెనగొని వచ్చునొక్కటిగ, వీడు దమంత నయాచితంబుగన్.

*తే॥గీ॥ కర్మఫలమైన దైవాధికారమైన
నింకనేమైన గానిమ్ము; సంకటములు
పోకమానవు; సుఖములు రాకపోవు;
వానియెడల తాటస్థ్యంబు నూనియుందు.

## 25-9-1926

ఉ॥ ఈయిలకున్ ననున్ బెనచు నేగుదిబంధములేదు; ప్రేమ యా
దాయము సన్నగిల్లె; నదిదాటుటకింకదయారు; రేవునం
బాయకవేచియుందు, నుడుపంబులు వచ్చెడిదారి జూచుచుం;
జేయునదేమి? యాపడవ శీఘ్రమువచ్చునొ? యాలసించునో?"

---

* ఈ ఐదు పద్యములకు ముందు మరియొక పద్యమీయబడినది. అదియిది :

"సృష్టిచిత్రంబునకు మూలజీవమైన
జనన మరణక్రమంబు జింతనమొనర్చి
యంతుగనలేక యత్నంబు నాపుకొంటి ;
దేవ, పరమేశ, యున్నావొ? లేవొ? చెపుమ! -సం.

చ॥ "మునుపటిరీతి బ్రత్యుషము మోహనవేషముదాల్చి, శయ్యపై
గనుగవమోడ్చియున్న ననుగాంచి 'సఖా' యని మేలుకొల్పు; మో
మునదనమోమునాన్చి, సుఖముంజిలికించెడి ముద్దువెట్టు; నై
నను బరిదగ్ధసారము మనంబు; ముదంబెటు లాశ్రయించెడిన్?

చ॥ పొలములనుండిరాగనె ప్రపూర్ణకళాశశిబింబమట్లు, వా
కిలికడనిల్చి, సిగ్గుమెయి గ్రీగనులందిలకించుచున్, మనో
విలసనమాననంబున స్రవించెడినోయన నవ్వు, స్వాగతం
బుల నుపచర్యసల్పుచెలివోవ, మఠంబుగ మాఱెగేహమున్

చ॥ హృదయపువల్లకాటిరసహీనత దేహమునందెగాక, నా
మృదులకవిత్వపున్‌లతలమీదికిసైతము నల్లునంచు నా
కొదవెడి సంశయంబు; కృతియున్ సతియట్టులజంటవాసినన్
బ్రదుకు µ కు నువ్వునీళ్ళనుచు బాదపరాగమురాల్చి పోయెదన్.

చ॥ విరహపుదుమ్ములో బొరలి వెఱ్ఱితనాల బికారినై, వ్యథా
భర కబళంబులన్ హృదయపాత్ర భుజించుచు, బ్రేమవాకిటన్
జిరముగవేచి, యీకఠినజీవితమున్ గడుపంగనేల? యం
బరచరకామినీ ప్రణయమందిరముల్ కఱవాయెనేమొకో!

ఉ॥ పూవుల పిందెలన్ లతల బుష్పాడితావుల నందమైన నా
యౌవన నందనంబిటు ప్రియార్ధవియోగ దురంతతాపచిం
తావిలకీలలందు నుసియయ్యెను; ఆ నుసి ప్రేమదేవతా
జీవవిహీనమూర్తిపయి జిట్టెముగట్టె సమాధిపోలికన్.

("శిశువియోగము" క్రిందఅచ్చుపడిన యీ పద్యాలకు జతగా మరొకటి చేర్చబడినది. అది డెయిరీలలో లేదు :

"ఉప్పులోపింప మిగతవి యుండి గూడ
జవియు సారంబు కొఱవడు సాదకమున;
. వసు గలసిన యిల్లాలు మఱిగిపోవ
నన్నియుండియులేనట్టులయ్యెనాకు!")

---

µ "బ్రదుకు"కు అచ్చయిన పద్యములో "బ్రదిమి"కిగా మార్చబడినది - సం.

## 5-10-1926

ఓమరుఖాయమును పార్శీమూలమునుండి తర్జుమా చేయుటకు మనసుపడినది. అయిదారుపద్యములు వ్రాసితిని.

## 10-10-1926

యేబది రుబాయిలవఱకు తర్జుమాచేసితిని.

మూడునాలుగు నెలలు గృహనిర్మాణ కార్యములందు నిమగ్నుడనయి వ్రాతయు చదువును ఏమియులేక అచ్చము రెడ్డినైయుంటిని.

## 26-2-1927

స్థానము నరసింహారావు ప్రతిభావంతుడగు నటుడని వినియుంటిని. కాని యిదివఱకు నేను చూచియుండలేదు. కస్తూరీబాయి బాలికాపాఠశాల వార్షికోత్సవము జరుగు దినమున నేను నెల్లూరికి పోయియుండి ఆ సందర్భమున ప్రదర్శింపబడిన కృష్ణతులాభార నాటకమును చూచితిని. స్థానము సత్యభామ పాత్రనుధరించెను. పిల్లలమఱ్ఱి సుందరరామయ్య నారదుడు, పారేపల్లి రుక్మిణి, యడవల్లి కృష్ణుడు. కలయిక మంచిదె. 1600 రూపాయలవఱకు టిక్కెట్లు అమ్ముడు పోయినవి.

యడవల్లి కృష్ణపాత్రము చక్కగ అభినయించలేదు. చప్పట్లన్ని స్థానము పిల్లవె!

యడవల్లి చార్లిఛాప్లినువలె మూకాభినయము చేయమొదలుపెట్టినాడు. గాంభీర్యము పోయి యానాది హాస్యము మట్టుకు దిగింది. ఆలోపాన్ని పూరించడానికిగా వ్రాసుకొని కంఠపాఠము చేసికొన్న భరతనాట్యంలెక్చరును నాటకము అయిన వెనుక లయాన్వితముగ ఒకఉపన్యాసం కొట్టినాడు.

పారేపల్లి రుక్మిణిడ్రెస్సు నాకంతనచ్చలేదు. హిందూ సంప్రదాయ సిద్ధముగాదు. Half-naked µ పారేపల్లికిని స్థానమునకును అన్యోన్యమనుకరింపరాని యొక విశిష్టమైన అభినయకౌశలముగలదు. స్థానము ఎక్కువ active ç గనుండును. పారేపల్లి static * గనుండును. స్థానము అభినయము చూచిన వెనుక అభినవ నాటకప్రదర్శనములపై నాకుగలద్వేషము, విసుగు చాలవరకు తగ్గినవి. స్థానము స్త్రీ స్వభావమును మర్మమును చక్కగ గమనించినవాడుగా కనుపట్టుచున్నాడు.

---

µ అర్ధనగ్నము

ç చలాకిగ

* స్థాణువువలె

నాటకశాలలో నేనును, బెజవాడ రామచంద్రారెడ్డి, అప్రయత్నపూర్వకముగ నొకచోటనే జేరితిమి. అప్పటి మాకుడిక నాటకప్రదర్శనమును అనుభవించుటకు మరింత తోడ్పడినది.

వార్షికోత్సవ సభకుపోయియుండినప్పుడు రంగనాయకులు ø (Oxford), మామిడిపూడి రంగయ్యగారు పరిచితులైరి. రంగయ్య సౌమ్యుడు. రంగనాయకులు ఉత్సాహపూరితుడు. ఆయన యుపన్యాసము Oxford student * తెలివితేటలకు దగినదిగాయుండలేదు.

సాయంతనము కస్తూరిబాయి పాఠశాలవారు నటకుల కొసగిన టీపార్టీకి పోయి యుంటిని. నటకులుకోరగా మీరాబాయి చదివి వినిపించితిని.

యడవల్లిది మనుష్యులతో కలసిమెలసియుండు స్వభావముకాదు. తెచ్చుకోలు గాంభీర్యంమెండు. సుందర రామయ్య అందుకు ప్రతికూల స్వభావము. స్థానము తన కౌశలముపై తనకుగల నమ్మకముచేత కొంచెము reserved ¥

## 24-3-1927

గుంటూరికి శేషాద్రిరెడ్డియొద్దకు పోయియుంటిని. అచ్చట రెండుదినములుండి నేనును, శేషాద్రిరెడ్డియు కొండవీటికిపోయియుంటిమి. చాలదినములనుండి కొండవీడు చూడతలపుగలదు గాని ఆ భాగ్యము నేటికితటస్థించినది. కొండ క్రిందియూరులో కత్తులబావిగలదు. ఆ బావి దేవాలయములో గర్భగుడిలో పానవట్టమునకుముందు కలదు. ఇటీవల ఆ బావిని అచ్చటి మహమ్మదీయులు పూడ్చివేసిరని చెప్పిరి.

ఆ దేవాలయములో సగభాగము మహమ్మదీయులు ఆక్రమించుకొని పీరులచావడిగ చేసికొనియున్నారు. దేవాలయములో గోడలకుచెక్కబడిన విగ్రహములకు ముక్కులు చెవులు చేతులు విరుగగొట్టబడియున్నవి.

శేషాద్రిరెడ్డి తుపాకికూడ తీసికొనివచ్చియుండెను. కొండయెక్కుచుండగనె యొక గువ్వనుకొట్టెను. కొండవీటికోట! తుపాకిమోత! కవిమనస్సు! నాయొడలెల్ల గగుర్పొడిచెను.

కొండపైన యొక సరస్సుగలదు. అదిచాలమనోహర ప్రదేశము. అచ్చటస్నానముచేసి భోజనముచేసి వెదురు పొదరుటింటిలో విశ్రమించితిమి. మధ్యాహ్నము మూడు గంటలకులేచి శిథిలములైన దేవాలయములు, గృహములు, మంటపములు, చూచుకొనుచు అడవివారి బంగళాకుచేరితిమి. ఏదేవాలయమునందు చూచినను మహమ్మదీయుల దౌర్మార్గ్యము పొడకట్టుచుండినది. నిజముగా ప్రతిరెడ్డికిని కొండవీడు యాత్రాస్థలము.

---

ø ఆచార్యరంగా పేరుతోనున్న నాయకుడు. గొప్ప పార్లమెంటేరియన్. ఇటీవల పరమపదస్థులు.
* ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయ విద్యార్థి.

¥ బెట్టు.

## 26-3-1927

"సాహితీసమితి" సభాపతి శివశంకరశాస్త్రిగారిని కలసికొంటిని. పదినిముషములసేపు మాటాడితిమి. ఆయనను చూచుటకిదియె మొదటిసారి. నేను "నైవేద్యము"నిచ్చితిని. తరువాత ఆయన తనగ్రంథమును "హృదయేశ్వరి"ని పంపెను.

ఏనుగసుందరరామిరెడ్డి యింట భోజనము.

## 28-3-1927

బెజవాడకు వెళ్ళితిని. కట్టమంచి రామలింగారెడ్డి యింట ఆయనకు అతిథినిగనుంటిని. రెడ్డిగారు వైసుచాన్సలరు అయిన వెనుక కలసికొనుటకిదియె మొదటిసారి. "సర్వెంట్సు ఆఫ్ ఇండియా" సొసైటీß కి సంబంధించిన (పి) కోదండరావు అనునతడు రెడ్డిగారికి అతిథిగనుండెను. ఆయన (రైటు ఆనరబుల్ వి.యస్. శ్రీనివాస) శాస్త్రితోగూడ దక్షిణ ఆఫ్రికాకు పోయియుండెను. అచ్చటివిషయములను కొన్నిఅడిగినప్పుడు ఇట్లు చెప్పెను.

"Politicalగా Confess† చేయుటకు వీలులేనివి, యింగ్లీషువాళ్లకేగాక మనబోటివాండ్లకు చాలా అసహ్యకరంగాఉండే ఆచారాలు అలవాట్లు మున్నగునవి మన వాళ్ళలో అచ్చటచాలా ఉన్నవి. మనవాళ్ళకు Commercial morality †† యేమాత్రమూలేదు. చట్టప్రకారము ముందుతలుపులు మూస్తారేకాని, రహస్యముగా దొడ్డిద్వారముగుండా అమ్ముతారు".

ఈ సందర్భమున English man's Conscience "" ను గుఱించి రెడ్డిగారొక దృష్టాంతము చెప్పిరి. తాను రెండవతూరి యింగ్లాండుకు పోయినప్పుడు ఒకనాటిసాయంకాలము బజారుతట్టువెళ్ళినాడట. జాన్‌ఫేబరు పెన్సిళ్ళు మూరడుపొడుగు చేతికఱ్ఱలావువి అన్నిరంగులలోను ఒక అంగడికిటికీలో పెట్టి ఉండినవట. రెడ్డిగారు ఆరురంగులలో ఆరు పెన్సిలులు ఇమ్మని అడిగెను. అంతట అంగడివాడు, "Sir, will you please come to-morrow? just it is time to close our shop"* అని చెప్పినాడట. మనవారైనయెడల బేరము పోగొట్టుకొనుటకు ఇష్టములేక తలుపుమూసినను మఱల తెఱచి పెనసలులను ఇచ్చియుందురు, అని రెడ్డిగారి రిమార్కు.

---

ß గోపాలకృష్ణగోఖలే స్థాపించిన "భారతసేవక సంఘము"

† రాజకీయముగా బహిర్గతపరచి ఒప్పుకొనుట.

†† వర్తకధర్మము.

"" ఆంగ్లేయుని ఆత్మపరత.

* "దయచేసి రేపు ఉదయం రండి; అంగడి మూసేవేళ అయినది".

English man's Conscience గుఱించి నిహాలుసింగు "మాడరనురెవ్యూ"కు వ్రాసిన "Our rulers at home"œ అను వ్యాసములో ఒక Scavenger * ను గుఱించి చదివి యుంటిని.

రామలింగారెడ్డి బెంగ్లూరు అమెచూరునాటకసమాజమునకు అధ్యక్షుడుగా నున్నపుడు ఈ కోదండరావు కార్యదర్శిగా నుండినాడు. నాటకరచనను గుఱించి మేముముగ్గురము కొంత చర్చించితిమి. రామలింగారెడ్డికి యిప్పటినాటకములు ఇష్టములేదు. పద్యములు నాటకములలో నుండగూడదని ఆయన అభిప్రాయము. నాకును ఈ అభిప్రాయముగలదు. Old dramatic conventions **వర్జించి modern dramas వ్రాయమనిరెడ్డిగారు కోరిరి. సరేనంటిని.

పిచ్చిరెడ్డిని, రామశేషయ్యను, రామబ్రహ్మమును కలసికొని మాటలాడితిని.

## 30-3-1927

ఈవేళ రాత్రి గూడూరు చేరితిని.

## 27-4-1927

ఈ దినమంతయు యేమేమోనాటకములు, వ్యానములు, వింతపోకడలు నామనములో నుద్భవించినవి. మనస్సులోనే నాటకములు వ్రాసినాను, మనస్సులోనే వ్యాసములు వ్రాసినాను. కలగని మేల్కొన్నట్లు! ప్రకటింపబోవు నప్పటికి మనస్సంతా సర్వశూన్యం! బలేగారడి!

## 30-4-1927

"ఆంధ్రభారతి"కి "ఒక పంటకారు సాయంకాలమ"ను ఖండకావ్యమును,"రెడ్డిరాణి" కి "మనోవిప్లవ"మను ఖండ కావ్యమును పంపినాను.

"నాదేశాటనం డైరీ"వ్రాసినాను.

## 4-5-1927

"నాదేశాటనం డైరి" ప్రకటనార్థము "భారతి"కి పంపితిని.

---

œ "స్వదేశమున మనపరిపాలకులు"

* పాకీవాడు

** పురానాటక సంప్రదాయములు

## 25-8-1927

మొన్నటిరోజు మన్నెము శేషాద్రిరెడ్డి భార్య శేషమ్మ స్వర్గస్థురాలయ్యెనను దారుణవార్తవిని గుంటూరికి పోయియుంటిని. పాపము పూర్వపుటుత్సాహమంతయు ఇంకిపోయి శేషాద్రిరెడ్డి జీవచ్ఛవమువలె నున్నాడు. ఎట్టివారికైనను అనుకూలవతియగు భార్య మరణముకంటె దుఃఖకరమగు విషయము ఇంకొకటిలేదని చెప్పవచ్చును.

"I will have to remain like a watch dog, taking care of my children. If I should like to live, it is only for their sake" æ అని చెప్పినమాట నాకు యెక్కుడు చింతకలుగజేసినది. ఆయన ద్వితీయవివాహమున కొప్పుకొనలేదు. అదికూడా ఒక వివేకమని నాతలంపు.

## 28-8-1927

గుంటూరికి అయిదారుమైళ్ళదూరములో నున్న "లాం" అగ్రికల్చరలు ఫారము ¶ చూచినాను. దానిలో చూచినేర్చుకొనవలసిన దేమియులేదు. ఢిల్లీబఱ్ఱెలను పోతులను చూచినాను.

## 19-8-1927

గుంటూరు సబ్ జడ్జిగారగు కల్యాణసుందరముతో పరిచయమేర్పడినది. ఆయన నాకవిత్వమును మెచ్చుకొనుచుండువాడు. "Voice of the reed"® నుకూడ గనేషు కంపెనీనుండి తెప్పించుకొనెను.

## 1-11-1927

పది దినములనుండి గూడూరులో నుంటిని. ఈనాడు "కవితాచితి" అను శీర్షికతో పదిపన్నెండు పద్యములు వ్రాసితిని. ఎప్పుడు వ్రాయచూచినను ఆక్రోశగానమేగాని తదితరము వ్రాయుటకు మనసుపోవుటలేదు.

ఈనాడు రాత్రి మహత్తరమైన తుపానుగాలి వీచినది. ప్రొద్దునలేచి యొకరి మొగము లొకరు చూచుకొందుమా యనునంతటి భీతిగలిగినది. ఎట్లనోరాత్రిగడచినది. ప్రొద్దున చూచునప్పటికి గూడూరు గ్రామమంతయు శ్మశానమువలె నగపడినది. పూరిల్లు ఒక్కటిలేక కప్పులుఎగిరికూలిపోయినవి. పెంకుటిండ్ల పెంకులు, ముఖ్యముగా మాంగ్లూరు పెంకులు

---

æ "నాబిడ్డలను శ్రద్ధతో చూచుకొంటూ కాపుకుక్కవలె వుండాలి. వారికొరకే బ్రతుకగోరుతాను.'

¶ వ్యవసాయశాఖవారు నిర్వహించే క్షేత్రము.

® గణేశ్‌కంపెనీవారు ప్రకటించిన రామిరెడ్డిగారి యింగ్లీషు కావ్య సంకలనము.

ఎగిరిపోయినవి. చేపట్టుగోడలు పడినవి. కొట్టములుపడి పశువులు చచ్చినవి. చెట్లు విరుగబడిపోయినవి. పోగా నగముప్రాణముతో నున్నచెట్లకు ఒక ఆకుకూడలేదు. చెట్లుకాలినట్లుకనబడినవి.

గ్రామాంతరములలో సంగతులుతెలుసుకొనుటకును బంధువులక్షేమసమాచారములు తెలుసుకొనుటకును ప్రజలు తహతహపడినారు. తంతెమానులు, చిన్నిచిన్ని రయిలు స్టేషనులు సాపుగా పడిపోయినవి. నెల్లూరిలో టౌనుహాలు శిథిలమైనది. రంగమన్నారయ్యామిద్దె మూడవఅంతస్తు కూలినది.

రెండురోజులు రైలువద్ద బండ్లకొరకు కనిపెట్టుకొని యుండి సాయంకాలము 6 గంటలకు నెల్లూరికి చేరితిని. అక్కడ చినమ్మ యుండినది. కాని పెమ్మారెడ్డిపాళెం సంగతి తెలియలేదు. బాలకృష్ణయ్య * ఒక్కడే వుండినాడు.

పెన్న విశేషముగా పాఱుచుండినది. పడవ ఆడలేదు. గరండాలమీదుగా నడచి ఆరాత్రియె పెమ్మారెడ్డిపాళెం చేరినాను. ఇచ్చట మిద్దెచేపట్టుగోడలు పడిపోయియుండినవి. వడ్లకూటు కప్పుయెగిరిపోయి సుమారు మూడుపుట్లవడ్లకు నష్టము.

## 14-11-1927

ఉమ్రఖయ్యాము రుబాయతు కొరవ తర్జుమా చేయుటకు మొదలు పెట్టితిని. షుమారు ఏడెనిమిది రోజులలో పూర్తి కావచ్చును.

## 24-11-1927

రుబాయతు పూర్తిచేసితిని. అన్నియు షుమారు 110 పద్యములుండును.

## 20-4-1928

"పెద్దన. సమకాలీన భావప్రతినిధి" అను వ్యాసమును వ్రాసి "గోలకొండ" పత్రికయొక్క వార్షికసంచిక కంపితిని.

## 14-5-1928

మన్నెం శేషాద్రిరెడ్డి ద్వితీయవివాహము చేసికొనెను.

---

* దువ్వూరి బాలకృష్ణారెడ్డి - రామిరెడ్డిగారి తమ్ముడు.

## 1-7-1928

తే॥గీ॥ మరణమేలేకయుండిన, మానవునకు
పూర్ణముగ జీవితసుఖంబు బోధపడదు;
అంధకారములేకున్న నమృతకరుని
రాక కెవడు నిరీక్షించు రసపిపాస?

తే॥గీ॥ స్వర్గమును దుఃఖవిహీన నివాస మటుల
సృష్టిచేసెను మతిలేని శిల్పి యెవడొ !
చిటికె యైనను నైహికజీవితంబు
వినిమయముసేయ నమర పట్టణము కొఱకు.

తే॥గీ॥ కాంతపోయిన యనివార్య కారణమున
రూపఱినయట్లు లోకంబు చూపడియును
ఇంపెగొల్పునుగతజీవితంపు విలువ
యింతయంతని యనరాక హెచ్చుకతన.

తే॥గీ॥ కాలవాహిని దొర్లుచు కఱకు వాసి
నున్ననయ్యెనుస్మృతియు; నింకెన్నటికిని
వివరములు గోచరింపవు; వినిమయార్థ
స క్తయౌ ప్రకృతి కళ కసాధ్యమెద్ది?

తే॥గీ॥ కామినీ, నీవు యాథార్థ్యసీమదాటి
గొనబు బంగారు కలలలో గుఱుతుపడవు;
దివ్యమీ నీ స్వరూపంబు దిక్కుజూప
నపరిమిత మూల్యమాసించెనయ్యొ ధాత !

## 2-7-1928

చ॥ చెలిచనినంత నాయెడదచిక్కము, లుబ్ధునిముష్టిరూకలన్
బలముగ బట్టి యుంచుగతి పల్లవ కోమలమైన ప్రేమ చి

క్కులనిడె; నిచ్చిపుచ్చుకొనగూడని యీదురవస్థ కెన్నినా
ళులు నెల లేదు లోర్చుకొని లొంగుదు, మ్రింగుదులోన దుఃఖమున్.

§చ॥ కొలదికి మించు మోతనిడి గోనెను గాడిదమీదవైచి దొ
త్తిలబడి కాలుపూనుకొలదిన్ గొరడా మెదలించు నిర్దయున్
దలపునకీడ్చె దైవకృతి; తన్నును గార్ధభమేని యోర్చుకో
నలవి దొలంగ; మానవునకా తుదిమార్గముకూడ లేదుగా!

తే॥గీ॥ నవురు జెక్కుల వెన్నెల నవక మెడలి
కైపు చూపుల మవ్వంపు దీపు సడలి
ప్రేమ మరణించె నయ్యయో! పికములార,
పాడుడీ దుఃఖగద్గద స్వరములెత్తి.

## 17-2-1929

ఈక్రింది పద్యములు వ్రాసి "సమదర్శిని" సంవత్సరాది సంచికకు పంపితిని.

## "మంచుకాలపు ప్రొద్దుపొడుపు"

తే॥గీ॥ పిటికి వాడొక సింహపంజరము దెఱచు
నట్లు, కిటికీని దెఱచితి నల్లనల్ల;
చలికి గప్పిన కంబళి* సడలనీక
తొంగి చూచితి; గనుక్రొత్త దోచెనాకు !

తే॥గీ॥ ఆకసం బద్దముగవ్రాలె ననగ, మంచు
దట్టముగ వ్రేలి సర్వంబు దాన యయ్యె;
భావదుర్భిణీయంత్రంబు బట్టిచూడ
బ్రళయకాల సూక్ష్మాకృతి ప్రతిఫలించె.

---

§ ఈ పద్యము, దీనిపైది ఖండకావ్యసంపుటిలో "నిస్పృహాయత" అను పేర ప్రకటింపబడినవి.
* "బూర్నీసు" గా మార్చబడినది. -సం.

తే॥గీ॥ బాలభానుండు మంచులోపల వెలుంగ
క్రమముగా బహుత్వము చుట్టు గాననయ్యె;
బాల్యమున విన్న "దయ్యాలబైని" కథకు
దగిన యస్ఫుట చిత్రమై తనరె జగతి!

మ॥ వలికిం జెమ్మలువోయి కుత్తుక మెదల్పన్‌లేక లేయెండరా
కలకున్ ఱెక్కలువిచ్చి యార్చు ఖగసంఘాతంబు ప్రాభాతమం
జులగీతల్ వినిపింపనోపవు; హిమాంశుండయ్యె సూర్యుండు; ప్రా
చి లవంబేనియు జిత్రకారునకు సంసేవ్యంబుగా దిప్పుడున్.

చ॥ ఇనకరతాప చండిమము హెచ్చుకొలందిని మంచుకోతకో
యను వరిమళ్ళకుం బఱచు హాలికపాళి సువర్ణరోచులన్
మునిగి యథార్థరూపపరిపూర్ణత నొందిరి; తద్వసుంధరా
తనయ లవిత్రపూజ సరిదాకునె విగ్రహపూజ లెన్నియేన్?

ఉ॥ నా కిటికీకి నేరుగ గనంబడి రిద్దఱు, యౌవనంపు లే
బాకపు దీపులన్ మెఱుగు వాఱినయాలు మగల్; నెలంతయుం
బోక సగంబుగం గొఱికి ముందుగ భర్తకు బెట్టె; నాతడున్
ఆకు బొగాకు ద్రుంచుకొని యాలిపయంటను గట్టెశేషమున్.

ఆ॥వె॥ పెండ్లి క్రొత్తదనము వీడని దాంపత్య
లజ్జ, యళుకువారు లాలనంబు,
మొదటిప్రేమ దుడుకు పోకుల మురిపెంబు
వారి చేతలం దవార్య మయ్యె.

తే॥గీ॥ పనులు పాటులు నంతగా బట్టువడని
తరుణి ములువు© ను మున్నుగా తరిమి* కోయు;
శ్రమకు దాళని చెలిపైన జాలిపుట్టి
దప్పిగొనె నీరు దెమ్మని తడయబంపు.

---

© "ములువు", "మునుము"గాను, * "తరిమి", "తానె" గాను మార్చబడినవి -సం

తే॥గీ॥ ఆడు బిడ్డల యత్తల యాడికలకు
బొంచు చూపుల కెడమైన పొలముపనియె
క్రొత్త మిథునంబునకు స్వేచ్ఛ గూర్చునేమొ!
తోడిపనిపాటు ప్రేమకు దోహదంబు.

ఉ॥ వారలు పంట చేల బనిపాటొనరింపగగాంచి, నేను సో
మారితనంబునన్ గిలకమంచముడిగ్గక, యున్నిశాలు వే
మాఱక పొర్లుచుంటగని, మాటికి నాపయి రోతపుట్టి నం
సారి వ్రతంబు బూనుటకు సల్పితి గొప్ప ప్రతిజ్ఞ ధీరతన్". †

## 17-2-1929

ఈక్రింది పద్యములు "భారతి"కి పంపితిని. ¶

తే॥గీ॥ "ఓసి జాతీయతా, నీ బలోజ్జ్వలత్వ
మెంత ! నీ శక్తి సామర్థ్యమెంత! నీదు
శంఖరవమున గల యింద్రజాలమెంత!
అస్థిపంజరములుసైత మాడునౌర!

సీ॥ నీ యాజ్ఞచేగదా నిఖిల భారత భూమి
గాంధీ మహాత్ముని కట్ల బడియె;
నీ కోర్కెచేగదా నెఱలోభియైనను
దాచియుంచిన నిధుల్ త్రవ్వియిచ్చె;
నీ ధర్మమునగదా నెఱజాణయైనను
మోటు ఖద్దరు మేనమోయ దొడగె;
నీ పిల్పుచే గదా నిర్నిద్ర కీర్తులు
చెఱసాలలం జిక్కి చీకువడిరి;

---

† ఈ పద్యములన్ని "ఖండకావ్యములు" లో అచ్చయినవి.

¶ ఇవి "జాతీయత" పేరున "ఖండకావ్యములు"లో అచ్చయినవి.

తే॥గీ॥ ఒక్క పెట్టున నీభారతోర్వినెల్ల
నూపి, కెరలించి, వేమాఱు ప్రోత్సహించి
త్యాగ సామ్రాజ్య పట్ట భద్రతను గూర్చి
వడిగ స్వాతంత్ర్యరథమును నడిపెదరరె!

తే॥గీ॥ పూర్వకీర్తి ప్రతాపంబు బొగడినావు;
భావి భాగ్యోదయం బగ పఱచినావు;
వర్తమాన దాస్యంబును వదలజేయ
నే యుపాయంబు వెదకెదో యింకమీద!"

## 21-2-1929

అ ... పెండ్లి ! "సింహముపాలిసొమ్ము గోమాయువు గోరు చందమున!"

ఉ॥ బచ్చెనపండు కీరమటు భ్రాంతిమెయింగనిపెట్టుకొన్న నా
పిచ్చితనంబు కొందఱకు¥ వేడ్కయు; నా కభిభూతి లజ్జయుం µ
బచ్చని కోర్కెకుం దెవులు, బంధుహితాళికి జాలిగూర్చి, పై
పెచ్చుగ దీఱరాని వెతవెట్టునొ జీవితశేషమంతయున్!

తే॥గీ॥ విష్ణునాభిని వికసించు విమలకమల
మదుసు బురదల బుట్టిన యఘము వలన,
నళుకువడ కెట్టి భేకమే నాశ్రయించు;
నెంత విపరీతసాంగత్య, మెంతపాటు !*f*

తే॥గీ॥ అకట!œ యవివేక దూషితంబైన బంధు
జన సదుద్దేశమే భావిసమయ భోగ
భాగ్యములకు నిరోధక బంధమయ్యె;
దల్లి విషపాత్రనందీయ ద్రావ వలెనొ !

---

¥ "శత్రులకు", "కొందఱకు" గా మార్చబడినది.

µ "అవమానతాపముం" మొదట "అభిభూతిలజ్జయుం", తర్వాత "అనవాప్తిలజ్జయుం"గా మార్చబడినది.

*f* ఈ పద్యము అచ్చయినవాటిలోలేదు. రెడ్డిగారే దీనిని తీసివేశారు.

œ "అకట", "అతివ"గా మార్చబడినది. -సం.

తాగి॥ సదనురాగంబు పరిభవక్షతి నొగిలియు
ద్వేషముగ మాఱిబోదు పవిత్రమగుట,
వేఱొకని జీవితంబు నీ ప్రేమ కతన
సౌఖ్యపడునేని యదికొంత సంతసంబె.

తేగీ॥ రాజరాజ హృద్దేశ విభ్రాజమాన
క్రమ ముక్తాఫలము శుక్తి గనును గాని
మూల్య మెఱుగ దదెంతటి మూఢమతమొ;
వింతయొనగూర్చె బ్రారబ్ధ విలసనంబు.

ఉ॥ అన్నిదినాలు భావపటమందున నే లిఖియించికొన్న య
భ్యున్నత భావిచిత్రములొకొక్కటి జింపి, నిరాశ మంటలం
దిన్నగవైచి, పైకెగసి తేలెడు ధూమము జూచిచూచి, మే
ల్కొన్నటు క్రమ్మఱంబడయ గోరుదు కీలలరూపురేఖలన్.

మ॥ అమలంబైనప్రభాతరాగ రస విన్యాసంబునం బ్రేమ చి
త్రములన్ వ్రాసియు వ్రాసి యిప్పటికి వర్ణంబంతయుం, గుంచెయుం,
హిమికాస్వచ్ఛచిదంబరంబు© వ్యయమాయెం; దచ్ఛ్రమ ప్రాప్తమౌ
కమనీయంబగుసృష్టి నాయెదుట దగ్ధంబౌట కెట్లోర్తునో!

శా॥ ఆశాభంగ కఠోర శస్త్రికల నన్నంతంబుగావించి యా
వేశోన్మత్తత ద్రొక్కినన్ సరియ! దుర్వీక్ష్యంబు కోటీన సం
కాశప్రాభవ దివ్యతేజము మనః కంజంబునన్ వెల్గె; త
ద్రాశీభూతపవిత్రశక్తి యెదుటన్ దర్పింతువే దుర్విధీ?

క॥ తలవంపులు ఘటి యించితె
పలువంతల సన్నగిలినవానికి, విధి, నీ
బలమెంతొ దెలిసికొందును,
కలకాలము నీకు నాకు కలహము సుమ్మీ

© "చిదంబరంబు", "మనోంబరంబు" గా మార్చబడినది.

శా॥ కాలన్ రాచి విదల్ప నే బురుగునే ? కాలానల జ్యోతి యం
చేలా నీ వెఱుగంగలేవు? నిను, నీసృష్టిందుటారించి, భా
వాలంబంబున దివ్యలోకములు రమ్యంబౌనటుల్ సల్పి, నీ
యాలిన్ దొంగిలిపోయి; మత్ర్పణయ రాజ్యశ్రీనొనర్తున్ విధీ!

ఉ॥ ఓయి కవీశ ! భావరుచిరోజ్జ్వల దృశ్యములన్ సృజించి, త
చ్ఛాయలు లౌకికంబులగు సత్యములంచు భ్రమించి, నమ్మి నీ
ప్రాయము జీవితంబునిటుపాడొనరించెద; వొక్కనాడు నిన్
బాయక మేలుకొల్పువిధి భగ్నమనోరథ రోదనంబునన్. *

ఉ॥ భావన నీకు శత్రువు; విభావరి దాటకమున్నె, సూక్ష్మ తా
రావళికాంతి గాంచి గగనాంచలమందు మనోజ్ఞవర్ణరే
ఖావలితేంద్రచాపమును గల్పనసేతువు; గుడ్లగూబ ఘూ
ఘూవని కూయ, నుల్కిపడికాంతువు నిక్కపుటంధకారమున్ *

ఆ॥వె॥ కావ్యరచనలందు కవివి కావచ్చును;
దివ్యలోకమందు దిరుగవచ్చు;
కామ్యవస్తువులను కవిదృష్టి జూడకు,
గట్టినేల దడవి కాలువెట్టు. *

తే॥గీ॥ కంటికందని యాదర్శకంబు గోరి
యకట! దుఃఖాంతనాటకమాడెదీవు!
వెనుక ఫలమేమి? మానవ ద్వేషవహ్ని!
రక్తసిక్త హస్తముల నిష్క్రాంతినీకు ! *

తే॥గీ॥ ఒక్కమార్గంబుగలదు నీ వొప్పుకొన్న;
గైకొనినదాని నాదర్శకముగ మార్చు;
వలనుపడు నది నీ రసవాద కళకు;
నీదుకవితా స్వయంభ్రమ నీకు రక్ష! *

---

* ఈ ఐదు పద్యములు, ఖండకావ్య సంపుటిలో "ప్రణయబలి" పేర నచ్చయిన పద్యములలో చేర్చబడలేదు

చ॥ కవితలువ్రాసి చింపునటుగాదు! హృదంతరలగ్నమైన యా
యువతి మనోహర ప్రతిమ నూడబెగల్చెడునప్డు, జీవిత
ప్రవిమల రక్తపూరములు పైకెగజిమ్మెడు బాధ నోర్చుకో
నవునె, విధాత, నీకయిన? నారునె గాయము, మచ్చమాయునే ?

క॥ మగనాలివేట, నాకుం
దగదిక దలపోయ నిన్ను దరుణీమణి; నే
నగపడను దెరల మాటున;
విగతాశుని వీడుకోలు వేడకు మింకన్.

తే॥గీ॥ కాని, యొకకోర్కెగలదు; నీ మానసమున
ప్రణయ బలిరక్తధార లార్ద్రముగనున్న,
మఱువ బోకు మత్ప్రేమ సమాధిమీద
కనికరంబున నొక బాష్పకణము రాల్ప.

## 22-2-1929

## ఆశీర్వాదము

మ॥ చెలియా, నిత్యశుభోదయంబు, సకలశ్రేయంబులున్, భోగముల్
విలసత్ ప్రేమ సదాభివృద్ధియు, గళావిద్యాభిలాషంబు, ని
శ్చలమాంగల్యము, పుత్రపౌత్రులును బ్రజ్ఞాతారతమ్యజ్ఞతల్
వెలయన్ జీవితయాత్ర మీకిక సుఖాన్వీతంబుగా సాగుతన్.

## 23-2-1929

క॥ ప్రేమకు విషయీ భూతము
సామాన్యపు వస్తువైన శతగుణయుతమై
కామికి దోచు: యథార్థత
నామదికెఱిగింప నట్టినటన జరిపెతో!

తే॥గీ॥ ప్రస్తుతాశా విభంగత భావికాల
యోగ్యతర ఫలావాప్తికై యొసగితేమొ!
కాని, యింకొకమాఱు నాకామితంబు
సేయ నవకాశమిత్తునో సృష్టికర్త!

## 28-2-1929

తే॥గీ॥ ఈక లెదిగిన కనుదాటి యెగురునంచు
ఱెక్కలనుద్రుంచె పిల్లకు నొక్కపులుగు;
ఇదియె వాత్సల్య దృష్టాంతమేని, యింక
స్వార్థపరతకు ముద్దుపేరబ్బినట్లు! ß

క॥ తల యెగగట్టిన దాదిగ
నిలలో గష్టములు గుడువనే సృజియింతే
కిలఘాతుక విధి, నీ
చలమును సాధింప నన్యసరణులు లేవో!

మ॥ నెలతా, భగ్నమనోరథుండగుటనేనేగాని, వాంఛింపకే
కలిగెన్ నీకమృతత్వసిద్ధి, కవితా కళ్యాణసౌధంబునన్
నెలకొంటం; గవియాత్మముచ్చిలవయేన్ నీతోడి సామాన్యలా
చెలులట్లే నివసింతువేమొ యిల నజ్ఞేయంబుగన్ జీకటిన్. ß

## 4-3-1929

I have written a tragedy "Meerabai" and have suffered a tragedy in the loss of my wife. I have written a "Farewell", a poem of disappointed love, and I had to be disappointed in love! It appears as if my own Poetic creations foreshadow my misfortunes! Am I to write a comedy to regain my happiness?

(నేను "మీరాబాయి" అను ఖేదాంతనాటకమును వ్రాసితిని. నాభార్యమృతివలన ఖేదము పాలైతిని. "కడపటి వీడుకోలు" అను భగ్నప్రేమ యితివృత్తముగా గలిగిన కావ్యమును

---

ß ఈ రెండు పత్యములు "ప్రణయ బలి" క్రింద ముద్రింపబడినవి.

వ్రాసితిని; నా ప్రణయవ్యవహారము భగ్నమాయెను! నేను సృష్టించిన కావ్యములే రాగల దౌర్భాగ్యములను సూచించునట్లున్నది! సౌఖ్యమును తిరిగి పొందుటకు నేను మోదాంత నాటకమును వ్రాయవలయునా యేమి?)

*చ॥ తలపులయందె నావెతను దాచదొడంగితిగాని, వాత సం
చలిత పయోధి వీచికలచాడ్పునరేగు విషాదమేచి, యా
కులమయి గాఢసంయమన కూలముద్రెంపి క్రమించె నాలుకం;
దలగెను దానగొంత పరితాపము; నర్ధవిముక్తిచేకుతెన్.

*చ॥ కరుణను నాకయాచితముగా వరిషించిన నీ వరంబులన్
మరల బరిగ్రహింపుము రమాధవ! రమ్యకళావిభూతి, యం
బరచర భావలోలతయు, బల్లవకోమలమౌమనంబు, దు
ర్భర రుజలొచు నైహికనివాసమసహ్యమొనర్చునెంతయున్.

*చ॥ గఱులనుద్రుంచి, నేలకును గాలికి బందమువైచియుం బయో
ధర రథచక్రముల్ పగులతాచి, తటిల్లతజాటిద్రెంపి, క
ర్బుర రమణీయతాకిరణరోధకమౌ కవచంబొసంగి, ప్ర
స్తర కఠినాత్ముజేసి నను సంసరణార్ణమొనర్పు మీశ్వరా!

## 6-3-1929

*మ॥ కవితావల్లకి $f$, క్రూరమౌ విధి తిరస్కారంబునన్ నీకు సం
భవమయ్యెన్ హృదయాంతకవ్యధలుకావ్యాలల్లిపాడంగ; చా
లు విషాదాంకితగీతికారవళి! చాలున్ నిల్పుమాక్రోశగా
న విషజ్వాలలు! పూనుమీ యచలమౌ సన్యాసదీక్షాధృతిన్.

## 20-3-1929

శేషాద్రిరెడ్డిగారి మేనకోడలిపెండ్లికి గుంటూరికి పోయియుంటిని.

---

* ఈ నాలుగు పద్యములు "ప్రణయబలి" క్రింద అచ్చయినవి.

$f$ వల్లకి "నిర్ఝురి"గా మార్చబడినది.

## 24-3-1929

శేషాద్రిరెడ్డిగారును శివశంకరశాస్త్రిగారును గుంటూరిలోని కవులతో నాకుపరిచితి కలిగించుటకుగా రెడ్డిగారి యింట్లోనొక "టీపార్టీ" యేర్పాటు చేసిరి. అచ్చటికి శివశంకరశాస్త్రి, వేదుల సత్యనారాయణ, శారదానికేతనము artist •• బాబురావు, కృష్ణమాచార్యులు, కాలేజి ఉపాధ్యాయులు,మతీయొకరువచ్చియుండిరి. జాషువా యూరలేదు. ఫలాహారానంతరము వేదుల సత్యనారాయణ కొన్ని పద్యములు చదివెను. నేనును (జలుబుచేసి గొంతురాసియున్నను నన్నువారు వదలలేదు) రెండుపద్యములు చదివితిని. కృష్ణమాచార్యులు కొంచెము స్థూలకాయుడు. ఆయనలో యేదోకొంత Comic Seriousness * కనబడును. నోరెత్తిమాటలాడడు. మాటలాడిన "పెదవులు కదలీ కదలక". అది ఆయన స్వభావము. శివశంకరశాస్త్రి డొక్కశుద్ధిగలవాడు. ఇతర సారస్వతములతో కొంతపరిచయము కలదు. వీరందరికి నాకవిత్వముపై కొంత యభిమానమున్నట్లు తోచినది. "కవితాచితి" లోని "కలమును కాగితంబు తణఖాపడె గుడ్బయి రామిరెడ్డి", అనే పద్యం మాకు మాటిమాటికి జ్ఞప్తికి వస్తుంటుంది. అని శివశంకర శాస్త్రి, బాబురావు అన్నారు. మొన్నటి భారతిలో "జాతీయత" అనుపద్యములను ప్రకటించియుంటిని. 'పానశాల' ప్రకటించిన వెనుక భారతిలో నేను రెండవతూరి ప్రకటించిన పద్యములు యివియేకాబోలు. అందువల్లనే శాస్త్రి "రామిరెడ్డి పానశాలలోనుండి పాలిటిక్సులో బడ్డాడు", అని నవ్వినాడు. శివశంకరశాస్త్రికి కొంచెం humarous # గా మాట్లాడవలెననే అభిలాషఉన్నట్లు కనబడుతుంది.

## 25-3-1929

శారదానికేతనానికి నేనున్ను శేషాద్రిరెడ్డిగారున్ను పోయిచూచినాము. Art Section £ బాగుగానున్నది. ఆ నికేతనమునకు భూమి నొసంగినందులకు మునగాల రాజాగారు వంద్యులు. ఆసంస్థను చూచినాకు చాలసంతోషము గలిగినది. అది కొద్దికాలములో ఉన్నతస్థితికి రాగలదని నానమ్మకము.

## 26-3-1929

పెమ్మారెడ్డిపాళెం బయలుదేరినాను.

---

•• చిత్రకారుడు

* హాస్యముగూర్చు గంభీరత.

\# హాస్యధోరణిలో

£ చిత్రకళాశాఖ

## 16-6-1929

మూలప్పేట వేణుగోపాలస్వామి దేవాలయములో ఈనాడు మధ్యాహ్నం 10.30 గంటలకు నాకు వివాహమైనది. నాజీవిత కావ్యములో ఒక అధ్యాయము ముగిసి మఱియొక అధ్యాయము ప్రారంభమైనది.

" I made another garden, yea,
For my new love:
I left the dead rose where it lay
And set the new above." øø

## 7-9-1929

1చ॥ చివురులకెంపుపెంపెసగజేయు వసంతమువచ్చె; నెన్నడో
కవటలుమాని శుష్కరసకాండతనున్న రసాలశాఖి పూ
ర్వవిధమునన్ కిసాల విసరంబుల పూతలదర్శనీయమై
కవగొనె మాధవీలతను; గష్టములున్ గడదాకకుండునే!

2ఉ॥ చీకటియింటి కాపురపు జీకుదొలంగెను; జల్లవెన్నెలల్
ప్రాకి కుటీర కుడ్యముల రాత్రిదినంబుగమార్చె; స్నేహధా
రాకలితంబు సెమ్మె; కనరావిక భావపిశాచరూపముల్;
చేకుఱె చిత్తశాంతి; విరచించెడినూహలు భావిచిత్రముల్.

మ॥ చతురంబౌగద దైవకల్పనము! లాశాభంగముల్ గూర్చి, దు
స్థితులందేలిచి, లోతుపాతుల బరీక్షింపన్ వెతల్గొల్పి, పై
ధృతిహీనుండగు మానవుంగని దయార్ద్రీభూతుడై సంసృతి
క్రతుకర్తంబొనరించు దేవుడు సుఖప్రాబల్యమేపారగన్.

4చ॥ "గతము గతంబె, యెన్నటికి గన్నులగట్టదు; వర్తమానమే
సతత మవశ్యభోగ్యమగు సంపద" యన్న ఖయామునూక్తులన్

---

øø "క్రొత్తప్రేయసి కొరకుగా మరొకతోటను వేశాను నేను. చనిపోయిన గులాబిని పడివున్న చోటనేవిడచి, మరొకగులాబిని దానిమీద నుంచాను" -సం.

మతినిడి మల్లికాలతికనాటితి దగ్ధగతస్మృతిన్, సుమ
ప్రతతుల సౌరభంబు పరిపాకమునొందగ బందువెన్నెలన్.

5శా॥ అంతంబొందె మదీయమౌకృతివియోగాధ్యాయమీనాడు; చి
త్తాంతస్సంయమితానురాగరసముల్ వ్యాపించె సేతుచ్యుతిం;
జింతాక్రాంతత యౌవనంబువ్యయముంజేయంగనేమాయె; సా
గింతున్ జీవిత నందనంబున లతాంగీదోహదక్రీడలన్.

6చ॥ అనునిమిషంబు జీవితమునందు నవీన దిగంచలంబులే
కనబడు; దుఃఖమున్ సుఖమగాధతవిస్తృతిజూపు; రెండునున్
మనుజునిజ్ఞానవృద్ధికి సమానమె; యైన, నగాధతన్ వరిం
పను వెనుదీయుగా యుపరి మంథనలోల మనంబధీరతన్! *

## 12-9-1929

"అధ్యాయాంతము" భారతికి పంపితిని.

ఉ॥ రాలినపూలతేకులు ధరంబడి మన్నయిపోవ నందు రో
జాలతవ్రేళ్ళునాటి సుమసంతతిగాంచు; శ్మశానభూతి జం
బాలమునందు మొసులిడు పచ్చనిపూరి; విరక్తమానవుం
డేలనొ సృష్టిసూచన గ్రహింపడు లౌకికసంగరావనిన్!

## 26-9-1929

మధుసూదనుని Bustతయారుచేసితిని. పోలికలు చక్కగావచ్చినవి.

## 27-9-1929

బ్రహ్మశ్రీ కళాప్రపూర్ణ వేదము వెంకటరాయశాస్త్రిగారు నాటకములను గుఱించి యొకవ్యాసమువ్రాసి బహుశా ప్రకటనార్హముగాదనియెంచి పారవైచియుండును. ఆయన మరణానంతరము భారతిలో ఆవ్యాసము ముద్రింపబడినది. దానికి నాట్యకళాచరిత్రమని భారతి సంపాదకుడు తగని నామకరణముచేసెను. ఈవ్యాసముచదువగా నాట్యకళాచరిత్రము

* ఈ ఆరు పద్యములు ఖండకావ్యసంపుటిలో "అధ్యాయాంతము" పేర అచ్చయినవి. కాని యీవరుస కొద్దిగా మారినది.

లేదుసరికదా నాటకములను గుఱించి నేర్చుకొనవలసిన సంగతులు చాలకొద్ది. తాను ఆంధ్రీకరించిన నాటకములలోని పద్యములను గద్యములను ఉదహరించు కొనవలయునను చాపల్యము మెండుగ నగపడుచున్నది. ఇతరులను ఎత్తిపొడుచుట. భరత శాస్త్రములోని శ్లోకములను (అర్థము వ్రాయకయె) పూర్తిగా ఉదహరించిరి. ఆ శ్లోకముల నర్థము చేసికొనగలిగిన పాఠకులకెట్లో అర్థముచేసుకోలేని పాఠకులకును ఈవ్యాసమట్లె నిరుపయోగము.

## 16-11-1929

ఆంధ్రమహాసభవారు నాకు "కవికోకిల" బిరుదము నొసంగిరని కృష్ణాపత్రికలో చదివితిని.

## 15-12-1930

"Wireless Receiver" * చేసితిని.

## 10-9-1931

నెల్లూరు మునిసిపాలిటీ వారికి యొక Wireless Receiver చేసి యిచ్చితిని.

## 5-10-1931

చ॥ జలదము లాకసంబున పచారొనరించుచునుండె; సూర్యకాం
తులు చలివాఱి యుష్ణతకు దూరములయ్యెను; పైరుచేలలో
గలుపులుదీయు మాలెతల కంఠనినాదము కర్ణపేయమై
తలపడె; నేలయెల్ల దలదాలిచె పచ్చముసుంగు సొంపుగన్

## 17-12-1931

(17th A.M. 4-45) సీమంతపుత్రజననం. సుఖప్రసవం. "పూచెనోయి చక్కదనాల పూవొకండు.'

## 5-9-1932

1ఉ॥ పండినపైరుచేల దనపయ్యెదచెంగులకావిరంగు నీ
రెండలుగాయ సాంధ్యరమ యింపుగ లాస్యముసల్ప, దిక్కులా
ఖండలచాపపున్ రజముగ్రమ్మినరీతిరహింప, మున్నునా
దండకునైన రాక, కవితా, విగతాశునిజేసితేగదా!

---

* నిస్తంత్రీ శబ్దగ్రాహి. అనగా రేడియో.

2చ॥ కలుపులుదీయు మాలెతల కమ్మనిపాటలనాలకింప, నా
తలపులనంకురించె, ముగుదా, చిరకాలవియోగజంబులౌ
కలలు; మనంబునేటికిని కస్తురిగట్టిన గుడ్డపోలికన్
దొలగదు పూర్వగంధమును; దోపకయెన్నిదినాలు దాగెదే?

3శా॥ ఆకాశంబున మేఘమాలికలనెయ్యంబెంచి క్రౌంచంబులున్
రాకల్ పోకలుసల్ప, వక్రగతులన్ రాపాడుచున్ గట్టులన్
మోకారంబున బంటకాలవలు సంపూర్ణంబులై పాఱ, ది
వ్యాకారంబును జూపరావు, కవితా, యానంద ముప్పొంగగన్.

4చ॥ మఱచితివో యొకళ్ళొకరి మానసముల్ కవగూడి యేకమై
చిరముపొలంపు కోవలను జిన్నెల వెన్నెలపూలుగోయుచుం
దిరిగిన వానకాఱు తరితీపుదినంబుల సోయగంబు; ని
త్తఱి నిను గూడకుంట, కవితా, విరసంబుగదోచు వర్షమున్.

5చ॥ చినుకులజల్లు ఝుంకృతులు సేయుచు ముత్తెములట్లు రాలగన్
మనమునరేగుకోరికల మాన్పగలేక యెకాయెకిన్ బొలం
బునకరుదెంచి చెట్లగుమిపొంతల ముద్దుగ గూరుచుండి మో
హనత చిగుర్పగం బ్రకృతియందముగ్రోలగ బజ్జనుండవే?

6ఉ॥ దాగుడు మూతలేల కవితా, ముసుగున్ వలెవాటు దీసి, యీ
వాగు నిగారపున్ గఱికపట్టుల నాకడగూరుచుండి, వ
ర్షాగమలక్ష్మి యుత్సవముహోయిగసల్పుము; చాలకాలమై
రాగిలె చిత్తమీ వాసగు ద్రాక్షరసంబునుగ్రోల దృప్తిగన్ ß

## 5-10-1932

నెల్లూరు సంస్కృతకాలేజిలో "కవిత్వవిషయములు"ను గుఱించి యొక యుపన్యాసమొసంగితిని. నేలటూరు రామదాసయ్యంగారు •• అగ్రాసనాధిపతి.

---

ß ఈ ఆరు పద్యములు అముద్రితములు

•• నేలటూరు రామదాసయ్యంగారు గొప్పసంస్కృత పండితుడు. వేదమువారి శిష్యుడు. నెల్లూరు కళాశాలలో చాలకాలము చరిత్రాధ్యాపకుడు.

## 26-10-1932

నా కత్యంత ప్రియమిత్రులయిన మన్నెం శేషాద్రిరెడ్డిగారు స్వర్గస్థులయిరి. నా ప్రాణమిత్రులలో నొక్కని గోల్పోయితిని.

## 10-11-1932

ఇదియేమిచిత్రమో మఱియొకమిత్రునికూడ కోల్పోయితిని. ఈతూరి పిశుపాటి వేణుగోపాలు. మరణము హైదరాబాదులో. చూచుటకైన వీలులేదు. ఘోరము !

## 11-12-1932

* ఉ॥ తీరుగ తిక్కయజ్వ తరితీపు తెనుంగు కవిత్వ సారపున్
ధారల నాంధ్రసాహితి సుధామధురంబొనరించె; నట్టి యా µ
కీరితి పొల్లువోక పలికించెడు సింహపురంబు నేటికిన్
శారద కాంచికాకలిక సన్మణి కింకిణి నిక్వణంబులన్. **

*ఉ॥ నాటని నేటినింగలుప నాణెపువంతెనయౌచు బాండితీ
పాటవమందు విద్వదభివంద్య కవిత్వ విమర్శనంబులన్
సాటియుబోటిలేని ç కవి చంద్రుడుµµ వేంకటరాయశాస్త్రి యా
మేటరి సంస్కృతిప్రతిమమించు హృదంతర పద్మ పీఠికన్.

సీ॥ శ్రీనాథ కవివర్యు శేముషీ విభవంబు
కావ్యార్థ కల్పనా గౌరవంబు;
కృష్ణరాయనృపేంద్ర కృత విష్ణుచిత్తీయ
కేరళ ఘననారికేళరుచులు;
ప్రకృతిసౌందర్యంబు ప్రతి పదంబున నించు
కాళిదాస కవీశు కావ్యరసము;

---

* యీ రెండు పద్యములు ఖండకావ్యసంపుటిలో "కళాప్రపూర్ణుడు" అను శీర్షిక క్రింద ప్రచురింపబడినవి. కాని కవి కొన్నిమార్పులు చేసినారు. అవి యివి :

µ "నట్టియా"కు మారు "బూర్వమా"

** కడపటిచరణానికి మారు "శారద కావ్యనాటక విశారద మంజు విపంచి నాదముల్".

ç "సాటియుబోటి"కి మారు "బోటియుసాటి"

µµ "కవిచంద్రుడు"కు మారు "కవిపూజ్యుడు".

భవ భూతి సాహిత్య భాండార పేటిక
దాగిన యాణి ముత్యాలసరులు;

తే॥గీ॥ శ్రమలకోరిచి, యేరిచి, సంతరించి,
ఆంధ్ర వాఙ్మయ దర్శన హర్మ్యమందు
సంతవెట్టిన వ్యాఖ్యాతృ చక్రవర్తి
పేరు స్వర్ణాక్షరంబుల వెలుగుటరుదె !

సీ॥ కల్పించినాడు యుగంధరామాత్యుని
కైతవోన్మాదంబుగార్యదీక్ష;
చిత్రించినాడు కృశించిన యాంధ్రశౌ
ర్యము రేగ బొబ్బిలి యాహవంబు;
పరగించినాడు మాభావన బాణ పు
త్రికపెండ్లి చలువపందిళ్ళనీడ;
దక్కించినాడు కథాసరిత్సాగర
కథలదెల్గున గద్యగౌరవంబు;

తే॥గీ॥ "ఆంధ్రభాషాభిమాని సమాదరించి
దిద్ది యభినయాభిరుచుల దీర్చినాడు;
అంతటి కళాప్రపూర్ణుని కంకితముగ
స్మరణచిహ్నంబు నిల్పుట సార్థకంబు!

ఔ ఉ॥ నాడును నేడనాక యొకనాడును వీసరవోక, జీవితం
బూడినదాక సంస్కృత రసోజ్జ్వల భారతిసేవసల్పి, యా
యూడిగపున్ శ్రమల్ సయిచి యొప్పిదమైన ఫలంబు మాకు చే
కూడ ననుగ్రహించిన యకుంఠ కృపామతి వీవు ధీమణీ!

తే॥గీ॥ ఈ వొనర్చిన సేవకు నీడు జోడు
ప్రతికృతి యొనర్పలేము విద్వద్వరేణ్య;

---

ఔ ఈ పద్యము అచ్చు కాలేదు.

యెవరి యుపకృతియునులేక యీయనంత
కాలమున నీదు నామ మక్షరతగాంచు!

## 29-1-1933

గులిస్తాను తర్జుమాచేయుటకు ప్రారంభించితిని.

## 10-2-1933

ప్రథమాధ్యాయము 41 కథలు అనువదించితిని.

## 7-5-1933

నెల్లూరు రాజాగారి కాలేజి ప్రాత విద్యార్థిసంఘమువారు "మీరాబాయి" నాటకమును మొదటితూరి ప్రదర్శించిరి. నాటకము బాగుగానుండినదని అందరును అభిప్రాయపడిరి. టి.వి. శివరామయ్యగారు ® ఈ నాటకమునుగుఱించి "సుబోధిని"లో నొక యింగ్లీషు వ్యాసము ప్రకటించిరి.

## 27-5-1933

"మీరాబాయినాటకము యీతూరి గూడూరులో ప్రదర్శింపబడెను. హనుమంతరావు Ü, వరదరాజన్, సుబ్రహ్మణ్యం, శివకామయ్య, సుబ్బరావు, కృష్ణమూర్తి మున్నగు నటకులు చక్కగ వారివారి పాత్రలను నిర్వహించిరి. నెల్లూరి ప్రదర్శనముకంటె గూడూరిప్రదర్శనము చాలరెట్లు బాగుగనుండినది. గూడూరునందు క్రొత్తడ్రస్సులు కుట్టింపబడినవి. రంగపరికరముల కేలాటి లోటులేదు. సుశీలా వాసంతికల సీనున్ను, మంత్రులు సేనాధిపతి తర్కించు సీనున్ను తీసివేయుట యుక్తమని తలంచితిని.

మీరాబాయి నాటకమును గుఱించి తూములూరి శివరామయ్యగారొక విమర్శనము సుబోధినిలో ప్రకటించి "మీరాబాయి" high-class tragedy * అని ప్రశంసించెను. కాని రసలుబ్ధునిగూడెమువారికి ఈప్రశంస హృదయభేదకముగనుండినది. తరువాత "రసలుబ్ధుడు" ఒక వ్యాసమును వ్రాసి Scrutator పత్రికలో ప్రకటించెను. దానికి జవాబుగా నేనొక వ్యాసమును వ్రాసి "కళాప్రియుని" పేరట Scrutator లోనే ప్రకటించితిని.

---

® తూములూరి వేంకటశివరామయ్యగారు గొప్ప విద్వాంసుడూ, పేరు మోసిన నెల్లూరు న్యాయవాది.

Ü ఎరగుడిపూటి హనుమంతరావుగారు గూడూరులో మొదట టీచరు, తర్వాత న్యాయవాది.

* ఉన్నతశ్రేణికి చెందిన విషాదాంతనాటకము.

**10-7-1934**

గులిస్తాను తృతీయాధ్యాయము పూర్తియైనది.

**16-7-1934**

"పానశాల"కు ఉపోద్ఘాతము వ్రాసితిని.

**17-7-1934**

శా॥ ఓయీ, ఉమ్రఖయామ, నీవు చని యెన్నోయేండ్లుపూండ్లాయె; లే
బ్రాయంపుంజెలి సాఖియున్ ధరణి గర్భంబందు నిద్రించె; గు
ర్తే యౌపట్టక నీనిషాపురము జీర్ణించెంగదా! నీదు గో
రీ యైనన్ సడలున్; రుబాయ తొకటే స్మృత్యంకమై నిల్చెడున్.

పంచాంగంబును సంస్కరించు గణితప్రావీణ్యమున్నన్, సలా
మంచున్ సంజరుషాహి ప్రీతిమెయి నీకర్థాసనంబిచ్చి మ
న్నించంగల్గియు, గ్రీకుశాస్త్రముల పాండిత్యంబు నార్జించియుం
గాంచం గల్గదె నేటి కీర్తి కవివేగాకుండినన్ ఖయ్యమా ?

ఎందఱులేరు జోస్యులు మఱెందరు నీవలె హేతువాదులై
క్రుందిరి, వారి పుట్టువులమాటయె లోకమెఱుంగబోదు; నీ
నందన వాటికన్ గఱికపట్టుల బూబొదరిండ్ల నీడ మా
కందఱకున్ రసార్ద్రకవితాసవమిచ్చితి వాసదీఱగన్.

నీ తత్త్వంబులు మాకు బూజ్యములుకానీ, కాకపోనీ, మఱే
మీ, తత్త్వాలకు నేమిగాని, మధురస్మేరాస్యయౌ సాఖి దృ
క్స్రాతం బైహికజీవితార్తి పరితప్త స్వాంతులౌ వారికిం
జేతః ప్రీతినొసంగు; మాకదియె యాశీర్వాద మిప్పట్టునన్.

బ్రతుకు టెడారిలో నిసుకబాటల ద్రిమ్మరి నీరువట్టి దుః
స్థితి మరణింపనున్న యొక జీవి కదృష్టపు వాగువోలె సం
తతము ద్వదీయ దివ్యకవితారస నిర్ఝరిణీ ప్రపాత మ
ద్భుతముగ జిత్తతాపమును బోనడచున్ శిశిరాంబుసేచనన్.

తెలుగుందోటల బచ్చబీళ్ళ ననురక్తిం బానశాలా ప్రతి
ష్ఠలు గావించి త్వదీయ కావ్యరసభాండంబుల్ గులాబీలు బు
ల్బులిపిట్టల్ మధుపానపాత్రికలు సొంపుల్‌గుల్కు సాకీయు భూ
తలనాకంబొనరింపనిల్పి రసికాంధ్రప్రీతి గావించితిన్.

పారసికన్న శ్రావ్యమయి పల్లవ కోమలమై సుధారసం
బూరెడు మాతెనుంగునుడి నొప్పిదమౌనటు నీదు భావముల్
ఏరిచి చేర్చికూరిచితి నింపగు కావ్యము నోఖయామ, నీ
పేరిక యావదాంధ్ర పృథివీస్థలి శాశ్వతమై తనర్చుతన్.

అలరెడు నాణిముత్యముల యాశ్రయగౌరవమంది సూత్రముల్
గులుకు మిటారి జవ్వనపుగుబ్బల నాట్యములాడుగాదె యే
కలిమియులేకయుండియును ఖయ్యామ, నీమృదుముగ్ధభావమం
జులత సమాశ్రయించుకృతి సొంపిలదే రసికార్చనీయమై.

తెలతెలవాఱ సంజకడ దెమ్మెర కమ్మగవిచ్చుపూల తా
వుల బువుతేకులన్ విసరిపోయుత నీదు సమాధిపైన; బు
ల్బులులు గులాబిపూబొదలలో జిరకాలము నీదు కీర్తి నిం
పొలయ నుతించుగాక ! సెలవోయి, ఖయామ, సలాము, వచ్చెదన్.

## 20-9-1934

ద్వితీయ పుత్రజననం. సుఖప్రసవం. గూడూరులో 1-20 A.M.

## 4-1-1935

"కాంగ్రెస్‌వాలా" అను ఏకాంక రూపకమును రచించితిని.

## 31-3-1935

తిక్కనజయంతి జరిగెను. తిరుపతివాసులు శ్రీమాన్ మాడభూషి మఠం వెంకటాచార్యులవారు ఉపన్యాసకులు. విషయము చర్విత చర్వణము. తిక్కనకవిత్వము. నేను అధ్యక్షత వహించితిని.

## బ్రహ్మశ్రీ వేదం వెంకటరాయశాస్త్రిగారి జాతకం

### ప్రమాదీచ మార్గశీర్ష బ ౬

| | | | | | |
|---|---|---|---|---|---|
| | ల | శ | రా | | ర |
| | | రాశి | | | రా చం |
| కే | శు | | | అం చం | |
| శ | ర గు | బు కే | | | |
| | | బు | కు ల | గు శ | |

## శ్రీ దుర్భా సుబ్రహ్మణ్య శర్మగారి జాతకం

| | | | |
|---|---|---|---|
| | | | |
| శ | రాశి | | ల |
| కు | | | |
| | గు బు | కే, ర, శు చం | |

# కవికొకిల దువ్వూరి రామిరెడ్డిగారి సమకాలిక ప్రముఖులు

## బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు :

పుదూరుద్రావిడ కుటుంబమందు పండిత వంశమందు 1851లో జన్మించి, వేంకటరాయశాస్త్రిగారు ప్రతాప రుద్రీయము, బొబ్బిలి ఉషలను స్వకపోల కల్పిత నాటకములనేగాక, నాగానందము, రత్నావళి, ప్రియదర్శికవంటి సంస్కృత నాటకాలను, కథాసరిత్సాగరమును అనువదించి, గ్రాంథిక భాషావాదులలో సంస్కరణ విరోధులలో అగ్రేసరులై, కళాప్రపూర్ణ, మహామహోపాధ్యాయ బిరుదధారులై, ఆముక్తమాల్యదవంటి మహాప్రబంధాలకు వ్యాఖ్యాతలై, అభినవమల్లినాథ బిరుదాంకితులై, 1929 లో చనిపోయినారు.

## శ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు :

1875లో నెల్లూరులో వైదిక కుటుంబమందు జన్మించి, బాల్యమునుండి పద్యరచనకుపక్రమించి, ఎన్నోఅష్టావధానాలు చేసి, నెల్లూరులోని వేంకటగిరిరాజావారి కళాశాలలో ఆంధ్రభాషాధ్యాపకులైనారు. చక్కని తెనుగు కవిత్వము చెప్పి అభినవతిక్కన బిరుదాంకితులై, పరమ హంసానాథుని లక్ష్మీశృంగారకుసుమమంజరిని, శంకరాచార్యుని సౌందర్యలహరిని వివేకచూడామణిని, కాళిదాసుని శాకుంతల నాటకాన్ని అనువదించినారు.

## శ్రీ గాడేపల్లి వీరరాఘవశాస్త్రిగారు :

కర్నూలు జిల్లాలోని ఎఱ్ఱగొండపాళెములో 1891 లో జన్మించి, వేదమును సాహిత్యమును పఠించి, ఉభయభాషలలోను అనర్గళ కవిత్వము చెప్పగల పండితకవి. శతావధాని. ఎన్నో ప్రబంధాలను ఆశువుగా చెప్పడమేగాక, ఈయన త్రిపురాంతకస్థలమాహాత్మ్యము, శ్రీ సత్యవరలక్ష్మీధ్రువ చరిత్రము అనే కావ్యాలను రచించి 1945లో పరమపదించారు.

## శ్రీ గిడుగు రామమూర్తిగారు :

1863లో ముఖలింగానికి దాపునగల పర్వతాలపేటలో జన్మించి, శ్రీ గిడుగురామమూర్తి పంతులుగారు స్వయంకృషి చేత అఖండ పాండిత్య ప్రతిభావైభవులై, వ్యావహారిక భాషోద్యమ జనకులై, పండితులను అప్రతిష్ఠపాలుజేసినారు. సవరభాషకు వ్యాకరణాన్ని నిర్మించి అభినవ వాగనుశాసనులైనారు. రావుసాహెబు, మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ బిరుదాంకితులై 1940లో మదరాసులో స్వర్గస్థులైనారు.

## శ్రీ జయంతి రామయ్యగారు :

మహాపండితులు, పరిశోధకులు, యుద్ధమల్లుని శాసనములను బయల్పరచి తెనుగుకు ఎంతోగొప్పసేవచేసినవారు. పిఠాపురమురాజావారి ప్రోత్సాహ సాహాయ్యములతో వ్యావహారిక భాషోద్యమ ఖండనకొరకు 1911లో ఆంధ్రసాహిత్య పరిషత్తును స్థాపించి నడపినవారు. 1860లో జన్మించి 1941లో చనిపోయినారు.

## శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు :

తిరుపతి వేంకటకవుల శిష్యులలోనొకరై, గొప్ప పరిశోధకులైన పండితకవి. శృంగారశ్రీనాథము, కనకాభిషేకము, చాటుపద్యమణిమంజరి, క్రీడాభిరామ, బసవపురాణాదుల పరిష్కారము, రంగనాథరామాయణ పరిష్కారము, ప్రతిమా నాటకానువాదము చేసినవారు. 1950లో పరమపదించినారు.

## శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు :

1881లో చిత్తూరు జిల్లాలోజన్మించి, ఇంగ్లాండులో విద్యాభ్యాసము ముగించి, ఆంధ్రవిశ్వవిద్యాలయ స్థాపనకు కష్టించిన మహామేధావి; గొప్ప వాగ్ఝరికలవక్త. 'కవిత్వతత్త్వ విచారము'లో ప్రబంధకవిత్వమును విమర్శించి, 'ముసలమ్మ మరణము' ద్వారా తెనుగు కవితలో తొలిసారి గ్రామీణ కర్షకజీవితచిత్రణను చేసినవారు. 24-2-1951 లో చనిపోయినారు.

## శ్రీసురవరం ప్రతాపరెడ్డిగారు:

1896లో హైదరాబాదు ప్రాంతమందు జన్మించి, గోలకొండ పత్రికకు సంపాదకులై, కవులను పండితులను చేరదీస్తూవచ్చినారు. బహుభాషానిష్ణాతులు. పరిశోధనాసక్తులు. 'రామాయణ విశేషములు', 'ఆంధ్రులసాంఘిక చరిత్ర' వ్రాసినారు. 1953 లో పరమపదించారు.

## శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు :

1892లో పండితకుటుంబమందు జన్మించి, చిన్ననాటి నుండి లలితమధుర కవిత్వాభిమానియై శాంతినికేతనమందు రవీంద్రునికడ కళాసృష్టికి రెక్కలుతొడిగి, లలిత, తృణ కంకణము, ఆంధ్రావళి, తెలుగుతోట, రమ్యాలోకమువంటి కావ్యాలను వ్రాసిన కవిప్రముఖులు. 30-6-1984 లో పరమపదస్థులైనారు.

## శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు :

1895లో కృష్ణామండలమందు జన్మించి తిరుపతి వేంకటకవుల శుశ్రూషచేసి, ఎం.ఏ. పట్టముపొంది బెజవాడ కళాశాలలో ఆంధ్రాచార్యులైన విద్వత్కవి. ప్రౌఢకవిత్వ పక్షపాతి. తెనుగువాఙ్మయప్రక్రియలలో ఈయన పట్టి బంగారము చేయనిదిలేదు. వేయిపడగలు, ఏకవీర, చెలియలి కట్ట వంటి నవలలు, కిన్నెరసానిపాటలు, కోకిలమ్మపెళ్ళివంటి దేశికావ్యాలు, శ్రీమద్రామాయణ కల్పవృక్షమువంటి మహా కావ్యము, గిరికుమారుని ప్రణయగీతాలు, శశిదూతము, ఆంధ్రప్రశస్తి, - శతాధిక గ్రంథకర్త, కవిసామ్రాట్ బిరుదాంకితులు. "జ్ఞానపీఠ" అవార్డు గైకొన్న తొలి ఆంధ్రుడు.

## శ్రీనాయని సుబ్బారావుగారు :

1899లో జన్మించి 'సౌభద్రునిప్రణయయాత్ర' 'మాతృగీతాలు' లనే కావ్యాలు రచించిన గొప్పకవి. స్పష్టత, సారళ్యము, ఆర్ద్రత వీరి కవితాలక్షణాలు. 8-7-1978లో స్వర్గస్థులైనారు.

## అడవి బాపిరాజుగారు :

1895లో జన్మించి 'తొలకరి'తో కావ్యరచనకుపక్రమించి దేశిప్రక్రియలను సాధించిన భావుకుడు. చిత్రకళాదృష్టి ఎక్కువగాకలిగినవాడు. గోనగన్నారెడ్డి, నారాయణరావు, హిమబాలవంటి అనేకనవలలను, కథలను ప్రకటించి 19-9-1952న పరమపదించిన కళాతపస్వి.

## శ్రీ నండూరు సుబ్బారావుగారు :

ఆంధ్ర పాఠకలోకం ఎన్నడూ మరచిపోలేని ఎంకిపాటలను రచించిన కవి. 1884లో జన్మించిన వీరు 1957 లో దివంగతులైనారు.

## శ్రీ పాకల వేంకటరాజమన్నారుగారు :

మైసూరు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగానుండిన పాకల వేంకటరమణయ్యగారి పుత్రులు, మదరాసు ప్రధానన్యాయమూర్తి. భారత సంగీత నాటక ఎకడమీ అధ్యక్షుడు 'ఏమి మగవాళ్ళు' వంటి నాటికాసంపుటాలను ప్రకటించినారు. 'కళ' పత్రిక నిర్వహించారు.

## శ్రీ తల్లావజ్ఝుల శివశంకరశాస్త్రిగారు :

1892లో జన్మించి, 1912 నాటికి గ్రంథరచన ప్రారంభించి, నవలలు, గేయనాటికలు, వ్రాసినపండితకవి. సాహితీ సమితి సభాపతిగా, సాహితి పత్రికాసంపాదకుడుగా, ఎందరో యువకులను కూడగట్టిన సంఘటనకర్త. 1970లో కీర్తిశేషులైనారు.

# 1

# స్వీయచరిత్ర

("మహోదయము" అనే గీతికాఖండ సముచ్చయములో తమ పద్యాలు ప్రకటించుకొనేందుకు రామిరెడ్డిగారిని శ్రీ తల్లావజ్ఝుల శివశంకర శాస్త్రిగారు అడుగగా, అందుమీదట రామిరెడ్డిగారు వ్రాసిన ఉత్తరములో యీ క్రింది సంగతులు వ్రాశారు.)

**"ప్రియమయిన శివశంకరశాస్త్రిగారూ.**

మీరు వ్రాసిన లేఖలకు యింతకుముందే సమాధానము నివ్వలేకపోయినందుకు విచారిస్తున్నాను. సరియైన ఫ్రెంచి భాషోచ్చారణ నలవరచుకొనుటకై కొన్నినాళ్ళు పాండిచేరిలో వుండదలచితిని. కాని పరిస్థితులు నన్నక్కడ మరి కొంతకాలముండనిచ్చినవికావు. ఇది కోతలకాలమయినందుచేత యిల్లు విడచి దూరమున నుండలేకపోయితిని. ఒక వారమురోజుల క్రిందట మాయూరునకు వచ్చితిని.

పద్యములను యేరుకొనుటలో మీకు కావలసినంత స్వేచ్ఛనిచ్చుచున్నాను. ఈక్రింది పన్నెండుపద్యములను నేనే యేరితిని. వానినుండి మీకు అవసరమైనన్ని మీరు తిరిగి యేరవచ్చును. మీరు సంపాదకులయినందుచేత యీమాత్రం కష్టించక తప్పదు. మొదట దయతో యీ పన్నెండుపద్యములను® పరిశీలించి, నాభావనకు సమగ్రప్రాతినిధ్యముకల్గునట్లు మీరు యేరుకొనవలసినదని ప్రార్థన....." .

"నాజీవిత విశేషముల విషయమై, మీరెరుగని వింతలేవియులేవు. నేను గూడూరున 1895వ సంవత్సరము, నవంబరు 9వ తారీఖున, అనగా శనివారము ఉదయం దాదాపు 6-30 గంటలకు జన్మించితిని. పాఠశాలలో నేను నేర్చినవిద్య చాల కొద్ది. గృహవిద్యాలయ శిక్షితుడనుట యొప్పగును. ("A product of my home university"). నా వృత్తి వ్యవసాయము. ఇష్టవిషయములు విజ్ఞానశాస్త్రములును. మెకానికల్ ఇంజనీరింగ్‌యును. కవిత్వరచన కుపక్రమించుటకుముందు కొన్నినాళ్ళు నేను చిత్రలేఖనమును, మృత్తివిగ్రహ నిర్మాణమును చేయుచుంటిని. పందొమ్మిదేళ్ళ వయసున నాబ్రతుకునందు ఘటిల్లిన యొకానొక స్వల్ప

---

® రామిరెడ్డిగారు యిచ్చిన పన్నెండుపద్యములు యివి : ప్రణయాంజలి, కవి, కుసుమాశ్రువులు, రాధయుత్కంఠ, ప్రణయాహ్వానము, పంటకారు సాయంకాలము, అనార్కలి, రజని, బాష్పదౌత్యము, బిడ్డ : బాటసారి, మేలుకొల్పు ఇవి అన్నీ ఖండకావ్యసంపుటిలో ప్రకటింపబడినవి.

సంఘటన వలన ("by a trivial accident in my life") నేను కవినైతిని. అందువలననే నేననేక పర్యాయములు, అప్రయత్నముగను, అవలీలగను ననుదరిసిన కవిత్వమటులే ఘడియ ముందుకూడా హెచ్చరికనీయక వదలిపోవునేమోనని భయపడుచుందును.

1916వ సంవత్సరమున మొదలైన; మిక్కుటమైన కావ్యనిర్మాణదశ యేడేళ్ళవరకు సాగినది. ఈమధ్యకాలమున ప్రతి వర్షర్తువునందు నేనొక నవ్యకావ్యమును వెలువరించ గలిగితిని. 'పానశాల' మొదలైన యిటీవలి రచనలుతప్ప తక్కినవన్నియు నీదశలోనే చేసితిని. అటుపిమ్మట కావ్యమునకు కావ్యమునకు మధ్యకాలము క్రమముగ మాసములనుండి సంవత్సరములంతకు విస్తరింపసాగెను.

1917వ సంవత్సరమున సర్ సి.ఆర్. రెడ్డిగారు, నెల్లూరున చేరిన రెడ్డిజనమహాసభాధ్యక్ష పదవిలో, నాకొక సువర్ణపతకమును బహూకరించిరి. 1918వ సంవత్సరమున, విజయనగరము మహారాజావారు నడపిన కావ్యరచనాస్పర్థలో నా "వనకుమారి" సాధించిన ప్రథమస్థానమునకు చిహ్నముగ ఐదువందలరూపాయలను బహూకరించిరి. అందుకై ప్రత్యేకముగకూడిన దర్బారునందు యీ బహుమానము నిచ్చిరి.

నాఖండ కావ్యములందు కొన్నిటిని ఇంగ్లీషులోని కనువదించి "వాయిస్ ఆఫ్ ది రీడ్"గా ప్రకటించితిని. భారత దేశమునందును. ఇంగ్లాండునందును, అమెరికాయందును పత్రికలు అగ్రంథమును ప్రశంసించినవి. డాక్టరు జేమ్సు హెచ్. కజిన్స్, డి.లిట్., గారు ప్రపంచయాత్రసల్పుచు, భారతదేశములోను, జపాను, అమెరికా, ఇంగ్లాండు దేశములలోనుగల యనేక కేంద్రములందు నాయింగ్లీషు పద్యములను చదివి వినిపించిరి. అవి ప్రశంసింపబడెనని వారునాకు చెప్పిరి. ఆయన కలకత్తానగరముననిచ్చిన యుపన్యాసమును గురించి వ్యాఖ్యానించుచు, అందుండి వెలువడు "ఫార్వర్డు" అనుపత్రిక యీతీరునవ్రాసెను. "మనరవీంద్రనాథునిలోను,హరీంద్రనాథునిలోను, సరోజనిలోను యువకుడైన రామిరెడ్డిలోను ప్రజ్వరిల్లుచున్న మహాకాంతి దేశాంతరములకు కూడ వ్యాపించి, అంతర్గతమైయున్న ఉత్తమకవిత్వమును వెలువరింపగల్గుచున్నది."

ప్రపంచయాత్ర ముగించుకొనివచ్చిన డాక్టరు కజిన్సుగారిని నేను అడయారున కలసికొంటిని. వారిమాటలు నన్ను ద్రిగ్భ్రాంతునిచేసెను. "రామిరెడ్డి ! ఒకానొక ఐరిష్‌కవి భారతదేశ భాషలలోని కవిత్వమును గురించి ఇంగ్లాండునందు ఉపన్యసించుట, ఈజిప్టులోని పిరమిడ్లకడ పర్యటన సల్పుచుండిన ఒక అమెరికన్ ప్రొఫెసరు మీ "వాయిస్ ఆఫ్ ది రీడ్" లభింపమిచే బాధపడుట, మీరిరువురు ఎంతో యెడమున నుండుటవలన నాకడగల ఒకేయొక్క ప్రతిని నేనాయనకు పంపుట-యివి విచిత్రముగ కన్పించుట లేదా!"యని నన్నడిగిరి.

"బ్రిటిష్ ఎంపైర్ ఎడిషన్ ఆఫ్ ఇంగ్లీష్ పొయిట్రీ" (బ్రిటిష్ సామ్రాజ్యదేశాలందు రచింపబడిన ఇంగ్లీషు కవిత్వసంపుటము)లో నాపద్యములు మూడు ప్రకటింపబడినవి. విదేశీయులైన కవిత్వసంకలనకర్తలు తెలుగుకవి నొకనిని గారవించుటకు యిదే ప్రథమమేమో! డాక్టరు జేమ్సు కజిన్సుగారు "సమదర్శన" యను తమ గ్రంథమందు "భారతీయ భాషాకవిత్రయము"అను భాగమున సర్. మహమ్మద్ ఇక్బాల్‌ను, పురాణ్‌సింగ్‌ను, మరి నన్ను గురించి వ్రాసిరి. ఇంగ్లీషు కవిత్వచ్ఛందోరీతులలోకాక, నేను కల్పించుకొనిన స్వచ్ఛంద కవిత్వ రచనా నిర్మాణకౌశలమును, నాస్వతంత్రభావనాశక్తిని వారు మెచ్చుకొనుచు, "అమెరికాలో ఉత్పత్తిచేయబడుచున్న దానికంటె ఎన్నోమడుగులు యిది హెచ్చయినది", అని వ్రాసిరి.

పదిసంవత్సరముల క్రిందటనే "వాయిస్ ఆఫ్ ది రీడ్" ప్రతులు అమ్ముడైపోయినను, తిరుగ దానిని వెలువరింపకుండుట సోమరితనముచేతనేకాని వేరుకాదు. నా ప్రతినికూడ మిత్రులొకరు తీసికొని తిరిగి నాకివ్వలేదు. నేను పార్శీ, బెంగాలీ, ఫ్రెంచి భాషలనుకూడ నేర్చితిని...'

(ఇంగ్లీషున వ్రాసిన రామిరెడ్డిగారి లేఖకు యిది తెనుగుసేత)

# 2

# ఆంధ్రోదయము

(క్రైస్తవ కళాశాలాపత్రిక "తెలుగు అనుబంధము"ను తమకు పంపిన శ్రీ జి.జగత్పతికి రామిరెడ్డిగారు వ్రాసిన లేఖలోని కొన్ని భాగాలందు, దేశాభిమానికవిత గురించి కవి అభిప్రాయాలను తెలిసికొనవచ్చును.)

శ్రీయుతులు జి. జగత్పతిగారికి,

"మీరుదయతో పంపిన "క్రైస్తవ కళాశాలా పత్రిక" తెలుగు అనుబంధము చేరినది. అందలి అన్ని వ్యాసములను పద్యములను చదివి సంతోషించితిని. విద్యార్థుల హృదయములలో ఎంతటి రచనాశక్తి నిగూఢముగ దాగి ఉన్ముఖమయి వెలికురుకుటకు సమయమునకై వేచియున్నదో ఆ వ్యాసముల వలన తెలుసుకొనవచ్చును. ఈ యనుబంధమే లేనియెడల వారికి రచించు నుత్సాహమె పుట్టియుండదు....

"కాలచక్రము కొంత తిరిగినది. క్రిందైన ఆకులు పై తేలినవి. ఆంధ్రులను పట్టి బాధించుచున్న కాళరాత్రి అంతమొందుచున్నదను సంతోషవార్త తెల్పుటకు పురోగాములైన తేజోరేఖలు ఆంధ్రకవికుమారుల గుండెలంటివేసినవి. నవ్య భారత భాగ్యోదయమును వారు దశదిశలు ప్రతిధ్వనించునట్లు గొంతెత్తి చాటించిరి.

"ప్రత్యుషశ్శాంత నిర్మలాంబరమునందు
నరుణ రక్తిమ వ్రాసెజయాంకములను;
జిమ్మచీకటి తెరలను జింపివైచి
మేలుకొనుమమ్మ, యికనైన మేలుకొనుము"

"నిద్రయే జీవనంబని నీకు మున్ను
నూరిపోసిరి మాయల మారు లెవరొ;
మచ్చుమందుల మతకమ్ము విచ్చిపోవ
గడప గాల్మెట్టి లేయెండ గ్రాగుమమ్మ."

"కాలగర్భంబునన్ దాగి కాన రాని
భావిదృశ్యంబు కన్నుల బడిన యట్లు
నలుదెసల బ్రొద్దుపొడుపు నిగ్గులు రచించె
నభినవజగంబు; ముసుగెత్తియరయు మమ్మ"

"అను నిట్టి వేనకువేల గీతములు ఆంధ్రుల హృదయములందు ప్రతిధ్వనించినవి.ß ఎన్నియో శతాబ్దులనుండి మట్టిదిన్న పామువలె అలసమైపడియున్న ఆంధ్రాత్మను పునరావిష్కరణము చేసికొనిరి. ఆత్మసాక్షాత్కారమైన వెనుక అధఃపతనము లేదు."

"అన్యులను అనుకరించడము, పరాయివారిని ప్రస్తుతించడముతోనే తనివిసెందిన తెలుగువారు ఆత్మగౌరవప్రీతి హెచ్చితమవారిని గుర్తించుచున్నారు. ఆంధ్రకావ్యము చేతబట్టుట అవమానకరమనుకొన్న దుర్దినాలు గడచిపోయినవి. మన పోతన,తిక్కన, శ్రీనాథాది మహాకవులకంటె మిల్టను, షెల్లీ, కీట్సు చాల గొప్పవారను అజ్ఞానవిలసితమైన అపోహ అంతరించినది. మాతృభాషపై మమత హెచ్చినది. "సత్కవితాయద్యస్తి రాజ్యేనకిమ్," అన్న కవితాసామ్రాజ్యము పునఃప్రతిష్ఠితమైనది. తెలుగుతేజము, తెలుగుకత్తి. తెలుగు నుడికారము, తెలుగునేల అను మాటలు ప్రతి విద్యార్థినాలుకకొనన నృత్యముచేయుచున్నవి. ఇట్టి నవయుగ ప్రభాతసమయమున ఆంధ్రవిద్యార్థులు పసుపు పుట్టముల ధరించి దీక్షాకంకణ బద్ధహస్తులయి జయజయధ్వాన ముఖరిత వదనములతో పులకిత శరీరములతో ప్రథమారుణోదయమును దర్శించుచున్నారు, శకుంతసంతానములు యశోగానము చేయుచున్నవి. ఆంధ్రుడా రథముపైకి లంఘింపుము. నీ విజయయాత్ర నిరాతంకముగ సాగుగాత!"

---

ß ఈ పద్యములు శ్రీరామిరెడ్డిగారు వ్రాసినవె. ఖండకావ్య సంపుటిలో "మేలుకొలుపు" శీర్షిక్రింద ప్రకటింపబడినవి.

# 3

## శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి లేఖ

## రెడ్డి జనసంఘము

అధ్యక్షులు :
శ్రీ మునగాల జమీందార్లు
ఉపాధ్యక్షులు :
కట్టమంచి రామలింగారెడ్డి

3. బోరుబాంక్ రోడ్డు,
బెంగుళూరు.
12-7-'20.

ప్రియమయిన రామిరెడ్డి,

మీజాబునుచూచి మీ అద్భుతోత్సాహమును గమనించగా నాకు సంతోషమైనది.

మన నెల్లూరు మిత్రులు కొంచెము మందగించుచున్నారను మాట వాస్తవముగా విచారదాయకమైయున్నది కాని మన మహాసభ ఉత్సాహమునకిది ప్రతిక్రియయని నాయూహ. రెడ్లు గౌరవస్థులు, మాటమీద నిలిచెడువారు నయినందుచేత నేను నిరాశచెందుటలేదు. నా యీ నమ్మకమును మార్చుకొనుటకు అగత్యమేమియు కనుపించలేదు. ఉత్సాహవంతులైన మీబోటివారున్న యెడల, మన ఉద్యమము మొక్కవోదని నా నిశ్చయము, మీరు నెల్లూరికి వెళ్ళినపుడు కర్తవ్యమును గురించి ప్రయత్నించిచూడవలసినది.

ఇచ్చెదమన్న రొక్కము యిచ్చినట్లయిన, త్వరలో అతిసులభముగా పత్రికను మొదలుపెట్టవచ్చును. మీరే మా మొదటి సంపాదకులని భావించుచున్నాము.

భవదీయుడు,

**(అనువాదము)**

**సి.ఆర్.రెడ్డి.**

# 4

## బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రి గారి లేఖ

అయ్యా !

యుష్మత్ప్రణీతములైన వనకుమారీ జలదాంగనా కృషీవలనామక గ్రంథములను పరికించితిని. వానియందు కవితా బీజమయిన ప్రతిభనాకు గోచరించినది. శబ్ద సౌష్ఠవ ప్రవణత్వముగూడ నగపడుచున్నది. కావున ఈ మార్గమున మీకు కీర్తిగలుగునని నేను నమ్ముచున్నాను.

**వే.వేం. శాస్త్రి.**

# 5

## శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారి లేఖ

పర్లాకిమిడి

3-11-1921

శ్రీ నీలం గోవిందరాజులునాయుడు ☆ గారికి :

అయ్యా !

గడచిన నెల 24వ తేది మీరు దయతో వ్రాసిన లేఖకు, మీ మిత్రులైన శ్రీ రామిరెడ్డిగారి పుస్తకములకు వందనములు.

మీరు వ్రాసినట్లు "గ్రంథకర్త సంప్రదాయ సిద్ధములగు పద్ధతులనుండి స్వతంత్రించి కాలమునకు తగిన మార్గమున పద్యములు వ్రాయ ప్రయత్నిస్తున్నాడ''ని విని చాల సంతోషించినాను. మీరున్నూ మీ స్నేహితుడున్నూ నా పత్రికయిన "తెలుగు"ను చదువగోరుతాను. దానిలో బాలకవిశరణ్యము, ఆంధ్ర పండితభిషక్కుల భాషా భేషజము లను వ్యాసములను వరసగా ప్రకటిస్తూ వున్నాను. నేటి వ్యవహారములోని తెలుగు రూపాలను ప్రయోగించడాన్ని సమర్థించుట కోసమున్నూ, వేదము వేంకటరాయశాస్త్రిగారివంటి దాంభిక పండితులు చేస్తున్న తప్పులను వెల్లడి చేయుటకోసమున్నూ, యీపని సాగిస్తూవున్నాను. దీని వెంట జతచేసిన పత్రము నా ఆశయములను మీకు తెలియపరచగలదు.

---

☆ నీలం గోవిందరాజులు నాయుడుగారు కొన్నినాళ్ళు నెల్లూరుజిల్లా కోవూరులో సబ్‌రిజిస్ట్రారుగా నుండిరి. కవికోకిలకు పరమమిత్రులు.

నా పత్రిక మరు సంచికలో కృషీవలుడు, జలదాంగనలనే కావ్యాలను సమీక్షచేయడానికి నాకే అభ్యంతరమూలేదు. వాటిలో నిజమైన కవిత్వమున్నది. కాని వ్యక్తంగానో వ్యక్తావ్యక్తంగానో కవి వాడుకలోలేక గ్రంథములందే నిలిచిన పదాలను ప్రయోగించడము చూచి నాకు విచారముకలిగింది, వీటిలో కొన్నిటిని యిటీవలి దాంభికపండితులే సృష్టించినారు. జలదాంగనలో పదహారవ పద్యము రెండవపంక్తిలో మొదటి పదము (చొచ్చ) ఉదాహరణకు, తప్పు. చొచ్చుయొక్క తద్ధర్మ రూపమైన చొర(న్)కు మారు అదివాడినారు. (వచ్చు-రాన్, తెచ్చు-తే, (ర(న్)); 32వ పద్యములో అకావికలు అనేది వకావకలు అయివుంటుంది. ఈవిధంగా విమర్శించడానికిదిచోటుకాదు. నేను సమీక్షచేసేటట్లయితే యిటువంటి విషయాలను గూడ స్పృశించవలసి వుంటుందని చెప్పడానికే యీహంశాలను ఎత్తిచూపినాను. నాఅభిప్రాయాలను వ్యతిరేకించే 'పెద్ద' పండితుల నటనలను బయల్పరచడానికి నాకు ధైర్యము కద్దు కాని మీమిత్రునివంటి కుర్రకారు కవుల మనస్సులను గాయపరచడానికి సంకోచమవుతుంది, వీళ్ళు కవులకు జన్మహక్కయిన స్వేచ్ఛను సంపాదించడానికి మనస్ఫూర్తిగా కృషి చేస్తున్నవాళ్ళు "ప్రకృతిలోని నిప్పురవ్వనొకటి యివ్వు; నేను కోరుకొనేది అ చదువేను", అని బర్న్స్ § లాగున అనేవాళ్ళు.

మీకూ మీనేస్తులకు గౌరవపురస్కరంగా,

(అనువాదము) భవదీయుడు,

**జి.వి. రామమూర్తి**

---

§ రాబర్టు బర్న్స్ స్కాట్లండు కవి.

# 6

## వేటూరి ప్రభాకరశాస్త్రిగారి లేఖ

3/15 నల్లతంబివీధి,
ట్రిప్లికేను,
5-12-1920.

శ్రీ నీలం గోవిందరాజులునాయుడు * గారికి వ్రాసినది :

ప్రియ మిత్రమా,

మీరు దయతోపంపిన పుస్తకములు రెండు చేరినవి. చదివినాను. సంతోషించినాను. కవి మిక్కిలి ప్రతిభాశాలి. చక్కని భావములు. శైలియును నిగ్గుదేరియున్నది. ఇంకను ఇట్టి

గ్రంథరచనచే నితోధికముగా నాకవి పేర్వెలయగలదు... నా పరితోషము గ్రంథకర్తగారికి తెల్పుడు ....

చిత్తగింపుడు,

మిత్రుడు,

**వేటూరి ప్రభాకరశాస్త్రి.**

---

* శ్రీ నీలం గోవిందరాజులు నాయుడు గారు కొన్నినాళ్ళు కోవూరులో సబ్ రిజిస్ట్రారుగా పనిచేసినారు. వారు కవికోకిలకు ప్రియమిత్రులయినందుచేత, వారి గ్రంథములను సుప్రసిద్ధ పండితులైన శ్రీ ప్రభాకర శాస్త్రిగారికి పరిశీలనార్థము పంపగా, శాస్త్రిగారు వ్రాసిన లేఖయిది (సం.)

# 7

## వంగూరి సుబ్బారావు ¢ గారి లేఖ

పండిత వంగూరి సుబ్బారావు
ప్రాచ్యభాషాబోధనలో ప్రభుత్వపు డిప్లొమా గలవారు.

6&7, తంబుచెట్టివీధి,
జి.టి. మదరాసు
3-11-1921.

అయ్యా!

తాము దయతో బంపిన విమర్శనముగల పత్రికయందినది. విమర్శనము సంపూర్ణముగా జదివితిని. మీరందు సూచించిన గొప్పతనము నాకడలేకున్నను-ఇది వినయోక్తికాదు-నా పరిశ్రమను గుర్తించిన మీ గొప్పతనము ద్యోతకమగుచున్నది. స్వవిషయములవిడిచి - మీసర్వసాధారణవిమర్శనము (General remarks) కు నేనెంతయు సంతసించితిని. ఇంతమాత్రము చల్లని మాటయే రాలేదు. చల్లనిమాటల కొఱకిది నేను వ్రాయకపోయినను-అదియిచ్చుటలోకధర్మము. అభిప్రాయ భేదములు-అభిమాన సూచకములు-అని వ్రాసిన విషయములు కొన్ని నాకంగీకారములు. అనగా మీ యభిప్రాయములకు కారణములు కలవు. కాని నాయభిప్రాయములు నాభాషా దారిద్ర్యము వలననేమి - తొందరవలన నేమి-కష్టములవలననేమి-ప్రథమప్రయత్నమగుటనేమి-చదువరులకు ద్యోతకమగుటలేదు. కొన్ని కేవలము సవరింపవలసియున్నవి. ... ఇంకొక్కమాట....

నా విషయములో నిట్లుకరుణజూపినవారు ప్రథములు శ్రీరామలింగారెడ్డిగారు, ద్వితీయులు మీరు.

మీ దయచేబొంగిన హృదయమును మీయెడ కృతజ్ఞతచే శాంతింప జేసితిని.

దయయుంచుడు,

చిత్తగింపుడు,

**వంగూరి సుబ్బారావు.**

---

¢ ఆంధ్రకవి చరిత్ర వ్రాసిన పండితుడు.

# 8

## జేమ్సు హెచ్. కజిన్సు * గారిలేఖ

అడయారు,

6-12-'21.

మీ పద్యములు చదివినాను. కొన్ని నన్ను ముగ్ధునిచేసినవి. తిరిగి చదువవలెననిపించినది. పరిశీలించవలెను. కవిత్వప్రేములకు నావుపన్యాసయాత్రలో వీటినిచదివి వినిపించవలెననియున్నది. వారు దీనిముద్రణములో ఆసక్తి చూపగలరేమో. నేను కొన్ని చిన్ని మార్పులు చేసినాను, పక్షము రోజులలో తిరిగి పంపగలను. మీకు ఆత్మపరతయున్నది.

**(అనువాదము)** **జే. హెచ్. కజిన్సు.**

---

* జేమ్సు. హెచ్. కజిన్సుగారు కవికోకిల కావ్యజీవితమును కొంతవరకు మలచగలిగిన మహనీయులు. ఐర్లాండు దేశమున పుట్టి, ఆనీబెసెంటమ్మగారి అనుచరులై, థియోసాఫికల్ సొసయిటీ కార్యకలాపాలకు సారథులై, కజిన్సుగారు భారతదేశాభిమానులైనారు. భారతీయాత్మను ప్రపంచానికి విప్పిచెప్పేందుకై వీరు "సమదర్శన" వంటి గ్రంథములు వ్రాయడమే కాక, విదేశాలలో సభలలో వుపన్యాసాలు కావించారు. తెలుగు సారస్వతానికి వీరు చేసినసేవ బ్రౌన్‌గారి సేవవంటిదికాకపోయినను, రెండవమెట్టుకు చెందినదని భావించవచ్చును. వీరు 1956లో మదనపల్లిలో పరమపదించారు.

# 9

## జేమ్సు హెచ్. కజిన్సు గారిలేఖ

లెడ్‌బీటర్ ఛేంబర్సు
అడయారు, మదరాసు
29-3-1923.

ప్రియమయిన రామిరెడ్డీ,

మీ గ్రంథవిషయము గణేశ్ అండు కో., వారితో ప్రస్తావించితిని. కాని దేశములో సాహిత్యాసక్తి కొంతకుకొంత క్షీణించుటవలన అమ్ముడుపోని పుస్తకాల నిలువ యెక్కువగా వున్నదట. ఇంగ్లీషులో ఉత్తమ కవిత్వము కూడ అమ్ముడుపోదనుచున్నారు. నాసొంతగ్రంథములెంత ప్రసిద్ధములైనప్పటికి, చక్కని సమీక్షలు వచ్చినప్పటికి, చాల మందగతిని అమ్ముడగుచున్నవి. అందుచేత తామీగ్రంథమును వెల్వరతురనుకొనలేను. కాని మీరు అచ్చుఖర్చులు భరించినచో, మీ కొరకు వారు దీనిని ముద్రించి, తమ కంపెనీపేరునుకూడ యిచ్చి, దాని వ్యవహారము నిర్వహించి ప్రకటింప నిచ్చగింతురు. భారతీయులు వ్రాసిన ఇంగ్లీషు కవిత్వమున కుపోద్ఘాతములు వ్రాయకూడదను నా నియమమును మీపుస్తక విషయమున నుల్లంఘించుటకుకూడ సంతోషించుచున్నాను. మీది యీ పద్దునపడదు. మహోత్తమమైన దేశభాషాకవిత్వమునకు ఇది ఆహ్లాదకరమైన అనువాదము. తొలిపలుకులో దానిని పరిచయముచేయ సంతోషింతును.

(అనువాదము)

భవదీయుడు,
**జేమ్సు. హెచ్. కజిన్సు.**



# 10

## జేమ్సు. హెచ్. కజిన్సుగారి లేఖ

మేనర్ లాడ్జి,
డార్జిలింగు,
19-5-1923.

ప్రియమయిన రామిరెడ్డి,

మీ అనువాదములను బహుశ్రద్ధతో సవరించి ముద్రణ కొఱకై శుద్ధప్రతిని తయారుచేయుటకు మీకుపంపితిని. ఇంగ్లీషుభాషాలోపములను సరిదిద్దుటలోను, లేదా సరియైనదానిని పటుతరము చేయుటలోను నేనుచేసిన సవరణలు మీకు సరియైనవిగ కన్పించునని తలతును.

"కవి-శ్రామికుడు", "విస్మృతకవి", అనువాటిని మీరు తీసివేతురని భావింతును. ఈవరకే కవిత్వమునుగురించి చాలినన్ని పద్యములున్నవికదా! నేనొక వుపోద్ఘాతమునుగూడ చేర్చితిని. గాని యిది ముందుగా వెల్లడిచేయకూడదు. మీ కావ్యము తన గుణములమీదనే ఆధారపడి నిలువవలెను; నిలువగలదు!

సందర్భమునకు చక్కగా సరిపడినచోట్లతప్ప తక్కిన చోట్ల "దౌ" (యింగ్లీషులో "నీవు లేక మీరు" నకు పర్యాయ పదముగా గౌరవ వాచకముగానుండి తర్వాత వ్యవహారములో వినష్టమైనపదము - సం.) ను తొలగించితిని. గ్రంథము, కావ్యము మొత్తము ఛందోబద్ధమయిననేతప్ప లేనియెడల అసందర్భముగానుండు కొన్ని యాదృచ్ఛిక ఛందోబద్ధ పంక్తులనుకూడ తొలగించితిని.

"కోకిల"కు మారు "కక్కూ" సరిగాదు. పాశ్చాత్య దేశములలో కక్కూలు పాడవు.

నా ఉపన్యాస యాత్రలో చదువుటకుగాను యీ దిగువ పేర్కొన్న పద్యములొక్కొక్క ప్రతిచొప్పున జూన్ నెల రెండవవారమునకు ముందుగా నాకు దయతో పంపవలసినది. "రివిలేషన్" (17వ పుట), "స్వాతంత్ర్య రథము"(24), "భవిష్యద్దర్శనము" (26), "వాల్మీకి" (33), "బాటసారి-బిడ్డ" (36), "వర్షాకాలములో పొలములు" (43), "గరిక"(44).

శుద్ధప్రతిని 39, తంబుచెట్టి వీధిలోని గణేశ్ అండు కో., వారికి పంపి, వీలైనంతత్వరలో ముద్రించమని అడుగవలసినది.

(అనువాదము)

భవదీయుడు,

**జె. హెచ్. కజిన్సు.**

# 11

## పి.వి. రాజమన్నారుగారి లేఖ

| | |
|---|---|
| కళ | సంపాదకీయకార్యాలయము, |
| మాసపత్రిక | 103, అణ్ణాపిళ్ళ వీధి, |
| సంపాదకుడు : "సుధాకరుడు" | మద్రాసు, |
| ప్రకాశకులు : టాగోర్ కంపెని | 27-8-1923. |

ప్రియ మిత్రమా,

నాపైగల తావక ప్రేమావిశేషంబున దేహస్థితినైనను పరిగణింపక, "కవిత్వతత్త్వ నిరూపణము" నంతయు నెత్తి వ్రాసిపంపినందులకు నాహృదయపూర్వకమగు వందనములను సమర్పించుచున్నాడను.

మీయీకృతి ఆంధ్రభాషకు వన్నె వెట్టగలపువ్వు. కేవలము ప్రత్యేకకవులపై విమర్శలుదక్క మనభాషయందు కావ్యస్వరూప నిర్ణయముగాని, రసతత్త్వవిచారముగాని లేనే లేవని చెప్పవచ్చును. అట్టి కొరంత దీర్చుటకు సామర్థ్యము గలవారు ఆంధ్రలోకమున బెక్కురులేరు. అట్టి పనికిదగిన వారలలో మఱియుందగిన వారలగు మీరే పూనుకొని నిర్వర్తించినది ఆంధ్రభాష భాగ్యమనవలయును. అట్టి యుత్కృష్టకృతిని ప్రచురింపగల్గుటకు మాకళామతల్లి ఎన్నినోములు నోచినదో! ...

ఇట్లు ,
ప్రియమిత్రుడు
**పా.వే. రాజమన్నారు.**



# 12

## పి.వి. రాజమన్నారుగారి లేఖ

| | |
|---|---|
| కళ | సంపాదకీయకార్యాలయము, |
| మాసపత్రిక | 103, అణ్ణాపిళ్ళ వీధి, |
| సంపాదకుడు : "సుధాకరుడు" | మద్రాసు, |
| ప్రకాశకులు : టాగోర్ కంపెని. | 6-10-1923. |

ప్రియమిత్రమా,

... ముద్రణాలయమునుండి వచ్చిన మీ "కవిత్వతత్త్వ నిరూపణము" నందలి మూడవ వ్యాసము చిత్తును సరిచూచుచుంటిని. ఒకప్రక్క కలము, చూడ్కులు తమ పనుల నొనరించుచునేయుండెను, గాని హృదయమునమాత్రము తావకమూర్తి నెలకొని యుండెను. మీకడ నుండి యుత్తరము వచ్చి బహుదినములై యుండెను. మీదేహము స్వస్థతనొందియున్నదో లేదోయను అస్పష్టవిచారము బాధించుచుండెను...

... మీ వ్యాసములు "కళ"కేగాక ఆంధ్ర వాఙ్మయమునకే కళ నొసగగలవని నానమ్మకము. మీపై ఎప్పుడో వ్రాసియుంచిన వ్యాసము తీరికలేక టైపుచేయక పంపనైతిని. క్షమింపవలెను... మీపద్యము మోడరన్ రివ్యూలో చూచి కడుసంతసించితిని. మిమ్ములను దలచుకొని, మనసఖ్యమును తిలకించి, ఆంధ్రప్రబోధమును పరికించినప్పుడు నాకు ఆనందావేశము గల్గుచున్నది. (కాల్పనికోద్యమ పునర్విజృంభణ) రొమేంటిక్ రివైవల్‌నాటి ఇంగ్లాండు జ్ఞాపకమునకు వచ్చెడిని ....

ఇట్లు,

**రాజమన్నారు.**

# 13

## పి.వి. రాజమన్నారుగారి లేఖ

| | |
|---|---|
| కళ | సంపాదకీయకార్యాలయము, |
| మాసపత్రిక | 103, అణ్ణాపిళ్ళ వీధి, |
| సంపాదకుడు : "సుధాకరుడు" | మద్రాసు, |
| ప్రకాశకులు : టాగోర్ కంపెని | 15-7-1924. |

ప్రియ మిత్రమా,

మీయొద్దనుండి ఉత్తరములువచ్చి అనేక సంవత్సరములైనట్లు తోచుచున్నది. నేను ఉదకమండలమునుండి రెండు జాబులు వ్రాసియుంటిని. అవి చేరినవనియే తలచెదను.

కళకు కొలదికాలములో మార్పు కలుగగలదని మనవిచేయుచున్నాడను. తద్విషయమై విపులముగ మీ యానతి గైకొని వ్రాసెదను.

నేను ఈమధ్య రెండు మూడు పర్యాయములు శ్రీమతి మృణాళినీ ఛటోపాధ్యాయ గారిని కలసికొని ఆమెతో మాట్లాడితిని. మీ కవిత్వ పటుత్వ సంపదలను వర్ణించితిని. మీపైనొక వ్యాసము నేనువ్రాసిన బాగుండునని ఆమెయనుటచే నట్లేయని మున్నువ్రాసిన దానిని కొంతమార్చి ఈ వారములో నొసగెదనని చెప్పితిని. దానితో కృష్ణదాసుగారు వ్రాసిన ప్రతి కృతియొక్క బ్లాకుసైతము ఒసగెదనంటిని. ఆమె బ్లాకుచూచి చాల మెచ్చుకొని, సంతసముతో బ్రచురించుటకు నమ్మతించెను. మీ ప్రతిభ ఇంకను ఆంగ్లభాషాముఖమున ప్రకటింపబడకుండుట తప్పుగాన నేను స్వల్ప ప్రయత్నము గావించితిని. మీరు హరీంద్రనాథునకు ఉత్తరములు వ్రాయుచున్నట్లు ఆమె చెప్పినది...

ఇట్లు,
ప్రియమిత్రుడు,
**పా.వే. రాజమన్నారు.**

# 14

## రాయసం వెంకటశివుడు œ గారి లేఖ

కాలేజి, నెల్లూరు.
14-11-1924.

అయ్యా!

తమరు దయతో పంపిన మీ యింగ్లీషు పుస్తకము (వాయిస్ ఆఫ్ ది రీడ్) వందన పూర్వకముగ నందుకొన్నాను. నేనును నా స్నేహితులు కొందరును చదివినాము. చాలాబాగా వున్నది. తెలుగునవ్రాసిన పుస్తకము ఎంత హృదయరంజకముగా నున్నను, ఆంధ్రులకుమాత్రమే అది యుపయోగకరముకాగలదు. ఆంగ్లమున భాషాంతరము చేయబడిన యీ గ్రంథము ఆంధ్రులకేకాక తక్కిన దేశీయులకందఱికిని వినియోగింపగలదు. అందరు తమ కవితామధురిమమును యిప్పుడు చవికొన గలుగుచున్నారు. అందుమూలమున మీకీర్తి భరతఖండమున వ్యాపింపగలదు. మీ పుస్తకముమూలమున ఆంధ్రులుకూడ ధన్యులగుట కవకాశముగలిగినది. కాని మీరింతటితోతృప్తినొందవలదు. ముఖ్యముగ క్రొత్తపద్ధతుల ననుసరించి ఆంధ్రమున మీరు కవితారచనకు బూనవలయును. ఉద్గ్రంథములు వ్రాయ నుద్యమింపవలెను. అప్పుడే మీరు కృతకృత్యులగుదురు. దైవము మీకు చిరాయువును, సకలైశ్వర్యములను ప్రసాదించుగావుత!

ఇట్లు,
మీమిత్రుడు,
**రాయసం వెంకటశివుడు.**

---

œ కీ॥శే॥ రాయసం వెంకటశివుడుగారు కందుకూరి వీరేశలింగము గారి శిష్యకోటిలోనివారై, చిలకమర్తి లక్ష్మీనరసింహంగారికి ఆప్తమిత్రులై, కొన్నినాళ్లు నెల్లూరులోని వేంకటగిరి రాజావారి కళాశాలకు ప్రిన్సిపాలుగా నుండినారు.

# 15

## డాక్టరు పి.వి. రమణయ్య (యం.బి.) గారి లేఖ

ది ఆంధ్రా మెడికల్ & సర్జికల్ హాల్.
రెసిడెన్సి మార్కెట్ స్ట్రీటు,
హైదరాబాదు(దక్కను).
26-12-1925.

మహారాజశ్రీ దువ్వూరి రామిరెడ్డిగారికి

పి.వి.రమణయ్య ప్రేమపూర్వక నమస్కారములు:

తమ కిటీవల సంభవించిన విపత్తువిషయమై మిత్రుల మూలమున విని నేనెంతేనియు విచారపడితిని... నేనిప్పుడు మీకు ముఖ్యముగ వ్రాయునదేమనగ, మీరొకపర్యాయము మీ వీలునుబట్టి యిచటికి రావలసినదని నా కోరిక... ఇచ్చట రెడ్డి విద్యార్థులకు ప్రత్యేక వసతిగృహము, గ్రంథాలయము యిత్యాదులుగలవు. వారనేకపర్యాయములు మిమ్ము కలియగోరి, నాకును మీకును పరిచితిగలదని యెట్లో వినియుండి, నా ద్వారా పిలిపింప వలయునని కుతూహలతతో నున్నారు. ఇటీవల మనయాంధ్రదేశపు కవులను, పండితులను సాధ్యమగునంత వఱకు ఆహ్వానించవలయునని మాకు కోరిక గలిగినది. అదే రీతిగ షుమారు పది మాసములక్రిందట బ్ర॥ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి నాహ్వానించి ఆనందము ననుభవించితిమి. అటు తరువాత ఉమర్ ఆలేషాగారుగూడ వచ్చియుండిరి. తరువాత పైవారిలో చేరినవారు కాకపోయినను దేశోద్ధారకులుగనుక, నాగేశ్వరరావుగారి నాహ్వానించియుంటిమి. మొన్ననే శ్రీ పానుగంటి లక్ష్మీనృసింహారావుగారు గూడ వచ్చియుండిరి. కనుక మీరుగూడ నొకపర్యాయమువచ్చి మా యుద్యమమును నెరవేర్చుటకు ప్రయత్నపడుదురని నమ్ముచున్నాను....

చిత్తగింపగలరు,
**పి.వి. రమణయ్య**

# 16

## డాక్టరు పి.వి. రమణయ్య గారు (యం.బి.) గారి లేఖ

దీ ఆంధ్రామెడికల్ & సర్జికల్ హాల్,
రెసిడెన్సీమార్కెట్ స్ట్రీటు,
హైదరాబాదు (దక్కను)
13-1-1926.

మహారాజశ్రీ మాప్రియమిత్రులు దువ్వూరి రామిరెడ్డిగారికి

పి.వి.రమణ్య నమస్కారములు.

మీరు దయతో వ్రాసిన యుత్తరము ముట్టినది. మీ స్థితియొక ట్రాజెడీ (విషాదాంతనాటకము)గా నున్నదని వ్రాసితిరి. అందులకు నా కెంతయో విచారము కలిగినది. నేటివఱకును యీమధ్య దైవకృతమగు సతీవియోగమొకటి తక్క మీరెక్కుడదృష్టవంతులనియును, లక్ష్మీసరస్వతులు రెండును మీ యధీనము నందుండుటయే కాక, సౌఖ్యజీవనము గలిగిన వారనియే నా నమ్మకముగ నుండెను .....

.... నేనిచటికి మిమ్ములను ఫాల్గుణ బహుళమునందు జరుగబోవు(శ్రీకృష్ణదేవరాయల ఆంధ్ర భాషానిలయమునందు) తిక్కన జయంత్యుత్సవ సందర్భమునకు మిమ్మధ్యక్షులుగ జేయగోరి యున్నాడను. క్రిందటి సంవత్సరము చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి శతావధానిగారీ యుత్సవమును నెరవేర్చియుండిరి. కాని Subject (విషయము) ముచ్చటించిరని చింత వొడమినను అనందముగ నుండకపోలేదు. ఈ తడవ ఆలోపమును మిమ్మాశ్రయించి తీర్చుకొన వలయుననుకొనుచున్నాడను. ఇచ్చట రెడ్డిప్రముఖులు చాలమంది గొప్పవారలున్నారు. వారితో మీకు పరిచితిగలిగియుండుట మంచిదని నా బుద్ధికి వొడముచున్నది. అంతియెగాక మీరు వారికి విద్యావిషయక ప్రోత్సాహమునుకూడ కలిగింపగలరు. మీరు మార్గదర్శకులుగా గూడ నుండగలుగుదురు ...

ఇక తిక్కన ఉత్సవము విషయమై కొంతవివరములు వ్రాయదలచితిని. ముఖ్యముగ మేము వినదలచిన సంగతులు: (1) సంగ్రహజీవిత చరిత్ర,(2) కవితామాధుర్యము, (3) ఆంధ్రీకరణము : యిందు వ్యాసభారతమునుండి కొన్నికొన్ని పట్ల తిక్కన స్వతంత్రించి యెవ్విధమున మెఱుంగువెట్టినట్లు వ్రాసియున్నాడో యిత్యాదివిషయములు, (4) తిక్కన పదప్రయోగములు...

ఈ విషయమున మరొక్క సంగతి జ్ఞాపకమునకు వచ్చుచున్నది. ఇటీవల నిచట జరిగియున్న నన్నయభట్టారక వర్ధంతి సందర్భమున మన రాయప్రోలు సుబ్బారావుగారు, తిక్కన సంస్కృతసమాసముల నన్నయరీతి వ్రాయప్రయత్నించి పాడుకూడ చేసినాడు!, అని నిర్భీతిగ వచించియుండెను. అందు నిజమెంతయోకాని నన్నుమాత్రము ఆ మాట చాల బాధించుచున్నది. కనుక తిరిగి తమవంటివారిచేత నట్టిమాటలను ఖండింపజేయవలయునని నాతలంపు ....

యింతేసంగతులు,

**పి.వి. రమణయ్య**

---

µ శ్రీ పి.వి. రమణయ్యగారు నెల్లూరుజిల్లా గండవరమందు పుట్టి, హైదరాబాదున వైద్యవృత్తి చేపట్టి, అనేక కవిపండితులతో చెలిమిజేసిన రసజ్ఞులు. కవికోకిలకు పరమాప్తులలో నొకరు.

# 17

## పి. వేణుగోపాలు గారి లేఖ

హైదరాబాదు,

15-1-1926

ప్రియమయిన రామిరెడ్డిగారూ,

... ఈ పట్టణములో విశేషముగా ఆంధ్రకవుల వర్ధంతులు యితరసభలు ఆంధ్రగ్రంథాలయములందు జరుపుదురు. దానికి కొన్నిదినములవఱకు స్థానికులనే అధ్యక్షులుగాను, ఉపన్యాసకులుగాను పిలుచుచుండువాడుక యుండెడిది. చదువురాని తెలుగు ప్రొఫెసర్లు విశేషము సకలకళాకోవిదులనిపించుకొనుట సంప్రాప్తించి గర్వమెక్కిపోవుటచేత, బ్రిటీషు ఆంధ్రరాష్ట్రములోనుండి పెద్దవారలను పిలిపించి యిక్కడ వారి గర్వమణచవలయుననియు, వారికేమిరాదని ప్రజలలో అభిప్రాయముకలుగజేయవలయునని యెంచి అనేకమందిని పిలుచుట పెద్దపెద్ద సభలు చేయుట...తటస్థించినది.. ఈ పట్టణమందు రెడ్డివిద్యార్థి వసతిగృహమున్నది. దానికి మీ మిత్రులేగావచ్చును సురవరం ప్రతాపరెడ్డి, బి.ఎ.,బి.ఎల్., అధ్యక్షులు. ఈ సంఘమువారును అందఱిని పిలిచి రెడ్లందరుచేరి వారిని సన్మానించుచుందురు. ఈ అవకాశముగొని తణికెళ్ళ వీరభద్రుడు, యం.ఎ.ఎల్.టి.గారు, ...శ్వరరావుగారు వచ్చినప్పుడు విశేషముగాను తదితర సమయములందును, మీరు వ్రాసిన

గ్రంథములను గురించియు, మీ తెలివితేటలనుగురించియు, విశేషము మీ నవ్యకవిత్వము యొక్క ప్రాశస్త్యమును గురించియు చెప్పి, అటువంటివారిని పిలిచి సన్మానించుట యుక్తమనియు చెప్పిరి. ఉపన్యాసకులు (వచ్చినవారు) కూడ కొంత చెప్పుట తటస్థించినది. తణికెళ్ళ వీరభద్రుడుగారు మీ "వాయిన్ ఆఫ్ ది రీడ్" వారి నైజాము కాలేజికిగా ప్రచురణకర్తలవద్దనుండి తెప్పించి లైబ్రరీలో పెట్టినారనియు మీ గ్రంథమును పూర్ణముగా చదివినారనియు చెప్పిరి. అదిచాలా బాగున్నదనియు, కొన్ని భాగములు పరమసుందరముగా వున్నవనియు, విశేషభాగము కజిన్సు వ్రాసినాడని భ్రమపడితిననియు చెప్పిరి... 'సాక్షి' గ్రంథకర్త (పానుగంటి లక్ష్మీనరసింహరావు), రాయప్రోలు సుబ్బారావు 'భారతీ' అను పద్యములను యింకాకొన్ని "జడకుచ్చులు" లోని పద్యములనుచూచి, 30,40 సంవత్సరములనుండి భాషాసేవచేయు నాకు యీ పద్యముల మొదలేదో తుదయేదో, ఒక వాక్యమునకు యింకొక వాక్యమునకు కడకు పదములకుకూడ సంబంధమేమియో తెలియక భావము గోచరముకాకపోతే యెందుకీపద్యములని అనిరి. నవ్యకవిత్వమునుగురించి ఒక ప్రత్యేక వుపన్యాసమిచ్చి బాగా సభలో చీవాట్లు పెట్టెను. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి సుబ్బారావుగారిని యెదుటపెట్టుకొని పేరు చెప్పి పిల్చి నానామాట లడిగిరి...

మీ మిత్రుడు,

**పి. వేణుగోపాల్**

# 18

## పి.వేణుగోపాల్ ¶ గారిలేఖ

ఘోర్పురి, పూనా.

22-3-1926.

శ్రీయుత దువ్వూరి రామిరెడ్డిగారికి,

నేను నిన్నటిరోజున హైదరాబాదులో బయలుదేరి నేడిచ్చటికి చేరితిని. హైదరాబాదునుండి నేను వచ్చునపుడు శాస్త్రిగారు (సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి) యెచటికో పోవుచు, నాతోగూడ 'వాడి'వఱకు ప్రయాణముచేయుట తటస్థించెను. ప్రతిరోజు వంట చేసుకొనుట, స్కూలుకుపోవుట, యిత్యాది కష్టములవలన మిమ్ములను చూడలేనందుకు చాల విచారపడినట్లు, మీకు వ్రాయమని నన్ను కోరెను. మీ తిక్కననుగురించిన ఉపన్యాసము అద్భుతముగా నున్నదనియు, కవిత్వతత్వము, రసచర్చ యిత్యాది విషయములు 'కళ'లో వ్రాసి నప్పటినుండి మీ రేవిషయమైన చక్కగా వ్రాయగల్గుదురన్న అభిప్రాయముకలదని నుడివిరి.

యతిప్రాసల విషయమున అభిప్రాయభేదములుండిన ఉండవచ్చుననియు, విషయము చాలా బాగా చర్చించిరనియు చెప్పిరి. మనస్+నంద = మనోనంద యిది ఒప్పుగాని వాడుకలో 'ఆనంద'కు బదులు 'నంద' అని యెచట వ్రాయబడి యుండలేదని చెప్పిరి. 'సులభ్యమైన' 'దుర్లభ్యము'వలెనే తప్పనిచెప్పిరి. కాని యిందువలన కవిత్వమునకు లోపముండదు కావున దానిసవరణ అనవసరమని చెప్పిరి.

మీ మిత్రుడు,

**పి. వేణుగోపాల్**

---

¶ శ్రీ పిశుపాటి వేణుగోపాల్‌గారు డా॥పి.వి. రమణయ్యగారి సోదరులు. కవికోకిలకు అత్యంత సన్నిహితమిత్రులు. వీరు అకాల మరణంచెందారు. ఒమార్‌ఖయాం రుబాయీల పాతప్రతిని కవికోకిలకు అందించి పానశాలావతరణంలో కొంతపాత్ర నిర్వహించారు.

## 19

## విశ్వనాథ సత్యనారాయణ గారిలేఖ

బందరు,

24-4-1927.

మిత్రులకు ...

మీరింతలో నన్ను మరచిపోరనుకుంటాను. నేనుమట్టుకు గూడూరులో మీ యింట్లోతిన్న టిఫిను ఈవర్కు మరచి పోలేదు.

చాలానాళ్ళుగా మనోగర్భంలోవుండి ఇప్పటికి ప్రయత్నతః ఉన్ముఖమైన 'జయంతి' అనే పత్రిక మే నెలాఖరునకు ప్రకటింపబడుతుంది.

మొదటినుంచి మీరు మాలో ఒకరుగానే భావిస్తున్నామని యివ్వాళ పనికొద్దీ చెపుతున్నామని మీరనుకోటానికి మీయెడ మా పూర్వస్నేహమెడమీయదు.

సరేనా, మీరు మాకు ప్రతిసంచికకు ఏదైనా వ్రాస్తుండాలి. ఏదైనా విమర్శనగాని ఖండకావ్యముగాని పత్రికలో సర్వతః చాలా ఉత్తమమైన వ్యాసములుమాత్రమే ప్రకటించుదామని

తలంపుగాన మీరు వ్రాసేవి అన్నీ బాగా వుండేటప్పటికిన్నీ బాగావుండేవాటిల్లో బాగావుండేవి పంపించ ప్రార్థిస్తున్నాను.

మైత్రి పాటింతురని నమ్మిక.

భవదీయుడు,

**విశ్వనాథ సత్యనారాయణ.**

# 20

## శ్రీ అవంత్స వెంకటరంగారావు ౮౮ గారికి

పెమ్మారెడ్డిపాళెం

యల్లయపాళెం పోస్టు

31-8-1929

మహారాజశ్రీ అవంత్స రంగారావుగారికి దువ్వూరిరామిరెడ్డి దండములు. ఇచ్చట మేమందరము క్షేమము. మీ క్షేమములు వ్రాయుచుండవలయును.

మీరువ్రాసిన జాబున్ను మీరు పంపిన శుభలేఖ చేరినవి. కాని వానిని మొన్ననే చూడగలిగితిని. నేను నెలరోజులు గూడూరులో నుండవలసినట్లు తటస్థించినది. మామేనమామ కూతురికి నిప్పంటుకొని యొడలుకాలి మరణించినందువల్ల నేను గూడూరుకిపోయియుండి మొన్ననే యూరుచేరితిని. మీ వివాహమునకు రాజాలనందుకు చింతిల్లుచున్నాను. నరసాపురములో నాకు ప్రియమిత్రులొకరు గలరు. వారిప్పుడచ్చట అసిస్టెంటు సర్జనుగానున్న రావుసాహెబు మన్నెం శేషాద్రిరెడ్డిగారు. మీరు నర్సాపురం పోయినప్పుడు వారి పరిచయము మీరు తప్పక కలిగించుకొనవలెను.

నా వివాహము† కూడ జూను నెల 16వ తేదీన నెల్లూరు మూలప్పేట దేవాలయములో జరిగినది. వివాహప్రయత్నము హఠాత్తుగా తలపెట్టుకొనబడినందువలన తుదకు నెల్లూరులోని మిత్రులకుకూడ తెలుపుటకు వీలులేదు.

మీ గ్రంథములను గురించిన విమర్శనమును నేను భారతిలో చూచితిని. న్యూసుపేపరు విమర్శనములను అందు ముఖ్యముగా బాధ్యతారహితముగ తెలుగు

న్యూసుపేపర్లలో వ్రాయు విమర్శనములను యే గ్రంథకర్తకూడ లెక్కచేయకూడదు.

మీ రిప్పుడేమి చేయుచున్నారు? మీ చిత్రలేఖనము కవితారచన నిరంతరాయముగా సాగుచున్నదా? మా యింటిపని యింకను పూర్తికాలేదు. మేము గృహప్రవేశము చేయునప్పుడు మీరు తప్పక రావలయును. విశ్వనాథ శర్మగారిని నేను విచారించితినని చెప్పవలయును.

ఇట్లు,
ప్రియమిత్రుడు,
**దువ్వూరి రామిరెడ్డి.**

---

ØØ ఆవంత్స రంగారావుగారు విజయనగర వాస్తవ్యులు 'నెలవంక' కావ్యసంపుటి రచించినారు.

† ఇది రామిరెడ్డిగారి రెండవ పెళ్ళి.

# 21

## శ్రీ ఆవంత్స రంగారావుగారికి మరొక లేఖ

30-5-1930

ప్రియ మిత్రమా,

(ఇందు మొదటి పేరాగ్రాపు తీసివేయబడినది- సంకలనకర్త)

.. మాయిల్లు యింకను పూర్తికాలేదు. వ్యవసాయకాలము వచ్చినపుడెల్ల నిలుపవలసిన యవసరముండుటవల్ల యింత ఆలస్యము జరుగుచున్నది. యీ సంవత్సరముకాగలదు. యిప్పుడు నేనేమియు చేయుటలేదు. భావశూన్యమైనమనస్సు, సోమరితనము, నిర్వ్యాపారత. (చివరి పేరాగ్రాపు కూడ తీసివేయబడినది.)

ఇట్లు,
ప్రియమిత్రుడు,
**దువ్వూరి రామిరెడ్డి.**

# 22

## శ్రీ ఆవంత్స రంగారావుగారికి వ్రాసిన మరొక లేఖ

30-9-1932

శ్రీయుత ఆవంత్స రంగారావుగారికి ప్రేమపూర్వక కుశల ప్రశ్నానంతరము.

ప్రియమిత్రమా,

(మొదటి పేరాగ్రాపు తీసివేయబడినది-సంకలనకర్త.)

రెండుమూడు సంవత్సరములనుండి Literary impulse కలుగుటయేలేదు. సారస్వత విషయమైనపని యేమియు చేయలేదు. కాలము వృథాగా గడచిపోవుచున్నది. కవిత్వము నన్ను వదలినదాయేమి అను సందేహము కలుగుచున్నది. ఉమ్రఖయ్యాముకొక ఉపోద్ఘాతమువ్రాసి దానిని పునర్ముద్రణము కావించవలెనని ఆరునెలలుగా తలచుచున్నాను. కాని కొన్ని పుస్తకములు చదువవలసి యుండుటచేత దినదినము వాయిదా పడుచు ఇంతవఱకు కొనసాగినదికాదు. మాంద్యము, సోమరితనము విశేషముగా నున్నవి.

పోయిన సంవత్సరము డిశంబరు నెలలో నాకు ప్రథమపుత్రుడు జన్మించినాడు. అందరము క్షేమముగా నున్నాము.

మాతృశతకములోని పద్యములు తప్ప తక్కిన కావ్యములలోని యే పద్యములైనను అరుణాచలశాస్త్రి గారు తమ గ్రంథమునందు చేర్చుకొనవచ్చును. మాతృశతకము అచ్చు అయిన ప్రతులలో విజయనగరం సంస్కృతకళాశాల భాండాగారములోనుండే యొక్కప్రతితప్ప తక్కినవన్నియు అగ్నికాహుతి యైనవి. §

(చివరి రెండు పేరాగ్రాపులు తీసివేయబడినవి)

ప్రియమిత్రుడు,

**దువ్వూరిరామిరెడ్డి.**

---

§ 1917లో వ్రాయబడిన "మాతృశతకము"లో బ్రిటిషు ప్రభుత్వమును తీవ్రముగా ఖండించియుండుటచే, దొరతనమువారు దానిని నిషేధింతురేమోనని అచ్చుప్రతులనన్నిటిని మంటలపాల్జేసినారు. - సంకలనకర్త.

# 23

## డాక్టరు పి.వి. రమణ్య (యం.బి.) గారి లేఖ

సుల్తాన్ బజారు,
హైదరాబాదు (డక్కను).
21-10-1934.

మిత్రమా! వందనములు.

మీరు వ్రాసిన ఉత్తరము చేరినది. నేటి సాయంకాలమే గోలకొండ పత్రిక ఆఫీసుకు వెళ్ళి కనుగొనగా, శ్రీ ప్రతాపరెడ్డిగారు ఆ పత్రికనొక దానినిచ్చినారు. మీకుపంపుచున్నాను. మాట సందర్భములో మీరీమధ్య నేమియు వ్రాయుటలేదనియు, మంచిపేరు, కీర్తులు వచ్చు సమయమునకు మనవాండ్లకుండు లోపమేయిదియనియు, డాక్టరు కజిన్సుగారి కెవరో యూరపుఖండమునుండి లేఖవ్రాయుచు Indian poets (భారతకవులు-సం.) ను గూర్చి "I feel lonely without Mr. Rami Reddy's poetical publication" (రామిరెడ్డిగారి కావ్యసంపుటి లేనిపట్ల నాకేమియు తోచదు-సం.) అని వ్రాసియున్నటుల తనేదో పత్రికలో చదివినట్లును చెబుతూ వచ్చెను. ఈ సంగతి మీరు విన్నారా ?...

**పి.వెం. రమణయ్య.**

# 24

## బళ్ళారి రాఘవాచారిగారి లేఖ

టి.రాఘవ, బి.ఎ.,బి.ఎల్.,
పబ్లిక్ ప్రాసిక్యూటరు, గవర్నమెంటు ప్లీడరు.

బళ్ళారి,
9-4-1935.

అయ్యా,

మీ లేఖలో వెలిబుచ్చిన సదభిప్రాయములకు మారు నమస్కరించుచున్నాను. రాజమన్నారుగారికి నాపట్ల అభిమానమెక్కువకనుక నన్నుగురించి అతనిచూపు పాక్షికమైవుంటుంది. మీరుకూడ ఆవిధముగనే తయారుకారని ఆశిస్తున్నాను. నిజానికి కావ్యమునుగాని, నాటకమునుగాని విమర్శించుటకు నేను అసమర్థుడను. ప్రేక్షకులదృష్టిని

బట్టి మాత్రమే నేను నాటక గుణమును గ్రహింపగలను. నాటకరంగము విషయమై నాకు గల సంకుచితాభిప్రాయములను మీరెరుగుదురనుకొందును. సమాజపురోగతిలో నిర్లక్ష్యముచేయ వీలులేని ప్రధానాంగములలో నాటకరంగ మొకటియని నాయూహ. 'కళ కళకొరకే' అని మాటిమాటికి వుద్ధరింపబడుచున్న నుడిని బోధపరచుకొను స్థితిలో నేను లేను. జీవితబాహిరమైన కళకు నా దృష్టిలో అర్థమేలేదు. రుచికరములైన కూరలతో పాత్రనిండుగా అన్నము నాముందులేనియెడల, సూర్యచంద్రులను తారకలను నేను లెక్కించనే లెక్కించను. నేను ప్రాచీనదృక్పథమును వెల్లడించుటలేదని యెరుగుదును. కాని నా పరిమితులను మీరు ముందుగా తెలిసికొనుట మంచిది.

తప్పక మీ పుస్తకము చదివి, మీ నాటక ప్రదర్శనమందు ప్రేక్షకమండలిలోకూర్చుని చూస్తున్నట్లుగా వూహింప ప్రయత్నింతును. ఆ తర్వాత మీ నాటకము నన్నేతీరున ప్రభావితుని చేసినది వ్రాతును. ఈవిషయములో నేనాత్మసాక్షిగా వుండగలనని మీరు నమ్మవచ్చును. మీ కవిత్వమందలి ఉత్తమ గుణములను, మీ శైలి గొప్పదనముగురించి చెప్పుటకు నేను పూర్తిగ అశక్తుడను. వాటి విషయమే నాకు తెలియదు.

ఉమార్ ఖయ్యాము ఆసక్తిగొల్పుగ్రంథము. మీ అనువాదము చదువుటకు సంతోషముగ పూనుకొందును.

(అనువాదము) భవదీయుడు,

**రాఘవ**

# 25

## బళ్ళారి రాఘవాచారిగారి లేఖ

టి.రాఘవ, బి.ఎ.,బి.ఎల్.,
పబ్లిక్ ప్రాసిక్యూటరు, గవర్నమెంటు ప్లీడరు.

బళ్ళారి,
9-5-1935

అయ్యా,

మీగ్రంథమును అత్యంతాసక్తితో చదివితిని. శైలియు, నగిషీయును మనోహరముగా నున్నవి. మొట్టమొదట ప్రదర్శనమునకు మీనాటకము కష్టమగునని భావించియుంటిని. పుస్తకము చదివినమీద నా అభిప్రాయము మారినది. ప్రదర్శించి చూచుటకు యీ నాటకము

యోగ్యమైనదనిపించినది. ఎప్పుడో ఒకప్పుడు దానిని ప్రదర్శింపబూనుకొందును. వెనువెంటనే కాకపోవచ్చును. ప్రస్తుతము ఉద్యోగకార్యములలో కొట్టుమిట్టాడుచు, తోటినటకుల వైరమువలన ఏమిచేయుటకు నశక్తుడనైయున్నాను. కాని ఎప్పుడోఒకప్పుడు నామనోరథము ఫలించగలదని నమ్మిక.

మనస్ఫూర్తిగా, ఆత్మసాక్షిగా మీనాటకమునుగురించి మిమ్మభినందిస్తున్నాను. ముందుముందు మీరు నన్ను కలసికొనుట వీలుపడునని, అప్పుడు మనము జతచేరి ఆంధ్రులకేకాక, యావద్భారతదేశానికికూడ ఒక మహానాటకమును ప్రదర్శింపగలమని ఆశిస్తున్నాను. ఈ విషయము గురించి రాజమన్నారు గారితో చాలాసార్లు మాట్లాడినాను. అటువంటి నాటకమొకటి ఆయన నాకు వ్రాసియివ్వగలడనుకొన్నాను. కాని ఆయన జమీందారీభూముల వ్యాజ్యములతోను, ఏకాంకనాటకములతోను ఎక్కువ తృప్తి పడుతున్నట్లున్నది.

(అనువాదము) స్నేహపూర్వకముగా,

**రాఘవ.**

# 26

## జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారి లేఖ

మాధవభాగ్,

మైలాపూరు, మద్రాసు.

24-5-1935.

సుహృద్వరా,

వందనములు. అవ్యాజ వాత్సల్యముతో తాముపంపిన పుస్తకములను నేడే అందుకొన్నాను. జాబునుచూచితిని. పరమానందభరితుడనైతిని. తాము నాకుచిరపరిచితులు. సాహితీ వసుంధరయందు అనవరతము తమను జూచుచున్నాను. రెడ్డికులమున నేడొకకౌస్తుభమును, ఒక శమంతకమును తేజరిల్లుచున్నవని యెఱుగుదును. కౌస్తుభము శ్రీరామలింగారెడ్డిగారు. వీరికిగల శక్తి పృథ్వీకళోపాసకులందు కొందఱికిమాత్రము కలదు.

.. శమంతకము మీరనిన ముఖస్తుతియని తలంపకుందురుగాక. మీ ప్రజ్ఞకు నే నంజలి ఘటింతును...

కవిత్వము దెలిసినవారు మనలోనెందఱోలేరు. టెక్నిక్కు (శిల్పము) కొంతనెఱిగి, వెర్సెస్ (పద్యములు) వ్రాసి భుజకీర్తులు దాల్చువారు కళోపాసకులని నేనంగీకరింపను. కాని వీరెట్లో కొంత పలుకుబడిని సంపాదించి రచ్చపై విజృంభించు చున్నారు .. మన రాష్ట్రములో రెండు వికృత దృశ్యములు చూపట్టుచున్నవి. ప్రజ్ఞలేనివారు పెద్ద బొట్టులుధరించియుండ, ప్రజ్ఞగల కొలదిమంది మూలబడుచున్నారు. వీరిని గుర్తించువారి సంఖ్య మిక్కిలి తక్కువ... ఈ రెండు దృశ్యములు అంతరించిన నాడు ఆంధ్రప్రతిభ అఖండజ్యోతియై వెలుగును.

చిత్తగింపుడు,

భవదీయ,

**జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి.**

## 27

## బి.యన్. రెడ్డిగారి £ లేఖ

మహాలక్ష్మీభవనం హోటల్,
35, తారాచంద్ దత్తుస్ట్రీట్,
కలకత్తా.

పూజ్యులును, మిత్రులును అగు మీకు నమస్కారములు :

మీరు వ్రాసిన జాబు ఈ దినం నాకు కలకత్తాలో చూచు భాగ్యము లభించినది ....

తమరి పరిచయము నాకు కొన్ని సంవత్సరములకు పూర్వము కలుగవోమినందుకు విచారించుచున్నాను. తమరి స్నేహము నా భావి విజ్ఞానోదయమునకు దారితీయునని గట్టినమ్మకమున్నది. ...

వ్యాపార చింతలచేత కలతచెంది క్రమక్రమంగా నాలో అంతరించుచున్న కళాభిరుచికి తమరి జాబులు, పెడత్రోవనడచుఆవులమందలకు వేణునాదమువలె హెచ్చరింపుగానుండును. దయచేసి తరచుగా నాకు వ్రాయుచుందురని కోరుచున్నాను.

ఇంతే నమస్కారములు.

తమరి ఆరోగ్యమునకై ధ్యానించు మీ

చిన్ని తమ్ముడు,

**బి.యన్.రెడ్డి.**

---

£ బి.యన్. రెడ్డిగారు సుప్రసిద్ధ సినిమా దర్శకుడు.

# 28

## బి. రామచంద్రారెడ్డి గారి * లేఖ

బుచ్చిరెడ్డిపాళెం,

1-3-1937

ప్రియమయిన రామయ్యా,

4-2-37 నాడు మీరు వ్రాసిన లేఖకు జవాబు ఆలస్యమయినందుకు క్షమించండి. ఎన్నికలఫలితాలు దారుణంగా వున్నవి. నిజానికి నేను వ్యాకులహృదయుల సత్సహవాసములో నున్నాను. కాంగ్రెసు ఎంతవరకు దేశమునకు మేలుచేయగలదో, ప్రజలకిచ్చిన వాగ్దానాలను నిలువబెట్టుకొనగలదో చూద్దాము. నేను రేపు మదరాసుకు పోతున్నాను. అక్కడ వారము పదిరోజులుంటాను.

చిత్రనిర్మాణములో మీరెంతవరకు ముందుకుపోయారు? కలకత్తాలో ఎన్నిరోజులుంటారు?

(అనువాదము)

భవదీయుడు,

**బి.రామచంద్రారెడ్డి.**

---

* శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు గొప్పరాజకీయ నాయకులేకాక వదాన్యులూ కవిత్వాభిమానులున్నూ. నెల్లూరుజిల్లాలో జస్టిసు పార్టీకి పట్టుగొమ్మగావుండి, మదరాసు లెజిస్లేటివు కౌన్సిలుకు కొన్నినాళ్ళు అధ్యక్షులుగా, పార్లమెంటు సభ్యులుగా ప్రజాసేవ కావించినారు. 19-3-1973న పరమపదించారు.

# 29

## రేబాల పట్టాభిరామరెడ్డిగారి లేఖ

(జమీందారు)

"లక్ష్మీ విలాస్"
స్టోన్‌హౌస్‌పేట - నెల్లూరు.
15-4-1937

మహారాజరాజశ్రీ దువ్వూరు రామిరెడ్డిగారి సముఖమునకు :-

యీనెల తే11దిన వర్ధమాన సమాజమువారు జరిపిన తిక్కన జయంతి సందర్భమున తమకు తిక్కవరపు రామిరెడ్డిగారు బహూకరించిన రూ. 116/- లను యిందువెంట జతపరుపబడిన చెక్కుమూలముగా తమకు అందచేయుచున్నాను. యీ చెక్కును క్రాస్‌చేసి పంపుచున్నాను కాన మొదట మీరు శ్రీరామా ఫిలిమ్సు పేర మార్పించుకొని, తర్వాత తమరువారి దగ్గర తీసుకొనవచ్చును. దీనివిషయమై మీరు యేదైన తెలుసుకొనదలచిన యెడల వుడాలి సుబ్రహ్మణ్యంను అడిగిన యెడల మీకు అన్ని విషయములు బోధపడగలవు. మీకు యీ చెక్కుచేరిన వైనం శ్రీ వర్ధమాన సమాజపు శెక్రిటరీగారికి తెలియజేయకోరుచున్నాను. యిచ్చట అందరుక్షేమం. యింతే సంగతులు.

**రే. పట్టాభిరామిరెడ్డి,**
ప్రెసిడెంటు.

# 30

## బి.గోపాలరెడ్డి గారి ౘౘ లేఖ

సెంటుజార్జికోట,
21-7-1937

ప్రియమిత్రమా,

మనరాష్ట్రములో తొట్టతొలి కాంగ్రెసు మంత్రివర్గములో నేనొక మంత్రినయిన సందర్భమున మీరు దయతో పంపిన అభినందనలకు మారు నమస్కరిస్తున్నాను. ఈ పదవి గౌరవాధికారములుగల హోదాయని కాక, బాధ్యతాయుతమైనదని నేను భావిస్తున్నాను.

లాఠీకి ఎదురొగ్గి చెఱలో గ్రమ్మగిన అజ్ఞాతుడూ అనామధేయుడూనయిన స్వచ్ఛంద సేవకుని ప్రతినిధిగా నేనిక్కడ వున్నాననే విషయమెప్పుడూ మరువను. దేశస్వాతంత్ర్యము కంటె మరేదీ ప్రియతరముకాదని సుప్రసిద్ధ భారతీయులు మన కందించిపోయిన సంప్రదాయముల నెప్పుడూ స్మృతిలో వుంచుకొన ప్రయత్నిస్తాను.

ఈ క్రొత్త కార్యకలాపములలో నానడవడి, సేవాపరత మీ అభినందనల కర్హమైనవిగా వుండునుగాక.

వందేమాతరమ్.

(అనువాదము)

భవదీయుడు,

**బి. గోపాలరెడ్డి.**

అందరికి వందనాలు. శాంతినికేతనముగూడ చూచిరండి. - బె.గో.

---

ddd శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రిగా, కేంద్రమంత్రిగా, గవర్నరుగా అనేక ఉన్నత రాజకీయ పదవులధిష్ఠించి ప్రజాసేవకావించినవారు.

# 31

## జయంతి రామయ్యపంతులు ¶¶ గారి లేఖ

ముక్తీశ్వరము,

(తూర్పుగోదావరి)

2-4-1938

అయ్యా,

"తెలుగుల కవితాత్మ" అను వ్యాసమును గూర్చి మీ యభిప్రాయమును సాధ్యమైనంత శీఘ్రముగా నాకుబంపి వ్యాసమును ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారికి మీరే పంపవలయునని కోరెదను.

చిత్తగింపవలెను,

**జ.రామయ్య**

---

¶¶ శ్రీ జయంతి రామయ్యపంతులుగారు మహాపండితులు. పిఠాపురము రాజావారి ప్రోత్సాహసాహాయ్యములతో వ్యావహారిక భాషోద్యమఖండన కొరకు 1911 లో "ఆంధ్రసాహిత్యపరిషత్తు"ను స్థాపించిరి. మదరాసులో చాలనాళ్ళు ప్రెసిడెన్సీ మేజిస్ట్రేటుగ నుండిరి.

# 32

## శ్రీ ఆవంత్స రంగారావుగారికి లేఖ

కవికోకిల డి. రామిరెడ్డి,
ఫిలిండైరెక్టరు. 14-8-1940

ప్రియ మిత్రమా,

మీరు వ్రాసిన జాబు నేను మద్రాసునుండి వచ్చునప్పటికి చేరియుండినది. ఇంతకాలమునకు మీ జాబు చూచి సంతోషపడితిని. నాభార్య ఆరోగ్యముగా నున్నది. ఇద్దరు మగపిల్లలు. అందరు క్షేమముగా నున్నారు. ఒక సంవత్సరం పూర్వం నేను ఫిల్ముపని వదలిపెట్టినాను. కవిత్వం మరల పొడచూపగలదా అని సందేహం నా మనస్సును అప్పుడప్పుడు పీడించుచుండును.
(మిగత రెండు పేరాగ్రాఫులు తీసివేయబడినవి.)

ఇట్లు,
ప్రియమిత్రుడు,
**దువ్వూరి రామిరెడ్డి.**

# 33

## శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి """ లేఖ

మారేడుపల్లి,
11-4-1943.

మిత్రుడా !

మీ ఉత్తరం నాకోసం ఎదురుచూస్తున్నది ఇక్కడ. మన సంబంధం చిరంతనమైనది. అందులో వైకల్యం లేకపోతే ఏ పుయిలోటలకూ పురస్కారం ఉండదు. నాకు కేవల వాచోపచారాలలో నమ్మకంలేదు. కడుపులో లేని ప్రేముడి కౌగిలింప వచ్చునే తల్లీ! ఎందుకీ తెచ్చుకోలు వాత్సల్యమని ఎప్పుడో వ్రాసికొన్నాను. కావలసింది కానరాని అంతఃకరణము. ఏవిధంగాగానీ అది లంకెపడితే తిరిగీ సులభంగాఛిన్నంకాదు,ఆగ్రంధిభేదనం! బంధమోక్షణంలాగా

ఎప్పుడో జరుగుతుంది. సాహిత్యవ్రతులమైన మనమూ పరస్పర విస్రంభాన్ని శంకిచ నవసరముండదు.

భవదీయుడు,

**రా. సుబ్బారావు.**

---

"" ఈ ఉత్తరములో ప్రస్తావింపబడిన మనస్తాపము ఎందుచేతనో తెలియదు. కాని కవులిద్దరు చాలకాలము క్రిందినుండి పరస్పరము అనుకూలించలేదని, రామిరెడ్డిగారి మిత్రుడైన శ్రీ పిశుపాటి వెంకటరమణయ్యగారి లేఖనుండి తెలిసికొనవచ్చును.

# 34

పెమ్మారెడ్డిపాళెం,
19-7-1943.

మహారాజశ్రీ వి. రామగోపాలరావు * గారికి,

నమస్కారములు, ఇచ్చట అందరుక్షేమం. అచ్చట మీ క్షేమసమాచారములు అప్పుడప్పుడు వ్రాయుచుండవలయును.

నేను వారము దినములనాడు మద్రాసునుండి గ్రామము చేరితిని. అప్పటికే మీ జాబు చేరియుండినది. ఆ కేసు మీకు కోర్టులో అనుకూలమైనదని చదివి చాలా సంతోషించితిని. మాటిమాటికి కోర్టుకు తిరగడం అలవాటుపడినవాళ్ళకు తప్ప ఇతరులకు కోర్టు వ్యాజ్యాలు క్లేశకారణములుగనే ఉండును. దేవుని కృపవలన ఆ బురదలోనుండి బైటపడితిరి. చాల సంతోషము.

భార్యావియోగదుఃఖము అందులోను నిండు యౌవనములో సహింపరానిది. కేవలం అనుభవైకవేద్యము. "ఓదార్పులు పుంటిపై నుప్పుగల్లు" అన్నట్లు నిష్ప్రయోజనములు. ఒకవేళ దుఃఖమును ఇనుమ్మడింపజేయును. కాలక్రమముగా దుఃఖము నశింపగలదు. నాకు రెండుసంవత్సరములవరకు దుఃఖము తీవ్రముగ నుండినది. తర్వాత క్రమక్రమముగ సన్నగిల్లినది. రెండవపెండ్లి చేసుకొనడం గూడ దుఃఖశమనానికి హేతువు.

మీరు సారస్వతవ్యాసంగం చేస్తూఉంటారని నా తలంపు. నేను జూన్ నెల "భారతి"

లో పానశాలలో చేర్చుటకు తగిన 14 క్రొత్తపద్యములను ప్రకటించితిని. జులై నెల మొదలు "కవి : రవి" అను కావ్యం ప్రకటిస్తున్నాను. ఈ కావ్యం "పలితకేశము"నకు పదిదినములముందు వ్రాయబడినది - వీలుంటే చదవండి.

నేను మా గ్రామములో పదిదినములుండు సమయము చూచుకొని మీకు వ్రాసెదను. మీరు కొన్నిదినములు కులాసాగా మా యింట కాలము గడుపవచ్చును.

హైదరాబాదులో మన స్నేహితులందరూ క్షేమముగా నున్నారని తలంచెదను.

ఇట్లు మిత్రుడు,

**దువ్వూరి రామిరెడ్డి.**

---

* శ్రీ కలపటపు రామగోపాలరావు హైదరాబాదు సంస్థానములోని కరీంనగరము జిల్లా రేకొండ వాస్తవ్యులు. కావ్యవ్యాసంగము గలవారు.

# 35

## అవంత్స రంగారావుగారికి లేఖ

డి.రామిరెడ్డి, పెమ్మారెడ్డిపాళెం,
ఫిలిండైరెక్టరు. 9-1-1944.

ప్రియసోదరులైన రంగారావుగారికి నమస్కారములు :

(మొదటి పేరాగ్రాపు తీసివేయబడినది)

కజిన్సుగారు చాల వృద్ధులైనారు. అందువలన కార్యాలస్యము. ఒక్కవిషయము మీరు చక్కగ జ్ఞప్తికి పెట్టుకొనవలయును. మనకు సంప్రదాయసిద్ధములైన కొన్ని యుత్ప్రేక్షలు, ఉపమానములు, ఇంగ్లీషులోకి తర్జుమా చేయబడినప్పుడు ఆ భాష ప్రతిభననుసరించి చాల నీరసములుగను mechanical గను అగపడును. ఇంగ్లీషు భాషలోకి తర్జుమాకాబడవలసిన కవిత్వమునందు Universal appeal ఉండవలయును. అట్టివే యేరుకొనిన బాగుగనుండును. ఇంగ్లీషులోని భావములు తర్జుమా చేయగలమేగాని మన సంప్రదాయము ననుసరించి ఆ భావముల నావరించిన atmosphere ను తర్జుమా చేయలేము. అందువలన పద్యములు

కొన్ని తర్జుమాలో మూలములో నుండినంత ఆహ్లాదకరముగ నుండుట లేదు. నేనీ రహస్యము టాగూరు తర్జుమాలో కనిపెట్టితిని. మూలములో మూడుపేజీల ద్విపద Philosopher's stone అని తర్జుమా చేయబడినది. అందువలన అది చాల విచిత్రమైన రమ్యమైన భావానువాదముగా ఏర్పడినది. ఇట్లు చేయుట ఇంగ్లీషు చదువుకున్నవారి మనస్తత్వమునకనుకూలముగ కొంత Concession చూపినట్లగును. తెలుగువారికి ఇంగ్లీషు అనువాదములు అవసరములేదు. ఎవరికి అవసరమో వారికి Universal appeal ఉండిన పద్యములు ఏర్పరుచవలెను.
(చివరి పేరాగ్రాపు తీసివేయబడినది.)

ప్రియ సోదరుడు,

**దువ్వూరి రామిరెడ్డి**

# 36

## డాక్టరు పి.వి. రమణయ్య (యం.బి.) గారి లేఖ

సుల్తాన్ బజారు,
హైదరాబాదు,
1-7-1945.

మిత్రులకు నమస్కారములు :

..... ఇక మన విషయాలకొద్దాం. రాయప్రోలు మిత్రుణ్ణి దర్శించి చాలాకాలమయింది. యీమధ్య నెలవరకతను గ్రామాంతరంకూడ వెళ్ళివుండడం, నేను పెండ్లి తొందరలలో వుండిపోవడం ఒక కారణం... ఆయన పద్యాలు అచ్చువేయించిన సంగతి నాకు తెలియదు... కు॥ సీ (కురుగంటి సీతారామయ్య) కూడా అనలేదు. ఈయన .. నవ్యసాహిత్య వీథులు పునర్ముద్రణచేయిస్తానని మాత్రం అంటున్నాడు. ఈ తడవ ప్రతి కవి ఫోటోలతో సహా వేయిస్తాడట. అందుకని ప్రతి వారికి వ్రాసి వాండ్ల ఫోటోలు స్వీకరిస్తున్నారు కూడా... ఇది చివరకు కార్యరూపం యెంతవరకు తాలుస్తుందో తెలియదు.

**పి.వెం. రమణయ్య.**

# 37

## డాక్టరు పి.వి. రమణయ్య (యం.బి.) గారి లేఖ

సుల్తాన్‌బజారు,
హైదరాబాదు(డక్కను)
21-7-1946.

మిత్రులకు నమస్కారములు:

... మీరు స.సూ. శాస్త్రి (సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి - సం॥) గారి నరసభూపాలీయంపై అభిప్రాయము యిచ్చినదాన్ని తెచ్చిచూపినారు. దానికి చాలా చాలా సంతోషించారు. "ఎలాగైనా రామిరెడ్డిగారు చాలా సరసులు, మంచివారు, వీళ్ళందరికన్నా చదువుకొన్నవారు," వగైరా ప్రశంసలు చేశారు..

**పి.వెం. రమణయ్య**

# 38

పెమ్మారెడ్డిపాళెం,
యెల్లయపాళెం పోస్టు,
నెల్లూరుజిల్లా,
11-9-1946.

మహారాజశ్రీ రామగోపాలరావుగారికి నమస్కారములు,

మీ జాబుచేరి కొన్ని దినములయినప్పటికి యింతవఱకు జవాబు వ్రాయజాలనందుకు చింతించుచున్నాను. నేను పదిహేను దినములనాడు కూజాలోని నీళ్ళుగ్లాసులో పోసుకొను చుండగా నడుము బెణికి కూర్చుండలేక పండుకొనిలేవలేక చాల బాధపడుచుండినాను. రెండు దినములనుండి నొప్పి కొంచెము శమించినది.

ఒకటిన్నర సంవత్సరమునాడు కుడిచేతికి కుడికాలికి పక్షవాతము తగిలి ఆ అవయవములు నా స్వాధీనము కాకయుండినవి. అయిదునెలలు గడచినతర్వాత లేచి తిరుగగలిగినాను. కాని వ్రాతవ్రాయుట కష్టసాధ్యముగ నుండినది. నేను ఏ స్నేహితులకు

జాబులు వ్రాయలేదు. కాని "జమీనురైతు" లో నా జబ్బువిషయమును చదివి కొందరు మిత్రులు నా క్షేమసమాచారములను తెలియగోరినారు. ఇప్పుడు పక్షవాత లక్షణములు ఏమియులేవు. నెత్తురు పోటు (Blood Pressure) మాత్రము ఉన్నది.

నేను ఒక పుస్తకము చదివిగాని ఏదైనను వ్రాసిగాని ఒకటిన్నరసంవత్సరమైనది. చదివినను వ్రాసినను నెత్తురుపోటు హెచ్చుచుండును. అందువలన నేను యింతకాలము నిరర్థకముగ జీవితము గడుపుచుంటిని.

మీ క్రొత్తవివాహము సుఖప్రదాయి అని తలంతును.

ఇట్లు మిత్రుడు,

**దువ్వూరి రామిరెడ్డి.**

# 39

## దువ్వూరి రామిరెడ్డిగారి సంస్మరణ

## డాక్టరు పిశుపాటి వెంకటరమణయ్యగారి లేఖ

సుల్తాన్‌బజారు,

హైదరాబాదు (దక్కను)

16-9-1947

నాయనా వేణుగోపాల్,

నీకార్డు చూచినాను. అంతకుపూర్వమే రేడియోలో నాన్నగారి మరణవార్తవిని నిర్విణ్ణుడనై పోయినాను....

.... ఆయన మహాపురుషుడు, మహాపురుషులంతా వొక మహత్కార్యమును చేసి ప్రపంచము నుద్ధరించి, వారు వచ్చిన కార్యమయిపోగనే నిర్యాణము జెందుచుండెదరు. ఆపైన నిరర్థకముగ ఒక్కక్షణము వుండరు. శంకరుడు, బుద్ధుడు, కాళిదాసు, షెల్లీ మొదలైన మహాపురుషులంతా అంతేను. మీకు నాయనని, నాకు మిత్రుడని|మన మేడవవలసినదేకాని, ఆయనను భగవంతుడు మన భాష నుద్ధరించుటకు సృష్టించినాడు. ఆయన ఆ పని

పూర్తిచేసినారు. వెళ్ళిపోయినారు. నాకు చివర ఉత్తరములో "పండ్లతోట (బోస్తాను) కూడా తర్జుమా చేసినాను. దీంతో సాదీమహాకవి గ్రంథములన్నీ తెలుగుజేయగలిగితిననే సంతృప్తికలిగినది.'' అని వ్రాస్తే అందులో నేను వచ్చిన కార్యము పూర్తిచేసుకొన్నాను. వెళ్ళిపోతున్నాననే సూచనకూడా వుందని గ్రహించలేకపోతిని... ఆయన మనిషి మనకు కనిపించదుకాని, ఈ తెనుగుతల్లి యెంతకాలము శాశ్వతమో అంతకాలము ఆయనను ఆమె యెత్తుకొని గడపగడప తిరుగుతూనేవుంటుంది. వారికి చావు అనేది ఎన్నడూ లేదు ....

**పిఠపాటి వెంకటరమణయ్య**

# 40

## దువ్వూరి రామిరెడ్డిగారి సంస్మరణ

## జస్టిసు పి.వి. రాజమన్నారు గారి లేఖ

16,విక్టోరియా క్రిసెంటు,
ఎగ్మోరు, మద్రాసు.
13-9-1947.

శ్రీ దువ్వూరి వేణుగోపాలరెడ్డిగారికి,

మీ తండ్రిగారి నిర్యాణం ఇప్పుడేతెలిసింది. ఆంధ్రదేశం కవివర్యుణ్ణి, నేను మిత్రరత్నాన్ని పోగొట్టుకొన్నాము.

మీ దుఃఖం ఓదార్చడానికి శక్తి మానవుడికి లేదు.

ఆంధ్రభాష ప్రపంచంలో ఉన్నంతవరకు రామిరెడ్డిగారికి మృతిలేదు .....

ఇట్లు,
**పా.వే.రాజమన్నారు.**

# గుడివాడ రత్తం

నెల్లూరుజిల్లాలో నారునాటడం ప్రారంభమయినది మొదలు కూలీలను పరాయిచోట నుండి తీసుకొనిరావడం కూడా అలవాటు పడినది. ఇంచుమించు పది దినములలో నారువేత పూర్తి కావలెను. అందుకు ఆయా ఊళ్ళలోని కూలీలు చాలరు.

గుడివాడ, తెనాలి ప్రాంతములనుండి మొదటి తూరి కూలీలను రప్పించుకొంటిమి. అటుపైన వాళ్ళకు మాకు పరిచయము ఏర్పడ్డ తర్వాత, ప్రతిసంవత్సరము వాళ్లకయివాళ్లే వస్తుండేవాళ్ళు. ఈ సంవత్సరముకూడ ఎప్పటివలెనే యిరవయిమంది మగవాళ్ళు, యిరవయిమంది ఆడవాళ్ళు వచ్చినారు. వీళ్ళు కిరస్తాని మతస్థులు. పరిశుభ్రంగా కనబడతారు. ఆడవాళ్ళు ప్రొద్దున్నే లేచి స్నానంచేసి బట్టలు ఉతుక్కొని ఆరబెట్టి, వంటపనులు ముగించి తలదువ్వుకొని తోటల్లో దొడ్లల్లో చెడిబడి పువ్వులు కోసి తలనిండా అలంకరించుకొని కూటి బుంగలు కంచములు తలపై బెట్టుకొని చేలవద్దకి నారునాటడానికి పోతారు. వీళ్ళు వృధాకాలయాపనం చేయరు. ఒక మనిషి కనిపెట్టుకొని ఉండవలసిన అవసరములేదు. ష్కపట హృదయులు. ఆడుతూ పాడుతూ వాళ్ళపనివాళ్ళు చేసుకొని సాయంకాల ుయ్యేటప్పటికి వాళ్ల విడిది కొట్టాము చేరుకొంటారు. వాళ్లతోడి పని యే పేచీలు లేకుండా నగలు దిని చేయి కడుక్కున్నట్లు జరిగిపోతుంది.

సెప్టంబరుమాసము. ఆకాశం మబ్బులుమాయలుగా ఉన్నది. వానకాళ్లు పడమట తట్టు దిగినవి. మూలగాలి కొడుతున్నది. తూనీగలాడుతున్నవి. వానవచ్చే చిహ్నాలు కనబడుతున్నవి. మధ్యాహ్నం మూడు గంటలకు పొలంతట్టు పోవడానికి బయలుదేరినాను.

నేను నిరాయుధుణ్ణిగా పోతున్నానని మా ఆవిడ గొడుగుపట్టుకొనివచ్చి "గొడుగు తీసుకొని పొండి. వాన వచ్చే మొక్కట్లుగా ఉన్నది" అని అంటూ గొడుగు అందియ్యబోయింది. "ఆ అప్పుడే వాన వచ్చిందా చచ్చిందా, కఱ్ఱ తీసుకరా". "ఇప్పుడు కఱ్ఱ యెందుకండి - వానకడ్డ పడుతుందా కఱ్ఱ. సరేలెండి మీ యిష్ట"మంటూ కఱ్ఱతెచ్చియిచ్చి తన అసంతృప్తి నాకు ప్రకటించడానికిగా వంట యింటిలోకి వెళ్లింది - మా ఆవిడ జోస్యాలు నేను అవగణించడం పరిపాటి అయిపోయినా అవి చాలావఱకు ఫలిస్తూనే ఉంటవి. నేను వెళ్ళేలోపల యేదోపని ఉండినట్లు మళ్ళీవచ్చి ఏమండి ఒకవేళ వానవచ్చేటట్టుంటే యానాది పిల్లవాడిచేత గొడుగు పంపించమంటావా అని బతిమలాడినట్లన్నది- నా వితండం సన్నగిల్లినది - అట్లనే పంపించు అని అన్నాను. నిజంగా స్త్రీ ప్రకృతిలోనే కరుణా మాధుర్యం గూడుకట్టుకొని ఉన్నవి. పురుషుడేమి చేసినప్పటికిని వాళ్ళ ఋణము నిర్విశేషంగా తీర్చుకొనలేదు.

నేను బయలుదేరి చేని దగ్గరకుపోయి గట్టుపైన ఉన్న గంగరావి చెట్టుక్రింద నిలబడ్డాను. ఒక్కొకరు బారడేసి మునుములేసుకొని పంతాలతో ఇటు అటు చూడకుండా నారునాటుతున్నారు. మా మడవకట్టు ఏదోతంతుచేసి ఉంటాడని అనుమానించినాను. ఇంతలో సుబ్బడు ముసిముసి నవ్వులతో నాదగ్గరకు వచ్చి ఒక్కొక్కరికి బారడేసి మునుము కఱ్ఱతో కొల్చేశాను. ఎవరు ముందేసుకొంటే వాళ్ళు ముందుపోవచ్చు. అట్లాయేశేటట్లయితే ఒక్కొక్కరికి దోశెడు చనగలూ బెల్లం ఒక గొబ్బిరిచిప్ప రెడ్డితో చెప్పి యిప్పిస్తానని చేప్పేనండి. అందునుంచి వాళ్లబ్బది పోయినట్లు ఆదలాబాదలాగా యేస్తున్నారని చెప్పి" భేష్ బలే చేశావురా " అనే నా పుసలాయింపు మాటకుగా ఆతురతతో నిరీక్షిస్తున్నాడు -

సుబ్బా, వాళ్లు ఎంతతొందరగా నాటినా యీ ములువు సాయంత్రంలోపలవేయగలరా? నీవు నిజంగా వాళ్లకు చనగలు బెల్లం పెట్టించవలెననే ఉద్దేశంతో చేశావా యీపని ? "వోయబ్బో సోమీ మీరు వాళ్లముందు ఈ మాటలనబాకండి - మీకు తెలియదులేండి. మీరింటికిపోండి - నేను యేయించుకొనివస్తును - వాళ్లసత్తా మీకేంతెలుసులేండి. తలుసుకొంటే పొద్దుణ్ణంగానే యేశేసిపోతారు" అని అన్నాడు -

సుబ్బడికి వయస్సు ఇరవైయైదు ఇరవైయారు సంవత్సరాలు ఉండవచ్చు. వీడు చిన్నప్పటి నుండి మా సేద్యములోనే ఉండినవాడు. నాలుగు సంవత్సరాలుగా మడవకట్టు అయినాడు. మడవకట్టు కావడం సేద్యగాళ్లల్లో మొగదారి తనంసంపాదించిట్లు- వీడికి నఖశిఖ పర్యంతం మాటలే; లాలించి బేలించి పనిచేయించ గలడు. కుఱ్ఱ ఆడవాళ్లతో ఎకసక్కేలు ఆడగలడు. వాళ్లకు ఏవేవో కథలు కమామీసులు చెప్పి కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వించగలడు. అందరితో కలుపుగోలుతనంగా ఉంటాడు.

"మీరు వాళ్లదగ్గిర పుస్తకాల్లో మాటలు చెప్పబాకండి- పుస్తకాలకు సేద్యానికి శానా దూరం" అంటూ నాఅజ్ఞానానికి అప్రయోజకత్వానికి జాలిగొన్నవాడివలె సలహా యిచ్చి పోయి మునుముకుముందు నిలుచున్నాడు.

"అనువుగాని చోట అధికుల మనరాదు" అనే ముక్క సమయానికి జ్ఞప్తికివచ్చి నాలో నేను నవ్వుకొని నారునాటడం చూస్తూ కూర్చున్నాను - అందరికంటే బారెడు ముందుగా ఒక కుఱ్ఱపిల్ల నారునాటుతూ పోతున్నది. ఒక యంత్రంమాదిరిగా పనిచేస్తున్నది. చల్లగాలిలోకూడా చెమటబొట్లు బుగ్గలపై పాటమరిస్తున్నవి. మలిచిన విగ్రహమువంటి కాయసౌష్ఠవము తాటికాయంత కొప్పు; చరచరలాడే కార్యోత్సాహం నాకు ఆశ్చర్యం కలిగించింది.

సుబ్బడు ఏదో యెగతాళిమాట అన్నాడు.

"సుబ్బయ్యా, యిప్పుడు నాతోమాట్లాడవద్దు" అని విసురుకొన్నది - వాడు మళ్ళీపలకలేదు.

నలుపక్కలా మబ్బులు కారాడుతున్నవి. కార్తెమూల గాలివీస్తున్నది. హఠాత్తుగా ఫెళ్ళుమని ఒక్క మెరుము మెరిసి ఒక్క ఉరుము ఉరిమింది. గట్లమీద ఉన్న కొంగలు అదురుకొని చెల్లాచెదరుగ ఎగిరి పోయినవి. ఆ పిల్లతప్ప అందరు లేచినిలుచున్నారు. వానజల్లు కమ్మీకొన్నది. పిలపిల అందరు చెట్లక్రిందకు పరుగెత్తినారు. ఆపిల్ల ఏమిసరకు చేయకుండా నాటుతున్నది. వాళ్లవాళ్లు "రత్తం - పెద్దజల్లొస్తున్నది - తొందరగా లేచిరా" అని కేకలువేసినారు. వాళ్లపిలుపులు కేకలు చెవిని పెట్టలేదు - అందుకునే మొక్కకు నాటేమొక్కకు విడుదల విరామం లేదు. తల తడిసి నీటిధారలు మొగమ్మీదగా క్రిందికి జారుతున్నవి- తడిసిపోయిన కోక దేహమునకంటుకొని పోయింది - వాళ్లమేస్త్రి యేసోబు నాదగ్గరికి వచ్చి "బాబుగారూ మీరైనా కొంచెం కూతెయ్యండి. పాపం తప్పాతడిసింది. చెప్పితే వినదు - కంపనాకట్టినా కాలని గుంటండి. పది అటైనా పది యిటైనా తానునుకొన్నపద్దే గెలవాలండి" అని మొరపెట్టినాడు - "రత్తం, యిప్పుడేం మునిగిపోయింది - వాన వెలిసిన పాట వేయచ్చు, లేచిరా" అని అన్నాను. పయికిలేవకుండానే చేయినిలపకుండానే "ఏం దొరగారూ పందెమేసుకొని వాళ్లయితే లేశిపొయ్యారుగాని నేను లేశొస్తానా? ఏమీ యీ వానకే మొల్చిమొలకెత్తతామా కానియ్యండి, నేను చచ్చేదేమొ వాళ్లుబ్రతికేదేమొ చూస్తాను" అన్నది. ఆ సంకల్పంలో నాకేదో గొప్పతనం గోచరించింది - వాన వెలిసింది. చెట్టుక్రింద ఉండిన వాళ్లు కడగావచ్చి గుడ్డలు పిడుచుకొన్నారు. మళ్లీ మునువుకు వంగినారు.

యానాదిపిల్లవాడు గొడుగు చంకలో పెట్టుకొని జారిపడుతూ లేస్తూ పరిగిస్తున్నాడు - దొంగలు దోచిన ఆరునెల్లకు కుక్కలు మొరిగినట్లయినది ఏమిరా యింత ఆలస్యం అని గద్దించినాను. "నోనా ఆవానకె సొట్టుకిందుణ్ణా." మంచి పనిచేశావురా - సరేపో అని అన్నాను.

రత్తం మునువు తీరావేసి చేతిలో ఉండిన కొరవనారు వాళ్ల మొగానవిసిరికొట్టి గట్టెక్కింది. తానునుకొన్న కార్యం నిగ్గించాననే సంతోషం మొగం పైన తాండవిస్తున్నది.

రత్తం చాలా పట్టుదలగల మనిషివి. పాపం, తడిసి పోయినావు.

చెట్టుకిందుండి బాబుగారుగూడ తడిసినమల్లె వుండే అంటూ నవ్వింది. పాపం, చలికి గడగడ వడకుతున్నది.

తలపిడిచి ఆర్చుకో, గుడ్డలుకూడా పిండుకో అని అన్నాను. నా యెదుట గుడ్డలు పిడుచుకోడానికి సిగ్గుపడింది. నేను కొంచెందూరంగా పోయి తూముమీద కూర్చున్నాను.

రత్తం పుట్టచాటుకుపోయి గుడ్డలుపిడుచుకొని ఆర్చుకొని కాలువ గట్టుమీదకువచ్చి

కొప్పువిప్పి వెంట్రుకలను రెండు చేతులతో వడపెట్టి విదిలించినది. నాకు తెలియకుండనే నాకన్నులు ఆ వెంట్రుకల తట్టు తిరిగినవి. పూర్వకవులు రచించిన కావ్యములలో మనము కేశభారాన్ని గురించిన వర్ణనలు చదివి ఒకొకప్పుడువాని సత్యాన్ని సందేహించికూడా ఉంటాము. "తెగబారెడు వెంట్రుకలు", "పిరుదులందాటు కురులు" అను నిట్టి వర్ణనలు మనము చదివి చదివి నోరుకాయగాచినవే. అత్యుక్తులని అనుకొన్నవె - కాని నేనెప్పుడూ నడుము వఱకైన వచ్చిన వెంట్రుకలను చూచి యెరుగను. రత్తం కురులు పూర్వకవుల వర్ణనలకు ఒక విధమైన యథార్థ భావము కల్పించినవి. పిరుదులు దాటినవి - నిగనిగలాడుతున్నవి. వానజల్లుచే కడుగబడి దుమ్ము దుమారము కొట్టుకొని పోయి నవనవలాడుతుండే పూపొద మాదిరి రత్తం అకృత్రిమ సౌందర్యం నాకు వింత యనుభూతిగా గోచరించింది. తామరపువ్వు బురదలో పుడుతున్నది. అక్కడనే పెరుగుతున్నది. కానిదాని సౌందర్యం కవులకు వర్ణన పాత్రమైనది. ఆపువ్వు లావణ్యవతులకు కర్ణపూరమై విలసిల్లినది. దేవుని పూజకు అర్హత సంపాదించుకొన్నది. పంకగర్భమునకు ఇంతటి రామణీయకమునకు లంకెకూర్చిన ప్రకృతి రహస్యమేమి ? అధమ స్థానము వహించిన పంకమునకు ఇటువంటి మనోహరమైన సంతానము సృష్టికర్తచే ప్రసాదింపబడ్డ నష్టపరిహారమేమొ!

రత్తం వెంట్రుకలుమెలిదిప్పి కొప్పుపెట్టుకొని మళ్ళీ ములువులోకి పోవడానికి కదిలింది ! ఎక్కడికి?

మునువులోకండి - ఊరికే వుండి యేంచేస్తాను - అక్కడకెళ్లి రెండుమొక్కలైనా గుచ్చిపెడతాను. నీ ములువు ముందుగా గుచ్చి పెట్టినావు. పంతం చెల్లించుకొన్నావు. ఇంక కొట్టానికిపోవచ్చు. వాళ్ళను వదిలిపెట్టి పోవడం బాగుంటుందా దొరగారు. అంతా వొకవాడకట్టువాళ్లం. అంటూ వాళ్లసందున వంగింది.

12-4-1943



# కవికోకిల జీవితంలో ముఖ్య ఘట్టాలు

| | | |
|---|---|---|
| 9-11-1895 | : | ఉదయం 6.30 గంటలకు గూడూరులో పుట్టుక. |
| 1915 | : | సంవత్సరాంతాన కవిగా రెండవ పుట్టుక; వివాహము (భార్య : శేషమ్మ) |
| 1916 - 1917 | : | కవితాభ్యాసకాలము. |
| 1916 - 1918 | : | రసిక జనానందము, స్వప్నాశ్లేషము } ప్రబంధములు. |
| | | అహల్యానురాగము, కృష్ణ రాయబారము } ప్రబంధములు. |
| | | ఋతు సంహారము, పుష్పబాణవిలాసము } అనువాదములు. |
| | | నలజారమ్మ - కావ్యము |
| | | కర్షకవిలాసము - నాటకము (అముద్రితము) |
| | | మాతృశతకము. |
| 1917 | : | నెల్లూరులోచేరిన రెడ్డి జనసంఘము వారిచే సి.ఆర్. రెడ్డిగారి అధ్యక్షతన స్వర్ణపతక బహూకరణ. |
| 1918 | : | వనకుమారి - కావ్యము. |
| | | విజయనగర మహారాజాస్థానములో 'వనకుమారి'కి కావ్యస్పర్ధలో ప్రథమ స్థానము. ఐదువందల రూపాయల బహూకరణ. |
| 1919 | : | కృషీవలుడు - కావ్యము. |
| 1920 | : | జలదాంగన - కావ్యము. |
| 1921 | : | సీతావనవాసము - నాటకము. |
| 1922 - 1923 | : | యువక స్వప్నము, కడపటివీడుకోలు - కావ్యములు. |
| 20-10-1924 — 29-10-1924 | : | కుంభరాణా - నాటకము. |
| 12-2-1925 — 20-2-1925 | : | మాధవ విజయము - నాటకము. |

## కవికోకిల జీవితంలో ముఖ్య ఘట్టాలు

| | | |
|---|---|---|
| 5-7-1925 | : | పుత్రిక (కుముదమ్మ) జననము. |
| 9-7-1925 | : | భార్య మృతి. |
| 20-8-1926 | : | పుత్రిక మృతి. |
| 5-10-1926 | : | "పానశాల" అనువాద ప్రారంభము. |
| 24-11-1927 | : | "పానశాల" అనువాద సమాప్తి. |
| 1928 | : | "భారతి"లో పానశాల ముద్రణ. |
| 21-2-1929 | : | ప్రణయబలి. |
| 16-6-1929 | : | రెండవపెళ్లి (భార్య : అన్నపూర్ణమ్మ) |
| 16-11-1929 | : | ఆంధ్ర మహాసభ బెజవాడ సమావేశములో "కవికోకిల" బిరుదు ప్రదానం. |
| 15-12-1930 | : | 'వైర్లెసు రిసీవరు' నిర్మాణము. |
| 17-12-1931 | : | సీమంత పుత్ర జననము (వేణుగోపాల రెడ్డి). |
| 1934 | : | 'గులిస్తాను' అనువాదం. |
| 20-9-1934 | : | ద్వితీయ పుత్ర జననము (జనార్దన రెడ్డి) |
| 4-1-1935 | : | 'కాంగ్రెస్ వాలా' - నాటకము. |
| 1935 | : | పానశాల, యువక స్వప్నము - తొలి ముద్రణ. కావ్యములు, ఖండ కావ్యములు, వ్యాసములు - ద్వితీయ ముద్రణ. |
| 1936 | : | సతీ తులసి : చలన చిత్రములో సాహిత్య రచన. |
| 1937 - 1938 | : | చిత్ర నళీయము : చలన చిత్రములో సాహిత్య రచన, దర్శకత్వము. - మిత్రార్థ శతకము. |
| 1939 | : | వేంకటేశ్వర మాహాత్మ్యం : చలన చిత్రములో సాహిత్య కల్పన (పద్యములు). |
| 1939 - 1942 | : | పార్వతీ కల్యాణం; సీతారామ జననం : చలన చిత్రములో సాహిత్య కల్పన (పద్యములు). |
| 1940 - 1944 | : | పల్లెతోట - అనువాదము. పలితకేశము, కవి - రవి కావ్యములు. |
| 1945 | : | పక్షవాతము. |
| 1947 | : | డ్రై బేటరీలతో రేడియో నిర్మాణము. |
| 11-9-1947 | : | రాత్రి 12 గంటలకు మరణం. |



---